

[illegible]

"వాల్మీకిగిరిసంభూతా, శ్రీరామా౽ర్ణవసంగతా ।
యోగవాసిష్ఠ గంగేయం, పునాతి భువనత్రయమ్ ॥"

ప్రథమ ముద్రణ - 1000 ప్రతులు
శ్రీ ఈశ్వరనామ సం॥ కార్తికము
(Nov. 1997)
(శా.శ. కార్తికము -1919)


ప్రతులకు

[illegible]

(D/o Dr. R. BALARAJU)
సాకేత నిలయం,
21, S.B.I. Colony,
అనంతపురం (ఆం.ప్ర.) - 515 001

*Printed at :*
[illegible]
3-4-709, Narayanaguda,
HYDERABAD - 500 027 (A.P.)
Ph: 7560543, 7564141

# In memory of



## SADHVI SRI KANDIKUPPA SITAMMA

**(Sept. 1904 –27, November 1987)**

సాధ్వి శ్రీ కందికుప్ప సీతమ్మగారి

స్మృత్యర్థం

ఓం నమః పరమాత్మనే ।

# పుణ్యస్మృతి

"యా త్యేకతోఽస్తశిఖరం పతి రోషధీనా
మా విష్కృతోఽరుణపురస్సర ఏకతోఽర్కః ।
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం,
లోకో నియమ్యత ఇవాఽఽత్మ దశాన్తరేషు ।"

(కాళిదాసమహాకవి – అభిజ్ఞానశాకున్తలము– IV-2)

ఒక ప్రక్క, ఓషధీశుడైన చంద్రుడు, అపరాద్రిపై అస్తమిస్తున్నాడు. మఱొక ప్రక్క, అరుణపురస్సరంగా, సూర్యుడు పూర్వాద్రిపై ఉదయిస్తున్నాడు. ఈ రెండు తేజస్సులు, ఏకకాలంలోనే, ఒకటి క్షీణతనూ, మఱొకటి వృద్ధిని, (వ్యసనోదయాలను), పొందుతున్నాయి. సూర్యచంద్రుల ఈ దశ, సుఖదుఃఖవంతులైన జనులను, తమకు ప్రాప్తించు సుఖదుఃఖాది అవస్థాభేదాల్లో, ఆయా అనుభవ వికారాలకు లోను గాకుండా,చిత్త సమత్వాన్ని స్థాపించుకోవాలని ప్రబోధిస్తున్నట్లున్నది.

అలా, లోకంలో అనియతంగా ప్రాప్తించే సుఖదుఃఖా ద్యవస్థల్లో, మానసిక సమత్వాన్ని కోల్పోవక, కర్తవ్యధర్మాన్ని విస్మరింపక, సక్రమంగా నెఱవేర్చి, జీవితాన్ని చరితార్థం చేసుకున్న పుణ్యచరిత్ర సాధ్వి సీతమ్మగారు.

శ్రీమతి సీతమ్మగారు, శ్రీ. బుర్రా సూర్యనారాయణరావుగారి పుత్రిక. 1904 సం॥ సెప్టెంబర్‌లో (ప్లవనామ సం॥ భాద్రపదం) బరంపురంలో జన్మించారు. శ్రీ. కందికుప్ప సాంబశివరావుగారిని వివాహమాడారు. సుమానుషమైన వారి దాంపత్యం, ఉత్కృష్టప్రేమాస్పదమై, ఆదర్శవంతమై, బంధుమిత్రులకూ, ఉభయవంశాలకూ, ఆనందప్రదమైంది.

శ్రీ. సాంబశివరావుగారు, పుష్పదంతవిరచితమైన 'శివమహిమ్నస్తోత్రా'నికి భాష్యాన్ని రచించిన భక్తిపరుడు, పండితుడు.

కాని, ప్రాక్తనకర్మవిశేషాలు, మనకు కనిపింపవు కదా! అవి కేవలం ఫలానుమేయాలు.1,2,4 సం॥ల వయస్సు గల ముగ్గురు పిల్లలను క్రమంగా, సీతమ్మగారు కోల్పోయారు. తరువాత, 6,4,2, సం॥ల వయస్సు గల మిగిలిన ముగ్గురు పిల్లలనూ, ముప్ఫై (30) సం॥లు నిండని**అనుకూలవతి కులకాంతను,** వదలి; శ్రీ. సాంబశివరావుగారు 1933 (శ్రీముఖనామ) సం॥న స్వర్గస్థులయ్యారు.

"మనుజు లెవ్వరు కర్మస్వతంత్రు లరయ?" –

ఈ దుఃఖ సమయంలో, సీతమ్మగారి పెద్దన్నయ్య, శ్రీ సర్వేశ్వరరావుగారు, తండ్రిలా, ఆమెను ఆదరించి, ముగ్గురు పిల్లలనూ ప్రాణతుల్యంగా చూస్తూ, పెంచి, పెద్ద చేశారు. భర్తను పోగొట్టుకున్న సీతమ్మ శోకాగ్ని చల్లారక మునుపే, ఆమె పెద్దకొడుకు, శ్రీ. తిరుపతిరావు కూడా, 1945 సం॥లో మృతి చెందారు. దుఃఖము తితిక్షనూ, సర్వాత్మభావననూ (ఆత్మసమతనూ), తన్మయీభావనతను ఉపదేశిస్తుంది.*

ఇట్లు, కాలవాహినిలో తనపై ఎగసిపడుతున్న దుఃఖతరంగాలను పరిగణింపక, త్రోసుకుంటూ, స్థిరచిత్తంతో సీతమ్మ, భగవచ్చరణాలను ఆశ్రయించి, దుఃఖాన్ని జయింపగల్గింది. స్వకర్మగతిసంతరణానికీ, దుఃఖనివృత్తికీ, భగవచ్చరణకమలములే శరణ్యం; ఆపదలందు ధ్యేయం. ఇందు, సంసారవశవర్తులైన వారెవరూ, వారెంత గొప్పవారైనా, రక్షింపలేరు.

"ఆబ్రహ్మస్తమ్బ పర్యన్తాః, జగ దన్తర్వ్యవస్థితాః,
ప్రాణినః కర్మజనితసంసారవశవర్తినః ।
యత స్తతో న తే ధ్యానే ధ్యానినా ముపకారకాః ।
అవిద్యాఽన్తర్గతాః సర్వే, తే హి సంసారగోచరాః ॥

★ "Pain is the touch of our Mother, teaching us how to bear and grow in rapture. She has three stages of her schooling, endurance first, next equality of soul, last ecstacy."

**(Sri Aurobindo - Thoughts and aphorisms - Jnana-P.22-23)**

అని కదా! పురాతనోక్తి,* కాన, పరమేశ్వర భక్తియే, సర్వత్ర అభయప్రదం. అధ్యాత్మరామాయణకీర్తనలను శ్రవణసుఖంగా సీతమ్మ గానం చేసేది. మోక్ష (శాంతి) సంహితలైన యోగవాసిష్ఠమూ, గీతా, భాగవతమూ, రామాయణమూ, శ్రీసీతారామాంజనేయసంవాదము - ఇత్యాదులు, ఆమెకు నిత్య శ్రవణమనన నిదిధ్యాసనాలకు భాజనాలయ్యాయి. ఈ శాంతిప్రదమోక్షశాస్త్రాల నిత్యశ్రవణ, పారాయణ, భావానుసంధానాదులవలనా, భగవదారాధనవలనా, సీతమ్మ మనస్సు శుభసంస్కారపూర్ణమై, సమత్వాన్నీ, స్థిరత్వాన్నీ పొందింది; కర్తవ్యధర్మాన్ని విస్మరింపకుండా, పిల్లల వినయశిక్షణ, రక్షణ, పోషణాది బాధ్యతలను సక్రమంగా నిర్వహించి, వారిని పెంచి, పెద్ద జేసి, ఉన్నతవిద్యాసంస్కారవంతుల్ని చేయగల్గిందా తల్లి. శ్రీకాకుళం జిల్లా పాలకొండలోని కందికుప్ప వారి వీధి ఇంటిలోనే చాల కాలమామె నివసించింది.

"యథా మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్,
బ్రూయాత్ తథా" (బృ.ఉ.VI-I-2)

అనుశాసనకర్త్రియైన తల్లి వలనా, అనుశాస్తయైన తండ్రి వలనా, ఆ తరువాత, అనుశాస్తయైన ఆచార్యుని వలనా, త్రివిధశుద్ధి పూర్వకంగా, నడవడిని నేర్చుకున్న సంతానం, ఎన్నడూ, సమాజంలో, శీల ధర్మ ప్రమాణ వ్యతిరేకంగా ప్రవర్తింపదు కదా! అలాంటి వారి వలన మానవ సమాజం, శోభమానమౌతుంది. తల్లే బిడ్డలకు ప్రథమగురువు. నేటికి (అక్టోబర్ 1997) అరవై రెండేళ్లకు (62) పూర్వం, అత్యంత బాల్యదశలో ఉన్న తన కుమారుడు రమణమూర్తి (Lt. Col. K.R. Murty) కోమల హృదయక్షేత్రంలో, పరమార్థజ్ఞాననిధానమూ, పరమశాంతి శాస్త్రమూ అయిన శ్రీయోగవాసిష్ఠాన్ని గూర్చిన ఆసక్తినీ, ఆకాంక్షనూ, అంకురింపజేసింది ఆ తల్లి. అది క్రమవికాసాన్ని పొంది, భగవదంకితమై, మాతృదేవతా స్మృత్యర్థమైన ఈ గ్రంథప్రకాశనంలో సాఫల్యసిద్ధిని పొందింది.

"ఆస్తాం తావ దియం ప్రసూతిసమయే దుర్వారశూలవ్యథా,
నైరూప్యం, తనుశోషణం, మలమయీ శయ్యా, చ సాంవత్సరీ।
ఏకస్యాఽపి న గర్భభారభరణ క్లేశస్య యస్యాః, క్షమో,
దాతుం నిష్కృతి మున్నతోఽపి తనయ స్తస్యై జనన్యై నమః।
(శంకరుడు - ఏక శ్లోకమాతృస్తుతి)

★ బ్రహ్మసూత్ర శ్రీభాష్యమున, భగవద్రామానుజులచే ఉదాహృతము.

తన కోసం ప్రసూతిసమయం నుంచీ, తల్లి అనుభవించిన గర్భభారభరణ క్లేశసముదాయంలో, ఏ ఒక్కదానికి కూడా, ఎంతో ఉన్నతుడైన కుమారుడు సైతం నిష్కృతిని కల్గింపజాలడని (ఋణవిముక్తి పొందజాలడని) భగవత్పాదులు ఆది శంకరులు, తల్లిని స్తుతించారు.

"అరుణగభస్తిబింబ ముదయాద్రి పయింబొడతేర గిన్నెలో
బెరుగును, వంటకంబు, వడపిందియలుం గుడువంగ బెట్టు, ని
ర్భరకరుణాధురీణ యగు ప్రాణము ప్రాణము తల్లి యున్నదే?
హర! హర! యెవ్వరింక కడుపారగ బెట్టెద రీప్సితాన్నముల్"

(శ్రీనాథమహాకవి–కాశీఖండము IV-114)

"కరచరణాదిసంఘటితకాయము, సంజననంబు, వహ్ని పు
ట్టరణికి బోలె తల్లి దెసనైనది కాదొకొ? యట్లు గాక, దు
ర్భరమగు గర్భఖేదమును, పట్టికి నై నిజదేహచింతపై
భరమొక యింతలేక పడు పాటులు నక్కట! యెక్కుడింతకున్ ॥"

(కవిబ్రహ్మ తిక్కన – మ.భా. – శాంతి – 273)

"నవధరించుట యెట్లు జఠరగోళము నందు
నవమమాసావసానంబు దాక?
ప్రేకమైన ప్రసూతి వేళాసముద్భూత
సంకటం బోర్వంగ జాలుటెట్లు?
కుత్సింపకుంటెట్టు లుత్సర్గ విణ్మూత్ర
లాలాద్రవ శ్లేష్మ జాలమునకు?
నందంద వక్షోరుహములు దింపులువోవ
దొడుక నిచ్చుట యెట్లు దుగ్ధరసము?
పంచకర పాట్లు పడి తన్ను బెంచి, విసికి,
యాపదల బాపి రక్షించినట్టి తల్లి,
దేవతాబుద్ధి పాటించి తెలియ వలయు,
కొడుకు వంశాభిసంవృద్ధి కొనలు సాగ ॥"

(శ్రీనాథకవిసార్వభౌముడు – శ్రీకాశీఖండము-IV-18)

మహాకవుల పై రెండు పద్యాలూ, శ్రీ శంకరభగవత్పాదుల ఏకశ్లోక మాతృస్తుతికి వివరణాత్మకాలుగా వుండి, ఆ శ్లోకాన్ని స్మరింపజేయడం గమనార్హం. విశ్వజనీనతే కదా సత్యానికి నికషోపలం!

స్వాధీన దేవతలైన తన తల్లినీ, తండ్రినీ, గురువునూ, ధిక్కరించి, నరుడు అస్వాధీనపు దైవాన్ని ఆరాధింపజాలడని ధర్మ విగ్రహుడైన శ్రీ రాముని నిశ్చయం.

"అస్వాధీనం కథం దైవం, ప్రకారై రభిరాధ్యతే?
స్వాధీనం సమతిక్రమ్య, మాతరం, పితరం, గురుమ్ ।"

(వా.రా. అయోధ్య -XXX-33)

భగవదవతారమూర్తులైన శ్రీరామకృష్ణాదులూ, జగద్గురువులైన ఆదిశంకరాదులూ - వీరి జీవనచర్యలు, హృదయంగమమైన మాతృభక్తిని, ఆర్ద్రంగా నిరూపిస్తున్నాయి.

ధన్యచరితయైన సాధ్వి సీతమ్మగారి శీలశిక్షణప్రభావం ఆమె సంతతి (పుత్రుని)పైన ప్రస్ఫుటంగా గోచరిస్తున్నది. ప్రత్యక్ష దృష్ట విషయానికి వివరణ అనవసరం.

"ఫలానుమేయాః ప్రారమ్భాః సంస్కారాః ప్రాక్తనా ఇవ ।"
"ఆరంభసదృశోదయాః ।"

పూర్వజన్మవాసనల వలె, కార్యారంభాలన్నీ వాని ఫలాల్ని బట్టే ఊహింపబడతాయి.

కార్యారంభాలకు సమానమైన ఫలసిద్ధే ఉత్తములకు లభిస్తుంది.

సార్థక★నామధేయయైన సాధ్వి సీతమ్మ, పరమేశ్వరభావన(ధ్యాన)

★ "She is the very type of the true Indian woman, for all the Indian ideal of a perfected woman have grown out of that one life of Sita; and here she stands these thousands of years, commanding the worship of every man, woman, and child, throughout the length and breadth of land of Āryavarta. There she will always be, this glorious Sita, purer than purity itself, all patience and all suffering. She who suffered that life of suffering without a murmur, she the ever-chaste and ever-pure wife, she the ideal of the people, the ideal of gods, the great Sita our national God, she must always remain....................

పూర్ణహృదయంతో, దుఃఖాలయమైన, నశ్వరమైన, పార్థివదేహాన్ని విడిచి, దివ్యదేహంతో తన భర్త సాన్నిధ్యాన్ని, ప్రభవసంవత్సరకార్తికమాసంలో (27/11/87) చేరుకున్నది.

"న గాయత్ర్యాః పరం మన్త్రం న మాతుః పరదైవతమ్" –
("వరతనూజున కఖిల దేవతల కంటె,
జనని యెక్కుడు సన్నుతాచారనిరత !")

అను సూక్తి ననుసరించి, మాతృభక్తిపరాయణుడైన కుమారుడు Lt. Col. K.R. మూర్తి (శ్రీ కందికుప్ప రమణమూర్తి) గారిచే, తల్లి సీతమ్మగారి పుణ్యస్మృత్యర్థమై, భగవదర్పితమూ (శ్రీ కృష్ణాంకితమూ) శాంతరసనిర్భరమూ, మోక్షోపాయ దర్శనమూ, చిత్తోపశమదాయకమూ, సంసారదుఃఖతారకమూ, అయిన శ్రీ యోగవాసిష్ఠసంగ్రహకృతి (సంస్కృతమూల ఆంధ్రానువాదపరమార్థదీపనీ నామవ్యాఖ్యా సంవలితము) ప్రకాశితం. ఈ ప్రకాశనం వలన, పరమకారుణికుడైన పరమేశ్వరుడు సంప్రీతుడగుగాక!

"సంప్రీణితో భవతి భూతపతిర్మహేశః ।"

"యా దేవీ సర్వభూతేషు మాతృరూపేణ సంస్థితా ।
నమస్తస్యై, నమస్తస్యై, నమస్తస్యై, నమో నమః ।"

ఓం తత్సత్ శ్రీ కృష్ణార్పణమస్తు



---

"The women of India must grow and develop in the foot prints of Sita, and that is the only way."

(Swami Vivekananda - C.W. Vol. III– Mayavati Memorial Edition - 1987)

ఓం నమః పరమాత్మనే ।

# శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహము – విషయానుక్రమణిక


| సంఖ్య | విషయము | | పుట |
|---|---|---|---|
| I | భగవద్ధ్యానం, గురువందనం, కృతి సమర్పణం చ | | XX |
| II | సందేశములు, పరిచయములు | ... | XXX |
| III | ప్రస్తావన | ... | L |
| IV | విషయప్రవేశము | ... | LXXVI |
| I | ప్రథమసర్గము (వైరాగ్యప్రకరణము) శ్రీ రామనిర్వేదము | | |
| | 1) భరద్వాజుని ప్రశ్న. | ... | 1 |
| | 2) విశ్వామిత్రాగమనము | ... | 4 |
| | 3) జీవితము దుఃఖమయము | ... | 6 |
| | 4) వయోఽవస్థలు దుఃఖదాయకములు | ... | 10 |
| | 5) కాలవైభవము. (విలాసము) | ... | 14 |
| II. | ద్వితీయ సర్గము (II ముముక్షు ప్రకరణము) ఉపదేశోపక్రమము | | |
| | 1) శుకోపాఖ్యానము | ... | 18 |
| | 2) వాసనలు (మానసిక) సంస్కారములు రెండు విధములు... | | 23 |
| | 3) ఆధికారిక పురుషుడగు వసిష్ఠుని నిజవృత్తాంత కథనము ... | | 25 |
| | 4) మోక్ష ద్వార పాలకులు, రక్షకులు. (ముముక్షుప్రకరణము సమాప్తము) | ... | 27 |
| III. | తృతీయసర్గము (III ఉత్పత్తి ప్రకరణము) ఉత్పత్తి క్రమము (జగదుత్పత్తివిధానము) | | |
| | 1) బంధస్వరూపము | ... | 32 |
| | 2) జగత్తు మనోమయము | ... | 36 |
| | 3) జీవన్ముక్తుని లక్షణము | ... | 38 |
| | 4) బ్రహ్మము యొక్క స్వరూపము | ... | 42 |
| IV. | చతుర్థ సర్గము – లీలోపాఖ్యానము | | |
| | 1) దేవీవరప్రాప్తి – లీలాదేవి సరస్వతీ దేవి నుండి వరమును పొందుట. | ... | 44 |
| | 2) పూర్వవృత్తాంతము | ... | 48 |

3) బ్రహ్మాఽభ్యాసము - బ్రహ్మసాక్షాత్కారసాధన ... 51
4) అనంతరవృత్తాంతము ... 54
5) పునరాగమనము ... 57

V. **పంచమ సర్గము - సూచ్యుపాఖ్యానము** (సూచియను రాక్షసి కథ)
1) సూచీ తపశ్చరణము ... 61
2) సూచీకృత ప్రశ్న - (సూచి. అడిగిన ప్రశ్న.) ... 65
3) సూచీ సమాధానము (సూచి ప్రశ్నలకు సమాధానము)... 67

VI. **షష్ఠ సర్గము - భావనావైభవము** (మనోభావనా బలము)
1) **ఐన్దవోపాఖ్యానము (ఇందుపుత్రుల కథ)** ... 72
2) **విటోపాఖ్యానము (కృత్రిమేన్ద్రోపాఖ్యానము)** ... 75
3) **చిత్తోపాఖ్యానము** ... 77
4) **బాలకాఖ్యాయిక (బాలకుని కథ)** ... 80

VII. **సప్తమ సర్గము - లవణోపాఖ్యానము**
1) శాంబరికుని మోహనము (ఇంద్రజాలికుని మాయ) ... 84
2) సంసారవిభ్రమము - (జగదస్తిత్వ భ్రాంతి) ... 89
3) అజ్ఞానభూమికా సప్తకము ... .93
4) జ్ఞానభూమికాసప్తకము ... 96
5) అవిద్యామాహాత్మ్యము ... 99
(ఆధ్యాత్మికాంధ్యము యొక్క ప్రభావము)

VIII. **అష్టమ సర్గము (IV స్థితి ప్రకరణము) భార్గవోపాఖ్యానము**
1) భార్గవమనోరాజ్యము ... 103
(భార్గవుని భావనా రాజ్యము - ఆకాశహర్మ్యనిర్మాణము)
2) భార్గవప్రబోధనము (శుక్రుని మేలుకోలు). ... 107
3) మనో మలక్షాళనము - (మనోమాలిన్యమును కడిగివేయుట) 109

IX. **నవమ సర్గము - దామాద్యుపాఖ్యానము (దామాదుల ఇతిహాసము)**
1) అహంకారోదయము (అహంకారము యొక్క పుట్టుక) ... 113
2) అహంకారము త్రివిధము - ... 116
(అహంకారము మూడు విధములు)
3) నిర్వాసనత - (మనోవాసనారాహిత్యము) ... 119

4) జీవాఽఽవిర్భావము (జీవుని అభివ్యక్తి - అవతరణము) .. 122

X దశమసర్గము - దాశూరోపాఖ్యానము

1) సృష్టిక్రమము (సంసారాఽవతరణక్రమము) ... 128

2) దాశూరుని తపస్సు. ... 133

3) పుత్రప్రబోధనము ... 135

(కుమారుని అనుబోధనము - మేలుకోలు)

4) సంకల్పప్రభావము (మనోవ్యాపారప్రబావము) ... 137

5) వాసనాత్యాగము ... 142

(మానసిక సూక్ష్మ సంస్కార పరిత్యాగము)

6) కచుని గాథలు ... 145

XI ఏకాదశ సర్గము (V ఉపశమన ప్రకరణము) జనకోపాఖ్యానము

1) సిద్ధగీతాశ్రవణము ... 147

(జనకుడు సిద్ధుల గీతముల నాలకించుట)

2) జనకుని ప్రబోధము (మేలుకోలు) ... 151

3) వాసనాత్యాగము ద్వివిధము ... 155

(మానసిక సంస్కారముల-వాసనల-త్యాగము రెండు విధములు)

4) నిశ్చయము చతుర్విధము (నాల్గు విధములు) ... 159

5) పుణ్య పావనుల సంవాదము. ... 161

XII ద్వాదశ సర్గము - బల్యుపాఖ్యానము – (బలిచక్రవర్తి కథ)

1) బలిచక్రవర్తి నిర్వేదము ... 164

2) తండ్రి విరోచనుని ఉపదేశము ... 167

3) శుక్రుని ఉపదేశము ... 170

XIII త్రయోదశ సర్గము - ప్రహ్లాదోపాఖ్యానము

1) హరితోషణము. (ప్రహ్లాదుడు హరిని సంతోషపఱచుట)... 174

2) ఆత్మతత్త్వవిచారణము ... 177

3) హరిచే ప్రహ్లాదప్రబోధనము ... 182

XIV చతుర్దశ సర్గము – గాధి ఉపాఖ్యానము

1) గాధి, తాను శ్వపచ (చండాల) - ... 186

త్వాదులను పొందుటను దర్శించుట.

2) మిథ్యా దృష్ట సత్యత్వము (మిథ్యగా కాంచబడిన దాని యొక్క సత్యత్వము - ప్రత్యక్షావలోకనము) ... 190
3) భగవంతుని ఉపదేశము. ... 192

XV పంచదశ సర్గము - ఉద్దాలకోపాఖ్యానము
1) విశ్రాన్త్యపేక్ష (చిత్తవిశ్రాంతిని ఆకాంక్షించుట.) .. 197
2) అంతర్విచారణము ... 199
(అంతఃకరణమున ఉద్దాలకుడొనర్చిన విచారణము).
3) సత్తా సామాన్య ప్రాప్తి ... 204
(సత్తా సామాన్యమగు బ్రహ్మముతో ఏకత్వ ప్రాప్తి)
4) పరావిశ్రాంతి (పరమోత్కృష్టమైన విశ్రాంతి) ... 208

XVI షోడశ సర్గము - సురఘూపాఖ్యానము
1) అంతఃశీతలత (అంతరంగములోని చల్లదనము) ... 212
2) మాండవ్యోపదేశము ... 215
3) పరిఘునితో సంవాదము ... 217
4) స్వాత్మసముద్ధరణము (తన్ను తాను ఉద్ధరించుకొనుట) 220

XVII సప్తదశసర్గము - మనోనాశ ప్రకారము (మనోనాశ విధానము)
1) భాస విలాసుల సంవాదము ... 223
2) సంసక్తి (ప్రగాఢమగు సంగము) ... 226
3) జీవన్ముక్త సమాచారము (వ్యవహారచర్య) ... 229
4) చిత్తస్పంద (మనశ్చాంచల్య) నిరోధము .... 234

XVIII అష్టాదశ సర్గము - వీతహవ్యోపాఖ్యానము
1) ప్రాణస్పందనిరోధము ... 239
(ప్రాణవాయుచలననిగ్రహము)
2) చిత్త సమాధానము (చిత్త సమాధి) ... 243
3) కేవలీ భావము (కైవల్యము) ... 245
4) చిత్తనాశము-ద్వివిధము. ... 249

XIX ఏకోనవింశ సర్గము - చిత్త ప్రశమనము (చిత్తోపశాంతి)
1) చిత్తము యొక్క రెండు బీజములు ... 255
2) అసంవేదనము (శబ్దాది విషయానుభూతి లేమి) ... 259

3) మనోనాశాదిత్రయము .. 264
(మనోనాశమునకు మూడు ఉపాయములు)
4) అధ్యాత్మ(పరమాత్మ)తత్త్వవిచారము ... 267
XX వింశతితమ సర్గము (VI నిర్వాణ ప్రకరణము) –చిదాత్మ భావన
(శుద్ధ చైతన్య స్వరూపమగు ఆత్మ ధ్యానము)
1) భ్రమకారణము (భ్రాంతి హేతువు) ... 270
2) అవిద్యావిభాగము (ప్రకృతి యందలి విభాగములు) ... 272
3) అనుసంధాన (సూక్ష్మ విచారణ) క్రమము ... 276
4) యోగము రెండు విధములు. ... 278
XXI ఏక వింశ సర్గము – భుశుండో పాఖ్యానము
1) భుశుణ్డోత్పత్తి (భుశుండుని జననము) ... 280
2) కల్పాంతములందును అవిచ్ఛిన్న స్థితి. ... 283
3) విచిత్రానుభవము (ఆశ్చర్యకర నానావిధానుభూతి) ... 286
4) ప్రాణ చింతనము ... 289
5) చిరజీవితమునకు కారణము. ... 292
XXII ద్వావింశ సర్గము – దేవార్చన విధానము
1) విధాన ప్రశ్న – (పూజా విధానమును గురించిన ప్రశ్న)... 295
2) ఆత్మయే పరమదైవము. ... 298
3) పూజాక్రమము (ఆరాధనా విధానము) ... 301
XXIII త్రయోవింశ సర్గము – చిచ్ఛక్తి (శుద్ధ చైతన్య శక్తి యొక్క) ప్రభావము
1) బిల్వఫలో పాఖ్యానము ... 306
2) మహాశిలో (పాషాణో) పాఖ్యానము ... 309
3) అర్జునోపాఖ్యానము (గీతార్థ సంగ్రహము) ... 311
4) భిక్షూ పాఖ్యానము (శతరుద్రోపాఖ్యానము) ... 316
XXIV చతుర్వింశ సర్గము – భగీరథో పాఖ్యానము
1) సౌషుప్త మౌనము ... 321
(సుషుప్తికి సంబంధించిన మౌనము – పరమచిత్త విశ్రాంతి)
2) బేతాళో పాఖ్యానము ... 324
3) జ్ఞానప్రాప్తి సాధనములు ... 328

4) చిత్త విశ్రాంతి ... 331

XXV పంచ వింశ సర్గము - చూడాలా ప్రభావము (శిఖిధ్వజోపాఖ్యానము)

1) జ్ఞానోదయము ... 334

2) ప్రాణు లందలి కుండలినీ శక్తి ... 339

3) ఆధివ్యాధులు (మానసిక శారీరక వ్యాధులు) ... 342

4) అణిమాది అష్టసిద్ధులు. ... 344

5) గురూపదేశ ప్రయోజనము, అవసరము ... 347

XXVI షడ్వింశసర్గము - శిఖిధ్వజుని తపస్సు

1) శిఖిధ్వజుని కానన (అరణ్య)వాసము ... 351

2) చూడాల కుంభుని రూపమును దాల్చుట. ... 353

3) చిన్తామణ్యుపాఖ్యానము (సర్వాభీష్టప్రదమగు చింతామణి యను దివ్యమణి వృత్తాంతము) ... 358

4) వనగజోపాఖ్యానము – (అడవి ఏనుగు కథ) ... 361

XXVIIసప్తవింశ సర్గము - చూడాలోపదేశము

1) సర్వత్యాగస్వరూపనిరూపణము ... 365

2) చిత్తత్యాగక్రమము (చిత్తము (వాసనల) యొక్క స్వరూపము, తన్నాశోపాయకథనము) ... 368

3) శిఖిధ్వజనిష్ఠ (శిఖిధ్వజుడు సమాధి నిష్ఠుడగుట) ... 373

4) శిఖిధ్వజుని ప్రబోధనము (జ్ఞానప్రాప్తి) ... 375

XXVIII అష్టావింశ సర్గము - శిఖిధ్వజపరీక్ష (శిఖిధ్వజుని చూడాల పరీక్షించుట)

1) కుంభుడు ప్రతిరాత్రియు, స్త్రీత్వమును పొందుట ... 380

2) ప్రలోభనము - ... 384
(చూడాల, శిఖిధ్వజుని కాముకత్వమునకు ఆకర్షించుట)

3) చూడాల సమాధానము (చూడాల, సంశయ నివారకమైన సమాధాన మొసగి, పరిస్థితని విశదపఱచుట) ... 387

4) స్వరాజ్యాభిషేచనము (శిఖిధ్వజుని స్వరాజ్య పట్టాభిషేకము) 389

XXIX ఏకోనత్రింశసర్గము - చిన్మాత్రస్థితి
(కేవలము పూర్ణ చైతన్యమున స్థితి - నిలుకడ నొందుట)

1) కచోపాఖ్యానము ... 394

2) మిథ్యా పురుషోపాఖ్యానము ... 398

3) భృంగీశోపాఖ్యానము ... 401

XXX త్రింశసర్గము –ఇక్ష్వాకూపాఖ్యానము

1) సంసార (దృశ్య ప్రపంచ) కారణము ... 407

2) యోగభూమికా సప్తకము ... 413

3) బ్రహ్మతాఽవాప్తి (బ్రహ్మత్వప్రాప్తి) ... 416

4) జీవన్ముక్తస్థితి .. 418

XXXI ఏకత్రింశ సర్గము – భూమికాజయము

1) చిత్తనాశక్రమము ... 423

2) భూమికాత్రయారోహణము ... 430

(మొదటి మూడు యోగ భూమికల ఆరోహణము)

3) ఉత్తర భూమికలు (తరువాతి ఉన్నత యోగ భూమికలు)... 433

4) బ్రహ్మైక భావనము (కేవలబ్రహ్మధ్యానము) ... 439

XXXII ద్వాత్రింశ సర్గము – గ్రంథోపసంహారము

1) భరద్వాజ ప్రబోధనము (జ్ఞానప్రాప్తి) ... 443

2) శ్రీరామనిర్వృతి ( శ్రీరాముని పరమశాంతి ప్రాప్తి) ... 449

**(VI నిర్వాణప్రకరణము సమాప్తము–**

**యోగవాసిష్ఠ సంగ్రహము సమాప్తము)**

## అనుబంధములు

**అనుబంధము –I**

శ్రీ యోగవాసిష్ఠ మహారామాయణ రచనాకాలము,
ఆదికవి మహర్షి వాల్మీకి పూర్వ వృత్తాంతము,
కర్తృ వైలక్షణ్యము ... 456

**అనుబంధము –II**

అధికారిక పురుషుడు బ్రహ్మర్షి వసిష్ఠుడు – ... 467
వక్తృ వైలక్షణ్యము





ఓం శ్రీ కృష్ణాయ పరబ్రహ్మణే నమః ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## అథ భగవద్ధ్యానం, గురువన్దనం, కృతి సమర్పణం చ ॥

శ్రీ రామ రామ రామేతి, రమమాణాః సదాఽఽత్మని ।
అక్షుబ్ధచిత్తవిశ్రాన్తిం, ప్రాప్నుయాం చిరనిర్వృతిమ్ ॥

శాశ్వతస్య చ ధర్మస్య గోప్తారం ధర్మవిగ్రహం,
జానక్యా సంపరివృతం, భక్త్యా, జ్ఞాన మివాఽమృతమ్ ।
హృదయే విష్ఠితం రామం, శరణాగతవత్సలం,
జరామరణమోక్షాయ, సంశ్రయే భవముక్తయే ॥

స్థితప్రజ్ఞాత్మకం ధర్మ్యం, బ్రాహ్మీం చ పరమాం స్థితిం ।
దర్శయన్తం పరానన్దం, శ్రీకృష్ణం ప్రభు మాశ్రయే ॥

స్మరణం యస్య దేవస్య, జయకారణ మేవ హి ।
జగద్గణాఽగ్రణే తస్మై, పార్థసారథయే నమః ।

సత్యం జ్ఞానం పరానన్దం, జగజ్జన్మాదిహేతుకమ్ ।
అన్తర్జ్యోతి రహం కృష్ణం, చిన్తయామి సనాతనమ్ ।

కారుణ్య మాతన్వన్తం చ, చతుస్సత్య ప్రబోధకమ్ ।
ఆర్యాఽష్టాఙ్గిక మార్గస్య దేశికం బుద్ధ మాశ్రయే ॥

శ్రీరామచన్ద్రం, శ్రీకృష్ణం, బుద్ధం చ, పరమాత్మని ।
ఏకరూప మహం జానే, రామకృష్ణం చ ధ్యానత ః ॥

సర్వవిద్యా ప్రతిష్ఠా యా, బ్రహ్మవిద్యాస్వరూపిణీ ।
హృదయే శేముషీం దేవీ, భారతీ మే ప్రచోదయాత్ ॥

భవభానుప్రతప్తానాం, నరాణాం శుభ మిచ్ఛతాం ।
ప్రదాతారం ఋషిం వన్దే, రామాయణసరస్వతీమ్ ॥

యస్య వాణీ మోహతాపం, శమయ త్యాత్మసంస్థితా ।
తస్మై గురూణాం గురవే, నమః ప్రాచేతసర్షయే॥

యేనాఽనుకమ్పితం విశ్వం, శ్రీరామప్రశ్ననిర్ణయైః ।
ఆధికారికపురుషం వసిష్ఠం బ్రహ్మణః సుతమ్ ।
విభ్రాజమాన మాకాశే, దివ్యే సప్తర్షిమణ్డలే ।
సవిత్ర్యరున్ధతీయుక్తం, బ్రహ్మవిద్యాగురుం భజే ॥

భారతశ్రుతివక్తారం, బ్రహ్మతత్త్వప్రకాశకం ।
కృష్ణద్వైపాయనం వ్యాసం, ప్రణమామి ముహుర్ముహుః ॥

బాదరాయణమౌనీన్ద్రం, సూత్రకారం చ శంకరం ।
భాష్యకారం గురుం వన్దే, జ్ఞానసిద్ధ్యర్థ మాత్మని ॥

శరణాగతిశాస్త్రస్య ప్రవక్తారం, కృపామయం ।
శ్రీభాష్యకారం శేషాంశం, రామానుజ ముపాశ్రయే ॥

వేదభాష్యప్రణేతారం, విద్యారణ్యయతీశ్వరం ।
ధర్మసంస్థాపకం వన్దే, రాజవిద్యాప్రవర్తకమ్ ॥

వేదాన్తదేశికం వన్దే, త్యక్త సర్వైషణం, కవిం ।*
యస్య భావాఽనుసరణం హరిసాయుజ్య ప్రాపకమ్ ॥

---

★ వేదాంత దేశికులు – 'సంకల్ప సూర్యోదయ', 'యాదవాభ్యుదయ', 'హంససందేశ', 'పాదుకాసహస్ర, 'దయాశతకా' ద్యనేకరమణీయ కావ్యనిర్మాత. పరమవైరాగ్యసంపన్నుడు, పరమభక్తుడు.

హనుమద్భీమాఽఽత్మకం తం, భక్తిజ్ఞాననిధిం హరేః।
ముఖ్యప్రాణస్వరూపం శ్రీమధ్వ మానన్ద మాశ్రయే॥

శిక్షాఽష్టక*ప్రదాతారం, హరినామప్రబోధకం।
ప్రేమాఽవతారం శ్రీకృష్ణచైతన్యం ప్రభుమాశ్రయే॥

స్థాపకం శ్రుతిధర్మస్య, సర్వధర్మస్వరూపిణం।
అవతారవరిష్ఠం శ్రీరామకృష్ణం, హరిం భజే।

యస్మింశ్చిదబ్ధౌ నలినాఽసనాఽఽద్యాః,
దేవాః సమస్తా అపి శీకరాభాః।
తం రామకృష్ణం ఖుదిరామసూనుం,
సత్త్వైకగమ్యం శరణం ప్రపద్యే।

సర్వవిద్యాప్రతిష్ఠాం తాం, బ్రహ్మవిద్యాస్వరూపిణీం।
గచ్ఛామి శరణం దేవీం, శారదాం విశ్వమాతరమ్।

శాస్త్రాణి, మాతృధరణీశ్చ, గురు ర్మహాత్మా,
ఏతే స్వరా విరచయన్తి, తవాఽఽర్ద్రరమ్యాః।
నాదాఽఽత్మికా మధుకృతీః పరతత్త్వ పూర్ణాః,
స్వామిన్! వివేకగురుదేవ నమోఽస్తు తుభ్యమ్।

ఆవిర్బభూవ పరమేశ్వర నేత్రతేజః
పుంజా జ్జగద్భరణబోధనిదర్శనార్థం।

---

★ శిక్షాఽష్టకము :-

"చేతోధర్పణమార్జనం, భవమహాదావాఽగ్ని నిర్వాపణం,
శ్రేయఃకైరవచన్ద్రికావితరణం, విద్యావధూజీవనమ్।
ఆనన్దామ్బుధివర్ధనం, ప్రతిపదం పూర్ణాఽమృతాఽఽస్వాదనం,
సర్వాఽఽత్మస్నపనం, పరం విజయతే శ్రీకృష్ణ సంకీర్తనమ్।"

ఇత్యాది పరమభక్తి శిక్షాత్మకములైన ఎనిమిది (8) శ్లోకములు గల గ్రంథము. శ్రీకృష్ణచైతన్య ప్రభు విరచితములైన కృతులలో ఇదియొక్కటి మాత్రమే ప్రస్తుతము లభించుచున్నది.

యస్తం నిరస్తభవమోహ మనన్తవీర్యం,
వీరేశ్వరం హృది వివేకగురుం ప్రపద్యే ॥

అభయాఽహింసేఽసఙ్గం చ, ఆనన్దం పరమం స్మరేత్[1]
ఇతి యోఽదర్శయత్ ప్రేమ్ణా, తం వివేకిన మాశ్రయే ।

యోఽర్థః శ్రీరామకృష్ణస్య వాచో మూర్తపరాత్మనః ।
తం బోధనిలయం వన్దే, వివేకానన్ద సద్గురుమ్ ।

బుద్ధం శ్రీరామకృష్ణం చ, ధర్మం స్వామి వివేకినం ।
సంఘం శ్రీశారదాం దేవీం, గచ్ఛామి శరణం సదా ।

'గీతగోవిన్ద'కర్తారం, రాధామాధవ తన్మయం ।
పద్మావతీరమణం, శ్రీజయదేవగురుం భజే ।

మన్దారమఞ్జరీస్యన్ది మకరన్దరసాఽర్ణవం ।
'కృష్ణకర్ణాఽమృతం'; తస్య కర్తారం బిల్వమఙ్గళమ్ ।

'లీలాశుక' ఇతి ఖ్యాతం, ప్రేమభక్తి ప్రబోధకం ।
కృష్ణభావసమాధిస్థం, చిన్తామణి[2]గురుం భజే ।

అష్టోత్తరశతానాం భాష్యముపనిషదా మయం ।
కృత్స్నం చకారోపనిషద్బ్రహ్మేన్ద్ర ఇతి విశ్రుతః ।

'ఉపేయనామ వివేక'కృత్యా భక్తి మదర్శయత్ ।
భగవన్నామమాహాత్మ్యం, జ్ఞానం చ తత్త్వదర్శనమ్ ।

రామనామైకరసికం, రామభక్తిపరాయణం
రామచన్ద్రేన్ద్రయతినం, చిన్తయా మ్యాత్మసిద్ధయే ॥

---

(1) అభయము, (2) అహింస, (3) అసంగము, (4) ఆనందము అను ఈ నాల్గు అకారములను నిత్యము స్మరించవలెనని అనుష్ఠించవలెనని, స్వామి ఉపదేశము.

(2) చింతామణి యను వేశ్యాంగననే, గురువుగా స్వీకరించిన వాడు (బహువ్రీహి).

శ్రీసదాశివబ్రహ్మేన్ద్ర మాత్మవిద్యావిలాసినం ।
యోగాఽఽరూఢం, నిర్వికల్పసమాధిస్థం యతీశ్వరమ్ ।

చిత్సుఖే సంప్రతిష్ఠోఽపి, లోకకల్యాణకాంక్షయా ।
'బ్రహ్మసూత్రార్థవృత్తిం'చ, 'యోగసూత్రార్థబోధినీమ్' ।

చకార లఘుప్రకరణాని తం బోధరూపిణం ।
కీర్తనానాం చ కర్తారం, మహామౌనసమాశ్రయమ్ ।
ఆశ్రయే సతతం మాయామోహజాలవిముక్తయే ॥

శ్రీరామభజనాఽఽనన్దం, సంకీర్తనపరాయణం ।
శ్రీనారదాఽంశసంభూతం, నాదబ్రహ్మరతం సదా ।

రామభక్తి రసాఽఽర్ద్రాణి, కీర్తనాని సహస్రశః ।
కృతవాన్ యో మహాయోగీ, విశ్వకల్యాణకాంక్షయా ।

త్యక్తసర్వైషణం, రామభక్తిసామ్రాజ్యవల్లభం ।
త్యాగరాజం గురుం వన్దే, రామభక్త్యర్థ మాత్మని ॥

విశ్రుతమ్ 'అయ్యావాళ్' నామ్నా, భగవన్నామపరాయణం ।
'ఆఖ్యాషష్టి'* ప్రవక్తారం, సర్వభూతహితే రతమ్ ।

శ్రీధరవేంకటేశాఖ్యం, సమే బ్రహ్మణి సంస్థితం, ।
భగవన్నామగురుం వంద్యం, చిన్తయామి సదా హృది ॥

లింగమూర్తిం గురుమూర్తిం, రాజయోగప్రవర్తకం ।
శ్రీ సీతారామాఽంజనేయసంవాదాఽఽఖ్యమహాకృతేః ।
కర్తారం రామమన్త్రోపదేష్టారం, యోగినాం వరం ।
దత్తాఽత్రేయగురుప్రఖ్యం, సర్వభూతహితేరతం।
చిన్తయామి కవీన్ద్రం తం, యోగీన్ద్రం చింతితాప్తయే ॥
"వాసుదేవః సర్వ"మితి దర్శనం ప్రాప్య సర్వదా ।
సర్వాఽభివాదనపరం, దేశికేన్ద్రం మహామతిమ్ ।

* భగవన్నామ మాహాత్మ్యమును స్థాపించు అఱువది (60) శ్లోకములు గల దివ్యగ్రంథము, సవ్యాఖ్యానము

కృతవాన్ ఆన్ధ్రభాషాయాం, కృత్స్నం రామాయణం తతః ।
ఆన్ధ్రవాల్మీకి నామ్నాఽయం విఖ్యాత స్తం కవీశ్వరమ్ ।

శ్రీ కృష్ణలీలాఽమృతాదికర్తారం చ బహుశ్రుతం ।
వాసుదాసం గురుం వన్దే, రామభక్తిప్రబోధకమ్ ।

కవీన్ద్ర మాద్య మాన్ధ్రాణాం, నన్నపార్యం మహామతిం ।
ప్రణమామి సదా సత్యసన్ధం విశ్వహితే రతమ్ ।

యో దత్వా స్వీయకవితాం, రామాయ పరమాత్మనే ।
శ్రీకైవల్యపదం ప్రాప, పునరావృత్తివర్జితమ్ ।
తం పుణ్యచరితం, పోతనాఽమాత్యం, భక్తి శేవధిం ।
కృతవన్తం భాగవత మాన్ధ్రాణాం పుణ్యపేటికామ్ ।
ఆత్మబుద్ధిప్రసాదాయ, సంస్మరామి సదా హృది ।
హరిహరాఽద్వైతతత్త్వం, ప్రాప్యదర్శనమద్వయం ।
జనానాం తత్త్వబోధాయ, భారతం మోక్షసంహితామ్ ।
ఆన్ధ్రభాషాఽఽత్మికాం కృత్వా, యోఽభవత్పరమో గురుః ।
కవిబ్రహ్మేతి విఖ్యాత స్తం భజే తిక్కనాఽభిదమ్ ।
ఎఱ్ఱాప్రగడం, భాస్కరం, గోనబుద్ధం చ భూవిభుం ।

మడికిసింగనాఽఽఖ్యం చ, యోగినం వేమనాఽఽహ్వయం ।
మొల్లమాంబాం చ రామాయణకర్త్రీం భక్తిభావనీం ।

'తరిగొండ వెంగమాంబాం (చ) అన్నమాచార్యదేశికమ్ ।
భద్రాద్రి రామదాసం, నారాయణతీర్థతాపసమ్ ।

ఆంధ్రాణాం తత్త్వబోధం చ, భక్తి వైరాగ్య సంయుతమ్ ।
ప్రబోధకాన్ గురూ న్నిత్యం స్మరామి, ప్రణమామి చ ।

శంకరం, రామకృష్ణం చ, వివేకానన్దస్వామినం,
రమణర్షిం, రామదాసమ్, అరవిన్ద మహం భజే ॥

యోగాఽవతారం 'బాబాజీ' నామ యోగేశ్వరం విభుం,
'లహిరీ మహాశయం' చ, తస్యశిష్యం మహామతిమ్ ।

యుక్తేశ్వరగిరిం తస్య శిష్యం, కైవల్యదర్శకం ।

యోగానన్దం తచ్ఛిష్యం, పరమహంసం కృపాంబుధిం ।
మాతరం శ్రీ దయామాం దేవీం, 'యోగదా' సంఘరూపిణీమ్ ।
సంప్రసాదాయ చిత్తస్య, చిన్తయామి సదా హృది ॥

శరణాగతదీనార్త పరిత్రాణపరాయణం ।
కారుణ్యసాగరం దేవం, షిర్డీశం సాయినం భజే ॥

గీతారహస్యకర్తారం, సర్వభూతహితే రతం ।
లోకమాన్య మహం వన్దే తిలకం కర్మయోగినామ్ ॥

దివ్యజీవనతత్త్వజ్ఞం, పూర్ణాఽద్వైత ప్రవర్తకం ।
యోగీన్ద్ర మరవిన్దాఽఽఖ్యం, చిన్తయామి సనాతనమ్ ॥

మహర్షిం రమణం మూర్తగుహం శోణాఽద్రివాసినం ।
చిన్తావిహీనం, గమ్భీరం, తత్త్వదీపం సమాశ్రయే ॥

యోగసిద్ధిప్రదాం, ప్రేమమయీం, వాత్సల్యవర్షిణీం ।
శ్రీ మీరాం, మాతరం వన్దే, అరవిన్దాఽఽశ్రమస్థితామ్ ॥

ఆదౌ మోహనదాసోఽయం, కామాఽఽసక్త మనా అపి ।
బుద్ధియోగ ముపాశ్రిత్య, సోఽభవత్ కర్మచన్ద్రమాః ॥

గీతాఽభ్యాసపరత్వేన, సత్యాఽహింసాఽఽత్మసత్తయా ।
స్థితప్రజ్ఞత్వ మారూఢో, లోకవన్ద్యోఽభవత్తతః ॥

ప్రథితోఽభూత్ మహాత్మేతి, జగత్యాం తం యశస్వినం,
గాన్ధినం భావయే నిత్యం, చిత్తశుద్ధ్యర్థమాత్మని ॥

దివ్యజీవనసంఘస్య స్థాపకం యోగదేశికం ।
హృషీకేశాఽఽశ్రమస్థం, శ్రీ శివానన్దం, యతీశ్వరం ।

ఆధివ్యాధిచికిత్సాసు, సిద్ధ వైద్యం కృపానిధిం ।
స్మరామి బ్రహ్మసంస్థం తం, భవరోగవిముక్తయే ॥

అఖణ్డాఽఽనన్ద నిర్వృత్తిః, స్మరణాద్యస్య జాయతే ।
రామదాసం గురుం వన్దే, రామభక్తి రసాఽఽర్ణవమ్ ॥

రామమన్త్ర స్వరూపం శ్రీరామదాసం కృపాఽఽమ్బుధిం ।
భజామి మద్గురుం శాన్తమ్, ఆనన్దాఽఽశ్రమ వాసినమ్ ॥

స్మరణం దర్శనం స్యాద్ధి, నామైవ పరమేశ్వరః ।
ఇతియోఽదర్శయత్ ప్రేమ్ణా, రామదాసం గురుం భజే ॥

నారాయణాంశం, కరుణం, గురుశబ్దార్థగోచరం ।
మూర్త్తజ్ఞానం, రామలాలం యోగీన్ద్రం సముపాశ్రయే ॥

అభయం సర్వభూతేభ్యో, దాతారం మూర్తశంకరం ।
జగద్గురుం కృపాపూర్ణం, చన్ద్రశేఖర★ మాశ్రయే ॥

విశ్వధర్మప్రవక్తారం, సత్యసాయీశరూపిణం ।
కృపామ్బుధిం భాగధేయనిధిం వన్దే సనాతనమ్ ॥

సాయి రామాయ, సత్యాయ, శివాయ, పరమాత్మనే ।
సున్దరాయ, ప్రశాన్తాయ, నమః శ్రీ సత్యసాయినే ॥

సంసారదుఃఖతప్తానాం, జనానాం కరుణేక్షణైః ।
ప్రశాన్తిదాయినం దేవం, సత్యసాయిన మాశ్రయే ॥

నారాయణసమారమ్భామ్, ఆదిశంకరమధ్యమామ్ ।
అస్మదాచార్యపర్యన్తాం, వన్దే గురుపరంపరామ్ ॥

బ్రహ్మమానసపుత్రస్య వసిష్ఠపరమర్షిణః ।
అధ్యాత్మయోగవిద్యేయం, మూర్తిరూపా సనాతనీ ॥

ప్రతిబోధితా రామాయ, త్రేతాయాం మునినా స్వయమ్ ।
తాపత్రయనిరోధాయ, లోకస్య హితకాంక్షయా ॥

★ చన్ద్రశేఖరః – శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి – కాంచీపురం – కామ కోటి పీఠ జగద్గురు శంకరాచార్యులు – పరమాచార్య స్వాములు.

గ్రథితా కావ్యరూపేణ, తతః ప్రాచేత[1]సర్షిణా ।
'యోగవాసిష్ఠ' నామ్నీయం, సంహితా మోక్షదాయినీ ।
ద్వాత్రింశత్ శ్లోక సాహస్రీ (32000) సంహితా సంగ్రహీకృతా ॥

జ్ఞానానన్దభారతీతి విశ్రుతేన మహాత్మనా ।
'వాసిష్ఠ సంగ్రహ' ఇతి తద్గ్రన్థ మధునా ముదా ।

అకార్ష మాన్ధ్ర భాషాయాం, వివృతిం చ మనోరమాం ।
'పరమార్థ దీప' వ్యాఖ్యాం, న తు మన్మతి వైభవాత్ ॥

ఈశ్వరాఽనుగ్రహాత్ సాక్షాత్ ప్రాక్పుణ్య పరిపాకతః ।
భవబన్ధ విముక్తిస్స్యా దాత్మా మే సంప్రసీదతు ।

రత్నాకరాఽన్వవాయోఽహం, భారద్వాజర్షి గోత్రజః ।
తనూజో బాలరాజాఽఽఖ్యః, సుబ్బామ్బా, భాస్కరార్యయోః[2] ॥

గురువాయుపురీశాయ, విశ్వక్లేశాఽపహారిణే ।
సమర్పయే కృతి మిమాం, కృష్ణాయ పరమాత్మనే ।

ఇత్యేషా వాఙ్మయీ పూజా, శ్రీ కృష్ణపదపద్మయోః ।
అర్పితా తేన మేదేవః, శఙ్ఖచక్రగదాధరః ॥

ప్రీయతాం శ్రీమనోరామో, యశోదానన్దవర్ధనః ।
రాధాలావణ్యనిలయః, శరణాగతవత్సలః ॥

(1) మహర్షి వాల్మీకి.

(2) శ్రీమతి రత్నాకరం సుబ్బమ్మ, శ్రీ రత్నాకరం భాస్కరరాజు, సాకేతనిలయం [21, S.B.I. Colony] అనంతపురం (ఆం.ప్ర) - 515 001

(3) ఈ గురువందనమున (పుణ్యశ్లోకమంజరి యందు) ప్రణుతులైన పుణ్యశ్లోకులగు మహాత్ములందఱును, పరోక్షముగను, అపరోక్షముగను, భక్తిజ్ఞాన వైరాగ్య రూపమున చిత్తశాంతి నొసగు సిద్ధౌషధమును ప్రసాదించిన, ప్రసాదించుచున్న, కరుణామూర్తులు; పరమ ఆప్తులు. ఈ గ్రంథకర్త, తన స్మృతిపావనతకై సూత్రీకరించు కొన్న పుణ్యశ్లోకమంజరి ఈ గురువందనము.

యదస్తి మమ యోఽస్మ్యహం, సర్వం నాథ! తవైవ హి ।
నియతస్వమితి బుధ్వా, అర్పయామి కి మీశ! తే ।

తథాఽప్యేనాం ప్రగృహ్య కృపయా శిక్షయ మేమన : ।
రజోతమోభ్యాం సంఛన్నం, చిన్తాజ్వరసమాకులమ్ ।

భగవత్కృపయా శాన్తరససల్లాపశాలినీ ।
మోక్షార్థగర్భి తేయం మే కృతిః కైవల్యదర్శినీ ॥

చిత్తోపశమనీ సమ్యగ్దేశితా పరమర్షిణా ।
ప్రచరిష్యతి లోకేఽస్మిన్ యావత్ చన్ద్రాఽర్క తారకమ్ ।

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



**RAMAKRISHNA MATH**
Ramakrishna Math Marg
Domalguda
Hyderabad - 500 029

Phone { 7633936, 7633937, 7635545

Date: 3.3.97




# BENEDICTION

The **Yogavasishtha** is an important book on the Vedanta Philosophy and spirituality. Dr. Ratnakaram Bala Raju has done a great service to the Telugu knowing public in bringing, The Essence of Yogavasishtha (Sri Yogavasishtha Sangrahamu) out in the Telugu Language. It deserves wide circulation.

I convey my best wishes to the author for this service.

**SWAMI RANGANATHANANDA,**
*Vice President, Rama Krishna Math*
*and Rama Krishna Mission.*

శ్రీ శ్రీ జగద్గురు శంకరాచార్య మహాసంస్థానమ్,
దక్షిణామ్నాయ శ్రీ శారదాపీఠమ్, శృంగేరీ ॥

**_PRIVATE SECRETARY_**
**To his Holiness Sri Jagadguru.**
**Shankaracharya Dakshinamnaya**
**Sri Sharada Peetham'**
**Sringeri-577 139 (Karnataka)**



**Camp:** శృంగేరి
**Ref : D–1/13943**
**Date : 15-7-97**

శ్రీ రత్నాకరం బాలరాజుగారికి నమస్కారములు.

వేదాంతతత్త్వప్రతిపాదకగ్రంథములందు **యోగవాసిష్ఠము** మిక్కిలి ప్రసిద్ధమై యున్నది. గహనమైన తత్త్వమును సులభశైలిలో ఉపాఖ్యానముల ద్వారా తెలియజేయుట ఈ గ్రంథము యొక్క వైశిష్ట్యము. బృహత్కాయమైన ఈ గ్రంథమును కొంత సంక్షేపము చేసి, లఘుయోగవాసిష్ఠ మను గ్రంథము వెలువడినది. దానినికూడా సంగ్రహముగా తెలియజేయుచూ, **'వాసిష్ఠసంగ్రహ'** మను గ్రంథమును పరమహంస శ్రీ జ్ఞానానందభారతీస్వామివారు వెలువరించిరి.

ప్రకృతము తమరు, ఈ వాసిష్ఠసంగ్రహమునకు ఆంధ్రానువాదము, **'పరమార్థదీపని'** యను ఆంధ్రవ్యాఖ్యను రచించినారని తెలిసి శ్రీ **చరణులు సంతసించినారు.**

**ఈ గ్రంథమును శ్రీ చరణులు అవలోకించి, "అనువాదము చక్కగా నున్నది. వ్యాఖ్యానము గూడా జిజ్ఞాసువులకు సంశయచ్ఛేదన దక్షముగా నున్న"దని సెలవిచ్చినారు.**

"శ్రీ శారదాచంద్రమౌళీశ్వరుల యనుగ్రహమున ఈ గ్రంథము విశిష్ట ప్రచారము నందుగాక" యనియు "తమరు ఇతోధిక శ్రేయోవంతులగుదురు గాక" **యనియు శ్రీ చరణులు ఆశీర్వదించినారు.**

ఇంతే నమస్కారములు

× × × ×

( శ్రీ స్వామివారి ఆంతరంగిక కార్యదర్శి –
శారదాపీఠము – శృంగేరి )

"Vedanta Siromani", "Vedanta Visarada", "Vidvan"
Dr. P. SRIRAMACHANDRUDU
M.A. Ph.D. (Skt.) M.A. (English), M.A. (Hindi)
Recipient of President's Certificate of Honour
Professor of Sanskrit, O.U. (Rtd.)

"NANDANAM"
7-1-32/4, P-2, Leelanagar,
Begumpet, Hyd. - 500 016
Phone: 291200

Dated: 11-8-1997

శ్రీః

# ఆముఖము

యోగవాసిష్ఠం, అద్వితీయాత్మతత్త్వజిజ్ఞాసువులకు అత్యాదరపాత్రమైన మనన గ్రంథం. ఇది ప్రమాణం చేత, ప్రామాణ్యం చేతా కూడ, మహత్త్వాన్ని మహితత్త్వాన్ని, సంతరించుకొన్న గ్రంథం. అనేక ఇతర ప్రాచీన గ్రంథాలలో వలె దీనిలో కూడ ఎన్నో ప్రక్షిప్త భాగాలు చేరి ఉంటాయి. ప్రసిద్ధవిద్వాంసుడు, దాస్ గుప్త ప్రకారం ఈ గ్రంథంలో ఇరవై మూడువేల ఏడువందల ముప్పైనాలుగు (23734) శ్లోకాలు ఉన్నాయి. మొదట నిర్ణయసాగర ప్రెస్సు వారిచేత ప్రకటితమై, ఛాయాగ్రహణపద్ధతిలో మోతీలాల్ బనారసీ దాస్‌వారు 1984లో ముద్రించిన ప్రతికి వ్రాసిన ఆంగ్ల భూమిక ప్రకారం, దీనిలోని మొత్తం శ్లోకాల సంఖ్య ముప్పై రెండు వేలు (32,000). దీనిని బట్టి, ఆయా ప్రాంతాలలో లభించిన దీని వ్రాత ప్రతులలో చాలా భేదాలు ఉన్నట్లు కనబడుతోంది. ఆయా విషయాలను విశదీకరించడానికి చెప్పిన వివిధోపాఖ్యానాలు అతి దీర్ఘంగా ఉండడం చేత, సర్గలకి సర్గలు నగర - యుద్ధ - సూర్యోదయాదుల సుదీర్ఘ వర్ణనలకి వినియోగించడం చేత, గ్రంథం ఇంత విస్తృతంగా పెరిగిపోయింది. ఈ వర్ణనాదుల మధ్య నుంచి, గ్రంథప్రతిపిపాదయిషితమైన తత్త్వాన్ని వెలికి తీయడం సైకతరాశులలో మరుగుపడి ఉన్న రత్నాలను బైటకు తీయడం వంటిది.

అందుచేతనే ఆయా కాలాలలో దీనికి అనేక సంగ్రహగ్రంథాలు బయలుదేరాయి. నవమ శతాబ్దానికి చెందిన అభినందుడు, 'బృహద్యోగ వాసిష్ఠం' 'లఘు యోగవాసిష్ఠం', 'యోగవాసిష్ఠశ్లోకాలు', 'యోగవాసిష్ఠసంక్షేపం', రచించాడు. అద్వైతానందుని శిష్యుడైన రామానంద తీర్థుడు, 'యోగవాసిష్ఠసారం', 'యోగవాసిష్ఠ సారసంగ్రహం' 'వాసిష్ఠ సారగూడార్థం' అనే గ్రంథాలు రచించాడు. ఈ విధంగా ఎన్నో సంగ్రహగ్రంథాలు, వాటి మీద వ్యాఖ్యానాలు కూడా బయలుదేరాయి. వీటి

సాహాయ్యం లేకపోతే, వివిధవర్ణనారణ్యాలలో చిక్కుకునిపోయిన సామాన్య పఠితకు, యోగవాసిష్ఠం లోని ప్రతిపాద్యవిషయం అందుబాటులోఉండేదికాదు. విద్యారణ్యులు, లఘుయోగవాసిష్ఠం నుంచే ఎన్నో శ్లోకాలు జీవన్ముక్తి వివేకాదులలో ఉదాహరించారు.

యోగవాసిష్ఠంలో ప్రతిపాదించిన అద్వైతతత్త్వానికీ శాంకరాద్వైత సిద్ధాంతానికి భేదం ఉందా, రెండూ సమానమైన వేనా, అనే విషయాల కొరకు ఆధునిక విమర్శకులలో అభిప్రాయభేదం ఉంది. యోగవాసిష్ఠప్రారంభం లోనే సతీక్ష్ణుడనేముని, అగస్త్య దగ్గరికి వెళ్ళి, మోక్షానికి కారణం కర్మయా? జ్ఞానమా? రెండూనా? అని ప్రశ్నించినట్లు, అగస్త్య–

"ఉభాభ్యామేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః।
తథైవ జ్ఞానకర్మభ్యాం జాయతే పరమంపదమ్।
కేవలాత్కర్మణో జ్ఞానాన్నహి ఽమోక్షోఽభిజాయతే।
కింతూభాభ్యాం భవేన్మోక్షసాధనం తూభయం విదుః। (యో.వా.1.1.78)

అని పక్షి ఏ విధంగా రెండు రెక్కలు ఉంటేనే ఎగర గలుగుతుందో అదేవిధంగా, జ్ఞానకర్మలు రెండూ ఉంటేనే మోక్షం కలుగుతుంది. అని సమాధానం చెప్పినట్లు ఉంది. శంకర భగవత్పాదులు అవకాశం వచ్చినప్పుడల్లా, సూత్రభాష్య-గీతాభాష్య-ఉపనిషద్భాష్యాదులలో జ్ఞానకర్మసముచ్చయవాదాన్ని పూర్తిగా ఖండించి ఉన్నారు.

అదేవిధంగా, యోగవాసిష్ఠంలో బౌద్ధమతసంబద్ధమైన విజ్ఞానవాదం ప్రతిపాదించబడినట్లు కనబడుతుంది. ప్రపంచం అంతా మానసిక సృష్టిమాత్రమే అని కూడా, అనేక స్థలాలలో ప్రతిపాదించబడింది. ఇలాంటి వాటిని పట్టి కూడా దీనిలో చెప్పిన అద్వైతం శాంకరాద్వైతం కంటే భిన్నం అనే వాదం ఒకటుంది.

అయితే, జాగర్తగా పరిశీలించి చూస్తే ఈ గ్రంథంలో ప్రతిపాదించిన ఏ ఒక్క విషయానికీ శాంకరాద్వైతంలో సమన్వయం కుదరకపోవడం అనేది లేదు. శంకర భగవత్పాదులు కూడా, కర్మలకి మోక్షం విషయంలో సంనిపత్యోపకారకత్వాన్ని (సాక్షాదుపకారకత్వాన్ని) అంగీకరించకపోయినా, ఆరాదుపకారకత్వాన్ని అంగీకరించారు. కర్మలు చిత్తశుద్ధి జననం ద్వారా జ్ఞానం కలిగించి, పరంపరయా

మోక్షసాధకా లౌతాయని వారి సిద్ధాంతం, "నను జ్ఞానకర్మణోః విలక్షణ కార్యత్వాత్ కార్యైకత్వాఽనుపపత్తిః; నైషదోషః, జ్వరమరణకార్యయోరపి దధివిషయోర్గుడమన్త్ర సంయుక్తయోస్తృప్తి పుష్టికార్యసందర్శనాత్. తద్వత్ కర్మణోఽపి జ్ఞానసంయుక్తస్య మోక్షకార్యత్వోపపత్తేః. నన్వనారభ్యో మోక్షః; కథమస్య కర్మకార్యత్వముచ్యతే? నైష దోషః, ఆరాదుపకారకత్వాత్ కర్మణః. జ్ఞానస్యైవ హి ప్రాపకం సత్కర్మప్రణాడ్యా మోక్షకారణమిత్యుపచర్యతే । (బ్ర.సూ.శాం.భా.4.1.16)

బ్రహ్మం ఒక్కటే పారమార్థిక సత్యం. తదితరమైనది అంతా కాల్పనికమే. ఆ బ్రహ్మ జ్ఞానస్వరూపం ("ప్రజ్ఞానం బ్రహ్మ") అని ఉపనిషత్తులు ఘోషిస్తుండగా, యోగవాసిష్ఠప్రతిపాదితవిజ్ఞానవాదం, బౌద్ధు లంగీకరించినది అనడం యుక్తి సహం కాదు. వాళ్లే, ఉపనిషత్తుల నుండి ఎన్నో విషయాలు సంగ్రహించినట్లు సప్రమాణంగా నిరూపించవచ్చు. అదేవిధంగా, దృష్టిసృష్టివాదాదులు, అద్వైతులకు అపరిచితాలు కాదు. నిజానికి ఈనాడు చాలామంది అనుకుంటున్నట్లు, ప్రచారం చేస్తున్నట్లు, జైనబౌద్ధాదిమతాలు వైదికమతంతో ఏమాత్రం సంబంధం లేని మతాలు కావు. వైదికమతానికి సంబంధించినంతవరకు ఆ సంప్రదాయాలు కొంత ఆస్తిని తీసికొని, కుటుంబం నుంచి విడిపోయిన పుత్రుల వంటివి. అందుచేత, యోగవాసిష్ఠం లోని సిద్ధాంతాలు శాంకరాద్వైత తత్త్వానికి దూరంకాదు. అందువల్లనే, ఎందరో అద్వైతాచార్యులు ఈగ్రంథం నుంచి అనేక శ్లోకాలు, ప్రమాణంగా తమ గ్రంథాలలో ఉద్ధరించడం జరిగింది.

శ్రీ జ్ఞానానందభారతీస్వాముల వారు కూర్చిన "శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహం" పైన పేర్కొన్న అతి ప్రామాణికమైన, ముముక్షుజనోపయుక్తమైన యోగవాసిష్ఠ సంగ్రహాల కోవకి చెందినది. ఇది 1698 శ్లోకాల గ్రంథం, ముప్పై రెండు (32) సర్గలలో విభజించబడింది. యోగవాసిష్ఠసారాన్నంతనీ హస్తామలకంగా తత్త్వజిజ్ఞాసువులకు అందజేసిన ఈ గ్రంథానికి డా॥ రత్నాకరం బాలరాజుగారు అన్యూనానతిరిక్తమూ, పరమప్రామాణికమూ అయిన ఆంధ్రభాషానువాదం చేసి, తద్ద్వారా సంస్కృతభాషతో అంతగా పరిచయం లేని తెలుగువారికి ఎంతోఉపకారం చేశారు. మూలయోగవాసిష్ఠానికి శ్రీ మదానందబోధేంద్రసరస్వతి రచించిన 'యోగవాసిష్ఠ మహారామాయణ తాత్పర్య ప్రకాశం' అనే వ్యాఖ్యను అనుసరించి చక్కని సరళశైలిలో రచించిన ఈ ఆంధ్రభాషానువాదం, సర్వథా ప్రామాణికంగా, విషయప్రతిపాదనప్రధానంగా ఉంది.

ఇలాంటి ఆధ్యాత్మికగ్రంథాల అనువాదం కేవలం ఏదో సంస్కృత భాషాజ్ఞానం ఉన్నంతమాత్రాన సాధ్యం అయ్యే పనికాదు. కావ్యాలకి కావ్యత్వాన్ని చేకూర్చే వ్యంగ్యార్థాన్ని గూర్చి చెపుతూ **ఆనందవర్ధనుడు –**

**"శబ్దార్థశాసన జ్ఞానమాత్రేణైవ న వేద్యతే ।**
**వేద్యతే స తు కావ్యార్థ తత్త్వజ్ఞైరేవ కేవలమ్" ।** (ధ్వ.ఆ. 1.7)

(వ్యంగ్యార్థ జ్ఞానం కలగాలంటే, వ్యాకరణం, నిఘంటువులు, మొదలైనవి చదివినంత మాత్రాన ప్రయోజనం లేదు. **నిరంతరోత్తమకావ్యాదిశీలనాజన్య వాసనావాసితాంతః కరణులైన, సహృదయులు మాత్రమే** దానిని గ్రహించకలుగుతారు) అని అంటాడు. అలాంటి వాటి విషయంలోనే ఇలా చెప్పినప్పుడు, ఇలాంటి ఆధ్యాత్మిక గ్రంథాలలోని నిగూఢ తత్త్వాన్ని గ్రహించి, దానిని మాటలలో ఆవిష్కరించాలంటే **ఎంతటి ఆధ్యాత్మికతత్త్వచింతా ప్రవణత్వం** ఉండాలో వేరుగా చెప్పనవసరం లేదు.

డా॥ బాలరాజుగారు చేసిన అనేక ఆధ్యాత్మికగ్రంథాల కూలంకష పరిశీలన వీరు అడుగడుగునా, అడుగున ఇచ్చిన టిప్పణులను పట్టి తెలుస్తుంది. దాదాపు ప్రతిరెండవపేజీలో **వీరిచ్చిన పాదటిప్పణులు మూలగ్రంథసారం వంట పట్టడానికి (మనస్సులో దృఢంగా నిలవడానికి) ఉపయోగించే అనుపానాలుగా ఉన్నాయి.** వ్యాఖ్యానసహాయంతోమాత్రమే చేసిన అనువాదం, మూలార్థగ్రహణానికి ఉపకరిస్తే ఉపకరించవచ్చును. అలాంటి అనువాదం కావ్యాదులలో సరిపోవచ్చును. కాని, ఆధ్యాత్మిక గ్రంథాల అనువాదం కూడా ఆ విధంగానే ఉంటే అది కావలసిన ప్రయోజనాన్ని పూర్తిగా సాధించజాలదు. వివిధ గ్రంథాలలోని దార్శనిక విషయాలను బాగా మననం చేసిన **ఒక సాధకుడు** రచించిన అనువాదం అవడం చేతనే ఇది ఇంత బుధజనాదరణ పాత్రంగా ఉంది.

అద్వైత సిద్ధాంత ప్రతిపాదక గ్రంథాలలోనే కాకుండా, **బౌద్ధ వాఙ్మయంలో** కూడా, డా॥ బాలరాజుగారి కున్న ప్రవేశం అసాధారణమైంది. అనేక దార్శనిక విషయాలలో వీరికున్న తలస్పర్శిజ్ఞానం ఎంతటిదో తెలుసుకొనడానికి మచ్చుకు కొన్ని పాదటిప్పణులను ఇక్కడ నిర్దేశించడం అప్రస్తుతం కాదు.

"అశాన్తస్య మనోభారో, భారోఽ నాత్మవిదో వపుః" (1,3)

అనే శ్లోకార్థంలో చెప్పిన భావాన్నే వేరుమాటలతో ప్రతిపాదించిన 'శ్రీ యజ్ఞ వరాహగీత'లోని శ్లోకం, 'ధర్మపదం'లోని శ్లోకం ఉదాహరించబడ్డాయి. (వీరు ఉదాహరించిన శ్లోక-వాక్యాదులన్నింటికి అక్కడనే ఆంధ్రభాషలో వివృతి ఇచ్చి ఉన్నారు).

"అజ్ఞస్య దుఃఖౌఘ మయం, జ్ఞస్యాఽఽనన్దమయం జగత్ ।
అన్ధం భువన మన్ధస్య ప్రకాశం తు సుచక్షుషః" ।

"దీఘా జాగరతో రత్తి, దీఘం సన్తస్స యోజనమ్ ।
దీఘో బాలానం సంసారో సద్ధమ్మం అవిజానతం" ।

"కిం శ్రియా..... నికృన్తతి" (1.42) అనే శ్లోకం భావానికి ఉపష్టంభకంగా
"శ్వోభావా మర్త్యస్య య దన్తకైతత్,
సర్వేన్ద్రి యాణాం జరయన్తి తేజః, ।
అపి సర్వం జీవిత మల్ప మేవ,
తవైవ వాహా స్తవ నృత్యగీతే" । -అనే కఠోపనిషద్వాక్యం చూపబడింది.

శుకుడు తత్త్వజిజ్ఞాసతో జనకుని దగ్గరికి వెళ్ళిన విషయాన్ని వర్ణించే ఘట్టంలో (2వ సర్గ) మహాభారతం శాంతిపర్వంలో ఉన్న ఇదే ఘట్టం నిర్దేశించబడింది. మహాభారతంలో ఇలాంటి విషయాలున్నాయని చాలా మంది పండితులకు కూడా తెలియదు. మహాభారతాన్ని ఆమూలాగ్రంగా చదివిన వాళ్ళే అరుదు. ఇది ఈ రచయిత కున్న విస్తృత గ్రంథ పరిచయానికి ఉదాహరణం.

"వీతశోకః శశామాఽసౌ నిర్వికల్పసమాధినా" । (2.19) అనే శ్లోక భావం విశదీకరించే సందర్భంలో "యత్రోపరమతే చిత్తమ్" ఇత్యాది భగవద్గీతా శ్లోకాన్ని (6.20), "తదా ద్రష్టుః స్వరూపేఽవ స్థానమ్" అనే యోగసూత్రం (1.2) ఉదాహరించి, నిర్వికల్పసమాధి స్వరూపం సంక్షిప్తంగా చక్కగా వివరించబడింది. ఈ విషయమే మరొక ఘట్టంలో (4.16)

"ప్రశాన్తవృత్తికం చిత్తం, పరమానన్ద దీపకమ్ ।
అసంప్రజ్ఞాతనామాఽయం సమాధి ర్యోగినాం ప్రియః" ।

అనే శ్రుతి వాక్యాన్ని

"ద్రష్టృ దర్శన దృశ్యానాం విరామో యత్ర జాయతే ।
స్వస్వరూపం తదేవ స్యాత్, సాక్షిరూపేణ తిష్ఠతి" ॥

అనే శ్రీ శారదాచతుశ్శతి శ్లోకాన్నీ, "తస్యాపి నిరోధే సర్వనిరోధాన్నిర్బీజః సమాధిః"॥ - అనే యోగ సూత్రాన్ని (1.51) ఉదాహరించి వివరించబడింది.

సాక్షాత్కృతాత్మ స్వరూపులు కూడా, స్వీయప్రారబ్ధక్షయం అయే వరకు శరీరధారణం చేసి, జ్ఞానోపదేశాదుల ద్వారా లోకాన్ని అనుగ్రహిస్తూ ఉంటారనీ, కొందరు ఆధికారికస్థానాలు అధిష్ఠించి ఉంటారనీ చెప్పే ఘట్టంలో (వసిష్ఠుని జన్మవృత్తాంతం-2 వ సర్గ) ఇందుకు ప్రమాణంగా, "యావదధికార మవస్థితి రాధికారికాణామ్"॥ - అనే బ్రహ్మసూత్రం (3.3.32), దానిపై శంకర భగవత్పాదుల భాష్యం ఉదాహరించబడ్డాయి. "శరీర వృత్తి ర్వ్రతమ్", "కథా జపః", "దానమాత్మ జ్ఞానమ్", అనే శివ సూత్రాలు (3.26, 27,28) కూడా ఉదాహరించి ఈ విషయం వివరించబడింది. ఈ విషయంలోనే వాచస్పతి మిశ్రుని-

"విద్యాకర్మ స్వనుష్ఠాన తోషితేశ్వర చోదనమ్ ।
అధికారం సమాప్యైతే, ప్రవిశన్తి పరంపదమ్" ॥

అనే అధికరణసిద్ధాంతసంగ్రహశ్లోకం కూడా ఉదాహరించబడినది. శాంకర భాష్య పరిచయమే కాకుండా భామతీ కల్పతర్వాది జ్ఞానం కూడ ఉన్నవారు ఈ రోజుల్లో చాలా అరుదుగా ఉన్నారు.

"విచ్ఛిన్న ........ భవాఽమ్బుధౌ" (2.52) అనే శ్లోకం భావం

"నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే, భవాఽబ్ధౌ పరమాయణమ్ ।
సన్తో బ్రహ్మవిదః శాన్తాః, నౌర్దృఢే వాఽప్సు మజ్జతామ్" ।

అనే భాగవత శ్లోకాన్నీ, "క్షణమపి సజ్జన సంగతి రేకా భవతి భవార్ణవ తరణే నౌకా" - అనే శంకరభగవత్పాద శ్లోకభాగాన్ని ఉదాహరించి విశదీకరించబడింది.

ఋతం అనగా సత్యం, అనృతం అనగా అసత్యం. ఇవి లౌకిక వాఙ్మయంలో ప్రసిద్ధమైన అర్థాలు. అయితే వైదికవాఙ్మయంలో ప్రయోగించబడిన 'ఋత

శబ్దానికి సకలభువన వ్యవహారాన్ని ఒక నియమితమైన పద్ధతిలో నడిపించే ఒక మహాశక్తి అని స్థూలంగా అర్థం చెప్పవచ్చు.

"ఋత మాత్మా పరం బ్రహ్మ సత్య మిత్యాదికా బుధైః" ॥ (3.6) అనే శ్లోకంలోని ఋతశబ్దం అర్థం ఋగ్వేదం నుంచీ నారాయణీయం నుంచి వాక్యాల్ని ఉదాహరించి చక్కగా ప్రామాణికంగా వివరించబడింది.

"అవిద్యా సంసృతి ర్మోహో, బన్ధో మాయా మలం తమః" (3.9) - అనే శ్లోకాన్ని వివరించే సందర్భంలో -

"నిర్గుణే కేవలే సాక్షాదాత్మనో యద్విపర్యయః ।
సైషా భగవతో మాయా యయేదం నిర్మమే విభుః ।

అనే భాగవత శ్లోకం,

"మహామోహప్రభావోఽయం, యేన నిత్య మనిత్యతామ్ ।
నిత్యతామివ మన్యన్తే మూఢా జగతి జన్తవః ॥
అసత్యే, రమతే లోకః, సత్యప్రత్యయమోహితః ।
న వేత్తి సర్వభావానా మభావాఽనుభవం స్థితమ్" ॥

అనే క్షేమేంద్ర కృత అవదాన కల్పలతలోని శ్లోకాలూ ఉదాహరించబడ్డాయి. క్షేమేంద్రుడనే కాశ్మీర పండితు డుండేవాడని అతడు రామాయణమంజరి – భారత మంజరి– బృహత్కథా మంజరి– అవధాన కల్పలతాది బహుగ్రంథానిర్మాత అనీ ఈనాటి పండితులలో ఎంతమందికి తెలుసు?

పాతంజలయోగదర్శనంలో చిత్తప్రసాదం(చిత్తానికినిర్మలత్వం) సంపాదించడానికి అనేక ఉపాయాలు చెప్పబడ్డాయి. అలాటి ఒక ఉపాయాన్ని ఉపదేశించే సూత్రం – "మైత్రీకరుణా ముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాఽపుణ్య విషయాణాం భావనాత శ్చిత్త ప్రసాదనమ్"(యో.ద.-1.33) అనేది. సుఖవంతులను చూచి మైత్రీభావం పెంపొందించుకోవాలి. అసూయ పడకూడదు. దుఃఖితుల్ని చూచి జాలిపడాలి, మహబాగా జరిగిందిలే అనుకోకూడదు. పుణ్యవంతులను చూచి సంతోషించాలి, ఏదో బాహ్యాడంబరం కోసం చేస్తున్నారు అనుకోకూడదు. పాపాచారులను చూచి ఉపేక్షాభావం వహించాలి. దాన్ని గూర్చే ఆలోచిస్తూ నిందాదులు చేయగూడదు. అపుడు మనస్సు నిర్మలంగా ఉంటుందని దీని భావం.

యథాజాతులుగానే ఉండిపోయి, తథాగతులై పోయే లౌకాయతికులు తప్ప దార్శనికులందరూ, బౌద్ధజైనాదులతో సహా, యోగాభ్యాసానికి అత్యంత ప్రాధాన్యం అంగీకరించినవారే. అందుచేతనే విద్యారణ్యులు, జీవన్ముక్తి వివేకంలో–

"నాఽపి లౌకాయతికవ్యతిరిక్తః సర్వోఽపి తైర్థికః మోక్షమజ్గీకుర్వన్ యోగి చరితేఽపి విసంవిదితు మర్హతి. ఆర్హత, బౌద్ధ, వైశేషిక, నైయాయిక, శైవ, వైష్ణవ, శాక్త, సాంఖ్యయోగాఽది మోక్షశాస్త్రేషు, ప్రతిపాద్యప్రమేయస్య నానావిధత్వేఽపి మోక్షసాధనస్య యమనియమాద్యష్టాజ్గయోగస్య ఏకవిధత్వాత్" (జీ.ము.వి. పేజి 144) అన్నారు. ఈమైత్ర్యాదులకు బౌద్ధమతంలో బ్రహ్మవిహారాలు అని పేరు. వీటి ప్రాధాన్యాన్ని గూర్చి క్రిస్ట్మస్ హంఫ్రేస్ అనే ఆయన 'జెన్' అనే గ్రంథంలో ఇలా అన్నాడు.

"The four Brahmaviharas, for example, or god-like states of mind, can be usefully exercised at any time and place, from the office to the restaurant, from a dentist's waiting room to a bus. These four virtues though powers mind is a better term, are Metta, loving kindness or good will, Karuna, Compassion, Mudita, joy and upekkha, equanimity or serenity of mind. In a famous quotation from a Buddhist sutta –"He lets his mind pervade one quarter of the world with thoughts of loving kindness, with thoughts of compassion. with thoughts of sympathetic joy and with thoughts of equanimity and so the second quarter, and so the third quarter and the fourth. And thus the whole wide world. above, below, around and every where does he continue to pervade with heart of love, compassion, pity and equanimity, far-reaching, great beyond measures free from the least trace of anger or ill-will, "This practice is itself a subject of meditation and as thoughts are things, and powerful things and thought force steadily directed is potentially an immense force for good, the practice of these ancient modes of blessing is a far better way of passing the idle moment of waiting, or a journey, than the useless and often harmful thoughts which other wise occupy the mind" (pp. 48-49).

"మైత్ర్యాదిభావనానామ్నీః, గృహాణాఽమలవాసనాః । (10.61) శ్లోకం పాదటిప్పణిలో డా॥ బాలరాజుగారు పై పాతంజలసూత్రం ఉదాహరించి సుత్తనిపాతంలో

మైత్రీభావనకిచ్చిన ప్రాధాన్యాన్ని ప్రతిపాదిస్తూ, దానిలో నుంచి కూడా ఒక పద్యం ఉదాహరించారు.

"ప్రతిషేధం న జానామి, న జానా మ్యభివాఞ్ఛితమ్ ।
న స్తౌమి న చ నిన్దామి, యథేచ్ఛసి తథాకురు" ॥ (28.46)

శ్లోకానికి పాదటిప్పణిలో శ్రీమద్గంగాధరసరస్వతీయతీంద్రుల 'స్వారాజ్యసిద్ధి' నుంచి

"నిరవధి సుఖభూమాఽనన్త సంవిత్పరాత్మ
న్యనుభవ మధిరూఢం వాక్యతో యోగతో వా ।
భవతు దృఢసమాధి ర్లోక సంగ్రాహకో వా,
భజతు విషయ జాతం, నైతి భూయోఽపి బన్ధమ్" ॥

అనే శ్లోకాన్ని ఉదాహరించి పూర్వోక్త శ్లోకార్థ పరిపుష్టి చేయబడింది.

"న చైత్యమన్యన్నో చిత్తం, బ్రహ్మైవేదం విజృమ్భతే ।
సర్వమేకం పరం బ్రహ్మ, కో మోక్షం కస్య బద్ధతా" ॥ (17.53)

అనే శ్లోకం అర్థానికి ఉపష్టంభకంగా "వాస్తవంలో ఉత్పత్తీ లేదు వినాశమూ లేదు, బద్ధుడూ, సాధకుడూ, లేడు. ముముక్షువూ లేడు, ముక్తుడూ లేడు" – అని చెప్పే –

"న నిరోధో నచోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః ।
న ముముక్షు ర్నవై ముక్త ఇత్యేషా పరమార్థతా॥"

అనే సుప్రసిద్ధమైన గౌడపాద కారిక ఉదాహరించబడింది.

ద్వైబీజే.... దృఢ భావనా" (19.3) శ్లోకానికి పాదటిప్పణిలో ప్రాణ స్వరూప నిరూపణం సశాస్త్రీయంగా చేయబడింది.

ఈ విధంగా, డా॥ బాలరాజుగారు పైన పేర్కొన్నవే కాక ఇంకా ఎన్నో గ్రంథాలనుంచి, ఎన్నో ఉపనిషత్తుల నుంచి, పంచదశి, హఠయోగప్రదీపికాది గ్రంథాలనుంచి, అనేక వాక్యాలు ఉద్ధరించి ఆయా శ్లోకాల అర్థాలను సప్రమాణంగా ప్రతిపాదించారు.

ప్రసంగవశం చేత, శ్రీ రామకృష్ణపరమహంస, వివేకానందులు, అనీబిసెంటు, అరబిందో, మొదలైనఎంతోమందిఅర్వాచీనులుమనఆధ్యాత్మిక విద్యవిషయం లోను, సంస్కృతి విషయంలోను ఆవిష్కరించిన అభిప్రాయాలను కూడ పాదటిప్పణులలో పొందుపరిచారు. మహాయోగుల దేహాలు ప్రాణత్యాగానంతరం కూడ, కొన్నాళ్లపాటు ఏ విధంగా చెక్కు చెదరకుండా ఉంటాయో శ్రీ అరబిందో, "ఆటో బయాగ్రఫీ ఆఫ్ ఏ యోగి" (Autobiography of a Yogi) అనేగ్రంథం ద్వారా, యోగులను గూర్చి, వారి శక్తులను గూర్చి, వర్ణించి చెప్పిన శ్రీ పరమహంస యోగానందల ఉదాహరణం చూపి, భారతీయ యోగవైశిష్ట్యాన్ని 250 పేజీలో విశదీకరించారు. 434వ పేజీలో ఆర్యులు ఎక్కడినుండో వచ్చారన్న వాదాన్ని సప్రమాణంగా ఖండించారు.

ఎన్నో గ్రంథాలు చదవడం ఒక ఎత్తు, వాటిలోని విషయాలన్నీ ధారణ చేసి, వాటిని తత్త త్ప్రకరణానుగుణంగా ఉపయోగించుకొనడం ఒక ఎత్తు. ఇది భగవదనుగ్రహప్రాప్తమైన మేధాశక్తి విశేషానికి తార్కాణం. ఈ పద్ధతి మన ప్రాచీన గ్రంథ వాఖ్యానాలలో మాత్రమే కనబడుతుంది. అయితే ఆ వాఖ్యాతలు ఇలాంటి ప్రకృత విషయ సంబద్ధాంశాలను, ఇతరగ్రంథాల నుంచి ఉద్ధరించి, ఆయా శ్లోకాల క్రిందనే ఇచ్చేవారు. ఇక్కడ పాదటిప్పణులలో ఇవ్వబడ్డాయి. ఇదే భేదం ఈ రచయితకున్న బహుగ్రంథపరిచయానికి, విషయప్రతిపాదనానైపుణికి ఉదాహరణలుగా, స్థాలీపులాకన్యాయం చేత కొన్ని అంశాలు పేర్కొనడం జరిగింది.

ముప్పైరెండువేల (32,000) శ్లోకాల యోగవాసిష్ఠం సారాన్ని పదిహేడువందల (1700) శ్లోకాలలో ఇమడ్చి, శ్రీ జ్ఞానానందభారతీస్వాములవారు ఆధ్యాత్మవిద్యాజిజ్ఞాసువులకు అందజేసిన ఈ యోగవాసిష్ఠసంగ్రహాన్ని, ఆత్మవిద్యారత్నాకరులైన డా॥ బాలరాజుగారు సంతరించిన అనువాద-పరమార్థదీపనీ వాఖ్యానాలతో పఠించే వారి హృదయక్షేత్రాలలో, ఆధ్యాత్మిక విద్యాబీజాలు నిక్షిప్తములై, పునఃపునః పఠన రూపమనన జలసేకం చేత అంకురించి, తదర్థనిదిధ్యాసన చేత, క్రమక్రమ వర్ధమానవృక్షరూపములు దాల్చి, ఫలేగ్రహులు కాగలవని నా దృఢ విశ్వాసం.

హైదరాబాదు
9.8.1997

పుల్లెల శ్రీరామచంద్రుడు

డా॥ తిరుమల రామచంద్ర,
స్వాతంత్ర్య సమరయోధుడు,
రచయిత.

హైదరాబాద్ - 80
తేదీ: 18-8-97

# మరొక సమ్యక్కృషి - సమ్యక్కృతి

తత్త్వామృత పరిపూర్ణ తపనీయకలశం మిత్రులు రత్నాకరం బాలరాజుగారు. ఈయనలో నాకు నాటి ఋగ్వేదకాలపు విశ్వామిత్ర, త్రసదస్యు, పౌరకుత్స, మాధుచ్ఛందాదిరాజర్షులు, ఉపనిషత్కాలపు జనకాదిరాజర్షులు కాన వస్తారు. ఈయనతో ఐదునిమిషాల సంభాషణలో, ఐదువందలమంది తత్త్వవేత్తలు గోచరమై, మనను వేదోపనిష దుద్యానాలలో విహరింపజేస్తారు; జైనబౌద్ధుల ఆగమ పిటకారామాలలో పర్యటింప జేస్తారు; అరవిందుల "అతిమానస" లోకాలకు తీసుకొని వెళ్లుతారు; సూఫీల గుల్షన్ల గుమగుమలు ఆస్వాదింపజేస్తారు.

బాలరాజుగారికి ఉన్న వివిధప్రస్థానాల సమన్వయదృష్టి, సామరస్య విధానం, అనిదంపూర్వాలు. ఏ ఆచార్యుడూ తన పూర్వాచార్యులను ఎవరినీ ఖండించలేదు. ప్రతిసిద్ధాంతమూ, పూర్వసిద్ధాంతానికి మండనమే కాని, ఖండనం కాదు; పూరకమే గాని మారకం కాదు - అని ఆయన నిర్ణయం. తదనుగుణంగానే ఆయన తద్వివరణకు పూనుకొన్నారు; తమ సామరస్యసాధనప్రస్థానంలో విజయం సాధిస్తున్నారు.

సమకాలీన తత్త్వాచార్యులలో లేని, వారికి తోచని, ఈ సమన్వయ దృష్టి బాలరాజుగారికి ఎలా కలిగింది? ఎందుకు కలిగింది? బాలరాజుగారు చాల చిరుత ప్రాయంనాడే పాతఅచ్చు గుజలీప్రతి అధ్యాత్మరామాయణం కొన్నారు. చదివారు. అర్థం కాలేదు. మళ్లీ చదివారు. శ్లోకాలు చాల కంఠస్థ మయ్యాయి గాని, విషయ మేమిటో బోధపడలేదు. మళ్లీ చదువుతూ పోయారు. ఏదో లీలా మాత్రంగా, ఛాయామాత్రంగా అర్థమయినట్టు తోచింది. సాధన వల్ల కొంత సాధించవచ్చుననుకున్నారు. తత్త్వశాస్త్రానికి సంబంధించినది ఏది కనిపించినా చదువసాగారు. అద్భుతమయిన ధారణ. మెదడులో అన్నీ అతుక్కుపోవలసిందే.

"ధీ ర్ధారణావతీ మేధా" - అని కదా అన్నాడు అమరసింహుడు.

"గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్"- అని, గోదాదేవి తండ్రి విష్ణుచిత్తుని గురించి పెద్దలు చెప్పేమాట. ఆయన గురువుల వద్ద చదువుకోకనే వేదాలనన్నిటినీ చెప్పాడట. అలాగే బాలరాజుగారు కూడా గురుముఖ మనధీత్యని గమాంతానికి సంబంధించిన దంతా పుక్కిటబట్టారు. ఈయన మేధ ఒక పెద్ద పావురాల గూడు. ఈయన తలచినప్పుడల్లా, ఆ గూటిలో నుంచి కర్పూరకాంతులతో భావకపోతాలు గునగునమంటూ వెలపలికి వస్తాయి; వెనుదిరిగి పోయి విలీనమవుతాయి.

ఈ మహాశక్తిని బాలరాజుగారు ఎలా సంపాదించారు? అకుంఠితదీక్ష, అనవరతాధ్యయనం, అపార వివేచన దృష్టి, అనితరసాధ్య పరిశ్రమ, బాలరాజుగారిని ఇంత వారిని చేశాయి. ఈయనకు కొన్ని వేల శ్లోకాలు, పద్యాలు, అటుండగా, భగవద్గీత, రమణగీత వంటి పుస్తకాలు పుస్తకాలే మనఃపాఠం . ఈధారణా విశేషం చూసి, "అవధాన ప్రక్రియ కిటుకులు చెబుతాను నేర్చుకో. గొప్ప అవధాని శేఖరుడవు అవుతావు" అని పండితులు* ప్రేమతో ఆహ్వానించారట. ఈయన "ఊహుఁ" అన్నారు. మంచి పనే జరిగింది. ఒప్పుకొని ఉంటే నలుగురిలో నారాయణగా, అవధాని వృషభులే అయ్యేవారు. కాని ఇప్పటి సంక్షుభిత కాలానికి అత్యావశ్యకమయిన తత్త్వసమన్వయామృతం ఆంధ్రావళికి లభించేదా?

నాకు, ఈయన ప్రతిమాటలోను భగవంతుడు తొంగి చూస్తున్నాడా? - అన్నట్టు ఉంటుంది. నేను భగవంతుడిని చూడలేదు. చూడలేను కూడ. ఆయన ఏ రూపంలో వస్తాడో నాకు తెలియదు. సహస్ర సూర్యకాంతితో ప్రత్యక్షమయితే, ఆ కాంతిని సహించే శక్తి ఈ నా భౌతికనయనాలకు లేదు. ఆయన నన్ను పరీక్షించడానికి ఏ కుక్క రూపమో, నక్కరూపమో, బిచ్చగాని రూపమో ధరించి వస్తే; కనుక్కోలేను; నాకా విచక్షణత లేదు. చాలమంది భక్తులు ఈ విధంగా పొరపాటు పడి, తర్వాత పశ్చాత్తాప పడ్డట్టు కథలు విన్నాను. కాని;

---

★ విద్వాన్ శ్రీ సోంపల్లి కృష్ణమూర్తి కవి, శ్రీమదాంధ్ర ఆనందరామాయణ, పుష్పవిలాపాది కావ్యకర్త, నాటి సుప్రసిద్ధఅవధాని; తెలుగుపండితులు, జిల్లా బోర్డు హైస్కూల్ కదిరి. (1944-46).

నేను భగవంతుని చూచాను, ఆయన నాకు చాలసార్లు కనిపించాడు. నా సూఫీ మిత్రుడు షా మహమ్మద్ నమాజ్‌లో భగవంతుని చూచాను; దేశం కోసం ప్రాణాలను పణంగా పెట్టిన స్వచ్ఛందసేవకుల కనులలో చూచాను; పరుల హితమే కోరే పరమ భక్తురాలు అంజన తల్లి ఆరాధన స్తోత్రాలాపాలలో చూచాను; కాళిదాసుపాత్రలను మధురోదాత్తంగా చిత్రించే కొండపల్లి శేషగిరిరావు కుంచె కదలికలో చూచాను; నిగమాంతప్రస్థానసమన్వయైకపరాయణులయిన బాలరాజుగారి వజ్రసంకల్పంలో చూచాను. ఆ సంకల్పదీధితులు, ప్రపంచ ప్రజల బుద్ధులను సత్కర్మాచరణకు ప్రేరేపించే సవితృదేవుని వరేణ్యమయిన భర్గం (తేజస్సు)గా నాకు భాసించింది.

ఈ ధ్వన్యాలోక స్వరూపుడైన భగవంతునిపై జరిగినచిత్రమీమాంసను, సమన్వయ పరచి చంద్రాలోకంగా, ఆనందవర్ధనంగా, కువలయానందంగా ఆంధ్రావళికి అందించడానికి పూనుకున్న బాలరాజుగారి తత్త్వప్రస్థానంలో మరొక పన్నీరు పూలజల్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహానువాదవ్యాఖ్యానాలు.

వసిష్ఠుడు, విశ్వామిత్రుడు ఋగ్వేద కాలఋషులు. కాని, విచిత్రమేమిటంటే, ఋగ్వేదం విశ్వామిత్ర కుమారుడైన 'మాధుచ్ఛందసుని' గాయత్రీచ్ఛందస్సులోని

"అగ్ని మీళే పురోహితం,
యజ్ఞస్య దేవమృత్విజం ।
హోతారం రత్నధాతమమ్ ॥" (ఋ.వే.I-1-1)

అనే ఋక్కుతో ప్రారంభమవుతుంది. మాధుచ్ఛందసుడు తండ్రిని మించిన తనయుడేమో! విశ్వామిత్రుడు తృతీయ మండలంలోగాని కనిపించడు. ఇంకొక విచిత్రం విశ్వామిత్రుడు దర్శించిన –

"తత్సవితుర్వరేణ్యం,
భర్గో దేవస్య ధీమహి ।
ధియో యో నః ప్రచోదయాత్" ॥

అనే గాయత్రీమంత్రం ఋగ్వేదంలో కనిపించదు. విశ్వామిత్రుడు సరస్వతీ, ఈళా, భారతీ, అనే ముగ్గురు దేవతలనే దర్శించాడు.ఇలాగే తండ్రి తాతలను మించిన తనయుడు పరాశరుడు. ఇతడు ఋగ్వేదం ప్రథమ మండలంలోనే సాక్షాత్కరిస్తాడు. చాలసూక్తులలో. మన గురుపరంపర

వ్యాసం వసిష్ఠనప్తారం, శక్తేః పౌత్రమకల్మషమ్ ।
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్ ।

అని కదా – **వసిష్ఠుడు – శక్తి – పరాశరుడు – వ్యాసుడు – శుకుడు.** వసిష్ఠుని మనమ డయిన **పరాశరుడు** అగ్నిని దర్శించిన ప్రథమమండలం – అరవయ్యాయిదో సూక్తం –

**"పశ్వానతాయుం గుహా చతన్తం**
**నమో యుజానం నమో వహన్తమ్,**
**సజోషా ధీరాః పదై రనుగ్మన్నుప**
**త్వా సీదన్ విశ్వే యజత్రాః ।"**

**చోరుడు గోగణంబులను**
**చోద్యముగా హరియించి భీతిచే**
**దూర మహీధ్ర కందరము**
**దూరి తనంతట దాగునట్టుగా**
**నీరములందు దాగి కడు**
**నేర్పున నుండెడు నిన్ను బ్రీతితో**
**ధీరులు దేవతల్ గనిరి**
**దివ్యహవిఃప్రద! పావకోత్తమా!**

**(నేమానివారి అనువాదం)**

అనే ఋక్కుతో ప్రారంభమవుతుంది. **పరాశరుని పితామహుడు వసిష్ఠుడు** సప్తమమండలం ప్రథమసూక్తంలో కనిపించి అగ్నిని దర్శిస్తాడు.

**"అగ్నిం నరో దీధితిభి రరణ్యో ర్హ స్తచ్యుతీ**
**జనయన్త ప్రశస్తమ్,**
**దూరేదృశం గృహపతి మథర్యుమ్ ।"**

ప్రశస్తుడు, దూరదృశ్యమానుడు, గృహపతి, గమనవిశిష్టుడునగు అగ్నిని నేతలు అరణిద్వయము నుండి హస్తాంగుళులతో బుట్టింపగలరు. (నేమానివారి అనువాదం)

ఆ వసిష్ఠుడో వసిష్ఠ వంశ్యుడో రచించిన ఈ యోగవాసిష్ఠం, 32 వేల శ్లోకాల ఉద్గ్రంథమని పెద్దలు చెప్పగా విన్నాను. దానికి ఎన్నో సంగ్రహాలు

ఉన్నాయి. బాలరాజుగారు అనువదించి వ్యాఖ్యానించిన ఈ సంగ్రహం శ్రీ జ్ఞానానంద భారతీస్వాముల వారు, "యోగవాసిష్ఠ సంగ్రహః" అనే పేరున కూర్చినట్టిది. ఈయన 32 వేల శ్లోకాల గ్రంథాన్ని 17 వందల శ్లోకాలకు కుదించారు. సర్గలు ముప్పైరెండు. బాలరాజుగారు మూల యోగవాసిష్ఠానికి శ్రీ మదానంద బోధేంద్ర సరస్వతి రచించిన "యోగవాసిష్ఠమహారామాయణతాత్పర్యప్రకాశః" – అనే వ్యాఖ్యానాన్ని అనుసరించి ఈ సంగ్రహాన్ని అనువదించారు; సరళసుందర గ్రాంథికంలో.

ఈలాటి ఆధ్యాత్మికగ్రంథాల అనువాదం, కేవలం ఉభయభాషా పాండిత్యంతో సాగదు. విషయం, తలస్పర్శిగా తెలిసి ఉండాలి. ఈ అనువాద ప్రామాణికతకు, అనువాదకుల జ్ఞానవైశద్యానికి, ప్రతి పుట అడుగడుగున సజాతీయ విజాతీయగ్రంథాల నుంచి చూపిన అధస్సూచికలు, వివరణలు సాక్షులు. ఏ మహాకార్యనిర్వాహణానికైనా, భగవత్సాహాయ్యం అవసరమని నా విశ్వాసం. భగవంతుడు తాను కోరిన వారికి, తానే తన స్వరూపం వివరిస్తాడని శ్రుతి. అలాగే ఈ అనువాద మహాయజ్ఞమూ భగవత్ప్రేరణతో, భగవదనుగ్రహంతో సంపన్నమయిందని నా విశ్వాసం.

యోగవాసిష్ఠంలోని విషయం, పాత్రలు, ప్రాచీనమయినా, రచన, తదనంతర కాలీనమేమోనని నా సందేహం. భగవద్గీతలో మొదట అర్జునవిషాదం, కృష్ణుడు నచ్చజెప్పడంలాగే దీనిలో రామనిర్వేదం, వసిష్ఠోపదేశం మొదలయిన పోలికలను బట్టి, రచన భగవద్గీతానంతరమేమో ననుకుంటాను. కాని, జ్ఞానం దేశకాలానవచ్ఛిన్నమని బాలరాజుగారు నాతో అన్నారు గనుక నేను వాదించను.

మరి, ఇది ఇప్పటికేవిధంగా ఉపకరిస్తుంది అని సామాన్యుడు వేసే ప్రశ్న. భగవద్గీత సామాన్యలోక వ్యవహారానికి కూడ ఉపయోగించి, మానవుడు సుఖంగా జీవించడానికి, ఇరుగుపొరుగులతో సక్రమంగా వ్యవహరించడానికి, మనస్సు, బుద్ధి వికసించి ఉన్నతిని సంపాదించడానికి తోడ్పడినట్టే ఈ యోగవాసిష్ఠసంగ్రహమూను. పాలకులే కాక సామాన్య ప్రజలు కూడ మనఃపరిపాకం పొందడానికి ఆధ్యాత్మిక చింతనం అవసరమని మన్వాదిస్మృతికారులూ, కౌటిల్యాదిరాజనీతిజ్ఞులూ, అన్నారు. దీనిలో రాముడు కేవలం ప్రజల ప్రతినిధి. కనుక, ప్రజాసామాన్యం ప్రశాంత

జీవితం గడపటానికి ఇది ఎంతో సహాయం కాగలదని నా విశ్వాసం.

మిత్రులు బాలరాజుగారి సమ్యక్సంకల్పాన్ని, సమ్యక్కృషిని, తత్ఫలమైన ఈ సమ్యక్కృతిని అభినందిస్తూ, ఆయన ఇష్టదైవమైన రాముడు, ఆయనతో ఇంకా ఎన్నో గొప్ప గ్రంథాలు రచించడానికి, అనువదించడానికి, వేదోక్తమైన ఆయుస్సును, శక్తిని, ఆరోగ్యాన్ని, ప్రసాదించుగాక అని అభ్యర్థిస్తున్నాను.

దేవకీనందనుడైన కృష్ణుడు వందవ ఏట తన అపవరకంలో ఏదో పని చేసుకుంటూ తలెత్తి చూచాడట. ఒక మూలలో నల్లని ఆకారం కనిపించిందట. ఎవరు నీవు? - అని ప్రశ్నించాడట కృష్ణుడు. నేను మృత్యువును. యముని ఆనతితో నిన్ను తొడ్కొని పోవడానికి వచ్చాను - అన్నదట ఆ ఆకారం. నాకిప్పుడు చాల పని ఉంది. ఇప్పుడు రాలేను. నా పని పూర్తికాగానే, నేనే పిలుస్తాను. వెళ్లు - అన్నాడట కృష్ణుడు. ఆ ఆకారం తటపటాయించి చేతులు నలుపుకుంటూ నిలబడి, యముని ఆజ్ఞ ఎట్లా మీరడమన్నట్టు చూచిందట. కృష్ణుడు అది గ్రహించి, నేను అట్లా అన్నానని యమునితో చెప్పు. వెళ్లు - అని అంటూ తన పనిలో నిమగ్నుడయ్యాడట. తర్వాత ఎనిమిదేళ్లకు కృష్ణుడు ఓ మృత్యో! నా పని పూర్తయింది. వచ్చి దారి చూపు. వెంట వస్తాను - అని ఆహ్వానించాడట. ఇది ఉపనిషద్గాథ. మిత్రులు బాలరాజుగారు దేవకీనందన కృష్ణునిలాగ అష్టోత్తరశతసంవత్సరాలు ఆరోగ్యంతో జీవించి మృత్యువును శాసిస్తారని నమ్మినాను.

భాషా సేవకుడు

ఈశ్వర శ్రావణ పూర్ణిమ
18-8-'97
హైదరాబాద్ - 80

**డా॥ తిరుమల రామచంద్ర**
స్వాతంత్ర్య సమరయోధుడు
రచయిత

**DR. MEDASANI MOHAN,**
M.A., Ph.D.,
DIRECTOR
Annamacharya Project
Tirumala Tirupati Devasthanams



Office: 22105
Resi. : 22278
TIRUPATI - 517 502 (A.P.)

DATE: 6-8-97

# కైమోడ్పు

డా॥ శ్రీ రత్నాకరంబాలరాజుగారు సుగృహీతనామధేయులు. యోగపురుషులు, భారతీయ వేదాంతక్షీరసాగరమును మథించి, **అనర్ఘరత్నము లెన్నింటినో వెలికి దీసి లోకమున కందించిన తత్త్వవేత్తలు.**

ప్రస్తుతము వీరు వెలువరించిన "శ్రీ యోగవాసిష్ఠసంగ్రహఅనువాదము, **పరమార్థదీపనీవ్యాఖ్యాసంవలితము", వేదాంతవాఙ్మయజగత్తున ఒక అపూర్వసృష్టి** – గహనాతిగహనమైన అధ్యాత్మ భావములను ప్రసన్న గంభీర సారళ్య బంధురమైన శైలీ విన్యాసముతో సుగమము చేసిన వీరి నేర్పు "**యోగః కర్మసు కౌశలమ్**" అను భగవానుని వాక్కును పదే పదే తలపింపఁ జేయుచున్నది. శ్రీయోగవాసిష్ఠ సంగ్రహమున ఆయా సందర్భములందు సంవదించుకొనదగిన, అనుసంధించుకొనదగిన, ఎన్నియో ఇతర గ్రంథముల నుండి కూడ, తాత్త్వికాంశములను వీరు సంగ్రథనము చేసి యున్నారు. ఈ సంగ్రథనము లన్నియు పరిశీలించినచో **ఈ వ్యాఖ్య, భారతీయవేదాంతమునకు ఒక ఆకరగ్రంథము అని చెప్పక తప్పదు.**

భారతదేశమున అనాదిగా **గురుశిష్యసంప్రదాయము** విలసిల్లినది. **ఆ పవిత్ర సంప్రదాయము యొక్క సంప్రయోగమే మన వేదాదిసమస్తవాఙ్మయము.** ఆ వాఙ్మయము యొక్క విరాట్స్వరూపమును సందర్శింపవలెనన్నచో, ఈ **"యోగవాసిష్ఠ సంగ్రహ పరమార్థ దీపనీవ్యాఖ్య"**ను త్రికరణశుద్ధిగా ఒకసారి అధ్యయనము చేయవలెను. ఎందులకనగా, శ్రీమద్భగవద్గీత, **భాగవతము, ఉపనిషత్తులు, శంకర భగవత్పాదులు, మరియు అనేకాచార్యపురుషుల గ్రంథముల నుండి వీరు అందందు నుదహరించి యున్న అంశములు – నాకు ఆశ్చర్యానందములు కల్గించినవి.**

నవమ సర్గమున, **"జీవావిర్భావము"** అను అధ్యాయమున గురువు, శిష్యుని ఏ విధముగా తన జ్ఞానదీప్తిచే ప్రభావితుని చేయగల్గునో వివరింపబడినది. **అవిద్యను, అవిద్యతోనే** నశింపఁజేయగలిగిన శక్తి ఎట్లు లభించునో వివరించుచు

**"చౌటి మట్టితో వస్త్ర మాలిన్యమును నశింపఁజేయుట"** వంటి సాధర్మ్యమును తెలుపుటచే, సామాన్యులకు గూడ ఇందలి అంతరార్థము గాని, పరమార్థము గాని సుబోధమగుటకు దోహదము చేసినది. **ఈనాఁడు భారతదేశమున పరిస్థితులు** బాగుగా లేవు. **హింస, క్రౌర్యము – వంటి తామస ప్రవృత్తులు విలయతాండవము చేయుచున్నవి. అహింస, ఆర్ద్రత వంటి సాత్త్విక ప్రవృత్తులు** నానాటికి మృగ్యము అగుచున్నవి. **దీనికి పరిష్కారమేమి? "ఏమిటంబొడము నాత్మకు శాంతి"** – అని తర్కించినచో, ఈ యధ్యాయము నందలి ప్రతిపాదితాంశమును క్షుణ్ణముగా అధ్యయనం చేసి, ఆచరించిన చాలును. మానవకోటికి పుష్కలముగా **సుఖశాంతులు** లభింపగలవు.

పంచదశసర్గము నందు, **ఉద్దాలకోపాఖ్యానమును** చదువుచుండగా, **ధ్యానధారణసమాధియోగములను** అభ్యాసము చేయుటలో హృదయమును ఏ రీతిగా సముద్యమింపఁజేయవలయునో నాకు బోధపడినది. అందందు వీరి వివరణాత్మకమైన విశ్లేషణ, నాలో కొంగ్రొత్త ఆలోచనాద్వారములను తెరచి నట్లైనది.

ఇది మూలగ్రంథమునకు సంగ్రహమైనను, మూలము నందలి **ఆఖ్యానములన్నియు** నిందు కలవు. **వసిష్ఠుని బ్రహ్మవిద్యాసిద్ధాంతములు, దార్శనికాంశములు – ఏవియు లుప్తము కాలేదు. వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి, స్థితి, ఉపశమన, నిర్వాణము లను ఆఱు ప్రకరణములందలి ఏ అంశము యొక్క విస్తృతికి లోపము జరుగలేదు.**

ఈ మహత్తరగ్రంథము చదివి, నన్ను పరిచయ వాక్యములు వ్రాయవలసినదిగా శ్రీ బాలరాజుగారు కోరినారు. నా యెడ వారికి గల వాత్సల్య విశేషమే ఇందులకు కారణము. వారిని లోకమునకు పరిచయము చేయనవసరము ప్రస్తుతము లేదు. వారి కీర్తిపరిమళములు ఇప్పటికే నలుదెసల వ్యాపించి యున్నవి.

**వాగ్దేవి వీరి వాఙ్మయ తపస్సుచే పులకితగాత్రయైనది. ఆ పలుకుఁదల్లి మఱింత ప్రసన్నయై లోకములను రక్షించుగాత!**

**నిత్యోత్సవమూర్తి శ్రీవేంకటేశ్వరస్వామి** వీరికి ఆయురారోగ్య – ఐశ్వర్యములను నిరంతరము ప్రసాదింపవలయునని ఆకాంక్షించుచున్నాను.

**తిరుపతి** మేడసాని మోహన్

**6–08–1997** **అవధాన చక్రవర్తి, సహస్రావధాని.**



ఓం నమః పరమాత్మనే ।

# ప్రస్తావన

ఓం—సత్యం, జ్ఞాన, మనన్త, మేక, మమరం, నిత్యం, ప్రభుం, శాశ్వతం,
ప్రత్యగ్బ్రహ్మరసాయనం, సుఖఘనం, పూర్ణం, పరం, పావనమ్ ।
స్వాత్మజ్యోతి, రనాదిమధ్యరహితం, మాయావిలాసై ర్మహా
ర్విశ్వాకార, మపాస్తమాయ, మభయం, వన్దే విశుద్ధం పదమ్ ।

విద్యా వేదతదఙ్గశాస్త్రముఖరా, స్సర్వా య ఈష్టే స్వయం,
బ్రహ్మాఽఽదీని తృణాఽవధీని నిఖిలా నీష్టే చ భూతాని యః ।
వేదస్యాఽధిపతిశ్చ వేదజఠరస్యాఽయం పురాణః పుమాన్,
బ్రహ్మాఽఽత్మా స శివోఽస్తు మే కరుణయా జ్ఞానప్రదో మాధవః ॥

ఇదం కవిభ్యః పూర్వేభ్యో, నమోవాకం ప్రశాస్మహే ।
వన్దేమహి చ తాం వాణీ మమృతా మాత్మనః కళామ్ ।
"యైరిమే గురుభిః పూర్వం, పదవాక్య ప్రమాణతః ।
వ్యాఖ్యాతాః సర్వవేదాన్తా, స్తాన్నిత్యం ప్రణతోఽస్మ్యహమ్ ।"★

(శంకరుడు—తై.ఉ.భాష్యము)

★ సత్యజ్ఞాన స్వరూపము, అద్వయము నయ్యును, మాయావిలాసమున విశ్వాకారమున దోచుచున్న, అభయము, విశుద్ధపదము నగు పరమాత్మకు నమస్కరించుచున్నాము.
వేదవేదాంగ తర్కాది శాస్త్ర ప్రముఖ సర్వవిద్యలను స్వయముగ నియమించువాడు, బ్రహ్మాది తృణ పర్యంత నిఖిల ప్రాణికోటికి పరిపాలకుడు, వేదములకు, బ్రహ్మకు, అధిపతి, బ్రహ్మాఽభిన్న ఆత్మ, శివుడు, మా(యా)ధవుడు నగు పురాణపురుషుడు నాకు జ్ఞానప్రదుడు, శాంతుడు నగుగాక!

పూర్వకాలప్రసిద్ధప్రాచేతసాదికవివిషయకనమోవాకరూపమగు మంగళమును ఆకాంక్షించు చున్నాము. పరమాత్మకళ (విభూతి)యు, అమృతస్వరూపయు నగు భారతికి ప్రణమిల్లుచున్నాము.

పూర్వము, పదములు, వాక్యములు, అనుమానాది ప్రమాణములు, వివేచించి, సర్వవేదాంత శాస్త్రములను వ్యాఖ్యానించిన పరమగురువులకు ప్రణామములు.

నిర్ణయ సాగర ముద్రణము(1918-బొంబాయి), **యోగవాసిష్ఠమునందు**, ఆముద్రణాలయాధికారులు, తమ పండితులగు శ్రీ పణశీకరోపనామధేయులు – శ్రీ వాసుదేవ శర్మగారిచే సంస్కృతమున వ్రాయించి చేర్చిన "ప్రాస్తావికము" నందలి గ్రంథప్రశస్తిని గూర్చిన కొంత భాగమును, ఈ గ్రంథమును చదువు వారి యుపయోగార్థము తెనిగించి, ఇందు చేర్చినాము. ,నా యభిప్రాయములను తరువాత తెలుపుదును.

**మహామోహాంధకారనిమగ్నమైన జగత్తునకు శాస్త్ర సూర్యోదయము –**

"ఈ జగత్తును **అనాది మహామోహ మను రాత్రి** యందునిద్రించుదానిగను, నిరంతర దుఃస్వప్నభ్రమ పరంపరాకల్పితమును, జన్మ, జరా, ఆమయ (వ్యాధి), మరణ, హర్షా, ఽమర్ష, శోకాది అనర్థసంకట శతసంకులమును, గ్రహాఽతి[1]గ్రహ **వ్యాఘ్రభీషణమును**,ఆధ్యాత్మిక, ఆధి భౌతిక, ఆధి దైవిక, **తాపత్రయ** దావానల జ్వాలామాలాకులమును, **షడూర్మి**[2]జాలమును, కామాది **అరిషడ్వర్గ**కిరాత బధ్యమాన ప్రాణి జాతము నగు సంసారమహారణ్యము నందు, **సమ్మోహితమును**, **వివేకాంధమును**, ప్రబోధోపాయము దుర్లభమగుట వలన, **విషాద గ్రస్తమును**, నైన దానిగను గాంచి, **మోక్షశాస్త్ర** మనెడి **సూర్యోదయము**[3]చేత, అట్టి యా

---

(1) గ్రహాఽతిగ్రహములు :– ప్రాణము (ఘ్రాణము), వాక్కు, జిహ్వ, చక్షువు, శ్రోత్రము, మనస్సు, హస్తము, త్వక్కు, (పంచజ్ఞానేంద్రియములు, మనస్సు, హస్తము, వాక్కు) అనునవి యెనిమిది (8) గ్రహములు. వీనికి క్రమముగ విషయములైన గంధము, నామము (భాషణము), రసము (ఆస్వాదనము), రూపము (దర్శనము) శబ్దము, కామము, కర్మము, స్పర్శ – అను నెనిమిది (8)యు, **అతిగ్రహములు. గ్రహము (మొసలి) మనుజుని మ్రింగునట్లు, అతిగ్రహములగు గంధాది విషయములు, గ్రహములైన ప్రాణాది ఇంద్రియములను గ్రసించుచున్నవి.**
ఇట్లు, గ్రహాఽతిగ్రహరూపమైన సంసారము, వ్యాఘ్రము వలె అతిభయంకరము. ఇంద్రియములు అజ్ఞానులను గ్రసించుచున్నవి. గ్రహాఽతిగ్రహరూపమైన సంసారరూపమృత్యువును వశింపజేయుటే **మోక్షము.**

(చూడు :- బృ.ఉ. III-2-బ్రాహ్మణము)
మఱియు, **అమృతానుభవము** – డా॥ రత్నాకరం బాలరాజు–1962)

**(2)** షడూర్మలు:- ఆకలిదప్పులు, జరామరణములు, శోకమోహములను ఆఱు ఊర్మలు (తరంగములు)

**(3)** పోల్చు :- "ఇద మన్ధతమః కృత్స్నం, జాయేత భువనత్రయం।
యది శబ్దాఽఽహ్వయం జ్యోతి, రాసంసారం న దీప్యతే।"
శబ్దము (ఆప్తవాక్యము-వేదము) అనెడి జ్యోతి సంసార పర్యంతము ప్రకాశింపక యేయున్నచో, ఈ భువనత్రయ మంతయు, అంధతమోమయమై (గాఢాంధకారమై) యుండెడిది. కాన, శాస్త్రము లోకమునకు వెలు గనుట నిరూఢము. మఱియు శాస్త్రము మనుజునకు అధిక లోచన మనియు వర్ణింపబడినది. ఇది, కామ(స్వేచ్ఛా) ప్రవృత్తిని నివారించి, మానవుని, సత్పథవర్తునిని చేయుచున్నది.

జగత్తును, ప్రబోధించు నిమిత్తము, భగవంతుడగు బ్రహ్మచే నియుక్తుడై పరమకారుణికుడైన వాల్మీకి మహర్షి శ్రీరామచంద్రుని వివిధ విచిత్ర పవిత్ర చరిత్ర పూర్ణమగు సప్తకాండాత్మకము శ్రీమద్రామాయణమును రచించి, ఆత్మాऽనాత్మ వివేచన పూర్వకముగ ఆత్మ సాక్షాత్కార గర్భమగు ఈ యోగవాసిష్ఠ మహారామాయణ మను మోక్షోపాయసంహితను బాలకాండముగ నావిష్కరించెను. *" – (ప్రాస్తావికము).

ఈ గ్రంథ వైశిష్ట్యమును దర్శనమును గూర్చి విషయప్రవేశమున విపుల విశదముగ వివరింతును.

## ప్రాక్తనవాసనా (పుణ్యసంస్కార) ప్రభావము

మానవుని చిత్తము, అనేక జన్మార్జిత కర్మ వాసనా (సంస్కార) మయమని శాస్త్రములు నిర్దేశించును. ఏ జన్మాంతరానుబంధమో, నాకు, యోగవాసిష్ఠముతో పరిచయము, నా బాల్యదశలోనే (1942-43) కల్గినది.

**1942 ఆగస్టు** – స్వాతంత్ర్యసమరము ఉద్ధృతముగ జరుగుచున్న దినములవి. విద్యాలయములన్నియు మూసివేయబడినవి. నేను, **హిందూపురమున** నా **'ఎడ్వర్డు కార్నేషన్ మ్యునిసిపల్ (E.C.M.) హైస్కూలు'** నందు, V ఫారం (నేటి 10వ తరగతి) చదువుచు విద్యను విరమింపవలసి వచ్చినది. ఈ విద్యావిరమణ కాలముననే **'వాసిష్ఠ రామాయణము'** – అను ద్విపదకావ్యము నా చేతికి వచ్చినది. **మహాయోగినియైన తరిగొండ వెంగమాంబ** (1856) కృతి యది. (వావిళ్ల ప్రతి-1925); యోగవాసిష్ఠమునకు అత్యంతసంక్షేపరూపము. జననాంతర సౌహృదవశముననే, నేనా గ్రంథమును పలుమాఱు పఠించితిని.

---

"న కామ ప్రసభాऽవరోధినీమ్ ।
బభార శాస్త్రాణి దృశం ద్వయాధికామ్
నిజత్రినేత్రాऽవతరత్వ బోధికామ్ ।" (హర్షుడు – నైషధకావ్యము I-6)

శాస్త్రమనెడి అధిక (మూడవ) లోచనము, మానవుని యందలి శివ (పరమేశ్వర) త్వమునకు వ్యంజకము (గుర్తు). కావ, శ్రేయస్కామునకు వచ్చాస్త్రాऽధ్యయనము విధాయకము.

★ శ్రీరాముని బాల్య జీవితమునకు సంబంధించిన దగుటచే, ఇది బాలకాండమని యోగవాసిష్ఠమున పేర్కొనబడినది. "ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే, దేవదూతోక్తే, మోక్షోపాయేషు, నిర్వాణప్రకరణే ఉత్తరార్థే, బాలకాణ్డే, ద్వాత్రింశత్ సాహస్ర్యాం సంహితాయాం (32000) షోడశాధిక ద్విశత తమః సర్గః" (216)" ।

**శాస్త్రములు జ్ఞానజ్యోతులు, చిత్తశాంతిప్రదములు, మార్గ ప్రకాశకములు**

ఆ పుణ్య సంస్కార ప్రభావముననే కాబోలు, బాల్యము నుండి శ్రీవాల్మీకి, రామాయణ, భాగవత, భారత, గీతా, అధ్యాత్మరామాయణ, శ్రీ సీతా రామాంజనేయ సంవాద, బుద్ధ చరిత, ధమ్మ పదాది మోక్షశాస్త్రములతో పాటు, **యోగవాసిష్ఠము. నా హృదయమందిరమున నిశ్చలతత్త్వజ్ఞానదీపమై వెలసి స్థిరపడినది.**

ఇవియే, ఆనాడు దుర్బలచిత్తుడు, అత్యంతకృశగాత్రుడునైన నాకు **పరమేశ్వర భక్తిని, ఆత్మవిశ్వాసమును,** పురుషకారమును, ధైర్యమును, ప్రసాదించి జీవితపథమును ప్రకాశిత మొనర్చినవి. భాషాసంస్కృతుల యందు సైతము, అవి, నాకు ఆచార్యస్థానము నధిష్ఠించినవి.

**"ప్రజ్ఞావివేకం లభతే, విభిన్నైరాగమదర్శనైః,**
**కియద్వా శక్య మున్నేతుం, స్వయత్న మనుధావతా? ।**
**తత్తదుత్ప్రేక్షమాణానాం, పురాణై రాగమైర్వినా,**
**అనుపాసితవృద్ధానాం, విద్యా నాఽతి ప్రసీదతి"**

(భర్తృహరి – వాక్యపదీయము)

జ్ఞాన సిద్ధులగు మహాత్ములే (బుద్ధులే) నిజమైన మానవులు. అట్టి వారి అనుగ్రహము లేకున్న, మనకేదియు సిద్ధింపదు. మన కున్న సద్భావ జాతమంతయు, వారి ఉపకారఫలమే. మనవంటి వారి మానసక్షేత్రములందు, అది యాదృచ్ఛికము గ నుద్భవించి యుండెడిది కాదు. మహాత్మ లనుగ్రహించిన జ్ఞానబీజములను హృదయక్షేత్రమున రోపణమొనర్చిన, (నాటిన)చో, అవి అంకురించి, వృద్ధి పొంది, జ్ఞానఫలాభ్యున్నతిని కల్గించును. విభిన్నాగమములు, దర్శనములు, అభ్యసించుటచే, ప్రజ్ఞ (బుద్ధి), వివేకసంపన్నమగును. స్వప్రయత్నమున మానవు డెంత వఱకు జ్ఞానోపలబ్ధిని గాంచగలడు? **పురాణాగమముల నభ్యసింపని వారికి, జ్ఞానవృద్ధులగు మహాత్ముల నుపాసింపని వారికి, విద్య, ప్రసన్నము కాదు. ప్రాక్తన పుణ్యసంస్కారాభివ్యక్తికి సైతము, శాస్త్ర సజ్జనసంపర్కము అంత్యంతావశ్యకము. గురువుల, విద్వాంసుల వంశపరంపర యొక్క చర్య, పూర్వయుగము లందును,** సుదూరదేశములందును, జీవించిన మహోన్నతమనీషావంతుల జ్ఞానమును, సూక్ష్మబుద్ధిప్రావీణ్యమును, **మన కొఱకు భద్రపఱచి యున్నది.**

## శుభసంకల్పాంకురోదయము

యోగవాసిష్ఠదర్శనమును వివరించుచు, నొక గ్రంథమును (దుస్సాధమైనను) స్వాంతఃసుఖమునకై వ్రాయవలయునను శుభేచ్ఛా సంకల్పము - నా యం దానాడే ఈశ్వరానుగ్రహమున అంకురించినది. **'The Economy of Human Life'** – అను జీవితపథనిర్దేశకమగు నొక అద్భుతగ్రంథము నైతము **(Benaras Hindu University, Benares–1922)** నాకు 24/2/51సం॥ న, 0-8-0 అణాలకు లభించినది. దానిని అనువదించుటకు కూడ ఆనాడే ప్రయత్నించితిని.

## గతకాలస్మృతులతో ఏకాంతసమావేశము

ఏతద్గతకాలసందర్భస్మృతులను నేడు చింతనా మధురములగు ఏకాంత సమావేశములకు ఆహ్వానించి, సమీక్షింపగా, 'శ్రీ రామానందలహరీ బ్రహ్మసూత్రాది గ్రంథరచన మొదలు, నేటి యీ 'యోగవాసిష్ఠసంగ్రహానువాదవ్యాఖ్యా,' 'మానవజీవితసంవిధానదర్శన' (Economy of Human Life) రచనా నిరంతరవ్యాసంగము వెనుక, పరమకారుణికమగు పరమేశ్వరసంకల్పము క్రియాత్మకమై యున్నదను నా ప్రగాఢవిశ్వాసము సత్యమైనది.

ఆ దివ్య సంకల్పమే లేకున్న, లక్షాధిక ధనవ్యయముతో 'ధమ్మపద' 'బుద్ధ దర్శనము'లతో పాటు, ఈ గ్రంథ ముద్రణ ప్రకాశనములు అకించనుడనైన నాకు అసంభవము. వీనికి గల కారణకార్యసంబంధము క్రమముగా విశదమగుచు, విస్మయమును గొల్పుచున్నది.

అనంతపురం ప్రభుత్వ కళాశాలలో (Govt. Arts College, Anantapur) 'తెలుగు ట్యూటర్ (Tutor in Telugu) గా నున్నపుడు ఒకనాటి రాత్రి (23/3/55) నా భావాంబరవీథి నీ క్రింది పద్యము అలవోకగా స్ఫురించినది.

"తల్లీ! శారద! వ్రాయ బూనితిని నే తత్త్వార్థముల్ నీవు నా
యుల్లంబందున వెల్గ జేయుము మనీషోత్సాహదీపంబు, రం
జిల్లం సత్పురుషాళి, వాల్మికము వాసిష్ఠాఖ్యకావ్యార్థము
న్నుల్లేఖింతు విశుద్ధవాసనరతిం యోగంబు పూర్ణంబుగాన్"

## అధ్యయనయోగము

తరువాత, నేను, మడికిసింగనార్యకృతమైన వాసిష్ఠరామాయణమును (1375-1480 - ఇది, యోగవాసిష్ఠమునకు ప్రథమ పద్యానువాదము.) బ్ర. శ్రీ. **పండిత పురాణం సూర్యనారాయణతీర్థుల శ్రీ యోగవాసిష్ఠము** (వచనము-రెండుసంపుటములు - 1935-37)ను, బ్ర. శ్రీ. వెన్నెలకంటిసుందర రామశర్మ కృత వచన **జ్ఞాన వాసిష్ఠమును,** (వావిళ్లప్రతి) అధ్యయన మొనర్చితిని. బ్ర. శ్రీ. **పండిత పురాణం సూర్యనారాయణ తీర్థుల వారిదే యోగవాసిష్ఠమునకు తెలుగున ప్రథమానువాదము (వచనము)**

(1) Yoga Vasishtha and Its Philosophy (III Edition – Darsana Printers - Moradabad 1966)

(2) Yoga Vasishtha & Modern Thought (or Agreement of the East and the West on Fundamental Problems) –

(The Indian Book Shop – Banaras 1954) అను రెండు ఆంగ్ల గ్రంథములను చదువుట తటస్థించినది. **వారణాసీ హిందూ విశ్వ విద్యాలయమున భూత పూర్వ తత్త్వశాస్త్రాధ్యాపకులు, ఆచార్య ఆత్రేయగారు.** (Retd. Professor and Head of the Department of Philosophy, Psychology and Indian Philosophy & Religion - Benaras Hindu University, Benaras) **ఈ రెండు గ్రంథములను రచించిరి.**

తరువాత, నిర్ణయసాగరముద్రణము - (బొంబాయి - 1918) - యోగవాసిష్ఠము - **శ్రీ మదానందబోధేంద్రసరస్వతీకృత శ్రీ యోగవాసిష్ఠ మహారామాయణ తాత్పర్య ప్రకాశాఖ్యా వ్యాఖ్యాసహితము – రెండు సంపుటములు చదువుట సిద్ధించినది.**

తెలుగువారికి సమగ్రముగ యోగవాసిష్ఠమును ప్రసాదింపవలెనన్న **అనుగ్రహదృష్టితో,** ఈ గ్రంథము ననువదింపజేసి, **పరమపూజనీయులు మహర్షి శ్రీ మలయాళస్వాముల వారు** (వ్యాసాశ్రమము, ఏర్పేడు) ప్రకటించిన నాల్గు బృహత్సంపుటములను అనుశీలించితిని.

ఈ గ్రంథాధ్యయనము వలన నాలో యోగవాసిష్ఠముపై శ్రద్ధాభక్తులు

వికసించినవి. ఆనాటి పుణ్యసంకల్పాంకురము కాలక్రమమున పల్లవించి, పుష్పించి, నేటికి ఈశ్వరానుగ్రహమున ఫలించినది.

బొంబాయి (ముంబై) నగరవాసులు, నెనెపుడును చూడని, వినని, యెఱుగని **అజ్ఞాతసఖులు** LT.Col.K.R.మూర్తి (శ్రీ కందికుప్ప రమణమూర్తి)గారు, శ్రీయోగవాసిష్ఠసంగ్రహమును [The Essence of Yogavasishtha - Compiled by Sri Jnanananda Bharati - Translated by SAMVID (English) - Samata Books, Madras] నాకు పంపి, ఆంధ్రీకరింపగోరుట ఈశ్వరకృపావిలాసము కాక, మఱేమగును? శ్రీ కె. రమణమూర్తిగారే నా **ధమ్మపద (1994) బుద్ధదర్శనము** (1995)లకు, ముద్రణ ప్రకాశన సౌభాగ్యమును కల్పించిన సుకృతాత్ములు.

> **"పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః,**
> **సంపదో విపద ఏవ విమృష్టాః ।**
> **పాత్రపాణికమలార్పణ మాసాం,**
> **తాసు శాన్తికవిధి ర్విధిదృష్టః ।"** (శ్రీహర్ష నైషధ కావ్యము-V-17)

పూర్వజన్మార్జితపుణ్యవిభవము వ్యయమగుటచేతనే, సంపదలు కలుగుచున్నవి. విచారింపగా, పురాకృతసుకృతనాశకము అగుటచే, ఆ **సంపదలు, వాస్తవమున ఆపదలే.** విద్యావంశతపోవృత్తసంపన్నుల పాణికమలము అందు సమర్పితమై, **జగన్మంగళకరమైన సద్విద్యావ్యాప్తికి ఉపయుక్తమగు దానమే,** ఈ విపత్తులకు, శాస్త్రదృష్టమగు **శాంతికర్మానుష్ఠానము. సంపదల కిట్టి దానమే రక్షకము.**

## ప్రస్తుతభారతావని యొక్క శిథిలస్వరూపము.

నేడు భారతావనియందు జనసామాన్యమున అనేకరోగములు, మనస్తాపములు, వ్యాపించియున్నవి. అనేకవిధములైన అశాంతిజ్వాలలు, జనసమూహముల తపింపజేయుచు, వ్యాపించి, కోలాహల మొనర్చుచున్నవి. ఆసురీప్రకృతి విజృంభించుచున్నది. దేశమునకు స్వాతంత్ర్యము సిద్ధించి అర్ధశతాబ్దము దాటుచున్నను, జనసామాన్యమునకు అవిద్యా దారిద్ర్య పీడలు ఉపశమించు జాడ కన్పించుటలేదు. **పుణ్యసంస్కారహీనులైన స్వార్థపరుల,**

**మరుగుజ్జుల వంటి వారి దుష్పరిపాలనము వలన, ప్రజల ధనమానప్రాణములకు భద్రత, శూన్యమై, సర్వత్ర, భయము తాండవించుచున్నది.***

సామాజికములైన మాతాపితృపుత్ర భార్యాభర్తృసోదరీసోదర సంబంధములు, మానవప్రేమానురాగములు, ఇంకిపోయినవి. - **నేటి మానుష్యానుబంధములలోని అస్థిరత్వము, అనిశ్చితత్వము, నాకు ప్రగాఢ సంతాపము ( దుఃఖము)ను కల్గించు చున్నవి.**

స్వార్థలాభపరాయణులు, జడభౌతికవాదులు, కుహనాలౌకికవాదులు, పశుబుద్ధులు, మాతా పితృద్వేషులు, స్త్రీ దేవులు( స్త్రీ లంపటులు) కామకింకరులు - వీరి సంతతి దినదినప్రవర్ధమాన మగుచున్నది. **పురాతనఆధ్యాత్మిక సంస్కృతిపరంపర యను ఇష్టదేవతను,** హృదయపీఠము నుండి తొలగించి పారవైచి, ఆస్థానమున భౌతికవాదము, క్షుద్ర రాజకీయములు అను పాశ్చాత్య పిశాచమును ప్రతిష్ఠించుకొన్నారు. **ధర్మభూమి, ఆర్యభూమి, పుణ్యభూమియునైన, పవిత్రభారతిని నేడు, భౌతికవాదభావనాతరంగములు ముంచివేయుచున్నవి.** స్వార్థమును పరమార్థముగా గ్రహించి, దాని సమర్థించుకొనుటకు ప్రాకులాడు దుష్ట ప్రవృత్తి సమాజమును కలుషిత మొనర్చుచున్నది.

**మహిళల స్థితిగతులు** దుర్భరముగా నున్నవి. వారికి రక్షణ ఏ మాత్రము లేదని,వారిపట్ల నేడు, ప్రతిదినము జరుగుచున్న **బీభత్ససంఘటనలు,** చాటుచున్నవి. న్యాయస్థానములు వారికి న్యాయమును ప్రసాదించుట యందు విఫలమైనవి. వరశుల్క( కట్నము)పీడలు, నిరక్షరాస్యత, దారిద్ర్యము, సద్విద్యాశూన్యత, వంచనా

---

★ పోల్చు:- Why should we. in the compass of a pale,
Keep law and form and due proportion,
Showing, as in a model, our firm estate,
When our Sea-walled garden, the whole land,
Is full of Weeds: her fairest flowers Chok'd up,
Her fruit trees all unprun'd, her edges ruin'd,
Her knots disorder'd and her wholesome herbs
Swarming with Catterpillars?"—
(William Shakespeare– King Richard II –Act III–Scene IV)

అని, షేక్స్పియర్ మహాకవి తన రిచ్చర్డు II నాటకమున దుఃఖోద్వేగమున నభివర్ణించిన ఇంగ్లండు దేశ దురవస్థను - శిథిల స్వరూపమును - నేటి మన భారతదేశము విషాదకరముగ తలపించుచున్నది.

స్వభావులైన పురుషుల నిర్దాక్షిణ్యప్రవర్తన - వీని వలన ఎందరో బాలికలు, అవివాహితలై, కన్యకలు గానే మిగిలిపోవుచున్న విషాదదృశ్యములు తఱుచుగ కాన్పించుచున్నవి. పురుషుల దౌష్ట్యము, ధనాశ, కామాతురత్వము, స్వైరవిహారము, వారిని దుఃఖమయపరిస్థితులలోనికి నెట్టి, వారిని న్యాయార్థము, భరణార్థము, న్యాయస్థానముల నాశ్రయింప జేయుచున్నది.

"అన్యకాంతల తల్లుల యట్లుగాగ,
కాంచజాలిన మానవగౌరవంబు,
ఖండఖండాంతరంబుల నెందులేదు
పరమపావనభారతధరణి దక్క॥"

అన్న మహాకవి యొక్క అలనాటి సూక్తి ఈనాడు అర్థరహితమైనది. ఆ మానవ గౌరవము (Human dignity) నేడు అస్తమించినది.

అట్టడుగు వర్గములందలి మహిళలు విద్యాగంధశూన్యలై రాత్రింబవళ్లు కాయకష్టము చేయుచు, నికృష్టమై వెలుగులేని దుర్భరతమోమయ జీవితము కడుపుచున్నారు. బాలబాలికలకు ప్రాథమికవిద్య బహుదూరము. బాల కార్మికుల దురవస్థ దుఃఖావహము. అలనాటి రామమోహనులు, విద్యాసాగరులు, దయానందులు, పరమహంసలు, వివేకానందులు, రామతీర్థులు, లోకమాన్యులు, మహాత్ములు, నే డేరీ వారి నరసి దుఃఖాశ్రువుల తుడిచి వేయుటకు? ఎక్కడున్నారు? శోకజనకములైన భారతసామాజికదృశ్యములు హృదయజ్ఞులకు తీరని సంతాపమును కల్గించుచున్నవి. దీనికి పరిష్కారము, అంతము ఎచ్చటో? భారతదేశము అనేక జాతుల సంప్రకీర్ణము; ఎప్పుడును, ఒక జాతి కాదను దురదృష్టకరభయంకరవాదమును వినిపించువారును నేడు కన్పించుచున్నారు. ప్రధానమంత్రులు మొదలుకొని రాజకీయ నాయకు లందఱును అనేక 'స్కాముల'లో లోక ప్రసిద్ధులై జుగుప్స కల్గించుచున్నారు. కుటిల రాజకీయములే వృత్తిగా గల్గి, అపరిమితధనార్జనమే వారి లక్ష్యమై యున్నది.

మఱియొక వైపున దృశ్యమానమగుచున్న విషాదకర యథార్థత :- ఆధునిక విద్యావతులైన యువతులు, పాశ్చాత్యసంస్కృతివ్యామోహితలై, వివాహానుబంధము, పాతివ్రత్యము, మాతృత్వము అనునవి 'బానిసత్వము'నకు ప్రతీకలని పవిత్ర సంప్రదాయములను అవహేళన మొనర్చుచు ప్రచారము చేయుచున్నారు. కొందఱు

మహిళలు స్వాతంత్ర్యాభాసమగు విశృంఖలస్వైరవిహారమును ఆకాంక్షించు మ ఉత్పథవర్తనులగు పురుషుల వలెనే పాతిత్యము వైపునకు పరుగులు తీయుచున్నారు; ఇంటిలోని వృద్ధులను, వారికి ఏదైన జీవనాధారము లేనిచో నిరంతరము అవమానించుచు, నిరాదరణచేయుచు వారు, మృత్యువున కెదురు చూచు దురవస్థను కల్పించు పాపజాతి స్త్రీల సంఖ్య సైతము పెరిగిపోవుచున్నది.

"ప్రాప్తే కలియుగేఘోరే, నరాః పుణ్యవివర్జితాః ।
దురాచారరతా స్సర్వే, సత్యవార్తాపరాఙ్ముఖాః ।
పరాఽపవాదనిరతాః, పరద్రవ్యాఽభిలాషిణః ।
పరస్త్రీ సక్త మనసః, పరహింసాపరాయణాః ॥
దేహాఽఽత్మదృష్టయో మూఢా, నాస్తికాః పశుబుద్ధయః ।
మాతాపితృకృతద్వేషాః, స్త్రీదేవాః కామకిఙ్కరాః ॥
విప్రా లోభగ్రహగ్రస్తా, వేదవిక్రయజీవినః ।
ధనాఽఽర్జనాఽర్థమభ్యస్తవిద్యా, మదవిమోహితాః ।
త్యక్తస్వజాతికర్మాణః, ప్రాయశః పరవఞ్చకాః ।
. . . . . . . . . . . . . . . . . . . . ।
స్త్రియశ్చ ప్రాయశో భ్రష్టా, భర్త్రవజ్ఞానని ర్భయాః ।
శ్వశురద్రోహకారిణ్యో, భవవ్యన్తి న సంశయః ।
ఏతేషాం నష్టబుద్ధీనాం, పరలోకః కథం భవేత్? ।

(ఇత్యార్షే, శ్రీబ్రహ్మాణ్డపురాణే, ............ఉత్తరఖణ్డే,
అధ్యాత్మరామాయణమాహాత్మ్యమ్ ।)

"ఏకం ధమ్మం అతీతస్స, ముసావాదిస్స జన్తునో ।
వితిణ్ణ పరలోకస్స, నత్థి పాపం అకారియం ।

(ధమ్మపదం–గాథ–176 – 1994– డా॥ రత్నాకరం బాలరాజు)

ఏక మగు ధర్మము (సత్యము) నుల్లంఘించినవాడు, అనత్యవాది, పరలోక విషయమున నుదాసీనుడగు వానికి, (జంతువునకు) చేయతగని పాపమేదియును లేదు.

**ఆతతాయులు**[1] నరహంతలు, మహిళా మానాపహారులు, సర్వవిధ్వంసకులు లోక వైపున, అసూయాగ్రస్తులు;[2] సరస్వతిని (విద్యను) నిరోధించు **జ్ఞానఖలులు,**[3] **కేవలకలిస్వభావులైన పండితులు, మనస్సను పదార్థమే లేని విశ్వవిద్యాలయ ఆచార్యులు** మఱొకవైపున, అంధతమస్సును దేశమున ప్రచురముగ వ్యాపింపజేయుచున్నారు.

> **"దొరసిన కాయము ల్మదిమి తోచిన జూచి, ప్రభుత్వ ముల్సిరుల్-**
> **మెఱుపులు గాగ జూచి, మఱి మేదినిలో తమ తోడి వారు ముం**
> **దరుగుట జూచి, చూచి, తెగు నాయు వెఱుంగక మోహపాశముల్,**
> **తఱుగని వారి కేమిగతి? దాశరథీ! కరుణా పయోనిధీ! ।"**

అని, గోపన్న - భద్రాది రామదాసు - జనుల వ్యామోహమును గూర్చి, వాపోయినాడు.

ఇచ్చట, బృ.ఉ. (II-4-3) నందుగల మైత్రేయీయాజ్ఞవల్క్యుల సంవాదమందలి మైత్రేయివాక్యము గమనార్హము. సర్వపృథివియు, ధనసంపూర్ణమై వశమైనను,

---

(1) **అగ్నిదో గరదశ్చైవ శస్త్రోన్మత్తో ధనాపహః।**
**క్షేత్ర దారహరశ్చైతాన్ షడ్విద్యా దాతతాయినః।" (శుక్రనీతి)**
ఇండ్లకు అగ్గిపెట్టువారు, అన్నమున విషమిడువారు, శస్త్రముల ధరించి, ఉన్మత్తులై తిరుగువారు, పరధన, క్షేత్ర, దారాపహారులు - **ఈ ఆఱుగురు ఆతతాయు లనబడుదురు.**

(2) **"బోధమల్పంబు, గర్వ మభ్యున్నతంబు,**
**శాంతి, విప్పచ్చరంబు, మచ్చరము ఘనము,**
**కూపమండూకముల బోలె కొంచె మెఱిగి,**
**పండితమ్మన్యులైన వైతండికులకు ।"**
**(శ్రీనాథ మహాకవి - భీమఖండము -13)**
వీరి స్వభావమును కవిసార్వభౌముడు మనోజ్ఞముగ వర్ణించినాడు.

(3) **"సా దేవకీ సర్వజగన్నివాస నివాస భూతా, నితరాం న రేజే।**
**భోజేన్ద్రగేహేఽగ్ని శిఖేవ రుద్ధా, సరస్వతీ జ్ఞానఖలే యథా సతీ ।"** (భాగ -X-2-20)
ఇతరుల కగపడకుండ, ఘటాదులందు నిరుద్ధమైన దీపశిఖ వలె, **జ్ఞాన వంచకులచే నిరోధింపబడిన శోభమాన యగు సరస్వతి వలె,** కంసుని గృహమున, సర్వజగన్నివాస నివాస భూతయగు దేవకీ **దేవి బంధింపబడి యుండెను. దేవకీదేవి వలెనే,** విద్య సైతము జగన్మంగళాత్మకపరార్థ **గర్భితము.**

దాని వలన భోగసాధనవంతులగు సంపన్నులకు కలుగు సుఖజీవనమే కాని, అమృతత్వప్రాప్తి లేదన్న యాజ్ఞవల్క్యునితో మైత్రేయి -

"యేనాఽహం నాఽమృతా స్యాం, కి మహం తేన కుర్యామ్" ? ।

"ధనము వలన అమృతత్వప్రాప్తి లేకున్న, దానిని గ్రహించి, నేనేమి చేసికొనగలను?" - అని, మైత్రేయి సంపదను తిరస్కరించినది. మైత్రేయి వాక్యము మానవజాతికి పథప్రదీపము కదా! వైరాగ్యజాగృతికి, వ్యామోహ నాశమునకు, ఈ వాక్యమును మించినది రెండవ దేదియు నుండదు. అధ్యాత్మపథ ప్రదీకమైన ఈ వాక్యము, శ్రేయస్సును కాంక్షించు వారం దఱును, పలుమాఱు ధ్యానించి, అనుష్ఠింపదగినది. మహిళాలోకమునకీ వాక్యము అనుచింతనార్హము; అనుసరణీయము.

ఆధ్యాత్మికములైన విలువలే మానవనాగరికతా వృక్షమునకు మూలములు. మూలములు దుర్బలములైనచో, వృక్షము, పల్లవపత్రపుష్పఫలరహితమై శుష్కించి, నిర్జీవమై పడిపోవును.

శ్రేయఃప్రేయములను(good and pleasant), మంచిచెడ్డలను గుఱించిన జ్ఞానవృక్షము, భౌతిక శాస్త్రభూమి నుండి పెరుగునది కాదు. ఆత్మ స్ఫురణను (Self awareness) భౌతికశాస్త్రపరిశోధనలతో నిరూపించుట అసాధ్యము. సర్వప్రమాణములకును ఆధారభూతమైన చరమప్రమాణము, ఈ ఆత్మ స్ఫురణయే, యని వేదోపనిషద్ద్రష్టలు, వసిష్ఠుడు, వాల్మీకివ్యాసులు, శంకరుడు, మొదలగు పరమార్థద్రష్టల సునిశ్చితసిద్ధాంతము. కాన, యోగవాసిష్ఠము వంటి మోక్ష(శాంతి)శాస్త్రముల అధ్యయనము, వ్యష్టి, సమాజము యొక్క అభ్యుదయనిశ్శ్రేయసములకు అత్యంతావశ్యకము.

మన విద్యాలయములు, నైతికాదర్శములను, మానవ జీవిత పరమార్థమును గూర్చి వివిధవిశదభావనను కల్గించుట లేదు. తలుచుగా, వాని పరిసరములు, వాతావరణము, అందు విద్య నభ్యసించు యువతీయువకుల నైతిక చేతనను నిస్తేజ మొనరించుచున్నవి. ఏవో కొన్ని పరీక్షలలో నుత్తీర్ణులై, ధనసంపాదనకు, లాభకరమైన ఉద్యోగముల సాధించుటకు మించి, యువజనులకు తమ

కర్తవ్యములగూర్చిన ఉన్నత చింతన మేదియు గోచరించుటలేదు. విద్యాఽఽలయములు, విద్యా+లయములుగ పరిణమించుచున్నవి.★

భారత జాతీయ జీవనమునకు (ఏ జాతీయ జీవనమునకైనను) శీలసంపద జీవభూతము. దానికి ప్రతిష్ఠ అధ్యాత్మవిద్య. ఇది విద్యారంగమునకు దూరమైనందున,జనులు అజ్ఞానావృతులై దారిద్ర్యపీడితులై మానవత్వమును మఱచి పోవుచున్నారు; జంతుప్రవృత్తిపరాయణులగుచున్నారు. అధ్యాత్మజ్ఞానము లేనిచో కేవలము రాజకీయఆర్థికసాంస్కృతికప్రయత్నముల వలన మానవైక్యతా దర్శము సిద్ధింపదు.

"A religion of humanity means the growing realisation that there is a Secret Spirit a divine Reality, in which we are all one, that humanity is its highest Present Vehicle on earth, that the human race and human being are the means by which it will progressively reveal itself here. It implies a growing attempt to live out this knowledge and bring about a kingdom of this divine Spirit upon earth....... There must be too a discipline and a way of salvation in accordance with this religion that is to say, a means by which it can be developed by each man within himself, so that it may be developed in the life of the race."

(Sri Aurobindo : The Human cycle–The Ideal of Human Unity-P-554)

వేదపురాణఇతిహాసగీతాయోగవాసిష్ఠాదిమోక్ష (శాంతి)శాస్త్రముల (Sciences of Peace) అధ్యయనము, జనులకు ఆధ్యాత్మికమైన దృఢ భూమికను ప్రసాదింపగలదు. ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వము, విద్యావేత్తలు, విద్యారంగమున,

★ The young people who to-day hear in high schools and colleges that man is merely a "higher animal", often become atheists. They donot attempt any soul exploration or consider themselves in their essential nature, to be "images of God". Emerson observed: "That only which we have within, can we see without. If we meet no gods, it is because we harbor none". **He who imagines his animal nature to be his only reality is cut off from divine aspirations.**

(Autobiography of a Yogi - Page 186 - Paramahamsa Yogananda - 1956)

జనతాశీల నిర్మాణమున, జగద్వ్యక్తికిని, ఆధ్యాత్మవిద్యకునుగల ప్రాధాన్యమును గుర్తించి, విద్యారంగమును సంస్కరింపవలెను. కాని, పాలకులు, రాజకీయనాయకులు దీనిని గ్రహింతురా?

"బోద్ధలగు వారు మత్సరపూర్ణమతులు
ప్రబలగర్వవిదూషితుల్ ప్రభువు లరయ,
ఇతరమనుజుల బోధోపహతులుగాన,
భావమున జీర్ణమయ్యె సుభాషితంబు"

అను భర్తృహరిసూక్తి నేటిసమాజమునకు సంపూర్ణముగ అన్వయించు చున్నది.

'సినిమాలు', 'టి.వి.'(T.V.)లు, విలాసజీవనాకాంక్షను ఉద్దీపింప జేయుచున్నవి. **అశ్లీలసాహిత్యము** విశృంఖలమై, వారి మనస్సులను కలుషిత మొనర్చుచున్నవి. ఇవి యన్నియు, **సామాజికదుర్దశకు** చిహ్నములు. వీని నిరోధించుట దేశముయొక్క నైతికాధ్యాత్మికశ్రేయస్సు కాంక్షించు వారందఱకును, ఆవశ్యకకర్తవ్యము. వ్యక్తులకు, జాతికి, వైమల్యము (పవిత్రత) యొక్క బలమును, నైతికధృతిని, ప్రసాదింపగల సాహిత్యము మాత్రమే ఈ దుర్దశ నంతమొందింపగలదు,

**మానవజాతిని శాంతితేజస్సుల నధిగమింప జేయగలనని ప్రగల్భము లాడుకొను భారతదేశము, తన కొఱకు అక్షయమగు వైమల్య ప్రమాణమును స్థాపించుకొనుట యందు వైఫల్యమందినచో, అంతకంటె శోచనీయ స్థితి మఱి వేరుండునా?★**

★ It is the bounden duty of all who are interested in the moral and spiritual welfare of the country to protest against the canker that is eating into the nation and to reinforce healthy ideas constantly. The literature of strength of individual and national purity and of moral courage alone can do this. **It will be a pity if India that boasts of leading mankind to peace and light, at times even causing of offence to others, failed to set up a standard of incorruptible purity to herself.**

(Spiritual Vistas – Swami Vimalananda – Trivandram - 1984 - P. 145)

యోగవాసిష్ఠసంగ్రహమునకు, పరమహంసపరివ్రాజకులు శ్రీ మదానంద బోధేంద్రసరస్వతీకృతవ్యాఖ్య (శ్రీయోగవాసిష్ఠమహారామాయణతాత్పర్య ప్రకాశము) ననుసరించి అనువాదమును కూర్చితిని. శాస్త్రసజ్జన సంపర్కవశమున నే నెఱిగినవిషయములను నా'పరమార్థదీపనీనామ'వ్యాఖ్యయందు పొందుపఱచితిని.

"ఇతిహాస పురాణాభ్యాం, వేదం సముపబృంహయేత్ ।
బిభే త్యల్పశ్రుతా ద్వేదో, మమాఽయం ప్రహరిష్యతి ॥"

(మ.భా. ఆది - I-267)

అను వ్యాసోక్తి ననుసరించి, శ్రుతిస్మృతి పురాణేతి హాసాది మోక్ష సంహితల నుండి, వేదాంతయోగదర్శనముల నుండి, పరమర్షుల సూక్తులను, కాళిదాసాది కవిచక్రవర్తుల రుచిరార్థశ్లోకములను, సానువాదముగ పాదటీకలయం దుదాహరించితిని.

## అనువాదవ్యాఖ్యల యందు ఆకాంక్షిత ప్రయోజనము

గ్రంథమును కేవలము వివరించుటయే, ఈ అనువాద వ్యాఖ్యల యందు నే నుద్దేశించిన ప్రయోజనము కాదు. జనుల హృదయము లందు వసిష్ఠమహర్షి ప్రోక్తమైన పరమపావనజ్ఞానము (బ్రహ్మవిద్య)ను, పునఃప్రతిష్ఠించుటయు, మతము యొక్కయు, అధ్యాత్మతత్త్వజ్ఞానము యొక్కయు, సామరస్యమును పునరుద్ధరించుటయు, నే నాకాంక్షించిన పరమప్రయోజనము.

యోగవాసిష్ఠము వంటి మహాగ్రంథములు గతకాలమునకు మాత్రమే రక్షకములు కావు. అవి, ఆగామికి – భావి కాలమునకు సైతము సందేశప్రకటనము లనుట విస్మరింపకూడదు.

## భద్రప్రాప్తికి మార్గము

ఆధునికములైన జీవనపరిస్థితులు మాఱి యున్నను, ఒక విధముగ అవి, మునుపటి కంటెను, మేలై యున్నను, ఆధ్యాత్మికగభీరతయందును, జీవిత

పథమున కష్టపరంపరలను నిర్భయముగ నెదుర్కొనుట కవసరమగు శీలశక్తి[1] యందును, ప్రాచీనుల కంటే మనము ఉత్కృష్టుల మని చెప్పజాలము. దానికి కారణము, మన యందు ఆధ్యాత్మిక నిష్ఠను ప్రసాదించు శీల సంపద కొఱత పడి యుండుటయే. అధ్యాత్మవిద్యావ్యాప్తియే భారతదేశభద్రప్రాప్తికి మార్గము. భౌతిక విద్యలు కేవలము బాహ్యములైన శరీరాదులకు పోషకములు. అధ్యాత్మవిద్య అంతరమైన ఆత్మకు పోషకము; తదభివ్యక్తికి హేతువు. శంకరుడు అనాత్మ సంపదను గర్హించినాడు.[2] ఆత్మానాత్మవిద్యలస్వరూపమును, వసిష్ఠ విశ్వామిత్రుల జీవితములు వ్యాఖ్యానించును. (చూడు : అనుబంధము II)

---

(1) "శీలశక్తి నిరుక్తి :-
"అద్రోహః సర్వభూతేషు, కర్మణా, మనసా, గిరా ।
అనుగ్రహశ్చ, జ్ఞానం చ, శీలమేతద్విదు ర్బుధాః ॥"
మనోవాక్కర్మము (త్రికరణము) లందు సర్వ ప్రాణుల యెడ ద్రోహ చింతనారాహిత్యము, వాని పై కారుణ్యము, జ్ఞానము, శీలమని బుధుల నిశ్చయము.
చారిత్రము, ఆచారము, అనునవి శీలశబ్దపర్యాయములు.
"న ఛన్దాంసి వృజినాత్తారయన్తి, మాయావినం మాయయా వర్తమానమ్ ।
నీడం శకున్తా ఇవ జాతపక్షా శ్ఛన్దాంసి ప్రజహ త్యన్తకాలే ॥" (సనత్సుజాతీయము -III-5)
శీలరహితుడగు మిథ్యాచారుని, వేదములు పాపముల నుండి రక్షింపజాలవు. ఱెక్కలు వచ్చిన పక్షులు గూటిని వలె, మరణకాలమున వేదములు వీనిని త్యజించుచున్నవి.

(2) "లబ్ధా విద్యా రాజమాన్యా తతః కిమ్?,
ప్రాప్తా సంపత్ ప్రాభవాఽఽఢ్యా తతః కిమ్? ।
భుక్తా నారీ సున్దరాఙ్గీ తతః కిమ్?,
యేన స్వాఽఽత్మానైవ సాక్షాత్కృతోఽభూత్ ।
"దృష్టా నానా చారుదేశా స్తతః కిమ్?,
పుష్టాశ్చేష్టా బన్ధువర్గా స్తతః కిమ్ ?
నష్టం దారిద్ర్యాది దుఃఖం తతం కిమ్?,
యేన స్వాఽఽత్మానైవ సాక్షాత్కృతోఽభూత్ ॥"
ఇత్యాది (శంకరుడు - అనాత్మ శ్రీ విగర్హణ ప్రకరణము -1,3)
రాజమాన్యతను పొందిన విద్య లభించినది, ఫలమేమి? ప్రభుశక్తితో కూడిన సంపదలు ప్రాప్తించినవి, ఫలమేమి? సుందరాంగియగు రమణితో భోగము ననుభవించినను ఫలమేమి? ఆత్మ సాక్షాత్కారము లభింపనిచో, అన్నియును వ్యర్థములే; దుఃఖహేతువులే. మనోహరములగు అనేకదేశముల దర్శించినాడు. ఇష్టమైన బంధువర్గమును పోషించినాడు. దారిద్ర్యమును (లేమిని) నశింపజేసికొన్నాడు. - కాని, ఆత్మసాక్షాత్కార మందలేదు. లాభమేమి?
(అనాత్మ శ్రీవిగర్హణప్రకరణము -3)
"For what shall it profit a man, if he shall gain the whole world and lose his own soul?"
Or what shall a man give in exchange for his soul?" (Christ – St. Mark – VIII – 36, 37 – Bible)

## ఆత్మస్వరూపజ్ఞానము, సర్వానర్థనివృత్తిహేతువు.

ఆత్మవేత్త మాత్రమే, శోకమును తరించును. "తరతి శోక మాత్మవిత్"
(ఛాం.ఉ.- VII ప్రపాఠకము -3)

అని సనత్కుమారుడు, దేవర్షి నారదునకుపదేశించెను. ఆత్మ, వర్ణాశ్రమాపేక్షారహితముగ సర్వజనుల (స్త్రీ పురుషుల) చేతను, సకలాశ్రమస్థుల చేతను నెఱుగదగినది; శ్రోతవ్యము, మంతవ్యము, నిదిధ్యాసితవ్యము.

"స హి సర్వై ర్విజిజ్ఞాస్య, ఆత్మా వర్ణై స్తథాఽఽ శ్రమైః।"

పరమాత్మస్వరూపజ్ఞానరాహిత్యమే, సకల అనర్థహేతువు. అధ్యాత్మజ్ఞానము వలన, సకలపురుషార్థములు సంపూర్ణముగ సిద్ధించును.

అజ్ఞానమున ఆనందరూపమగు ఆత్మ నెఱుగమిచే, జనులు, బాహ్యమున సుఖసంపాదనమునకై ప్రయత్నించుచున్నారు. ఆత్మజ్ఞుల మార్గ మదికాదు[1] సర్వాత్మభావమే బ్రహ్మవిద్యాఫలము. బ్రహ్మవేత్త, జీవన్ముక్తుడు,[2] స్వానందాను భూతియే, జీవన్ముక్తికి ఫలము. ఉత్తమోత్తమమైనట్టి చిత్తశాంతి బ్రహ్మవిద్యాగమమునకు ఫలము.

ఇదియే సనాతనధర్మస్వరూపము. భారతభూమి, హైందవధర్మోదయము (rise of Hinduism) వలననే, పరమ అభ్యుదయ శ్రేయముల నందగలదు. మహోన్నతమైన హిందూ ధర్మ సంస్కృతి యొక్క ఆత్మ, ఆధ్యాత్మిక జీవనమే. ఇందు ఏకత్వగాంభీర్యములు (Unity and profoundity), పరిపూర్ణత నందియున్నవి. మానవు డెపుడు స్వకల్పితములైన గర్వాభినివేశముల నుండి, విముక్తుడై, అధ్యాత్మజీవనసరణి నెఱుగునో, అపుడు, వేదాత్మ (Vedic Spirit) వాని నావహించి, ద్యావాపృథువుల నైక్య మొనరించును. (See-Buddhi Yoga of the Gita - Anirvan - Introduction P. XIV)

(1) "ఆనన్దరూప మాత్మాన మజ్ఞాత్వైవ పృథగ్జనః।
బహిః సుఖాయ యతతే, న తు కశ్చిద్విధం బుధః।"

(2) "సర్వాత్మభావో విదుషో బ్రహ్మవిద్యాఫలం విదుః।
జీవన్ముక్తస్య తస్యైవ స్వాఽఽనన్దాఽనుభవః ఫలమ్।"
(శంకరుడు - సర్వవేదాంత సిద్ధాంతసార సంగ్రహము - 635, 905)

అమృతస్వరూపమైన వేదధర్మము (సనాతన హిందూ ధర్మము) మానవజాతి విముక్తికై అతి పురాతన కాలము నుండి, ఈ ద్వీపకల్పము యొక్క ఏకాంతమున మహాత్ములచే ధ్యానింపబడి పరిపుష్టమై, ప్రవర్తితమైనది.

"But what is the Hindu religion? What is this religion which we call **Sanatan, eternal?** It is the **Hindu religion** only because the Hindu nation has kept it, because in this peninsula it grew up in the Seclusion of the sea and the Himalayas, because in this Sacred and ancient land, it was given as **a charge to the Aryan race** to preserve through the ages".

"This is the Dharma that for the Salvation of humanity was Cherished in the seclusion of this peninsula from of old"................ **"It is for the Dharma and by the Dharma India exists".** (Sri Aurobindo)

"This is the one religion that can triumph over materialism by including and anticipating the discoveries of Science and Speculations of Philosophy. It is the one religion which impresses on mankind the closeness of God to us and embraces in its compass all the possible means by which man can approach God. It is the one religion which insists every moment on the truth which all religions acknowledge that He is in all men and all things and that in Him we move and have our being. It is the one religion which enables us not only to understand and believe this truth but to realise it with every part of our being. It is the one religion which shows the world, what the world is, that it is the **Lila of Vasudeva.** It is the one religion which shows us how we can best play our part in that Lila its subtlest laws and its noblest rules. It is the one religion which does not separate life in any smallest detail from religion, **which knows what immortality is and has utterly removed from us the reality of death.** (Sri Aurobindo - Uttarpara Speech P -11-12)

ఆబ్రహ్మస్తంబపర్యంతము ప్రాణిజాతమంతయు స్వాభావికముగ దుఃఖవిముక్తిని, పరమసుఖ ప్రాప్తిని కాంక్షించుచున్నది. కాన, అధ్యయన, శ్రవణ,

మననాదులచే, తాపత్రయ విముక్తిని కల్గించి, ఉత్తమోత్తమమైనట్టి చిత్త ప్రశాంతిని ప్రసాదించి, లోకానందకరమై, సకల పురుషార్థముల సిద్ధింపజేయు ఈ యోగవాసిష్ఠ మోక్ష సంహిత, విశ్వజనాదరణీయము.

"నానా పురాణనిగమాఽఽగమసమ్మతం యద్
రామాయణే నిగదితం, క్వచిదన్యతోఽపి।
"స్వాన్తః సుఖాయ తులసీ, రఘునాథగాథా
భాషా నిబన్ధ మతిమఞ్జుల మాతనోతి ॥"

అను మహాత్ముడు తులసీదాసు సూక్తి (రామచరితమానసము-బాల-7) ననుసరించి, నేనును, ముఖ్యముగ స్వాంతః సుఖమునకై, భగవదంకితముగా, ఈ గ్రంథమును ప్రకాశిత మొనర్చితిని. తత్త్వవేత్తలైన మహాత్ముల దయా పరిపుష్టిచే బ్రహ్మయోనియగు వసిష్ఠమహర్షి మంజుగంభీరవచోవిలాసమును, శ్రద్ధాభక్తులతో యథామతి వివేచించి అనువాద వ్యాఖ్యలను కూర్చితిని.

"స్వర్గాఽపవర్గయో ర్మార్గ మామనన్తి మనీషిణః,
యదుపాస్తి మసావత్ర పరమాత్మా నిరూప్యతే।
న్యాయచర్చేయ మీశస్య మననవ్యపదేశభాక్,
ఉపాసనైవ క్రియతే, శ్రవణాఽనన్తరాగతా ॥"
(ఉదయనుడు - న్యాయకుసుమాంజలి)

ఈశ్వరస్వరూపమననరూపమైన ఈ గ్రంథరచననిజముగ ఈశ్వరోపాసనయే. వేదాధుల నుండి పరమేశ్వరజ్ఞానము, లేక, తచ్ఛ్రవణము, సిద్ధించిన అనంతరమే, ఈ యుపాసన కల్గుచున్నదన్న ఉదయనుని సూక్తితో నేకీభావమంది ఈ నా సాహితీవ్యాసంగమును, పరమేశ్వరసంరాధనగా భావింతును. భగవదుపాసన, స్వర్గమోక్షములకు మార్గమని పరమర్షుల దర్శనము.

హేమచంద్రుని వాక్యముతో నేకీభవించి, "బుద్ధిమాంద్యము వలన, దోషయుక్త వాక్యము లందును, వివరణములందును, నేను చేసిన తప్పులను, ఆర్యచిత్తులు (Noble minds) మాత్సర్యమును వీడి, కృపతో సవరింతురు గాక!" అని ప్రార్థించుచున్నాను. గుణలేశగ్రహణపరులు, దయాశిశిరులునైన సత్పురుషులు సంతుష్టులగుదురు గాక!

"ప్రమాణసిద్ధాన్త విరుద్ధమత్ర,
యత్కిఞ్చిదుక్తం మతిమాన్ద్యదోషాత్ ।
మాత్సర్య ముత్సార్య త దార్యచిత్తాః,
ప్రసాద మాధాయ విశోధయన్తు ॥"

పూర్వవ్యాఖ్యాతలకు కృతజ్ఞతా ప్రణామాంజలి.

యోగవాసిష్ఠమును ఇతఃపూర్వము, అనువదించి, వ్యాఖ్యాతలై వెలసిన మహాత్ములందఱికిని నా కృతజ్ఞతా పూర్వకభక్తి ప్రణామములు. ఇందు వ్యాకరణ నియమములు, సంధులు, సరళాదేశములు, విధిగా పాటింపనందుకు పండితులు క్షమింప ప్రార్థించుచున్నాను. శాస్త్రవిషయములందు కొన్నిచోట్ల, భాషా కాఠిన్యము తప్పలేదు.

పునరుక్తులు కొన్ని యున్నను, సందేశాత్మకములగు ధర్మగ్రంథము లందవి గుణములే కాని, దోషములు కావు. సాధకుల హృదయమున ఉపదేశమును దృఢముగా స్థాపించుటయే వాని ప్రయోజనము[1].

"పరుగెత్తు వానికి ప్రమాదవశమున, నెచటనైన జాఱుపాటు కల్గినచో, దుర్జనులు నవ్వి గేలి చేయుదురు. సజ్జనులు, ఆ పడుటను విరోధించి ఆలంబన

---

(1) "పౌనరుక్త్యం న దోషోఽత్ర, శబ్దేనాఽర్థేన వా భవేత్ ।
అభ్యాసేన గరీయస్త్వ మర్థస్య ప్రతిపాద్యతే ॥"
(సురేశ్వరుడు – మానసోల్లాసము-VIII-4)

"భూయో నిపుణబోధాయ, శృణు కిఞ్చి ద్రఘూద్వహ !।
పునః పున ర్యత్కథితం, త దజ్ఞోఽప్యవతిష్ఠతే ॥"
"శ్రీరామా! బోధదార్ఢ్యము కొఱకు, చెప్పిన దైనప్పటికి, మరల చెప్పెదను వినుము. మరల మరల చెప్పిన దానిని, మూఢుడు సైతము గ్రహింపగలడు" – అని వసిష్ఠుడే వచించి, ఇందు పునరుక్తులు దోషములు కావని స్థాపించెను.
"దుర్బోధత్వాత్ ఆత్మవస్తునః పునః పునః ప్రసఙ్గమా
పాద్య, శబ్దాన్తరేణ తదేవ వస్తు నిరూపయతి భగవాన్ వాసుదేవః ॥"
(శంకరుడు – గీతాభాష్యము-II-24)
దుర్బోధమగు ఆత్మ విషయమును, మరల మరల ప్రసంగించి, నిరూపించుట దోషము కాదని శంకరుడు గీతాభాష్యమున ప్రకటించెను.

మొసగుదురు.[1] కాన, శ్రమజ్ఞులైనపండితులు మన్నించి, దోషముల సవరింతురు గాక! జలాశయమున, కేవలము శైవలము (నాచు)ను తొలగించి నిర్మల జలమును గ్రోలుదురు కదా![2]

విచారించి, గుణలేశమును సైతము, కర్ణావతంసముగ గ్రహించువారు, పరదోషవాదమున నానందింపని వారు నైన నిర్మత్సరులు, సుకృతాత్ములు, కొందఱు మాత్రమే, విరళముగ నీ భూమి యందున్నారు.[3]

మనస్సును దోషదృష్టిపరము చేయకూడదు. దోషము లేకున్నను, దోష చిత్తులకు, దోషమే గోచరించుచుండును. అని మహాత్ముడు కుమారిలభట్టు ఉపదేశించెను.[4] సుభాషితము ఎంత మనోజ్ఞమైనను, దివాకరుడు, దివాంధములకువలె, దుర్జనులకు ప్రకాశింపదు; విశుద్ధచిత్తులు, తృష్ణారహితులగు వారికి, మహాధన నిక్షేపమువలె ప్రకాశించును.[5]

పురంజనునకు పేరుగాని, చేష్టగాని, తెలియని సఖుడు (ఈశ్వరుడు) ఉండెను. ఆ అవిజ్ఞాత నాముడు, అవిజ్ఞాత చేష్టితుడు, నగు ఈశ్వరుడే లోకమున మనము చేయు సత్కర్మములకు సాయమొనర్చు అజ్ఞాతసఖులగు (Friends unknown) మహాత్ములకు ప్రేరకుడని నా నిశ్చయము. అమృత స్వరూపమగు అధ్యాత్మికసంస్కృతి సద్ధర్మములందు పరమనిష్ఠ గల అజ్ఞాతమిత్రునికి, – LT. Col. K.R. మూర్తి గారికి, పరమకారుణ్యనిధి సర్వేశ్వరుడు సమస్త సన్మంగళములు నిరంతరము ప్రసాదించుగాక!

---

(1) "ధావతః స్ఖలనం క్వాఽపి భవేదేవ ప్రమాదతః ।
హసన్తి దుర్జనా స్తత్ర, సమాదధతి సాధవః ॥"

(2) "శైవలం కిల విహాయ కేవలం, నిర్మలం కిము న పీయతే జలమ్ ?॥"

(3) "నిర్మత్సరా, సుకృతినః, ఖలు యే వివిచ్య,
కర్ణే గుణస్య కణమ ప్యవతంసయన్తి ।
యేషాం మనో న రమతే పరదోషవాదే,
తే కేచిదేవ, విరళా, భువి సంచరన్తి ॥" (హారావళి–3– పురుషోత్తమదేవుడు)

(4) "న చాఽత్రాఽతీవ కర్తవ్యం, దోషదృష్టి పరం మనః ।
దోషోఽప్యవిద్యమానోఽపి, తచ్చిత్తానాం ప్రకాశతే ॥" (కుమారిలభట్టు)

(5) సుభాషితం చార్యపి నాఽమహాత్మనాం,
దివాకరో నక్తదృశా మివాఽమలః ।
ప్రభాతి భాత్యేవ విశుద్ధచేతసాం,
నిధిర్యథాఽపాస్తతృషాం మహాధనః ।
(నైష్కర్మ్య సిద్ధి –IV–శ్లో.75)

## జగద్గురువుల అనుమోదము – ఆశీస్సులు

ద్వాత్రింశత్ సహస్ర (32000) శ్లోక పరిమితమగు యోగవాసిష్ఠ మహా రామాయణమును పలుమాఱు అధ్యయనమొనర్చి 1698 శ్లోకములకు పరిమితముగ రమణీయములైన ఆఖ్యానములను, దర్శన సార తత్త్వాంశములను, వేనిని వదలకుండ అత్యద్భుతముగ సంగ్రహించి, శ్రీ వాసిష్ఠసంగ్రహనామమున పునర్నిర్మించిన మహాత్ములు పరమహంస శ్రీ జ్ఞానానందభారతీస్వాములు, శృంగేరీ శ్రీశారదాపీఠ భూత పూర్వజగద్గురుశంకరాచార్యులు, జీవన్ముక్తులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖర భారతీస్వాముల వారి అంతేవాసులు (ప్రియశిష్యులు)

శ్రీ(యోగ)వాసిష్ఠసంగ్రహమిట్లు శ్రీ శృంగేరీశారదాపీఠమునకు సంబంధించిన దగుటచే, 15–8–93 సంగిన శ్రీ శారదాపీఠమును సందర్శించిన శుభసమయమున, ప్రస్తుతపీఠాధిపతులు, పరమపూజనీయజగద్గురువులు శ్రీ. శ్రీ. శ్రీ. భారతీతీర్థమహాస్వాముల వారిని ప్రార్థింపగా, వారీ గ్రంథము నాంధ్రీకరించి, వ్యాఖ్యానించుటకు అనుగ్రహవిశేషపూర్వకమైన అనుమోదమును ప్రసాదించినారు. అనువాదవ్యాఖ్యారచనాసమయమున నా మానసేంద్రియ శరీరములు,సంపూర్ణారోగ్యవంతములుగ నుండునట్లు కటాక్షింపవలెనని నేను ప్రార్థింపగా, జగద్గురువులు ముమ్మారు 'తథాఽస్తు' 'తథాఽస్తు' 'తథాఽస్తు' అని కృపావాత్సల్యపూర్ణులై ఆశీర్వదించినారు.

తమ పరమగురువులు, జీవన్ముక్తులు, శ్రీ. శ్రీ. శ్రీ. జగద్గురు చంద్రశేఖర భారతీస్వాములచే అనుగృహీతవ్యాఖ్యాసనాథమగు వివేకచూడామణి గ్రంథమును సైతము ప్రసాదించి, తీర్థము నొసగినారు. కృపాళువులగు జగద్గురువులకు నిరంతర కృతజ్ఞతాభక్తి ప్రణామాంజలులు.

కృశపరిణతితో నానాసంసారక్లేశవశ్యమైన చిత్తముతో మోక్షోపాయ దర్శనమగు ఈ గ్రంథమును ఆంధ్రీకరించి వ్యాఖ్యానించుటకు సమర్థుడను గాకున్నను, కేవలము భగవత్కృపా ప్రభావముననే దీనిని నిర్వర్తింపగల్గితిని. నేను నిమిత్తమాత్రుడను. ఉజ్జ్వలరత్నఖనియగు ఈ మహాగ్రంథమును తెనుగుజేసి, (అనువదించి) – 'పరమార్థదీపనీ' నామవ్యాఖ్యను రచించి, ఆంధ్రావళి యెదట నుంచు సౌభాగ్యమును, పరమకారుణికుడగు భగవంతుడు నాకు అనుగ్రహించినాడని భావింతును.

"యద్వ ద్ఘటానాం పటలో విశాలో, విలోక్యతేఽల్పే కిల దర్పణేఽపి ।
తద్వన్మదీయే లఘుసఙ్గ్రహేఽస్మి న్నుద్వీక్ష్యతాం శాఙ్కరవాక్యసారః ॥"
(శ్రీమచ్ఛంకర విజయము-I-2

విశాలోన్నతమైనను హిమాలయపర్వతశృంగసముదాయము అల్ప దర్పణమున వీక్షిత మగుచున్నట్లు, నే ననువదించి వ్యాఖ్యానించిన ఈ యోగవాసిష్ఠ సంగ్రహమున వసిష్ఠమునీంద్రుని శుభకరమగు వాక్యసారమును లోకము సమగ్రముగ దర్శించుగాక – అని శ్రీ శంకరవిజయకర్త – మాధవ విద్యారణ్యుని వలెనే నేనును ఆకాంక్షింతును.

నిష్ఫలారంభములగు సాంసారికములైన ఆయాసప్రదములు, బాధ్యతలతోనే, వ్యథలతోనే, ఎంతో కాలము (యౌవనమంతయు) గడచి పోయినది. గుణగ్రాహులగు సహృదయులు లేమిచే, విద్యావినయాదులగు గుణములును నిష్ఫలములైనవి.

"జీర్ణా ఏవ మనోరథా శ్చ హృదయే, యాతం చ తద్యౌవనం,
హన్తాఽఙ్గేషు, గుణాశ్చ వన్ధ్యఫలతాం యాతా గుణజ్ఞైర్వినా ।
కిం యుక్తం? సహసాఽభ్యుపైతి బలవాన్ కాలః కృతాన్తోఽక్షమీ,★
హా! జ్ఞాతం మదనాఽన్తకాఽఙ్ఘ్రి యుగళం ముక్త్వాఽస్తి నాఽన్యాగతిః ।

(భర్తృహరి సుభాషితము – వైరాగ్య – 83)

దుర్వారమగు కాలచక్రపరిభ్రమణమున, భగవదర్పితములైన నా బ్రహ్మసూత్రాది గ్రంథరచనలు మాత్రమే నాకు శాంతిదాయకములై నిలిచినవి. అపరిహార్యమగు వార్ధకావస్థ వ్యాఘ్రము వలె పైబడనున్నది.

"క్రతౌ సుప్తే జాగ్రత్త్వమసి ఫలయోగే క్రతుమతాం,
క్వ కర్మ ప్రధ్వస్తం ఫలతి పురుషాఽఽరాధనమృతే ? ।
అతస్త్వాం సంప్రేక్ష్య క్రతుషు ఫలదానప్రతిభువం ।
శ్రుతౌ శ్రద్ధాం బద్ధ్వా, కృతపరికరః కర్మసు జనః ।

(శివమహిమ్నః స్తోత్రము-20)

---

★ "చిత్తమునందె కోరికలు జీర్ణములయ్యె, నశేషగాత్రమున్
హత్తిన జవ్వనం బరిగె, ఆర్యులు లేమి గుణంబులున్ ఫలో
చ్ఛిత్తి వహించె, నెద్ది తగు? చేరక మానడు కాలు డక్కటా !
చిత్తజవైరిపాదయుగ సేవనమే, గతిగా నెఱింగితిన్ !"

క్రతువు లీనమై యుండగా, (నశింపగా) క్రతుకర్తలకు ఫలమొసగుట యందు, పరమేశ్వరా! నీవు నిరంతర జాగరూకుడవై యున్నావు. అందువలన. యజ్ఞాదులందు యజ్ఞఫలప్రదాతవగు నిన్నారాధించి, శ్రుతియందు ప్రమాణ బుద్ధితో, విద్వాంసులు, యాగాదికర్మములందు, కృతారంభు లగుచున్నారు. ఫలదాతయగు పరమేశ్వరుని ఆరాధనారహితమైన కర్మము ఫలప్రదము కానేరదు. పరమేశ్వరోపాసనారూపమైన కర్మము సంపూర్ణ ఫలదాయకము కాగలదు.

**కాన, క్రతుఫలవిధానవ్యసని, కర్మాధ్యక్షుడు, సర్వకర్మఫలప్రదాత, కర్మమునకు ఫలమును కూర్చుట యందు నిరంతర జాగరూకుడగు విరాడ్రూపి, పరమ పురుషునకు సమర్పితమైన వాక్యపుష్పాంజలి, ఈ కృతి, ఆంధ్ర జనతకు** ఆదరణీయమైనచో, నా అధ్యయన పరిశ్రమ సాఫల్య సిద్ధిని పొందును. **దయతో ఆశీస్సుల ననుగ్రహించిన శ్రీరామకృష్ణమతాధ్యక్షులు, పరమపూజనీయయతి వరేణ్యులు, శ్రీ. శ్రీ.. రంగనాథానందస్వాములకు సాష్టాంగభక్తిప్రణామములు.**

**"తనువది చంచలంబు ధనధాన్యములో సట,[1] యౌవనం బహో!**
**కనుగొనుచుండ వేగ జను(జనె) కావున భ్రాంతిని బొంది దుష్టవ**
**ర్తనమున సంచరింపకు, వృథాగను, కాని మఱుంగు జొచ్చి, ద**
**చ్చన[2]లికనెల్ల మాని, మనసా! హరి పాదము లాశ్రయింపుమా!"**

అన్న మహాత్ముడగు మానసబోధశతకకారుని నిత్యస్మరణీయమగు రమ్యపద్యము స్మృతిపథమున సర్వదా స్ఫురించుచున్నది.

**"జాగృహి! జాగృహి! చేత శ్చిరాయ చరితార్థతా భవతః।**
**అనుభూయతా మిదం, పురతః స్థితం పూర్ణనిర్వాణమ్ ।"**

**"వెనుకటి వేళ లందనుభవించిన జన్మశతంబు లట్లు వే**
**డును భ్రమ మోసపోవక గడుం దెలివొందుము డెందమా! చిరం**
**తనతపముల్ ఫలించి, పురతః స్థితినున్నది కృష్ణరూపమై,**
**అనవరతాఽనుచింతనసుధారసవీచుల నోలలాడుమీ ।"**

**(లీలాశుకుడు – శ్రీకృష్ణకర్ణామృతము-III-65)**

**(1) సట :– మోసము (2) తచ్చన :– కపటము)**

ఓ చిత్తమా! చిరకాలము భగవదనుభూతిని కోరి, దుఃఖమున మోహితమై యుంటివి. ఇపుడు నీకు కృతార్థత సిద్ధించినది. ఇక మోహమును విసర్జింపుము. పూర్ణ నిర్వాణము—నిరతిశయ మోక్షానందము – శ్రీకృష్ణరూపమున నీ ముందట పొడసూపుచున్నది, దాని ననుభవింపుము.

ప్రాక్తనజన్మకర్మశేషరూపమైన ఈ దేహమున
ప్రాణతైల సంయుక్తమై, జీవజ్యోతి
వెలుగు చున్నంత వఱకు, భగవచ్చింతనము,
భగవత్కథనము, భగవద్వాక్య వాఖ్యాతృత్వము – వీనినే
అధ్యాత్మయోగసాధనాంగములుగ అవలంబించి,
"యావత్ తైలం తావద్వ్యాఖ్యానమ్" –

అన్నట్లు, జీవితమును యోగస్వాధ్యాయనంపత్తిచే, పునీత మొనరించుకొనుట కాకాంక్షింతును.

'పరమసుఖచిదాత్మకమగు ఆత్మను నేను' ('పరమసుఖచిదాత్మకోఽహ మాత్మే'తి) అను అనుభూతి హృదయమున స్ఫుటముగ నుదయించి, పరమాత్మరతి కవిరోధరూపమగు పరమభక్తి, ఈశ్వరుని యందు అచంచలప్రతిష్ఠ నందక, విఫలమైనచో, మోక్షమున సైతము పరాఙ్ముఖుడనై, మరల నీలోకమున శరీర పరిగ్రహమునే (పునర్జన్మమునే) అభిలషింతును

"త్వయి జనార్దన! భక్తిరచఞ్చలా,
యది భవే దఫలప్రవణా మమ ।
అభిలషా మ్యపవర్గపరాఙ్ముఖః,
పున రపీహ శరీరపరిగ్రహమ్ ।"

కాని, పరమేశ్వరేచ్ఛయే యిందు నెఱవేరు గాక!

ప్రేమదం చ మే, కామదం చ మే, వేదనం చ మే, వైభవం చ మే ।
జీవనం చ మే, జీవితం చ మే, దైవతం చ మే, దేవ! నాఽపరమ్ ।

(శ్రీకృష్ణకర్ణామృతము-I-104)

స్వామీ! నా కోరిక లిచ్చినను, నెనరు గూర్చినను, జ్ఞానమునొసగినను,

నీవే నా వైభవము (ఐశ్వర్యము) నా ప్రాణము, నా జీవితము, నాకు ఇష్టదైవమును. నీవు తప్ప, మఱియొకరు లేరు.

నా గ్రంథ రచనా వ్యాసంగమున, నిరంతరము ప్రేమ శ్రద్ధా భక్తులతో నాకే కష్టము కలుగకుండ, సకాలమున స్నాన, భోజన, పానాదులు, సమకూర్చి, పరిచరించిన, చిరంజీవులు నా మనుమరాండ్రు **కరుణాప్రియదర్శిని, (కరుణాయి), ఇందుమతీదేవి (ఇందీ), భామతీదేవి (బామి), నా కుమార్తె డా॥ రత్నాకరం రమాదేవి M.A, Ph.D., – వీరి కందఱకు పరమ కారుణ్య సింధువగు భగవంతుడు (శ్రీరాముడు) సమస్తసన్మంగళములను –చిరాయురారోగ్యసౌభాగ్యములను కృపతో ప్రసాదించి అనుగ్రహింపవలెనని నిరంతరము ప్రార్థింతును.**

వాత్సల్యమున అమూల్యములైన పరిచయములు వ్రాసి యిచ్చి నన్ను ప్రోత్సహించిన **మహాత్ములకు, సహృదయులగు పండితులకు, కృతజ్ఞతా ప్రణామములు.**

సర్వాంగ సుందరముగ గ్రంథమును శ్రద్ధ వహించి ముద్రించిన Om Sai Graphics, Offset processing, and Printing, Hyderabad (A.P.) **అధిపతులు, పూజ్యమిత్రులు, శ్రీ ఎమ్. రాంరెడ్డిగారికి, వారి సిబ్బందికి మా కృతజ్ఞతలు.**

పరమేశ్వర కారుణ్యమునకు నిరంతరశరణాగతి.

**మూకం కరోతి వాచాలం, పఙ్గుం లంఘయతే గిరిం।**
**యత్కృపా త మహం వన్దే, పరమానన్దమాధవమ్ ।**

***ఓం తత్సత్ శ్రీ కృష్ణార్పణమస్తు***

**సాకేత నిలయం,** **డా॥ రత్నాకరం బాలరాజు**
**అనంతపురం. (ఆం.ప్ర.)**
ఈశ్వరనామ సంవత్సర–శ్రావణ బహుళ అష్టమి –
**శ్రీ కృష్ణ జన్మాష్టమి – శ్రీ జయంతి** –(25, August 1997)

ఓం నమః పరమాత్మనే ॥

# శ్రీ యోగ వాసిష్ఠ సంగ్రహము

## విషయప్రవేశము - యోగవాసిష్ఠతత్త్వదర్శనము.

ఓం - యద్వాణీ మోహమూలం శమయతి జగదానన్దసన్దోహదోగ్ధ్రీ ।
తస్మై వాల్మీకయే, శ్రీగురుతమగురవే, భూరిభావైర్నతాః స్మః ।"[1]

ఓం - పూర్ణాఽఽనన్దస్వభావః, స్వజనహితకృతే మాయయోపాత్తకాయః,
కారుణ్యా దుద్ధిధీర్షు ర్జన మనవరతం మోహపఙ్కే నిమగ్నమ్ ।
ఆవిశ్యాఽన్తర్వసిష్ఠం, బహిరపి కలయన్ శిష్యభావం వితేనే,
యః సంవాదేన శాస్త్రాఽమృతజలధి మముం రామచన్ద్రం ప్రపద్యే ।[2]

(పరమహంస శ్రీమదానన్ద బోధేన్ద్ర సరస్వతి)

ఉపాస్యోపాసకత్వేన, గురుశిష్యక్రమేణ చ ।
స్వామిభృత్యాఽఽదిరూపేణ, క్రీడతి స్వేచ్ఛయేశ్వరః ।[3]

(సురేశ్వరుడు - మానసోల్లాసము-VIII-7)

---

(1) ఎవని వాక్కు జగమునకు ఆనందసందోహమును వర్షించు కామధేనువై, మోహము (అవిద్య)ను, సమూలముగ నశింపజేయుచున్నదో, అట్టి సర్వోత్కృష్టుడైన పరమగురువునకు, వాల్మీకిమహర్షికి నిర్భరభక్తిభావమున ప్రణమిల్లుచున్నాము.

(2) సంపూర్ణానందస్వరూపుడై యున్నను, స్వజనహితార్థము, మాయామానుషదేహధారియై, నిరంతరము, మోహ(అవిద్యా)పంకమున మునిగి యున్న జనులను, కారుణ్యమున నుద్ధరింపగోరి, వసిష్ఠమహర్షిచిత్తమున లోపల నావేశించి, బయట శిష్యభావము వహించి సంవాదరూపమున, ఈ మోక్షశాస్త్రమను అమృతసాగరమును వ్యాపింపజేసిన - ప్రసాదించిన - శ్రీరామచంద్రుని శరణు జొచ్చుచున్నాము.

(3) ఉపాస్యము, ఉపాసకుడు, గురువు, శిష్యుడు, స్వామి, భృత్యుడు, - అను రూప భేదములను స్వేచ్ఛగా వహించి, అద్వయుడగు పరమేశ్వరుడు క్రీడించుచున్నాడు.

వసిష్ఠ రామ సంవాద రూపమగు యోగవాసిష్ఠము, వేదోపబృంహణమైన సమస్త సంస్కృతకావ్యేతిహాసపురాణాదిమోక్షశాస్త్రసముదయ మనెడి పారిజాతనందనారామ మందలి మధుకోశము; సర్వవేదాంతవిజ్ఞానసీమాంతము. అధ్యాత్మదీపము. ఈ మహాసంహిత 'యోగవాసిష్ఠమహారామాయణ' మని 'ఆర్షరామాయణ'మని. 'జ్ఞానవాసిష్ఠ' మని. 'వాసిష్ఠ'మని, లోకప్రసిద్ధి గాంచినది. దీని నిర్మించిన మహాత్ముడు. మహాతత్త్వవేత్త, మహాకవియునైన ఆదికవి మహర్షి వాల్మీకియని, అందే చెప్పబడి యున్నది.

గురువు, వక్త, బ్రహ్మమానసపుత్రుడగు వసిష్ఠుడు. శ్రోత, శిష్యుడు, భగవదవతారమూర్తియగు శ్రీరాముడు.

ఇది, ద్వాత్రింశత్సహస్ర(32000) గ్రంథ[1](శ్లోక) పరిమితము, లేక. చతుఃషష్టి సమాన(64,000)పాదసహితము. మాధుర్యాదిగుణ సంభరితము, శబ్దార్థాలంకార భూషితము, రమణీయదృష్టాంతశోభితము రసమయమునైన ఈ కావ్యము, (శాస్త్రము) సుబోధమైయున్నది[2]. దీని శ్రవణమననాదులున్నచో, మోక్షప్రాప్తి యందు, నరునకు తపోఽధ్యానజపాదిక మనవసరము. ఏలయన, తత్ఫలములన్నియు, దీని శ్రవణమననినిదిధ్యాసనరూపమగు మహాఫలమున నంతర్గతములు. ఇది, సారభూతార్థ పూర్ణములగు ఉపనిషత్తులతో తుల్యము.

ఇందు I- వైరాగ్య (1500 శ్లోలు), II- ముముక్షు (1000శ్లోలు), III-ఉత్పత్తి (7,000శ్లోలు), IV- స్థితి (3,000శ్లోలు), V- ఉపశమన(5,000శ్లోలు), VI- నిర్వాణ-(14,500శ్లోలు)ములను ఆఱు (6) ప్రకరణములున్నవి. ఆఱవదియగు నిర్వాణప్రకరణము, మరల పూర్వోత్తరములని రెండుగా విభక్తమై యున్నది. మొత్తము ఆఱు ప్రకరణములందలి శ్లోక సంఖ్య ముప్పది రెండువేలు (32000) అని చెప్పబడినది. పుణ్యములు, ప్రత్యక్షముగ పరమపురు

(1) గ్రంథము:– 32 అక్షరములు గల 'అనుష్టుబ్' ఛందోరూపమగు శ్లోకము.

(2) "శాస్త్రం సుబోధ మేవేదం సాఽలంకార విభూషితమ్।
కావ్యం రసమయం, చారుదృష్టాంతైః ప్రతిపాదితమ్॥"
"మోక్షోపాయోఽభిధా నేయం, సంహితా సారసంమితా।
త్రింశద్ద్వేచ సహస్రాణి, జ్ఞాతా నిర్వాణదాయినీ" ఇత్యాది. (యో.వా II-18.33 & II-17-6)
సారసంమితా– సార్థేన సంమితా – పూర్ణా, సారభూతోపనిషద్భి స్తుల్యేతి (యో.వా.తా. ప్ర)

షార్థా(మోక్షా)నుభవము నొసగు నవియునైన ఈ గ్రంథమందలి మోక్షోపాయములు విని, బాలుడు (మందాధికారి) సైతము, బ్రహ్మవేత్తయగు మన్నాడనిన. మఱి ముఖ్యాధికారుల ఫలప్రాప్తివిషయము చెప్పనేల? (VI నిర్వాణ - ఉత్తర -215.6) ఈ శాస్త్రము సర్వదుఃఖక్షయకరము; హృదయమునకు విశ్రాంతిదాయకమై. (II-2.9) సుఖదుఃఖాఽతీతమైన మహానందము ప్రసాదించును.

సర్వము బ్రహ్మమే (సర్వం ఖల్విదం బ్రహ్మ) యను శ్రుతిసిద్ధాంతమును. విస్తరించి. అసమానలలితశబ్దార్థ సంగతులతో. శాంతరస ప్రధాన మైనను, నానారస విజృంభణముగ నీ మహా కావ్యమును అప్రతిమానసముగ ఆదికవి మహర్షి వాల్మీకి నిర్మించినాడు. ఈ నిర్మితి (కల్పన) అభూతము!; అనన్యసాధ్యము!

1905 సం॥న మరణించిన, వారాణసికి చెందిన పండిత బృందావన సారస్వతుడను మహాత్ము డీమోక్ష సంహితను, నూట అఱువదియైదు (165)మార్లు అధ్యయన మొనర్చెనని, భారతరత్న శ్రీ భగవాన్‌దాసు వచించినారు.

'నేను సంసార పాశబద్ధుడను. జన్మజరామరణ దుఃఖము ననుభవించుచు, శోకించు చున్నాను. ఆత్యంతికశోకతరణమునకు ఆత్మజ్ఞాన మొక్కటియే ఉపాయము. దానిచే, విముక్తుడ నగుదును గాక! అని ఆర్తితో, ఉత్కటజిజ్ఞాసాసహిత దృఢనిశ్చయ శాలియే, ఈ మోక్ష శాస్త్రమున కధికారి. అత్యంతము అజ్ఞుడు కాని, తద్జ్ఞుడు కాని, ఈ శాస్త్రమున కధికారి కాడు.*

## భారతీయచింతనపై యోగవాసిష్ఠ ప్రభావము.

భారతీయచింతన నీగ్రంథము అమితముగ ప్రభావిత మొనరించినది. భర్తృహరి యోగీంద్రుని వైరాగ్యశతకము, వాక్యపదీయము, గౌడపాదుని మాండూక్యకారికలు, శంకరుని వివేకచూడామణి, మహావాక్యదర్పణము, సురేశ్వరుని మానసోల్లాసము, విద్యారణ్యుని పంచదశి, జీవన్ముక్తివివేకము, మఱియు, అనేక లఘూపనిషత్తులు (Minor-Upanishads) నారాయణభట్టు భక్తిసాగరము, ఆత్మారామ యోగీంద్రుని హఠయోగప్రదీపిక, శ్రీరామగీత, ప్రకాశాత్ముని వేదాంతముక్తావళి-ఇత్యాది

★ "అహం బద్ధో విముక్తః స్యా మితి యస్యాఽస్తినిశ్చయః ।
నాఽత్యన్త మజ్ఞో, నోతద్జ్ఞః, సోఽస్మిఞ్ఛాస్త్రేఽధికారివాన్" (యో.వా. I- 2-2)

మఱియు చూడు:- అనుబంధచతుష్టయము-యో.వా.సం. ప్రథమసర్గ-శ్లో.3 - పాదటీక.

గ్రంథకోటిపై. దీని ప్రభావము ప్రస్ఫుటముగ గాన్పించుచున్నది. ఈ వాస్తవము లన్నియు, ప్రముఖభారతీయతత్త్వదర్శనము లందు యోగవాసిష్ఠ మొక పరమప్రామాణికమోక్షశాస్త్రమని చాటుచున్నవి. భారతీయచింతనేతిహాసమున సహస్రాధికసంవత్సరములుగ నీ గ్రంథము వేదోపనిషత్తులతో సమానస్థానము నధిగమించి పరమాదరణీయ మైయున్నది.

ఈ మహాగ్రంథమునకు 'యోగవాసిష్ఠ మహారామాయణ తాత్పర్య ప్రకాశ'మను విశదమనోజ్ఞము, ప్రసన్న గంభీరమునైన వ్యాఖ్యను పరమహంస శ్రీమదానంద బోధేంద్రసరస్వతి యను యతీంద్రుడు రచించియున్నాడు. ఈ మహాసంహితాఽభిహితమగు నర్థమును దర్శించి గ్రహించుట కిది **దివ్యదీపము.**

ఆనందబోధేంద్రసరస్వతీకృతవ్యాఖ్యాసహితముగ,. సంపూర్ణ యోగవాసిష్ఠమును, రెండు సంపుటములుగ, నిర్ణయసాగరముద్రణాలయము (బొంబాయి)వారు మొదట, 1918 సం॥న చక్కగా ముద్రించి, ప్రకటించినారు. ప్రస్తుతము దీని తృతీయావృత్తిని (Third edition) మున్షిరామ్ మనోహర్‌లాల్ అను గ్రంథప్రకాశకులు (Munshiram Manoharlal, Publishers Pvt. Ltd. New Delhi) రెండు సంపుటములుగ, 1981 సం॥న ముద్రించి ప్రకటించియున్నారు.

**బృహత్పరిమాణమగు** నీ గ్రంథము శ్రవణ, మనన, నిదిధ్యాసనములకు, స్వాధ్యాయమునకు, సులభసాధ్యము కాకుండుట వలన, క్రీ.శ. **తొమ్మిదవ శతాబ్దపూర్వార్ధమున** కాశ్మీరదేశస్థుడగు గౌడబ్రాహ్మణుడు, **అభినందు డను** పండితుడు, **షట్ సహస్ర(6,000) శ్లోకపరిమితముగ,** నీ గ్రంథమును **'లఘువాసిష్ఠ'** మను పేర సంగ్రహించినాడు. లఘువాసిష్ఠమున మొదటి మూడు (వైరాగ్య, ముముక్షు, ఉత్పత్తి) ప్రకరణములకు **'ఆత్మసుఖుడ'**ను మహాత్ముడు రచించిన **'వాసిష్ఠ చంద్రిక'** యను వ్యాఖ్యయు, తరువాతి మూడు (స్థితి, ఉపశమ, నిర్వాణ) ప్రకరణములకు **'ముమ్మడి దేవరాయకృతమగు, 'సంసారతారణి'** యను వ్యాఖ్యయు కలవు. ఈ రెండు వ్యాఖ్యలు, మూల సహితముగ, నిర్ణయసాగర ముద్రణాలయమున (బొంబాయి) **1888సం॥న** ముద్రితము.

యోగవాసిష్ఠమున ప్రస్తుతము మనకు లభ్యమైన ప్రతులందు **27687శ్లోకములు మాత్రమే** యున్నవి. లఘుయోగవాసిష్ఠమున **ఆఱువేల (6,000) శ్లోకములకు బదులు 4829 శ్లోకములు** మాత్రమే లభించుచున్నవి. దీనిని **శ్రీ కె. నారాయణస్వామి అయ్యరు,** ఆంగ్లమున ననువదించిరి (1896). 'ది అడయార్ లైబ్రరీ అన్డ రిసర్చిసెంటర్ (The Adyar Library and Research Centre,

Madras) వారిచే నిది, మొదట (1896) ముద్రితమైనది. దీని ద్వితీయావృత్తి. (1971- Second Edition) సైతము. మరల 1987సంllన వారిచేతనే పునర్ముద్రితము. ఇది శ్లోకతాత్పర్యానువాదము మాత్రమే. శ్లోకసంఖ్య నిది తెలుపదు.

లఘుయోగవాసిష్ఠమున సైతము. వైరాగ్యాది షట్ (6) ప్రకరణముల క్రమమే పాటింపబడినది. తెలుగున ముందు పేర్కొన్న పద్యద్విపదకావ్యములు, వెన్నెలకంటి సుందరరామశర్మకృతజ్ఞానవాసిష్ఠము (వచనము), ఈ లఘుయోగవాసిష్ఠమునే మూలముగ గైకొని అనుసరించినవి. **వావిళ్ళరామస్వామిశాస్త్రులు & సన్సు (మద్రాసు)** వారు **లఘుయోగవాసిష్ఠమున**పూర్వము, తాత్పర్యసహితముగ ముద్రించి ప్రకటించినారు. ప్రస్తుత మీ గ్రంథములు అలభ్యములు.

శ్రీ 'సంవిద్' గారిచే నాంగ్లమున ననువదింపబడి, 'The Essence of Yogavasishtha' – అనుపేర **'సమతాబుక్సు'** (Samata Books, Madras-1982) వారిచే ఈ **యోగవాసిష్ఠ** సంగ్రహము మూలసహితముగా ప్రకటింపబడి యున్నది.

ఆధునికులైన ఆధ్యాత్మికబోధమూర్తులగు శ్రీరామకృష్ణపరమహంస, **స్వామివివేకానంద, స్వామిరామతీర్థ,** భారతరత్న శ్రీ భగవాన్‌దాసు, మొదలగు మహాత్ములకీ **శాంతిసంహిత,** (Science of Peace) అత్యంత ప్రీతిపాత్రము. **స్వామి రామతీర్థులు** తమ అమెరికా ఉపన్యాసములలో నొకట, యోగవాసిష్ఠము నిట్లు ప్రశంసించినాడు.

**"ఈ ప్రపంచమున మహోత్తమ గ్రంథములలో నొకటి, నాకు అత్యద్భుతమైనది, అపూర్వ రచితము నైనది యోగవాసిష్ఠము. దైవ చేతనా సాక్షాత్కార రహితముగ, నెవరును దీనిని పఠింపజాలరు.*

యోగవాసిష్ఠకర్తయు, తన కృతి యొక్క **నిరుపమానతమమహత్త్వమును, సౌందర్యమును, ప్రభావమును,** గూర్చి, అనేక సందర్భములందు ప్రకటించి యుండుటకు ముందు ఉదాహరించిన శ్లోకములే ప్రమాణములు.

**ఉపదేశ పద్ధతి :-** పఠితలకు హృదయంగమముగా, సత్యమును బోధించుటకు, **ఉపనిషత్తులు, మహాభారతము, భాగవతము, బుద్ధజాతక కథలు,** అవలంబించిన మార్గమునే, ఈ మహాకవి (మహర్షి) అవలంబించినాడు.

★ "One of the greatest books and the most wonderful according to me, ever written under the sun is the 'Yoga vasishtha', which nobody on earth can read without God-consciousness. (In the woods of God realisation – Delhi Edition - Vol III-P. 295)

## ఉపమాదృష్టాంతయుక్తజ్ఞాననిరూపణము.

హృదయంగమము, ఉపమాదృష్టాంతయుక్తము, మధురపదార్థ సహితము నైన వాక్కు శ్రోతృహృదయమున ప్రవేశించి, సందేహనివారిణియై, జలమందు తైలము వలె, హృదయమున వ్యాపించును. దృష్టాంతరహితము, శబ్దశాస్త్ర సమ్మతము కాని కఠోరవర్ణములతో కూడినది, అస్ఫుటము, క్రోధావేశాది వశమున క్షుబ్ధము, నైనవాక్కు, శ్రోతృహృదయమున ప్రవేశింపజాలదు. భస్మహవ్యమువలె నది వ్యర్థమై నశించును. రమ్యకథాకలితము, మనోరంజకమునగు వాక్కు, భువనమునకు పండువెన్నెల, వెలుగును, చల్లదనమును కల్గించునట్లు, హృదయమునకు జ్ఞానమును, శాంతిని, ప్రసాదించును.(1) తన యుపదేశమును సుబోధమొనరించుటకు వసిష్ఠుడు ఉపమాన, దృష్టాంత, ఆఖ్యాయికలను ఆశ్రయించును. దృష్టార్థ (సాదృశ్య) రహితముగ, అదృష్టార్థ (అపూర్వార్థ) మేదియు, రాత్రి, దీపము లేకుండ, గృహమున పదార్థదర్శనము, ఉపస్కరణము (అలంకారము), సంభవింపని యట్లు అవబోధము కానేరదు. సాదృశ్యబలమున ప్రకృతార్థనిర్ణయమును సాధ్య మొనరించునదియే దృష్టాంతము.(2)

---

(1) యత్కథ్యతే హి హృదయంగమయోపమాన-
యుక్త్యా గిరా మధురయుక్త పదార్థయా చ।
శ్రోతు స్తదఙ్గ! హృదయం పరితో విసారి,
వ్యాప్నోతి తైల మివ వారిణి వార్య శఙ్కామ్॥
త్యక్తో పమాన మమనోజ్ఞ పదం దురాపం,
క్షుబ్ధం, ధరావిధురితం, వినిగీర్ణవర్ణమ్।
శ్రోతు ర్నయాతి హృదయం ప్రవినాశ మేతి,
వాక్యం కిలాఽఽజ్యమివ భస్మని హూయమానమ్॥
ఆఖ్యానకాని భువి యాని కథాశ్చ యా యా,
యద్యత్ప్రమేయ ముచితం పరిపేలవం వా।
దృష్టాన్త దృష్టి కథనేన తదేతి సాధో!,
ప్రాకాశ్య మాశు భువనం సితరశ్మినేవ॥ (యో.వా. III–84.45–47)
(ధరావిధురితమ్ – వ్యస్థాన విచ్యుత వర్ణమ్॥
వినిగీర్ణవర్ణమ్ – గ్రస్తాక్షరమ్॥ యో.వా.తా.ప్ర.)

(2) "యేనేహాఽ వమభూతేఽ ర్థే, దృష్టేనాఽ ర్థేన బోధనమ్
బోధోపకార ఫలదం, తం దృష్టాన్తం విదుర్బుధాః॥"
దృష్టాన్తేన వినా రామ! నాఽపూర్వాఽర్థోఽవ బుధ్యతే-
యథా దీపం వినా రాత్రౌ, భాణ్డోపస్కరణం యథా॥ (యో.వా. II–18.50,52.)

## యోగశబ్దవివరణము

యోగవాసిష్ఠమందలి యోగశబ్దము ప్రత్యేకముగ, భక్తి, జ్ఞాన, కర్మ యోగములను గాని, అష్టాంగ యోగమును గాని, హఠయోగమునుగాని, నిర్దేశింపదు. నరుడు తన సోపాధికాత్మను (finite self) - నిరుపాధికమగు పరమాత్మతో నైక్య మొనరించు పథము నిది నిర్దేశించును. ఇది అత్యంతము ఆంతరమగు పథము. ఈ విభిన్న యోగములన్నియు, అనేకములగు దాని అంశరూపములు. అట్లని, ఇది ఆయోగము లన్నిటి యొక్క సమన్వయమును కాదు. **ఇది అవిభాజ్యమైన (అఖండమైన) పూర్ణయోగము.** వివిధ యోగములన్నియు కేవలము దాని ఆంశికసూత్రీకరణములు.

బ్రహ్మాత్మలాభా దపరం, విద్యతే న జగత్త్రయే ।
యేన విస్మృత్య నిఖిలం, స్వారాజ్యే సుఖ మశ్నుతే ।★

"యత్రోపరమతే చిత్తం, నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాఽఽత్మనాఽఽత్మానం, పశ్యన్నాత్మని తుష్యతి ॥
"సుఖ మాత్యన్తికం యత్తద్బుద్ధి గ్రాహ్య మతీన్ద్రియమ్।
వేత్తి యత్ర న చైవాఽయం స్థిత శ్చలతి తత్త్వతః ।"
"యం లబ్ధ్వా చాఽపరం లాభం, మన్యతే నాఽధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన, గురుణాఽపి విచాల్యతే ।
తం విద్యా ద్దుఃఖ సంయోగవియోగం యోగసంజ్ఞితమ్ ॥

(భ.గీ.VI-20,21,22,23)

ముల్లోకములందును, బ్రహ్మాత్మలాభమున కంటె నుత్కృష్టలాభము మఱియొకటి లేదు. దీనిచే సర్వమును విస్మరించి స్వారాజ్యమున (మోక్ష రాజ్యమున) నరుడు పరమసుఖమును పొందును.

---

★ పోల్చు:- "రిరంసా యది తే తస్మాదధ్యాత్మే ధీయతాం మనః ।
ప్రశాన్తా చాఽనవద్యా చ, నాస్త్యధ్యాత్మసమా రతిః ॥
న తత్ర కార్యం తూర్యైస్తే, న స్త్రీభి ర్న విభూషణైః ।
ఏకస్త్వం యత్రతత్రస్థస్తయా రత్యభిరంస్యసే ।"
(అశ్వఘోషుడు - సౌందరనందము-XI-34,35)
నీవు ఆనందము నాకాంక్షించినచో, అధ్యాత్మయందు నీ మనస్సును సంలగ్నమొనర్పుము. అధ్యాత్మరతికి (ఆనందమునకు) సమానమైన ఆనందము (రతి), ఇతరమేదియు లేదు. ఈ అధ్యాత్మరతి యందు, వాద్యవిశేషసహితసంగీతముతో గాని, యువతులతోగాని, విభూషణములతోగాని, అవసర ముండదు. ఎక్కడైనను, ఏకాంతమున నున్నను, అక్కడనే, నీవు ఈ అధ్యాత్మానందము రమించుచుందువు.

యోగానుష్ఠానము చే, చిత్త మెపుడు సర్వవిధములం నివారితప్రచారమై, ఉపరతిని పొందునో, ఎపుడు పరిశుద్ధాంతఃకరణమున యోగి, ఆత్మచైతన్యమును (జ్యోతిఃస్వరూపమును) దర్శించు చు, పరితుష్టిని పొందు చుండునో, (అఖండానంద భరితుడగునో), ఎందు ఇంద్రియనిరపేక్షము, బుద్ధి గ్రాహ్యము, అతీంద్రియమునగు అనంతసుఖము ననుభవించునో, మఱియు నెపుడు ఆత్మస్వరూపమున స్థితుడై, అందుండి, అణుమాత్రమైనను చలింపడో (చ్యుతి పొందడో), -

ఏ యాత్మలాభమును ప్రాపించి, నరుడు, అపరము (లాభాంతరము)ను దీనికంటె నధికమని భావింపడో, శస్త్రనిపాతాది లక్షణమగు **మహత్తర దుఃఖముచే** సైతము **చలింపడో**, దుఃఖసంయోగ రహితమైన అదియే, '**యోగము**'నబడునని తెలియవలెను. ఈ గీతాశ్లోకములే, యోగవాసిష్ఠమందలి యోగశబ్దమునకు పరిపూర్ణమైన, సమ్యగ్రూపమైన వ్యాఖ్యానము. యోగవాసిష్ఠ మీపరమావస్థను **సమదర్శనమని - సర్వభూతములందు ఐకాత్మ్య దర్శనమని, జ్ఞానుల నిర్విక్షేప సుఖస్థితి కిది జలమునకు సేతువు వలె హేతువని ప్రశంసించును.**

**"సర్వసౌహార్ద జననీం, సర్వస్యాఽఽశ్వాసకారిణీమ్।**
**సమతా మల మాశ్రిత్య, విహర్తవ్య మిహాఽ నఘ!॥"**

(యో.వా. VI నిర్వాణ-ఉత్తర 198-7)

సర్వభూతములందును, ఐకాత్మ్యదర్శనము వలన, **గుణదోషదర్శన వైషమ్య రాహిత్యమును**, స్వదేహసమాన సుఖదుఃఖ దృష్టిత్వమును, సర్వవైషమ్య రహితమగు బ్రహ్మదృష్టిని దృఢముగ నాశ్రయించి, ఈ జగమున వ్యవహరింప వలెనని వసిష్ఠుని ప్రబోధము.

## యోగవాసిష్ఠమున భక్తి

**"ఆత్మా ప్రియః సమస్తస్య ప్రియం నేతర దాత్మనః।**
**అచ్ఛిన్నా తైలధారావత్ప్రీతి ర్భక్తి రుదాహృతా॥**
**అభిన్నం స్వాత్మతః ప్రీత్యా, విజానా తీశ్వరం కవిః।**
**జానన్నప్యపరో భిన్నం, లీన ఆత్మని తిష్ఠతి॥**
**వహన్తీ తైలధారా వ ద్యా ప్రీతిః పరమేశ్వరే।**
**అవిచ్ఛతోఽపి సా బుద్ధిం స్వరూపం నయతి ధ్రువమ్॥**

(అరుణాచల రమణ మహర్షి-రమణగీత XVI- 2,3,4)

"అందఱికిని ఆత్మ ప్రియమైనది. ఆత్మకంటే ప్రియమైనది వేఱేదియును లేదు. **అవిచ్ఛిన్న తైలధారవంటి ప్రీతియే భక్తి.**

విద్వాంసు డీశ్వరుని, తన ఆత్మతో అభిన్నునిగా ప్రీతిచే తెలిసి కొనుచున్నాడు. మఱియొకడు, ఈశ్వరుడు తనకంటే భిన్నుడని తెలియుచు, ఈశ్వరభక్తిచే ఆత్మయందు లీనుడై యున్నాడు.

పరమేశ్వరుని యందు తైలధార వంటి అవిచ్ఛిన్నమగు ప్రీతి, కోరకున్నను, బుద్ధిని, నిశ్చయముగా ఆత్మ స్వరూపమును బొందించుచున్న" దని రమణమహర్షి యుపదేశము. వసిష్ఠుని ఉపదేశమును ఇదియే.

ఇదియే, సంపూర్ణమైన సగుణభక్తి స్వరూపమని భగవదుపదేశము. ఇట్టి అనన్యభక్తి వలననే, యథార్థముగ భగవంతు నెఱుగుటకు, సాక్షాత్కరించుకొనుటకు, ఐక్యమునందుటకు, సంభవమగును.

"భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున! ।
జ్ఞాతుం, ద్రష్టుం చ, తత్త్వేన ప్రవేష్టుం చ, పరంతప ! ।"

(భగీ. XI-54) చూడుః— భాగ. XI-14-16)

తాము ప్రపన్నుల మనియు, భగవచ్ఛరణాగతుల మనియు, చెప్పుకొనుచు సోమరులు (అలసులు) యథార్థమును గ్రహింపక, తమోగుణవశులై, స్వప్రయత్నమును, మనోనిగ్రహరూపమైన సాధననిష్ఠను పరిత్యజించి భ్రష్టులగుదురని, వసిష్ఠుడు, ఉపదేశారంభమున పురుషప్రయత్నమును, అప్రమాదమును, ప్రధానముగ నుపదేశించి నను, ఉపదేశపరిణామమున సాకార,నిరాకార,నిష్ఠలను (సగుణనిర్గుణ ఆరాధనలను) బోధించినాడు. ఉపదేశోపసంహారమున, ఈశ్వరానుగ్రహరహితముగ జ్ఞానసిద్ధి దుర్లభమని ఉపదేశించినాడు. (చూడు : సర్గ 23— అర్జునోపాఖ్యానము, సర్గ 24— శ్లోలు33–35 పాదటీక, —సర్గ 32— శ్లోలు 8,9 పాదటీక)

## సగుణారాధన స్వరూపము

భగవంతునికి నామరూపములు కల్పించుట వలన, ఆనామరూపముల చేతనే ప్రపంచము యొక్క నామరూపములను మనుజుడు జయింపగలడు.

సగుణరూపభగవన్మూర్తి ధ్యానవందనస్తుతికీర్తనలు, ఈశ్వరార్పిత సత్కర్మాచరణము. వైదికనైమిత్తికకర్మానుష్ఠానము, పర్వసమయపుణ్య వ్రతానుష్ఠానములు, మొదలగునవి సగుణారాధన యందలి అంతర్భాగములు,

క్షుదార్తులకు ఆహార ప్రదానము, ఆపన్నులకు సాహాయ్యము, ఉపకృతి, రోగార్తులకు ఉపచారము, సేవ, జిజ్ఞాసువులకు జ్ఞానదానము – ఇవి యన్నియు సగుణారాధన యొక్క వివిధ రూపములు. భగవంతుడు సర్వభూతమయుడై యుండుట వలన, సర్వభూతాళియందును అవ్యభిచారభక్తి, (సర్వభూతహితరతి) కర్తవ్యము.

"ఏవం సర్వేషు భూతేషు, భక్తి రవ్యభిచారిణీ ।
కర్తవ్యా పణ్డితైర్జ్ఞాత్వా, సర్వభూతమయం హరిమ్ ॥"
(ప్రహ్లాదుడు – విష్ణుపురాణము)

నిరతాత్మరతులగు ముక్తపురుషులు సైతము లోకసంగ్రహార్థము ఈ ధర్మము ననుష్ఠింతురు. ( చూడుః- వసిష్ఠోపదేశము - సర్గ XXXII - శ్లోలు 17, 18 వివరణ పాదటీకలు).

"ఈశ్వరార్పితం నేచ్ఛయా కృతం ।
చిత్తశోధకం ముక్తిసాధకమ్ ॥
కాయవాఙ్మనః కార్య ముత్తమమ్ ।
పూజనం జప శ్చిన్తనం క్రమాత్ ॥
జగత ఈశధీ యుక్తసేవనమ్ ।
అష్టమూర్తి భృద్దేవపూజనమ్ ॥"
(ఉపదేశసారము –3,4, 5– భగవాన్ శ్రీరమణమహర్షి)

ఈశ్వరార్పితము, ఫలాభిసంధిరహితమునైన కర్మాచరణము, చిత్తశుద్ధిని కల్గించి, మోక్షమునకు హేతువగుచున్నది. జగత్తు పరమాత్మస్వరూపమే యను బుద్ధిచే నొనర్చిన జగత్తు యొక్క సేవ, అష్టమూర్తియగు పరమేశ్వరుని ఆరాధన కాగలదు. ప్రాణుల కొనర్చు మేలు భగవంతునికి పూజనమే.

("పూజనము కాదా ప్రాణిమేల్ చక్రికిన్? ॥" - ఆముక్తమాల్యద - శ్రీకృష్ణదేవరాయలు – )

అవతారమూర్తుల, జగద్గురువుల, జీవనచర్యలు ఇందుకు దృష్టాంతములు.

"మత్కర్మకృ న్మత్పరమో, మద్భక్త స్సఙ్గవర్జిత: ।
నిర్వైర స్సర్వ భూతేషు, యః స మామేతి పాణ్డవ ! ॥" (భ.గీ.XI-55)

భగవదర్థమై కర్మలనాచరించుచు, భగవంతునే పరమపురుషార్థముగ

భావించుచు, ధన, మిత్ర, పుత్ర, కళత్రాదులందు ఆసక్తిని వర్జించి, భగవంతు నాశ్రయించి, సర్వజీవుల యెడ (శత్రువులందు సైతము) వైరభావము లేని మనుజుడు, భగవంతుని ప్రాపించును.

## సమదృష్టి ప్రశంస

బాహ్యములగు సర్వసంపదలు, సకల కళ్యాణ గుణములు, సమదర్శనము, వర్ధిల్లజేయును. సమతాలత, సర్వభూత మైత్రీరూపమగు ఫలమును ప్రసాదించును. **సమదర్శనముతో సర్వభూతహితేచ్ఛ** గల్గి, వానికి హితమాచరించువారికి, ఈ సర్వజగల్లక్ష్మియు, భృత్యత్వము వహించును. సమదర్శనము వలన సిద్ధించు సారసుఖము, రాజ్యప్రాప్తి వలన గాని, కాంతా సంగమము వలన గాని, లభించునది కాదు.[1]

"సమత్వ మారాధన మచ్యుతస్య" । (వి.పు. అంశ I-17-90)
అని విష్ణుపురాణము సమదర్శనమును వర్ణించును[2]

## యోగవాసిష్ఠము యొక్క కొన్ని విశిష్టపరిస్ఫుటలక్షణములు

### 1. యుక్తియుక్తమగు శాస్త్రమే, ఉపాదేయము.

కారణవిమర్శరూపమగు **హేతుబుద్ధికే, వసిష్ఠుడు ప్రాధాన్య మొసగును.** పురుష నిర్మితమైనను, శాస్త్రము యుక్తి యుక్తముగ తత్త్వనిరూపణ చేసినచో, అది ఆదరణీయమే. తదితరమైనది వేదమైనను, న్యాయైకసేవనులగు వారికి

---

(1) **"సర్వసంపత్తి సుఖగం, సర్వసౌభాగ్యవర్ధనమ్।
సమతాసులతాయాస్తు, ఫలం భవతి పావనమ్।
సమతా సుభగేహానాం, కుర్వతాం ప్రకృతం క్రమమ్।
సర్వైవేయం జగల్లక్ష్మీ ర్భృత్యతా మేతి రాఘవ !!
న తదాసాద్యతే రాజ్యా న్న కాన్తాజనసఙ్గమాత్।
అనపాయి సుఖం సారం, సమత్వాద్యదవాప్యతే।"**
(యో.వా. VI నిర్వాణ-ఉత్తర - 198.7-10)

(2) పోల్చు :- **"యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవాఽనుపశ్యతి।
సర్వభూతేషు చాఽఽత్మానం, తతో న విజుగుప్సతే"
"యస్మింత్సర్వాణి భూతాని, ఆత్మైవాభూద్విజానతః
తత్ర కో మోహః? కః శోకః? ఏకత్వ మనుపశ్యతః"** (ఈశావాస్యోపనిషత్-6,7)
బ్రహ్మాది స్థావరాంతమగు సమస్త భూతజాతమును ఆత్మయందును, అట్లే సర్వభూతములందు ఆత్మను, దర్శించువానికి ఏదియు జుగుప్స కల్గింపదు. దేనిని అతడు నిందింపడు. సర్వభూతములును, పరమాత్మ దర్శనము వలన, తన ఆత్మయే యని తెలిసికొన్న వానికి – శోకమోహములు సంభవింపవు. ఏకత్వ దర్శనమువలన, మూలావిద్యనశించుటచే, శోకమోహాదుల ఆత్యంతిక నివృత్తి సిద్ధించుచున్నది.
**మఱియు భ.గీ. VI -18-20**

త్యాజ్యమే. బాలుడు వచించినను, యుక్తియుక్తమైనదే **ఉపాదేయము.** అట్లుకానిది, బ్రహ్మయే వచించినను, తృణము వలె త్యజింపవలెను. (యో.వా. II- 18.2,3)

## 2. స్వానుభూతి (ప్రత్యక్షానుభూతి) యే పరమప్రమాణము

జ్ఞానముయొక్క ఆత్యంతికమగు మూలము ప్రత్యక్షానుభూతి. **పరమేశ్వరుడు, శాస్త్రముచే గాని, గురువులచే గాని, ప్రత్యక్షముగ గోచరింపడు. అహంతామమతా రహితమగు స్వీయబుద్ధిచేతనే, తన స్వరూపముగ దర్శితుడగును.**

(యో.వా. VI పూర్వ - 118-4)

జలమునకు సాగర మాధారమైయున్నట్లు, **సర్వప్రమాణములకును, స్వానుభూతియే**(ప్రత్యక్షమే) **ఆధారభూమి.**స్వానుభూతి రహితముగ **కేవలము అనుమాన, ఆప్తవచనప్రమాణముల వలన, ఆత్మసాక్షాత్కారము సిద్ధింపదు.** సర్వకాలములందును. సర్వవిధముల చేతను, సర్వమునగు **ఆత్మ, స్వానుభూతి వలననే సిద్ధించును.** (యో.వా. II 19.16) సర్వప్రమాణములకు ఇంద్రియములు సారము (ప్రధానము). అట్లే సర్వేంద్రియములకును అపరోక్ష (ప్రత్యక్ష)మగు వేదనము (జ్ఞానము) సారము. అదియే ముఖ్యమైన ప్రత్యక్షము. (యో.వా. II-19-17)

## 3. సర్వధర్మైకాత్మ్యము (సర్వధర్మసమానత్వము)

విశ్వజనీనత, ఔదార్యము, అన్యాభిప్రాయగౌరవము, అను నవి, **వాసిష్ఠ దర్శనము యొక్క మఱియొక వైలక్షణ్యము.** ప్రతిదృష్టిని గౌరవించి, సాధ్యమైనంత **సానుభూతితో,** అవగాహన మొనర్చుకొనుట కిది ప్రయత్నించినది.

**పారమార్థికమైన బ్రహ్మపదము, సర్వజనులకు, పొందదగినది(గంతవ్యము).** విభిన్నకాలములలో, విభిన్నదేశములలో, నుదయించిన తత్త్వసిద్ధాంతములు - విభిన్న మార్గములు, **అధ్వగుల(బాటసారుల)ను, ఒకే పురమును చేర్చుచున్నట్లు.** ఆ పరతత్త్వమునే ప్రాపింపజేయుచున్నవి. కాని, పరమార్థమును గుఱించిన అజ్ఞానమువలన, విపరీతజ్ఞానమువలనను, ఆరురుక్షువులగుసాధకులు **వికల్పములతో,** వాదోపవాదమగ్నులగుచు, ప్రతిపథికుడు, తన మార్గమే యుత్తమ మని భావించునట్లు తన మతమే, సర్వోత్తమమని ప్రశంసించు

కొనుచున్నారు.[1]. ఎవనికి చిరకాల ముపాసితమైన ఏదేవత వలన, పూర్వము స్వాభిలషితము సిద్ధించినదో, అతనికి ఆ దేవత తప్ప, అన్యగతి యుండదు. అన్యమార్గము శోభింపదు; హితకరము, ఫలప్రదముకాదు.[2]
(యో.వా. VI ఉత్తర. 130.2)

## 4. అధ్యాత్మపథమున స్త్రీ పురుష సమానత్వము

ఆధ్యాత్మిక లౌకిక విషయములందు స్త్రీ పురుష సమానత్వమును[3] వసిష్ఠుడు

---

(1) 'సర్వైరేవ చ గన్తవ్యం, తైః పదం పారమార్థికమ్।
విచిత్రం దేశకాలోత్థైః, పురమేక మివాఽధ్వగైః ।
అజ్ఞానా త్పరమార్థస్య, విపరీతాఽవబోధతః ।
కేవలం వివద న్త్యేతే, వికల్పై రారురుక్షవః ।
స్వమార్గ మభిశంసన్తి, వాదిన శ్చిత్రయా దృశా।
విచిత్రకాలదేశోత్థా, మార్గం స్వం పథికా ఇవ।" (యో.వా. III-96.51-53)
"**There is only Truth** but there are so many ways of experiencing Him. And there aught to be as many beliefs. as there are experiences of God. **Authentic and important beliefs are but statements of men's realisation of their own inherent Godhood.** Look, how experiences and statements of them differ in such objective matters as the sun–men's experiences differ exceedingly. **An African's feeling of the sun is quite different from that of a Laplander.** They have different stories to tell about the cycles of the sun: **the former believes that it shines twelve hours a day, while the latter holds that it shines for six months in a year.** Yet it is the same sun. Similarly, with our experience of God. **Though we all realise the One Beloved, our ways of stating Him are quite different. yet all of them verify and magnify His 'Thousand-facedness'. Instead of seeing the same bleak, flat face all the time, we all see many different faces of the One Face of Silence. Does not that make the Lord all the more interesting?" – (The Face of Silence** - Dhan Gopal Mukerji - P. 113–Great Books - "Dinantika", Howrah–Reprint - 1991)

(2) "యేనైవాఽభ్యుదితా యస్య, తస్య తేన వినా గతిః ।
న శోభతే, న సుఖదా, న హితాయ, న సత్ఫలా" (యో.వా. VI ఉత్తర - 130.2)
మఱియు చూడుః- సర్గ XVIII-శ్లోలు 36-40. వివరణ పాదటీకలు. పుటలు 247-249

(3) "The Atman dwells within the hearts of all and therefore is this path open to all without distinction of race. caste. or sex.....
This path. calling only for sincere self-giving. needs no scriptural or philosophic learning and so is available for all. since all the knowledge that

స్థాపించును. పురుషుని కంటే, స్త్రీ యెందునను న్యూనము (తక్కువ) కాదని **యోగ వాసిష్ఠ సిద్ధాంతము.** ఉన్నత జ్ఞానభూమికల నారోహించు శక్తి కల్గియుండుట మాత్రమే కాక, స్త్రీ, తన పతియగు పురుషుని, అతిక్రమించి, అతనిని జ్ఞాన పథమున నడిపించి, సముద్ధరింపగలదనుట, యిందు '**చూడాలో పాఖ్యానము**'న నిరూపింపబడినది.

## 5. పత్నీ గౌరవము (కులాంగనా మహత్త్వము)

అనాదియు, అనంతగహనమునైన మోహాంబుధి నుండి తమ పతులను **ప్రయత్నశాలినులగు కులాంగనలు** తరింపజేయగలరు.(1) **స్నేహశాలినులగు సతులు** తమ పతులను సముద్ధరించునట్లు, **శాస్త్రార్థ** గురుమంత్రాదులు సైతము సముద్ధరింప సమర్థములుకావు. కులాంగన (పత్ని)యే పతికి, సఖుడు, సోదరుడు సుహృత్తు, భృత్యుడు, గురువు, మిత్రము, ధనము, సుఖము, శాస్త్రము, గృహము, దాసుడు, సమస్తము నగును.కాన, సతతము, సర్వప్రయత్నములచే **కులాంగనలు (పత్నులు) పూజనీయలు**(2) అందున, ఇహపరలోక సుఖము సంపూర్ణముగ ప్రతిష్ఠితమగును.

(యో.వా. VI పూర్వ - 109)

**అరుంధతీవసిష్ఠులదాంపత్యమే** దీనికి నిదర్శనము. **లీలోపాఖ్యానము, చూడాలో పాఖ్యానము,** ఈ సత్యమును మనోజ్ఞముగ స్థాపించుచున్నవి.

---

is needed comes of itself to him who gives himself.
(The yoga of Bhagavad Gita - Chapter IX –p.88 – Sri Krishna Prem - New order Books Co., Ahmedabad - 1982)

(1) "మోహా దవాది గహనా దనన్త గహ నాదపి ।
**పతితం వ్యవహాయిన్య స్తారయన్తి కులస్త్రియః ।**
**శాస్త్రార్థ గురుమన్త్రాది, తథా నోత్తరణక్షమమ్ ।**
**యథైతాః స్నేహశాలిన్యో, భర్తౄణాం కులయోషితః ।**
**సఖా, భ్రాతా, సుహృ ద్భృత్యో, గురు ర్మిత్రం, ధనం, సుఖమ్ ।**
**శాస్త్ర మాయతనం, దాసః, సర్వం భర్తుః కులాఙ్గనాః ।"**

(యో.వా. VI పూర్వ–109.26,27,28)

(2) **స్త్రీలు హ్లాదినీగుణసంపన్నులని రవీంద్రుని సూక్తి.**
"The hladini (Joy-giving) qualities are native to her in a much more vivid sense and there lies the secret of what we call her charm or grace" (See: Among the great- Rabindranath Tagore-By Dilip Kumar Roy- 1950)

## 6. సర్వబంధుత్వము – సోదరత్వము

యోగవాసిష్ఠము సర్వమానవ సౌభ్రాత్రమునే కాక, సర్వజీవసోదరత్వమును స్థాపించుచున్నది. 'ఇతడు నావాడు,' 'అతడు పరుడు' –అను పరిగణన అల్పబుద్ధులది. ఉదారచరిత్రుల బుద్ధి, నిరావరణమైనది. ఏకము, సర్వగతమునైన ఆత్మకు 'ఇతడు బంధువు' 'అతడు పరుడు' అను కల్పన యెక్కడిది? శ్రీరామా! భూత(ప్రాణి) జాతులన్నియు, నీకు బంధువులే. నీతో పూర్తిగా సంబంధములేని వా రొకరును లేరు [1]

## 7. మనోమహత్త్వము

మనోరూపమున మనకు నిరవధికమైన శక్తి యున్నది. వాంఛ, కల్పన, ప్రయత్నము, సంకల్పము– ఈ రూపములలో మనస్సు, జగమున అత్యంత శక్తి సంపన్నము. మనస్సు, సృజనాత్మక శక్తి (creative power) యుక్తము. సృష్టి కార్యమున మనస్సు కేవలము స్వతంత్రము.[2] మానవు డాకాంక్షించిన అర్థమును పొందగలడు. మనము ప్రగాఢముగ, వాంఛించి, యత్నించిన దంతయు, అప్పుడే కాని, మఱికొంత ఆలస్యముగ కాని, మనకు సిద్ధించుచున్నది.[3]

---

(1) "అయం బన్ధు రయం నేతి, గణనా లఘుచేతసామ్ ।
ఉదారచరితానాం తు, విగతావరణైవ ధీః ।" (యో.వా. V-18.61)
"ఏకత్వే విద్యమానస్య సర్వగస్య కిలాఽఽత్మనః ।
అయం బన్ధుః పరశ్చాఽయ మిత్యసౌ కలనా కుతః ?।" (యో.వా. V-20.4)
"సర్వ ఏవ హి తే భూతజాతయో రామ! బన్ధవః ।
అత్యన్తాఽసంయుతా ఏతా స్తవ రామ! న కాశ్చన ।" (యో.వా. V-18.64)
"ఉదారచరితానాం తు విగతావరణైవ ధీః ।" –
అను పాదమునకు బదులు "ఉదార చరితానాం తు వసుధైవ కుటుమ్బకమ్"
అనుపాఠము హితోపదేశమున (మిత్రలాభ కథ –75) స్వీకరింపబడినది.
(2) "తత్స్వయం స్వైర మేవాఽఽశు, సఙ్కల్పయతి దేహకమ్
తేనేయ మిన్ద్ర జాలశ్రీ ర్వితతేన వితన్యతే ।" (యో.వా.III-4-79)
(3) "సర్వం సంపాదయ త్యాశు, స్వయం జీవః సమీహితమ్ । (III-45-12)
జీవస్యోదేతి యాశక్తి ర్యస్య యస్య యథా యథా ।
భాతి తత్ఫలదా నిత్యం, తస్య తస్య తథా తథా ।" (III-45-13)

వాస్తవముగ మన ఆకాంక్షల ననుసరించు ప్రయత్నములే, మన భవితవ్యము (అదృష్టము) యొక్క పడుగుపేకలు[1]. మనజీవితము లన్నియు, మనోనిర్మితములే. మన మనోభావనల ననుసరించియే, మనచుట్టుగల జగము మాఱుచుండును. మన వేదన (ఉపలబ్ధి)లన్నియు, మన విశ్వాసములచే రంజితములే[2]

దేశదైర్ఘ్యము, కాలదైర్ఘ్యము, అనునవి సైతము, మన మనోభావావేశ సాపేక్షములే. శ్రద్ధయే (faith) సకలసాధనవిజయముల రహస్యము [3]

బంధమోక్షములు మనోమయములే. మనస్సు యొక్క ప్రమాదవివేకములే. బంధమోక్షములకు హేతువులు. (యో.వా.III–98.3) మనపార్థివదేహము మనోనిర్మితము. మనస్సు కాంక్షించిన రూపమున, కుంభకారుడు కుంభమును వలె దానిని తీర్చి దిద్దవచ్చును (యో.వా.IV-11-19). మనస్సు యొక్క సంక్షోభము వలననే, శారీరకములైన వ్యాధులలో పెక్కులు మనకు సంభవించుచున్నవి. సమ్యక్చింతన వలనను, మనస్సును సంస్కరించుకొనుట వలనను, శారీరకములైన వ్యాధుల నుపశమింప జేసికొనవచ్చును. (యో.వా.IV-45.7; IV-11-19)

---

(1) "యచ్చిత్తం తన్మయో జన్తు ర్భవతీ త్యను భూతయః ।
నదేహేషు విదేహేషు, న భవ త్యన్యథా క్వచిత్ ।" (III-56-28)
"యథా భావన మేతేషాం, పదార్థానాం హి సత్యతా ।
భావనా చ పదార్థేభ్యః, కారణేభ్య ఉదేతి హి ।" (III-56-30)

(2) "యేన యేన యథా యద్యద్యదా సంవేద్య తేఽనఘ ! ।
తేన తేన తథా తత్తత్తదా సమనుభూయతే ।" (III-60-16)

(3) "న క్షణేహ పదార్థేషు రూపమేక ముదీర్యతే ।
దృఢభావనయా చేతో యద్యథా భావయత్యలమ్ ।
తత్తత్ఫలం తదాకారం, తావత్కాలం ప్రపశ్యతి ।
న తదస్తి న యత్సత్యం, న తదస్తి న యన్మృషా ।
యద్యథా యేన నిర్ణీతం తత్తథా తేన లక్ష్యతే ।
భావితాకాశ మాతఙ్గం, వ్యోమ హస్తితయా మనః ।" (IV-21.56-58)

"యాదృశం భావ మాదత్తే దృఢాఽభ్యాసవశా న్మనః ।
తథా స్పన్దాఖ్యకర్మాఖ్యప్రథాశాఖా విముఞ్చతి ।" (IV-21-20)

అత్యాశలు, క్లేశములు, చింతలు, ఉద్వేగములు వీనిచే చిత్తసమత్వము చెడకుండ, నిలుపుకొనగల్గినచో, శరీరములోనికి ఏ వ్యాధియు ప్రవేశింపజాలదు. సంతోషము, చిత్తసమత్వమునకు పర్యాయనామమే. (యో.వా.V.21-12,14) మనస్సు యొక్క సమ్యక్ శిక్షణమే ఆనందమయజీవనరహస్యము. భుశుండోపాఖ్యానమున నిది వ్యాఖ్యానింప బడినది. (యో.వా.VI-పూర్వ - 26.10,35)

మనము సోపాధికులమను అసద్భావనయే, దుఃఖమునకుహేతువు (IV-27.21). భౌతికశరీరావధులకు అతీతమైన స్వాత్మస్వరూపమును దృఢముగ స్థాపించుకొనుటయే, వసిష్ఠ ననుసరించి, అలౌకికసిద్ధుల పొందుటలోని రహస్యము. అసద్భావనవలన నిర్మితములైన అసత్యోపాధులను నిషేధించుట వలనను, నిరుపాధికమైన బ్రహ్మస్వరూపభావనను స్థిరీకరించుకొనుట వలనను, అతిమానుషశక్తులు మనయం దావిర్భవింపగలవు.

మన మనస్సును దేహేంద్రియోపాధులు పరిపాలించుటకు మన మనుమతింప కూడదు*. ప్రతివ్యక్తి దేహమందును, మూలాధారమున నిద్రించుచున్న కుండలినీశక్తిని

---

★ "చిత్తా ఽఽయత్త మిదం సర్వం, జగత్ స్థిరచరా ఽఽత్మకమ్ ।
చిత్తా ఽధీనావతో రామ! బన్ధ మోక్షావపి స్ఫుటమ్ ।" (III.98-3)

"సమ్యగుక్తం త్వయా బ్రహ్మన్! శరీరం మన ఏవ చ ।
కరోతి దేహం సఙ్కల్పాత్ కుమ్భకారో ఘటం యథా ।" (IV-11.19)

"మనసేదం శరీరం హి వాసనార్థం ప్రకల్పితమ్ ।
క్రిమికోశ ప్రకారేణ, స్వాత్మకోశ ఇవ స్వయమ్ ।" (IV-45.7)

"న తత్ త్రిభువనైశ్వర్యా న్నకోశాద్రత్న ధారిణః ।
ఫల మాసాద్యతే చిత్తా ద్యన్మహత్స్వేవ బృంహితాత్ ।" (V.21.12)

"పూర్ణే మనసి సంపూర్ణం, జగత్సర్వం సుధాద్రవైః ।
ఉపానద్గూఢపాదస్య, నను చర్మావృతైవ భూః ! ।" (V-21.14)

"భావాఽ భావమయీం చిన్తా మీహితాఽనీహితాన్వితమ్ ।
విసృజ్యాఽఽత్మని తిష్ఠామి, చిరం జీవా మ్యనామయః ।" (VI-పూర్వ-26.10)

"అస ద్యచంధీరోఽస్మి జగన్మిత్రం చ సంపది ।
భావాఽభావేషు నైవాఽస్మి, తేన జీవా మ్యనామయః" (VI-పూర్వ-26-35)

"అయం సోఽహం మమేదం తదిత్యా కల్పిత కల్పనః ।
ఆపదాం పాత్రతా మేతి, పయసా మివ సాగరః ।" (IV-27.21)

ప్రబుద్ధ మొనరించి, సహస్రారమును చేరుటకు దానిని నియోగింపగల్గిన, అతిమానుషములైన యోగసిద్ధులు సాధింపవచ్చును.

(చూడుః- యో.వా.సం. - సర్గ-25. శ్లో॥లు 41-46-పాదటీకలు)

## 8. ఇంద్రియసుఖస్వరూపము

**ఇంద్రియ సుఖములు, వంచనాత్మకములు.** అవి, వాంఛపైననే ఆధారపడునవి. ప్రాప్తి క్షణమున మాత్రమే అవి, తృప్తిని కల్గించును. ఆక్షణము తరువాత, అవి తృప్తిని కల్గింప జాల వనుట అందఱ అనుభవమే. **మనోవాసనాయుక్తమగు వస్తువు మాత్రమే సేవింపబడి సుఖ మొసగ గలదు. సుఖహేతువగు నదియు, నశించినపుడు, వెంటనే దుఃఖహేతువగుచున్నది.** వాసనలు శూన్యమైనపుడు, అనుభవింపబడిన పదార్థము సుఖదముగాని, నాశకాలమున దుఃఖదము గాని, కానేరదు. (యో.వా.VI పూర్వ-44.2,3,4; VI పూర్వ-120.18,19,20).

**అశాంతమైన చిత్తము,** ప్రాపంచికమైన దేనియందును తృప్తిగాంచదు. వాంఛల **కొక నిశ్చితమైన లక్ష్య మేదియును లేదు. సుఖాన్వేషణయందు, అవి, యొకదానినుండి మఱియొక దానిపైకి దూకుచుండును. ఇట్లు, మానవుని జీవిత మంతయు, నిరర్థకాన్వేషణమై, చింతాకులమైన మనస్సునకు, నే ప్రయోజనమును కల్పింపదు. సత్యమైన ఆనందస్వరూపము నెఱుగకుండుటకు (అజ్ఞానమునకు) ఫలమే, ఈ దుఃఖావస్థ. సమ్యగ్ జ్ఞానముకాక, అన్యమేదియు, విముక్తికి, యథార్థానందమునకు, మార్గము కానేరదు.**

## 9. పౌరుషప్రశంస- (మహిమ)

చిత్తవిశ్రాంతిదాయకమైన ఈ జ్ఞానము, పురుషప్రయత్నరహితముగ, ఆకాశమునుండి రాలిపడదు. సంపూర్ణపురుషప్రయత్నమే, తప్పక పరిపూర్ణ పదమును ప్రాపింపజేయగలదు. **సర్వదుఃఖనాశమునకు, పురుషప్రయత్నరూపమగు ఉపాయమునకు మించిన మార్గ మేదియును లేదు.** (యో.వా. III 6.14) ఈ సంసారమున నెవరు దేనిని కాంక్షింతురో, దానినే క్రమముగ కాంక్షించుచు, తప్పక, వారు దానిని పొందుచున్నారు (యో.వా.II-4.12). పురుష ప్రయత్నముననే, అందఱు, అన్నిటిని, ఎల్లప్పుడును పొందుచున్నారు. **ఊరక కూర్చున్న వా**

దెవ్వడును, ఏ ఫలమును పొందజాలడు (యో.వా.II-7-19).

ఎవరు ప్రయత్నమును విరమించి, కేవలము దైవము (విధి) పై ననే, ఆధారపడి యుందురో వారు, ఆత్మద్రోహులు. వారికి ధర్మార్థకామములు నశించును (యో.వా.II.7.3) దైవము (విధి) ఏమియును జేయదు. దైవ(విధి) వాదము కేవలము కల్పనానిరూఢమైన భ్రాంతి(యో.వా.II.9-3). మూఢులచే కల్పితమైన ఈ దైవ (విధి) వాదము నాశ్రయించిన వారు, నశించిరి,(యో.వా.II-8.16).

## దైవశబ్దనిరుక్తి.

పౌరుషముచే సిద్ధించిన ఫలముయొక్క శుభాఽశుభసంపత్తినే దైవశబ్దమున వ్యవహరింతురు. పూర్వజన్మమున తానొనర్చిన కర్మమే, దైవము. అంతకంటె దైవ మనునది వేఱులేదు (యో.వా.II.6.4) ప్రాక్తనజన్మ మందలి తన పౌరుష (ప్రయత్న)మే, వర్తమానజన్మమున దైవశబ్దముచే వ్యవహరింప బడుచున్నది (II-6.35).

లోకమున, ప్రసిద్ధములైన పదార్థములు, సిద్ధములయ్యును, నశించుటయు గలదు. అపుడు, నాశముగర్గించు ప్రయత్నమే, బలవత్తరమని గ్రహింపవలయును. ప్రాక్తన(వెనుకటి)పౌరుషము, ప్రస్తుతపౌరుషమును, రెండు పొట్టేళ్ళవలె పోరుచుండును. వానిలో బలవత్తరమైనదే క్షణమాత్రమున గెలుచును. (యో.వా.II-6.10)

ఆత్మను ఆత్మచేతనే సముద్ధరించుకొనవలెను. ఆత్మకు ఆత్మయే బంధువు, శత్రువును.(యో.వా.VI -ఉత్తర 162.18) *. ప్రశస్త పురుషార్థమున అభినివేశము కల్గుటకును, చిరభోగ్యములైన మన్వాదుల సంపదల పొందుటకును, సస్యములకు భూమివలె, స్వమనోనిగ్రహమే కారణము. (యో.వా.V-43.35).

## 10. ఆలస్యనింద (సోమరితనమును గర్హించుట)

బహుళాఽనర్థహేతువగు అలసత్వము (సోమరితనము) లేకున్నచో, అందఱును

---

*పోల్చు :- "ఉద్ధరే దాత్మనాఽఽత్మానం, మగ్నం సంసార వారిధౌ
యోగారూఢత్వ మాసాద్య, సమ్యగ్దర్శన నిష్ఠయా॥
(శంకరుడు-వివేకచూడామణి -9)
మఱియు భ.గీ. -VI-5,6 – ధమ్మపదం – 379,380 గాథలు

అధికధనవంతులు, బహుశ్రుతులు (అధిక విద్యావంతులు) కాగలరు. **అలసత్వము వలననే చతుఃసముద్రముద్రితమైన భూవలయ మంతయు, నరపశువులతోను, దరిద్రులతోను, నిండియున్నది★.** కాన, అలసత్వమును విసర్జించి, మానవుడు బాల్యము నుండియు, **సచ్ఛాస్త్ర విచారము, సత్సాంగత్యము, చేయుచు తన పరమశ్రేయస్సునకు ప్రయత్నశాలి కావలెను.**

## 11. మోక్షద్వారపదమునకు నలుగురు ద్వారపాలకులు

**1) సంతోషము, 2) శమము(శాంతి) 3. సాధుసంగమము, 4) విచారము–** అను నీ నాల్గును, ఆ ద్వారపాలకులపేర్లు. ఈ నాల్గుగుణములను పెంపొందించుకొనవలయును. స్వాత్మానుభూతిరహితముగ, కేవలశాస్త్ర జ్ఞానమువలన, ఆత్మ సాక్షాత్కారము సిద్ధింపదు. ( ఈసంతోషాదుల వివరణము ఈగ్రంథమున రెండవ సర్గమున నున్నది - శ్లో॥లు 42-53, పాదటీకలు)

## 12. వసిష్ఠుని రాజధర్మసిద్ధాంతము

**"ప్రభుత్వం సమదృష్టిత్వం, తచ్చస్యాద్రాజవిద్యయా ।**
**తామేవ యో న జానాతి, నాఽసౌ మన్త్రీ, న సోఽధిపః ॥"**

ప్రభుత్వ మనగా, సమదృష్టి గల్గి యుండుటయే. అట్టి ప్రభుత్వము, **విద్యలలో సర్వోత్కృష్టమైన రాజ(ఆత్మ)విద్య** (Sovereign Science), వలననే కాని, తదన్యమైన దేని వలన గాని, సిద్ధింపదు. **అట్టి రాజవిద్య నెఱుగని వాడు రాజుగా గాని, మంత్రిగాగాని, యుండుటకు–వ్యవహరించుటకు – అనర్హుడు. ఆత్మవిద్యాసంపన్నులు మాత్రమే ప్రజాహితమును – లోక కల్యాణమును సాధింపగలరు.**

ఈ ప్రమాణము ననుసరించి చూచిన, నేటి దేశపాలకుల క్షుద్రత్వము, అనర్హత్వము, దాని వలన **భారత ధాత్రికి, జాతికి, గల్గిన, కల్గుచున్న, పాతిత్యము, దుఃస్థితి, విశదమై, మనస్సును దుఃఖావిల మొనర్చుచున్నది.** భారతదేశ మహనీయ

---

★ **"ఆలస్యం యది న భవే జ్జగత్యనర్థః, కో న స్యాద్బహుధనకో?, బహుశ్రుతో వా?।**
**ఆలస్యా దియ మవనిః ససాగరాన్తా, సంపూర్ణా నరపశుభిశ్చ నిర్ధనైశ్చ॥**
**(యో.వా. ముముక్షు–II-5-30)**

సంస్కృతి, కళాసంపద, సాహిత్యము, శాస్త్రవిజ్ఞానము నశించునా? అది సంభవింపదు[1] చిరంతనధర్మగోప్తయగు భగవంతుడు నిరంతరజాగరూకుడై సకలదేశములకు జ్ఞానధాత్రియగు ఈ భారతధాత్రిని జాతి నావేశించి రక్షింపగలడు.

"ప్రళయపయోధిజలే ధృతవానసి వేదం,
విహితవహిత్రచరిత్ర మఖేదమ్ । [2]
కేశవ! ధృతమీనశరీర! జయజగదీశ! హరే!॥

అను జయదేవుని గీత గోవిందమునందలి అష్టపది, నిత్యమగు భగవద్రక్షణను వ్యంజించుచున్నది.

## 13. కర్మబంధవిముక్తిమార్గము

"ఈశ్వరాఽర్పిత సర్వాఽర్థ, ఈశ్వరాఽఽత్మానిరామయః ।
ఈశ్వరః సర్వభూతాఽఽత్మా, భవ! భూషిత భూతలః ।
(యో.వా. VI-నిర్వాణ-పూర్వ-53.18)

ఈశ్వరార్పిత బుద్ధితో, తదారాధనరూపము, ఫలాభిసంధిరహితమునగు శాస్త్రీయ కర్మాచరణమే, కర్మబంధవిముక్తికి మార్గము.[3]

(1). తన ఆధ్యాత్మికధర్మమును పరిత్యజింప నంత వఱకు, భారతదేశము అజరామరమై నిలిచి యుండగలదు.
"The Indian nation can not be killed. Deathless it stands, and it will stand so long as that spirit shall remain as the background, so long as her people do not give up their spirituality. Beggars they may remain, poor and poverty stricken, dirt and squalor may surround them perhaps through out all time, but let them not give up their God, let them not forget that they are the children of the sages. .............and so long as holiness is thus supremely venerated India cannot die."
(Swami Vivekananda - My Master- C.W. Vol. IV p. 160)
- Mayavati Memorial Edition, Advaita Ashram, Calcutta 1989)

(2) ప్రళయ కాలమున సప్తసముద్రము లేకమై, జలమయమగు ప్రపంచమున వేదములు మునిగి పోకుండ , మత్స్యావతారము నెత్తి ఓడవలెనయి, అనాయాసముగ, ఆ వేదముల భగవంతు డుద్ధరించెను కదా! గీత (IV-7.8) యందలి శాశ్వతాభయప్రదానము నమ్మకానేరదు.

(3) పోల్చి:- బ్రహ్మణ్యాధాయ కర్మాణి, సఙ్గం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన, పద్మపత్ర మివాఽమ్భసా । (భ.గీ. V-10)
మఱియు, "యథా పుష్కర పలాశ ఆపో న శ్లిష్యన్త ఏవ మేవం విది పాపం కర్మ నశ్లిష్యత ఇతి (ఛా.ఉ. IV-14.3)
ఈశ్వరార్పితముగ కర్మల నొనర్చు వానిని, జలము పద్మపత్రమును వలె పుణ్యపాపము లంటవు.

"ఈశ్వరార్పితముగ సర్వకర్మముల నాచరించువాడవై, ఈశ్వర స్వరూపుడవు, నిరామయుడవు, ఈశ్వరుడవు, సర్వభూతాత్మవునై, ఈ భూతలమ నలంకరించిన వాడవు కమ్ము". అని వసిష్ఠుని ఉపదేశము.

## 14. సంబంధము వలన అద్వైతము

కేవలము, భిన్నస్వభావములగు (విషమ) వస్తువులకు నిరంతర సంబంధము, అసంభవము. ఈ రెంటికిని పరస్పరసంబంధము లేకున్న, పరస్పరానుభవ ముండదు. సంబంధమనగా ఏకత్వమే. అసమానవస్తువులకు ఏకత్వము సిద్ధింపదు. సజాతీయము, సజాతీయముతోనే, జలముతో జలమట్లు, ఏకత్వమును పొందును. దాని వలన, అన్యోన్యానుభవము కలుగును. **కావున జగము యొక్క అనుభవము నందు–అనుభవముల ఏకత్వమున, చైతన్యము (చిత్పదార్థము) యొక్క ఏకత్వ సిద్ధాంతమే పర్యవసన్నమగుచున్నది.**

## 15. దృశ్యము సైతము చైతన్యస్వరూపమే

ద్రష్ట, దర్శనము–వీనికి సాక్షి యగు చిదాత్మయందు ఏకత్వము లేకున్నచో, ఇక్షు(చెఱకు) రసాస్వాదనము (దాని మాధుర్యానుభవము) పాషాణమునకు (శిలకు) వలె దృశ్యానుభవము, ద్రష్టకు కలుగనేరదు. జడమునకు రసానుభూతి అసంభవము. జడమగు రసమును, జడ మనుభవింప జాలదు. **కాష్ఠోపలములకు (కఱ్ఱకు రాతికి) పరస్పరానుభవము అసంభవము.**(యో.వా.III-121.37-42).

**కాష్ఠోపలాదులు** (కఱ్ఱ,రాయి మొదలగునవి), బోధ స్వరూపములు కానిచో, అవి అభావవస్తువు లట్లు, మనచే ఎఱుగబడి యుండెడివే కావు.

మనకు జ్ఞాతమగు వస్తువు, జ్ఞాన(బోధ)స్వరూపమై యుండవలెను. బోధము(జ్ఞానము) అబోధము(అజ్ఞానము)ను ఎఱుగజాలదు. విరుద్ధస్వభావమగు వస్తువు, బోధ (జ్ఞాన) భూమియందు ప్రవేశింపజాలదు.*

---

* **బోధాఽవబుద్ధం యద్వస్తు, బోధ ఏవ తదుచ్యతే**
**నాఽబోధం బుధ్యతే బోధో, వైరూప్యా త్తేవ నాఽన్యథా।**
**ద్రష్టృదర్శన దృశ్యేషు, ప్రత్యేకం బోధమాత్రతా।**
**పారస్తేన తదన్యత్వం నాఽస్తి కిఞ్చిత్ ఖపుష్పవత్।**
**సజాతీయః సజాతీయే నైకతా మనుగచ్ఛతి।**

ఈ విచారము వలన, ద్రష్ట (Seer) దృశ్యము (Seen) - ఈరెండును సర్వగతమగు శుద్ధచైతన్యము యొక్క రూపభేదములు మాత్రమే యనుట నిరూఢ మగుచున్నది.

## 16. ప్రతిజీవునకు ప్రత్యేకవిశ్వస్వప్నము (SUBJECTIVE IDEALISM)

ప్రతివ్యక్తియు, తన అనుభవమున నున్న విషయజాతమును మాత్రమే యెఱుగ గల్గును. ప్రతిజీవునకు ప్రత్యేకచిత్తముండును. విభిన్న చిత్తములలో, విభిన్నముగనే జగద్భ్రాంతి యుదయించుచున్నది. రాత్రి యొక చోటనే పరుండిన సైనికులకు, తమ తమ యుద్ధమునకు సంబంధించిన అనుభవములు, తమ తమ స్వప్నములందు, ప్రత్యేకముగ నుదయించుచున్నట్లు, **ఈ జగదనుభవము సైతము, ప్రతివ్యక్తికిని ప్రత్యేకము** (యో.వా.IV-17-27). ఇది యితరులకు అజ్ఞాతము. తన మనస్సున దోచిన జగత్తునే, వ్యక్తి, అనుభవించును. మనోరథ పదార్థములను తత్సాక్షియే యెఱుగుచున్నట్లు, పురుషుడు, స్వస్వప్నమును స్వయముగనే ఎఱుగుచున్నాడు. **సూర్యరశ్మియందు త్రసరేణువులవలె,** మహాచైతన్య సంబంధియగు ప్రతిపరమాణువునందును, అసంఖ్యాకములగు బ్రహ్మాండములు స్ఫురించుచున్నవి. బ్రహ్మ నామకమగు కాననమున **అసంఖ్యాక గుంజాఫలములు** (గురువెందలు) అణు వణువునను, **పరస్పరలగ్నములు కాకుండ మున్నవి.** (యో.వా.IV-18.6).

మనము పరస్పరము ప్రతివ్యక్తిచైతన్యము నందును ప్రతిబింబించి యుండుట వలననే, పరస్పరము దర్శింప గల్గుచున్నాము. మఱియు **మహానియతి నిశ్చయము** వలనను, మహాచైతన్యము సర్వగతమై అన్నిటి యందును, అభివ్యక్తమై యుండుట వలనను, ఇది సిద్ధించుచున్నది. వసిష్ఠుడు, అనేక వ్యష్టిచిత్తములకు,

---

**అన్యోన్యాఽనుభవాస్తేన భవత్యేకత్వ నిశ్చయః ।**
**యది కాష్ఠోపలాఽఽదీనాం, న భవేద్బోధరూపతా ।**
**తత్పదాఽనుపలమ్భః స్యాదేతేషు మనసా మిథః** (యో.వా.VI ఉత్తర – 25. 12,13,14,15)
**ద్రష్టృదృశ్యే న యద్యేక మభవిష్య చ్చిదాత్మకే ।**
**తద్దృశ్యాఽఽస్వాద మజ్ఞః స్యా న్నాదృష్టేక్షు మిహోపలః ।** (యో.వా.VIఉత్తర – 38.9)
**(నా= పురుష–యో.వా. తా.ప్ర)**

**అన్నిటికిని సామాన్యమైన జగదనుభూతిని స్థాపించును**(Objective Idealism) మొదట నంతయు నాత్మస్వరూపమే. **ఈ పరమార్థ సత్తయే సర్వాత్మకము. ఈ** సత్తారూపమగు శుద్ధ చైతన్యమే, ఈశ్వరరూపమున వివర్తమైనది.

## 17. పదార్థజాతము యొక్క సంకల్పమయత్వము

సర్గాదిని, స్వప్నపురుషన్యాయమున జీవసమష్ట్యాత్మకుడగు ఆది ప్రజాపతి, (విశ్వమానసము - Cosmic Mind)స్ఫుటముగ నెట్లు సంకల్పించెనో, అది యంతయు, నేటికిని, స్థితి నంది యున్నది. **ప్రథమ ప్రతిస్పందనమే, పదార్థముల కన్నిటికిని బింబరూపము.** ఇపుడు సంస్థితమై యున్నదంతయును దాని **ప్రతిబింబమే.** వ్యష్టిజీవులకు ఆధారమై యున్నసర్వసామాన్యమగు-ఈవిశ్వమానసమే (Cosmic Mind). సర్వసామాన్యమగు జగదనుభూతికి కారణమగుచున్నది.

బ్రహ్మ(Cosmic Mind)సంకల్పించిన కల్పనలు, మనయందఱి అనుభవము యొక్క సామాన్య పదార్థ జాతము. మన వ్యష్టి(ప్రత్యేక) మనస్సున, అవి, మనవిగా ప్రవేశించుచున్నవి. మఱొక రీతిగా, **ఆ ప్రథమసంకల్పములు బింబములు. మన మనస్సులు ప్రతిబింబములు.** ప్రతివ్యష్టిమానసమును, ఏకమగు విశ్వమానసము యొక్క అభివ్యక్తి మాత్రమే యగుట చేత, ఇది, తనలో ఇతరములగు వ్యష్టిచిత్తములను, తన స్వీయకల్పనలుగ నిరూపింపగలదు. **జలము, తరంగరూపములను బొందునట్లు విశ్వమానసమే వ్యష్టిమానసములుగ దోచుచున్నవి.** ఇట్లు విశ్వమానసరూపుడగు బ్రహ్మ యొక్క సృష్టి యగు విషయప్రపంచమును, వ్యష్టిచిత్తముల సృష్టియగు విషయప్రపంచమును,రెండును కలవని నిరూఢమగుచున్నది.

## 18. దేశకాలముల మిథ్యాత్వము

దేశకాలము లనునవి సాపేక్షములు (Relative). ఇవి సంకల్పరూపములే! సంకల్పమే వాని కాధారము. ఈ జగత్సర్గాఽవభాసము (జగద్దృశ్యము) ప్రతిభా మాత్రమైనట్లే,క్షణకల్పావభాసము (క్షణములు,యుగములు వీని యొక్క అనుభవ దృశ్యము) సైతము ప్రతిభా[1] మాత్రమే. దేశకాలకర్మవిషయవైచిత్ర్యము వలననే,

---

(1) ప్రతిభ- సంకల్పదృశ్యము (Thought-appearance)

సుఖదుఃఖాదివైచిత్ర్యము సంభవమగుట ప్రసిద్ధము. దేశకాలములు అల్పమైనను, మనస్సులో వాని విపులత్వము సంకల్పితముకాగా, వైపుల్యానుభవము కల్గుచున్నది. తుచ్ఛ విషయము సైతము, మనస్సుచే గొప్పగా భావింపబడినపుడు, దానియందు రాగాతిశయము గోచరించుచున్నది కదా!

కాంతాదివిరహులకు, ఒక్కదినమే, సంవత్సరముగ దోచుచున్నది. దుఃఖితునకు (రోగికి) ఒక్క రాత్రియే, కల్పసమానము. ఆరోగ్యవంతుడు, వినోదమగ్నుడునగు సుఖశాలికి, రాత్రి, ఒక్కక్షణముగ దోచుచున్నది. ఒక్క క్షణకాలపు స్వప్నమున అనేకసంవత్సరముల అనుభవముకల్గుచున్నది. మేల్కొన్నంతనే యేమియు నుండదు. స్వప్నమున, క్షణము, సైతము కల్పమగుచున్నది. కల్పము క్షణమగుచున్నది.★

దేశకాలముల మిథ్యాత్వమునకు సాపేక్షకత్వమునకు (Relativity) సంబంధించిన అర్థము లన్నియు లీలా, భార్గవ, లవణ, గాధి, ఉపాఖ్యానములందు విశదఫణితి వివరింపబడియున్నవి.

## 19. మరణాఽనంతరజీవితము

జీవితము యొక్క సాపేక్షకత్వము, (Relativity) ఏ యొక్క విషయమునకు సంబంధించిన కాంక్ష (కోరిక)తో, సంతృప్తి నందుట, అసాధ్యమని నిర్దేశించును. పదార్థజాతము యొక్క సాపేక్షకత్వస్వభావము, విషయపదార్థనిర్మాణమున నిత్యత్వమేదియు (Permanency) లేదని నిరూపించుచున్నది. కేవలము నశ్వరములు,

---

★ దేశకాలాఽభిధానేన, రామ! సఙ్కల్ప ఏవ హి।
లక్ష్యతే (కథ్యతే) తద్వశా ద్యస్మా ద్దేశకాలౌ స్థితిం గతౌ। (యో.వా.III.110-59)
యథైతత్ప్రతిభామాత్రం, జగత్సర్గాఽవభాసనమ్ ।
తథైతత్ప్రతిభామాత్రం, క్షణకల్పాఽవభాసనమ్ । (యో.వా.III.20-29)
నిమేషే యది కల్పౌఘసంవిదం పరివిన్దతి।
నిమేష ఏవ తత్కల్పో, భవ త్యత్ర న సంశయః ।
కల్పే యది నిమేషత్వం, వేత్తి కల్పోఽప్యసౌ తతః ।
నిమేషే భవతి క్షిప్రం, తాద్రూప్యాత్మికా హి చిత్।
దుఃఖితస్య నిశాకల్పః, సుఖితస్యైవ చ క్షణః ।
క్షణః స్వప్నే భవేత్ కల్పః, కల్పశ్చ భవతి క్షణః । (యో.వా.III.60.20,21,22)

అనుభవసంబంధములు, లేక, వాని సన్నివేశములు మాత్రమేయగు విషయపదార్థముల వలన, సంతృప్తిపూరణము అసంభవమగుటచే, ప్రతి వాంఛయు, అసాధ్యము సాధించుటకగు ప్రయత్నము మాత్రమే.

కాన, అనుభవసన్నివేశములైన ఉద్దీపనములు, (ఉత్తేజనములు) తప్ప, మఱి యే సంతృప్తియు, అనిత్యపదార్థములందు లభింపదు. పరతత్త్వము, కేవలము, వ్యష్టిత్వమున (Individuality) కే, పరిమితమై యున్నదను విపరీతభావన (భ్రమ)యే, శారీరకజీవనాఽఽకాంక్షకు హేతువు.

**శరీరమే పరమార్థ మను అసద్భావన, ప్రపంచ మందలి పదార్థములన్నియు, వ్యక్తియొక్క వివిధసుఖానుభవమునకే, ఉద్దిష్టమై యున్నవను ఆత్యంతిక దోషమునకు ఆస్పదమగుచున్నది.**

**వస్తు పరిపూర్ణమగు జగము నెవ్వరును, తమ వ్యక్తిగత స్వార్థ ప్రయోజన సిద్ధికి, సాధనముగ నుపయోగించుకొన కూడదనుటయే, సమ్యగ్జ్ఞానము యొక్క నిర్ణయము.** కాని, అజ్ఞానము, నిరర్థకమైన ప్రాధాన్యమును కల్పించుకొని, అజ్ఞానియగు వ్యక్తి యొక్క నాశమునకు,పరమార్థ విషయమున, అనవసరముగ ప్రవేశించుచున్నది.

**అపరిపూర్ణములైన (నెఱవేఱని) వాంఛలు, మనుజులను కార్యకారణశృంఖలా రూపమైన జననమరణపరంపరయందు (సంసారమున) పడద్రోయుచున్నవి. మరణమున ఆత్మ నశింపదు. ఆత్మ, అజము, నిత్యము.** పాంచభౌతిక దేహమును త్యజించి, ఆత్మ, ప్రాణేంద్రియమనః సహితమగు **సూక్ష్మ (ఆతి వాహిక) దేహముతో** ముందుకు సాగును. మరణమూర్ఛానంతరము, తృప్తి గాంచని కోరికలతో ఆతివాహిక దేహయుక్తమగు ఆత్మ, తాను పునర్జన్మ మందిన జగత్తును గూర్చిన సంవేదనను పొందుచున్నది.

**సత్తాసామాన్యరూపమగు బ్రహ్మమును పొందువఱకు జననమరణాత్మక సంసారము, కొనసాగుచునే యుండును.** బ్రహ్మప్రాప్తియే, మోక్షము. ఇది నిత్యమగు పరతత్త్వమున, నామరూపముల విసర్జించి, అపరిచ్ఛేద్యస్థితినందుట. **జన్మమృత్యువులు, కర్మసూత్రబద్ధములు. కర్మసూత్రము, స్వార్థకర్మలకు ప్రతిక్రియారూపము. <u>సుఖదుఃఖముల కతీతముగ చిత్తసమత్వమున రాగద్వేషరహితముగ నుండుటయే చిరజీవన రహస్యము.</u>** భుశుండోపాఖ్యాన మీ సత్యమును నిరూపించును*.ఎవరి చిత్తము సమభావమున సర్వభూతస్థమగు

---

* చూడు :- యో.వా. సం. సర్గ-21

బ్రహ్మమున నిశ్చలముగ నున్నదో, వారిచే జననమరణరూప మగు సంసారము నిరస్తము.వారు పునరావృత్తినిరోధకమగుబ్రహ్మమున స్థితులై జీవన్ముక్తులగు చున్నారు. ప్రియాఽప్రియవస్తుప్రాప్తి యందు వారు, హర్షవిషాదముల పొందరు.

## 20. పరబ్రహ్మము

పరతత్త్వమును నిరూపించి వర్ణించుట అసాధ్యము. సకలవర్ణనములు, నిర్ణయములు, కేవలము భేదసృష్టిని, ద్వైతభావమునే, నిష్పాదించును. కాన పరతత్త్వము 'ఇది' అని 'అది' అని వచింప జాలము. ప్రతినిర్వచనమును, నిరవధిక భూమరూపమగు పరబ్రహ్మమును విషయీకరించి, సాఽవధికము చేసి జ్ఞేయ మొనర్చుచున్నది. మనఃకల్పన యేదియు,పరతత్త్వమును తెలియజేయజాలదు. అది సర్వగతము, సర్వజ్ఞము, సర్వశక్తిమంతము, అని మాత్రమే మనము వర్ణింపగలము. అది, అద్వయసచ్చిదానందరూపము. సర్వగతమయ్యును, విషయరూపము కానందున గోచరింపదు. అది సర్వసారరూపము. ఋతము, ఆత్మ, పరము, బ్రహ్మము, సత్యము, – ఇత్యాది శబ్దములు బ్రహ్మమును నిర్దేశించుటకు బుధులచే కల్పితములు. తప్పక వర్ణింపవలసి వచ్చిన, పరబ్రహ్మమును, భావాత్మక శబ్దములతోను, నిషేధార్థక (నేతి నేతీతి) శబ్దములతోను అన్ని శబ్దములతోను –వర్ణింపవలయును. పరస్పర విరుద్ధ శబ్దములలో నేదేనొక్క శబ్దముతో మాత్రము దానిని వర్ణించుట అసాధ్యము. లేకున్న, మౌనమే దానిని వర్ణించును.[1] విశ్వమూల మయ్యును, అది అత్యంత సూక్ష్మము. ప్రతివస్తువున కది ధారకము. సమస్తవిశ్వము అంత్యమున, దానియందే ప్రవేశించుచున్నది.

ఝరీసదృశవాగ్గుంభనతో మోక్షావస్థను శంకరుడు, బ్రహ్మసూత్ర భాష్యమున (I-1-4) వర్ణించును.

"ఇది పారమార్థికము, కూటస్థము, నిత్యము, ఆకాశము వలె సర్వగతము, సర్వవిక్రియారహితము, నిత్యతృప్తము, నిరవయవము, స్వయంజ్యోతిస్స్వభావము, ధర్మాఽధర్మములు, తత్ఫలములును, కాలత్రయమును, దానిని సమీపింపజాలవు. ఇది మోక్షాఖ్యమగు అశరీరత్వము" [2]

---

(1) చూడు :- సర్గ –31, శ్లో –21. పాదటీక.

(2) "ఇదం తు పారమార్థికం, కూటస్థం, నిత్యం, వ్యోమవత్సర్వ వ్యాపి, సర్వవిక్రియా రహితం, నిత్యతృప్తం, నిరవయవం, స్వయంజ్యోతిస్స్వభావం, యత్ర ధర్మాఽధర్మౌ సహ కార్యేణ కాలత్రయం చ నోపావర్తేతే తదశరీరం మోక్షాఖ్యమ్" (శంకరుడు – బ్ర.సూ.భా. I-1-4)

## 21. ప్రతివ్యక్తి యందలి ఆత్మ (ద్రష్ట) బ్రహ్మమే

జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడు అవస్థలయందును, ఏమార్పును పొందక, తురీయావస్థయందు ఈ మూడింటిని ఆత్మ, అతిక్రమించుచున్నది. ద్రష్ట, దృశ్యముగ మాఱడు. కావున మన అనుభూతి యందలి విషయములేవియును, ఆత్మకావు. మన వ్యష్టిత్వము (Personality) నందలి దేహమనోబుద్ధి ప్రాణేంద్రియములకు ముఖ్య ప్రేరకుడు, వానికి ద్రష్టయు, **ఈ ఆత్మయే.**

## 22. ద్రష్టృదృశ్యముల ఏకత్వము

ద్రష్ట, దృశ్యము (విషయి, విషయము –The Seer and the Seen) – ఇవి కేవలము విభిన్నతత్త్వములైనచో, జ్ఞానోపలబ్ధి అసంభవము. కాన, అంతమున, వీని యందు ద్వైతము సాధ్యపడదు. **కావున వసిష్ఠుడు, ఈఆత్మస్వరూప స్థితియందు, విషయ(దృశ్య)తత్త్వము నందలి సారార్థమునకును, విశ్వము యొక్క చరమ సారతత్త్వముతో, ఏకత్వమును పూర్ణాద్వైతమును స్థాపించును***

అనంతమగు బ్రహ్మమే, జగదాకారమున భాసించుచున్నది. తత్త్వవేత్తలకు జగము, బ్రహ్మసత్తారూపమునను, అజ్ఞానులకు కేవలము జగదాకారముగను, దోచుచున్నది. ఇది యంతయు స్వరూప అజ్ఞానలక్షణమగు అవిద్యయే. స్వాత్మతత్త్వ జ్ఞానము లేమిచే, అనంతమగు ఈ అవిద్య, ఆ జ్ఞానమున నివారితమై, నిర్మలమైన బ్రహ్మమే యగుచున్నది. బ్రహ్మభావమున జగత్స్వప్న జాలమును గాంచినచో, ద్రష్టయు నుండడు. అపుడు ద్రష్ట, దృశ్యము, ద్వైతము, కారణము– అనునవి యెచట నుండగలవు? సర్వము, మహాశాంతము, కేవలము భేదరహితము, (నిర్భిత్తి) – చిదాకాశరూపము, స్వచ్ఛము, ఆద్యంతరహితమునగు బ్రహ్మము, స్వస్వరూపమున నెలకొనియున్నది. అజ్ఞాననిద్ర యున్నంత వఱకు, పరమాత్మయందు, బ్రహ్మాండలక్ష సమూహములు, అవి, అనన్యము (అభిన్నము)

---

* పోల్చు:- "తా మామనన్తి ప్రకృతిం, పురుషార్థ ప్రవర్తినీమ్ ।
తద్దర్శిన ముదాసీనం, త్వా మేవ పురుషం విదుః" ॥
(కాళిదాస మహాకవి- కుమారసంభవము II.13.)

పురుషార్థ ప్రవర్తిని యగు ప్రకృతియు, దానికి ద్రష్టయగు ఉదాసీనుడగు పురుషుడును (ప్రకృతి పురుషతత్త్వములు రెండును) నీవే యని జ్ఞాను లెఱుగుదురు.

లైనను, అవారితముగ, వ్యాపించుచున్న తరంగవేగమున కల్లోలితమైన జలము యొక్క పరమాణుసమూహములు అసంఖ్యాకము లగుచున్నట్లు, అన్యము(భిన్నము) లట్లు నిలిచి యున్నవి.*

## 22. జగన్మిథ్యాత్వము

పరమార్థదృష్టి యందు వాస్తవముగ జగము లేనేలేదు. ఉన్నది సర్వమును బ్రహ్మమే. త్రికాలములందును, నియతముగ నేమార్పు పొందక, ఏకరూపమై, స్థిరమై యుండునదియే (త్రికాలాఽబాధ్యము) సత్యము. ఆద్యంతము లందు లేనిది సత్య మెట్లగును? రూపము లన్నియు కొంతకాల ముండి అంతరించి పోవుచున్నవి. కాన, నివి, సత్యము లనుటకు సాధ్యపడదు. పూర్తిగా అసత్యము లనుటకును వీలుపడదు. కేవలము సత్యములు, అసత్యములును కాని, వీనిని గ్రహించుటకు 'మిథ్య' 'అవిద్య' 'మాయ' (భ్రమ), అను శబ్దములను వసిష్ఠుడు ప్రయోగించును.

ఇవి, దృశ్యము (Appearance) అను శబ్దముతో సమానములు. జగము, ఉత్పన్న మగుచున్నట్లు దోచుచున్నను, ఏదియు నుత్పన్నమగుట లేదు. స్థావర జంగమాత్మకమై, గోచరించు సమస్త సంసారమును, నిర్మల మరుమరీచిక

---

★ "బ్రహ్మైవేదం మునే! సర్వం జగదిత్యవ భాసతే।
సతా మసన్తం సత్త్వేన, జగత్త్వేనాఽ సతామపి।
అవిద్యేయ మనన్తేయ మవిద్యాత్వేన చేలితా।
బ్రహ్మత్వేన పరిజ్ఞాతా, భవతి బ్రహ్మ నిర్మలమ్।
ఏవం ద్రష్టాఽపి యః స్వప్నజాలం దృష్టే వ కిఞ్చన।
కోఽత్ర ద్రష్టా? కుతో దృశ్యం? క్వ ద్వైతం? క్వ చ కారణమ్ ?
సర్వం నిః శాన్త మాభాతం, ఖాఽఽత్మ నిర్వృత్తి కేవలమ్।
బ్రహ్మాత్మని స్థితం స్వచ్ఛ మాద్యన్త పరివర్జితమ్।
బ్రహ్మణ్డలక్షనిచయాః పరమాత్మనీతి,
నిత్యం స్థితా నిపుణ మవ్యవదవ్యవన్యే
వారి ణ్యవారితవిసారితరఙ్గవేగా-
ల్లోలం స్థితాఽమ్బు పరమాణుచయా తథైతే"
(యో.వా. VI నిర్వాణ-ఉత్తర- 176.9, 22-25)

లందు జలము లేనట్లే, లేనిదియే. జగము కేవలము అసత్యదృశ్యము-(Unreal-Appearance) మనో రాజ్యము. ఈ సంసారవిభ్రమము, చిత్రమందలి సారసుగంధ వర్జితమైన పద్మాకరము, గంధర్వనగరము. దిన కరోదయమున, తమస్విని(రాత్రి) అంతరించునట్లు, వివేకోదయమున, అవిద్య విలయమందుచున్నది. ఎంతవఱకు, అజ్ఞానగ్రహణ ముండునో, ఎంతవఱకు బ్రహ్మభావన యుండదో, ఎంతవఱకు జగజ్జాలమున ఆస్థ(అపేక్ష)యుండునో, అంతవఱకు చిత్తాదుల కల్పన యుండును.[1]

## 23. తత్త్వమసిమహావాక్యము

యోగవాసిష్ఠము సామార్థసారమని మహాయోగిని తరిగొండ వెంగమాంబ వర్ణించినది. యోగ వాసిష్ఠము యొక్క నిర్వాణ (VI)ప్రకరణ ఉత్తరార్ధ అంతమున నిది సామార్థ సారమని నిరూపింపబడినది[2].

---

(1) యథోదితే దినకరే, క్వాఽపి యాతి తమస్వినీ ।
తథా వివేకేఽభ్యుదితే, క్వాప్యవిద్యా విలీయతే । (యో.వా. III-114.9)
అయ మాకాశ భూతాది రూపోఽహం చేతి లక్షితః ।
జగచ్ఛబ్దస్య నామాఽర్థో, నను నాస్త్యేవ కశ్చన । (యో.వా. III 4-67)
బ్రహ్మ సర్వమిదం విశ్వం, విశ్వాఽతీతం చ తత్పదమ్।
వస్తుతస్తు జగన్నాఽస్తి సర్వం బ్రహ్మైవ కేవలమ్ । (యో.వా. IV 40.30)
నిరాధారం నిరాధేయ మద్వైతం చైత్య వర్జితమ్ ।
జగత్సంవిది జాతాయా మపి జాతం న కిఞ్చన । (యో.వా. III 13-48)
పరమాకాశ మాశూన్య మచ్ఛమేవ వ్యవస్థితమ్।
సర్వసంసారతా నాఽస్తి, యదేవ తదవ స్థితమ్ । (యో.వా. III-13-48, 49)
పిణ్డగ్రహో జగ త్యస్మి న్విజ్ఞానాకారరూపిణి।
మరునద్యాం జలమివ, న సమ్భవతి కుత్రచిత్। (యో.వా.III 15.7)
అనుభూతం మహారాజ్య మివాఽ సత్య మవాస్తవమ్ ।
చిత్రపద్మాకర ఇవ సారసౌగన్ధ్య వర్జితమ్ । (యో.వా.IV 1.12)
ప్రతిభాససముత్థానం, ప్రతిభాసపరిక్షయమ్ । (యో.వా.VI పూర్వ- 33.45)
యథా గన్ధర్వనగరం, తథా సంసృతివిభ్రమః ।
(పిణ్డగ్రహః = మూర్తతా స్వీకారః - రూపమును గ్రహించుట)

(2) చూడు :- యోగవాసిష్ఠ సంగ్రహము -సర్గ-32, శ్లో. 28- పాదటీక.

సామవేదీయమగు ఛాన్దోగ్యోపనిషత్తు (VI-1)న, 'తత్త్వమసి' (తత్+త్వమ్+అసి) అదియే నీవై యున్నావు అనునది, నాల్గువేదాంత **మహావాక్యముల** [1]**లో నొకటి.** ఈయుపనిషత్తున, ఆరుణిమహర్షి, తన పుత్రుడగు **శ్వేతకేతువునకు** 9 (తొమ్మిది) మార్లు, ఈ మహావాక్యముతో, భిన్నభిన్న దృష్టాంతముల నొసగి, ఆత్మతత్త్వోపదేశమొనర్చెను. ఇది బ్రహ్మాత్మైక్యము బోధించు వేదాంత మహావాక్యములలో **ముఖ్య వాక్యము. పిండ బ్రహ్మాండములలో నున్నది, ఏకతత్త్వమగు బ్రహ్మమే యని, ఈ మహావాక్యమున కర్థము.** [2]

అనేక జన్మాంతరకృత పుణ్యకర్మ పరిపాకము వలన, శుద్ధాత్ములైన వారికి, పరమాత్మవిషయకమగు జిజ్ఞాస ఉదయించుచున్నది.

సర్గారంభమున నున్న సత్పదార్థము **(తత్)ను, నీవును (త్వమ్)** అనగా, నీ దేహ మందున్న ఆత్మయును **నొక్కటియే.** నీయాత్మ నెఱిగినచో, సమస్త జగత్తునకును మూల(ఉపాదాన)కారణమైన బ్రహ్మమును స్వయముగ నెఱుగ గలవు. బ్రహ్మము, ఆత్మస్వరూపమున నున్నదని, యిట్లీ ఉపనిషత్తున, సిద్ధాంత మొనర్పబడినది. **సర్వజ్ఞయు, సత్యవాదిని, యైన శ్రుతి యొక్క ఉపదేశమును**

---

**(1) మహావాక్య చతుష్టయః – 1. ఓం ప్రజ్ఞానం బ్రహ్మ. 2) ఓం అహం బ్రహ్మాఽస్మి.**
**3) ఓం తత్త్వమసి. 4) ఓం అయమాత్మా బ్రహ్మ. ఇవియే, నాల్గు వేదాంత మహావాక్యములు**

**(2) పోల్చు:–** **జన్మభిః కోటి సర్వత్రై ర్నిర్వృత్తైః పుణ్యకర్మభిః ।**
**శుద్ధాత్మనాం సతా మేవ, జిజ్ఞాసాఽఽత్మని జాయతే ।**
**ఛాందోగ్యపనిషద్యేత న్మహావాక్య మితీర్యతే ।**
**షష్ఠ ప్రపాఠకే 'తత్త్వమసీ'తి ప్రాయశోఽస్తి యత్ ।**
**తత్రత్యానాం పదానాం యద్ద్వితీయం త్వం పదం స్థితమ్ ।**
**తస్యాఽర్థః ప్రత్యగాత్మైష, యోఽహ మిత్యనుభూయతే ।**
**సహజం తు పరం బ్రహ్మ, కేవలాఽఽనన్దలక్షణమ్ ।**
**తత్పదస్య భవే దర్థో యః పరాత్మేతి గీయతే ।**
**అపేత్యైకత్వ మనయో రఖణ్డత్వం ముహుర్ముహుః ।**
**తాత్పర్యేణ శ్రుతి ర్వక్తి, సర్వజ్ఞా సత్యవాదినీ ।**
**శ్రుత్యా సమీరిత స్త్వర్థో, మోహా న్నాద్రియతే జనైః ।**
**సంసారాబ్ధౌ పత న్త్యన్ధా, ఇవ తేనైవ దోషతః ।**
**(శంకరుడు మహావాక్యదర్పణము –13–18)**

ఆదరింపక, మోహదోషము వలన జనులు, సంసారార్ణవమున అంధుల వలె పడుచున్నారు.

ఈ యుపనిషత్తు, శాండిల్యవిద్యయందు, సర్వదృష్టితో బ్రహ్మోపాసనమును విధించును. ('సర్వం ఖల్విదం బ్రహ్మ'ఇత్యాది) జీవద్దశయందు ఎవరెట్టి అధ్యవసాయము (దృఢనిశ్చయము -భావన) కలవారో, వారు, అట్టి భావనారూప ఫలమును పొందగలరు. కాన, బ్రహ్మప్రాప్తిని గోరు ముముక్షువులు, యావజ్జీవము, బ్రహ్మోపాసన మాచరింపవలయును.

## 24. యోగవాసిష్ఠమహత్త్వము

మోక్షస్వరూపమును, తత్ప్రాప్తికి సోపానములగు జ్ఞానభూమికలను, ఈశ్వరాఽఽరాధనరూపమగు నిష్కామకర్మానుష్ఠానమును, జీవన్ముక్తస్థితిని (సిద్ధావస్థను), జీవన్ముక్తులగు స్త్రీ పురుషుల రమణీయజీవితోపాఖ్యానములచే నిరూపించు ఈ యోగవాసిష్ఠమహారామాయణము, భగవంతుడగు వసిష్ఠమహర్షి యొక్క ఆత్మవిద్యకు మూర్తిరూపమై, నిరంతరము ప్రకాశించుచున్నది. ఈ జ్ఞానము కేవలము తార్కికచింతనాఫలము కాదు. ఇది, జీవితము యొక్క మహోన్నతసత్యసాక్షాత్కారఫలము. ఈయుపదేశమున జ్ఞాతజ్ఞేయుడైన (పరమాత్మనెఱిగినవాడైన) శ్రీరాముడు, జీవన్ముక్తుడై, యథాప్రాప్తములగు కర్మములను అహంకార మమకారముల వర్జించి, రాగ ద్వేషరహితుడై, అనుష్ఠించి, శోకరహితస్థితి నందినాడు. "భరద్వాజా! నీవును అట్టి పూర్ణబ్రహ్మాత్మదృష్టి నాశ్రయించి, ప్రశాంతబుద్ధివి, రాగరహితుడవు, నిశ్శంకుడవు, జీవన్ముక్తుడవు కమ్ము" అని వాల్మీకి తన శిష్యుని ప్రబోధించినాడు.

ఈ శాస్త్రము జననమరణములను, జీవితసర్వావస్థలను, సమదృష్టితో ఆనందమున స్వీకరింప గల స్థిత ప్రజ్ఞతను ప్రసాదించును. దీని వలన, జాతి, వర్ణ, లైంగిక, హేతుకములైన దురాగ్రహముల నుండి, సమాజమునకు హానికరములైన చేతోవికారములనుండి విముక్తుడై, మానవుడు, బాధ్యత నెఱిగిన విశ్వపౌరుడై, ఇహముననే, స్వర్గ సుఖమనుభవించుచు, ఆనందమున జీవింప గలడు. నేటి కాలమున కీఆత్మవిద్య మిక్కిలి ఆవశ్యకము. శ్రేయస్కాములగు జను లందఱకును, ఈ మోక్ష (శాంతి) సంహిత (Science of peace) అత్యంతసమాదరణీయము.

"ఈమోక్షశాస్త్రమును పలుమాఱు చదువుటవలనను, వినుట వలనను, అనుష్ఠించుట వలనను, చిత్తసంస్కారపూర్వకమగు అపూర్వపాండిత్యము సిద్ధించును. దీనిని నిత్యము వినుచుండెడి ఉదారులగు స్త్రీ పురుషుల బుద్ధి, ఇతర గ్రంథముల వలన గలుగు జ్ఞానము కంటెను పరమోత్కృష్టజ్ఞానమును పరమశాంతిని[1] పడయుచున్నది.

**ఉత్కృష్టమగు ఔషధ సేవనమున, తప్పక ఆరోగ్యము కలుగునట్లు, ఈ శాస్త్రమును విన్నంత మాత్రమున జీవన్ముక్తి లభించును. వినుచున్నపుడే జీవన్ముక్త స్థితిని, శ్రోత అనుభవించుచుండును."** [2]

వసిష్ఠుని ఈ వాక్యములు యథార్థమున అతి శయోక్తులు కావు. ప్రయోజన వాదులు (Pragmatists) చెప్పునట్లు, ప్రయోజకత్వమే సత్యమునకు ప్రమాణమైనచో ('Utility is the test of truth') వసిష్ఠప్రోక్తమైన ఈ దర్శనము (తత్త్వశాస్త్రము) అత్యంతము సత్యబంధుర మనుట సిద్ధాంతము.

శాంతము(నిరుపద్రవము), నిరవధికమహిమము, నిర్మలచిదానందము (దేహేంద్రియాదివిషయమాలిన్యరహితము) జ్ఞానసుఖరూపము, తరంగ రహితమై, నిశ్చలమై యున్న **అమృతసాగరజలములలో** మగ్నులై యున్నను, అజ్ఞానులు, **స్వల్పమైనను ఆజలముల గ్రోలరు. నిస్సారమైన సంసారరూప మరుమరీచికా**

---

(1) **శమార్థం సర్వశాస్త్రాణి విహితాని మనీషిభిః ।**
**స ఏవ సర్వశాస్త్రజ్ఞః, యస్య శాన్తం మనః సదా ।**
**యచ్ఛ్రుతం న విరాగాయ, న ధర్మాయ, న శాన్తయే ।**
**సుబద్ధ మపి శబ్దేన కాకభాషిత మేవ తత్। (మహాభారతము)**
మానవుల మనస్సున శాంతిని ప్రతిష్ఠించుకొఱకే, సకల శాస్త్రములను మనీషావంతులగు మహాత్ములు ఆవిష్కరించిరి. చిత్త విశ్రాంతి సంపన్నుడగు వ్యక్తియే, వాస్తవమున సర్వజ్ఞుడు. దేని శ్రవణము, వైరాగ్యమును, ధర్మమును, శాంతిని ఉత్పాదింపదో, అది (ఆ శాస్త్రము), రమణీయ శబ్దాలంకారసంయుతమయ్యును, కాక భాషితమే (కాకి కూతయే)

(2) **"ఏతచ్ఛాస్త్ర ఘనాఽభ్యాసాత్, పునః పుర్వేవ వీక్షణాత్ ।**
**పాణ్డిత్యం స్యాదపూర్వం హి చిత్తసంస్కార పూర్వకమ్॥"** (యో.వా.II-18-36)
**"య ఇదం శ్రుణయా న్నిత్యం, తస్యోదారచమత్కృతేః ।**
**బోధస్యాఽపి పరం బోధం, బుద్ధిరేతి న సంశయః॥"** (యో.వా.III-8.13)
**"జీవన్ముక్తత్వ మస్మింస్తు శ్రుతే సమనుభూయతే।**
**స్వయమేవ యథా పీతే, నీరోగత్వం వరౌషధే॥"** (యో.వా.III-8-15)

సాగరమున (ఎండమావుల కడలియందు) వారు నీరు త్రాగుచున్నారు; ఆచమించుచున్నారు; స్నానమాడుచున్నారు; క్రీడించుచున్నారు; మరల, మరల, మునకలు వేయుచు, తేలుచున్నారు. ఇది ఆశ్చర్యకర మగు మహామాయావిలాసము కదా!

"శాన్తేఽనన్త మహిమ్ని, నిర్మలచిదానన్దే, తరఙ్గావళీ
నిర్ముక్తేఽమృతసాగరామ్భసి, మనాఙ్మగ్నోఽపి, నాఽఽచామతి।
నిస్సారే, మృగతృష్ణికాఽర్ణవజలే, శ్రాన్తోఽపి మూఢః పిబ
త్యాచామ త్యవగాహతేఽ భిరమతే మజ్జ త్యథోన్మజ్జతి ।

(శ్రీకృష్ణమిశ్రయతి - ప్రబోధచన్ద్రోదయము -IV-6)

విషయప్రదేశము సమాప్తము

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ప్రథమసర్గము

## శ్రీ రామనిర్వేదః - శ్రీరాముని పరమవైరాగ్యము

### 1. భరద్వాజ ప్రశ్నః -భరద్వాజుని ప్రశ్న

**ఓమ్ - యతః సర్వాణి భూతాని, ప్రతిభాన్తి స్థితాని చ।**
**యత్రైవోపశమం యాన్తి, తస్మై సత్యాఽఽత్మనే నమః ॥1॥**

1. ఎందుండి సమస్త భూతములు ప్రభవించి స్థితినందుచున్నవో, ఎందవి మరల విలీనమగుచున్నవో (తిరోభావమందుచున్నవో) అట్టి సత్యస్వరూపమగు పరబ్రహ్మమునకు ప్రణామము.

దివి భూమౌ తథాఽఽకాశే, బహిరన్తశ్చ మే విభుః ।
యో విభాత్యవభాసాత్మా, తస్మై సర్వాత్మనే నమః । 2 ।

2. భూమి యందు, అంతరిక్షమున, స్వర్గలోకమున, (ద్యులోకమున) నా యందు, బాహ్యాభ్యంతరములందును, సర్వగతమై - వ్యాపించి - సర్వమును ప్రకాశింపజేయుచున్న సర్వాత్ముడగు పరమాత్మకు ప్రణామము.

అహం బద్ధో విముక్తస్స్యా మితి యస్యాఽస్తి నిశ్చయః ।
నాఽత్యన్త మజ్ఞో నో తద్జ్ఞః, సోఽస్మిన్ శాస్త్రేఽధికారవాన్ ★। 3 ।

3. నేను బద్ధుడను; ముక్తుడనగుదును గాక! అను నిశ్చయము కలవాడే ఈ శాస్త్రమును పఠింపనధికారి. అత్యంతము అజ్ఞుడు, (బొత్తిగ ఏమియు తెలియని దేహాత్మబుద్ధి కలవాడు) సర్వవేత్తయగు ముక్తుడు, ఈ శాస్త్రమును పఠించుట కధికారులు కారు.

గురు మాసీన మేకాన్తే, వాల్మీకిం సర్వదర్శినమ్ ।
పప్రచ్ఛ ప్రణతో భూత్వా, భరద్వాజో మృదుస్వరమ్ । 4 ।

4. ఏకాంతప్రదేశమున నాసీనుడై యున్న సర్వజ్ఞుడగు తన గురువు, వాల్మీకిమహర్షికి ప్రణతుడై, భరద్వాజుడు మృదుస్వరమున నిట్లు ప్రశ్నించెను.

భగవన్! జ్ఞాతు మిచ్ఛామి, కథం సంసారసఙ్కటే ।
రామో వ్యవహృతో హ్యస్మిన్?, కారుణ్యాద్బ్రూహి మే గురో! । 5 ।

---

★ అనుబన్ధచతుష్టయము
"అధికారీ, చ విషయః, సమ్బన్ధశ్చ, ప్రయోజనమ్ ।
శాస్త్రారమ్భ ఫలం ప్రాహు, రనుబన్ధచతుష్టయమ్ ।"
(శంకరుడు - సర్వవేదాన్త సిద్ధాన్త సారసంగ్రహము-6)
(1) అధికారి, (2) విషయము, (3) సంబంధము, (4) ప్రయోజనము - అను ఈ అనుబంధములు నాల్గును, శాస్త్రారంభమునకు ఫలమని పండితులందురు. ఈ నాలుగు నున్న చోటనే శాస్త్రమును ఆరంభింపవలయును. అధ్యాత్మ విద్యాశ్రద్ధాసంపన్నుడగు వ్యక్తియే, ఈ శాస్త్రాధ్యయనమునకు అధికారి. జీవ బ్రహ్మైక్య లక్షణమగు శుద్ధ చైతన్యమే- స్వరూపసిద్ధి విచారమే - ఈ శాస్త్రమందలి ముఖ్య విషయము. ప్రమేయమగు స్వరూపసిద్ధికిని - (జీవ బ్రహ్మైక్యమునకును) ప్రమాణమగు శాస్త్రమునకు గల బోధ్య బోధక సంబంధమే సంబంధము. నిశ్శేష సంసారబంధ విముక్తి హేతువగు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానమే ఈ శాస్త్రమునకు పరమ ప్రయోజనము.

5. భగవంతుడా! గురుదేవా! ఈ సంసారసంకటమున శ్రీరాము డెట్లు వ్యవహరించెనో, తెలియగోరుచున్నాను. కారుణ్యమున దాని నెఱిగింపుము.

**వాల్మీకి రువాచ :—**

**వాసనా ద్వివిధా ప్రోక్తా, శుద్ధా చ, మలినా తథా ।**
**మలినా జన్మనో హేతుః, శుద్ధా జన్మవినాశినీ ॥ 6 ॥**

6. **వాల్మీకి :—** మలినము, శుద్ధము నని వాసన, ద్వివిధము.
మలినవాసన, పునర్జన్మమునకు కారణము, శుద్ధవాసన పునర్భవ వినాశిని. (పునర్జన్మరాహిత్యమును కల్గించును)
[పూర్వజన్మములందలి కర్మముల యొక్క సూక్ష్మసంస్కారములే వాసనలు. భౌతిక శరీర పతనానంతరము, ఈ సంస్కారములు నశింపక, సజీవములై, భావిజన్మముల గతిని ప్రభావిత మొనరించును (నిర్ణయించును)]

**యే శుద్ధవాసనా భూయో, న జన్మాఽనర్థభాజనమ్ ।**
**జ్ఞాతజ్ఞేయా[1]స్త ఉచ్యన్తే, జీవన్ముక్తా మహాధియః ॥ 7 ॥**

7. జీవన్ముక్తులు, మహాప్రజ్ఞావంతులు, శుద్ధవాసనాసంపన్నులగువారు, జ్ఞాతజ్ఞేయు లనబడుదురు. వారు, మరల అనర్థభాజనమైన పునర్జన్మమునకు వశులు కారు.

**జీవన్ముక్తిపదం ప్రాప్తో, యథా రామో మహామనాః ।**
**తత్తేఽహం శృణు వక్ష్యామి, జరామరణశాన్తయే ॥ 8 ॥**

8. మహామతియైన శ్రీరాముడు, జీవన్ముక్తపదము పొందిన విధమును జరామరణోపశాంతికై నీ కెఱిగింతును. వినుము.

**విద్యాగృహాద్వినిష్క్రమ్య, స్వగృహే వసతః సుఖమ్ ।**
**ద్రష్టుం తీర్థాఽఽశ్రమశ్రేణీః, రామస్యోత్కణ్ఠితం మనః[2] ॥ 9 ॥**

1. జ్ఞాతజ్ఞేయులు – ఎఱుగదగిన పరమార్థము నెఱిగినవారు
2. బ్రహ్మవిద్యకు, చిత్తశుద్ధి, అత్యంత ప్రధానమైనది. కాన, అర్హమైన వయోవిద్యాదులు లేనందున, చిత్తశుద్ధి హేతువులగు యజ్ఞాదుల ననుష్ఠించుటకు శక్తి చాలని వారు, తీర్థయాత్రాదులచే, సైతము యజ్ఞఫలమగు చిత్తశుద్ధిని పొంది, బ్రహ్మవిద్యకు అధికారులగుచున్నారు.
**'ఏతే భౌమామ్మయా యజ్ఞాస్తీర్థరూపేణ నిర్మితాః' (యో.వా.తా.ప్ర.)**

9. విద్యాగృహము (గురుకులము) నుండి విద్యల ముగించి, మరలి వచ్చి, సుఖముగ స్వగృహమున నివసించు శ్రీరాముని మనస్సు, పుణ్యక్షేత్ర, పుణ్యనదీ, పుణ్యాశ్రమశ్రేణుల దర్శించుటకు ఉత్సహించినది. (ఆత్రము వహించినది).

**తతః పితర మామన్త్ర్య, తీర్థయాత్రాఽర్థముద్యతః ।**
**నదీతీరాణి పుణ్యాని, వనాన్యాయతనాని చ ॥ 10 ॥**
**సందృశ్య పునరాగత్య, గేహే స న్యవసత్ సుఖమ్ ॥ 11 ॥**

10-11. తరువాత, తండ్రి యనుమతిని పొంది, శ్రీరాముడు తీర్థయాత్రా ప్రయత్నమున **పుణ్యనదీతీరములను, విశాలతపోవనములను,** సందర్శించి మరల గృహమున కేతెంచి, సుఖముగ నివసించుచుండెను.

**అథోనషోడశే వర్షే, వర్తమానే రఘూద్వహః ॥ 11 ॥**
**జగామాఽనుదినం కార్శ్యం, శరదీవాఽమలం సరః ।**
**చిన్తాపరవశ స్తూష్ణీ మవ్యాపారో బభూవ హ ॥ 12 ॥**

11-12. తుది కొన్ని నెలలు కొఱతగు పదునాఱవ యేట, శ్రీరాముడు **శరత్కాలనిర్మలసరోవరము** వలె, అనుదినము శుష్కించుచు, చింతాపరవశుడై మౌనము వహించి, నిర్వ్యాపారి యయ్యెను.

## 2. విశ్వామిత్రాఽఽగమనమ్ – విశ్వామిత్రుని రాక

**ఏతస్మిన్నేవ కాలే తు, విశ్వామిత్రోఽభ్యగా ద్రుషిః ।**
**తదా దశరథో రాజా, పాద్య మర్ఘ్యం నివేద్య చ ॥ 13 ॥**

13. ఈ సమయముననే విశ్వామిత్రమహర్షి యేతెంచినాడు. దశరథ మహారాజు అప్పుడా ఋషికి అర్ఘ్యపాద్యములు నివేదించి–

**ప్రాఞ్జలిః ప్రయతో భూత్వా, విశ్వామిత్ర మభాషత ।**
**"తీర్థభూతోఽసి మే బ్రహ్మన్!, ప్రాప్తః పరమధార్మిక ః ॥ 14 ॥**

14. కృతాంజలియై వినయమున విశ్వామిత్రునితో నిట్లనెను. "మహాత్మా పరమధార్మికుడవైన నీ విచట కేతెంచి నాకు పూజార్హుడవైతివి.

**కశ్చతే పరమః కామః, కిం చ తే కరవాణ్యహమ్?।"**
**త ద్రాజ వచనం శ్రుత్వా, విశ్వామిత్రోఽభ్య భాషత ॥ 15 ॥**

15. ఉత్కృష్టమైన తమ కోరిక యేది? తమ కొఱకు నేనేమి చేయవ

యును.?"- రాజు యొక్క ఈ వచనమును విని, విశ్వామిత్రు డిట్లనెను.

"అహం నియమ మాతిష్ఠే, సిద్ధ్యై సత్యపరాక్రమమ్ ।
మమ విఘ్నకరాణాం చ, రాక్షసానాం వినిగ్రహే ॥ 16 ॥
దక్షం రామం మహాత్మానం, పుత్రం మే దాతు మర్హసి" ।

**16-17.** "నేను యజ్ఞ దీక్షను వహించుచున్నాను. దాని సిద్ధ్యర్థము విఘ్నకరులైన రాక్షసుల నిగ్రహించుటకు, సత్యపరాక్రముదు, సమర్థుడు, మహాత్ముడునైన శ్రీరాముని – నీ పుత్రుని నాకు సమర్పింపుము".

శ్రుత్వైతత్ విహ్వలం భూపం, వసిష్ఠో వాక్య మబ్రవీత్ ॥ 17 ॥
"న పాలయసి చేత్ వాక్యం, కోఽపరః పాలయిష్యతి? ।"

**17-18.** విశ్వామిత్రుని వాక్యము విని విహ్వలుడైన (భయవివశుడైన) రాజునకు వసిష్ఠు డిట్లనెను. "ఆడిన మాటను నీవు పాటింపకున్న, మఱి యెవరు పాటింపగలరు?"

తథా వసిష్ఠే బ్రువతి "రామో రాజీవలోచనః ॥ 18 ॥
ఆగతః తీర్థయాత్రాయాః, తతః ప్రభృతి దుర్మనాః ।
సర్వమేవాఽస దిత్యుక్త్వా, తూష్ణీం ఏకోఽవతిష్ఠతే" ॥ 19 ॥
ఇతి రామజనాత్ శ్రుత్వా, విశ్వామిత్ర ఉవాచ హ ।

**18–20.** వసిష్ఠు డిట్లనగా, శ్రీరాముని (భృత్య) జనుల వలన "కమల లోచనుడగు శ్రీరాముడు, తీర్థయాత్ర నుండి మరలి వచ్చినప్పటి నుండి, ఖిన్న మనస్కుడై, సర్వ మసత్యమని విశ్వయించి, ఏకాంతమున తూష్ణీం భావమున (మౌనము వహించి) ఉన్నాడ"ని విని, విశ్వామిత్రు డిట్లనెను.

"ఏవం చేత్ తం మహాప్రాజ్ఞ మానయత్వత్ర వేగతః ॥ 20 ॥

**20.** "అట్లైన, మహాప్రాజ్ఞుడగు రాముని త్వరితముగ నిటకు గొనిరండు.

ఏష మోహో రఘుపతేః నాఽపద్భ్యో నాఽపి రాగతః ।
వివేక వైరాగ్యవతో, బోధ ఏవ మహోదయః* ॥ 21 ॥

---

★ "నిర్వేద ఆశాపాశానాం, పురుషస్య యథా హ్యసి,
నహ్యఙ్గాఽజాతనిర్వేదో, దేహబన్ధం జిహాసతి ।
యథా విజ్ఞానరహితో మనుజో మమతాం నృప! ॥" (భాగ XI-8-27,28)
నిర్వేదము (పరమవైరాగ్యము) సుఖావహమని వర్ణింపబడినది. నిర్వేదము, ఆశాపాశములను ఖండించు ఖడ్గము. విజ్ఞానరహితుడగు మనుజుడు, మమతాబంధము నుండి విముక్తిని కాంచనట్లు, నిర్వేద ముదయింపనివాడు, శరీర, తత్సంబంధ బంధము నుండి విముక్తిని గాంచవేరడు.

21. రఘుపతి(రాముని) యొక్క ఈ మోహము (చిత్త విభ్రాంతి; అజ్ఞానము) ఆపదల వలన గాని, రాగము (మనఃక్లేశము; అనురాగము) వలన గాని, కల్గినది కాదు. ఇది వివేకవైరాగ్యవంతునికి కల్గు జ్ఞానము యొక్క మహోదయము మాత్రమే. (వివేక వైరాగ్య పూర్వకమగు జ్ఞానోదయము మాత్రమే.)

**మోహేఽస్మిన్ మార్జితే, యుక్త్యా, విశ్రాన్తి మేష్యతి ధ్రువమ్" ।**

22. ఉపాయముచే (సమ్యగ్విచారముచే) ఈ మోహము ప్రక్షాళితమైనచో, ఈతడు చిత్త విశ్రాంతిని(పరమ ప్రశాంతిని) నిశ్చయముగ పడయగలడు."

**ఏతస్మిన్నన్తరే రామః, పితుః పాదాభివన్దనమ్ । 22 ।**
**కర్తు మభ్యాగత స్తత్ర, ప్రణమ్య పితరం మునీ ।**
**భూమౌ పరిజనాస్తీర్ణే, చాఽఽసనే స న్యవిక్షత । 23 ।**

23. అంతలో శ్రీరాముడు, పితృపాదాభివందన మొనర్చుట కేతెంచెను; తండ్రికిని, మును లిద్దరికిని(వసిష్ఠవిశ్వామిత్రులకు) ప్రణమిల్లి, సేవకులు నేలపై పఱచిన రత్నకంబళిపై నాసీనుడయ్యెను.

**తదా రాజ్ఞా మునిభ్యాం చ, సంపృష్టో మోహకారణమ్ ।**
**ఉవాచ వచనం రామో, యథావదతి విస్తరమ్ । 24 ।**

24. అపుడు, మోహ కారణమును రాజు, వసిష్ఠవిశ్వామిత్రులును, ప్రశ్నింపగా, శ్రీ రాము డతి విస్తరముగ నీ వచనముల పల్కెను.

## 3. జీవితం దుఃఖమయమ్ – జీవితము దుఃఖమయము

**శ్రీరామ ఉవాచ :–**

**"కథయామ్యహ మజ్ఞోఽపి, విచారః క్రియతే మయా ।**
**జాయతే మృతయే లోకో, మ్రియతే జననాయ చ । 25 ।**

---

"వైరాగ్యం చ ముముక్షుత్వం, తీవ్రం యస్య తు విద్యతే ।
తస్మిన్నేవాఽర్థవన్తః స్యుః, ఫలవన్తః శమాదయః ।
ఏతయో ర్మన్దతా యత్ర విరక్తత్వ ముముక్షుయోః ।
మరౌ సలిలవత్తత్ర శమాదేర్భానమాత్రతా ।" (శంకరుడు-వివేకచూడామణి-30,31)
తీవ్ర(గాఢ) విరక్తి, మోక్షేచ్ఛ, కలవారి యందు మాత్రమే శమము, దమము, ఉపరతి, తితిక్షా, శ్రద్ధా, సమాధానములు, సార్థకములై ఫలవంతములగును. ఎవరి యందు వైరాగ్యముముక్షుత్వములు తాత్కాలికములై, మందస్థితి యందుండునో, వారికి శమాదులు, మరుమరీచికలందలి జలముల వలె కేవలము బాహ్యమునకు గోచరించును కాని, ఫలవంతములు కావు; జ్ఞానోత్పత్తిని కల్గింపజాలవు.

"——, before the bright Path of the Sun can be trodden, the aspirant must enter the valley of gloom, must close his eyes and ears to the light and laughter of life, and must realise in sorrow that all that he is and all that he has is nothing, before he can see and know in joy that within his heart is the All." [The Yoga of the Bhagavad Gita (Chapter-I-p5) Sri Krishna Prem - The New Order Book Co, Ahmedabad 1982)

25. శ్రీరాముడు :- "నేను అజ్ఞానినైనను, నేనొనర్చిన విచారము నెఱిగింతును. లోకము (జనము), మృతి కొఱకు జన్మించును; జన్మించుటకై మరణించును.

అస్థిరాః సర్వ ఏవైతే, సచరాఽచరచేష్టితాః ।
కిం మే రాజ్యేన? కిం భోగైః?, కోఽహం?, కిమిద మాగతమ్? ॥ 26 ॥

26. స్థావర జంగమాదికమైన సర్వమును, అశాశ్వతము. రాజ్యము తోడను, భోగములతోడను, నాకేమి ప్రయోజనము? నేనెవడను? ఇట కేతెంచిన దేది?

ఏవం విమృశత స్తీవ్రం, సర్వేష్వపి చ వస్తుషు ।
అరతి ర్మమ సంజాతా, పథికస్య మరుష్వివ ॥ 27 ॥

27. ఇట్లు తీవ్రముగ విచారింపగా, పాంథునకు మరుభూములు (ఎడారుల) యందు విరక్తి కల్గునట్లు, నాకును సర్వభోగవిషయములందును విరాగ ముదయించినది.

శామ్యతీదం కథం దుఃఖ, మితి తప్తోఽస్మి చిన్తయా ।
శ్రీ ర్మునే! పరిమోహాయ, సాఽపి నూనం న శర్మదా ॥ 28 ॥

28. 'ఈ దుఃఖ మెట్లుపశమించు' నను చింతచే పరితపించుచున్నాను. మహర్షీ! లక్ష్మి (సంపద) మోహమును కల్గించును. అది సుఖదాయిని కానేకాదు.

శ్రీమా నజననిన్ద్యశ్చ, శూరశ్చాఽప్యవికత్థనః ।
సమదృష్టిః ప్రభుశ్చైవ, దుర్లభాః పురుషా స్త్రయః ॥ 29 ॥

29. జననిందితుడు గాని శ్రీమంతుడు(ధనికుడు), ఆత్మస్తుతి పరాయణుడు కాని (తన్నుపొగడు కొనని) వీరుడును, పక్షపాత రహితుడగు (సమదృష్టి యగు) ప్రభువును, - ఈ ముగ్గురు పురుషులును దుర్లభులు.

ఆయుః పల్లవకోణాగ్ర, లమ్బ్వాఽమ్బు కణభఙ్గురమ్ ।
యుజ్యతే వేష్టనం వాయో, రాకాశస్య చ ఖణ్డనమ్ ॥ 30 ॥
గ్రథనం చ తరఙ్గాణా మాస్థా నాఽఽయుషి యుజ్యతే ।

**30-31.** ఆయువు చిగురుటాకు కొననున్న జలబిందువు వలె క్షణభంగురము. గాలిని (తలపాగగా) చుట్టవచ్చును. ఆకాశమును తుత్తునియలుగ ఖండింపవచ్చును. తరంగములను (నీటి అలలను) - జతలుగ కూర్పవచ్చును. కాని, ఆయువు నందు ఆస్థ (అపేక్ష), తగనిది.

**తరవోఽపి హి జీవన్తి, జీవన్తి మృగపక్షిణః ॥ 31 ॥**
**స జీవతి మనో యస్య, మననేనైవ జీవతి ।**
**జాతా స్త ఏవ జగతి, జన్తవః సాధుజీవితాః ॥ 32 ॥**
**యే పునర్నేహ జాయన్తే, శేషా జరఠగర్దభాః ।**

**31-33.** చెట్టు చేమలు జీవించుచున్నవి. పశువులు పక్షులును జీవించుచున్నవి. కాని, ఎవని మనస్సు, మననముతో జీవించునో, వాని జీవితమే జీవితము. పునర్జన్మము ఈ సంసారమున బొందని సాధుజీవనులు మాత్రమే, ఈ జగమున జన్మమందిన వారు. (వారి జీవితమే ప్రశంసింప దగినది). తక్కిన జీవు లందఱును ముసలి గాడిదల వంటి వారే. (ముసలి గాడిద వలె చిరకాలము జీవించినను, వారి జీవితము అప్రశస్తము)

**భారోఽవివేకినః శాస్త్రం, భారో జ్ఞానం చ రాగిణః, ॥ 33 ॥**
**అశాన్తస్య మనో భారో, భారోఽనాత్మవిదో వపుః★।**

**33-34.** వివేకరహితులకు శాస్త్రము భారము. రాగము (కోరిక) కలవానికి జ్ఞానము భారము. శాంతిహీనునికి మనస్సు భారము. ఆత్మజ్ఞాన రహితునకు తన శరీరమే భారము.

**అహఙ్కారవశా దాప దహఙ్కారా ద్దురాధయః ॥ 34 ॥**
**అహఙ్కారవశా దీహా, నాఽహఙ్కారాత్ పరో రిపుః ।**

---

★ పోల్చు :- "దీఘా జాగరతో రత్తి, దీఘం సన్తస్స యోజనం ।
దీఘో బాలానం సంసారో, సద్ధమ్మం అవిజానతం ॥" (ధమ్మపదం -60)
నిద్రరాని వానికి రాత్రి దీర్ఘము. అలసిన వానికి యోజనము దీర్ఘము. సద్ధర్మ మెఱుగని మూర్ఖులకు సంసారము దీర్ఘము.
మఱియు :- "అజ్ఞస్య దుఃఖౌఘమయం, జ్ఞస్యాఽఽనన్దమయం జగత్ ।
అన్ధం భువనమన్ధస్య, ప్రకాశం తు సుచక్షుషః ॥"
(శ్రీ యజ్ఞవరాహ భగవద్గీత - 42)
అజ్ఞాని కి జగత్తు, దుఃఖ ప్రవాహమయము; జ్ఞానికి ఆనందమయము. అంధునికి భువనము అంధమే; సుచక్షువునకు (చక్కని దృష్టిగలవానికి) ప్రకాశమయము.

**34-35.** ఆపదలు, (శరీరదుఃఖములు) దుశ్చింతలు (మనోదుఃఖములు), కోరికలును, అహంకారము వలననే పుట్టుచున్నవి. అహంకారమున కంటే నికృష్టతర శత్రువు లేదు.

ఇతస్తతశ్చ సువ్యగ్రం, వ్యర్థమేవాఽభిధావతి ॥ 35 ॥
దూరా ద్దూరతరం చేతో, గ్రామే కౌలేయకో యథా ।

**35-36.** మిగుల వ్యాకులమై, గ్రామశునకము వలె, మనస్సు వ్యర్థముగ ఇటు నటు, దూరము నుండి దూరతర ప్రాంతములకు పరువులెత్తుచుండును.

న ప్రాప్నోతి క్వచిత్ కిఞ్చిత్, ప్రాప్తైరపి మహాధనైః ॥ 36 ॥
నాఽన్తః సంపూర్ణతా మేతి, కరణ్డక ఇవాఽమ్బుభిః ।

**36-37.** దీనికెచ్చటను ఏమియు దొరకదు, మహాధనరాశి ప్రాప్తించినను, ఎన్ని నీళ్లు పోసినను నిండని వెదురు బుట్టవలె, - అంతఃసంపూర్ణతను ఇది పొందదు.

అప్యబ్ధిపానా న్మహతః, సుమేరూన్మూలనాదపి ॥ 37 ॥
అపి వహ్న్యశనాత్ సాధో! విషమః చిత్తనిగ్రహః ।*

**37-38.** మహా సముద్ర జలపానమున కంటెను, సుమేరు పర్వతమును పెకలించుట కంటెను, దావాగ్నిని భక్షించుట కంటెను, ఓ సాధువర్యా! చిత్త నిగ్రహము కష్టతరము.

---

★ పోల్చు:- "మనో దుర్నిగ్రహం చలమ్" । (భగీ. VI-35)

"క. ఆదలదు ప్రాణము లదలిన, కదలదు సర్వాంగకములు కదలుచు నుండన్ ।
వదలదు బిగువులు వదలిన, తుదలేది తృష్ణ దీని ద్రుంపగ వలయున్ ।
(పోతన మహాకవి – భాగ -IX-577)

"యథా పి మూలే అనుపద్దవే దళ్హే, ఛిన్నోపి రుక్ఖో పునరేవ రూహతి ।
ఏవమ్పి తణ్హానుసయే అనూహతే, నిబ్బత్తతీ దుక్ఖమిదం పునప్పునం ॥"
(ధమ్మపదం - 338 - డా॥ రత్నాకరం బాలరాజు – 1994)

మూలమునకు (తల్లి వేరుకు) హాని కలుగక, అది దృఢముగ నున్నపుడు, వృక్షము ఛేదింపబడినను, మరల చిగిరించునట్లు, తృష్ణ యొక్క సంస్కారము నశింపనిచో, నీ దుఃఖము మాటి మాటికి నుత్పన్నమగుచుండును.

మఱియు :- బృ. ఉ. III-9-28.

సర్వసంసారదోషాణాం, తృష్ణైకా దీర్ఘదుఃఖదా ॥ 38 ।

నాఽసిధారా న వజ్రార్చిః, న తప్తాఽయఃకణార్చిషః ।
తథా తీక్ష్ణా యథా బ్రహ్మన్! తృష్ణేయం హృది సంస్థితా ॥ 39 ॥

38-39. సంసారమందలి దోషములన్నిటిలోను, తృష్ణయొక్కటే దీర్ఘ దుఃఖమును కల్గించును. బ్రహ్మజ్ఞుడా! నిశితమైన ఖడ్గధార కంటెను, వజ్రజ్వాల కంటెను, కాలుచున్న ఇనుపగుండ్ల నుండి వెలువడు అగ్నికణముల కంటెను, హృదయస్థమైన ఈ తృష్ణ మిక్కిలి తీక్ష్ణమైనది.

అపి మేరూపమం ప్రాజ్ఞ, మపిశూర మపి స్థిరమ్ ।
తృణీకరోతి తృష్ణైకా, నిమేషేణ నరోత్తమమ్ ॥ 40 ॥

40 మేరుపర్వతసదృశుడైన ప్రాజ్ఞుని, శూరుని, అపరిగ్రహవ్రతమున స్థిరచిత్తుడునైన నరోత్తముని సైతము, తృష్ణ ఒక్క నిమిషమున, తృణప్రాయునిగా చేయుచున్నది. (తృష్ణావశమున పరుల యాచించు వాడు, వారి దృష్టిలో తృణముతో సమానుడే కదా!)

( ఈ తృష్ణ నెవడీ లోకమున నిగ్రహించునో, వాని దుఃఖములన్నియు కమల పత్రజలబిందువుల వలె నిర్గళితములై నశించునని శ్రుతి సూక్తి.)

## 4. వయోఽవస్థాః దుఃఖదాః –
## వయోవస్థలు దుఃఖదాయకములు

దేహః స్ఫురతి సంసారే, సోఽపి దుఃఖాయ కేవలమ్ ।
నాఽస్తి దేహసమః శోచ్యో, నీచో గుణబహిష్కృతః ॥ 41 ।

41. ఈ సంసారమున సుఖభోగాస్పదమైనదిగా దేహము స్ఫురించు (తోచు) చున్నది. కాని, ఇదియును, కేవలదుఃఖానుభవము కొఱకే. దేహముతో సమానమైన శోచనీయము, అధమము, గుణవిహీనమునైన వస్తువు మఱియొకటి లేదు.

**కిం శ్రియా?, కిం చ రాజ్యేన?, కిం కాయేన? కిమీహితైః? ।**
**దినైః కతిపయై రేవ, కాలః సర్వం నికృన్తతి★ ॥ 42 ॥**

42. సంపదలతోను, రాజ్యముతోను, శరీరముతోను, కోరికలతోను, ప్రయోజన మేమున్నది? కొలది దినములలోనే కాలము సర్వమును కబళించుచున్నది. (ఛేదించుచున్నది.)

**రక్తమాంసమయస్యాఽస్య, సబాహ్యాభ్యన్తరం మునే! ।**
**నాశైక ధర్మిణో బ్రూహి, కైవ కాయస్య రమ్యతా? ॥ 43 ॥**

43. మునీంద్రా! ఈ శరీరము లోపల, బయట, రక్త మాంసమయము. దీని ధర్మము - (స్వభావము) - కేవల వినాశమే. ఈ శరీరము యొక్క రమ్యత యేదియో విచారించి వచింపుడు.

**అశక్తి రాపద స్తృష్ణా, మూకతా మూఢబుద్ధితా ।**
**గృధ్నుతా లోలతా దైన్యం, సర్వం బాల్యే ప్రవర్తతే ॥ 44 ॥**

44. శక్తిహీనత, ఆపదలు, ఆశ, మూగతనము (మాటలు లేమి) మూఢత్వము, లుబ్ధత, చాంచల్యము, దీనత్వము, ఇవి యన్నియు బాల్యధర్మములు. (బాల్యదశయందు ప్రవర్తిల్లును)

**అమేధ్య ఏవ రమతే, బాలః కౌలేయకో యథా ।**
**శైశవే గురుతో భీతిః, మాతృతః పితృత స్తథా ॥ 45 ॥**

45. బాలుడు, కుక్కవలె అమేధ్యము నందే క్రీడించును. బాల్యమున గురువులు, తల్లిదండ్రులు - వీరి వలన భయము కల్గును.

---

★ పోల్చు :- "శ్వోఽభావా మర్త్యస్య యదన్తకైతత్,
సర్వేన్ద్రియాణాం జరయన్తి తేజః ।
అపి సర్వం జీవిత మల్పమేవ,
తవైవ వాహా స్తవ నృత్యగీతే" (కఠ.ఉ. I-26)

"ఓ యమధర్మరాజా! భోగజాతమంతయు నశ్వరమైనది. సకలేంద్రియ తేజమును (శక్తిని) అది, కృశింపజేయుచున్నది. భోగాదులు అనర్థముల కొఱకే. జీవితము సర్వమును, బ్రహ్మాదుల ఆయువు సైతము అల్పమే. నీవిచ్చు అశ్వరథాదులు, నృత్యగీతములు నీకే యుండుగాక!" అని, ఏ ప్రలోభమునకు లొంగని నచికేతుని పరమ వైరాగ్య భావమునిట అనుసంధించునది.

జనతో జ్యేష్ఠబాలాచ్చ, శైశవం భయమన్దిరమ్ ।
విస్తీర్ణాఽపి ప్రసన్నాఽపి, పావన్యపి హి యౌవనే ॥ 46 ॥
మతిః కలుషతామేతి, ప్రావృషీవ తరఙ్గిణీ ।

**46-47.** అపరిచితులగు జనుల వలన, పెద్దపిల్లల వలనను, శైశవము, భయమునకు మందిరమగుచున్నది. యౌవనమున బుద్ధి, విశాలము, ప్రసన్నము (స్వచ్ఛము), పావనమునైనను, వర్షాకాల నది వలె కలుషితమగుచున్నది.

యదా యదా పరాం కోటి మధ్యారోహతి యౌవనమ్ ॥ 47 ॥
వల్గన్తి సజ్వరాః కామాః, తదా నాశాయ కేవలమ్ ।

**47-48.** యౌవనము ముదిరిన కొలది - (నడి యౌవనమున) - సంతాప కారకములైన కామములు - (కామజ్వరములు) - త్రుళ్ళియాడుచు, కేవలము నాశమునే కల్గించును.

తే వన్ద్యాస్తే మహాత్మాన, స్త ఏవ పురుషా భువి ॥ 48 ॥
యే సుఖేన సముత్తీర్ణా, సాధో! యౌవన సఙ్కటాత్ ।★

**48-49.** మహాత్మా! ఈ యౌవనసంకటము నుండి, ఎవరు సుఖముగ సముత్తీర్ణులగుదురో, వారే పూజ్యులు, వారే మహాత్ములు, వారే ఈ లోకమున పురుషులు.

మాంసపాఞ్చాలికాయాస్తు, యన్త్రలోలేఽఙ్గపఞ్జరే ॥ 49 ॥
స్నాయ్వస్థిగ్రన్థి శాలిన్యాః, స్త్రియాః కిమివ శోభనమ్?।

**49-50.** నాడులతో, ఎముకల కూర్పులతో, మాంసపు బొమ్మయై, యంత్రము

---

★ పోల్చు :- "శృంగారద్రుమ నీరదే, ప్రసృమరక్రీడారసస్రోతసి,
ప్రద్యుమ్నప్రియ బాన్ధవే, చతురవాఙ్ముక్తాఫలోదన్వతి ।
తన్వీనేత్ర చకోర పార్వణ విధౌ సౌభాగ్యలక్ష్మీ నిధౌ,
ధన్యః కోఽపి న విక్రియాం కలయతే ప్రాప్తే నవే యౌవనే ॥" (భర్తృహరి -II-30)

"మారుని కూర్మి చుట్టము, సమంచిత కేళి రసప్రవాదంబు, శృం
గార మహీజ నీరదము, కంజముఖీ జన దృక్చకోరరా
కారజనీశ మండలము, కాంతవచోఽమృతవార్ధి, యౌవనం
బారయజెందుచో వికృతి నందని వాడె కృతార్థు డిమ్మహిన్ ॥"

వలె కదలుచుండెడి స్త్రీదేహపంజరమునందు శోభావహమైన, సంభావ్యమైన వస్తు వేమున్నది?

**త్వఙ్మాంసరక్తబాష్పామ్బు, పృథక్కృత్వా విలోచనమ్ । 50 ।**
**సమాలోకయ రమ్యం చేత్, కిం ముధా పరిముహ్యసి?।**

**50-51.** వనిత నేత్రములను, చర్మమును, మాంసమును, రక్తమును, కన్నీటిని, వేర్వేఱు చేసి, రమ్యమైనచో, పరికింపుము. వ్యర్థముగ నేల మోహ మందెదవు?

**యస్య స్త్రీ తస్య భోగేచ్ఛా, నిఃస్త్రీకస్య క్వ భోగభూః । 51 ।**
**స్త్రియం త్యక్త్వా, జగత్ త్యక్తం, జగత్ త్యక్త్వా సుఖీ భవేత్ ।**

**51-52.** కాంతా సహితునికే భోగేచ్ఛ; కాంతారహితునకు భోగభూమి యెచ్చట? కామినీత్యాగము వలన జగమే (సంసార బంధములే), పరిత్యక్తమగును. సంసారబంధము త్యజించినవాడు సుఖించును.

**అపర్యాప్తం హి బాలత్వం, బలాత్ పిబతి యౌవనమ్ । 52 ।**
**యౌవనం చ జరా పశ్చాత్, పశ్య కార్కశతాం మిథః ।**★

**52-53.** అసంపూర్ణమైన (కోర్కులు నిండని) బాల్యమును, బలాత్కారముగ యౌవనము కబళించును. (భోగాభిలాషలు నిండని) యౌవనమును, తరువాత, ముదిమి మ్రింగును. ఈ పరస్పర క్రౌర్యమును కాంచుము.

**దుష్ప్రేక్ష్యం జరఠం దీనం, హీనం గుణపరాక్రమైః । 53 ।**
**గర్ధో హ్యభ్యేతి సోల్లాస ముపభోక్తుం న శక్యతే ।**
**హృదయం దహ్యతే నూనం, శక్తిదౌస్థ్యేన వార్ధకే । 54 ।**

---

★ పోల్చు :- "ఆక్రాన్తం మరణేన జన్మ, జరసా చాఽత్యుజ్జ్వలం యౌవనమ్,
సన్తోషో ధనలిప్సయా, శమసుఖం ప్రౌఢాఙ్గనావిభ్రమైః ।
లోకైర్మత్సరిభిర్గుణా, వనభువో వ్యాళై, ర్నృపా దుర్జనై
రస్థైర్యేణ విభూతయోఽప్యుపహతా, గ్రస్తం న కిం కేన వా ? ॥"
(భర్తృహరి. III-32)

జన్మమును మరణము, యౌవనమును వార్ధకము, సంతోషమును ధనాశ, శాంతి వలని ఆనందమును ప్రౌఢాంగనల విలాసములు, సద్గుణములను మాత్సర్యము గల కూళలు, వనభూములను క్రూరజంతువులు, రాజులను దుర్జనులు, (దుర్మంత్రులు) ఐశ్వర్యములను, అస్థిరత్వము ఆక్రమించి, చెఱచి వేయుచున్నవి. అన్నియు ఉపద్రవగ్రస్తములే. ఇంక, నిరుపద్రవమైన దేది కలదు? అని, భర్తృహరి యోగీంద్రుడు, భోగముల యొక్క అస్థిరత్వమును నిరూపించినాడు.

53-54. చూడ నసహ్యము గొల్పు దీనుడు, గుణ పరాక్రమహీనుడునైన వృద్ధుని సోల్లాసముగ కామము (కోరిక) ఆవహించును. కాని భోగించుటకు శక్తి యుండదు. వృద్ధావస్థ యందు అనుభవింప శక్తి లేని దురవస్థ, హృదయమును నిశ్చయముగ దహించివైచును కదా!
(గర్ధము - అభికాంక్ష.)

## 5. కాలవైభవమ్ – కాలవైభవము (విలాసము)

క్వచిద్వా విద్యతే యేషాం, సంసారే సుఖభావనా ।
ఆఖుః తన్తుమివాఽశేషం, కాల స్తామపి కృన్తతి* ॥ 55 ॥

55. కొన్ని యెడల ఎక్కడైన, ఎవరికైన, కొందఱికి సంసారమున సుఖభావన యున్నను, దానిని సైతము, మూషికము, తంతువుల (నూలి పోగుల) నుత్తరించునట్లు, కాలము నిశ్శేషముగ ధ్వంసమొనరించుచున్నది.

మహతామపి నో దేవః, పరిపాలయతి క్షణమ్ ।
కాలః కబళితాఽశేష విశ్వో, విశ్వాత్మతాం గతః ॥ 56 ॥

56. కాలదేవుడు, గొప్పవారి సుఖమును సైతము, క్షణకాలమైనను రక్షింపడు; విశ్వమును నిరవశేషముగ కబళించి, విశ్వాత్మకత్వమును అతడు పొందినాడు.

వృత్తేఽ స్మిన్నేవమేతేషాం, కాలాదీనాం మహామునే! ।
సంసారనామ్ని కైవాఽఽస్థా మాదృశానాం భవతీహ? ॥ 57 ॥

57. సంసార జీవితమున ఈ కాలాదుల వర్తన మిట్టిదైనచో, మాబోంట్లకు అపేక్ష (ప్రీతి; ఆలంబనము) ఎట్లు కల్గునో వచింపుడు.

మనో విముహ్యతీవాఽన్తః, ముదితా దూరతాం గతా ।
ధీరతాఽధీరతామేతి, ధ్రువోఽప్యధ్రువజీవితః ॥ 58 ॥

58. అంతఃకరణము, లోన మూర్ఛిల్లినట్లున్నది. ఆనందము దూరమైనది. ధైర్య మధైర్యమైనది. ధ్రువుని జీవితము సైతము అధ్రువమే.

---

★ చూడు :– మ.భా.స్త్రీ పర్వము -V-1-24 శ్లోకములు – ధృతరాష్ట్రునికి విదురుడు గూపవన దృష్టాంతము చే, జగత్తు యొక్క ఘోరరూపమును వర్ణించుట.

అమరా అపి మార్యన్తే, కైవాఽఽస్థా మాదృశే జనే?।
శైలా అపి విశీర్యన్తే, కైవాఽఽస్థా మాదృశే జనే ? । 59 ।

59. అమరులు (దేవతలు) సైతము మరణించుచున్నారు. ఇక, మావంటి వారికి గతి ఏది? పర్వతములు సైతము విశీర్ణము లగుచుండగా, (విడిపోయి చెదరిపోవుచుండగా), మావంటి వారి విషయమున నమ్మిక యేమున్నది?

శుష్యన్త్యపి సముద్రాశ్చ, శీర్యన్తే తారకా అపి ।
సిద్ధా అపి వినశ్యన్తి, కైవాఽఽస్థా మాదృశే జనే? । 60 ।

60. సముద్రములును ఎండిపోవుచున్నవి. నక్షత్రములును విశీర్ణములగు చున్నవి. సిద్ధ పురుషులు సైతము నశించుచున్నారు. ఇక మాబోంట్ల విషయమున నమ్మిక యెట్లుండును?

పరమేష్ఠ్యపి నిష్ఠావాన్, హ్రియతే హరి రప్యజః ।
భవోఽప్యభావమాయాతి, కైవాఽఽస్థా మాదృశే జనే ? । 61 ।

61. సృష్టికర్తయగు పరమేష్ఠి (బ్రహ్మ)యును నియమితకాలమున నశించుచున్నాడు. జన్మరహితుడగు హరి(స్థితికర్త)యు నశించుచున్నాడు. భవుడు(లయకర్త రుద్రుడు)ను, అభావమందు చున్నాడు. ఇక మావంటి వారికి నమ్మిక యేమున్నది? (నిష్ఠా = పరిసమాప్తిః)

బ్రహ్మా, విష్ణుశ్చ, రుద్రశ్చ, సర్వా వా భూతజాతయః ।
నాశ మేవాఽనుధావన్తి,* సలిలానీవ బాడబమ్ । 62 ।

---

★ పోల్చు :- "కోటయో బ్రహ్మణాం యాతా, భూపా నష్టాః పరాగవత్ ।
తథాఽధ్యాత్మాభిమానోఽపి, విదుషోఽ ప్యసురత్వతః ॥"

చతుర్ముఖబ్రహ్మల కోటిసంఖ్యాకములు గతించినవి. ఇక్ష్వాకు మాంధాత్రాది మహారాజులు ధూళివలె గతించినారు. అట్లే విద్వాంసునకును రాక్షస స్వభావమైన దేహాభిమానము అనేకము నశించినది. అనగా, జ్ఞానికిని ఇది వఱ కనేక దేహములు కలిగి నశించినవని భావము.

(శ్రీయజ్ఞవరాహభగవద్గీత -130)

"సా రమ్యా నగరీ, మహాన్ స నృపతిః, సామన్తచక్రం చ తత్
పార్శ్వే తస్య చ సా విదగ్ధపరిషత్, తాశ్చన్ద్రబిమ్బాననాః ।
ఉద్వృత్తః స చ రాజపుత్రనివహః, తే, బన్దినః, తాః కథాః,
సర్వం యస్య వశా దగాత్ స్మృతిపదం కాలాయ తస్మై నమః ॥" (భర్తృహరి - వైరాగ్య - 41)

62. బ్రహ్మ విష్ణు రుద్రులు, లేక, సర్వభూతజాతులును బడబాగ్ని వైపునకు సముద్రోదకముల వలె, వినాశము వైపునకు పరుగులిడుచున్నవి.

[బడబాగ్ని, సాగర జలములను శుష్కింపజేయునని సంభావింపబడినది.]

ఆపదః క్షణమాయాన్తి, క్షణమాయాన్తి సంపదః ।
క్షణం జన్మ, క్షణం మృత్యుః, మునే! కిమివ న క్షణమ్? ॥ 63 ॥

63. క్షణములో ఆపదలు కల్గుచున్నవి; మఱొక క్షణమున సంపదలును; క్షణమున జన్మము; క్షణమున మరణము. మునీంద్రా! వాస్తవమున, క్షణికము కానిదేది? (ఇచ్చట, సదైకరూపము, స్థిరమున్నైన దేదియును, లేదని భావము)

ఇతి మే దోషదావాఽగ్నిదగ్ధే, సపది చేతసి ।
ప్రస్ఫురన్తి న భోగాశాః, మృగతృష్ణా సరస్స్వివ ॥ 64 ॥

64. ఇట్లిపుడు నా మనస్సు, దోషదావాగ్ని యందు కాలిపోవుచుండగా, సరస్సులందు మృగతృష్ణ లట్లు (ఎండమావులట్లు) నాకు భోగాశలు స్ఫురించుట (ఉదయించుట) లేదు.
[ఎండమావులు జలములపై కాన్పింపవు.]

నాఽభినన్దామి మరణం, నాఽభినన్దామి జీవితమ్ ।
యథా తిష్ఠామి తిష్ఠామి, తథైవ విగతజ్వరమ్ ॥ 65 ॥

65 మరణమును గాని, జీవితమును గాని, నే నభినందింపను. (కాంక్షింపను) విగతజ్వరుడనై (చింతారహితుడనై) యెట్లుండవలెనో, అట్లుండ గోరెదను.

యథా జానాసి భగవన్!, తథా మోహనివృత్తయే ।
బ్రూహి మే సాధవో యేన, మూచం నిర్దుఃఖతాం గతా ॥ 66 ॥

---

"ఆదిమేలైన పురంబు, పూజ్యచరితుం, దారాజు, రాణ్మండలం
బది, పార్శ్వంబున నా విద్వద్గణంబు, నా రజ్ఞాన్య, లత్యుద్ధతం
బది రాజన్యక, మద్ది వందివికరం, బా గాథలం నర్వమూం
గదలం జేసిన కాలమూర్తికి, నమస్కారంబు నల్కిర్తికిన్ గో"

**66.** భగవంతుడా! సత్పురుషు లెట్లు దుఃఖనివృత్తిని పొందిరి? మీరెఱిగినట్లు నా మోహనివృత్తికై దానిని నాకెఱిగింపుడు.

**అథవా తాదృశీయుక్తి ర్యది బ్రహ్మన్! న విద్యతే ।**
**న వక్తి మమ వా కశ్చిత్, విద్యమానా మపి స్ఫుటమ్ । 67 ।**

**67.** బ్రహ్మజ్ఞుడా! అట్టి ఉపదేశరూపమగు ఉపాయము లేకున్నచో, లేక, ఉన్నను, దానిని నాకెవరును విశదముగ నెఱిగింపనిచో -

**స్వయం చైవ న చాఽప్నోమి, తాం విశ్రాన్తి మనుత్తమామ్ ।**
**తదహం త్యక్తసర్వేహో, నిరహఙ్కారతాం గతః । 68 ।**
**న కిఞ్చిదపి వాఞ్ఛామి, దేహత్యాగాదృతే మునే! ।**
**మౌన ఏవాఽవ తిష్ఠామి, లిపికర్మస్వివాఽర్పితః" । 69 ।**

**68-69.** స్వయముగ పరమోత్తమమైన ఆ ప్రశాంతి నాకు లభింపనిచో, దేహ త్యాగమున కంటె నితరమును కాంక్షింపను. కోరికలనన్నిటిని త్యజించి, నిరహంకృతినొంది, చిత్ర లిఖిత వ్యక్తి వలె, మౌనమును వహింతును."

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'శ్రీ రామ నిర్వేదో' నామ ప్రథమఃసర్గః

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'శ్రీ రామనిర్వేద'మను ప్రథమ (మొదటి) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనె ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో, వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీ రామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ద్వితీయసర్గము

## ఉపదేశోపక్రమః – ఉపదేశప్రారంభము

### 1. శుకోపాఖ్యానమ్ – శుకుని కథ

**వాల్మీకి రువాచ :–**

ఇత్యుక్త్వా విరతే రామే, విశ్వామిత్రోఽభ్యభాషత ।

వాల్మీకి :- ఇట్లు వచించి, శ్రీరాముడు విరమింపగా, విశ్వామిత్రమహర్షి అతని కిట్లు వచించెను.

**విశ్వామిత్ర ఉవాచ :–**

"న రాఘవ! తవాఽస్త్యన్యత్, జ్ఞేయం జ్ఞానవతాం వర! ॥ 1 ॥

1. విశ్వామిత్రుడు :- "జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవైన శ్రీరామా! నీ వెఱుగ దగినది, ఇతరమేదియు లేదు.

**స్వయైవ సూక్ష్మయా బుద్ధ్యా, సర్వం విజ్ఞాతవానసి ।**
**భగవద్వ్యాస పుత్రస్య, శుకస్యేవ మతిస్తవ ॥ 2 ॥**

2. సూక్ష్మమైన స్వబుద్ధితో సర్వమెఱిగితివి. భగవంతుడగు వ్యాసర్షి పుత్రుడు శుకుని బుద్ధి వంటిదే నీ బుద్ధియును.

**విశ్రాన్తి మాత్రమేవాఽన్తః, జ్ఞాతజ్ఞేయోఽభ్యపేక్షతే ।**
**శుకో వ్యాసాత్మజః పూర్వం, చిన్తయన్ జగతో గతిమ్ ॥ 3 ॥**

**స్వయమేవ వివేకేన, బుద్ధోఽపి పరవస్తుని ।**
**'ఇదం వస్త్వి'తి విశ్వాసం నాఽసావాత్మన్యుపాయయౌ ॥ 4 ॥**

3-4. జ్ఞేయవస్తువు (పరమాత్మ) నెఱిగిన జ్ఞాతయు, అంతఃశాంతినే ఆకాంక్షించును. వ్యాసాత్మజుడగు శుకుడు పూర్వము సంసారగతిని విచారించుచు స్వయముగ వివేక బలమున పరతత్త్వము నెఱిగియు, '**ఇదియే వస్తువు**'-అను విశ్వాసమును హృదయమున పొంద జాలడయ్యెను.

**అవిశ్రాన్తమనాః స్థిత్వా, ప్రపచ్ఛ పితరం తదా ।**
**"సంసారాఽఽడమ్బర* మిదం, కథ మభ్యుదితం? మునే ! ॥ 5 ॥**

5. చిత్త విశ్రాంతిని పొందక, శుకుడు తండ్రినిట్లు ప్రశ్నించెను. "మునీంద్రా! ఈ సంసారాడంబరము - భ్రాంతిరూపమైన ఈ సంసారదృశ్య మెట్లు ఉదయించినది?

**కథం చ ప్రశమం యాతి?, కియత్? కస్య? కదేతి చ?**
**వక్తవ్య మఖిలం ప్రోక్తం, వ్యాసేన విదితాత్మనా ॥ 6 ॥**

6. ఇది యెట్లు ఉపశమించును (నివర్తించును)? ఇది యెంత వఱకు, ఎవరికైన, ఎప్పుడైన, ఈ జగద్భ్రాంతి నివర్తించినదా? – ఈ విషయమున చెప్పవలసినదంతయు శుకునకు ఆత్మవేత్తయైన వ్యాసుడు వివరించినాడు.

**జానామి పూర్వమేవేతి, నాఽసౌ తత్ బహ్వమన్యత ।**
**అభిప్రాయమిమం జ్ఞాత్వా, "నాఽహం జానామి తత్త్వతః ॥ 7 ॥**

7. కాని, శుకుడు దీని, తానిదివఱకే తెలిసికొంటినని భావించి, తండ్రి యుపదేశమును గొప్పగా తలపలేదు. శుకుని యభిప్రాయము నెఱిగి

★ ఆడమ్బరమ్ = పరవంచనార్థం కృత్రిమ చేష్టితమ్ । (యో.వా.తా.ప్ర)
ఇతరుల వంచించుటకైన అసహజమైన చేష్ట.

వ్యాసుడు, "నేను తత్త్వజ్ఞుడను కాను; యథార్థముగ సత్యము నేనెఱుగను.

**జనకో వేత్తి తత్తత్త్వం, తస్మాత్సర్వ మవాప్నుహి ।"**
**పిత్రేత్యుక్తః శుకః ప్రాయాత్, జనకస్య పురీం తదా । 8 ॥**

8. జనకు డా తత్త్వము నెఱుగును. సర్వతత్త్వజ్ఞానము నాతని నుండి గ్రహింపుము". ఇట్లు తండ్రి వచింపగా, శుకుడు జనకుని పురమునకు (మిథిలకు) బయలుదేరి వెళ్లెను.

**ద్వారిస్థితం శుకం జ్ఞాత్వా, జిజ్ఞాసాఽర్థ మవజ్ఞయా ।**
**తూష్ణీ మవస్థితో రాజా, గతే తం దినసప్తకే । 9 ।**

9. జిజ్ఞాసార్థమై, పురద్వారము చెంతనున్న శుకుని ఎఱిగియు రాజు, మౌనమున నుదాసీనత వహించెను. ఏడు దినములిట్లు గడచెను.

**ప్రవేశ్యాఽఙ్గణం తత్రాఽపి, స్థితం చ దినసప్తకమ్ ।**
**తతః ప్రవేశయామాస, జనకోఽన్తఃపురం శుకమ్ । 10 ।**

10. శుకుడు ప్రాంగణమును ప్రవేశించి, అచటను ఏడు దినములుండెను. అనంతరము, జనకుడు, శుకుని అంతఃపురమున ప్రవేశ పెట్టెను.

**తత్రోన్మదాభిః కాన్తాభిః, భోజనైః భోగసఞ్చయైః ।**
**లాలితోఽహాని సప్తాఽపి, స్వచ్ఛః సుమనా అభవత్★ । 11 ।**

11. అచ్చట మదవతులగు కాంతలచే భోజనాదులతో, భోగసంచయముతో, ఏడుదినము లుపలాలితుడైనను, శుకుడు స్వచ్ఛుడు (చిత్తవికార రహితుడు), ముదితమానసుడునై యుండెను.

**పరిజ్ఞాతస్వభావం త మానీయ ప్రణనామ హ ।**
**"స్వాగతం తే మహాభాగ !, ప్రాప్తాఽఖిల మనోరథ ! । 12 ।**

---

★ పోల్చు:- మ.భా. శాంతి- అ. 325 శ్లోకములు 32-45. తండ్రి యాజ్ఞానుసారము శుకుని మిథిలాగమనము, అచట ద్వార పాలామాత్య యువతులచే సత్కృతి - శుకుని నిర్వికార ధ్యాన స్థితి.

**మఱియు పోల్చు-**

**"శ్రుతాఽప్సరోగీతి రపిక్షణేఽస్మిన్, హరః ప్రసంఖ్యానపరో బభూవ ।**
**ఆత్మేశ్వరాణాం న హి జాతు విఘ్నాః, సమాధిభేద ప్రభవో భవన్తి ।"**
(కాళిదాసు - కుమారసంభవము.III-40)

**ఆవసంతావిర్భావకాలమున, పరమేశ్వరుడు, దివ్యాంగనల-అచ్చరల-గానములు వినియు, ఆత్మానుసంధానము నుండి చలింపలేదు. ఆత్మేశ్వరుల (మహానిగ్రహము గల వారి) ఆత్మ సమాధిని ఎపుడును, విఘ్నములు భంగపఱుపజాలవు.**

12. జనకనృపతి, తత్త్వదర్శనపర్యంతప్రతిష్ఠితుడును, విచారవైరాగ్య పరిపాక స్వభావుడునైన శుకుని రప్పించి, ప్రణమిల్లెను. "మహాత్మా! వాంఛితార్థములన్నియు సిద్ధించిన మీకు స్వాగతము.

**కిమీహితం తవే"త్యుక్తః, శుకో రాజాన మబ్రవీత్ ।**
**"సంసారాఽఽడమ్బరమిదం కథ మభ్యుత్థం? గురో! ॥ 13 ॥**

13. నీ అభీప్సిత మేది" యని ప్రశ్నించిన రాజునకు శుకుడిట్లన్నాడు. "గురువర్యా! ఈ సంసారాడంబరము (భ్రాంతిరూపమైన ఈ సంసార దృశ్యము) - ఎట్లుదయించినది?

**కథం ప్రశమ మాయాతి?, యథావత్ కథ యాఽఽశు మే" ।**
**ఇత్యుక్తో జనకః ప్రాహ, పిత్రా ప్రోక్తం యదేవ తత్ ॥ 14 ॥**

14. ఇది యెట్లుపశమించును?. యథార్థముగ, సర్వమును శీఘ్రముగ వచింపుడు" - అని అర్థించిన శుకునకు, అతని తండ్రి (వ్యాసుడు) మున్నుపదేశించినదే జనకుడు ఉపదేశించెను.

**ఏతత్ శ్రుత్వా శుకః ప్రాహ, "జ్ఞాత మేతత్ మయా పురా ।**
**స్వయమేవ వివేకేన, పిత్రాఽప్యేత దుదాహృతమ్ ॥ 15 ॥**

15. దాని విని శుకుడు "వివేకబలమున స్వయముగ నే నిదివఱకే దీనిని గ్రహించితిని. మా తండ్రియు నిట్లే వచించెను.

**భవతాఽప్యేష ఏవార్థ, ఉక్తః శాస్త్రేషు యః శ్రుతః ।**
**త్వత్తో విశ్రామమాప్నోతి, కథం చేతో? వద ప్రభో" ! ॥ 16 ॥**

16. శాస్త్రముల యందు విన్న అర్థానినే, మీరును వచించితిరి. ప్రభూ! చిత్త మెట్లు విశ్రాంతిని పొందునో మీరే వచింపుడు".

**జనక ఉవాచ :-**

**"అవ్యుచ్ఛిన్న చిదాత్మైకః, పుమానస్తీహ నేతరత్ ।**
**స్వసఙ్కల్పవశా ద్బద్ధో, నిస్సఙ్కల్పశ్చ ముచ్యతే ॥ 17 ॥**

17. **జనకుడు :- "అఖండచైతన్యస్వరూపుడు నద్వితీయుడునగు పరమ పురుషుడొక్కడే యున్నాడు; అన్యమేదియు నిచ్చట లేదు. అతడు స్వసంకల్పవశమున బద్ధుడు, నిస్సంకల్పుడునై ముక్తుడు నగుచున్నాడు.**

[సంకల్పశబ్దమునకు నిశ్చయము, కామము, ఆకాంక్ష, భావన, అను అర్థములున్నవి. ఈ క్రియలన్నియు అంతఃకరణ మనబడు మనస్సు యొక్క ధర్మములు. 'సఙ్కల్పః కర్మ మానసమ్'- అమరకోశము -I.141.]

**ప్రాప్తం ప్రాప్తవ్య మఖిలం, ముక్త స్త్వం భ్రాన్తి ముత్సృజ ।"**
**అనుశిష్ట స్తథా రాజ్ఞా, విశశ్రామ శుక స్తదా ॥ 18 ॥**

**18.** పొందవలసిన దాని నంతయును పొందితివి. నీవు ముక్తుడవు. భ్రాంతిని విసర్జింపుము." – ఇట్లు రాజుచే నుపదేశింపబడి **శుకుడు, పరమవస్తువు నధిష్ఠించి, విశ్రాంతిని బొందెను.**[1]

**వీతశోకః శశామాఽసౌ, నిర్వికల్పసమాధినా[2]।**
**తవాఽప్యపేక్ష్యతే నూనం, మలమాత్రా ఽపమార్జనమ్ ॥ 19 ॥**

**19.** శోకవిముక్తుడై **శుకుడు,** నిర్వికల్పసమాధి యందు పరమశాంతిని **(నిర్వాణమును)** పొందెను. శుకునికి వలెనే నీకును కేవలము మాలిన్య మార్జనమే అపేక్షితము.

**వాసనాతానవం రామ! మోక్ష ఇత్యుచ్యతే బుధైః ।**
**పదార్థవాసనాదార్ఢ్యం బన్ధ, ఇత్యభిధీయతే " ॥ 20 ॥**

**20.** సుఖదుఃఖహేతుకములైన జన్మాంతరశుభాఽశుభకర్మముల వలన గల్గిన చిత్తసంస్కారములు – (వాసనలు) – పలుచనై క్షీణించుటయే ముక్తి

(1) యుక్తుడగు యథార్థసాధకుని లక్షణములను వివరించుట కీ కథ చెప్పబడినది.

(2) **"యత్రోపరమతే చిత్తం, నిరుద్ధం యోగసేవయా ।**
**యత్ర చైవాఽఽత్మనాఽఽత్మానం, పశ్యన్నాత్మని తుష్యతి ।"** (భ.గీ.VI-20)
**నిర్వికల్పసమాధి యందు చిత్తము సంపూర్ణముగ నిరుద్ధమై (ప్రచారరహితమై, సంకల్ప రూపమున పరిణమింపక) ఉపరతిని పొందగా, సమాధి పరిశుద్ధమగు అంతఃకరణముచే, పరమ చైతన్యము, జ్యోతిస్స్వరూపమునగు పరమాత్మను పొంది, యోగి, ఆత్మయందే అఖండానంద భరితుడయి, స్వస్వరూపస్థితి నందును. "జీవాత్మ పరమాత్మైక్యావస్థా, త్రిపుటిరహితా, పరమానంద స్వరూపా శుద్ధ చైతన్యాత్మికా సమాధిః – ఇతి శ్రుతిః ।**
**"తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్" ।** – (యోగదర్శనము - I-2)
**అపుడు – (చిత్తము, వృత్తిశూన్యమైనపుడు) – ద్రష్టయగు ఆత్మకు స్వరూప ప్రతిష్ఠ – కైవల్యము – సిద్ధించుచున్నది. నిర్వికల్ప సమాధి విరమణమున యోగి, సర్వజ్ఞుడగును; అతని యందు చిత్తము, సంస్కారమాత్రముగ మిగిలి యుండును.**
**చూడు :- కల్యాణకైవల్యము – డా. రత్నాకరం బాలరాజు (1955)**

యనియు, వాసనావృద్ధియే బంధమనియు చెప్పబడుచున్నది."

ఏవముక్త్వా వసిష్ఠం చ, విశ్వామిత్రోఽభ్యభాషత ।
"అత్రాఽస్య చిత్త విశ్రాన్త్యై, రాఘవస్య మహాత్మనః ॥ 21 ॥

రఘూణామపి సర్వేషాం ప్రభో! కులగురో! మునే ! ।
యుక్తిం చోపదిశాఽద్య త్వ" మిత్యుక్తో ముని రబ్రవీత్ ॥ 22 ॥

21-22. అని పలికి, వసిష్ఠునితో విశ్వామిత్రుడు "రఘువంశజుల కందఱికి ప్రభువు, కులగురువువైన మునీంద్రా! ఇచ్చట శ్రీరాముని చిత్తవిశ్రాంతి నిమిత్తము యుక్తిని (యోగమును-ఉపాయమును) ఉపదేశింపుము"- అని యడుగగా, వసిష్ఠుడిట్లు పల్కెను.

"యదేవ బ్రహ్మణా ప్రోక్తం, సంసారభ్రమశాన్తయే ।
తత్ స్మరామీ"తి సంప్రోచ్య, వక్తుం సముపచక్రమే ॥ 23 ॥

23. సర్వ సంసార దుఃఖ భ్రమ ఉపశమించుటకు బ్రహ్మ (సృష్టికర్త) సర్గాదిని ఉపదేశించిన దానిని (జ్ఞానమును) స్మరించుచున్నా"నని చెప్పి (ముని) దానిని వివరించుట కుపక్రమించెను.

(ఈ జ్ఞానము సనాతనము; వ్యక్తి కల్పితము కాదని భావము)

## 2 వాసనా ద్వివిధా – వాసనలు – (మానసిక సంస్కారములు) – రెండు విధములు

వసిష్ఠ ఉవాచ :–
సర్వదా సర్వమేవేహ, సంసారే రఘునన్దన ! ।
సమ్యక్ ప్రయుక్తాత్, సర్వేణ పౌరుషాత్ సమవాప్యతే* ॥ 24 ॥

---

★ "వీర్యం పరం కార్యకృతౌ హి మూలం, వీర్యాదృతే కాచన నాఽస్తి సిద్ధిః
ఉదేతి వీర్యాదిహ సర్వసంపన్నిర్వీర్యతా చేత్సకలశ్చ పాప్మా ।"
అలబ్ధస్యాఽలాభో నియత ముపలబ్ధస్య విగమ-
స్తథైవాఽఽత్మాఽవజ్ఞా కృపణ మధికేభ్యః పరిభవః ।
తమో నిస్తేజస్త్వం శ్రుతి నియమ తుష్టివ్యుపరమో,
నృణాం నిర్వీర్యాణాం భవతి, వినిపాతశ్చ భవతి ।"
(అశ్వఘోషకృతసౌందరనందము XVI-94.95)
"కార్యసాఫల్యమునకు మూలకారణము వీర్యమే (పురుష ప్రయత్నమే). పురుష ప్రయత్నరహితముగ నేదియు సిద్ధింపదు. పురుష ప్రయత్నము వలననే, సర్వసంపదలు (సమృద్ధి) ఉదయించును. ప్రయత్న హీనుడు పరమపాపాత్ముడు. పురుష ప్రయత్న హీనులగు నరులకు అప్రాప్త వస్తువు లభింపదు. ప్రాప్త వస్తువు పైతము నశించును. ఆత్మ గౌరవముండదు; దైన్యమావహించును. అధికులు, వారిని పరిభవింతురు. మనస్సున నంధకారము క్రమ్మి, తేజస్సు క్షీణించును. విద్యా, సంయమ, సంతోషములు వారికి వినష్టమగును. సర్వవిధముల పురుష ప్రయత్నహీనులు పతనమును పొందుదురు."

24. వసిష్ఠుడు :– రఘునందనా! శ్రీ రామా! ఈ సంసారము (జగత్తు)న సర్వదా, లెస్సగా, పౌరుషమును (పురుషప్రయత్నమును) ప్రయోగించిననే, వాంఛితార్థము సర్వము, అందఱికిని, సిద్ధించుచున్నది.

ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి, ద్వివిధం పౌరుషం స్మృతమ్ ।
తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ, పరమాఽర్థాయ శాస్త్రితమ్ ॥ 25 ॥

25. శాస్త్రవిరుద్ధము, శాస్త్రవిహితమునని పౌరుషము రెండు విధములు. శాస్త్ర విరుద్ధమైన పౌరుషము (కర్మము) అనర్థమునకును, శాస్త్ర విహితమైనది పరమార్థమునకును హేతువగుచున్నది.

శ్రీ రామ ఉవాచ :–

ప్రాక్తనం వాసనాజాలం, నియోజయతి మాం యథా ।
మునే! తథైవ తిష్ఠామి, కృపణః, కిం కరోమ్యహమ్? ॥ 26 ॥

26. శ్రీ రాముడు :– ప్రాక్తన(పూర్వజన్మ మందలి)వాసనా(చిత్త సంస్కార) సమూహము, నన్నెట్లు నియమించునో, అట్లు నేనుండగలను. మునీంద్రా! నేను దీనుడను; ఏమి చేయుదును?

వసిష్ఠ ఉవాచ :–

ద్వివిధో వాసనా వ్యూహః, శుభశ్చైవాఽశుభశ్చ తే ।
వాసనౌఘేన శుద్ధేన, తత్ర చేదద్య నీయసే ॥ 27 ॥*
తత్క్రమేణ శుభేనైవ, పదం ప్రాప్స్యసి శాశ్వతమ్ ।

27-28. వసిష్ఠుడు :- నీ ప్రాక్తన వాసనా (చిత్త సంస్కార) సమూహము శుభము, అశుభము నని ద్వివిధము (ఇరు తెఱగులు) గ నున్నది. వీనిలో శుభవాసనల వలన ప్రేరితుడ వైనచో, ఆ శుభవాసన చేతనే, క్రమముగ శాశ్వత పదమును (ముక్తిని) పొందగలవు.

అథ చే దశుభో భావః, యత్నాత్ జేతవ్య ఏవ సః ॥ 28 ॥

28. అట్లు కాక, నీ మనస్సు అశుభవాసనామయమైనచో, ప్రయత్నించి, దానిని జయింపవలెను.

శుభాఽశుభాభ్యాం మార్గాభ్యాం, వహన్తీ వాసనాసరిత్ ।
పౌరుషేణ ప్రయత్నేన, యోజనీయా శుభే పథి ॥ 29 ॥

* చేదవనీయసే – పా.భే.

29. ఈ వాసనానది శుభాఽశుభమార్గముల రెంటను ప్రవహించుచున్నది. దృఢమైన **పౌరుషముతో** ప్రయత్నించి దానిని **శుభపథమున** చేర్చవలయును.

**అశుభేషు సమావిష్టం, శుభేష్వేవాఽవతారయ ।**
**సన్దిగ్ధాయామపి భృశం, శుభామేవ సమాహర ॥ 30 ।**

30. అశుభమార్గమున నీ మనస్సు ప్రవేశించినచో, పురుషప్రయత్న బలమున శుభమార్గమునకు మరల్పుము. **మానసికసందిగ్ధావస్థ** యందును (సందేహము కల్గినను) **శుభవాసనలనే** ప్రోగు చేయుము.

**తతః పక్వకషాయేణ, నూనం విజ్ఞాతవస్తునా ।**
**శుభోఽప్యసౌ త్వయా త్యాజ్యో, వాసనౌఘో నిరాధినా ॥ 31 ।**

31. అనంతరము, రాగాదివాసనాదోషములు శిథిలములు కాగా, ఆత్మ వస్తువు విజ్ఞాతమగును; ఆధి (మనఃక్లేశము) నశించును. అప్పుడు, నీవే **ఈ శుభవాసనాసమూహమును** సైతము త్యజింతువు. (అప్పుడు నీచేత నవి త్యజింపదగినవి.)

**చిదాకాశోఽ వినాశాత్మా, తస్మాత్ విష్ణు రజాయత ।**
**తస్యాఽపి హృదయామ్భోజాత్, పరమేష్ఠీ వ్యజాయత ॥ 32 ॥**

32. చిదాకాశము, అవినాశియగు (అవినశ్వరమగు) ఆత్మతత్త్వము. అందుండి విష్ణు వుదయించెను. విష్ణువు హృదయకమలము నుండి చతుర్ముఖ బ్రహ్మ జనించెను.

[విష్ :- వ్యాపించు - ధాతువు నుండి విష్ణు శబ్దము (విష్+ను = విష్ణుః) నిష్పన్నము. త్రిమూర్తుల యందు **విష్ణువు** విశ్వము యొక్క స్థితి కారకుడు; శ్రీ రామకృష్ణాది అవతారముల ద్వారా, జగద్రక్షణమును నిర్వహించును. బ్రహ్మ, సృష్టికారకుడు; రుద్రుడు సంహారకర్త.]

**(ఆధికారికపురుషుడగు, వసిష్ఠమహర్షి నిజవృత్తాంతకథనము)**

**స సృష్ట్వా సకలం సర్గం, నానావ్యసన సఙ్కులమ్ ।**
**జగామ కరుణా మీశః, పుత్ర దుఃఖాత్ పితా యథా ॥ 33 ।**

33. సకల సృష్టిని బ్రహ్మ సృజించి, నానావ్యసన (**దుఃఖ**) సంకులమైయున్న **సకలసృష్టిని** గాంచి, లోకకర్తయగు బ్రహ్మ, పుత్రుని **దుఃఖమును** గాంచిన **తండ్రివలె** కారుణ్యమును వహించెను.

"తపో దానం జపస్తీర్థం, నాఽత్యన్తం దుఃఖశాన్తయే ।
తత్ తావత్ దుఃఖమోక్షార్థం, జ్ఞానం ప్రకటయామ్యహమ్" ॥ 34 ॥

34. "తపస్సు, దానము, జపము, తీర్థ యాత్రలు, దుఃఖమును సంపూర్ణముగ ఉపశమింప జేయజాలవు. కావున, నేను దుఃఖవిముక్తికై, జ్ఞానమును ప్రకటింతును. (వెల్లడింతును)"

ఇతి సంచిన్త్య సృష్ట్వా మాం, మనసా ప్రోక్తవా నసౌ ।
"గచ్ఛ భారతవర్షం త్వం, లోకాఽనుగ్రహహేతునా ॥ 35 ॥

35 బ్రహ్మ, ఇట్లు ఆలోచించి, సంకల్పమాత్రమున మనస్సు వలన నన్ను సృష్టించి, "లోకానుగ్రహ నిమిత్తమై, భారతవర్షమున కరుగు" మని పల్కెను.

"తత్ర క్రియా కాణ్డపరా, త్వయా పుత్ర! మహాధియః ।
ఉపదేశ్యాః క్రియా కాణ్డక్రమేణ క్రమశాలినా ॥ 36 ॥

36. "కుమారా! అచ్చట – (భారతవర్షమున) – వైదికకర్మకాండ రతులును, మహామేధావులు, నగువారికి, క్రియాకాండక్రమము ననుసరించి వేదోక్తవిధానవేత్తవగు నీవు ఉపదేశింపవలయును.

విరక్తాస్తు మహాప్రాజ్ఞాః, జ్ఞానేనాఽఽనన్దదాయినా ।" *
ఇతి తేన నియుక్తోఽహం, తిష్ఠామి భువనస్థలే ॥ 37 ॥

---

★ "యావదధికార మవస్థితి రాధికారికాణామ్" (బ్ర.సూ. III-3–32 సూత్రము)

ధర్మరక్షణాధికారము నెఱవేర్పవలసిన వారికి, వారి అధికార మున్నంత వఱకు, శరీరావస్థితి సంభవించుచున్నది.

నిర్గుణబ్రహ్మవిదులైనను కొందఱు నూత్న దేహములను దాల్చినారు. అపాంతరతముడు, వసిష్ఠుడు, భృగుడు, సనత్కుమారుడు, దక్షుడు, నారదుడు మున్నగు మహాత్ములు, కైవల్యహేతువగు సమ్యగ్జ్ఞానము నధిగమించినను, వారి సర్వకర్మములు క్షయించి యున్నను, నూత్న శరీర ధారణ మొనర్చిరి. ధర్మరక్షణాధికారమున వారు పరమేశ్వరునిచే నియుక్తులైనారు. ఆ యధికారము ముగియు వఱకు, వారు శరీరావస్థితిని బొంది యుందురు. సర్వకాలములందును, బ్రహ్మైకత్వస్మృతిని, నిలుపుకొని స్వేచ్ఛగా నొక దేహము నుండి, మఱొక దేహమునకు వారు బోవుచుందురు. అపాంతరతముడు, – కృష్ణద్వైపాయనుడు (వ్యాసుడు)గ, కలి ద్వాపర సంధి కాలమున జన్మించెను. క్రీ.పూ. 3102 ప్రాంతమున కలియుగాదిని, వ్యాసమహర్షి యుండెననుట సిద్ధాంతము. (See:- Indian Chronology - Bharatiya Vidya Bhavan - Bombay - 1963 –Dr. D.S. Triveda)

బ్రహ్మమానస పుత్రుడగు వసిష్ఠుడును, నిమిశాపవశమున, పూర్వ దేహము నశించినను, మరల

37. మహాప్రాజ్ఞులగు విరక్తులకు ఆనందదాయి యగు జ్ఞానము ననుసరించి తత్త్వము బోధింపవలయును." ఇట్లు బ్రహ్మచే నియుక్తుడనై, ఈ భూతలమున నివసించుచున్నాను.

## 3. మోక్షద్వార పాలకాః – మోక్ష ద్వార రక్షకులు

**మోక్షద్వారే ద్వారపాలాః, చత్వారః పరికీర్తితాః ।**
**శమో, విచారః, సంతోషః, చతుర్థః, సాధుసఙ్గమః । 38 ।**

38. మోక్ష ద్వారము యొక్క పాలకులు – (1) శమము, (2) (తత్త్వ) విచారము, (3) సంతోషము (4) సాధుసంగమము, అను నల్వురని చెప్పబడినది.

**ఏతే సేవ్యాః ప్రయత్నేన, చత్వారో ద్వౌ త్రయోఽథవా ।**
**ఏకం వా, సర్వయత్నేన, సర్వముత్సృజ్య సంశ్రయేత్ । 39 ।**

39. ఈ నాల్గింటిని కాని, లేక, మూడింటిని, రెండింటిని కాని, లేక, కనీసము వీనిలో నొక్కటిని గాని ఆశ్రయించి, సర్వమును పరిత్యజించి, ప్రయత్న పూర్వకముగ అభ్యసింపవలయును.

**ఏకస్మిన్ వశగే యాన్తి, చత్వారోఽపి వశం యతః ।**
**ఏషాం ఏకతమా ౽౽ సక్త్యా, మోక్షద్వారే ప్రవేశ్యతే । 40 ।**

40. ఏలయన, వీనిలో నొక్కటి లోబడినను, నాల్గును లోబడును. వీనిలో నేయొక్క దాని యందలి ఆసక్తిచేనైనను, (ముముక్షువు) మోక్షద్వారమున ప్రవిష్టుడు కాగలడు.

---

బ్రహ్మ దేశము చేత మిత్రావరుణులవ లవ, సంభవించెను. అట్లే సనత్కుమారుడును, స్వయముగ, స్కందరూపమున ప్రాదుర్భావమొందెను. వారి ధర్మరక్షణాధికారము, ప్రారబ్ధ కర్మము వంటిది. (చూడు – బ్రహ్మసూత్రము – శంకర భాష్యము III-3–32)
"శరీర వృత్తి వ్రతమ్ ।" (శివసూత్రము III-26)
బ్రహ్మవిదుడైన మహాత్మునకు, (కర్మక్షయమున పునర్జన్మరహితుడైనను), శరీరధారణ మొనర్చి, లోక కల్యాణమునా చరించుట వ్రతము.
"కథా జపః" । "దాన మాత్మజ్ఞానమ్ ।" (శి.సూ. III-27,28)
బ్రహ్మజ్ఞానోపదేశమొనర్చుట, ఆతనికి నిత్యజపము. తన్నాశ్రయించిన వారికి బ్రహ్మ జ్ఞానమొసగుటయే, ఆతనికి దానవ్రతము.
"విద్యాకర్మన్యనుష్ఠానలోషితేశ్వరచోదనమ్ ।
అధికారం సమాప్యైతే ప్రవిశన్తి పరంపదమ్" । (భామతి. III-3.33))
ఈశ్వరసందేశమును నెఱవేర్చి వారు, పరమపదమును ప్రవేశింతురని చెప్పబడినది.

యాని దుఃఖాని యా తృష్ణా, దుస్సహా యే దురాధయః ।
తత్సర్వం శాన్తచేతస్సు, తమోఽర్కేష్వివ నశ్యతి ॥ 41 ॥

41. తృష్ణలు, దుస్సహములగు మనోవ్యాధులు (వ్యథలు) - ఇవి యన్నియు, సూర్యప్రభలందు తమస్సు వలె శాంతిపూర్ణములగు చిత్తములందు నశించును.

న రసాయనపానేన, న లక్ష్మ్యాఽఽలిఙ్గనేన చ ।
తథా సుఖ మవాప్నోతి, శమేనాఽన్తర్యథా మనః ॥ 42 ॥

42. మనస్సు అంతశ్శాంతితో సుఖమందునట్లు, జీవరసాయనపానముతో గాని, సకలసంపదలకు నధిష్ఠానదేవతయగు లక్ష్మి యొక్క ఆ లింగనముతో గాని, సుఖమందజాలదు. [ఏ సుఖమును, శమసుఖమునకు సాటిరాదని భావము.]

తపస్విషు బహుజ్ఞేషు, యాజకేషు నృపేషు చ ।
బలవత్సు గుణాఢ్యేషు, శమవానేవ * రాజతే ॥ 43 ॥

43. తాపసులు, బహుశాస్త్ర కోవిదులు, యాజ్ఞికులు, రాజులు, బలవంతులు, గుణాఢ్యులు - వీ రందఱిలోను, శాంతిశాలియే, శోభిల్లుచున్నాడు.

విచారాత్ తీక్ష్ణ తామేత్య, ధీః పశ్యతి పరం పదమ్ ।
దీర్ఘసంసారరోగస్య, విచారో హి మహౌషధమ్ ॥ 44 ॥

44. తత్త్వవిచారము వలన బుద్ధి నిశితమై, పరమపదమును గాంచును. దీర్ఘమైన సంసారమను రోగమునకు విచారమే పరమౌషధము.

[ఇందు నిర్దేశింపబడిన 'విచారము' - అనునది కేవలము ఇంద్రియ ప్రపంచమునకును, దాని దృశ్యమునకును, సంబంధించినది కాదు.

---

★ పోల్చు :- శమేన శాన్తాః శివ మాచరన్తి, శమేన నాకం మునయోఽన్వవిన్దన్ ।
శమో భూతానాం దురాధర్షం, శమే సర్వం ప్రతిష్ఠితమ్
తస్మాచ్ఛమః పరమం వదన్తి ।
[తైత్తిరీయ నారాయణీయా యాజ్ఞిక్యుపనిషత్ 79-5]

ఇది, మానవచేతన యొక్క సహజమైన పరావృత్తి. (వెనుకకు త్రిప్పి వేయుట). ఆత్మమూలమును దర్శించుట. తరువాతి శ్లోకములు దీనిని వివరించును.]

**కోఽహం? కస్య చ సంసారః?, ఇత్యాపద్యపి ధీమతా ।**
**చిన్తనీయం ప్రయత్నేన, సప్రతీకార మాత్మనా । 45 ।**

45. 'నేనెవడను!? 'ఈ సంసార మెవరికి?' - అని ఆపదయందు సైతము బుద్ధిమంతుడగువాడు ప్రయత్నముతో శ్రవణాద్యనుష్ఠాన సహితముగ స్వయముగ విచారింపవలయును.

**కోఽహం? కథ మయం దోషః సంసారాఖ్య ఉపాగతః?।**
**న్యాయేనైవం పరామర్శో, విచార ఇతి కథ్యతే । 46 ।**

46. 'నేనెవడను?' సంసారమను ఈ దోషమెట్లు వచ్చినది? అని హేతుయుక్తముగనొనర్చు విమర్శయే, విచార మనబడును.

**సంతుష్టః పరమభ్యేతి, విశ్రామం సుఖలక్షణమ్ ।**
**సన్తోషాఽమృతపానేన, యః శాన్తః తృప్తి మాగతః । 47 ।**

47. **సంతుష్టుడగువాడు,** సుఖలక్షణమగు పరమవిశ్రాంతిని (ఆత్యంతిక దుఃఖవిక్షేప నివృత్తిని) పొందును. సంతోష మను అమృతమును గ్రోలుటచే, శాంతుడగువాడే **తృప్తిని** పొందుచున్నాడు.

**అప్రాప్తవాఞ్ఛా ముత్సృజ్య, సంప్రాప్తే సమతాం గతః ।**
**అదృష్ట ఖేదాఽఖేదో యః, సన్తుష్టః స ఇహోచ్యతే । 48 ।**

48. అప్రాప్తవిషయముల **కాంక్షింపక,** ప్రాప్తించిన వాని విషయమున **పొంగిపోక,** **(తత్ప్రాప్తి, అప్రాప్తి నిమిత్త హర్షవిషాద రాహిత్యముచే) సమచిత్తుడై,** సుఖదుఃఖముల అనుభూతిని గాంచని వాడే, **సంతుష్ట** డన బడును.

**వాఽభివాఞ్ఛత్యసంప్రాప్తం, ప్రాప్తం భుఙ్క్తే యథాక్రమమ్ ।**
**యస్తు సౌమ్యసమాచారః, సన్తుష్ట ఇతి కథ్యతే । 49 ।**

49. అప్రాప్తవిషయముల కాంక్షింపక, యథాక్రమముగ సంప్రాప్తమైన విషయముల (సుఖదుఃఖముల) ననుభవించువాడును, **సౌమ్యా (రమణీయా) చరణయుక్తుడువగు మనుజుడు, సంతుష్టుడనబడును.**

సర్వత్రోపకరోతీహ, సాధుః, సాధుసమాగమః ।
ఆపత్ సంపదివాఽఽభాతి, విద్వజ్జనసమాగమే । 50 ॥

50. సత్పురుషసమాగమము, ఎల్లవేళల ఉపకారకము, రమ్యమును. సాధుసంగమమున ఆపదలు సంపదలట్లు భాసించును.

యః స్నాతః శీతసితయా, సాధుసఙ్గమగఙ్గయా ।
కిం తస్య దానైః?, కిం తీర్థైః? కిం తపోభిః?, కిమధ్వరైః? । 51 ।

51. చల్లని వెన్నెలవాకయగు సాధుసంగమమను గంగ యందు స్నానమొనర్చిన వానికి, దాన, తీర్థ, తపో, యజ్ఞముల వలని ప్రయోజనమేమి? (సితా – వెన్నెల)

విఛ్ఛిన్న గ్రన్థయ[1] స్తద్‌జ్ఞాః, సాధవః సర్వసమ్మతాః ।
సర్వోపాయేన సంసేవ్యాః, తే హ్యుపాయాః భవాఽమ్బుధౌ[2] । 52 ।

---

(1) "ఆత్మైవ భాసతే యస్య బహిరన్తశ్చ సర్వతః ।
పామరస్యేవ రూపాది, స ఛిన్నగ్రన్థిరుచ్యతే ।"

(అరుణాచల రమణ మహర్షి–రమణగీత–IX-6)

పామరునికి రూపాదిక ఇంద్రియార్థజాతమగు జగత్తు, బహిరంతరముల సర్వత్ర, ప్రత్యక్షముగ దోచురీతి, జ్ఞానికి బహిరంతరముల సర్వత్ర, పూర్ణము, నిత్యము, అఖండమునగు ఆత్మ, అపరోక్షానుభవమై యుండును. అట్టి జ్ఞాని 'ఛిన్నగ్రంథి' (అవిద్యావాసనామయములైన హృదయ గ్రంథులు, రాగద్వేషాదులు భేదించినవాడని) యనబడును.

(2)పోల్చు :- "నిమజ్జ్యోన్మజ్జతాం ఘోరే, భవాఽబ్ధౌ పరమాఽయనం ।
సన్తో, బ్రహ్మవిదః, శాన్తా, నౌ ర్దృఢేవాఽప్సు మజ్జతామ్ ।"

ఘోరమగు సంసారార్ణవ జలముల ఉన్మజ్జన నిమజ్జన రూపములైన నానావిధ జన్మ మృత్యు పరంపరలను బొందుచున్న జనులకు శాంతులు, బ్రహ్మవేత్తలునైన సాధువులు, దృఢమైన నావ వలె పరమాశ్రయ మగుదురు. (భాగ.XI- 26.32)

"క్షణమపి సజ్జన సఙ్గతి రేకా, భవతి భవార్ణవతరణే నౌకా ।"
ఒక్క క్షణకాలమైనను సాధు సంగమము సంసార సాగరమును దాటించు నౌక కాగలదు.

(ఆదిశంకరులు – మోహముద్గరము – 21)

**52.** **అవిద్యా గ్రంథులు విచ్ఛిన్నమైన వారు,** పరమసత్యము నెఱిగిన సాధువులు, సర్వసమ్మతులు (సర్వజనపూజ్యులు). వారిని. సర్వవిధముల **సేవింపవలెను.** ఏలయన, **సంసారాంబుధిని తరించుటకు వారే ఉపాయ స్వరూపులు.**(పరమాశ్రయులు).

**చత్వార ఏతే విమలాః, ఉపాయా భవభేదనే ।**
**యైరభ్యస్తా స్త ఉత్తీర్ణా, మోహవారిభవాఽర్ణవాత్ । 53 ।**

**53.** భవమును (సంసారమును) భేదించుటకీ నాల్గును పవిత్రములైన **ఉపాయములు.** ఎవరు వీనిని అభ్యసింతురో వారే, మోహ జలపూర్ణమగు సంసారార్ణవమును తరింతురు.

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'ఉపదేశోపక్రమో' నామ ద్వితీయః సర్గః**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'ఉపదేశోపక్రమము'ను ద్వితీయ (రెండవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము .

## తృతీయసర్గము

## ఉత్పత్తిక్రమః – జగదుత్పత్తి విధానము

### 1. బన్ధస్వరూపమ్ – బంధస్వరూపము

వసిష్ఠ ఉవాచ :–

బన్ధస్య తావద్రూపం త్వం, కథ్యమాన మిదం శృణు ।
తతః స్వరూపం మోక్షస్య, జ్ఞాస్యసి త్వ మసంశయమ్ ॥ 1 ॥

1. వసిష్ఠుడు:– ఇపుడు నేను చెప్పు చున్న బంధస్వరూపము నాలకింపుమ
తరువాత, మోక్ష స్వరూపమును నిస్సంశయముగ నీవు తెలిసికొనగలవ

ద్రష్టుః దృశ్యస్య సత్తా హి, బన్ధ ఇత్యభిధీయతే ।
ద్రష్టా దృశ్యవశాత్ బద్ధో, దృశ్యాఽభావే విముచ్యతే ॥ 2 ॥

2. ద్రష్టకు దృశ్యము యొక్క సద్భావమే (అస్తిత్వమే) బంధ మనబడును. దృశ్యవశమున ద్రష్ట, బద్ధ డగుచున్నాడు. దృశ్య మభావమైనపుడు, విముక్త డగుచున్నాడు.

[ద్రష్ట - జ్ఞాత లేక, ఆత్మ.
దృశ్యము - కనబడుచున్న విశ్వము.]

**జగత్, త్వమ్, అహమ్, ఇత్యాది ర్మిథ్యాత్మా దృశ్య ముచ్యతే ।**
**యావదేతత్ సమ్భవతి, తావన్మోక్షో న విద్యతే ॥ 3 ॥**

3. జగత్తు, నీవు, నేను, అనునిట్టి మిథ్యాకల్పనల స్వభావమే, దృశ్య మనబడును. ఇది యున్నంత వఱకు మోక్షము సంభవింపదు.

**యదిదం దృశ్యతే సర్వం, జగత్ స్థావర జఙ్గమమ్ ।**
**తత్ సుషుప్తావివ స్వప్నః, కల్పాన్తే ప్రవినశ్యతి ॥ 4 ॥**

4. కనబడుచున్న స్థావరజంగమాత్మకమగు ఈ సర్వజగత్తు, **సుషుప్తి (గాఢనిద్ర)** యందు, స్వప్నము లయించునట్లు, కల్పాంతమున (ప్రళయమున)- సంపూర్ణముగ నశించుచున్నది.

**తతః స్తిమిత గమ్భీరం, న తేజో న తమ స్తతమ్ ।**
**అనాఖ్య మనభివ్యక్తం, సత్ కిఞ్చి దవశిష్యతే ॥ 5 ॥**

5. అప్పుడు స్తిమితము (నిశ్చలము) గంభీరము (అపరిచ్ఛిన్నము), నామరూపరహితమునగు **సత్పదార్థ మొకటియే, మిగిలి యుండును;** అభివ్యక్తి యుండదు. తేజము గాని, తమము గాని వ్యాపింపదు. (ఆ సత్పదార్థము, అమూర్తమగుట వలన, **స్తిమితము** (అక్రియము), అపరిచ్ఛేద్యమగుట వలన **గంభీరము**. అరూపమగుట వలన, **తేజమును;** భా రూపమగుట వలన, విస్తృతమగు **తమస్సును** కాదు.)

**ఋత* మాత్మా పరం బ్రహ్మ, సత్య మిత్యాదికా బుధైః ।**

---

* పోల్చు :- "తదేవర్తం (ఏవ ఋతం) తదు సత్యమాహు, స్తదేవ బ్రహ్మ పరమం కవీనామ్ ।
ఇష్టాపూర్తం బహుధా జాతం జాయమానం, విశ్వం బిభర్తి భువనస్య నాభిః ॥"
వేదర్షులు సాక్షాత్కరించుకొన్న పరతత్త్వము, ఋతము, సత్యము, పరబ్రహ్మము అని

**కల్పితా వ్యవహారార్థం, తస్య సంజ్ఞా మహాత్మనః । 6 ।**

6. ఋతము, ఆత్మ, పరబ్రహ్మము, సత్యము, మున్నగు నామములు ఆ పరమాత్మకు, వ్యవహారార్థమై పండితులు కల్పించిరి.
[ఋతమ్ - పారమార్థిక సత్యము - పరమాత్మ,
Eternal order–Divine Law – దివ్యనియమము; నియతి]

**స తథాభూత ఏవాఽఽత్మా, స్వయ మన్య ఇవోల్లసన్ ।**
**జీవతా ముపయాతీవ, మననాత్ స్థూలతాం గతః । 7 ।**

7. ఇట్టి దయ్యు, ఆ పరమాత్మ, తనకు తానే అన్యమైనట్లు ప్రకాశించుచు, సంకల్పవశమున జీవ భావము నాశ్రయించిన దానివలె, స్థూలత్వమును (జడత్వమును) బొందినట్లు కన్పించుచున్నది.

**మనో భవతి భూతాత్మా★, తరఙ్గ ఇవ వారిధేః ।**
**తేనేయం ఇన్ద్రజాలశ్రీః, జాగతీ ప్రవితన్యతే । 8 ।**

8. సాగరమున తరంగము (అల) రూపొందినట్లు, మనస్సు, వ్యష్టి జీవభావము నొందుచున్నది. దీని వలన, జగద్రూపమగు ఇంద్రజాలవైభవము విస్తరించుచున్నది.
[అఖండచైతన్యమగు సత్పదార్థము, సంకల్పవశమున, వ్యష్టిచైతన్యముగ విభక్తమైనట్లు కన్పించుచున్నది. సాగరతరంగము, మౌలికముగ సాగరభిన్నము కానట్లు, వ్యష్టిచైతన్యము - (జీవుడు) - అఖండ

---

వ్యపదేశింపబడినది. అదియే ఇష్టాపూర్తములు (శ్రౌత స్మార్త కర్మఫలము); చక్రనాభి వలె, సర్వలోకములకు ఆధారభూతము. ఆ పరమాత్మయే, ఉత్పన్నము, ఉత్పద్యమానము నగు విశ్వమును, భరించుచున్నాడు. (తైత్తిరీయ నారాయణీయా యాజ్ఞికృుపనిషత్-I.6)
**"ఋతస్య దృళ్హా ధరుణాని సన్తి, పురూణి చన్ద్రా వపుషే వపూంషి ।**
**ఋతేన దీర్ఘ మిషణన్త పృక్ష, ఋతేన గావ, ఋతం ఆవివేశుః ।"** [ఋగ్వేదము -IV-23-9]
ఋతము యొక్క ప్రతిష్ఠానములు (foundations)దృఢముగా నున్నవి. దాని మనోజ్ఞరూపమున అనేక ఉజ్జ్వల శోభలు నెలకొనియున్నవి. ఋతము చేతనే శాశ్వత పోషణము (ఆహారము) మన కనుగ్రహింపబడినది. ఋతము చేతనే లోకములు, సర్వగతమగు సంవిధాన (క్రమ)మునందు, ప్రవేశించినవి. ఋతము, సర్వగతము. సత్యము, ఋతము యొక్క వ్యవహారరూపము.

★ భూతాత్మా - భౌతికలిఙ్గాత్మా (యో.వా.తా.ప్ర.)

చైతన్యమగు పరమాత్మతో అభిన్నమైనను, మనోవశమున తద్భిన్నముగ దృశ్యమాన మగుచున్నది.]

**అవిద్యా, సంసృతి ర్మోహో, బన్ధో, మాయా,★ మలం, తమః ।**
**ఇతి నామాని తస్యాశ్చ, కల్పితాని భవన్తి హి । 9 ।**

9. అవిద్య, సంసృతి (సాంసారికజీవనవాహిని), మోహము, బంధము, **మాయ,** మలము, తమస్సు, అని, ఈ జగదింద్రజాలవిభూతికి పేర్లు కల్పింపబడినవి.

(**మాయ** – అసత్యమగు జగత్తును సత్యముగను, పరమాత్మ భిన్నముగను, భావించుట.)

**యథా కటకశబ్దార్థః, పృథక్త్వార్హో న కాఞ్చనాత్ ।**
**న హేమ కటకాత్ తద్వత్, జగచ్ఛబ్దార్థతా పరే । 10 ।**

10. సువర్ణ వలయము (కంకణము) యొక్క అర్థము, సువర్ణమున కంటె పృథక్త్వమునకు (భిన్నతకు) అర్హము కాదు. సువర్ణము సైతము, కంకణమున కంటె వేఱు కాదు. అట్లే, **జగత్ శబ్దము యొక్క అర్థమును పరమాత్మయందే పర్యవసించుచున్నది.**

[కారణ రూపమగు బ్రహ్మమున కంటె కార్యరూపమగు జగత్తు, వేఱు

---

★ **పోల్చు :- "నిర్గుణే కేవలే సాక్షాదాత్మనో యద్విపర్యయః ।**
**సైషా భగవతో మాయా, యయేదం నిర్మమే విభుః ।"**

నిర్గుణమగు కేవల బ్రహ్మము నందు (ఆత్మయందు) తత్స్వరూపము యొక్క అన్యథాత్వము, సగుణత్వము, ద్వితీయత్వము, లేక, వాని ఆభాసము, మాయ యనబడును. ఈ మాయయే జగత్కారణము. (భాగ. XI.2-37)

**మహామోహప్రభావోఽయం, యేన నిత్య మనిత్యతామ్ ।**
**నిత్యతామివ మన్యన్తే మూఢా జగతి జన్తవః ।**
**అసత్యే రమతే లోకః, సత్యప్రత్యయమోహితః ।**
**న వేత్తి సర్వభావానా మభావాఽనుభవం స్థితమ్ ।**

**(అవదానకల్పలత – ప్రథమ ఖండము –VII-20,21– క్షేమేంద్రుడు)**

మూఢులు, మహామోహ ప్రభావము వలన మోహితులై అసత్యమును సత్యముగ భావించి, అందు ఆనందించుచున్నారు. సర్వభావముల అభావమును వారెఱుగరు.

కాదు. కాన, జగత్తు యొక్క అస్తిత్వము - (ఉనికి) - బ్రహ్మమునందే పర్యవసితమగుచున్నది.]

**యథాఽఙ్కురోఽన్తర్బీజస్య, సంస్థితో దేశకాలతః ।**
**తనోతి భాసురం దేహం, తనోత్యేవం హి దృశ్యధీః ॥ 11 ॥**

11. విత్తనమందలి మొలక, తగిన నేలను, ఋతువు (కాలము)ను, పొంది, సుందర (వృక్ష) రూపము నుత్పాదించుచున్నట్లు, చిత్తమున సంస్కార రూపమున నున్న దృశ్యజ్ఞానము, దేశకాలపరిస్థితుల ననుసరించి, వృద్ధి నొందుచున్నది.

## 2. మనోమయం జగత్ – జగత్తు మనోమయము

**సర్వేషామేవ దేహౌ ద్వౌ, భూతానాం కారణాత్మనామ్ ।**
**అజస్య కారణాఽభావాత్, బ్రహ్మణస్తు స్వయంభువః ॥ 12 ॥**
**ఆతివాహిక ఏవాఽస్తి, దేహో నాఽస్త్యాధి భౌతికః ।**
**ఆకాశాదేవ యో జాతః, స వ్యోమైవ భవేత్ కిల ॥ 13 ॥**

12-13. పంచభూతాదికారణములతో కూడిన ప్రాణులకందఱికి రెండు దేహములున్నవి. స్వయంభువు, జన్మరహితుడునైన బ్రహ్మకు - (కారణము లేనందున) - **ఆతివాహిక దేహము** మాత్రమే కలదు; **ఆధి భౌతికము** లేదు.ఆకాశము వలన జనించిన బ్రహ్మ, కేవల మాకాశ స్వరూపుడే.

**సహకారీణి నో సన్తి, కారణాన్యస్య కానిచిత్ ।**
**బ్రహ్మ సఙ్కల్పపురుషః, పృథ్వ్యాది రహితాకృతిః ॥ 14 ॥**

14. బ్రహ్మకు సహకారికారణము (మృత్యువునకు సహాయకములగు అభిమాన రాగాదులు) లేవు. బ్రహ్మ, (పరబ్రహ్మము యొక్క) **సంకల్పము** నుండి జనించెను. అతని ఆకృతి, పృథివ్యాది పంచభూత రహితము.

**బ్రహ్మణా తన్యతే విశ్వం, మనసైవ స్వయమ్భువా ।**
**మనోమయ మతో విశ్వం, యన్నామ పరిదృశ్యతే ॥ 15 ॥**

15. స్వయంభువు బ్రహ్మ యొక్క మనస్సుతోనే, విశ్వము వ్యాప్తమై యున్నది. కాన, సర్వత్ర, దృశ్యమానమగుచున్న విశ్వము, మనోమయము.

యదర్థప్రతిభానం తన్మన ఇత్యభిధీయతే ।
నాఽన్యస్య మనసో రూపం, సఙ్కల్పా త్తన్న భిద్యతే ॥ 16 ॥

16. విషయపదార్థజ్ఞానము, మనస్సనియే చెప్పబడినది. మనస్సు రూపరహితము; అది సంకల్పమున కంటె వేఱు కాదు.

అవిద్యా, సంసృతి, శ్చిత్తం, బన్ధోఽజ్ఞానం మన స్తమః ।
ఇతి సఙ్కల్పజాలస్య, నామాన్యేతాని రాఘవ ! ॥ 17 ॥

17. శ్రీరామా! అవిద్య, సంసృతి (సంసారవాహిని), చిత్తము, బంధము, అజ్ఞానము, మనస్సు, తమస్సు, అనునివి సంకల్పసమూహమునకు నామములు.

సఙ్కల్పజాలే గళితే, స్వరూప మవశిష్యతే ।
మహాప్రళయ సంపత్త్యా, వసత్తాం సముపాగతే ॥ 18 ॥
అశేషదృశ్యసర్గాదౌ, శాన్త మేవాఽవశిష్యతే ।
ఆస్తేఽనస్తమితో, భాస్వాన్, పరమాత్మా మహేశ్వరః ॥ 19 ॥

18-19 సంకల్పజాలము నశింపగా, స్వరూపమే మిగులుచున్నది. మహాప్రళయమున దృశ్యసృష్టియంతయు లయమగుచున్నది. సర్వదృశ్యసృష్టికి పూర్వము, శాన్తమే (బ్రహ్మమే) మిగిలి యుండును. అస్తమింపని ప్రకాశస్వరూపుడు, పరమాత్మ, మహేశ్వరుడు, శాశ్వతముగ నిలిచి యుండును.

యతో వాచో నివర్తన్తే, యో ముక్తై రవగమ్యతే ।
యస్య చాఽఽత్మాదికాః సంజ్ఞాః, కల్పితాః న స్వభావజాః ॥ 20 ॥

20. ఎందుండి వాక్కు నివర్తిల్లునో, ఎవనిని, ముక్తులు మాత్రమే ఎఱుగుదురో, ఆ పరమాత్మకు, ఆత్మ మొదలగు నామములు కల్పితములు మాత్రమే; స్వాభావికములు కావు.

ఆవిర్భావతిరోభావమయాః, త్రిభువనోర్మయః ।
స్ఫుర న్త్యతితతే యస్మిన్, మరావివ మరీచయః ॥ 21 ॥

21. ఆవిర్భావతిరోభావరూపములైన త్రిభువనము (ముల్లోకము) లనబడు తరంగములు, **మరుభూమి (ఎడారి) యందు మరీచికల (ఎండమావుల)** వలె, అతి విస్తారమైన దేని యందు స్ఫురించుచున్నవో....
[అతితతే ః – అత్యన్త విస్తీర్ణే.]

**భిద్యతే హృదయగ్రన్థిః, ఛిద్యన్తే సర్వసంశయాః ।[1]**
**క్షీయన్తే చాఽస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరాఽవరే ॥ 22 ।**

22. అట్టి సర్వాత్మకము, పరాత్పరమునగు బ్రహ్మము నెఱిగిన వాని అవిద్యావాసనామయములైన **హృదయగ్రంథులు, రాగద్వేషాదులు,** విచ్ఛిన్నములగును. అవి నశించుటవలన, తన్మూలకములైన సర్వసంశయములు తొలగిపోవును. సంచితకర్మములన్నియు నశించును. (ప్రారబ్ధము, సంచితము, ఆగామి అని, కర్మము త్రివిధము.)[2]

## 3. జీవన్ముక్తలక్షణమ్ – జీవన్ముక్తుని లక్షణము

**నృణాం జ్ఞానైక నిష్ఠానాం, ఆత్మజ్ఞానవిచారిణామ్ ।**
**సా జీవన్ముక్తతోదేతి, విదేహోన్ముక్తతైవ యా । 23 ।**

23. జ్ఞాననిష్ఠాపరాయణులు (జ్ఞానసాధనములైన శ్రవణాదులందు అనన్య వ్యాపారలక్షణమగు నిష్ఠగలవారు), ఆత్మజ్ఞానవిచారపరులునైన నరులకు, **జీవించి యుండగనే ముక్తి సిద్ధించుచున్నది. ఇది విదేహముక్తికి భిన్నము కాదు.**

**యథాస్థిత మిదం యస్య, వ్యవహారవతోఽపి చ ।**
**అస్తం గతం స్థితం వ్యోమ, స జీవన్ముక్త ఉచ్యతే । 24 ।**

---

(1) చూడు :- ముండక. ఉ – II-2-8. శ్రుతి ప్రమాణ ముదాహరింపబడినది.
"పరం చ కారణాత్మనా, అవరం చ కార్యాత్మనా" (శంకరుడు)
పరాఽవరుడగుటచే (కారణకార్యరూపుడగుటచే) పరమాత్మ, సర్వాత్మకుడు.
(2) మఱియు చూడు :-
"వైరాగ్యంబు దృఢంబు జేసి, పరతత్త్వజ్ఞాన మార్జించి, స
ర్వారంభోపరమంబుగైకొని, తురీయం బంది, యీరీతి యో
గారూఢుండగు వానికిం గలుగునే? యాగామియు న్సంచిత
ప్రారబ్ధంబులు సంతతంబును బరబ్రహ్మాత్ముడై యుండగాన్"
(శ్రీ సి.రా. సంవాదరాజయోగదర్శనము – (పుటలు 405–6)
డా॥ రత్నాకరం బాలరాజు–1982–అధ్యాత్మవిద్యాగ్రంథరత్నమాల, సాకేతనిలయం, అనంతపురం–515001 (ఆం.ప్ర.)

24. లోకవ్యవహారవంతుడైనను, ఎవని కీవిశ్వము లేనిదై (అస్తంగతమై) దర్పణదృశ్యమాననగరము వలె ప్రతీయమానమై యున్నను, ఆకాశ మట్లు శూన్యముగ నుండునో, వాడు జీవన్ముక్తుడ (జీవించి యుండగనే ముక్తి పొందినవాడ)నబడును.

నోదేతి నాఽస్తమాయాతి, సుఖేదుఃఖే ముఖప్రభా★ ।
యథాప్రాప్త స్థితి ర్యస్య, స జీవన్ముక్త ఉచ్యతే ॥ 25 ॥

25. ఎవని ముఖకాంతి, సుఖమునందు వికసింపక, దుఃఖము నందు అస్తమింపక, ఎల్లవేళల సమముగ నుండునో. ఎవడు, ఎప్పు డేది లభించిన, (యథా ప్రాప్తమైన) దాని నవలంబించు చుండునో, అతడు, జీవన్ముక్తు డనబడును.

---

★ పోల్చు :- "న చాఽస్య మహతీం లక్ష్మీం, రాజ్యనాశోఽపకర్షతి ।
లోకకాన్తస్య కాన్తత్వా చ్ఛీతరశ్మేరివ క్షపా ॥
న వనం గన్తుకామస్య, త్యజతశ్చ వసున్ధరామ్ ।
సర్వలోకాతిగస్యేవ, లక్ష్యతే చిత్తవిక్రియా ॥" (వా.రా. అయోధ్య - XIX-32,33)
"దధతో మఙ్గళక్షౌమే, వసానస్య చ వల్కలే ।
దదృశు ర్విస్మితా స్తస్య, ముఖరాగం సమం జనాః ॥" (రఘువంశము-XII-8)

రాజ్య పరిత్యాగ సందర్భమునను, శ్రీరాముని వదనశోభ యందే మార్పును రాలేదు. అనంత భోగాస్పదమైన వసుంధరను త్యజించునపుడును, వనవాసమునకు వెళ్లునపుడును, ఆ మహాత్ముని చిత్తము శాంతమై, లోకాతీతుడగు యోగీంద్రుని చిత్తము వలె నిర్వికారమై యుండెను. దీనికి కారణము వికృతిరహితమగు పరమజ్ఞానమును అతడు వసిష్ఠమహర్షిని సేవించి, పొంది యుండెను. తరువాత, ప్రాపంచిక జీవితమును, దాని సర్వవిధ కర్తవ్యములను విశాలదృష్టితో స్వీకరించెను.

See: Sri Ramachandra The Ideal King – [Anne Besant. 1905 - Chapter III-p-50]

"The calm established in the whole being must remain the same whatever happens, in health and disease, in pleasure and in pain, even in the strongest physical pain, in good fortune and misfortune, our own or that of those we love, in success and failure, honour and insult, praise and blame, justice done to us or injustice, everything that ordinarily affects the mind". [Sri Aurobindo– The Synthesis of Yoga - The Action of Equality - II University Edition 1957- Chapter XIII. p-825-833]

సుఖదుఃఖాద్యనుభవములలో, ఈ యుగమునకు చెందిన శ్రీ రామకృష్ణ, వివేకానంద, రమణ, రామదాస, అరవిందాది జీవన్ముక్తుల దివ్యజీవన చర్య, ఆధ్యాత్మసాధననిష్ఠల కందఱికిని ఆదరణీయము; అనుసరణీయము. ఇట్టి మనఃప్రవృత్తి, భారతదేశ సర్వతోముఖాభ్యున్నతికి హేతువు కాగలదు.

**యో జాగర్తి సుషుప్తిస్థో,[1] యస్య జాగ్ర న్నవిద్యతే ।**
**యస్య నిర్వాసనో బోధః, స జీవన్ముక్త ఉచ్యతే ॥ 26 ॥**

26 గాఢనిద్ర (సుషుప్తి) యందున్నను, ఎవడు మేల్కొని యుండునో, ఎవనికి దేహేంద్రియసాధారణమగు జాగ్రదవస్థ లేదో, ఎవని జ్ఞానము, వాసనా (ప్రాక్తనసంస్కార) రహితమో, **అతడే జీవన్ముక్తుడు.**
**[ఈ జ్ఞానము, స్మృతిజన్యమైన జ్ఞానము నుండి విముక్తము]**

**రాగద్వేషభయాదీనా, మనురూపం చరన్నపి ।**
**యోఽన్త ర్వ్యోమవదత్యచ్ఛః, స జీవన్ముక్త ఉచ్యతే ॥ 27 ॥**

27. బాహ్యమున, రాగద్వేషభయాదులకు అనుగుణముగ చరించు చున్నప్పటికి, (నటించుచున్నప్పటికి) అంతరమున నెవడు **ఆకాశము వలె** అత్యంతస్వచ్ఛుడో, **వాడే జీవన్ముక్తుడనబడును.**

**యస్య నాఽహఙ్కృతో భావో, యస్య బుద్ధి ర్నలిప్యతే ।[2]**
**కుర్వతోఽ కుర్వతో వాఽపి, స జీవన్ముక్త ఉచ్యతే ॥ 28 ॥**

28. ఎవనికి అహంకృతమగు భావము (మానసిక ప్రవృత్తి) లేదో, ఎవని బుద్ధి, కార్యముల నొనర్చుచున్నను, ఒనర్పక యున్నను, కర్తృత్వాభిమానములచే నంటబడనిదో **(నిర్లిప్తమో) అట్టి వాడే జీవన్ముక్తుడనబడును.**

**యస్మా న్నోద్విజతే లోకో, లోకా న్నోద్విజతే చ యః ।[3]**
**హర్షాఽమర్ష భయోన్ముక్తః, స జీవన్ముక్త ఉచ్యతే ॥ 29 ॥**

(1) పోల్చు :- యా నిశా సర్వభూతానాం, తస్యాం జాగర్తి సంయమీ ।
యస్యాం జాగ్రతి భూతాని, సా నిశా పశ్యతో మునేః ।  (భ.గీ. - 69)
ప్రాణు లందరికి ఏది రాత్రియో, అంధకారమయమో, దాన, పరమార్థ విషయమున, సంయమి (విజితేంద్రియుడు) మేల్కొని యుండును - అన్ని వేళల (నిరంతరము) పరమార్థతత్త్వమును, దర్శించుచుండును. ఏ అజ్ఞాన రాత్రి యందు, జీవులు మేల్కొని సంసారానుభవ మొందుదురో, తత్త్వ దర్శియగు మునికి, ఆ సంసారావస్థ, రాత్రిని పోలునది.

(2) పోల్చు :- భ.గీ. XVIII-17;

(3) పోల్చు :- భ.గీ. XII-15.

29. ఎవని నుండి లోకము భయ మందదో, లోకము నుండి ఎవనికి భయము లేదో, ఎవడు సమ్మదము, కోపము, భయము – వీని నుండి విముక్తుడో, అట్టి మనుజుడే **జీవన్ముక్తు డనబడును.**
[ఉద్వేజనము – పీడ; వ్యాకులత]

**శాన్తసంసారకల్లోలః, కలావా నపి నిష్కలః ।**
**యః సచిత్తోఽపి నిశ్చిత్తః, స జీవన్ముక్త ఉచ్యతే । 30 ।**

30. సంసారమహాతరంగములు (సంసారమున సత్యతాబుద్ధి), ఉపశమించిన వాడు, సోపాధికుడైనను (దేహాఽద్యవయవధారి యైనను) నిరుపాధికుడు (నిరవయవుడు), చిత్త సహితుడైనను, అమనస్కుడునునైన పురుషుడే, **జీవన్ముక్తుడనబడును.**
[కలా – పురుషుని యందలి పదునాఱు – (16) – కళలు – ప్రాణము, శ్రద్ధ, ఆకాశము, వాయువు, తేజస్సు, జలము, భూమి, ఇంద్రియము, మనస్సు, అన్నము, వీర్యము, తపస్సు, మంత్రము, కర్మము, లోకము, నామము – **ఇవి శారీరక మానసికములైన ఉపాధులు.** – ఇవి యున్నను, జ్ఞాని, పరమాత్మాఽభిన్నుడగుట వలన, **నిరుపాధికుడు; అఖండుడు.**]

**యః సమస్తాఽర్థ జాతేషు, వ్యవహార్యపి శీతలః ।**
**పరాఽర్థేష్వివ పూర్ణాత్మా, స జీవన్ముక్త ఉచ్యతే । 31 ।**

31. సమస్తవిషయప్రపంచమున వ్యవహరించుచున్నను (జగద్వ్యాపారమున చరించుచున్నను), **మనస్సున శీతలుడు** (ఆవేగ రహితుడు) సంతృప్తుడు, పరార్థముల యందు (ఇతరుల సంపదలందు) చరించు వాని వలె **మమతాగంధ రహితుడు,** పూర్ణాత్ముడునైన **వాడు, జీవన్ముక్తుడనబడును.**
[పా.భే– **పదార్థేష్వివ** – సర్వ పదార్థముల యందు ఆత్మను గాంచుటచే పూర్ణాత్ముడు అని భావము]

**జీవన్ముక్తి పదం త్యక్త్వా, స్వదేహే*కాలసాత్కృతే ।**
**విశ త్యదేహముక్తత్వం, పవనోఽస్పన్దతామివ । 32 ।**

* కాలసాత్కృతే :– కాలవశీకృతే. సాత్కారము – అధీనము (యో.వా.తా.ప్ర)

32. ముక్తపురుషుడు, స్వదేహము కాలవశము కాగా, ప్రారబ్ధ క్షయమున, జీవన్ముక్తిపదమును త్యజించి, వాయువు స్పందించుట మాని నిశ్చల మైనట్లు, విదేహముక్తిని పొందును.

**విదేహముక్తో నోదేతి, నాఽస్తమేతి న శామ్యతి ।**
**కిమ ప్యవ్యపదేశ్యాత్మా, పూర్ణాత్ పూర్ణతరాఽఽకృతిః । 33 ।**

33. విదేహముక్తుడు ఉదయింపడు; అస్తమింపడు, నశింపడు. ఒకానొక అనిర్వచనీయ స్థితి అతనిది. అతని ఆకృతి, పూర్ణత కంటె పూర్ణతరము. [విదేహముక్తునకు వృద్ధి, అపక్షయములు లేవు. వ్యక్తాఽవ్యక్త భావములును లేవు]

## 4. బ్రహ్మస్వరూపమ్ – బ్రహ్మము యొక్క స్వరూపము

**మహాప్రళయసంపత్తౌ, సర్వకారణకారణమ్ ।**
**శిష్యతే యత్ పరం బ్రహ్మ, తదిదం వర్ణ్యతే శృణు । 34 ।**

34. మహాప్రళయము ప్రాప్తింపగా, సర్వకారణకారణమైన పరబ్రహ్మము (సద్వస్తువు) మాత్రమే మిగిలి యుండును; దాని నిపుడు వర్ణింతును వినుము.

**చిన్మాత్రం చేత్యరహిత, మనన్త మజరం శివమ్ ।**
**అనాదిమధ్యపర్యన్తం, య దనాది నిరామయమ్ । 35 ।**

35. అది కేవలము చిన్మాత్రము (శుద్ధచైతన్యస్వరూపము), చైత్య (దృశ్య) రహితము, అనంతము. అజరము (ముదిమిలేనిది) శివము, (మంగళ స్వరూపము), అనాదియు, నిరామయము (రుజా -కళంక-రహితము) నగుటచే, ఆదిమధ్యాంతరహితము.

**ద్రష్టృదర్శనదృశ్యానామ్, మధ్యే యద్దర్శనం స్థితమ్ ।**
**వేదనస్య ప్రకాశస్య, దృశ్యస్య తమస స్తథా★ । 36 ।**

★ బుద్ధివృత్తే రర్థస్ఫురణస్య, విషయస్యాఽజ్ఞానస్య చ
యత్ సాక్షిభూతం వేదనం, తేషా మాద్యన్త ప్రథాత్వా దనాద్యన్తం
తదిత్యర్థః । (యో.వా.తా.ప్ర.)

**వేదనం య దనాద్యన్తం, తద్రూపం పరమాత్మనః ।**

**36-37.** ద్రష్ట(చూచువాడు), దర్శనము(చూపు), దృశ్యము(చూడబడునది), – వీని నడుమ(త్రిపుటికి సాక్షిరూపమగు) ఈ ఆత్మ స్వరూపమున్నది. ప్రకాశము యొక్క వేదనము(జ్ఞానము), దృశ్యమగు తమస్సు యొక్క జ్ఞానము. అట్లే, అనాద్యంతమగు జ్ఞానము, – ఇదియే పరమాత్మ యొక్క స్వరూపము. [వీనినన్నిటి నెఱుగునది పరమాత్మయే.]

**వేద్యవేదనవేత్తృత్వ,రూపత్రయ మిదం పురమ్ ॥ 37 ॥**
**యత్రోదేత్యస్త మాయాతి, నిర్వికారం నిరఞ్జనమ్ ।**
**యత్ సదా భాతి సద్రూపం, తద్రూపం పరమాత్మనః ॥ 38 ॥**

**37–38.** ఎచ్చట, వేద్య,వేదన,వేత్తృత్వములు, (తెలియదగినది, తెలివి, తెలియువాడు) అను త్రిపుటీ లక్షణములతోడి ఈ పురము(శరీరము), ఉదయించి (పుట్టి) అస్తమించు (నశించు)చున్నదో, నిర్వికల్పము (అవ్యయము), నిర్మలమునై, యేది, నిరంతరము ప్రకాశించు సద్రూపమో, అదియే పరమాత్మ యొక్క స్వరూపము.

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే, 'ఉత్పత్తి క్రమో'నామ తృతీయః సర్గః**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠసంగ్రహమున 'ఉత్పత్తిక్రమ'మను
తృతీయ (మూడవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు !*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## చతుర్థసర్గము

## లీలోపాఖ్యానమ్ – లీలాదేవి కథ

1. **దేవీ వర ప్రాప్తిః – లీలాదేవి సరస్వతీదేవి నుండి వరమును పొందుట.**

**వసిష్ఠ ఉవాచ**

**అత్రేదం మణ్డపాఽఽఖ్యానం, చిత్తవిశ్రాన్తిదం శృణు ।**
**పద్మోనామ నృపః కశ్చిత్, శ్రీమానాసీత్ వివేకవాన్ । 1 ।**
**తస్యాఽఽసీత్ సుభగా భార్యా, లీలా నామ పతివ్రతా ।**

1. **వసిష్ఠుడు :– ఈ విషయమై, చిత్తవిశ్రాంతిదాయకమైన మండపోపాఖ్యానమును వినుము.**

**శ్రీమంతుడు వివేకశాలియునగు పద్మడను రాజొక డుండెను. అతనికి లీలాదేవియను సౌభాగ్యవతి, పతివ్రతయు నగు భార్య యుండెను.**

**సైకదా చిన్తయామాస, "ప్రాణేభ్యోఽపి ప్రియః పతిః । 2 ।**
**యౌవనోల్లాసవాన్ శ్రీమాన్, కథం స్యా దజరాఽమరః" ।**

2. "నా భర్త నాకు ప్రాణములకంటెను ప్రియుడు; యౌవనోల్లాసవంతుడు, శ్రీమంతుడునగు నిత డేయుపాయమున, జరామరణ రహితుడు కాగలడు" - అని యామె యొకప్పుడు చింతించెను.

**"తపోజపయమై నూనం, సమస్తాః సిద్ధసిద్ధయః । 3 ।**
**సంప్రాప్యస్తేఽమరత్వం తు, న కథంచన లభ్యతే ।"**
**ఏవం ద్విజముఖాచ్ఛ్రుత్వా, చిన్తయామాస సా పునః । 4 ।**

3-4. "తపము, జపము, యమము (ఆత్మనిగ్రహము) - వీని యనుష్ఠానముచే, సమస్త సిద్ధులు సిద్ధించును. కాని, అమరత్వము మాత్ర మేయుపాయము చేతను లభింపదు." - అని బ్రాహ్మణుల పలుక విని, యామె మరల నిట్లు తలపోసెను.

**"మరణం భర్తు రగ్రే మే, యది దైవాత్ భవిష్యతి ।**
**తత్ సర్వదుఃఖనిర్ముక్తా, సంస్థాస్యే సుఖమాత్మని" । 5 ।**

5. దైవవశమున నేను నా భర్త కంటెను ముందే మరణించినచో, సర్వ దుఃఖవిముక్తిని పొంది, ఆత్మ యందు సుఖముగ నుండగలను.

**"యద్యసౌ మ్రియతే పూర్వం, తజ్జీవో న గృహాత్ బహిః ।**
**యథా గచ్ఛేత్ తథోపాస్యా, మయా దేవీ సరస్వతీ" । 6 ।**

6. "నా కంటె నా భర్త ముందుగ మరణించిన, అతని జీవుడు, గృహము నుండి వెలువడకుండునట్లు, సరస్వతీదేవిని ఉపాసింతును."

**ఇతి నిశ్చిత్య సా నాథ మనుక్త్వైవ వరాఙ్గనా ।**
**యథాశాస్త్రం చకా రోగ్రం, తపోనియమ మాస్థితా । 7 ।**

7. ఆ వరాంగన, లీలాదేవి, ఇట్లు నిశ్చయించుకొని, భర్తకు తెల్పకయే, శాస్త్రానుసారము నియమస్థితయై, కఠోర తపమాచరించెను.

**తుష్టా భగవతీ ప్రాహ, "గృహాణ వర మీప్సితమ్" ।**
**దేవీం స్తుత్వా★తతో లీలా, వరద్వయ మయాచత ॥ 8 ॥**

8. భగవతి - సరస్వతి - యామె తపమునకు సంతుష్టురాలై "నీ కిష్టమైన వరమును గ్రహింపు"మని పల్కెను. లీలాదేవి, వాగ్దేవిని స్తుతించి,★ రెండు వరములను అర్థించినది.

**"భర్తుర్జీవో విదేహస్య, మా యాసీత్ నిజమణ్డపాత్ ।**
**యదాఽహం ప్రార్థయే త్వాం చ, తదా మే దేహి దర్శనమ్" ॥ 9 ॥**

9. "నా భర్త మరణించినపుడు, అతని ప్రాణము (జీవాత్మ) నిజమండపము నుండి వెలుపలికి పోకుండుగాక ! నేనెపుడు ప్రార్థింతునో, అపుడే నీవు దర్శనమొసగుము."

**ఏతద్వరద్వయం లబ్ధ్వా, బభూవాఽఽనన్దధారిణీ ।**
**కాలే బహుతిథే యాతే, భర్తా తస్యాః మమార హ ॥ 10 ॥**

10. ఈ రెండు వరములను పొంది, లీలాదేవి ఆనందధారిణియయ్యెను. బహుకాలానంతరము, ఆమె భర్త మరణించెను.

**దేవ్యాజ్ఞయా తదా రాజ్ఞీ, శోకసన్తాపపీడితా ।**
**శవీభూతం నివేశ్యాఽథ, భర్తారం పుష్పఖణ్డకే ॥ 11 ॥**
**దుఃఖా దాహూయ సా దేవీం, ఉవాచ భృశదుఃఖితా ।**

11-12. శోకసంతాపపీడితయై రాణి (లీల), భర్త యొక్క శవమును సరస్వతీదేవి యాజ్ఞానుసారము పూలపాన్పున నుంచి, దుఃఖముతో ఆ దేవిని ఆహ్వానించి, అత్యంత దుఃఖముతో నిట్లు పలికెను.

**"క్వ మమాఽవస్థితో భర్తా?, కిం కరోత్యథ?, కీ దృశః? ॥ 12 ॥**
**సమీపం నయ మాం తస్య, నైకా శక్నోమి జీవితుమ్" ।**

12-13. "నా భర్త యిపుడెచట నున్నాడు? ఏమి చేయుచున్నాడు? ఎట్లున్నాడు? నన్నాతని కడకు గొనిపొమ్ము. నేనొంటరిగ జీవింపజాలను".

---

★ "జయ జన్మజరా జ్వాలా, దాహదోష శశిప్రభే ! ।
జయ హార్దాన్ధకారౌఘ నివారణ రవిప్రభే"! । అని దేవిని లీల స్తుతించినది. (యో.వా.III.16-37)

ఏవముక్తా తదా దేవీ, బ్రహ్మతత్త్వ ముపాదిశత్ ॥ 13 ॥

13. ఇట్లు లీల, వచింపగా, సరస్వతీదేవి, ఆమెకు బ్రహ్మతత్త్వ ముపదేశించినది.

"చిత్తాకాశం చిదాకాశ, మాకాశం చ తృతీయకమ్ ।
ద్వాభ్యాం శూన్యతరం విద్ధి, చిదాకాశం వరాననే!" ॥ 14 ॥

14. "వరాననా! చిత్తాకాశము, చిదాకాశము, ఆకాశము – అను త్రివిధాకాశము లలో, చిదాకాశమే మిగిలిన రెంటి కంటెను శూన్యతరమని గ్రహింపుము"

"తస్మిన్ నిరస్తనిశ్శేషసఙ్కల్పా, స్థితిమేషి చేత్ ।
సర్వాత్మకం పదం, తత్త్వం, త్వం తదాఽఽప్స్న్యసంశయమ్" ॥15॥

15. "సంకల్పముల (చిత్తవృత్తుల) నిశ్శేషముగ పరిత్యజించి, చిదాకాశమున నీవు నిలుకడ నొందినచో, నిస్పందేహముగ సర్వాత్మకమగు తత్త్వమును, బ్రహ్మపదమును పొందగలవు."

"అత్యన్తాఽభావసంపత్త్యా, జగతస్త్వేతదాప్యతే" ।
ఇత్యుక్తా సహసా లీలా, నిర్వికల్పసమాధిభాక్★ ॥ 16 ॥

16. "జగత్తు యొక్క అత్యంత అభావము (జగత్తునకు అనగా, సంసారమునకు సంబంధించిన సంస్కారములన్నిటి యొక్క నాశము) సిద్ధించినపుడు, ఈ పదమును ప్రాప్తించును." – ఇట్లు బోధింపబడి లీల, వెంటనే నిర్వికల్పసమాధి అనుభూతిని పొందినది.

---

★ పోల్చు :- "ప్రశాన్త వృత్తికం చిత్తం, పరమానన్దదీపకం ।
అసంప్రజ్ఞాత నామాఽయం, సమాధి ర్యోగినాం ప్రియః ।" (శ్రుతి.)

మనోవృత్తులన్నియు ఇందు నశించును. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయ, రహితమైన ఈ సమాధియే అసంప్రజ్ఞాత సమాధి. ఇది, యోగులకు ప్రియమైనది. చిత్తము నశింపగా, కూటస్థ నిత్య అనంత శుద్ధ రూపమగు ఆత్మశక్తి, సర్వ ప్రకాశక స్వస్వరూపమునందు (స్వమహిమయందు) సర్వదా నిర్విఘ్నముగా ప్రకాశించును. మఱియు-

"ద్రష్టృదర్శన దృశ్యానాం, విరామో యత్ర జాయతే ।
స్వస్వరూపం తదేవ స్యాత్ సాక్షి రూపేణ తిష్ఠతి" । (శ్రీ శారదాచతుశ్శతి I-56)

"తస్యాఽపి నిరోధే సర్వనిరోధా న్నిర్బీజః సమాధిః ।"

సర్వ సంస్కారముల నిరోధము వలన, నిర్వికల్పసమాధి సిద్ధించును.

(యోగదర్శనము I-51)

సన్త్యజ్యాఽథ స్వకం దేహమ్, అంతఃకరణ పఞ్జరమ్ ।
దదర్శ స్వస్థా భర్తారం, మాస్థానే బహురాజకే ॥ 17 ॥

17. అప్పుడు అంతఃకరణ (మనోబుద్ధి అహంకార చిత్తరూప)మునకు లోహ నిర్మితపంజరము వంటిదగు తన స్థూలదేహమును విడిచి, స్వస్థయై, (స్వీయ మహిమ యందు చిదాకాశమున ప్రతిష్ఠితయై) అనేక నృపులు కొలువగా, ఆస్థానమున కొలువు దీరియున్న తన భర్తను, ఆమె కాంచినది.

సింహాసనసమారూఢం, ప్రాక్తన్యా జరసోజ్ఝితమ్ ।
ద్విరష్టవర్షం భూపాలం, దృష్ట్వా సా విస్మయం యయౌ ॥ 18 ॥

18. మునుపటి వార్ధకము నుండి విముక్తుడై, షోడశ వర్షప్రాయుడై యున్న భూపాలుని గాంచి ఆమె విస్మయ మందినది.

నిజాఽన్తఃపుర మాగత్య, దేవీం సస్మార భక్తితః ॥
పృష్టా దేవీ తదా ప్రాహ, సర్గస్య భ్రాన్తిమాత్రతామ్ ॥ 19 ॥

19 లీలాదేవి తన అంతఃపురమునకు ఏతెంచి, సరస్వతీదేవిని భక్తితో స్మరించినది. ప్రశ్నింపబడిన దేవి, సర్గము (సృష్టి) కేవలము భ్రాంతి మాత్రమని తెలిపినది.

## 2. పూర్వవృత్తాన్తః – పూర్వ వృత్తాంతము

దేవ్యువాచ – సరస్వతి (ఇట్లు) వచించినది.

"అస్తి కశ్చిత్ చిదాకాశే, క్వచిత్ సంసారమణ్డపః ।
తత్ర వసిష్ఠ నామాఽఽసీత్, కశ్చిత్ ధర్మపరో ద్విజః ॥ 20 ॥

20. "చిద్రూప (చైతన్యరూప) ఆకాశమున (చిదాకాశమున) ఒకానొక చోట నొక సంసారమండపము (ప్రపంచము యొక్క అస్తిత్వభవనము) కలదు. అచ్చట, వసిష్ఠుడను పేరు గల ధర్మపరుడైన బ్రాహ్మణు డొకడు నివసించుచుండెను.

**తుల్యశీలవయోవేషా, తస్య భార్యా హ్యరున్ధతీ ।**
**కదాచిత్ స దదర్శాఽధః, పరివారయుతం నృపమ్ ॥ 21 ॥**

**21.** అతనికి సమానవయస్సు, శీలము, రూపమును గల అరుంధతి యను భార్య యుండెను. ఒకప్పు డతడు (ఆ పర్వతము యొక్క) క్రింది భాగమున పరివారముతో పోవుచున్న రాజును గాంచెను.

**'అహో! భూపాలతా రమ్యా, సర్వసౌభాగ్యలాలితా ।**
**కదా స్యా మహమప్యేవం?,' ఇతి సఙ్కల్పవా నభూత్ ॥ 22 ॥**

**22.** 'ఆహా! సకలసౌభాగ్యములతో లాలింపబడుచున్న రాచరికము నిజముగ రమ్యమైనది. నేనును అట్లు ఎప్పుడగుదును?' - అని అతడు సంకల్పవంతుడయ్యెను.

**ఆసన్నమరణస్యాఽస్య, భార్యా మాం శరణం గతా ।**
**త్వద్వత్ సా ప్రార్థయామాస 'జీవో భర్తుః మృతస్య మే ॥ 23 ॥**
**మా యాసీత్ మణ్డపా దస్మాత్' తథైవాఽఙ్గీకృతం మయా ।**
**మృతః స ప్రాక్తనాఽనల్పసఙ్కల్పా దభవన్నృపః ॥ 24 ॥**

**23-24.** వసిష్ఠునకు మరణ మాసన్నమైనది. అతని భార్య, నీవలెనే నన్ను శరణుచొచ్చి 'మరణించిన నా భర్త యొక్క జీవుడు ఈ మండపము నుండి వెడలి పోకుండుగాక.' - అని నన్ను ప్రార్థించినది. నేనును, అట్లేయని అనుగ్రహించితిని. అతడు మరణించి, పూర్వపు అనల్పమైన సంకల్పము వలన, రాజయినాడు.

**తస్మిన్నేవ చిదాకాశే, జీవాఽఽకాశతయా స్థితః ।**
**శోకేన కర్శితా సాధ్వీ, దేహ ముత్సృజ్య దూరతః ॥ 25 ॥**
**ఆతివాహికదేహేన, సా భర్తార ముపాయయౌ ।**
**త్వమేవ సా స తే భర్తా, ద్విజో భూపత్వమాగతః ॥ 26 ॥**

**25-26.** ఆ చిదాకాశము నందే, జీవాకాశ (వ్యష్టి) రూపమున నతడుండెను. శోకముచే కృశించిన ఆ సాధ్వి, స్థూలమగు **ఆధిభౌతికదేహమును** పరిత్యజించి, **ఆతివాహిక (సూక్ష్మ) శరీరముతో** భర్తను చేరుకొన్నది.

నీవే ఆ సాధ్వివి. నృపత్వము పొందిన, ఆ ద్విజుడే నీ భర్త.

**ప్రాక్తనీ సా స్మృతి ర్లుప్తా, యువయో రుదితాఽన్యథా ।**
**స్వప్నే జాగ్రత్స్మృతి ర్యద్వత్, మృతే రద్యాఽష్టమం దినమ్॥ 27 ।**

27 స్వప్నమున జాగ్రదవస్థకు సంబంధించిన స్మృతి ఉదయించునట్లు , మీ యిరువురి పూర్వస్మృతి లోపించి, మఱియొక విధమున నుదయించినది. ఆ బ్రాహ్మణుడు మృతి నొంది నేటికి ఎనిమిదవ దినము.

**దేశదైర్ఘ్యం యథా నాఽస్తి, కాలదైర్ఘ్యం తథా న హి**
**'ఏతస్యాఽహం పితుః పుత్రో, వర్షాణ్యేతాని సన్తి మే' । 28 ।**
**ఇతి భ్రాన్తిర్జగత్యత్ర, మృతిమోహా దనన్తరమ్ ।"**
**ఏవం దేవ్యాః వచః శ్రుత్వా, లీలా ప్రోచే సరస్వతీమ్ । 29 ।**

28–29. దేశమునకు దీర్ఘత్వము లేనట్లే, కాలమునకును దీర్ఘత్వము లేదు. (ఈ రెండును, (ప్రతిభాస) భ్రాంతి మాత్రములే). 'ఈ తండ్రికి పుత్రుడను నేను. నావయస్సు ఇన్ని సంవత్సరములు.'–అని మరణమూర్ఛానంతరము, జగమున ఈ భ్రాంతి ఉదయించుచున్నది."

శ్రీదేవి యొక్క ఈ పలుకులు విని లీల, ఆమెతో నిట్లన్నది.

**"సర్గం బ్రాహ్మణదమ్పత్యోః, తం మాం నయ మహేశ్వరి"! ।**
**ఏవ ముక్తా తు సా ప్రాహ, "దేహం ముక్త్వా భవాఽమలా । 30 ।**

30. "మహేశ్వరీ! ఆ బ్రాహ్మణ దంపతులున్న సర్గమునకు నన్ను చేర్పుము." అని లీల కోరగా, "ఆధిభౌతికమగు ఈ స్థూలశరీరమును విసర్జించి నిర్మలస్వరూపవు కమ్ము."

**"అచేత్యచిద్రూపమయీం, పరమాం పావనీం దృశమ్ ।**
**అవలంబ్య చ పశ్యావః, సహ సర్గ మనర్గలమ్ । 31 ।**

31. "దృశ్యముల నుండి విముక్తమైన చిద్రూపమయమగు (కారణబ్రహ్మాత్మమయమగు) **పరమపావనదృష్టి** నవలంబించి, మన మిరువురమును, ఆ

సర్గమును, ఏ ప్రతిబంధకమును (ఆటంకము) లేకుండ కాంచగలము.

**ఆతివాహిక ఏవాఽయం, త్వాదృశై శ్చిత్తదేహకః ।**
**ఆధిభౌతికయా బుద్ధ్యా, గృహీత శ్చిర భావనాత్ । 32 ।**

32. ఈ చిత్తదేహము **ఆతివాహికదేహమే** (సూక్ష్మమైన ఆధ్యాత్మికదేహమే). చిరకాలభావన వలన, నీవంటి వారిచే నిది, **ఆధిభౌతిక (స్థూలశరీర) బుద్ధిచే** గ్రహింపబడినది.

**వాసనాతానవం నూనం, యదా తే స్థితిమేష్యతి ।**
**తదాఽఽతివాహికో భావః, పునరేష్యతి దేహకే । 33 ।**

33. (సంసార) వాసనలు సన్నగిల్లిన స్వాభావిక స్థితి, నీకు కల్గినపుడు, ఈ ఆతివాహిక(ఆధ్యాత్మికసూక్ష్మ) దేహభావము, ఈ దేహముననే మరల నుదయింపగలదు.

**వాసనా తానవే తస్మాత్, కురు యత్నం అనిన్దితే!।**
**తస్మిన్ ప్రౌఢి ముపాయాతే, జీవన్ముక్తా భవిష్యసి" । 34 ।**

34. కావున, ఓ అనిందితా! (పావనమూర్తీ!) వాసనలు (మానసిక సంస్కారములు) సన్నగిల్ల జేయుటకు ప్రయత్న మొనరింపుము. ఇందు (ఈ ప్రయత్నమున) ప్రౌఢిమ (నైపుణ్యము, పూర్ణత) ప్రాప్తించినపుడు, నీవు, జీవన్ముక్తురాలవు కాగలవు. (జీవించియున్నపుడే ముక్తిని పొందగలవు)".

### 3. బ్రహ్మాఽభ్యాసః- బ్రహ్మసాక్షాత్కార సాధన

**లీలోవాచ –**

**అత్రోపకురు మే*బ్రూహి, కోఽభ్యాసః? కీదృశోఽథవా? ।**
**స కథం పోషమాయాతి?, పుష్టే తస్మింశ్చ కిం భవేత్ ?" । 35 ।**

35. **లీల :–** "దేవీ! నా యం దనుగ్రహముంచి, ఆ యభ్యాసమేదో, యెట్టిదో, అది యెట్లు పుష్టిపొందునో, అట్లు పుష్టి పొందినచో, నేమి కలుగునో, వివరించి, తెలుపుము."

---

★ కురుతే – పా.భే. ।

శ్రీ దేవ్యువాచ - శ్రీదేవి ఇట్లన్నది.

**"తచ్చింతనం తత్కథనమ్, అన్యోన్యం తత్ప్రబోధనమ్ ।**
**ఏతదేకపరత్వం చ, త దభ్యాసం విదుర్బుధాః ॥ 36 ॥**

36. శ్రీ దేవి :- "(చిత్తమున ఆత్మపదమును) చింతన చేయుట, ఒకరికి చెప్పుట, పరస్పర బోధనము, అందే తత్పరత్వమును కలిగి యుండుట, (దానినే మనన మొనరించుట) బ్రహ్మాభ్యాసమని జ్ఞానులెఱుగుదురు.

**అత్యన్తాఽభావసంపత్తౌ, జ్ఞాతుర్ జ్ఞేయస్య వస్తునః ।**
**యుక్త్యా[1] శాస్త్రైర్యతన్తే యే, తే బ్రహ్మాఽభ్యాసినః స్థిరాః ॥ 37 ॥**

37. "జ్ఞాత, జ్ఞేయవస్తువు - వీని యొక్క **అత్యంత అభావబుద్ధి** సంప్రాప్తి యందు, యుక్తి పూర్వకమగు విచారణ చేతను, అధ్యాత్మశాస్త్రముల చేతను, ఎవరు ప్రయత్నింతురో వారే స్థిరులైన బ్రహ్మాభ్యాసులు.

**సర్గాదావేవ నోత్పన్నం, దృశ్యం నాఽస్త్యేవ తత్ సదా ।**
**ఇదం జగ దహం చేతి, బోధాఽభ్యాసం విదుః పరే[2] ॥ 38 ॥**

38. సృష్ట్యాదియందు దృశ్యప్రపంచము ఉత్పన్నము కాలేదు. ఇది యెపుడును లేనిదే (అసత్తే). ఈ జగత్తు, నేనును, పరబ్రహ్మము నందే యున్నాము. అను బోధోదయమే, బ్రహ్మాభ్యాస మని, అన్యులు కొందఱు జ్ఞానులు ఎఱుగుదురు. (**త్రైకాలికదృశ్యబాధదర్శనావృత్తి సైతము, బ్రహ్మాభ్యాసమే**).

**దృశ్యాఽసంభవబోధేన, రాగద్వేషాఽఽది తానవే ।**
**రతిర్బలోదితా[3] యాఽసౌ, బ్రహ్మాఽభ్యాస స్స ఉచ్యతే ॥ 39 ॥**

39. దృశ్యము, అసంభవమన్న జ్ఞానము చేత రాగద్వేషాదులు సన్నగిల్లి, మననము వలన కల్గిన విద్యావాసనచే దృఢమైన **ఆత్మరతి** బ్రహ్మాభ్యాస **మనబడును.**

---

(1) యుక్త్యా - ప్రమాణ తత్త్వావధారణానుకూలయా ।
ప్రమేయ తత్త్వావధారణానుకూలయా చ ।
శాస్త్రైః- అధ్యాత్మ శాస్త్రైః (ఆనందబోధేంద్రసరస్వతి - వాసిష్ఠ మహారామాయణ తాత్పర్య ప్రకాశికా)

(2) బోధాఽభ్యాస ఉదాహృతః - పా.భే.

(3) బలమ్ - మనన జన్య విద్యావాసనా దార్ఢ్యమ్. రతిః - ఆత్మరతిః (ఆనందబోధేంద్రసరస్వతి)

**తదభ్యాసేన నిర్వాణ మిత్యభ్యాసో మహోదయః ।"**
**సంభాష్యైవం నిశాయాం తే, నిర్వికల్పసమాధినా । 40 ।**
**బభూవతుః చిదాకాశరూపిణ్యౌ, వ్యోమగాకృతీ ।**

**40-41.** ఈ అభ్యాసము వలన నిర్వాణసిద్ధి ప్రాప్తించుటచే, అభ్యాసమే మహోదయము (మహోన్నతసిద్ధి)". రాత్రి, ఇట్లు, సంభాషించి వారిరువురును, నిర్వికల్పసమాధిచే, చిదాకాశరూపిణులై, వ్యోమగాములు (దేవతల) ఆకృతులను పొందిరి.

**దూరాత్ దూర మభిప్లుత్య, తతో బ్రహ్మాణ్డ మణ్డలాత్ । 41 ।**
**నిర్గత్యాఽన్యదనుప్రాప్తే, మణ్డలం బ్రాహ్మణాఽఽస్పదమ్ ।**
**తదా తస్యాస్తు సఙ్కల్పాత్, తత్రత్యాః దదృశుస్త్వమే । 42 ।**

**41-42.** తరువాత ఈ బ్రహ్మాండమండలము నుండి, దూరదూరముగ మిగుల వేగముతో వెళ్లి, బ్రాహ్మణ నివాసమైన వేఱొక బ్రహ్మాండ మండలమును చేరగా, శ్రీ దేవీసంకల్పబలమున అచ్చటి వారు వీరిని గాంచ గల్గిరి.

**"నమోఽస్తు వనదేవీభ్యామ్", ఇత్యుక్త్వా కుసుమాఞ్జలిమ్ ।**
**తత్యాజ జ్యేష్ఠశర్మాఽథ, సార్ధం గృహజనేన సః । 43 ।**

**43.** "వన దేవతలారా! మీకు నమస్కారము" – అని జ్యేష్ఠశర్మ (బ్రాహ్మణుని పెద్దకొడుకు) గృహజనముతో కూడి వారికి పుష్పాంజలిని సమర్పించినాడు.

**పుత్రం సా మూర్ధ్ని పస్పర్శ, తేన సర్వే శుచం జహుః ।**
**తద్దృష్ట్వా పునరాయాతా, లీలా దేవీ మపృచ్ఛత । 44 ।**

**44.** ఆమె (లీలాదేవి) పుత్రుని శిరస్సును స్పృశించినది. దాన, అందఱును సంతాపము త్యజించిరి. అది గాంచి, లీల, సరస్వతిని మరల చేరి ఇట్లు ప్రశ్నించినది.

**"మృతస్య భర్తుర్జీవోఽసౌ, యత్ర రాజ్యం కరోతి మే ।**
**తత్రాఽహం కిం న తైర్దృష్టా?, దృష్టాఽ స్మీహ సుతేన కిమ్?" । 45 ।**

45. "మృతి జెందిన నా భర్త యొక్క జీవుడు రాజ్యమేలు చోట నున్న జనులు, నన్నెందుకు కాంచరైరి? ఇచ్చట నా కుమారు డేల నన్ను కాంచగల్గెను?"

**దేవ్యువాచ :–**

**"అభ్యాసేన వినా వత్సే! తదా తే ద్వైతనిశ్చయః ।**
**నాఽస్తఙ్గతోఽభవత్★, సత్యసఙ్కల్పత్వమభూత్ న చ ॥ 46 ॥**

46. శ్రీ దేవి :– "కుమారీ! అప్పుడు నీకు అభ్యాసము లేనందున, ద్వైత నిశ్చయము (ప్రపంచము సత్యమనియెడి నిశ్చయము) పోలేదు. కావున, సత్యసంకల్పత్వము నీకు సిద్ధింపలేదు.

**అద్యాఽసి సత్యసఙ్కల్పా, ఫలితం తే యదీప్సితమ్" ।**

47. ఇపుడు నీవు సత్యసంకల్పురాల వైతివి. (కావున) నీవు కాంక్షించిన దంతయు ఫలించినది."

**లీలోవాచ :–**

**"అహో! మయా స్మృతాన్యద్య, పూర్వజన్మశతాని మే ॥ 47 ॥**
**సుభ్రాన్తం హి మయా పూర్వం, నానావిధాసు యోనిషు ।**

47. లీల :– "అహో! నేడు నా పూర్వజన్మ శతముల నన్నిటిని స్మరించితిని. నేను పూర్వము నానావిధయోనుల యందు (జన్మభూముల యందు) పరిభ్రమించితిని."

## 4. అనన్తరవృత్తాన్తః – తరువాతి కథ

**వసిష్ఠ ఉవాచ –**

**ఏవ మాకథయన్త్యౌ తే, ప్రాప్య సర్గం ద్వితీయకమ్ ॥ 48 ॥**
**అన్తఃపురే దదృశతుః, రాజానం శవతాం గతమ్ ।**
**తతః పునః వినిర్గత్య, దదృశతుర్భయానకమ్ ॥ 49 ॥**

★ మానమస్తం గతో నాఽభూన్నిఃశేషం వరవర్ణిని! ।" పా.భే.

**48-49.** వసిష్ఠుడు:— ఇట్లా ఇరువురు (సరస్వతీ లీలాదేవులు) సంభాషించుకొనుచు, రెండవ బ్రహ్మాండమండలమును చేరుకొని, అంతఃపురమున శవమై పడియున్న రాజును గాంచినారు. తరువాత అందుండి నిర్గమించి, ఒకానొక భయానక దృశ్యమును కాంచినారు.

**సేనయోః శస్త్రసమ్పాతం, యుద్ధే చోపరతే నిశి ।**
**విదూరథాఖ్యభూపస్య, దేవ్యౌ వివిశతుర్గృహమ్ ॥ 50 ॥**

**50.** ఇరుసేనల శస్త్రసంపాతమును వారు కాంచిరి. రాత్రి, యుద్ధము విరమింపబడి యుండగా, విదూరథ నామక నృపతి గృహమున, సరస్వతీ లీలా దేవు లిర్వురును ప్రవేశించినారు.

**ప్రబుధ్య చ తదా రాజా, సన్దదర్శాఽఙ్గనాద్వయమ్ ।**
**ఉత్పత్య శయనాద్భక్త్యా, సోఽర్పయత్ కుసుమాఽఞ్జలిమ్ ॥ 51 ॥**

**51.** తరువాత రాజు మేల్కొని, ఆ యిరువురు కాంతలను గాంచెను; భక్తితో పాన్పు నుండి లేచి, వారికి పుష్పాంజలిని సమర్పించినాడు.

**"రాజన్! స్మర వివేకేన, పూర్వజాతి"మితి స్వయమ్ ।**
**వదన్తీ మూర్ధ్ని పస్పర్శ, తం కరేణ సరస్వతీ ॥ 52 ॥**

**52.** "రాజా! వివేకముతో నీ పూర్వజన్మమును స్మరింపుము". అనుచు, సరస్వతి స్వహస్తముతో అతనిని శిరమున స్పృశించినది.

**అథ హార్దం తమో మాయా, రాజ్ఞోఽస్య క్షయ మాయయౌ ।**
**సస్మార పూర్వవృత్తాన్త మన్తః స్ఫురదివ స్థితమ్ ॥ 53 ॥**

**53.** అప్పుడు, రాజు హృదయమందలి తమోరూపమైన మాయ (హృదయాంధకారము) నశించినది. అతడు తన అంతఃకరణమున స్ఫురించిన దాని వలె, పూర్వవృత్తాంత మంతయును, స్పష్టముగ స్మరించెను.

**"హే దేవ్యౌ! కిమిదం నామ? దిన మేకం మృతస్య మే ।**
**అద్యేహ సమతీతాని, వయోవర్షాణి సప్తతిః" ॥ 54 ॥**

**ఇతి పృష్టే తదా దేవ్యౌ, రాజ్ఞా విస్మితచేతసా ।**

54-55. "ఓ దివ్యాంగనలారా! ఇది యేమి? నేను మృతినొంది యొక దినము మాత్రమే అయినది. ఇచ్చట నాకు నేటికి డెబ్బది(70) సంవత్సరముల వయస్సు గడచినది." విస్మితచిత్తుడై రాజిట్లు వారిని ప్రశ్నింపగా---

**దేవ్యువాచ –**

**"యథా స్వప్నే ముహూర్తే తు, సంవత్సరశతభ్రమః । 55 ।**
**తవ మాయావిలాసేన, తథాఽయం జాగ్రతి భ్రమః ।**
**వస్తుతస్త్వ న జాతోఽసి, న మృతోఽసి కదాచన । 56 ।**

55-56. శ్రీదేవి :– "స్వప్నమున క్షణమాత్రముననే, శతసంవత్సములు గడచినట్లు భ్రమ కల్గుచున్నది. అట్లే, నీ జాగ్రదవస్థ యందలి ఈ భ్రమ సైతము, మాయావిలాసము వలన కల్గినది. కాని, ఎపుడును, వాస్తవముగ నీవు జన్మించను లేదు; మృతి నొందను లేదు.

**శుద్ధవిజ్ఞానరూప స్త్వం దీర్ఘస్వప్న ఇదం జగత్ ।"**

57. "నీవు శుద్ధవిజ్ఞాన స్వరూపుడవు; ఈ జగ త్తొక దీర్ఘ స్వప్నము."

**రాజోవాచ :–**

**"అహం దేహ మిమం త్యక్త్వా, పూర్వదేహం లభే కదా?" । 57 ।**

57. రాజు :– "ఈ దేహము త్యజించి, పూర్వదేహమును నేనెపుడు పొందుదును"?

**దేవ్యువాచ –**

**"అస్మిన్ రణే తు మర్తవ్యం, తతః ప్రాప్స్యసి పూర్వకమ్" ।**
**ఏతస్మిన్ ప్రస్తుతే శ్రుత్వా, శత్రుణా పీడితం పురమ్ । 58 ।**
**రాజా విదూరథో "దేవ్యౌ! యుద్ధాయ యామ్యతో మమ ।**
**రక్ష్యతా మియం భార్యే"తి, ప్రోచ్య యుద్ధాయ నిర్యయౌ । 59 ।**

58-59. శ్రీదేవి :– "ఈ యుద్ధమున నీవు మృతి నొందవలయును. తరువాత, నీ పూర్వదేహమును పొందగలవు". అని చెప్పగా, పురము శత్రు

పీడితమై నదని విని, విదూరథనృపాలుడు -

"దివ్యాంగనలారా! యుద్ధమునకు పోవుచున్నాను. ఈ నా భార్య, రక్షింపబడుగాక" అని పలికి, యుద్ధార్థమై వెడలిపోయెను.

**లీలా లీలాం దదర్శాఽన్యాం, స్వాఽఽకార సదృశాఽఽకృతిమ్ ।**
**తతో వీరగణైః సాకం, గత్వా సమరభూతలే ॥ 60 ॥**

**ప్రయుధ్యంస్తు హతో రాజా, ప్రతిరాజేన సంయుగే ।**

**60-61.** (అనంతరము) లీల, తన ఆకృతితో సమానమగు ఆకృతి గల మఱియొక లీలను గాంచినది. వీరగణ సమేతుడై యుద్ధమునకు వెళ్లి, రాజు అచ్చట శత్రురాజుచే హతుడైనాడు.

## 5. పునరాగమనమ్ - పునరాగమనము

**మూఢం భర్తార మాలోక్య, లీలాఽనుగమనేచ్ఛయా ॥ 61 ॥**
**బ్రహ్మాఽది స్థాన మాక్రమ్య, ప్రాప చిద్గగనాఽన్తరమ్ ।**

**61-62.** మూర్ఛితుడై యున్న భర్తను గాంచి, లీల అతని ననుగమించు కాంక్షతో, బ్రహ్మాదుల స్థానమును ఆక్రమించి, చిదాకాశమున ప్రవేశించినది.

**పత్తనే తత్ర పద్మస్య, దేవీశక్త్యుపబృంహితా ॥ 62 ॥**
**మణ్డపే పుష్పగుప్తస్య, శవస్య నికటే స్థితా ।**

**62-63.** పద్మరాజు పట్టణమున, (విదూరథుని భార్య, లీల) దేవీశక్తి బలసంపన్నయై, మండపమున పుష్పగుప్తమై (పూలచే కప్పబడి) యున్న శవము యొక్క సమీపమున నిలిచి యుండెను.

**రాజ్ఞో జీవకళా లీలా, దేవీ చేతిత్రయం తతః ॥ 63 ॥**
**సర్గాత్ సర్గాఽన్తరం గత్వా, పద్మరాజస్య మణ్డపే ।**
**శవపార్శ్వే స్థితాం లీలాం, దదర్శ పూర్వమాగతామ్ ॥ 64 ॥**

**63-64.** రాజు యొక్క జీవకళ, లీల, సరస్వతి, - ఈ ముగ్గురును సర్గము నుండి సర్గమునకు పయనించి, తమ కంటె ముందుగా నేతెంచి

యున్న (విదూరథుని భార్య) లీలను, మండపమున పద్మరాజు శవము ప్రక్కన గాంచినారు.

లీలోవాచ :-

"దేవి! స ప్రాక్తనో దేహః, కథం మమ న దృశ్యతే" ।

65. లీల :- "దేవీ! నా పూర్వదేహ మెందుకు కాన్పించుట లేదు."

దేవ్యువాచ -

"సమాధౌ త్వయి లీనాయాం నిర్జీవం తే కళేబరమ్ । 65 ।
చన్దనదారుభి ర్దగ్ధం, చితౌ నిక్షిప్య మన్త్రిభిః ।
ఆతివాహికదేహాఽసి, వాసనాయాః పరిక్షయాత్ । 66 ।

65-66. శ్రీ దేవి :- "నీవు నిర్వికల్పసమాధియందున్నపుడు, నీశరీరము నిర్జీవమై యుండగా, దానిని చితి యందుంచి, చందనకాష్ఠములచే, మంత్రులు దహించినారు. (ఇపుడు) వాసనాక్షయము వలన నీవు, ఆతివాహిక దేహవై (ఆధ్యాత్మికసూక్ష్మశరీరధారిణివై) యున్నావు.

ఆవాం తావదియం లీలా, పశ్యత్వి"త్యేవ చిన్తితే ।
ఉత్థాయ సంభ్రమాత్ దృష్ట్వా, తయోః పాదేషు సాఽపతత్ । 67 ।

67. మొదట, ఈ లీల, మనలను కాంచుగాక!" - ఇట్లు శ్రీదేవి తలచినంతనే, [విదూరథుని భార్య (మాత్న)లీల] వారిని గాంచి, ససంభ్రమముగ లేచి వారి పాదములపై పడినది.

"ఉత్థాపయామో నృపతిం, శవతల్పా దిమం పునః ।"
ఇతి జీవకళాం దేవీ, నాసికాయాం న్యవేశయత్ । 68 ।

68. "మన మిపుడు శవతల్పము నుండి రాజును లేపుదము" - అని శ్రీదేవి (మృత దేహముయొక్క) నాసికారంధ్రముల యందు జీవకళను ప్రవేశ పెట్టినది.

క్రమా దఙ్గాని సర్వాణి, సరసాని చకాశిరే ।
ఉత్తస్థౌ స లసత్కాయః, పప్రచ్ఛ విస్మిత స్తదా । 69 ।

69. క్రమముగ అతని అవయవములన్నియు సరసములై ప్రకాశించినవి. కాంతిమంతమగు తనువుతో లేచి, అతడు విస్మయముతో నిట్లు ప్రశ్నించెను.

**"కా త్వం? కేయం? కుతశ్చేయం?", తస్మై లీలాఽబ్రవీ ద్వచః ।**
**"మహిళా తవ లీలాఽహం ప్రాక్తనీ సహధర్మిణీ । 70 ।**

70. "నీ వెవరవు? ఈమె ఎవరు? ఈమె యెట నుండి?" -

"స్వామీ! నేను నీ పూర్వపు సహ ధర్మచారిణిని లీలను" - అని లీల వచించినది.

**"ఇయం తే మహిళా లీలా, ద్వితీయా లీలయా* మయా ।**
**ఉపార్జితా తవైవార్థే, ప్రతిబిమ్బమయీ శుభా । 71 ।**

71. "ఈమె నీ ద్వితీయ లీల. నీ కొఱకు నాచే విలాసముగ సంపాదింపబడిన శుభరూపిణి, ప్రతిబింబమయి.

**ఏషా సరస్వతీ దేవీ, త్రైలోక్య జననీ శుభా" ।**
**ఇత్యాకర్ణ్య సముత్థాయ, వవన్దే స సరస్వతీమ్ । 72 ।**

72. ఈమె సరస్వతీదేవి; శుభరూపిణి, త్రైలోక్య జనని." - ఇట్లు విని ఆతడు లేచి సరస్వతికి ప్రణమిల్లెను.

**"సర్వాపదోఽపగచ్ఛన్తు! సన్త్వనన్తసుఖాని వః! " ।**
**ఇత్యుక్త్వా చ తదా దేవీ, తత్రైవాఽన్తర్ధి మాయయా । 73 ।**

73. "మీ ఆపదలన్నియు తొలగిపోవుగాక! అనంతసుఖములు మీకు సంప్రాప్తించుగాక!" - అని పలికి శ్రీదేవి యచటనే అంతర్ధాన మందినది.

**లీలా, లీలా, చ రాజా చ, జీవన్ముక్తా మహాధియః ।**
**కాలే విదేహ ముక్తత్వం, ఆసేదు ర్దేవ్యనుగ్రహాత్ । 74 ।**

74. లీలయు, ద్వితీయలీలయు, రాజును, మహాజ్ఞానవంతులై

---

★ హేలయా – పా.భే. (నిర్ణయసాగర ముద్రణ.)

జీవన్ముక్తులైనారు. కాలక్రమమున వారు శ్రీదేవి (జ్ఞప్తిదేవి) అనుగ్రహమున విదేహముక్తిని ప్రాపించినారు.

**ఏతత్తే కథితం రామ!, దృశ్యదోషనివృత్తయే ।**
**లీలోపాఖ్యాన మనఘం, ఘనతాం జగత స్త్యజ । 75 ॥**

75. శ్రీ రామా! **దృశ్య దోష నివృత్తి కొఱకు** (దృశ్యము నాస్తి యను బోధ వలన పరమైన నిర్వాణనిర్వృతి ప్రాపించు కొఱకు) నిర్మలము - రమ్యము-నగు **లీలోపాఖ్యానము** నీకెఱిగించితిని. జగము సత్యమను భావమును త్యజింపుము (ఘనతామ్ - సత్యతామ్)

**ఇతి శ్రీ యోగవాసిష్ఠసంగ్రహే, 'లీలోపాఖ్యానం' నామ చతుర్థః సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'లీలోపాఖ్యాన'మను చతుర్థ (నాల్గవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## పఞ్చమసర్గము

## సూచ్యుపాఖ్యానమ్ – సూచి యను రాక్షసి కథ

### 1. సూచీతపః – సూచి యొక్క తపశ్చరణము

వసిష్ఠ ఉవాచ –

"అసదాభాస* మచ్ఛాత్మ, బ్రహ్మాఽస్తి పరమం పదమ్ ।
బ్రహ్మణః స్ఫురణం కిఞ్చిత్, తం జీవం విద్ధి రాఘవ! ॥ 1 ॥

1. వసిష్ఠుడు :– బ్రహ్మము, అచ్ఛము (నిర్మలము – సద్రూపమును) అగు పరమపదము. ఈ అసద్రూపమగు జగము దాని ఆభాసరూపము.

---

★ పోల్చు :- "అసతాచ్ఛాయయాఽఽత్మయ, సదా భాసాయతే నమః" ।
"వెలి సనత్యమనెడి నీడతో వెలుగుచు నుండు వొక్కటికి.... నమస్కరింతు!
అసత్యమనెడు చాయతో కూడియుండువాడు. (భాగవతము – VIII –స్కంధము)

రాఘవా! (వ్యష్ట్యాత్మయగు) జీవుడు బ్రహ్మము యొక్క లేశమాత్ర స్ఫురణమే (అభివ్యక్తి) అని ఎఱుగుము.

**తదేవ ఘనసంవిత్త్యా, యాత్యహన్తా మనుక్రమాత్ ।**
**సఙ్కల్పోన్ముఖతాం యాత, స్త్వహఙ్కారో భవత్యపి । 2 ।**

2. ఇదియే (ఈ జీవుడే) ఘనీభవించిన సంవిత్తి (వాసనాదార్ఢ్యము)చే, క్రమముగ సంకల్పోన్ముఖమై , అహంకారతను పొందుచున్నది.

**చిత్తం, చేతో, మనో, మాయా, ప్రకృతి, శ్చేతి నామభాక్ ।**
**దీర్ఘస్వప్నస్థితిం యాతః, సంసారాఽఽఖ్యాం మనోవశాత్ ॥ 3 ।**

3. చిత్తము, చేతస్సు (దృశ్యవిషయకజ్ఞానము), మనస్సు, మాయ, ప్రకృతి, యను పేర్లను (క్రియానామములను) ఈ అహంకారము పొందుచున్నది. మనఃప్రభావముచే (మనఃకృతమైన ఆసక్తిచే) సంసార మను పేరు గల దీర్ఘస్వప్నాఽవస్థను (జన్మమృత్యుపరంపరను) ఇది పొందుచున్నది.

**అసమ్యగ్దర్శనాత్ స్థాణా, వివ పుంప్రత్యయో దృఢః ।**
**చిదాత్మజీవయోర్భేదో, నైవైవం జీవచిత్తయోః ॥ 4 ।**

4. సమ్యగ్దర్శనము లేనందున, స్థాణువు (స్తంభము, మోడు), మనుష్యుడను నిశ్చిత (దృఢ) భావము కల్గుచున్నది. చిదాత్మకు, జీవునకు, భేదము లేదు. అట్లే జీవునకు (వ్యష్ట్యాత్మకు), చిత్తమునకు, భేదము శూన్యము. అయినను, చిదాత్మ యందు జీవభావము, జీవుని యందు చిత్త భావము, భ్రాంతి వలన కల్గుచున్నది. (స్థాణువు మనుష్యుడు - అని రెండు పదార్థములు లేవు. ఉన్నది ఒక్కటే స్థాణువు. దాని యందు మనుష్యభావము భ్రాంతికల్పనము)

**న చిత్తసర్గయో ర్వాఽపి, కోఽపి భేదః కథఞ్చన ।**
**అత్రైవోదాహరన్తీమమ్, ఇతిహాసం పురాతనమ్ । 5 ।**

5. ఎట్టైనను, చిత్తమునకు సర్గమునకు (సృష్టికి) ఏ మాత్రమును భేదము లేదు. (పూర్వోక్త రూపకము ననుసరించి). ఈ విషయమున (జ్ఞానులు) **పురాతనేతిహాసము** నుదాహరింతురు.

**హిమాద్రే రభవత్ పార్శ్వే, కర్కటీనామ రాక్షసీ ।**
**తస్యా విపులకాయత్వాత్, దుర్లభత్వాత్ నిజాన్నసః ॥ 6 ॥**
**న కదాచన సా తృప్తి ముపయాతా మహోదరీ ।**

6-7. హిమవత్పర్వతపార్శ్వమున, కర్కటి యను పేరు గల రాక్షసి యుండెను. మహాకాయము కల్గియుండుట వలన, ఆ రాక్షసికి, తన ఆహారము దుర్లభమై యుండెను. గొప్ప కడుపుగల ఆ రాక్షసి, ఏ ఒకప్పుడును తృప్తిని పొందలేదు.

**"జంబూద్వీపగతాన్ సర్వాన్, నిగిరా"మీతి నిశ్చితా ॥ 7 ॥**
**వ్యవస్థితా తపః కర్తుం, తాం పితామహ ఆయయౌ ।**

**రాక్షస్యువాచ –**

**భగవన్! భూతభవ్యేశ! స్యామహం జీవసూచికా ॥ 8 ॥**

7-8. "జంబూద్వీపవాసులైన జనులందఱిని మ్రింగి వేయుదు"నని నిశ్చయించుకొని, ఆ రాక్షసి తప మొనరింప పూనుకొన్నది. (తపమునకు మెచ్చి) బ్రహ్మ దాని యొద్దకేతెంచెను.

**రాక్షసి :-** " భూతభవ్యములకు ప్రభువైన భగవంతుడా! జీవులకు నేనొక **సూచిక (సూది)** నగుదును గాక!"

**పితామహ ఉవాచ :–**

**"ఏవమస్తు తథా హి త్వం, భవిష్యసి విషూచికా ।**
**దుర్భోజనా దురారమ్భా, మూర్ఖా, దుఃస్థితయశ్చ యే ॥ 9 ॥**
**దుర్దేశవాసినో దుష్టా, తేషాం వ్యాధి ర్భవిష్యసి ।"**

9-10 బ్రహ్మ :– "అట్లేయగు గాక! నీవు విషూచిక (రోగము) వగుదువు. **దుష్టాహారభోజులు, దుష్కార్యారంభులు, మూర్ఖులు, దుర్జీవములు, దుష్టస్థానవాసులు, దుష్టులు, – వీరి కందఱికి నీవు వ్యాధివి కాగలవు."** (విషూచి – **'కలరా'** అను వ్యాధి)

**అథ సూక్ష్మశరీరా సా, ప్రాణిప్రాణైకఘాతినీ ॥ 10 ॥**
**బభూవ బహువర్ణాణి, తతః సా చిన్తయత్ స్వయమ్ ।**

10-11. తరువాత, ఆమె సూక్ష్మశరీరమును గ్రహించి, కేవలము ప్రాణుల ప్రాణ ఘాతినియై (జీవమును హరించునదియై) అనేక వత్సరములు గడపినది. అనంతర మారాక్షసి స్వయముగ (ఇట్లు) చింతించినది.

**"సూచీయం రక్తమాంసానాం, కణమాత్రేణ పూర్యతే ॥ 11 ॥**
**క్వ మే తాని విశాలాని, గతాన్యఙ్గాని దుర్ధియః" ।**
**ఇతి సంచిన్త్య భూయోఽపి, తపస్తేపే సుదారుణమ్ ॥ 12 ॥**

11-12. ఈ సూది, రక్తమాంసముల కేవలము కణము (బిందువు) చేతనే నిండిపోవుచున్నది. దుర్బుద్ధి యుక్తములగు నా పూర్వపు విశాలమైన అవయవము లెక్కడ? – ఇట్లు చింతించి ఆ రాక్షసి, మరల సుదారుణమైన తప మాచరించినది.

**బభూవ నిర్మలా సాఽపి, తపసా క్షీణకల్మషా ।**
**తస్థౌ సాఽఖిలసంసారహేయతాం హృది కుర్వతీ ॥ 13 ॥**

13. తపము వలన ఆ రాక్షసి సైతము, కల్మషములు క్షీణించి నిర్మలత్వమును గాంచినది. తన హృదయమున, సర్వసంసారము హేయమని – విసర్జింపదగినదియని – చింతించుచు నుండిపోయినది.

**తాం వేధా స్తాదృశీం జ్ఞాత్వా, సముపేత్య వచోఽబ్రవీత్ ।**
**"జీవన్ముక్తాఽసి హే వత్సే! హార్దం తే గళితం తమః ॥ 14 ॥**

14 సృష్టికర్తయగు బ్రహ్మ, ఆమెను అట్టి దానినిగా గ్రహించి, ఏతెంచి "బిడ్డా! నీవు జీవన్ముక్త వైనావు. నీ హృదయాంధకారము నశించినది.

**పురాతనవపుః ప్రాప్య, సుఖినీ భువనే చర ।**
**సైవ ముక్తా చిరం తస్థౌ, నిర్వికల్పసమాధినా ॥ 15 ॥**

15 నీ పూర్వ దేహమును పొంది, భువనమున సుఖముగ చరింపుము" – అని వచించెను. ఇట్లు చెప్పబడినదియై ఆమె, నిర్వికల్ప సమాధి*యందు చిరకాలముండెను.

---

* ద్రష్ట, దర్శన, దృశ్యములు మూడును అభావమైన, ఆత్యంతిక దృశ్యోపశమన స్థితియే నిర్వికల్ప సమాధి.
చూడు :– IV-16. పాదటీకా.

## 2 సూచీకృత ప్రశ్నః – సూచి అడిగిన ప్రశ్న

అథ కాలేన మహతా, చిత్తస్పన్దన మేత్య సా ।
బహిర్వృత్తిమయీ భూత్వా, సస్మార చ పునః క్షుధామ్ । 16 ।

16. చాల కాలము గడచిన తరువాత, ఆ రాక్షసి చిత్తస్పందనస్థితిని పొంది, బహిర్ముఖవృత్తియై, మరల తన ఆకలిని స్మరించుకొన్నది.

ప్రాప్తుం జాత్యుచితాఽఽ హార మటవ్యాం న్యవసత్ తదా ।

17. అప్పుడు తన జాతికి ఉచితమైన ఆహారము సంపాదించుటకు, ఆమె యొక అరణ్యమున నివసించినది.

ఏతస్మిన్నన్తరే తత్ర, మన్త్రిణా సహ భూపతిమ్ । 17 ।
రజన్యాం సంప్రవిష్టం సా, విలోక్యాఽచిన్తయత్ భృశమ్ ।

17-18. ఈ సమయమున రాత్రియందు మంత్రిసమేతుడై, ఆయరణ్యమున ప్రవేశించిన యొక రాజును గాంచి, ఆమె ఇట్లు గాఢముగ చింతించినది.

"అపి నంక్ష్యామి దేహేన*, నైవ భోక్ష్యే గుణాఽన్వితమ్ । 18 ।

తస్మాదిమౌ పరీక్షేఽహం, కయాచిత్ ప్రశ్నలీలయా" ।

ఇతి నిశ్చిత్య సా ఘోరం, వినద్యోవాచ రాక్షసీ । 19 ।

18-19. "దేహముతో నశించెదను గాని, (నా శరీరము నశించి పోయినను సరియే) గుణాన్వితుని భక్షింపను. కాన, విలాసముగ వీరిరువురిని కొన్ని ప్రశ్నలతో పరీక్షింతును." అని నిశ్చయించి ఆ రాక్షసి, ఘోరముగ నిర్ఘోషించి (రంకె వేసి), ఇట్లు పలికినది.

"కౌ భవన్తౌ ఇదానీం మే, హ్యాహారాఽర్థం సమాగతౌ? ।
ఏకోపాయేన మత్పార్శ్వాత్, బాలకౌ ఉత్తరిష్యథః । 20 ।
మత్ప్రశ్న పఞ్జరం పారం చేత్, విదారయథో ధియా" ।
'కథ్యతా'మితి రాజ్ఞోక్తా, సాఽపృచ్ఛత్ రాక్షసీ తదా । 21 ।

---

* అపి దేహేన నంక్ష్యామి – ఆత్మ అవినాశి కాన, దేహముతో నశింతునని రాక్షసి అన్నది.

20-21. "నాకు ఆహారార్థమై ఏతెంచిన మీ రిరువు రెవ్వరు? బాలకులారా! ఒక ప్రత్యేకమైన ఉపాయమున మాత్రమే మీరు నా పార్శ్వము నుండి తప్పించుకొనగలరు. మీ యందు సార (బల)మున్నచో నా ప్రశ్న పంజరమును మీ ధీశక్తితో చీల్చి వేయుడు." 'అడుగు'మని రాజు అన్నంతనే, ఆ రాక్షసి వారి నిట్లు ప్రశ్నించినది.

సూచ్యువాచ – సూచి ఇట్లడిగినది.

"ఏకస్యాఽనేక సంఖ్యస్య, కస్యాఽణోరమ్బుధే రివ ।
అన్తర్బ్రహ్మాణ్డలక్షాణి, లీయన్తే బుద్బుదా ఇవ ॥ 22 ।

22. సూచి :- "యథార్థముగ నొకటియై యున్నను, ఉపాధిభేదముచే అనేకసంఖ్యలు కలదియై, అణువునై యున్న దేనియందు, అంబుధి యందు బుద్బుదముల వలె, లక్షల కొలది బ్రహ్మాండములు పుట్టి లయమగుచున్నవి? ఆ అణువేది?

కిమా కాశ మనాకాశం?(1), న కించిత్ కించిదేవ కిమ్?।(2)
గచ్ఛన్న గచ్ఛతి చ కః?, కోఽతిష్ఠన్నేవ తిష్ఠతి? । 23 ।

23 శూన్యమయ్యును, శూన్యము గాని ఆకాశ మేది? లేనిదైనను, ఉనికి గలదేది? నడచుచున్నను, నడవని దేది? నిలుకడగా నుండనిది యయ్యును, నిలుకడగా (స్థిరముగ) నుండునదేది?

కశ్చేతనోఽపి పాషాణః?, కశ్చ వ్యోమని చిత్రకృత్?।(3)
అణౌ జగన్తి తిష్ఠన్తి, కస్మిన్ బీజ ఇవ ద్రుమః ? । 24 ।

---

(1) అనాకాశమ్ – అశూన్యమ్ ।

(2) లౌకిక ప్రసిద్ధం న కించిత్, తత్త్వవిత్ప్రసిద్ధం కించిదేవ ।
(ఆనందబోధేంద్ర సరస్వతి – (యో.వా. తాత్పర్య ప్రకాశిక) లౌకిక ప్రసిద్ధమైనదేదియు కాదు–కాని, తత్త్వవేత్తలకు ప్రసిద్ధమైన దంతయు నగుచున్నది.

(3) పోల్చు :-
"In the blue of the sky, in the green of the forest, whose is the hand that has painted the glow?
When the winds were asleep in the womb of the ether, who was it roused them and bade them to blow?"
(Sri Aurobindo. "Who?" Collected poems)

24. చేతన స్వరూప మయ్యును, చైతన్యాఽనాశ్రయమగు పాషాణము వలె నుండునది ఏది? ఏది ఆకాశమున చిత్రములు రచించుచుండును? బీజము నందు వృక్షమట్లు, ఏ అణువునందు జగము లున్నవి?

**కస్మాన్న చ పృథక్ కించిత్?, ద్వైత మప్యపృథక్ కుతః?।"**

25. దేని నుండి ఏదియును భిన్నము కాదు? ద్వైత ప్రపంచము సైతము దీనికంటెను భిన్నము కాదు? ఎట్లు?"

## 3 సూచీ సమాధానమ్ – సూచీ ప్రశ్నలకు సమాధానము

మన్త్ర్యువాచ –

**"భవత్యా పరమాత్మైవ, కథితో బోధరీతితః । 25 ।**
**అనాఖ్యత్వా దగమ్యత్వా దాకాశాదపి సూక్ష్మకః ।**
**బ్రహ్మాణ్డబుద్బుదా స్తస్మిన్, లీయన్తే శక్తిపర్యయాత్ । 26 ।**

25-26. మంత్రి :- "నీ చేత పరమాత్మయే బోధరీతిచే (బోధయోగ్యముగ) వర్ణింపబడినది. (వాక్కుల కతీతమగుట వలన) వర్ణించుటకు అసాధ్యమైనది, (ఇంద్రియములకు విషయము కాదు కావున) పొంద రానిదియు నగుట వలన, అది ఆకాశమున కంటెను సూక్ష్మము. పరమాత్మ యందు బ్రహ్మాండములను బుద్బుదములు, శక్తి పర్యయము (శక్తి పరివర్తనము) వలన విలీనమగుచున్నవి.

**ఆకాశం బాహ్యశూన్యత్వాత్, అనాకాశం చ చిత్త్వతః ।**
**అకించి దిత్యనిర్దేశ్యం, వస్తువత్తేతి కించన* । 27 ।**

---

"శష్పే వనస్య హరితే, నభసశ్చ నీలే,
రాగం ప్రదీప్త మకరో న్ను కస్య హస్తః? ।
ఆకాశగర్భశయనే మరుతః ప్రసుప్తాన్,
ఆదిశ్య కశ్చ విరహేజయ ద్రుత వాతాన్ ?" ।
[శ్రీ కపాలిశాస్త్రిగారి సంస్కృతానువాదము – 'కవితాంజలిః'] "వనము యొక్క ప్రశస్తమైన పచ్చదనమున, ఆకాశము యొక్క నైల్యము నందును, ఎవని హస్తము ప్రదీప్తమై రంజనలేప మొనర్చెను? ఆకాశగర్భశయనమున నంతట నిద్రించుచున్న వాయువుల మేల్కొల్పి వీచునట్లుగ ఆజ్ఞాపించెను?"

★ సర్వాత్మకత్వాదితి! నన్వేవ సర్వాత్మకత్వాత్ స్వాత్మనైవ
సాక్షాత్కృతేన సర్వస్మిన్ భుక్తే విగీర్ణే సతి తదేవ కించిత్ ।
న కించనాత్మనా పరిశిష్యత ఇత్యాశయ ఇత్యర్థః । (యో.వా.తా.ప్ర.)

27. బాహ్యవస్తుశూన్యమగుటచే, ఆ పరమాత్మ 'ఆకాశమ'నియు, శుద్ధ చైతన్యస్వరూపమగుటచే, 'అనాకాశ (ఆకాశమున కంటె భిన్న)' మనియు, అనిర్దేశ్య (అనిర్వచనీయ) మగుటచే, '**అకించిత్తు**' (ఏదియు కానిది) అనియు, **సర్వ వస్తువులకును అధిష్ఠానమగుటచే, సర్వరూపమనియు** ('కించన'మనియు) **వర్ణింపబడినది.**

**చేతనోఽసౌ ప్రకాశాత్మా, వేద్యాఽభావాత్ భవేత్ శిలా ।**
**ఆత్మని వ్యోమని స్వచ్ఛే, జగ దున్మేషచిత్రకృత్ ॥ 28 ॥**

28. వేద్యము (తెలియదగినది) ఏదియు లేనందున, ప్రకాశాత్మకమగు ఆ శుద్ధచైతన్యము **శిల.** (పాషాణముతో ఉపమింపబడినది) **ఆత్మ స్వరూపమగు స్వచ్ఛాకాశమున, జగదభివ్యక్తి రూపమున, ఆ పరమాత్మ, చిత్రముల రచించును.**

**ఇదం తద్భావమాత్రత్వాత్, విశ్వం న స్యాత్ తతః పృథక్ ।**
**జగద్భేదోఽపి తద్భాన, మితి భేదోఽపి తన్మయః ॥ 29 ॥**

29. ఇది (దృశ్యమాన విశ్వము), ఆ పరమాత్మ యొక్క స్వభావ మాత్రమగుట వలన, విశ్వము, తద్భిన్నము కాదు. జగము నందలి భేదదృశ్యము సైతము దాని ప్రకాశమే. (దృశ్యమే). ఇట్లు భేదము సైతము తన్మయమే. [దాని కంటె వేఱు కానిదే - అభిన్నమే]

**సర్వగః సర్వసంబద్ధో, గత్యభావాత్ న గచ్ఛతి ।**
**నాఽస్త్యసౌ ఆశ్రయాఽభావాత్, సద్రూపత్వాదథాఽస్తి చ ॥ 30 ॥**

30 పరమాత్మ సర్వవ్యాపి; సర్వాధిష్ఠానమగుటచే, ప్రతివస్తువుతోను సంబద్ధమే. అవస్థారహితమగుటచే (గతి లేనందున) - అది ఎచ్చటికి పోవునది కాదు. (సర్వగతమగు దానికి రాక పోక లెక్కడ?) ఆశ్రయము లేనందున, అది లేనిదే (నాస్తి). కాని, సత్స్వరూపమగుట వలన, అది ఉన్నదియే (అస్తి). **(అస్తి నాఽస్తి విచికిత్సలు, సోపాధిక వస్తువులకే కాని, నిరవధికతత్త్వమునకు అన్వయింపవు.)**

రాజోవాచ –

"యత్సంకోచవికాసాభ్యాం, జగత్ప్రలయసృష్టయః ।*
నిష్ఠా వేదాన్తవాక్యానామ్, అథ వాచా మగోచరః । 31 ॥
సన్మాత్రం తత్ త్వయా భద్రే! కథ్యతే బ్రహ్మ శాశ్వతమ్ ।"

31-32. "రాజు :– శుభ స్వరూపిణీ! దాని సంకోచము, జగత్ప్రలయము. దాని వికాసము, జగత్సృష్టి. (దాని సంకోచవికాసములు, కేవలము మాయికములు). పరమాత్మను ఈ విధముగ వేదాంతశాస్త్రములు ప్రతిపాదించుచున్నవి – (వేదాంత వాక్యములకది పరమావధి – నిష్ఠ.) అయినను, అది, వాక్కులకు అందనిది. సన్మాత్రము, శాశ్వతమునైన ఆ పరబ్రహ్మమును నీవు నివేదించితివి."

రాక్షస్యువాచ –

"అహో! బత! పవిత్రేయం, భవతోర్భాతి శేముషీ । 32 ।
పూజనీయౌ యువాం నూనం, కథ్యతాం మే త్వదీహితమ్ ।"

32-33. రాక్షసి :– "అహో! ఆశ్చర్యము! మీ బుద్ధి, పవిత్రమై ప్రకాశించుచున్నది. మీ రిరువురును పూజనీయులు. మీ ఆకాంక్షితము నాకెఱిగింపుడు".

రాజోవాచ :–

"భూయో భవత్యా న ప్రాణాః, హింసనీయాః కదాచన" । 33 ।

33. రాజు :– పూజ్యురాలవైన "నీవిటుపైన నెపుడును మరల ప్రాణులను హింసింపకుము".

రాక్షస్యువాచ –

"ఆశరీరపరిత్యాగ మితః ప్రభృతి నో మయా ।
హింసనీయాః పరప్రాణాః, పశ్యన్త్యా సర్వగం శివమ్ । 34 ।

34 రాక్షసి :– "ఇప్పటి నుండి మరణపర్యంతము, సర్వగతము పరమమంగళ

---

★ పోల్చు :- ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః ।
(లలితాసహస్రనామస్తోత్రము–నామము 281.)

స్వరూపమునగు పరమాత్మను దర్శించుచున్న నేను, పరుల ప్రాణములను హింసింపను.

అమృతిం[1] ధారణాం బద్ధ్వా, క్షుధాం న గణయామ్యహమ్ ।"

35. అమృతాత్మభావనారూపమగు ధారణ నవలంబించి, ఆకలిని పరిగణింపను".

రాజోవాచ :-

"ఆగచ్ఛాఽస్మద్ గృహం భద్రే! దివ్యస్త్రీ రూపధారిణీ" ॥ 35 ॥

రాజు :- "కల్యాణీ! దివ్యాంగనా (దేవతా) రూపధారిణివై, మా గృహమునకు విచ్చేయుము.

తతో దుష్కృతిన శ్చౌరాన్, వధ్యాన్ శతసహస్రశః ।
మణ్డలేభ్యః సమానీయ,[2] దాస్యామి తవ భోజనమ్ ॥ 36 ॥

36. అపుడు మా దేశమందలి పాపకర్ములు, చోరులు, వధార్హులునైన వారిని వేల కొలదిగ పట్టి తెప్పించి, నీకు భోజనముగ నొసగెదను.

కాన్తారూపం పరిత్యజ్య, గృహీత్వా తానశేషతః ।
గత్వా చ హిమవచ్ఛృఙ్గం, తత్ర భుంక్ష్వ యథాసుఖమ్ ॥ 37 ॥

37. కాంతారూపమును విడిచి, వారి నందఱిని గైకొని, హిమవత్పర్వత శిఖరమునకు బోయి, యథాసుఖముగ భుజింపుము.

తృప్తిం నిద్రాం తతో లబ్ధ్వా, భవ భూయః సమాధిభాక్ ।
సమాధివిరతా భూయః, ఏవమేవ సమాచర ॥ 38 ॥

38. అట్లు తృప్తిని, నిద్రనుపొంది, మరల సమాధి నవలంబింపుము. సమాధి నుండి లేచిన తరువాత, మరల అట్లే ఆచరింపుము."

---

(1) అమృతిమ్ - అమృతాత్మ భావనారూపామ్ ।
(ఆనందబోధేంద్ర సరస్వతి – యో.వా. తాత్పర్య ప్రకాశిక)
అమృతిమ్ - Until death అని సంవిద్ గారు అనువదించుట చింత్యము. 'అమృతిమ్'–అను పాఠము సరికాదు.

(2) సమానీయ – సమాహృత్య –పా.భే.

తతః ప్రభృతి సాఽద్యాఽపి, కిరాతజనమణ్డలే ।
వధ్యా నాగత్య గృహ్ణాతి, సమాధేః వ్యుత్థితా సతీ । 39 ।

39. అప్పటి నుండి, నేటికి సైతము, ఆమె సమాధి నుండి లేచి, కిరాతజన మండలమున కేతెంచి, వధ్యులైన వారిని కొనిపోవు చున్నది.

(ఈ ప్రపంచమున, భయవిపత్తులు అజ్ఞానులకు మాత్రమే. విశ్వ రహస్యమును, విశ్వమున కధిష్ఠానరూపమైన పరమాత్మ స్వరూపమును ఎఱిగిన వివేకశాలి - తత్త్వవేత్త - సకల భయ విపత్తుల నుండి విముక్తు డన్న సత్యమునకు దృష్టాంతముగ, ఈ యుపాఖ్యానము చెప్పబడినది.

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే, 'సూచ్యుపాఖ్యానం' నామ పంచమః సర్గః ।

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠసంగ్రహమున 'సూచ్యుపాఖ్యాన'మను
పంచమ (ఐదవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## షష్ఠసర్గము

## భావనావైభవమ్ – మనోభావనాబలము

### 1. ఐన్దవో పాఖ్యానమ్ : – (ఇందుపుత్రుల కథ)

వసిష్ఠ ఉవాచ : –

"ఇద మైన్దవ మాఖ్యానం, శృణు రామ! శుభాఽఽవహమ్ ।
చితిశక్తిసముల్లాసం, విశ్వవోషి జగద్యతః । ।1।

1. వసిష్ఠుడు :– శ్రీరామా! శుభావహమైన ఈ ఐందవోపాఖ్యానము నాలకింపుము. దాన, ఈ జగము, చితిశక్తి యొక్క సముల్లాసమని నీవు నిశ్చయింపగలవు. (చితిశక్తి – మనోభావనాబలము).

వ్రజాః ప్రస్థం దృశౌ స్ఫారే, వ్యోమ్ని యోజితవా నజః ।
తత్రాఽపి దృష్టవాన్ సర్గాన్, పృథగ్భూతా ననేకశః । 2 ।

2. సృష్టికర్తయగు అజుడు (బ్రహ్మ), మానవజాతిని సృష్టించుటకు విశాలాకాశమున తన దృష్టిని యోజించెను. అచ్చట బ్రహ్మ, వేర్వేరైన అనేక జగములను కాంచినాడు.

**సూర్యం తస్మాత్ జగజ్జాలా దేకమానీయ పృష్టవాన్ ।**
**"కస్త్వం? కథ మిదం జాతం? జగజ్జాలం వదాఽనఘ!" ॥ 3 ॥**

3. ఆ జగజ్జాలము నుండి సూర్యు నొకని పిలిచి "నీవెవరు? ఈ సృష్టి (జగజ్జాలము), ఎట్లు కల్గినది? పాపరహితుడా! ఎఱిగింపు"మని బ్రహ్మ అడిగినాడు.

**ఇత్యుక్తో భాస్కరః ప్రాహ, "జంబుద్వీపైకకోణకే ।**
**ఇన్దునామాఽతి శాన్తాత్మా, కశ్యపస్య కులోద్భవః ॥ 4 ॥**

4. బ్రహ్మ ఇట్లడుగగా, "జంబుద్వీపమున నొక్క మూలప్రాంతమున, మిగుల శాంతస్వభావుడు, కశ్యపకులోద్భవుడునైన ఇందుడను పేరు గల నొక విప్రు డుండె" నని భాస్కరుడు తద్వృత్తాంత మెఱిగింప మొదలిడెను.

**తస్య ప్రాణసమా భార్యా, న బభూవాఽఽత్మజ స్తయోః ।**
**తేపతు స్తౌ తపో ఘోరం, పుత్రార్థం వ్రతనిష్ఠితౌ ॥ 5 ॥**

5. అతనికి ప్రాణసమానమగు భార్య యుండెను. వా రిరువురును, పుత్రుడు లేనందున, తత్ప్రాప్తికై వ్రతనిష్ఠులై ఘోరతప మాచరించిరి.

**'వరం విప్ర! గృహాణేతి,' తుష్టః ప్రోవాచ శంకరః ।**
**దశ పుత్రాన్ యయాచే సః, తథైవ చాఽఽప్తవాన్ వరమ్ ॥ 6 ॥**

6. శంకరుడు (శివుడు) వారి తపమునకు సంతుష్టుడై, 'బ్రాహ్మణా! వరము గైకొమ్ము' – అని వచింపగా, అతడు పది మంది పుత్రులను అర్థించి, అట్లే ఆ వరమును పొందెను.

**జాతాస్తే క్రమశో బాలాః, కాలేన ప్రౌఢి మాయయుః ।**
**మృతౌ చ పితరౌ దృష్ట్వా, గృహం సన్త్యజ్య ఖేదినః ॥ 7 ॥**

7. క్రమముగ పుత్రులు జనించి, కాలగమనమున ప్రౌఢవయస్కులైనారు.

తల్లిదండ్రులు మృతులౌట గాంచి, వారు గృహమును విడిచి, ఖేదమును (శోకమును) పొందిరి.

**'కిమిహ స్యాత్ పరంశ్రేయః', ఇతి సంచిన్త్య సోదరాన్ ।**
**జ్యేష్ఠః ప్రోవాచ 'బ్రహ్మత్వ మాకల్పాన్తాఽ వినాశి యత్ ॥ 8 ॥**
**తదేవ రోచతే మహ్యం, 'బ్రహ్మాఽహ' మితి చేతసా।[1]**
**సృజామి సంహరామీ'[2]తి, ధ్యానమస్తు చిరాయ[3]వః" ॥ 9 ॥**

**8-9.** '**ఈ లోకమున (ఇహమున) నేది పరమశ్రేయ**' మని విచారించి, జ్యేష్ఠుడు, తన సోదరులతో నిట్లనెను. '**కల్పాంతము వఱకు నశింపని సృష్టికర్త యగు** బ్రహ్మపదవియే నా కిష్టమైనది. 'నేను బ్రహ్మను' (సృష్టికర్తను), అను భావనచే జగత్ సృష్టి లయములను కావింతును' - అని యిట్లు చిత్తమున చిరకాలము (భ్రమరకీటన్యాయమున, తద్భావోదయమగు వఱకు) మీకు ధ్యానము సిద్ధించు గాక!'

**అథ తే బ్రాహ్మణా ఏవం, బద్ధబ్రహ్మాఽఽత్మ భావనాః ।**
**తేషాం దేహా స్తు కాలేన, గళితాః, శీర్ణపర్ణవత్ ॥ 10 ॥**

**10.** ఇట్లు, తాము బ్రహ్మల మన్న స్థిరధ్యానాఽధీనభావనతో ఆ బ్రాహ్మణులుండగా, కాలగమనమున వారి దేహములు **పండుటాకుల వలె** రాలిపోయినవి.

**భావనాపరిపాకేన, దశ తే బ్రహ్మతాం గతాః ।**
**స తేషాం దశధా సర్గ, ప్రతిభాసోఽయముత్థితః ॥ 11 ॥**
**ఏషా మన్యతమస్యాఽహం, భాస్కరోఽస్మి పితామహ!" ।**

**11.** **ధ్యాన పరిపాక వశమున** ఆ పదిమంది బ్రాహ్మణులును బ్రహ్మత్వమును పొందిరి. దశవిధసర్గప్రతిభాస వారికి కల్గినది. పితామహా! ఆ అనేక భాస్కరులలో (సూర్యులలో) నేనొకడను".

---

(1) **తేజసా** – పా.భే. (యోగవాసిష్ఠము – మున్షీరామ్ మనోహర్‌లాల్ ముద్రణ. న్యూఢిల్లీ –III Edition 1981)

(2) సృజామి, సంహరామీతి లిఙ్గాత్ 'సంవర్గ విద్యే'య ముపదిష్టేతి గమ్యతే । (యో.వా.తా.ప్ర.) దీనిని 'సంవర్గ విద్య'యని అందురు.

(3) **చిరాయ – భ్రమరకీటన్యాయేన ఆ తద్భావోదయ మిత్యర్థః । భ్రమర కీటన్యాయమున అది సిద్ధించు వఱకు అని భావము. (యో.వా.తా.ప్ర.)**

సామాన్యా బ్రాహ్మణా భూత్వా, మనోభావనయా కిల ॥ 12 ॥
ఐన్దవాః బ్రహ్మతాం ప్రాప్తాః, మనసః పశ్య శక్తతామ్ ।

12-13. ఇందుపుత్రులు సామాన్యబ్రాహ్మణు లయ్యును, దృఢమనోభావన వలన వాస్తవముగ బ్రహ్మత్వమును ప్రాపించినారు. శ్రీరామా! మనస్సు యొక్క శక్తిని, సామర్థ్యమును, చూడుము!

## 2. విటోపాఖ్యానమ్ – విటుని కథ (కృత్రిమేంద్రోపాఖ్యానము)

మనసా భావ్యమానో హి, దేహతాం యాతి దేహకః ॥ 13 ॥

13. మనస్సుచే భావింపబడి, దేహకుడు, (దేహి)దేహత్వమును పొందుచున్నాడు. (మనస్సుచే భావింపబడి జీవుడు ఏకత్వముచే దేహమే యగుచున్నాడు.)

దేహభావనయా ముక్తో,(1) దేహధర్మై ర్న బాధ్యతే ।

14. దేహభావన నుండి విముక్తిని బొంది, దేహధర్మములగు జనన మరణాదులచే, మనుజుడు బాధింపబడడు.

ఇన్ద్రద్యుమ్న ఇతి ఖ్యాతః, మాగధేషు మహీపతిః ॥ 14 ॥
అహల్యా నామ తస్యాఽసీత్, భార్యా కమలలోచనా ।
ఇన్ద్రనామా విటః కశ్చిత్, తస్మిన్నేవ పురేఽవసత్ ॥ 15 ॥

14-15. మగధ దేశీయులలో ఇంద్రద్యుమ్నుడను భూపతి ప్రసిద్ధుడు. అతనికి అహల్యయను - కమలలోచన, భార్య యుండెను. ఆ పురముననే ఇంద్రుడను పేరుగల యొక విటుడు (జారుడు) ఉండెను.

సాఽహల్యాఽహల్యయా సార్ధం, ఇన్ద్రస్య యదభూత్ పురా ।
తదాఽ కర్ణ్యేతిహాసేభ్యః, తస్మిన్నిన్ద్రేఽన్వరజ్యత(2) ॥ 16 ॥

16. ఇతిహాసముల వలన పూర్వము ఇంద్రునకు అహల్యతో ఏమి జరిగినదో, ఆ కథను విని, ఆమె, ఇంద్ర నామకుడైన విటుని యందు అనురక్తయైనది.

ఏవ మన్యోఽన్య మాసక్తం, భావమాలోక్య భూపతిః ।
తావుభావపి తత్యాజ, దుర్మతీ పరిలాశయే ॥ 17 ॥

(1) దేహభావనయాఽయుక్తో – పా.భే.
(2) కేవలం అసత్కథాశ్రవణమున, మనస్సు ఎట్లు ప్రభావితమగునో, దానిని ఇది నిర్దేశించుచున్నది.

17. వారి అన్యోన్య ఆసక్త భావమును గాంచి, రాజు, దుర్మతులగు వారిరువురిని (హేమంతమున) నొక తటాకమున విసర్జించెను. (త్రోయించెను).

తౌ తు జహసతు స్తుష్టౌ, న ఖేద ముపజగ్మతుః ।
గ్రథితౌ గజపాదేషు, కశాభిస్తాడితా వపి ॥ 18 ॥
జ్వాలాభి ర్దహ్యమానౌ చ, నాఽఽపతుః కామపి వ్యథామ్ ।
రాజ్ఞాఽథ పృచ్ఛ్యమానౌ తావూచతు ర్ముదితాశయౌ ॥ 19 ॥

18-19. అయినను, వారిరువురును తుష్టి(తృప్తి)గ నవ్వుచుండిరి కాని, ఖేదమును పొందరైరి. గజపాదములచే త్రొక్కించినను, కొఱడాలతో కొట్టించినను, అగ్ని జ్వాలలో పడవేయించినను ఏ మాత్రము వ్యథను పొందలేదు. అప్పుడు రాజు ప్రశ్నింపగా, సంతోషస్వాంతులైన వారిట్లు వచించిరి.

"ఆవాం ఖేదం నజానీవో, జాతావన్యోన్యతన్మయౌ ।
భావితం తీవ్రవేగేన, మనసా య న్మహీపతే! ॥ 20 ॥
తదేవ పశ్యత్యఖిలం*, న శరీరవిచేష్టితమ్ ।"

20-21. "మే మిరువురము పరస్పరతన్మయులమై యుండుటచే, దుఃఖము నెఱుగము. రాజా! తీవ్రవేగాత్మకమైన (దృఢాభినివేశమున) మనస్సు, దేనిని భావించునో, దానినంతయును, స్థిరముగ గాంచును. కాని, శరీర వ్యాపారమును, (సంవేదనమును) గాంచదు."

ఏవముక్త స్తతో రాజా, వచః కామాన్ధయో రపి ॥ 21 ॥
సత్యమేవేతి విజ్ఞాయ, తావుభౌ నిరవాసయత్ ।

21-22. వారిట్లన్న తరువాత, కామాంధులైనను వారి మాట సత్యమని తెలిసి కొని, రాజు, వారిరువురిని దేశము నుండి బహిష్కరించెను.

ఏవం రామ! జగత్యస్మిన్, ద్విశరీరాః శరీరిణః ॥ 22 ॥
ఏకం మనశ్శరీరం తు, క్షిప్రకారి చలం సదా ।
అకిఞ్చిత్కర మన్యచ్చ, శరీరం మాంస నిర్మితమ్ ॥ 23 ॥

22-23 శ్రీరామా! ఇట్లే జగమున శరీరికి (జీవునికి) రెండు శరీరములు కలవు.

* పశ్యత్యచలమ్ – పా.భే. అచలమ్ – స్థిరమ్ ॥ (యో.వా.తా.ప్ర.)

ఒకటి మనశ్శరీరము; క్షిప్రకారి - (శీఘ్రక్రియాకారి) - నిరంతరము చలించునది. మఱొకటి మాంస నిర్మిత శరీరము; దేని నొనరించుటకు నిది అశక్తమై నది, జడము.*

## 3 చిత్తోపాఖ్యానమ్ - చిత్తేతిహాసము

**అత్ర కించిదుపాఖ్యానం, చిత్తస్య కథయామి తే ।**
**అస్తి శూన్యాఽటవీ భీమా, తస్యామేకోఽభవన్నరః ॥ 24 ॥**

24. ఈ సందర్భమున చిత్తమును గుఱించిన యొక కథను నీ కెఱిగింతును. ఒక భయంకర శూన్యారణ్యమున నొక పురుషు డుండెను.

**పర్యాకులమతి ర్భీమః, సహస్రకరలోచనః ।**
**ప్రహరన్ ఆత్మనః పృష్ఠే, స్వాఽఽత్మనా పరిఘైర్భృశమ్ ॥ 25 ॥**
**క్రన్దన్ పలాయమానోఽసౌ, పతితోఽన్ధోఽన్ధకూపకే ।**

25-26. వేయేసి చేతులు, కన్నులు, గల ఆ భయంకరాకారుడు, వ్యాకుల చిత్తమున, తన వీపుపై తానే, వేయిచేతులతో పరిఘల (ఇనుపకట్ల గుదియల) ధరించి, తీవ్రముగ కొట్టుకొనుచు, ఆక్రందించుచు, పరుగెత్తుచు వెళ్లి, గ్రుడ్డిగా (వివేకదృష్టి శూన్యుడై) నొకచీకటి నూతిలో పడిపోయినాడు.

**తతః సముత్థితః కాలే, ప్రవిష్టః కణ్టకాఽటవీమ్ ॥ 26 ॥**
**తతః పునః వినిష్క్రమ్య, స్వాత్మానం ప్రహరన్ ముహుః ।**
**విద్రువన్ శీతలం గత్వా, కదళీకాననం హసన్ ॥ 27 ॥**

26-27. కొంతకాల మందుండి, మరల బయటికి లేచి వచ్చి, తన్ను తాను మాటి మాటికి కొట్టుకొనుచు, ముండ్లతో నిండిన అడవి యందు ప్రవేశించినాడు. తరువాత, మరల అందుండి వెడలి, మాటికి కొట్టుకొనుచు, - పరుగెత్తి -నవ్వుచు చల్లని అరటితోటలోని కేగి,- -

★ సుఖదుఃఖములు రెండును మనోవిశ్వాసము పైనను, మనోభావనపైనను, ఆధారపడుచున్న విషయము ఈ కథ నిరూపించుచున్నది. ఏదేనొక వస్తువున నిశ్చలమై న, స్థిరమై న, మనస్సు ఎంత వఱకు సర్వవిధములైన బాహ్య పీడలకు- (బాధలకు), సంవేదన పొందకుండ, సహింపగలదో, ఆ విషయమీ ఉపాఖ్యానము వివరించుచున్నది. బాహిరములైన, బలాత్కారములకు మనోవిశ్వాసము అభేద్యమనుటను పైతమీ కథ స్థాపించుచున్నది.

**క్షణాత్ తస్మాత్ వినిర్గమ్య, ముహుశ్చ ప్రహరన్ స్వయమ్ ।**
**విద్రుతః పతితో భూయః, తస్మిన్నేవాఽన్ధకూపకే ॥ 28 ॥**

28. క్షణ కాలముననే దాని నుండి బయలుదేరి, మాటిమాటికి తన్ను తాను కొట్టుకొనుచు, పరుగెత్తి, మరల అదే చీకటి నూతిలో పడిపోయినాడు.

**ఏవం రూపనిజాచారం, సమాలోక్య చిరం మయా ।**
**అవష్టభ్య బలాదేవ, ముహూర్తం ప్రతిబోధితః ॥ 29 ॥**

29. చిరకాల మిట్లు వాని రూపనిజాచారమును (వివేకదృష్టిచే) గాంచి కడకు (యోగబలమున) బలవంతముగా వానిని పట్టుకొని, క్షణకాలము బోధించితిని

**పృష్టశ్చ 'కిమిదం? కస్త్వం? కిం ముధా పరిధావసి?' ।**
**ఇతి పృష్టః స చ ప్రాహ, 'నాఽహం కశ్చిత్ కరోమి న ॥ 30 ॥**

30. 'ఇది ఏమి? ఎవరు నీవు? ఎందుకు వ్యర్థముగ పరుగెత్తెదవు?' – అని అడుగగా, 'నేనెవడను కాను, నేనేమియు చేయలేదు'. –

**'త్వం మే శత్రుః త్వయా దృష్టో, నష్టోఽస్మీ'తి రురోద సః ।**
**ప్రహసన్ అథ తత్యాజ, స్వాన్యఙ్గాని సమన్తతః ॥ 31 ॥**

31. 'నీవు నాకు శత్రువవు. నీ కంట బడి నేను నష్టపడినాను' – అని పలికి, యేడ్వ మొదలిడినాడు. తరువాత నవ్వుచు, తన అవయవములను అంతట త్యజించినాడు.

**ఏవం తస్మిన్ మహారణ్యే, బహవ స్తాదృశో నరాః ।**
**పరిభ్రమన్త ష్తిష్ఠన్తి, విద్యతే ఽద్యాఽపి సాఽటవీ ॥ 32 ॥**

32. ఇట్లా మహారణ్యమున, అట్టి వ్యక్తులు పరిభ్రమించుచు, నివసించుచున్నారు. **నేడును ఆ యరణ్యమున్నది.**

**శ్రీరామ ఉవాచ –**

**"కాఽసౌ మహాటవీ బ్రహ్మన్?, కిం వా తే కర్తు ముద్యతాః ?" ।**

**శ్రీరాముడు :–** "మహర్షీ! ఆ యరణ్య మేది? వా రేమి చేయుటకట్లు ప్రవర్తించుచున్నారు"

వసిష్ఠ ఉవాచ –

"సంసారాఖ్యే మహారణ్యే, ప్రభ్రమన్తి మనాంసి హి । 33 ।
మయా తాని వివేకేన, నీయన్తే పరమం శమమ్ ।"
కానిచిత్ మత్తిరస్కారాత్, నరకేషు పతన్త్యధః । 34 ।

33-34. వసిష్ఠుడు :– "సంసారమను ఈ మహారణ్యమున వాస్తవముగ మనస్సులు పరిభ్రమించుచున్నవి. వివేకముతో పరమశమమును నేను వానిని పొందజేయుచున్నాను. కొన్ని మనస్సులు నన్ను తిరస్కరించుట వలన, అధోలోకముల – (నరకముల యందు) పడుచున్నవి.

కదళీకాననం స్వర్గః, దుఃఖబాధస్తు కణ్టకః ।
'నష్టోఽస్మీ'తి యదుక్తం తత్, మమతాపరిదేవనమ్ । 35 ।

35. అరటి తోటయే స్వర్గము. దుఃఖ బాధలే ముండ్లు. 'నేను నష్టపడితి'నను మాట, మమతా – అహంకార– భావము యొక్క విలాపము.

మనసః త్యజతో భోగాన్, రోదనం సహజం ఖలు ।
పరిప్రాప్తవివేకస్య, త్యక్త సంసారసంస్థితేః । 36 ।
చేతస స్త్యజతో రూప మానన్దో హసితం భవేత్ ।

36-37. భోగములు (స్నేహలోభాదికములు) త్యజించునపుడు మనస్సునకు రోదనము, (విలాపము) సహజము కదా! పరిపూర్ణ వివేకమును బొంది, సంసారస్థితిని త్యజించి, వితర్కరూపమగు మనస్సును త్యజించి, మనోలయ మొనరించిన, వాని ఆనందమే, హసితము – నవ్వు.

ప్రహారాః కల్పనా ఘాతాః, క్రియన్తే స్వయమేవ హి । 37 ।
సఙ్కల్పవాసనాజాలైః స్వైరేవాఽఽయాతి బన్ధనమ్ ।
మనోలీలామయైర్బన్ధైః, కోశకారకృమి ర్యథా । 38 ।

37-38. మిథ్యాకల్పనారూపములైన ఘాతములు, దెబ్బలు, తనకు తాను కల్గించుకొన్నవే. కోశకారకృమి, (పట్టుపురుగు) వలె, లీలామయములైన సంకల్పవాసనాజాలములచే, బంధమును స్వయముగ మనస్సు కల్పించు కొనుచున్నది.

ఏతత్ తే కథితం రామ! చిత్తోపాఖ్యాన ముత్తమమ్ ।
చిత్తేనైవేద మాలోక్య, చిత్తత్యాగే స్థిరో భవ" ! । 39 ।

39. శ్రీరామా! ఉత్తమమైన ఈ చిత్తోపాఖ్యానము నీకు చెప్పబడినది. నీ మనస్సుచే దీని నాలోకించి, చిత్త త్యాగమున స్థిరుడవు కమ్ము"[1]

### 4. బాలకాఽఽఖ్యాయికా- బాలకుని కథ

సర్వశక్తి పరం బ్రహ్మ, నిత్య మాపూర్ణ మవ్యయమ్ ।
యయోల్లసతి శక్త్యాఽసౌ, ప్రకాశం సోఽధి గచ్ఛతి । 40 ।[2]

40. పరమార్థ సత్యమగు బ్రహ్మము, సర్వశక్తిమయము, శాశ్వతము, ఆపూర్ణము అవ్యయము. ఆపరబ్రహ్మము యొక్క శక్తిచేతనే, కార్యరూపమున, జగత్తు ప్రకాశమును పొందుచున్నది; - ప్రకట పఱచుకొనుచున్నది:

చిచ్ఛక్తి స్తస్య దేహేషు, జడశక్తి స్తథోపలే ।
స్పన్దశక్తిశ్చ వాతేషు, ద్రవశక్తి ర్జలేషు చ । 41 ।

41. (భౌతికమానసికాదులగు) దేహముల యందు చిచ్ఛక్తిగా, శిలల యందు చలనరహిత జడశక్తిగా[3], దార్ఢ్యశక్తిగా, వాయువు నందు స్పంద శక్తిగా, జలములందు ద్రవశక్తిగా, పరబ్రహ్మమే - శక్తి రూపమున - కార్య రూపమున ప్రకటమగుచున్నది.

శూన్యశక్తి స్తథాఽఽకాశే, నాశశక్తి ర్వినాశిషు ।
తేజశ్శక్తి స్తథా వహ్నౌ, స్ఫుటమేవోపలభ్యతే । 42 ।

---

(1) మనస్సు యొక్క తన్ను తాను పీడించుకొను - (ఆత్మ పీడా పరాయణ) స్వభావమునకీ కథ రూపకల్పన. వేయిచేతులు, వేయికన్నులు గల ఉన్మత్తుడగు వ్యక్తి, మనస్సునకు ప్రతీక. ఆ వ్యక్తి, తన్ను తాను, ఆవేశమున, వేయి కశాఘాతముల (కొరడా దెబ్బల)తో పీడించుకొనును; లక్ష్య రహితముగ కీకారణ్యమున పరిభ్రమించును.

(2) "పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే ।
స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" (శ్వే. ఉ. VI. 8)

(3) పోల్చు:- "చిచ్ఛక్తిః, చేతనారూపా, జడశక్తిః, జడాత్మికా". (లలితా సహస్రనామ స్తోత్రము) ప్రతివస్తువు నందును సత్, చిత్, ఆనందములు సత్తాభాగముగా నున్నవి. నామ రూపములు రెండును జడములు - ఇవి సత్తా రహితములు విచారింపగా శూన్యములు - ఈ జడశక్తియు బ్రహ్మాంశమే.

42. ఆకాశమున శూన్యశక్తియు, నశించు పదార్థములందు నాశశక్తియు, అగ్ని యందు తేజశ్శక్తి (దాహకశక్తి)యు, బ్రహ్మమే యని విశదమగుచున్నది.

ఫలపత్రలతా పుష్ప శాఖావిటపమూలవాన్ ।
వృక్షబీజే యథా వృక్ష, స్తథేదం బ్రహ్మణి స్థితమ్[1] ॥ 43 ॥

43. పండ్లు, ఆకులు, తీగలు, పూలు, కొమ్మలు, చిగురులు, మూలములును గల చెట్టు, విత్తనము లోపల నుండు నట్లు, బ్రహ్మము నందీ దృశ్యమానమగు జగత్తంతయు నున్నది.

క్వచిత్ క్వచిత్ కదాచిచ్చ, తస్మా దుద్యన్తి శక్తయః ।
దేశ కాలాదివైచిత్ర్యాత్, క్ష్మాతలాదివ శాలయః[2] ॥ 44 ॥

44. ఒకానొక ప్రదేశమున, వేఱొక ప్రదేశమునను, మఱియు, నొకానొక సమయమున, దేశకాలాఽఽది వైచిత్ర్యము ననుసరించి, భూతలము నుండి, శాలిధాన్య ముద్భవించునట్లే, బ్రహ్మము నుండి శక్తులును పొటమరించుచున్నవి.

ప్రపఞ్చోత్పత్తి రేవం హి, బాలకాఽఽఖ్యాయికా క్రమాత్ ।
"రాజపుత్రాః త్రయః సన్తి, శూరా అసతి పత్తనే ॥ 45 ॥

45 ప్రపంచోత్పత్తియు, బాలకకథాదృష్టాంతము వంటిదే సుమా!

---

(1) పోల్చు :-
"బీజాస్యాఽన్తరివాఽఙ్కురో జగదిదం, ప్రాఙ్నిర్వికల్పం పున -
ర్మాయాకల్పిత దేశకాల కలనా వైచిత్ర్య చిత్రీకృతమ్ ।
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా,
తస్మై శ్రీ గురుమూర్తయే నమ ఇదం శ్రీ దక్షిణామూర్తయే"
(శంకరుడు - దక్షిణామూర్తి స్తోత్రమ్ - 2)
"ఈశ్వరోఽనన్త శక్తిత్వా త్స్వతన్త్రోఽన్యాఽన పేక్షకః ।
స్వేచ్ఛామాత్రేణ సకలం, సృజ త్యవతి హన్తి చ ॥ (సురేశ్వరుడు-మానసోల్లాసము II-48)

(2) యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ,
యథా పృథివ్యామోషధయః సంభవన్తి ।
యథా సతః పురుషాత్ కేశలోమాని,
తథాఽక్షరాత్ సంభవతీహ విశ్వమ్ ॥ (ముం.ఉ.I-1.7.)
కార్యకారణములకు, శక్తులకు, శక్తిమంతమగు బ్రహ్మమునకును, అభేద మిందు స్థాపింపబడినది.

"ఒకశూన్య(లేని) పత్తనమున, ముప్పురు శూరులగు రాజపుత్రులున్నారు.

**ద్వౌ న జాతౌ తథైకస్తు గర్భ ఏవ హి న స్థితః ।**
**ఏకదోత్తమలాభార్థం, నిర్గత్య ఫలశాలినః । 46 ॥**
**దదృశుః గగనే వృక్షాన్, భుక్త్వా స్వాదు చ తత్ఫలమ్ ।**
**సరిత్త్రితయ మాసేదుః, పథి కల్లోలమాలితమ్ ॥ 47 ॥**

**46-47.** ఆ ముప్పురిలో, ఇద్దరు పుట్టనే లేదు. అట్లే వారిలో ఒక్కడు, గర్భము నందు ఉండనే లేదు. ఒకప్పుడు వారు ఉత్తమలాభమును కాంక్షించి, నగరము నుండి బయలుదేరి, ఆకాశమున ఫలభరితములైన వృక్షములను కాంచి, రుచికరములైన వాని ఫలములను మెసవి, మార్గమున తరంగ కల్లోలితములైన మూడు నదులను ప్రాపించినారు.

**తత్రైకా పరిశుష్కైవ, మనాగవ్యమ్బు న ద్వయోః ।**
**తత్ర స్నాత్వా జలక్రీడాం, కృత్వా, పీత్వా, పయస్తతః ॥ 48 ॥**

**48.** వానిలో నొక్కటి పూర్తిగా నెండిపోయినది. మఱి రెండు నదులలో నీరు లేనే లేదు. అందు స్నానము చేసి, జల విహార మొనర్చి, పాలవంటి నీరు త్రాగి, తరువాత - - (బయలుదేరి పోవుచు)...

**ఆసేదుస్తే దినస్యాఽన్తే, భవిష్యన్నగరం త్రయః ।**
**దదృశు స్తత్ర రమ్యాణి, త్రీణ్యేతే, భవనాని చ । 49 ॥**

**49.** సూర్యాఽస్తమయసమయమున, ముప్పురును ముందు (భవిష్యత్తున) కట్టబోవు నొక నగరమును, అందు రమణీయములైన మూడు భవనములను గాంచినారు.

**ఏకం నిర్భిత్తి నిష్టమ్భ, మనుత్పన్నం గృహద్వయమ్ ।**
**ప్రాపుః స్థాలీత్రయం తత్ర, తప్తకాఞ్చన కల్పితమ్ । 50 ॥**

**50.** వానిలో నొక భవనమునకు గోడలు, స్తంభములును లేవు. మఱి రెండు మందిరములు కట్టబడనే లేదు. అచ్చట వారు తప్తకాంచన కల్పితములైన మూడు పాత్రలను గాంచి (పొంది)నారు.

తత్ర కర్పరతాం యాతే, ద్వే ఏకా చూర్ణితాం గతా ।
తస్యాం ద్రోణత్రయం పక్వం, న్యూనం ద్రోణత్రయేణ తు । 51 ।

51 వానిలో రెండు ముక్కముక్కలై యున్నవి. ఒక్కటి పొడి పొడియై పోయినది. పొడియై పోయిన దానిలో, మూడు తూములకు, మూడు తూములు తక్కువగు బియ్యమును వండినారు.

అన్నం ప్రాప్య ద్విజైర్భుక్తం, నిర్ముఖై ర్బహుభోజిభిః ।
అవశిష్టం తతో భుక్త్వా, రాజపుత్రాః త్రయో హి తే । 52 ।
సుఖమేవ స్థితా స్తత్ర, మృగయావ్యవహారిణః ।"

52-53. తిండిపోతులైన నోళ్లు లేని బ్రాహ్మణులు తినగా, మిగిలిన అన్నమును ఆ ముగ్గురు రాకుమారులు భుజించి, అచట, మృగయా విహారములతో కాలము గడుపుచు సుఖముగా నుండిరి."

ధాత్ర్యా హి కథితా మేతాం, నిర్విచారధియా యథా । 53 ।
బాలో నిశ్చయ మాయాతి, విచారోజ్ఝితచేతసామ్ ।
ఇయం సంసారరచనాఽవ్యవస్థితి ముపాగతా । 54 ।

53-54 విచారరహితమైన బుద్ధితో (బుద్ధితో) బాలకుడు, దాది చెప్పిన ఈ కథను విశ్వసించినట్లే, విచార శూన్య మనస్కులైన వారి యందు, ఈ సంసారరచనయును* వ్యవస్థితిని పొంది యున్నది. (సత్యమని నిశ్చయింపబడినది).

*ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే, 'భావనావైభవం' నామ షష్ఠః సర్గః ।*

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'మనో భావనా బలమ'ను షష్ఠ (ఆఱవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



★ జగత్తు యొక్క కేవల మిథ్యాత్వమును నిరూపించుటకే కథ చెప్పబడినది.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో, వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## సప్తమసర్గము

## లవణోపాఖ్యానమ్ – లవణరాజు కథ

### 1. శామ్బరికేన మోహనమ్ – ఇంద్రజాలికుని మాయ

**వసిష్ఠ ఉవాచ :–**

**స్వ సఙ్కల్పవశాన్మూఢో మోహ మేతి న పణ్డితః ।**
**విచారయ ధియా సత్య మసత్యం చ పరిత్యజ ॥ 1 ॥**

1. **వసిష్ఠుడు :–** మూర్ఖుడు తన సంకల్పవశముననే మోహమును, –(చిత్త వైకల్యమును) – పొందుచున్నాడు; కాని, పండితుడు (జ్ఞాని) అట్లు మోహము పొందడు. బుద్ధితో సత్యమును విచారించి, అసత్యమును త్యజింపుము.

**మనః ప్రశమనే రామ! మోక్ష ఏవాఽవశిష్యతే ।**
**అత్ర తే శృణు వక్ష్యామి, వృత్తాన్త మిమ ముత్తమమ్ ॥ 2 ॥**

2. శ్రీరామా! మనస్సు ఉపశమమందగా, (లయమొందగా) మోక్షమే మిగులుచున్నది. ఈ విషయమున విశిష్టమైన ఉపాఖ్యానమును వినుము.

**లవణో నామ భూపాలః, ఆసీత్ పరమధార్మికః ।**
**తత్సభా మేకదా కశ్చిత్, సాఽఽటోపం ఇన్ద్రజాలికః ॥ 3 ॥**
**ప్రవిశ్య నత్వా భూపాలం, 'రాజన్! ఏతాం విలోకయ' ।**
**ఇత్యుక్త్వా భ్రామితా తేన, పిఞ్ఛికా భ్రమదాయినీ ॥ 4 ॥**

3-4. **లవణుడను** పేరు గల పరమధార్మికుడగు **భూపాలుడుండెను.** ఒకప్పుడు అతని సభకు సాటోపముగ (ఇంద్రజాలికోచితమైన వేషాఽలంకార బిరుదాఽఽడంబరసంపన్నముగ) ఇంద్రజాలికు డొక డేతెంచెను. ఇట్లు సభను ప్రవేశించి, రాజునకు నమస్కరించి, 'రాజా! దీని నాలోకింపుము' - అని భ్రమను గల్గించు **నెమలిపురికుంచె** నొక్కసారి ఆ రాజు చుట్టును త్రిప్పినాడు.

**తతః సైన్ధవసామన్తో, వివేశాఽశ్వయుతః సభామ్ ।**
**రాజానం చ తదా ప్రోచే, ప్రీత్యా స ఇన్ద్రజాలికః ॥ 5 ॥**

5. తరువాత సమీపస్థ సింధురాష్ట్రమునకు చెందిన సామంత రాజొకడు, గుఱ్ఱముతో సభను ప్రవేశించినాడు. అప్పుడు ఇంద్రజాలికుడు ప్రీతితో (స్నేహ భావమున) రాజున కిట్లు వచించెను.

**'సదశ్వమేన మారుహ్య, భువనం విహర ప్రభో!' ।**
**అథాఽనిమిషయా దృష్ట్యా, రాజాఽశ్వమవలోకయన్ ॥ 6 ॥**
**తస్థౌ ముహూర్తయుగ్మం తు, ధ్యానాఽఽసక్త ఇవాఽఽత్మని ।**

6. 'రాజా! ఈ ఉత్తమాశ్వము నారోహించి, జగమున విహరింపుము' - తరువాత, రాజు రెప్పవాల్పకుండ, ఆ యశ్వము నవలోకించి, ముహూర్త ద్వయము (ఇంచుమించు ఒకటిన్నర (11/2) గంటల కాలము) **ఆత్మధ్యానాసక్తుని యట్లు** నిశ్చలుడై యుండెను.

తత స్తే విస్మయాఽఽపన్నాః, యయుశ్చిన్తాం సభాసదః । 7 ।
బభూవాఽసౌ ప్రబుద్ధోఽథ, పర్యాకులమతి ర్నృపః ।
సమ్యక్ ప్రాప్తప్రబోధశ్చ, ప్రోవాచ మన్త్రిణ స్తదా । 8 ।

7-8. తరువాత, సభాసదులు ఆశ్చర్యపరవశులై, వ్యాకులితమనస్కులైరి. అపుడు రాజు, పర్యాకులచిత్తమున మేల్కొన్నాడు. పూర్తిగా జాగ్రదవస్థను పొంది, అతడు మంత్రులతో నిట్లు వచించెను.

రాజోవాచ :-

"ఇద మాశ్చర్య మాఖ్యానం, శృణుతాఽద్య సభాసదః ! ।
పిఞ్ఛికా మహమాలోక్య, జాల్మేన భ్రామితా మిమామ్ । 9 ।
అశ్వ మారూఢవానేన మాత్మనా భ్రాన్తమానసః ।
ప్రవృత్తో మృగయాం గన్తుం, దూరం నీతోఽస్మి వాజినా । 10 ।

9-10. రాజు :- "సభాసదులారా! ఇపుడు ఆశ్చర్యకరమైన ఈ వృత్తాంతము వినుడు. ఈ ధూర్తుడు త్రిప్పిన నెమిలిపురికుంచెను ఆలోకించి, భ్రాంత మనస్కుడనై, యీ అశ్వము నారోహించితిని. వేటకై వెడలుటకు ప్రవర్తించి, అశ్వముచే బహుదూరము కొనిపోబడితిని.

సంప్రాప్తోఽహ మపర్యన్త మరణ్యం శ్రాన్తవాహనః ।
అనూర్త్యాఽస్తం దినం తత్ర, ప్రక్రమ్య జాఙ్గలం గతః । 11 ।

11. అవధిలేని అరణ్యమును అలసిపోయిన గుఱ్ఱముతో చేరితిని. సూర్యాస్తమయము వఱకు, దినమంతయు పరిభ్రమించి, తుదకొక జాంగలప్రదేశమును (గ్రామీణప్రాంతమును) ప్రాపించితిని.

తత్ర జమ్బీరఖణ్డస్య, స్కన్దసంసర్గిణీం లతామ్ ।
ధృత్వా ప్రలమ్బమానం మాం, త్యక్త్వా యాతః తురఙ్గమః । 12 ।

12. అచట జంబీర(నిమ్మ) వృక్షశాఖ యొక్క భాగమును అల్లుకొని యున్న తీగను ఆలంబనము చేసికొని, వ్రేలాడుచున్న నన్ను విడిచి, ఆ గుఱ్ఱము వెళ్లిపోయినది.

**తత్ర కల్పసమా రాత్రిః, మోహమగ్నస్య మే గతా ।**
**అథాఽష్టభాగమాపన్నే, వ్యోమ్ని దివసనాయకే ॥ 13 ॥**
**దృష్ట్వా మయా ప్రభ్రమతా, బాలికౌదనధారిణీ ।**
**యాచితాఽపి మయా యత్నాత్, నాఽన్నం దత్తవతీ హ సా ॥ 14 ॥**

**13-14.** అచ్చట కల్పసమానమగు రాత్రి, భ్రాంతిమగ్నుడనైన నాకు గడచి పోయినది. దివసాధిపతి సూర్యుడు, ఆకాశమున అష్టమభాగమును చేరుకొన్న సమయమున, తీగను పట్టుకొని వ్రేలాడుచున్న నాకు, అన్నమును కొనిపోవుచున్న ఒక బాలిక కన్పించినది. నే నామెను ప్రయత్నపూర్వకముగ అన్నమును యాచించినను, అన్నము నామె యొసగలేదు.

**'విద్ధి మా మిహ చణ్డాలీం, మత్తో నాఽఽప్నోషి భోజనమ్ ।**
**దదామి భోజనం తుభ్యం, భర్తా భవసి చేన్మమ' ॥ 15 ॥**

**15.** 'నేను చండాలాంగన నని తెలిసికొనుము. నా నుండి నీకు భోజనము లభింపదు. నీవు నాకు భర్తవైనచో, నీకు భోజన మొసగగలను' - అని ఆమె యన్నది.

**అథోక్తా సా మయా 'భర్తా, భవామీ'తి తత స్తయా ।**
**దత్త మన్నం మయా భుక్తం, వర్ణజాతికులక్రమాః ॥ 16 ॥**
**కేనాఽఽపది విచార్యన్తే, మోహాఽపహృతచేతసా?।**
**బహునాఽత్ర కిముక్తేన?, స్వీకృతా సా మయా తతః ॥ 17 ॥**

**16-17.** 'నేను నీకు భర్త నగుదు' నని యన్న తరువాత, ఆమె నాకొసగిన అన్నమును, భుజించితిని. ఆపదలందు మోహాపహృతచిత్తులగు వారెవ్వరు వర్ణజాతికులక్రమముల విచారింతురు? ఈ విషయమై అధికవివరణము వలని ప్రయోజనమేమి? తరువాత, ఆమెను నా భార్యగా స్వీకరించితిని.

**క్రమాద్గర్భవతీ భూత్వా, ప్రసూతా కన్యకాద్వయమ్ ।**
**తథా పుత్రద్వయం చైవ, జాతోఽహం పుష్టపుల్కసః ॥ 18 ॥**

**18.** క్రమముగ నామె గర్భవతియై, ఇరువురు పుత్రికలను, ఇరువురు పుత్రకులను

కన్నది. నేనిట్లు సంపూర్ణ పుల్కసుడ (చండాలుడ)నైతిని.

**చణ్డాలత్వే స్థిరీభూతే, భూపత్వం మమ విస్మృతమ్ ।**
**ఏవం తత్ర మయా నీతాః, షష్టిః కల్పసమాః సమాః ॥ 19 ॥**

19. చండాలత్వ మిట్లు స్థిరపడగా, నా నృపత్వము విస్మరింపబడినది. కల్ప సదృశములైన అఱువది (60) సంవత్సరము లిట్లు నేను గడపితిని.

**ఏవం మయి స్థితే తత్ర, నవశ్వశుర మన్దిరే ।**
**ఆసీత్ తత్రాఽథ దుర్భిక్షం, గతాః సర్వే సుహృజ్జనాః । 20 ॥**

20. నూతనశ్వశుర (మామ) మందిరమున, ఇట్లు నేనుండగా, గొప్ప దుర్భిక్షము (కఱవు) తటస్థించినది. సుహృజ్జనులు (మాతోడివారు) అందఱును, (కుటుంబములతో, దేశాంతరమునకు) వెళ్లిపోయినారు.

**అహం దుఃఖా దపత్యై స్తు, తయా చ సహితః శనైః ।**
**కృచ్ఛ్రాత్ దేశాద్వినిర్గత్య, విశ్రాన్తోఽస్మి తరోస్త లే ॥ 21 ॥**

21. నేనును, దుఃఖమున బిడ్డలతో, భార్యతో, కూడి, నెమ్మదిగా, అత్యంత కష్టముతో, దేశము విడిచి వెళ్లి, ఒక వృక్షము క్రింద విశ్రమించితిని.

**కనీయాన్ బాలకో మాం చ, '<u>మాంసం దేహి</u>' త్యయాచత ।**
**దుఃఖం సోఢు మశక్తోఽహం, మరణే కృతనిశ్చయః ॥ 22 ॥**
**తత్ర కాష్ఠాని సంచిత్య, చితాయాం పతితోఽస్మ్యహమ్ ।**
**చలితోఽస్మి జవాత్ తావత్, ప్రబుద్ధోఽహ మిహ స్థితః ॥ 23 ॥**

22-23 'మాంసమిమ్మ'ని చిన్న కొడుకు నన్ను యాచించినాడు. దుఃఖము నోర్చుకొనుటకు అశక్తుడనై మరణించుటకు నిశ్చయించుకొంటిని. అచ్చట కట్టెలు సేకరించి, చితిపేర్చి, అందుపడితిని. ఇప్పుడే వేగముగ విచలితుడనై, మేల్కొని, ఇచ్చట నుంటిని.

**ఏవం శామ్బరికేణాఽయం, మోహ ఉత్పాదితో మమ ।"**
**ఇత్యుక్తవతి రాజేన్ద్రే, మాయావీ స తిరోదధే ॥ 24 ॥**

24 ఇంద్రజాలికునిచే ఇట్లు నాకు మోహము (భ్రమ) కల్గినది." రాజిట్లు అనుచుండగా, ఆ ఇంద్రజాలికుడు తిరోహితుడైనాడు.

అథేదమూచు స్తే సభ్యాః, విస్మయోత్ఫుల్లలోచనాః ।
"నాఽయం శాంబరికో దేవ! యస్య నాఽస్తి ధనేషణా । 25 ।
దైవీ కాచన మా యేయం, సంసారస్థితి బోధినీ ।"

25-26 విస్మయముతో విప్పారిన కన్నులతో, సభ్యులు - "దేవా! ధనాశలేని అతడు ఇంద్రజాలికుడు కాడు. ఇది సంసారస్థితిని బోధించు నొకానొక దైవీమాయ" అని రాజుతో నన్నారు.

## 2. సంసారవిభ్రమః – జగద స్థిత్వభ్రాంతి

వసిష్ఠ ఉవాచ - వసిష్ఠు డిట్లు చెప్పెను.
చణ్డాలత్వం హి లవణో, ప్రతిభాసవశాద్యథా । 26 ।
తథేదం జగదాఽఽభోగి, మనోమననమాత్రకమ్ ।
సంయమాత్ మనసః శాన్తి, మేతి సంసారవిభ్రమః । 27 ।

26-27. వసిష్ఠుడు :- లవణుని చండాలత్వము ప్రతిభాస (మాయ) వలన కల్గినట్లే, ఈ జగద్భ్రమ (సంసారానుభవము)సైతము, మనఃసంకల్ప కల్పనల వలననే కల్గుచున్నది. మనఃసంయమము వలన, సంసార భ్రాంతి ఉపశమించుచున్నది.

స్వపౌరుషైకసాధ్యేన, స్వేప్సితత్యాగ రూపిణా ।
మనః ప్రశమమాత్రేణ, వినా నాఽస్తి శుభా గతిః । 28 ।

28. ఇష్టవస్తు(అభిమతసుఖ) పరిత్యాగ రూపమైన స్వప్రయత్నము(పౌరుషము) వలననే, మనస్సు ఉపశమించుచున్నది. మనః ప్రశాంతికి (నివృత్తికి) వేఱుగా శుభమైన గతి – (మార్గము) – ఇతర మేదియు లేదు.

అసఙ్కల్పన శస్త్రేణ, ఛిన్నం చిత్తం గతం యదా ।
సర్వం సర్వగతం శాన్తం, బ్రహ్మ సంపద్యతే తదా । 29 ।

29. సంకల్పాఽభావమనెడి(నిరీహత్వమనెడి)శస్త్రముచే చిత్తము సమూలముగ ఛేదింపబడినపుడు, సర్వము, సర్వవ్యాపకము, పరమ శాంతాత్మకమునైన బ్రహ్మము ప్రాప్తించుచున్నది.

అయం సోఽహ మిదం తన్మే, ఏతావన్మాత్రకం మనః ।★
పరం పౌరుష మాశ్రిత్య, నీత్వా చిత్త మచిత్తతామ్ । 30 ।

★ ఇట్టి వృత్తుల రూపమే చిత్తము; వృత్తులే చిత్తము.

తామ్మహాపదవీ మేహి, యత్ర నాశో న విద్యతే ।

30-31. 'అతడిది', 'ఇది నేను', 'ఇది నాది' – మనస్సు అనునది కేవల మింత మాత్రమే. (ఈ దృశ్యమానము, పిత్రోత్పాదితమైన దేహము, నేను, దేహసంబంధిగృహక్షేత్రాదులు, ముందు పిత్రార్జితమైన సంపద, యంతయు నాది- అను అహంతా, మమతారూపమే మనస్సు -యోవా.తా.ప్ర.-) ఉత్తమమైన పౌరుషమును,(స్వప్రయత్నమును) ఆశ్రయించి, చిత్తమును సంకల్పవర్జన మొనరించి, నాశరహితమైన ఆ మహా పదవిని పొందుము.

న హి చఞ్చలతాహీనం, మనః క్వచన దృశ్యతే । 31 ।
చఞ్చలత్వం మనోధర్మో, వహ్నే ర్ధర్మో యథోష్మతా ।

31-32. ఎచ్చటను చంచలత్వరహితముగ మనస్సు కనిపింపదు. అగ్నికి ఉష్ణత్వము స్వభావమైనట్లు, చంచలత్వము మనోధర్మము –(మనస్సు యొక్క స్వభావము).

విబోధైక[1]ఽను సన్ధానాత్, చిదంశాఽఽత్మతయా మనః । 32 ।
చిదేకతా ముపాఽఽయాతి,[2] దృఢాఽభ్యాసవశాదిహ ।

32-33. మనస్సు చైతన్యాంశస్వభావమే యగుటచే, ముఖ్యముగ వివేకాను సంధానము వలనను, దృఢాభ్యాసము వలనను, అఖండచైతన్యముతో నేకత్వము నిచ్చట పొందుచున్నది.

అతః పౌరుష మాశ్రిత్య, చిత్త మాక్రమ్య చేతసా । 33 ।
విశోకం పద మాలమ్బ్య, నిరాతఙ్కః స్థిరో భవ ।[3]

(1) వివేకైకా (పా.భే)
(2) "తదా వివేకనిమ్నం కైవల్య ప్రాగ్భారం చిత్తమ్ ।" (పాతఞ్జల యోగదర్శనము–VI-25)
అజ్ఞాననిమ్నమై (అభిముఖమై) బహిర్ముఖము, విషయభోగఫలమునువై యున్న మనస్సు (చిత్తము), వివేకజజ్ఞాననిమ్నము, అంతర్ముఖమువై, కైవల్యఫలమును, పొందుచున్నది. కైవల్యావధియే ఫలము గలదిగా నగుచున్నది.
(3) పోల్చు :- ఉద్ధరే దాత్మనాఽఽత్మానం – ఇత్యాది భ.గీ. VI-5-7
"అత్తా హి అత్తనో నాథో, అత్తా హి అత్తనో గతి ।
తస్మా సంయమయ త్తానం, అస్సం భద్రం వ వాణిజో" ।.(ధమ్మపదం – 380)
తనకు తానే ప్రభువు; తనకు తానే గతి, కాన వణిజుడు భద్రాశ్వము (ఉత్తమ జాతి గుఱ్ఱము)ను వశపఱచుకొనునట్లు, నీవు నీ యాత్మను నిగ్రహించుకొనుము (వశీకరించుకొనుము).
"ఉద్ధరే దాత్మనాఽఽత్మానం, మగ్నం సంసారవారిధౌ ।
యోగారూఢత్వ మాపాద్య, సమ్యగ్దర్శననిష్ఠయా ।" (శంకరుడు – వివేకచూడామణి – 9)
చిత్త వృత్తులను నిగ్రహించుటయే యోగమని యోగదర్శనము చెప్పుచున్నది.
"యోగశ్చిత్తవృత్తి నిరోధః" । (పాతఞ్జల యోగదర్శనము I-1)

మన ఏవ సమర్థం హి, మనసో దృఢ నిగ్రహే ॥ 34 ॥

**33-34.** కాన, పౌరుషము నాశ్రయించి, సంకల్పాత్మకమైన చిత్తమును, చిత్తము చేతనే ఆక్రమించి, శోకరహితమైన బ్రహ్మపదమును ఆలంబన మొనరించుకొని, సంతాప, - (భయ) - రహితుడవై స్థిరుడ వగుము. మనస్సును దృఢముగ నిగ్రహించుటకు, మనస్సే సమర్థము.

భోగౌఘవాసనాం త్యక్త్వా, నిర్వికల్పః సుఖీ భవ! ।
ఏష ఏవ మనోనాశ, స్త్వవిద్యానాశ ఉచ్యతే ॥ 35 ॥

**35.** అనేకభోగసముదాయము యొక్క వాసనను, (సంస్కారమును), త్యజించి, నిర్వికల్పుడవై - (జ్ఞాతృజ్ఞేయరహితుడవై) సుఖమొందుము. ఈ మనోనాశమే, అవిద్యానాశ మనబడును.

ఇచ్ఛామాత్ర మవిద్యేయం, తన్నాశో మోక్ష ఉచ్యతే ।
స చాఽసఙ్కల్ప మాత్రేణ, సిద్ధో భవతి నాఽన్యథా ॥ 36 ॥

**36.** మానసిక సంకల్పమే అవిద్య; దాని నశింపజేయుటే, మోక్షమనబడును. సంకల్పరాహిత్యము చేతనే, ఇది సిద్ధించును కాని, ఇతరముచేత సిద్ధింపదు.

నాఽహం బ్రహ్మేతి సఙ్కల్పాత్, సుదృఢాత్ బధ్యతే మనః ।
సర్వం బ్రహ్మేతి సఙ్కల్పాత్, సుదృఢాత్ ముచ్యతే మనః ॥ 37 ॥

**37.** 'నేను బ్రహ్మమును కాన'ను దృఢసంకల్పమువలన, మనస్సు బంధింప బడుచున్నది. 'సర్వము బ్రహ్మమ'ను దృఢసంకల్పము వలన మనస్సు విముక్తమగుచున్నది.

'కృశోఽతి దుఃఖీ, బద్ధోఽహం, హస్తపాదాదిమా నహమ్' ।
ఇతి భావాఽనురూపేణ, వ్యవహారేణ బధ్యతే ॥ 38 ॥

**38.** 'నేను కృశుడను, అత్యంత దుఃఖిని, బద్ధుడను, హస్తపాదాది అవయవ యుక్తుడను' - ఇట్టి భావముల ననుసరించి వ్యవహరించుటచే, మనుజుడు బద్ధ డగుచున్నాడు.

**'నాఽహం దుఃఖీ న మే దేహో, దేహాదన్యః పరోఽస్మ్యహమ్' ।**
**ఇతి నిశ్చయవానన్తః, క్షీణాఽవిద్యో విముచ్యతే ॥ 39 ॥**

**39.** 'నేను దుఃఖిని కాను. నాకు దేహోపాధి లేదు. దేహమున కంటె భిన్నుడగు పరమాత్మను నేను.' – అంతరంగమున నిట్టి దృఢనిశ్చయము కలవాడు, అవిద్య (అజ్ఞానము) క్షీణించినవాడు, విముక్తుడగును.

**అహో! ను చిత్రం యత్సత్యం, బ్రహ్మ తద్విస్మృతం నృణామ్ ।**
**యదసత్య మవిద్యాఖ్యం, తన్నూనం స్మృతి మాగతమ్ ॥ 40 ॥**

**40.** అహో! సత్యమగు బ్రహ్మమును, నరులు విస్మరించుట విచిత్రము కదా! అవిద్య యనబడు **అసత్యమే వాస్తవముగ నరుల స్మృతి యందు ప్రవేశించినది.**

**శ్రీరామ ఉవాచ :–**

**'లవణోఽపి మహాభాగః, ప్రాప్తవాన్ కథ మాపదమ్' ?**

**41.** **శ్రీరాముడు :–** 'మహాత్ముడైన లవణు డెట్లీ ఆపదను పొందెను?'

**వసిష్ఠ ఉవాచ :–**

**ఏకాన్తే చోపవిష్టేన, లవణేన విచిన్తితమ్ ॥ 41 ॥**
**'పితామహో హరిశ్చన్ద్రో, రాజసూయస్య* యాజకః ।**
**అహం తస్య కులే జాతః, తం యజే మనసా మఖమ్' ॥ 42 ॥**

**41-42.** **వసిష్ఠుడు :–** ఏకాంతమున నాసీనుడై లవణుడిట్లు తలపోసెను. 'మా తాత, హరిశ్చంద్రుడు, వేదోక్తరాజసూయమునకు యాజకుడు. (రాజసూయయజ్ఞమును ఆచరించినవాడు). నే నతని వంశమున జన్మించితిని. మానసికముగ నేనా యాగము నాచరింతును.'

**ఇతి సంచిన్త్య మనసా, దీక్షాం చ ప్రవివేశ సః ।**
**ఆహూయ ఋత్విజో దేవాన్, ప్రజ్వాల్యాఽథ చ పావకమ్ ॥ 43 ॥**

---

* **రాజా వై రాజసూయేనేష్ట్వా భవతి ।** (శతపథ బ్రాహ్మణము)
రాజసూయము, సార్వభౌముడైన చక్రవర్తి ఆచరించు మహాయజ్ఞము. సామంతరాజు లందఱు నిర్వివాద విధేయతకు గుర్తుగా, చక్రవర్తి పట్టాభిషేకమున పాల్గొందురు.

**హుత్వా చ ద్విజపూర్వేభ్యో, దత్త్వా సర్వస్వదక్షిణామ్ ।**
**వ్యబుధ్యత దినస్యాఽన్తే, స్వ ఏవోపవనే నృపః[1] । 44॥**

**43-44.** మానసికముగ నిట్లు చింతించి, ఆ రాజు, దీక్షయందు ప్రవేశించెను; ఋత్విజులను, దేవతలను ఆహ్వానించి, యాగాగ్నిని ప్రజ్వలింపజేసి. హోమ మాచరించి, బ్రాహ్మణాదులకు తన సర్వస్వమును దక్షిణగానొసగి, దినాంతమున, -(సూర్యోదయమునకు పూర్వమున) - తన ఉపవనమున రాజు, మేల్కొన్నాడు.

**రాజసూయస్య కర్తారః, దుఃఖం యత్రాప్నువన్తి హి ।**
**తస్య దుఃఖస్య భోగాయ, శక్రేణ గగనాత్తదా । 45 ।**

**ప్రహితో దేవదూతో హి, రామ! శామ్బరికాఽఽకృతిః ।**
**మనః కర్తృ ఫలం భుఙ్క్తే, తదేవ న శరీరకమ్ । 46 ।**

**45-46.** శ్రీరామా! రాజసూయయాగకర్తలు ప్రాపించు దుఃఖమును రాజుచే ననుభవింప జేయుటకు, శక్రుడు (దేవరాజగు ఇంద్రుడు) స్వర్గమున నుండి దేవదూతను ఇంద్రజాలికరూపమున పంపినాడు. **కర్తృత్వము వహించిన మనస్సే, తత్ఫలము ననుభవించునుకాని, శరీరముకాదు.**

## 3. అజ్ఞానభూమికాః - అజ్ఞానభూమికాసప్తకము

**స్వరూపాఽవస్థితిర్ముక్తిః,[2] తద్భ్రంశోఽహంత్వవేదనమ్ ।**
**ఏతత్ సంక్షేపతః ప్రోక్తం, యత్ జ్ఞత్వాఽజ్ఞత్వలక్షణమ్ । 47 ।**

(1) ఈ శ్లోకములు తన యాజ్ఞికవిధుల యందలి భాగముగ రాజు అనుష్ఠించిన నియమములను వర్ణించుచున్నవి.
(2) పోల్చు :- యోగ శ్చిత్తవృత్తి నిరోధః ।
తదా ద్రష్టుః స్వరూపేఽవ స్థానమ్ ।
వృత్తి సారూప్య మితరత్ర । (యోగదర్శనము I-3-4)
చిత్తవృత్తుల నిరోధమే, యోగము. అవి నిరోధింపబడగా, ద్రష్టయగు ఆత్మకు స్వస్వరూపావస్థితి సిద్ధించును. వ్యవహారదశలో ఆత్మ, వృత్తులతో తాదాత్మ్యమును పొందుచున్నది. అహంత, మమత - ఇవి చిత్తవృత్తులే.
"వృత్తి హీనం మనఃకృత్వా, క్షేత్రజ్ఞం పరమాత్మని ।
ఏకీకృత్య విముచ్యేత యోగోఽయం ముఖ్య ఉచ్యతే" ।
మనస్సును వృత్తి రహితమొనర్చి, క్షేత్రజ్ఞుని (జీవుని) పరమాత్మతో ఐక్యపఱచి, విముక్తి నొందవలెను. ఇదియే ముఖ్యమగు యోగమని చెప్పబడినది.

47. స్వస్వరూపమున అవస్థితి - (నిలుకడయే) - ముక్తి. ఆ స్థితి నుండి జాఱిపడుటయే అహంతా (వృత్తి) భావవేదనమునకు (ఎఱుకకు) లక్షణము. జ్ఞానాఽజ్ఞానముల లక్షణ మిట్లు సంక్షేపముగ చెప్పబడినది.

**అజ్ఞానభూమయః సప్త, సప్త చ జ్ఞానభూమయః ।**
**బీజజాగ్రత్, తథా జాగ్రత్, మహాజాగ్రత్, తథైవ చ । 48 ।**

**జాగ్రత్స్వప్న, స్తథా స్వప్నః, స్వప్నజాగ్రత్, సుషుప్తకమ్ ।**
**ఇతి సప్తవిధో మోహః, శృణు తస్య చ లక్షణమ్ । 49 ।**

48-49. అజ్ఞాన భూమికలు ఏడు (7). జ్ఞానభూమికలును ఏడే (7). అవి, (1) బీజ జాగ్రత్తు (2) జాగ్రత్తు, (3) మహా జాగ్రత్తు, (4) జాగ్రత్స్వప్నము, (5) స్వప్నము, (6) స్వప్నజాగ్రత్తు (7) సుషుప్తి - **ఈ ఏడును మోహావస్థలు.** ఈ మోహలక్షణమును వినుము.

**అనాఖ్యం చేతనం యత్ స్యాత్, తస్యాఽవస్థా హి నూతనా ।**
**భవిష్యచ్చిత్త జీవాఽఽది, నామ శబ్దార్థ భాజనమ్ । 50 ।**

50. **చేతనము, (చిదాభాస సంవలిత రూపము) నామరహితము.** దానికి అవస్థ అనునది క్రొత్తది. (అనగా గతము దానికి లేదు) ప్రాణధారణాది క్రియోపాధి వశమున నది, భవిష్యచ్చిత్తజీవాది నామశబ్దములకును, తదర్థములకును, పాత్రమగుచున్నది.

**బీజరూపం స్థితం జాగ్రత్, బీజజాగ్ర త్తదుచ్యతే ।**
**పరాత్ జాతస్య జీవస్య, త్వయం చాఽహ మిదం మమ । 51 ।**
**ఇతి యః ప్రత్యయః స్వచ్ఛః, తత్ జాగ్రత్ ప్రాగభావనాత్ ।**

51-52. బీజరూపమున నున్న జాగ్రదవస్థ [ఇందు జ్ఞానము (ఎఱుక) ఆరంభ దశలో నుండును. ఇది జ్ఞప్తికి నూతనావస్థ.] **బీజజాగ్రత్తు** అనబడును. పరమాత్మ నుండి జనించిన జీవునకు, **ఇది నేను, ఇది నాది -అను అహంతా మమతల రూపమున విశదమైన ప్రత్యయము** - జ్ఞానమే - (ఎఱుకయే) **జాగ్రత్తు.** ఈ ప్రత్యయము - (అహంతామమతలు), జాగ్రత్తునకు, ముందు అభావము (లేనివి).

**అయం సోఽహ మిదం తన్మే, ఇతి జన్మాన్తరోదితః । 52 ।**
**పీవరః ప్రత్యయః ప్రోక్తో, మహాజాగ్ర దితి స్ఫుటమ్ ।**

**52-53.** ఈ దృశ్యమానము, పిత్రోత్పాదితమైన దేహము 'నేను' దేహసంబంధి గృహక్షేత్రాదులు, ముందు పిత్రార్జితమైన సంపదయంతయు, 'నాది' - అను జన్మాంతరమున పుట్టినది యైన దృఢప్రత్యయము, - (నిశ్చయము) స్ఫుటముగ మహాజాగ్రత్త న బడుచున్నది.

**అరూఢ మథవా రూఢం,★ సర్వథా తన్మయాత్మకమ్ । 53 ।**
**యత్ జాగ్రతో మనోరాజ్యం, జాగ్రత్స్వప్నః స ఉచ్యతే ।**

**53-54.** దాని నుండి వృద్ధి చెందకున్నను, లేక, వృద్ధి చెందినను, సర్వ విధముల తన్మయాత్మకమైన జాగ్రదవస్థ యందలి మనోరాజ్యము, (ఆకాశసౌధ కల్పన)-, జాగ్రత్స్వప్న మనబడుచున్నది.

**ద్విచంద్ర-శుక్తికారూప్య, మృగతృష్ణాది భేదతః । 54 ।**
**అభ్యాసాత్ప్రాప్య జాగ్రత్త్వం స్వప్నోఽనేకవిధో భవేత్ ।**

**54-55.** ఆకాశమున ఇరువురు చంద్రులు భాసించుట, ముత్యపు చిప్పను వెండి అని యనుకొనుట, ఎండమావులను జల మనుకొనుట, - ఇత్యాది భేదముచే అభ్యాసము వలన జాగ్రద్భావమును పొందిన స్వప్నము (జాగ్రత్స్వప్నము), పెక్కు గతులగుచున్నది. (ఎండమావులు మొదలగు భ్రాంతులీ జాగ్రత్స్వప్న భేదములే).

**అల్పకాలం మయా దృష్ట మేతన్నో వేతి యత్ర హి । 55 ।**
**పరామర్శః ప్రబుద్ధస్య, స స్వప్న ఇతి కథ్యతే**

**55-56.** నిద్రించి యున్నపుడనుభవమైన అర్థము నందు, మేల్కొన్న తరువాత, ఇది నేను స్వల్పకాలమున గాంచినది, సత్యమా? కాదా? అను పరామర్శ (స్మరణము) స్వప్నమనబడుచున్నది.

**చిరసందర్శనాఽభావాత్, అవిస్ఫుటబృహద్వపుః । 56 ।**
**చిరకాలాఽను వృత్తశ్చ, స్వప్నో జాగ్రదివోదితః ।**
**స్వప్న జాగ్రదితి ప్రోక్తో, జాగ్రత్యపి పరిస్ఫురన్ । 57 ।**

**56-57.** చిరకాలము కాంచ నందున, అవిస్పష్టమైన వ్యాపకస్వభావము కల్గియు,

---

★ అరూఢమ్ - అనభ్యాసాపేలవం, రూఢ మభ్యాసదృఢమ్ । (యో.వా.తా.ప్ర.)

చిరకాలము (స్మృతియందు) కొనసాగుచు, జాగ్రదవస్థ యందును, మనస్సున స్ఫురించుచు, జాగ్రదవస్థ వలెనే ఉదయించు స్వప్నము. స్వప్నజాగ్రత్తని యనబడుచున్నది. (స్వప్నమందలి జాగ్రత్తు లవణభూపతి కొకక్షణము, చాల సంవత్సరములుగ దోచినట్లు, మహా జాగ్రద్భావమును పొందిన - స్వప్నము)

**షడవస్థా పరిత్యాగే, జడా జీవస్య యా స్థితిః ।**
**భవిష్య ద్దుఃఖబోధాఢ్యా, సౌషుప్తీ[1] సోచ్యతే గతిః । 58 ।**

58. **ఈ ఆఱు అవస్థలును, పరిత్యక్తము కాగా,** ఆపైని జీవుని (చేతనుని) జడస్థితి, భావిదుఃఖబీజజ్ఞాన భూయిష్ఠమై నది, **సుషుప్తి** (గాఢనిద్ర) యని అనబడుచున్నది. [అనగా, మేల్కొన్న తరువాత, భవిష్యద్దుఃఖమును జీవుడు గాంచుచున్నాడని భావము].

**జగత్ తస్యా మవస్థాయా, మన్ధే తమసి లీయతే ।**
**సప్తాఽవస్థా ఇతి ప్రోక్తా, మయాఽజ్ఞానస్య[2] రాఘవ ! । 59 ।**
**ఏకైకా శతశాఖాఽత్ర, నానావిభవరూపిణీ ।**

59-60. ఈ సుషుప్తి (గాఢనిద్ర) యందు, జగము అంధతమస్సున లయ మగుచున్నది. శ్రీరామా! ఇట్లు అజ్ఞానము యొక్క ఏడవస్థలు (భూమికలు) నాచే చెప్పబడినవి. ఇందు ప్రతిభూమికయు, **శతశాఖా సమన్వితమై యున్నది.** [వీని యందొక్కొక్కటియు వందల కొలది భేదములు కల్గి యున్నది] అనేక విలాసముల - (శక్తుల) -తో కూడి యున్నది.

## 4. జ్ఞానభూమికాః - జ్ఞానభూమికా సప్తకము

**జ్ఞానస్య భూమికానాం త్వ మద్య నిర్వచనం శృణు । 60 ।**

---

(1) "సుషుప్త్యాఖ్యం తమోఽజ్ఞానం, బీజం స్వప్నప్రబోధయోః ।
స్వాత్మబోధప్రదగ్ధం స్యాద్బీజం దగ్ధం యథాఽభవమ్ ।" (శంకరుడు-ఉపదేశసాహస్రి-XVII-26) సుషుప్తి, తమస్సు, అజ్ఞానము - అను నిదియే స్వప్న జాగ్రదవస్థలకు బీజము. వేచిన బీజము (విత్తనము), మరల అంకురించనట్లు, ఆత్మ జ్ఞానాగ్నిచే నిది (సుషుప్తి) దగ్ధమై, మరల పొటమరించదు.

(2) అజ్ఞాన భూమికలు, యోగవాసిష్ఠమున తప్ప, మఱియే ఇతర మోక్షశాస్త్రములందున ప్రోక్తములు (ఉపదిష్టములు) కాలేదనుట గమనార్హము.

60. శ్రీరామా! నీ విప్పుడు జ్ఞానభూమికాసప్తకము యొక్క నిర్వచనము నాలకింపుము.

**కిం మూఢ ఇవ తిష్ఠామి, ప్రేక్ష్యేఽహం శాస్త్ర సజ్జనైః ।**
**వైరాగ్యపూర్వ మిచ్ఛేతి, 'శుభేచ్ఛే'త్యుచ్యతే బుధైః ॥ 61 ॥**

61. 'నేనేల మూఢుని వలె పడియున్నాను? వేదాంతశాస్త్ర సజ్జన సంపర్కముచే, తత్త్వమును విచారింతును గాక' అని వైరాగ్యపూర్వకమైన ఇట్టి మంచి అభిలాష - (ఆకాంక్ష), 'శుభేచ్ఛ' యను ప్రథమ (మొదటి) భూమిక యని బుధులు వచింతురు.

**శాస్త్ర సజ్జన సంపర్క వైరాగ్యాఽభ్యాస పూర్వకమ్ ।**
**సదాచార ప్రవృత్తి ర్యా, ప్రోచ్యతే సా 'విచారణా' ॥ 62 ॥**

62. మోక్ష(వేదాంత)శాస్త్ర, సజ్జనసహవాస, వైరాగ్యాఽభ్యాసపూర్వకముగ, సదాచారమున ప్రవృత్తి గల్గుటయే 'విచారణ' యను ద్వితీయ (రెండవ) భూమిక.

**విచారణాశుభేచ్ఛాభ్యా, మిన్ద్రియార్థేష్వసక్తతా ।**
**యాఽత్ర సా తనుతా భావాత్, ప్రోచ్యతే 'తనుమానసా' ॥ 63 ॥**

63. విచారణా శుభేచ్ఛల చేత, ఇంద్రియార్థముల -(శబ్దాది బహిర్విషయముల) - యందు, మనస్సున కాసక్తి లేకుండుటయే (సవికల్ప సమాధియే) 'తనుమానస' యను తృతీయ (మూడవ) భూమిక. (అనగా, మనస్సు సూక్ష్మతమమై, ఇంద్రియార్థాసక్తి క్రమముగ క్షీణించుట తనుమానస యని భావము)

**భూమికాత్రితయాఽభ్యాసాత్, చిత్తేఽర్థవిరతే ర్వశాత్ ।**
**సత్యాత్మని స్థితిః శుద్ధే, 'సత్త్వాపత్తి'రుదాహృతా ॥ 64 ॥**

64. పై మూడు భూమికల నభ్యసించుట వలన, శుద్ధమగు చిత్తమున, బాహ్య విషయ సంస్కార ముచ్ఛేదమై ఆత్యంతికమైన విరతి - (వైరాగ్యము) స్థిరమగుట వలన, సర్వాధిష్ఠాన సన్మాత్రరూప సత్యమగు పరమాత్మ యందలి స్థితి -(నిలుకడ), 'సత్త్వాపత్తి' యను చతుర్థ (నాల్గవ) భూమిక. (ఇదియే నిర్వికల్పసమాధి రూపమని భావము)

**దశా చతుష్టయాఽభ్యాసా దసంసర్గఫలేన చ ।**
**రూఢసత్త్వచమత్కారా, ప్రోక్తాఽసంసక్తి'నామికా ॥ 65 ॥**

65 ఈ నాల్గు భూమికల నభ్యసించుట వలన కల్గిన బాహ్యాఽభ్యంతర విషయసంస్కారసంగరాహిత్యము చేత, సమాధి పరిపాక ఫలము చేతను, చిత్తమున, రూఢమైన శుద్ధసత్త్వ (బ్రహ్మాత్మభావ) నిరతిశయానంద సాక్షాత్కార లక్షణమైన చమత్కారము **'అసంసక్తి'** యను పంచమ (ఐదవ) భూమిక.

**భూమికా పఞ్చకాఽభ్యాసాత్, స్వాత్మాఽఽరామతయా దృఢమ్ ।**
**అభ్యన్తరాణాం బాహ్యానాం, పదార్థానా మభావనాత్ ॥ 66 ॥**

**చిరం పరప్రయుక్తేన, ప్రయత్నేనాఽవబోధనమ్ ।**
**'పదార్థాఽభావనా' నామ, షష్ఠీ సంజాయతే గతిః ॥ 67 ॥**

66-67. పైన పేర్కొన్న ఐదుభూమికల నభ్యసించుట వలన సిద్ధించిన దృఢమైన స్వాత్మాఽఽరామత్వము (ఆత్మయందానందించుట) చేత, **బాహ్యాభ్యంతరములగు అన్యపదార్థముల గూర్చిన భావన, అభావమగుట** వలన, చిరకాలము పరతత్త్వము లక్ష్యముగా గల ప్రయత్నముచే నుదయించిన అవబోధనము – (జ్ఞానోపలబ్ధి) వలనను, 'పదార్థాఽభావన' అనబడు **షష్ఠ (ఆఱవ) భూమిక** సిద్ధించుచున్నది.

[వ్యాఖ్య :– 67వ శ్లోకము యొక్క ప్రథమపాదమునకు 'చిరకాలము ఇతరుల ప్రయత్నము వలన మాత్రమే బాహ్యపదార్థజ్ఞానము కల్గుచుండుట వలనను 'పదార్థాఽభావన' ... సిద్ధించుచున్నది' – అని సాంప్రదాయిక వివరణము]

**భూమిషట్కచిరాఽభ్యాసాత్, భేదస్యాఽనుపలమ్భతః ।**
**యత్ స్వభావైక నిష్ఠత్వం, సా జ్ఞేయా 'తుర్యగా గతిః'★ ॥ 68 ॥**

68 ఈ ఆఱుభూమికలను చిరకాలమభ్యసించుటవలన, మనస్సున భేద

★ ఏకాత్మప్రత్యయసారం, ప్రపఞ్చోపశమనం,
శాన్తం, శివ, మద్వైతం చతుర్థం మన్యన్తే । (మాండూక్యోపనిషత్ –7)
తురీయాఽవస్థ, జాగ్రదాది అవస్థాత్రయ
నిర్ముక్తము. ఇది శివము, అద్వైతమునని శ్రుతి వర్ణించును.

"జాగ్రత్స్వప్న సుషుప్తైస్తు, వ్యాప్తం సర్వమిదం జగత్ ।
తుర్యాఽవస్థాం బ్రహ్మవిదో జానన్తి న చ పామరాః ।
(శారదాచతుశ్శతీస్తవము - IV - 57)
సకల జగత్తును, జాగ్రత్స్వప్న సుషుప్తులతో వ్యాప్తము. తుర్యావస్థను బ్రహ్మవేత్త లెఱుగుదురు. అది వారి అనుభవమున నున్నది. దానిని పామరులు ఎఱుగనేరరు.

రహితజ్ఞానము (తనకు అన్యమగు అర్థము లేని దెఱిగి) తత్త్వభావైక (స్వరూప భావ)నిష్ఠతో నుండుట సప్తమ (ఏడవ) జ్ఞానభూమిక 'తుర్యగ' యనబడుచున్నది. (జాగ్రత్ స్వప్న సుషుప్తి అవస్థలకు అతీతమైన దీ తురీయాఽవస్థ. ఇందు జ్ఞాతృజ్ఞేయములకు భేదము శూన్యము).

**యే హి రామ! మహాభాగాః, సప్తమీం భూమికాం గతాః ।**
**ఆత్మాఽఽరామా మహాత్మానః, తే మహత్పద మాగతాః ॥ 69 ॥**

69. శ్రీరామా! ఈ సప్తమ భూమికను పొందిన పుణ్యాత్ములే ఆత్మారాములు, మహాత్ములు, నని అనబడుదురు. వీరు, మహత్పదమును (నిరతిశయానంద స్వరూపబ్రహ్మపదమును) పొందినవారు.

**జీవన్ముక్తేషు చైషా హి, తుర్యాఽవస్థేహ విద్యతే ।**
**విదేహముక్తివిషయః, తుర్యాఽతీత మతః పరమ్ ॥ 70 ॥**

70 ఇచ్చట, జీవన్ముక్తులైన వారి యందీ తుర్యావస్థ మాత్రమే నిలిచి యుండును. తుర్యాతీతమైన తరువాతి అవస్థ, విదేహముక్తికి సంబంధించినది.

**భూమికాసప్తకం చైతత్, ధీమతా మేవ గోచరః ।**

71. ఈ ఏడు (7) జ్ఞాన భూమికలు ధీమంతులకు మాత్రమే. గోచరములు (సుగమ్యములు).

## 5. అవిద్యా మాహాత్మ్యమ్ –
అవిద్య (ఆధ్యాత్మికాంధ్యము) యొక్క ప్రభావము-శక్తి.

**ఏతత్తే కథితం రామ! జ్ఞానం వై సాప్తభౌమికమ్ ॥ 71 ॥**
**త్వం మాహాత్మ్య మవిద్యాయాః, పునః శృణు రఘూద్వహ ! ।**

71-72. రఘువంశోద్భవుడవైన శ్రీరామా! సప్తభూమికాయుక్తమైన ఈ జ్ఞానము, నీకు చెప్పబడినది. అవిద్య,లేక,ఆధ్యాత్మికాంధ్యము యొక్క మాహాత్మ్యమును (శక్తిని) మరల నాలకింపుము.

**లవణోఽసౌ మహీపాలః, తత్ర దృష్ట్వా తథా భ్రమమ్ ॥ 72 ॥**
**ద్వితీయే దివసే గన్తుం, ప్రవృత్త స్తాం మహాఽటవీమ్ ।**
**స తత్ర విహరన్ తాంస్తు, స్వవృత్తాన్ సకలానపి ॥ 73 ॥**

**దృష్టవాన్ పృష్టవాంశ్చైవ, జ్ఞాతవాంశ్చ విసిస్మియే ।**
**విలపన్తీం తదాఽరణ్యే, వృద్ధాం పప్రచ్ఛ భూమిపః । 74 ।**

**72-74.** ఆ లవణభూపతి, అచ్చట, అట్టి భ్రమను కాంచి, రెండవ నాడు ఆ మహారణ్యమునకు పోవుటకు పూనుకొనెను. అత డచట విహరించుచు, తన జీవితమున కల్గిన సంఘటనల నన్నిటిని కాంచి, వానిని విచారించి, తెలిసికొని, ఆశ్చర్యమును పొందినాడు; తరువాత, ఆ యరణ్యమున విలపించు నొక వృద్ధురాలిని గాంచి, యావద్వృత్తాంతమును గుఱించి ప్రశ్నించినాడు.

**'కిం వృత్తం తవ దుఃఖాయ?, కాన్ వా త్వమనుశోచసి'? ।**
**ఇతి పృష్టా చ సా ప్రాహ, 'పతి ర్మే పుక్కసాధిపః । 75 ।**

**75** 'నీకు దుఃఖమును కల్గించిన వృత్తాంతమేది? లేక, ఎవరిని గూర్చి నీవు శోకించుచున్నావు' - అని రా జడుగగా, 'నా భర్త, చండాల(మాల) జాతికి అధిపతి -

**ఆవయోశ్చ సుతా ప్రాప, దైవా దిన్దుసమం పతిమ్ ।**
**సుఖాని సా చిరం భుక్త్వా, ప్రసూతా తనయాః సుతాన్ । 76 ।**

**76.** మా కూతురు దైవవశమున, చంద్రసముడైన పతిని పొందినది; చిరకాలము సుఖముల ననుభవించి పుత్రికలను, పుత్రులను, కన్నది.

**కేనచిత్త్వథ కాలేన, గ్రామే దుర్భిక్ష పీడితే ।**
**తే సర్వే హి గతా దూరం, పఞ్చత్వం వా గతా ఇతి । 77 ।**
**శోచ్యాంస్తానమశోచన్త్యః, తిష్ఠామో భృశదుఃఖితాః ।**

**77-78.** తరువాత కొంతకాలమునకు మా పల్లె, దుర్భిక్ష (కఱవు) పీడకు గుఱికాగా, వా రందఱు దూరదేశమునకు పోయినారు. లేక, చనిపోయి నారేమో? అని, శోకింపదగిన అవ్వారిని గుఱించి, శోకించుచు, మిక్కుటమగు దుఃఖముతో మే మున్నాము.'

**ఇతి శ్రుత్వోచితై ర్వాక్యైరేతాసాం దుఃఖసంక్షయమ్ । 78 ।**
**కృత్వా చ విస్మయాఽఽవిష్టో, దృష్టలోక పరావరః ।**

**జ్ఞాత్వాఽ విద్యాస్వభావోఽసా, వాజగామ గృహం నృపః ॥ 79 ॥**

**78-79.** ఇట్లు విని, ఆ స్త్రీల దుఃఖమును సముచితదానాదులచే నుపశమింప జేసి, పూర్వాఽపర జీవితమును కాంచిన ఆ రాజు, **అవిద్యాస్వభావము** నెఱిగినవాడై, ఆశ్చర్యమును పొంది, స్వగృహమున కేతెంచినాడు.

**శ్రీరామ ఉవాచ :-**

**కథ మేతద్వద బ్రహ్మన్! స్వప్నః సత్యత్వ మాగతః? ।**
**సంశయో భగవన్! సోఽయం, న మే గలతి చేతసః ॥ 80 ॥**

**80.** **శ్రీరాముడు :-** స్వామీ! అతని స్వప్న మెట్లు సత్యమైనది? ఈ సంశయము, భగవంతుడా! నా మనస్సు నుండీ యంతరించుట లేదు.'

**వసిష్ఠ ఉవాచ :-**

**సర్వమేత దవిద్యాయాం, సంభవత్యేవ రాఘవ! ।**
**అసచ్చ సదివాఽఽభాతి, స్వప్నేష్వివ నభోగతిః ॥ 81 ॥**

**81.** **వసిష్ఠుడు :-** "రాఘవా! ఇది యంతయు అవిద్య యందు (ఆధ్యాత్మికాంధ్యము నందు) సంభవించుచున్నది. **స్వప్నములందు ఆకాశగమనము వలె,** అసత్తు (లేనిది), సత్తు (ఉన్నదాని) వలె, ఆభాసించుచున్నది (తోచుచున్నది).

[నిత్యము, శుద్ధము, బుద్ధము, ముక్తము, ఆనంద రూపము, ప్రాపంచికోపాధి వినిర్ముక్తమునైన ఆత్మను, - స్వస్వరూపమును - విస్మరింపజేసి, కర్తృత్వ భోక్తృత్వ ధర్మములను, అందు, అవిద్య ఆరోపించుచున్నందున, ఆయవిద్య, **(విద్యాఽభావము),** ఇచట 'ఆధ్యాత్మికాంధ్య'మని వివరింపబడినది.]

**దృష్టం యత్సక్షణే రాజ్ఞా, తత్ర శామ్బరికేహయా ।**
**తత్ర యోల్లసితాఽవిద్యా, సైవాఽవ్యేద్యురితి ధ్రువమ్ ॥ 82 ॥**

**82.** ఇంద్రజాలికుని మాయ వలన చండాలగృహమున (గూడెమున) రాజు కాంచిన దంతయు, మఱునటి దినము నందలి విలాసమంతయును నిశ్చితముగ అవిద్యయే. (ఆధ్యాత్మికాంధ్యమే).

**తత్కాలే లవణేనాఽఽశు, దృష్టో యః స్వప్నవిభ్రమః ।**
**స ఏవ సంవిదం ప్రాప్తః, తదా పుక్కస చేతసి ॥ 83 ॥**

83 ఆ సమయమున వెను వెంటనే, లవణ రాజు గాంచిన స్వప్నసదృశమగు ఆ భ్రాంతి, చండాలుని చిత్తమునను స్ఫురించినది. లేదా, ఆ పర్వత ప్రాంత మందలి చండాలురదైన ప్రతిభయే లవణరాజు చిత్తమున స్ఫురించినది.

**సత్తా సర్వపదార్థానాం. నాఽన్యా సంవేదనాదృతే ।**
**సఙ్కల్పసంక్షయా ద్రామ! చిన్మాత్ర మవశిష్యతే ॥ 84 ॥**

84 శ్రీరామా ! సర్వ పదార్థములకును అధిష్ఠాన చైతన్య సత్త (సంవేదనమున) కంటె, ఇతరమగు సత్త (అస్తిత్వము) ఏదియును లేదు. సంకల్పములు క్షయింపజేసినచో, చిన్మాత్రమే (శుద్ధమగు చైతన్యము మాత్రమే) మిగులగలదు. ['అధిష్ఠాన చిత్ సత్తయైవ సర్వ వస్తుసత్తా, న స్వాతన్త్ర్యేణ ఇత్యాహ – సత్తేతి' । (యో.వా.తా.ప్ర.)]*

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే, 'లవణోపాఖ్యానం' నామ సప్తమః సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'లవణోపాఖ్యానమ'ను
సప్తమ (ఏడవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



* ప్రపంచచరిత్ర యందు, సంభవించుటకు అనేక సంవత్సరములు పట్టు సంఘటనలు, ఏ చిత్తమున నైనను అభిన్నరూపమున (సమానముగ) – కొన్ని క్షణములలోనే జరిగినట్లు నిరూపింపబడగల నను సిద్ధాంతమును విశదీకరించుటకు ఈ కథ చెప్పబడినది. సర్వ వస్తువులు, కాలము, దేశము – వీని యొక్క సాపేక్షకత్వమును, (relativity) భావనా మాత్రత్వమును, (Ideality) పైతమీ కథ వివరించుచున్నది.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## అష్టమసర్గము

## భార్గవోపాఖ్యానమ్ – భార్గవుని (శుక్రుని) కథ

### 1. భార్గవమనోరాజ్యమ్ – భార్గవుని భావనారాజ్యము – [ఆకాశసౌధకల్పన]

వసిష్ఠ ఉవాచ :–
ఏకం బ్రహ్మ చిదాకాశం, సర్వాత్మక మఖణ్డితమ్ ।
స్థితా బ్రహ్మణి విశ్వశ్రీః, ప్రతిభామాత్రరూపిణీ ॥ 1 ॥

1. వసిష్ఠుడు :– బ్రహ్మము ఏకము, చిదాకాశము, సర్వాత్మకము, అఖండితము (అవిభాజ్యము). బ్రహ్మము నందు, విశ్వముయొక్క సంపద,–శోభ– (విభూతి) – అంతయు కేవలము ఆభాసరూపముగ నున్నది.

అత్ర భార్గవవృత్తాన్తం, కథయామి తవాఽనఘ ! ।
పురా మన్దరశైలస్య, భృగుః పూర్వ మతప్యత ॥ 2 ॥

2. పాపరహితుడా! ఈ విషయమున భార్గవుని (శుక్రుని) వృత్తాంతము నీకు వచింతును. మందరపర్వతసానుభాగ మందలి అరణ్యమున, పూర్వము భృగుమహర్షి తప మాచరించెను.

**నిర్వికల్ప సమాధిస్థే, తస్మిన్ శుక్ర స్తదాఽఽత్మజః ।**
**దదర్శాఽప్సరసం తత్ర, గచ్ఛన్తీం నభసః పథా । 3 ।**

3. అతడు (భృగువు) నిర్వికల్ప సమాధి యందుండగా, ఆతని కుమారుడగు శుక్రుడు, ఆకాశమార్గమున చనుచున్న ఒక అప్సరసను గాంచెను.

**అథ తాం మనసా ధ్యాయన్, తత్రైవాఽఽమీలితేక్షణః ।**
**ఆరబ్ధవాన్ మనోరాజ్యం, తయా సహ యథా సుఖమ్ * । 4 ।**

4. తరువాత, ఆమెను మనస్సున ధ్యానించుచు, కన్నులు మూసికొని, ఆమెతో యథా సుఖముగ, మనోరాజ్యమును ప్రారంభించినాడు (ఆకాశ సౌధముల నిర్మింపనారంభించినాడు)

**స్వర్గే విహర్తు మారేభే, తతః సఙ్కల్ప మాత్రతః ।**
**పుణ్యక్షయాఽనుసన్ధానాత్, పపాతాఽవని మణ్డలే । 5 ।**

5. సంకల్పమాత్రముననే, తరువాత స్వర్గమున ఆమెతో విహరించుట కారంభించి, స్వర్గసుఖముల ననుభవించినాడు; అప్పు డతడు తన పుణ్యము క్షీణించినదని యనుకొనుట వలన, వెంటనే భూమండలమున పడిపోయినాడు.

**తతః తస్య క్రమాజ్జీవః, శాలితా మగమత్ తదా ।**
**శాలీన్ భుక్తవతః పుత్రో, భూత్వాఽపి తపసి స్థితః । 6 ।**

---

పోల్చు :- "ప్రభవతి మనసి వివేకో, విదుషామపి శాస్త్ర సంభవ స్తావత్ ।
నిపతన్తి దృష్టివిశిఖా, యావన్నేన్దీవరాక్షీణామ్ ॥"

పండితులకు సైతము, శాస్త్రసంభవమగు వివేకము, ఇందీవరాక్షుల (నల్లకలువల వంటి కన్నులు గల కాంతల) యొక్క మోహకారక కటాక్షరూపములగు నిశితబాణములు పడనంత వరకు మాత్రమే, మనస్సున నిలుచును.

(శ్రీకృష్ణ మిశ్రయతీంద్రుడు - ప్రబోధ చంద్రోదయము–I-11)

6. తరువాత, క్రమముగ అతని జీవుడు, శాలిధాన్యమున చేరి, ఆ ధాన్యము భుజించిన వానికి పుత్రుడుగ జన్మించి, మరల తపస్సున నెలకొన్నాడు.

**అవన స్మేరుగహనే, మన్వన్తర మయం తతః ।**
**ధర్మచిన్తాపరిభ్రంశాత్, జాతో మద్రమహీపతిః ॥ 7 ॥**

7. మేరుశైలదుర్గమారణ్యమున, ఒక మన్వంతరకాలము, అతడు జీవించి, ధర్మచింతనమునుండి భ్రష్టుడగుట వలన, మద్రదేశాధిపతిగ జన్మించినాడు.

**ఏవ మన్యాని జన్మాని, సముపేత్య బహూన్యథ ।**
**సమఙ్గాయా స్తటే జాతః, తపస్వీ తాపసాత్మజః ॥ 8 ॥**

8. ఇట్లు, అతడు జన్మపరంపరల పొంది, తరువాత సమంగానదీ తీరమున, నొక తాపసునకు పుత్రుడుగ జన్మించి, తపస్వియైనాడు.

**అథ కాలేన మహతా, భృగుశుక్రసముద్భవః ।**
**కాయ స్తత్ర పపాతోర్వ్యాం, పవనాఽఽతప జర్జరః ॥ 9 ॥**

9. చిరకాలమునకు మందర పర్వతమున, భృగువునకు జన్మించిన ఆతని శరీరము, శీతవాతాఽఽతపములకు శిథిలమై, (ఛిన్నమూలమైన వృక్షము వలె) భూమిపై పడిపోయినది.

**అథ వర్షసహస్రేణ, సమాధేః విరతో భృగుః ।**
**పుత్రం మత్వా మృతం కోపాత్, కాలం శపుమియేష సః ॥ 10 ॥**

10. అప్పుడు, వేయిసంవత్సరముల తరువాత, సమాధిని విరమించి భృగువు, తన కుమారుడు మృతుడైనాడని తలచి, కోపముతో కాలుని (యముని) శపించుట కుపక్రమించినాడు.

**ఆధిభౌతికదేహోఽథ, కాలో భృగు ముపాయయౌ**
**ఉపేత్య కుపితం కాలో, మునిం ప్రోవాచ సాన్త్వయన్ ॥ 11 ॥**

11. ఆధిభౌతికదేహధారియై కాలుడు, కోపమున నున్న భృగువు చెంత కేతెంచి, అనునయించుచు, ముని కిట్లు వచించినాడు.

**"త్వ మనన్తతపా విప్రో, వయం నియతిపాలకాః ।**
**కిం మూర్ఖ ఇవ సర్వజ్ఞ!, ముధా మాం శపు మిచ్ఛసి? ॥ 12 ॥**

12. సర్వజ్ఞుడా! నీవు అనంత తపశ్శాలివైన బ్రాహ్మణుడవు. మేము నియతికి

రక్షకులము. మూర్ఖుని వలె ఏల వ్యర్థముగ నన్ను శపింప కాంక్షింతువు?

మనో హి తవ పుత్రస్య, సమాధౌ త్వయి సంస్థితే ।
సన్త్యజ్యేదం వపుర్గత్వా, విశ్వాచీం బుభుజే దివి ॥ 13 ॥

13. నీవు యోగసమాధి యందుండగా, నీ పుత్రుని మనస్సు, ఈ శరీరమును పరిత్యజించి, విశ్వాచియను అప్సరసను చేరి, స్వర్గమున నామెతో కామభోగముల ననుభవించినది.

మహీపో ధీవరో వంశః, తతః సర్పోఽథ కుక్కుటః ।
ఏవం పుత్రో విచిత్రాసు, వాసనావశతః స్వతః[1] ॥ 14 ॥

స యోనిషు చరిత్వాఽద్య, జాతో విప్రకుమారకః ।
తపశ్చరతి తే పుత్రః, సమఙ్గాసరిత స్తటే ॥ 15 ॥

14-15. రాజుగా, బెస్తవాడుగా, వెదురుగా, పాముగా, కోడిగా, స్వవాసనా (సంస్కార) వశమున, నిట్లు విచిత్రములైన వివిధజన్మములను దాల్చి, ప్రస్తుతము విప్రకుమారుడుగా జన్మించి, నీ కుమారుడు, సమంగానదీ తటమున, తప మాచరించుచున్నాడు.

త మిచ్ఛసి యది ద్రష్టుం, జ్ఞాననేత్రేణ లోకయ" ।
ఏవముక్తో మహూర్తేన, ప్రతిభాన[2] వశాదపి ॥ 16 ॥
సమఙ్గయా స్తటే పుత్ర మాలోక్య పునరాయయౌ ।

---

(1) పోల్చు :- "అహో! కర్మోర్మిభిః శీర్ణే సంసారమకరాఽఽకరే ।
జన్మాఽఽవర్తేషు జన్తూనాం, మజ్జనోన్మజ్జనక్రమః ॥"
(క్షేమేంద్రుడు-బోధిసత్త్వావదానకల్పలత -VII-43)
ఆహా! కర్మములను కల్లోలతరంగములచే విశీర్ణమైన (విక్షిప్తమైన) సంసారమను (మొసళ్లకు నిలయమగు) సాగరమున జనుల (ప్రాణుల)కు జన్మపరంపరయను ఆవర్తము (సుడిగుండము)లందు ఉన్మజ్జననిమజ్జన (తేలుట, మునుగుటల) క్రమము ఆశ్చర్యమును కల్గించుచున్నది.

(2) ప్రతిభానవశాత్ - యోగజ ధర్మ శుద్ధ బుద్ధి దర్పణే బింబితమివ ప్రత్యక్షమ్. (శ్రీమదానందబోధేంద్రసరస్వతి. యో.వా. తాత్పర్య ప్రకాశికా వ్యాఖ్య) యోగజన్యమైన ధర్మముచే విశుద్ధమైన బుద్ధియను దర్పణమున (అద్దమున) ప్రతిఫలించిన దాని వలె ప్రత్యక్షముగా -
"యోగజో ద్వివిధః ప్రోక్తో, యుక్త, యుంజాన, భేదతః ।
యుక్తస్య సర్వదా భానం, చిన్తాసహకృతోఽపరః ।
యోగజన్యజ్ఞానము యుక్తము, యుంజానము - అని ద్వివిధము. యుక్తము నిరావరణమైన దర్శనము (జ్ఞానము). యుంజానము విచారసహకృతమైన దర్శనము (జ్ఞానము). (భాషా పరిచ్ఛేదము (65-66) ప్రతిభానమ్ :- కాంతి, ఉజ్జ్వలమైన బుద్ధి. (Brightness of conception.)

16 నీ వతని చూడ తలచినచో. జ్ఞాననేత్రమును తెఱచి చూడుము." - అని కాలుడనగా, భృగువు ఒక ముహూర్త కాలముననే (48 నిమిషములు) ప్రతిభానశక్తి (ఉజ్జ్వలయోగదృష్టి) ప్రభావమున, సమంగానదీ తీరమున నున్న తన కుమారుని కాంచి, మరల తిరిగి స్వస్థానమున కేతెంచినాడు.

## 2. భార్గవప్రబోధనమ్ - శుక్రుని మేలుకొలు

**తతః కాలో భృగుశ్చైవ, సమజ్గాయా స్తటం గతౌ ॥ 17 ॥**
**శాన్తేన్ద్రియం సమాధిస్థం, తం దృష్ట్వా 'బుధ్యతా మయమ్' ।**
**ఇతి కాలస్య సఙ్కల్పా త్సమాధేః విరరామ సః ॥ 18 ॥**

17-18. తరువాత కాలుడును, భృగువును, సమంగానదీ తీరమునకు వెళ్లినారు. ప్రసన్నేంద్రియుడై, యోగసమాధి యందున్న శుక్రుని గాంచి, '**ఈతడు మేల్కొనుగాక**' - అని కాలుడు సంకల్పించుటవలన, శుక్రుడు యోగసమాధిని విరమించినాడు.

**ఉన్మీల్య నేత్రే తౌ దృష్ట్వా, శాన్తం వచ ఉవాచ సః ।**
**'భవతో దర్శనేనాఽహం, పరాం నిర్వృతి మాగతః' ॥ 19 ॥**

19. కనులు తెఱచి వారిద్దఱిని గాంచి, శుక్రుడు '**మీ దర్శనము వలన నేను అతిశయమైన సుఖమును పొందితిని**'. అని శాంత వచనమును పల్కెను.

**ఇతి ప్రోచ్య నమస్యన్తం, ప్రోవాచ భృగు రాత్మజమ్ ।**
**'స్మరాఽఽత్మానం ప్రబుద్ధోఽసి,' తతః సోఽపి ప్రబోధితః ॥ 20 ॥**
**ముహూర్తమాత్రాత్ సస్మార, జన్మాన్తరదశాం నిజామ్ ।**

20-21. ఇట్లు పల్కి, నమస్కరించు కుమారునితో, 'నాయనా! నీ విపుడు **ప్రబుద్ధుడవు. (మేల్కొన్నావు)** నిన్ను నీవు స్మరించుకొమ్ము' - అని భృగువు వచించెను. తరువాత, అతడును ప్రబోధితుడై, ముహూర్త (48 నిమిషముల) మాత్రముననే **నిజజన్మాంతరదశలను** స్మరించు కొన్నాడు.

**ఉత్తిష్ఠ తాత! గచ్ఛామః, పశ్యామః పూర్వకం వపుః ॥ 21 ॥**
**ఇతి తస్య వచః శ్రుత్వా, ప్రావృష్టే మన్దరం క్షణాత్ ।**

దృష్ట్వా తు భార్గవ స్తత్ర, శుష్కాం తను మువాచ సః ॥ 22 ॥

21-22. 'తండ్రీ! రెమ్మ పోదము, నా పూర్వదేహమును చూతము' - అను శుక్రుని పలుకులను విని, క్షణకాలముననే వారు మందరాద్రిని చేరుకొన్నారు. భార్గవుడు (శుక్రుడు) శుష్కించిపోయిన శరీరమును గాంచి, యిట్లన్నాడు.

'నిరస్తకల్పనాజాల మియం శేతే సుఖం వనే ।
అచిత్తత్వం వినా నాఽన్యత్, శ్రేయః పశ్యామి జన్మషు' ॥ 23 ॥

23 'కర్మవాసనా రూపమైనకల్పనా జాలమును నిరసించి (నశింపజేసి) ఈ శరీరము, వనమున, సుఖముగ నిద్రించుచున్నది. జనన ధర్మములైన వాని యందు, చిత్తాఽభావము (చిత్తోపశాంతి) తప్ప, మఱి ఇతరమైన శ్రేయస్సును దేనిని, నేను కాంచనైతిని. (చిత్తోపశమమే, పరమ శ్రేయస్సు).'

అథాఽఽక్షిప్య వచ స్తస్య, కాలః ప్రోవాచ భార్గవమ్ ।
'ప్రవిశేమాం తనుం సాధో! కర్తవ్య మనయా త్వయా ॥ 24 ॥
గురుత్వ మసురేన్ద్రాణాం, కల్యాణ మస్తు వాం' ఇతి ।

24-25 అతని మాటల నాక్షేపించి కాలుడు, భార్గవునితో, 'సౌమ్యుడా! ఈ శరీరమున ప్రవేశింపుము. దీనితో, రాక్షసేంద్రులకు గురుత్వము నీవు నిర్వహింపవలసిన కర్తవ్యమున్నది. మీకు (పితాపుత్రులకు) శుభమగుగాక!' అని యన్నాడు.

ఉక్త్వా చాఽన్తర్హితే తస్మిన్, సన్త్యజ్య ద్విజభావనామ్ ॥ 25 ॥
శుక్రదేహం వివేశాఽథ, భార్గవో నియతే ర్వశః ।
చకారాఽఽప్యాయనం తస్య, ప్రోక్షణైః స భృగు స్తదా ॥ 26 ॥

25-26 అట్లు పలికి, కాలు డంతర్హితుడు కాగా, భార్గవుడు (శుక్రుడు) పూర్వ కర్మ (నియతి) వశమున, బ్రాహ్మణ భావమును విసర్జించి, శుక్రదేహమున ప్రవేశించెను. తరువాత భృగువు, మంత్రజలముల ప్రోక్షించి దానికి ఆప్యాయన మొనర్చినాడు. (బలోపేతముగ పునరుజ్జీవనము కల్పించినాడు.)

అథ శుక్రః సముత్థాయ, వవన్దే పితరం సుఖీ ।
భార్గవాఽఽఖ్యాన మేతత్, త్వం విచారయ యథామతి* । 27 ।

27. అప్పుడు శుక్రుడు సుఖియై, సర్వాంగపరిపుష్టుడై లేచి, తండ్రికి నమస్కరించి నాడు. శ్రీరామా! ఈ భార్గవాఖ్యానమును నీవు యథామతి విచారింపుము.

## 3. మనోమలక్షాళనమ్ – మనోమాలిన్యమును కడిగి వేయుట

జన్తోః కృతవిచారస్య, విగళద్వృత్తిచేతసః ।
విజ్ఞానవశతో నూనం, స్వభావః సంప్రసీదతి । 28 ।

28. విచారమొనరించిన వాడును, చిత్తవృత్తు లుపశమించిన వాడును నైన జనునకు (మనుజునకు) విజ్ఞానవశమున స్వస్వరూపస్వభావము, తప్పక ప్రసన్న మగుచున్నది.

విచారేణ పరిజ్ఞాతస్వభావస్యోదితాత్మనః ।
అనుకమ్ప్యా భవన్తీహ, బ్రహ్మవిష్ణ్విన్ద్రశఙ్కరాః । 29 ।

---

★ వ్యక్తిజీవితముపై కామము, లేక, కాంక్ష (అభిలాష) కల్గించు ఆశ్చర్యకరమైన ప్రభావమును వివరించుటకీ కథ చెప్పబడినది. కేవలము సంచారిభావరూపమగు కాంక్ష (Passing wish) సైతము, దానిని సిద్ధింపజేసికొనుటకు నూతన జన్మమునకు హేతువు కాగలదనుటకు కూడ ఈ కథ నిర్దేశించుచున్నది.
"పుంసః స్త్రియా మిథునీభావ మేతం, తయోర్మిథో హృదయగ్రన్థి మాహుః ।
అతో గృహక్షేత్రసుతాఽఽప్తవిత్తైః, జనస్య మోహోఽయ మహం మమేతి ॥"
"యదా మనోహృదయగ్రన్థిరస్య, కర్మాఽనుబద్ధో దృఢమా శ్లథేత ।
తదా జనః సంపరివర్తతేఽస్మా ద్ముక్తః పరం యాత్యతిహాయ హేతుమ్ ॥" (భాగ. V-5-7.8)
ఇతఃపూర్వమే గల దేహాత్మాభిమాన రూపమగు సూక్ష్మ హృదయగ్రంథి కాక, పురుషునకు స్త్రీతో మిథునీభావము, వా రిరువుని బంధించు ప్రత్యేకము, స్థూలమునైన రెండవ హృదయగ్రన్థి యగుచున్నది. ఈ ప్రత్యేక స్థూల హృదయ గ్రంథియే, దేహేంద్రియ మనస్సులను అతిక్రమించి, గృహ, క్షేత్ర, సుతాఽఽప్త, విత్తము లందును, అహంతా, మమతా, మోహముల నుత్పాదించుచున్నది. జీవుని కర్మానుబంధమగు మనోరూపదృఢహృదయగ్రంథి, శిథిలమైనపుడు మాత్రమే, నరుడు స్త్రీ పురుష మిథునీభావము నుండి నివర్తించి, తత్కారణమగు అహంకారమును త్యజించి, ముక్తుడై, పరమపదమును పొందుచున్నాడు. (ఋషభదేవుడు) దీని వలన స్త్రీ పురుష మిథునీ భావరూపమగు, కామ మెంత బలీయమో, కామ విజయమెంత దుర్ఘటమో, దుస్సాధమో, తెలియుచున్నది.
"శరీరస్యాఽఽత్మనశ్చాఽపి, సమ్బన్ధో గ్రన్థి రుచ్యతే ॥" శరీరము యొక్కయు, ఆత్మ యొక్కయు సంబంధము గ్రంథి (ముడి) యని చెప్పబడినది. ఇదియే, దేహాత్మాభిమానరూపమగు సూక్ష్మ హృదయగ్రంథి. (శ్రీ రమణ మహర్షి – రమణగీత-IX-3)

29. ఆత్మవిచారము వలన స్వరూపజ్ఞానమును బడసిన ఆత్మజ్ఞానోదయ శాలికి, బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుడు, శంకరుడు, - వీరందఱును అనుకంపా (కారుణ్య) పాత్రులు కాగలరు.

[ఆత్మ సాక్షాత్కారమందిన మహాత్ముని సిద్ధావస్థ, దేవతల మహోన్నత పదమును సైతము అతిక్రమించునని భావము.]

'కోఽహం కథ మిదం' చేతి, యావన్నాఽన్తర్విచారితమ్ ।
సంసారాఽఽడమ్బరం తావ, దన్ధకారోపమం స్థితమ్ ॥ 30 ॥

30. 'నేనెవరు? ఈ విశ్వమెందుండి జనించినది?' - అని యెంత వఱకు లోపల (హృదయమున) విచారితము కాదో, (విచారింపబడదో), అంత వఱకు, గాఢాంధకార సదృశమగు సంసారాడంబరము - (జగదస్తిత్వ దృశ్యము) స్థిరముగ నిలిచియే యుండును.

సర్వశక్తి రనన్తాఽఽత్మా, సర్వభావాఽన్తరస్థితః ।
అద్వితీయ శ్చిదిత్యన్తః, యః పశ్యతి స పశ్యతి ॥ 31 ॥

31. సర్వభూతహృదయస్థితమగు ఆత్మ, సర్వశక్తియుతము, అనంతము, అద్వితీయము, చిత్స్వరూపము, నని లోపల (హృదయమున) నెవడు ఉపలబ్ధి, గాంచునో, వాడే నిజముగ చూపుగలవాడు. (యథార్థదర్శి).

పరిజ్ఞాయోపభుక్తో హి, భోగో భవతి తుష్టయే ।
విజ్ఞాయ సేవిత శ్చోరో, మైత్రీ మేతి న చోరతామ్ ॥ 32 ॥

32. మిథ్యారూపములని పూర్తిగ నెఱిగి, తరువాత అనుభవించిన భోగములు, సంతృప్తి కల్గించును. చోరుని చోరునిగ నెఱిగి సేవించినచో, నతడు మైత్రిని పొందును కాని, చోరత్వమును బొందడు కదా!

---

పోల్చు :- "యావం హి వనథో న ఛిజ్జతి అణుమత్తోపి నరస్స నారిసు ।
పటిబద్ధమనో వ తావ సో, వచ్ఛో ఖీరపకోవ మాతరి ॥"
(ధమ్మపదం. - 284 (1994)-డా॥ రత్నాకరం బాలరాజు)

ఎంత వఱకు పురుషునకు స్త్రీల యందు వనథము (కామ వాసనారూపమైన గుల్మము-పొదరులు), అణుమాత్రమైన ఛేదింపబడక, అఖండితమై యుండునో, అంత వఱకు పాలుత్రాగు దూడ, తల్లియావునందు బద్ధమైయుండునట్లు, అతని మనస్సు భవమునకు ప్రతిబద్ధమై యుండును.

మనసో నిగృహీతస్య, లీలాభోగోఽల్పకోఽపి యః ।
త మేవా ఽలబ్ధవిస్తారం, క్లిష్టత్వాద్బహు మన్యతే । 33 ।

33. సమస్తము నుండి, నిగ్రహింపబడిన మనస్సు యొక్క విలాస సుఖానుభవము అత్యల్పమైనను, విస్తృతిని బొందకున్నను, దానినే, దుఃఖానుభవ కారణమున, అధిక సుఖముగ మనుజుడు భావించుచున్నాడు.

బన్ధముక్తో మహీపాలో, గ్రామమాత్రేణ తుష్యతి ।
పరై రబద్ధోఽనాక్రాన్తో, న రాజ్యం బహుమన్యతే । 34 ।

34. బంధము నుండి విముక్తుడైన రాజు, కేవల మొక్క గ్రామముతోనే సంతుష్టుడగును. కాని, శత్రువులచే బంధింపబడని, ఆక్రమింపబడని స్వతంత్రుడగు రాజు, రాజ్యమును సైతము విపులముగ – (గొప్పగ), భావింపడు.

మనసో విజయాత్ నాఽన్యా, గతి రస్తి భవాఽర్ణవే ।
తావ న్నిశీథ వేతాలా, వల్గన్తి హృది వాసనాః । 35 ।
ఏక తత్త్వదృఢాఽభ్యాసాత్, యావ న్నవిజితం మనః ।

35-36. భవ (సంసార) సాగరమున, మనో విజయమున కంటె అన్యమగు గతి – (శరణ్యము) – లేదు. ఏకమగు పరతత్త్వమును దృఢముగ నభ్యసింప నంత కాలము, హృదయమున, భోగవాసనారూపములగు నిశీథ బేతాలములు (అజ్ఞానాంధకారరూపములగు భూతములు) నృత్యమాడుచునే యుండును.

భృత్యోఽభిమతకారిత్వాత్, మన్త్రీ సత్కార్యకారణాత్ । 36 ।
సామన్తశ్చేన్ద్రియాక్రాన్త్యా, గురు ర్విద్యా ప్రదానతః ।
లాలనాత్ స్నిగ్ధలలనా, పాలనాత్ పావనః పితా । 37 ।
సుహృ దుక్తం*చ విశ్వాసా న్మనో మన్యే మనీషిణామ్ ।

36-38. వివేకవంతులకు మనస్సే, అభిమతము నెఱవేర్చుచున్నందున

---

★ సుహృదుత్తమ విశ్వాసాత్ – పా.భే. పాల్యా– ధమ్మపదం -I-పాదటీక. మఱియు, ధమ్మపదం III.3,4. వ్యాఖ్యలు. డా॥ రత్నాకరం బాలరాజు 1994.

భృత్యుడును, సత్కార్యములకు హేతువగుచుండుట వలన మంత్రియు, ఇంద్రియములను స్వాధీన మందుంచుట వలన సామంతుడును, జ్ఞాన మొసగుట వలన ఆచార్యుడును, లాలించుట వలన స్నేహశాలినియగు భార్యయు, పాలించుట వలన పావనుడగు తండ్రియు, ఉత్తమవిశ్వాసము వలన మిత్రుడును, అగుచున్నదని భావింతును. [స్వదేహనగరీ సామ్రాజ్యమున, భృత్య, మంత్రి, సామంతాది కార్యమును శుద్ధమగు మనస్సు నిర్వహించుచున్నదని భావము. మానసనిగ్రహమే, పరమ శాంతి.]

**ఏవం మనోర్మణిం రామ! బహుపఙ్కకలఙ్కితమ్ । 38 ।**
**వివేకవారిణా సిద్ధ్యై, ప్రక్షాళ్యాఽఽలోకవాన్ భవ!।**

38-39. శ్రీరామా! ఇట్లు బహుమాలిన్యదూషితమైన మనస్సను మణిని, పరిపూర్ణతా సిద్ధిని బడయు కొఱకు వివేకజలములతో చక్కగా కడిగి శుద్ధ మొనరించుకొని, ఆలోకవంతుడవు, దీప్తిమంతుడవు (చూపుకల వాడవు) కమ్ము.

**ఇన్ద్రియారీ న్బలం తీర్త్వా, బుద్ధ్యా సత్యమవేక్ష్య చ । 39 ।**
**తత్రైవ నిష్ఠితో భూత్వా, తీర్ణో భవ! భవార్ణవాత్ ।**
**ఏవం తే కథితం రామ!, మనోనైర్మల్య సాధనమ్ । 40 ।**

39-40. ఇంద్రియములను శత్రువులను సంపూర్ణముగా నిర్జించి, బుద్ధిచే సత్యమును దర్శించి, అందే ప్రతిష్ఠితుడవై, భవసాగరమును దాటినవాడవు కమ్ము! శ్రీరామా! నీకిట్లు మనః పరిశుద్ధికి సాధనమును వచించితిని.

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే, 'భార్గవోపాఖ్యానం' నామ అష్టమః సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠసంగ్రహమున 'భార్గవోపాఖ్యాన'మను అష్టమ (ఎనిమిదవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## నవమసర్గము

## దామాద్యుపాఖ్యానమ్ – దామాదుల ఇతిహాసము

### 1. అహఙ్కారోదయః – అహంకారము యొక్క పుట్టుక

వసిష్ఠ ఉవాచ :–

దామవ్యాళకటన్యాయం, వక్ష్యామ్యత్ర శుభప్రదమ్ ।
శమ్బరస్య బలే మస్తే, తస్మిన్ దేశాన్తరం గతే । 1 ।

తత్సైన్యం తరసా జఘ్నుః, ఛిద్రం ప్రాప్య కిలాఽమరాః ।
స్వయం కోపాదథాఽఽయాసీత్, శమ్బరః సురపత్తనమ్ । 2 ।

1-2. వసిష్ఠుడు :– ఇచ్చట శుభప్రదమైన దామ, వ్యాళ, కట, దృష్టాంతము నీ కెఱిగింతును. శంబరాసురుని సైన్యము నిద్రించునపుడును, వాడు దేశాంతరమునకు పోయినపుడును, అవకాశమును(మర్మమును) కనిపెట్టి,

దేవతలు వాని సైన్యమును జవమున (శీఘ్రముగ) సంహరించినారు. అప్పుడు శంబరుడు, కోపించి, స్వయముగ, సురపత్తనము – (స్వర్గము) పైకి, దాడి వెడలినాడు.

**తస్య మాయాబలాద్భీతాః, సురాస్తేఽన్త ర్ధిమాయయుః ।**
**శూన్యం దృష్ట్వా తు స స్వర్గం, విహృత్య కుపిత స్తదా ॥ 3 ॥**
**లోకపాలపురీం దగ్ధ్వా, జగామాఽఽత్మీయ మాలయమ్ ।**

3-4. శంబరుని మాయాబలమునకు భయపడి, దేవతలు (మేరుపర్వత గుహలలో) దాగొన్నారు. శంబరుడు, పాడుపడి, శూన్యమై యున్న, స్వర్గమును చూచి, విహరించి, దొరికిన సంపదల హరించి, క్రుద్ధుడై లోకపాలుర పురమును దగ్ధ మొనరించి, స్వస్థానమును (పాతాళమును) మరల చేరుకొన్నాడు.

**అదృశ్యా ఏవ దేవాస్తే, జఘ్నుః తస్య బలాఽధిపాన్ ॥ 4 ॥**
**శమ్బరేణ తదా భీమాః నిర్మితాః మాయయా త్రయః ।**
**దామో, వ్యాళః, కటు, శ్చేతి, మహామాయాః మహాబలాః ॥ 5 ॥**

4-5. దేవతలు అదృశ్యులయ్యే, శంబరుని సేనాధిపతులను సంహరించుచుండిరి. అప్పుడు, తన మాయాశక్తిచే ముగ్గురు, దామ, వ్యాళ, కటు అను మాయాన్వితులు, మహాబలులునైన వారిని, శంబరుడు సృజించినాడు.

**వాసనాఽఽత్మాభిమా నాభ్యాం, హీనా స్తే న విదు ర్భయమ్ ।**
**కేవలం సైనికా నగ్రే, దృష్ట్వా తే హననోద్యతాః ॥ 6 ॥**

6. ధర్మాఽధర్మములకు సంబంధించిన వాసనలు కాని, దేహాభిమానము కాని, లేకుండుట వలన, వారు భయ మెట్టిదో యెఱుగరు; కేవలము సైనికులను తమ ఎదుట గాంచి, వారిని సంహరించుట కుద్యమించినారు.

**హన్యమానా స్తథా దేవాః, యత్ర క్వాఽపి చ సంస్థితాః ।**
**విషణ్ణాః క్షణమా శ్వాస్య, బ్రహ్మాణం శరణం యయుః ॥ 7 ॥**

7. దేవత లిట్లు వధింపబడుచుండగా, ఎక్కడి వా రక్కడనే విషాదము పొందినవారై, వారు క్షణకాలమున, మరల ధైర్యము వహించి, బ్రహ్మదేవుని శరణుచొచ్చినారు.

బ్రహ్మోవాచ :-

"యోధయన్తః పలాయధ్వం, యుధ్యధ్వం పునరేవ చ ।
యుద్ధాఽభ్యాసవశా దేషా మసురాణాం హృదాశయే ॥ 8 ॥

అహఙ్కారచమత్కారః, నూన ముత్పద్యతే తదా ।
గృహీతవాసనా ఏవం, సుజేయా వో భవన్తి తే ॥ 9 ॥

8-9. బ్రహ్మ :- "రాక్షసులను యుద్ధమున కుపక్రమింపజేసి, వారితో యుద్ధము చేయుచు, మీరు పారిపొండు. మరల వచ్చి, యుద్ధము చేయుడు. మాటి మాటికి. యుద్ధాభ్యాసము వలన, ఈ రాక్షసుల హృదయమున అహంకారము యొక్క ప్రకాశము, అప్పుడు తప్పక జనింపగలదు. అట్టి వాసనలను గ్రహించుట వలన, వారు మీకు సులభముగ జయింపదగిన వారు కాగలరు.

వాసనాతన్తుబద్ధోఽయం, లోకో హి పరివర్తతే ।
ధీరోఽప్యతి బహుజ్ఞోఽపి, ప్రబుద్ధోఽపి మహానపి ॥ 10 ॥
తృష్ణయా బధ్యతే జన్తుః, సింహః శృఙ్ఖలయా యథా ॥"

10-11. ఈ లోకము, మనోవాసనలచే బద్ధమయి, ప్రవర్తిల్లుచున్నది. ధైర్య శాలియైనను, బహుశ్రుతుడైనను, ప్రబుద్ధుడైనను, మహనీయుడైనను, జననధర్మియైన మానవుడు, శృంఖల (సంకెల)చే బంధింపబడిన సింహము వలె, తృష్ణ చేత బద్ధుడు."

ఇత్యాకర్ణ్య చ యుధ్యన్తః, పున శ్చక్రుః పలాయనమ్ ॥ 11 ॥
ఏవం పునః పునర్వృత్తే, దృఢాఽభ్యాసా దహఙ్కృతేః ।
దామాదయోఽహమిత్యాస్థాం, జగృహు ర్వ్యక్తచేతసః ॥ 12 ॥

11-12. ఇట్లు బ్రహ్మ నుండి విని, దేవతలు మొదట యుద్ధమున రాక్షసులతో పోరుచు, పలాయితులగుచు, మరల కలియుచుండిరి. ఇట్లు, మాటి మాటికి, జరుగగా, దామవ్యాళ కటులు, అభినివేశ మనస్కులై, యుద్ధ దృఢాఽభ్యాసము వలన, అహంకారావస్థను పొందినారు. (వారి యందు అహంకార ముదయించినది). వారు, 'నేము', - 'వాది' యను ఆస్థను (అపేక్షను) గ్రహించినారు.

**ఆస్థావాసనయా గ్రస్తా, స్తతః కృపణతాం గతాః ।**
**ఏవం బద్ధధియాం తేషాం, ధైర్య మస్తర్ధి మాయయా ॥ 13 ॥**

13. అపేక్షా వాసనాగ్రస్తులై వారు, క్షుద్రత్వమును (దైన్యమును) పొందినారు. (వివేకశూన్యులైనారు). బద్ధబుద్ధులైన వారి యందు, ధైర్యమంతరించినది.

**అథ ప్రమ్లానసత్త్వా స్తే, మరణా ద్భీతచేతసః ।**
**నైవ శక్తాః సురాన్ హన్తుం, పాతాళం వివిశు ర్భయాత్ ॥ 14 ॥**

14. తరువాత, బలము శిథిలము కాగా, చావునకు భయపడు మనస్సు గలవారై వారు, దేవతలను సంహరించుటకు అశక్తులై, భయముతో పాతాళమును ప్రవేశించినారు.

**అవివేకాఽనుసన్ధానాత్, చిత్త మాపద మీదృశీమ్ ।**
**అవాప్నోతీతి బోధాయ, తవేయం కీర్తితా కథా★ ॥ 15 ॥**

15. వివేకరహితమైన భావనల ననుసరించుట వలన, చిత్త మిట్టి ఆపదకు పాలగునని తెలియుటకే ఈ కథ నీకు చెప్పబడినది.

## 2. అహఙ్కారః త్రివిధః – అహంకారము మూడు విధములు

**ఇదం మే స్యా దిదం మేస్యా దితి బుద్ధేః కదాచన ।**
**స్వైన దౌర్భాగ్యదైన్యేన, న భస్మాఽప్యుప తిష్ఠతి ॥ 16 ॥**

16. 'ఇది నాది అగుగాక!' 'ఇది నాది అగుగాక!' అని తన దౌర్భాగ్య దైన్యమున, అపేక్షించు బుద్ధికి, బూడిద సైత మెపుడును రాలదు. (సిద్ధింపదు).

**వేత్తి నిత్య ముదారాత్మా, త్రైలోక్యమపి యస్తృణమ్ ।**
**తం త్యజ న్త్యాపదః సర్వాః, సర్పా ఇవ జరత్త్వచమ్ ॥ 17 ॥**

17 ఈ ముల్లోకములను తృణప్రాయముగ నెఱుగు ఉదారాత్ముని సకలాపదలును, సర్పములు, జీర్ణమైన కుబుసమును వలె త్యజించును.

★ జీవింపవలెనను అపేక్షయే (జీవితాస్థయే) (Will to live) జీవితమున పరాజయములకు, దుఃఖములకు, అన్నిటికి హేతు వనుటనీ కథ వివరించుచున్నది. ఈ అపేక్ష లేమియే సకల విజయములకు, సిద్ధులకు మూలము.

ఆపదః సంపదః సర్వాః, సర్వత్రాఽనాదరో జయః ।

18 అట్టి వారికి ఆపదలన్నియు సంపదలగును. అన్నిచోట్లను కల్గిన అనాదరము, జయముగా పరిణమించును.

అహంభావోఽఙ్కురో జన్మవృక్షాణా మక్షయాత్మనామ్[(1)] । 18 ।
మమేదమితి విస్తీర్ణాః, తేషాం శాఖాః సహస్రశః ।
త్రివిధో రాఘవాఽస్తీహ, సోఽహఙ్కారో జగత్త్రయే । 19 ।

18-19. శ్రీరామా! సంసారమాయ యొక్క అనాదికాల ప్రవృత్తత్వము వలన, అవినాశస్వభావము గల జన్మ (సంసార) వృక్షములకు, అహంభావమే అంకురము. 'ఇది నాది' అను మమత్వభావనతో ఈ వృక్షముల శాఖలు, వేనవేలుగ విస్తరించుచున్నవి. ఇచ్చట ముల్లోకములలో, అహంకారము మూడు విధములుగ నున్నది.

అహం సర్వ మిదం విశ్వం, పరమాత్మాఽహ మచ్యుతః ।
నాఽన్యదస్తీతి యో భావః, పరమా సా హ్యహఙ్కృతిః[(2)] । 20 ।

20. 'ఈ సమస్త విశ్వమును నేనే; నేనే నాశము లేని పరమాత్మను; నా కంటె వేఱయిన దించుకంతయు లేనేలేద'ని తలచు అహంకృతియే ఉత్తమాహంకృతి యనబడును. ["సర్వం ఖల్విదం బ్రహ్మ, నేహ నానాఽస్తి కించన" । సర్వము బ్రహ్మమే. ఏ కొంచెమైనను ఇచ్చట నానాత్వము లేదు. అని శ్రుతి వచనము.]

(1) అక్షయాత్మనామ్ – జ్ఞాన కుఠారమన్తరేణాఽను చ్ఛేద్య స్వభావానామ్ ।
జ్ఞానమనెడి కుఠారము చేత తప్ప, ఇతరముచే ఖండింపబడని స్వభావము గల జన్మ (సంసార) వృక్షములకు. (యో.వా.తా.ప్ర.) మఱియు పోల్చు భ.గీ. XV. 1-4 శ్లోకములు.

(2) పోల్చు :- "జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే ।
తద్బ్రహ్మాఽహ మితి జ్ఞాత్వా, సర్వబంధైః ప్రముచ్యతే" ।
"త్రిషుధామసు యద్భోజ్యం, భోక్తా భోగశ్చ యద్భవేత్ ।
తేభ్యో విలక్షణః సాక్షీ, చిన్మాత్రోఽహం సదాశివః" ।
"మయ్యేవ సకలం జాతం, మయి సర్వం ప్రతిష్ఠితమ్ ।
మయి సర్వం లయం యాతి, తద్బ్రహ్మాఽద్వయ మస్మ్యహమ్" ।
జాగ్రత్స్వప్న సుషుప్త్యాదికమగు ప్రపంచమును ప్రకాశింపజేయునట్టి బ్రహ్మమే తానని తెలిసికొన్నచో, సర్వబంధముల నుండి మనుజుడు విముక్తుడగును. 'జాగరాది త్రివిధావస్థలలోని భోక్తృభోగాదులకు విలక్షణమైన సాక్షిని నేను. చిన్మాత్రస్వరూపుడైన సదాశివుడను నేను. సర్వమును నా యందే జనించి, స్థితి నంది, లయమందుచున్నది. అట్టి అద్వయమైన బ్రహ్మము నేను.' (కైవల్య – ఉ. 17, 18, 19)

సర్వస్మా ద్వ్యతిరిక్తోఽహం, వాలాగ్రశతకల్పితః ।
ఇతి యా సంవిదేవాఽసౌ, ద్వితీయాఽహఙ్కృతిః శుభా[1] । 21 ।

21. అన్నిటి యందును, వ్యతిరిక్తమై వెలుగుచున్న వాలాగ్రశతకల్పితమగు పరమాణురూపమును నేనేయని తలచునట్టి అహంకృతి, శుభమైన ద్వితీయాఽహంకృతి యనబడును.

పాణిపాదాఽఽది మాత్రోఽయమహ మిత్యేష నిశ్చయః[2] ।
అహఙ్కార స్తృతీయోఽసౌ, లౌకిక స్తుచ్ఛ ఏవ సః । 22 ।

---

(1) "వాలాగ్ర శత భాగస్య, శతధా కల్పితస్య చ ।
భాగో జీవ స్స విజ్ఞేయః, స చాఽఽనన్త్యాయ కల్పతే । (శ్వేతాఽశ్వతర - ఉ.V-9 )

తల వెండ్రుక కొన యొక్క నూఱవ భాగమును మరల నూఱు భాగములు చేసినచో, అందలి ఒక్క భాగమునకు జీవ స్వరూపము సమానము. అనగా కేశము (వెండ్రుక)ను పదివేల భాగములుగ విభజించినచో అందలి ఒక్క భాగమునకు జీవస్వరూపము సమానము. జీవుడు స్వయముగ పరమాత్మస్వరూపుడు, అనంతుడునైనను, బుద్ధి ఉపాధి (లింగశరీరము) వశమున నట్లు సూక్ష్మరూపుడని శ్రుతి వర్ణించుచున్నది.

I– "అందు బ్రహ్మంబు తానని అహంభావ
మొందిన అహమర్థ మున్నతోన్నతము ।
II– పరగ నీశ్వరుడు ప్రపంచంబు నందు,
పరమాణుపూర్ణుడై భాసిల్లుచుండు,
నతనికి దాసుండ నను నహమర్థ
మతులితోన్నతమగు, నా రెండు విడిచి
III– తనువు నింద్రియములు తానను నహము
జనియింప నది కనిష్ఠంబగు చుండు
IV - కడపటికివి నహంకార త్రయంబు
విడిచిన ధన్యుండు విమల నిర్వాణ
పదమందు జెందు తప్పదు నిశ్చయంబు ।"

[మహాయోగిని తరిగొండ వెంగమాంబ వివరణము]

మఱియు చూడుః– సర్గ XI-46-పాదటీక.

(2) పోల్చు :- "పిణ్డః పృథగ్యతః పుంసః శిరః పాణ్యాదిలక్షణః ।
తతోఽహమితి కుత్రైతాం సంజ్ఞాం రాజన్! కరోమ్యహమ్ ।
"యద్యన్యోఽస్తి పరః కోఽపి, మత్తః పార్థివసత్తమ ! ।
తదైషోఽహ మయం చాఽన్యో, వక్తుమేవ మపీష్యతే ।
యదా సమస్త దేహేషు, పుమానేకో వ్యవస్థితః ।
తదా హి కో భవాన్, సోఽహ, మిత్యేతద్విఫలం వచః ।
[విష్ణు.పు. II. అంశము – 13వ అధ్యాయము. 89, 90, 91]

22. హస్తపాదాదియుక్తమైన కేవల శరీరమే నేనను నిశ్చయము తృతీయాఽహంకృతి యనబడును. ఇది లౌకికము; తుచ్ఛము. [దేహాత్మాభిమానము నశ్వరలోకసంబంధమైనది కాన. తుచ్ఛమైనదని భావము] ★

**ప్రథమౌ ద్వావహఙ్కారావఙ్గీకృత్యాఽతిలౌకికౌ ।**
**తృతీయాఽహఙ్కృతి స్త్యాజ్యా, లౌకికీ దుఃఖదాయినీ ॥ 23 ॥**

23. అతి లౌకికములైన (లోకోత్తరములైన) మొదటి రెండు అహంకృతుల నంగీకరించి, (నశ్వర)లోకసంబంధియు, దుఃఖదాయినియు నైన **తృతీయాహంకృతిని** త్యజింప వలయును.

**పూర్వోక్తే చాఽపి సన్త్యజ్య, సర్వాఽహఙ్కృతి వర్జితః ।**
**య స్తిష్ఠతి స ఏ వోచ్చైః, పద మా రోహతి ధ్రువమ్ ॥ 24 ॥**
**అత్యన్తం పరమం శ్రేయః, ఏతదేవ పరం పదమ్ ।**

24-25. పూర్వోక్తములైన రెండహంకృతులను సైతము త్యజించి, సర్వాఽహంకృతివర్జితుడై యుండువాడు మాత్రమే, పరమోత్కృష్ట స్థానమును (నిర్వాణమును) నిశ్చయముగ పొందగలడు. ఇదియే అత్యంతపరమమైన శ్రేయస్సు; ఇదియే **పరమపదము.**

### 3. నిర్వాసనతా – మనోవాసనారాహిత్యము

**అథ తే శృణు వక్ష్యామి, శమ్బరేణ కృతం తతః ॥ 25 ॥**
**దామాఽఽదయోఽప్యహఙ్కారాత్, నిర్జితా సమరే సురైః ।**

---

కరచరణాది లక్షణమగు ఈ పిండము – (దేహము) ఘటాదికము వలె, దృశ్యత్వము కలదగుట వలన, ఆత్మ కంటెను భిన్నము. కాన, 'అహమ్' అను సంజ్ఞను నేను ఎందు ప్రయోగింపగలను? రాజా! నా కంటె అన్యు డెవరైన నున్నచో అప్పుడు "ఇతడు నేను", "అత డన్యుడు" అని చెప్పవచ్చును. కాని, సమస్తదేహముల యందును పురుషుడు (ఆత్మ) ఒక్కడే విరాజిల్లుచున్నందున, "మీరు ఎవరు"? "అతడు నేను" – అను వ్యవహారము నిష్ఫలమగుచున్నది కదా! అని జడ భరతుడు, రహూగణుడను సౌవీరరాజున కుపదేశించెను.

★ "భువనములందు ఖండపరిపూర్ణమహత్త్వము తోడ నేకమై
యవిరళవృత్తి నున్న పరమాత్ముని గాదని, బాహుమస్తకా
ద్యవయవ యుక్త దేహములయందును 'సోఽహ' మటంచు ధారుణీ
ధవ! పలుకంగ గోరుట వృథాయగు నిత్యవివేకశాలికిన్ ।" (ఆంధ్ర విష్ణు -పు. III. 312)

మఱియు సౌల్యు– "దేహబుద్ధ్యాఽస్మి దాసోఽహం, జీవబుద్ధ్యా త్వదంశకః ।
ఆత్మబుద్ధ్యా త్వమేవాఽహమ్, ఇతి మే నిశ్చితా మతిః ।
అని, మహావీరుడగు హనుమంతుని దృఢ ప్రత్యయము.

**ఇతి సంచిన్త్య శాస్త్రజ్ఞాన్, మిథ్యాభావవివర్జితాన్ ॥ 26 ॥**
**సవివేకా నహఙ్కారవిహీనాన్, మాయయాఽసృజత్ ।**

25-26. తరువాత, శంబరు డాచరించినది చెప్పెదను వినుము. అహంకార సహితులైన దామాదులు, యుద్ధమున దేవతలచే నిర్జితులైనారని తలచి, శాస్త్రజ్ఞులు, మిథ్యా(అసత్య)భావరహితులు, వివేకశాలులు, నిరహంకారులును నైన వారిని శంబరుడు తన మాయాశక్తితో సృజించినాడు.

**సర్వజ్ఞా వేద్యవేత్తారః, జరామరణనిర్భయాః ॥ 27 ॥**
**భీమో, భాసో, దృఢ, శ్చేతి, నామభాజో హి తేఽభవన్ ।**

27-28. వారు, సర్వము నెఱిఁగినవారు, తెలియదగిన దానిని (పరమాత్మను) తెలిసికొన్నవారు, జరామరణముల భయము లేనివారు. భీముడు, భాసుడు, దృఢుడు నను నామముల వారు ప్రసిద్ధులైనారు.

[ఈ ముగ్గురి పేర్లును, మునుపటి ముగ్గురి పేర్లును, కథకు అనుగుణమైన సార్థకనామములుగా దోచుచున్నవి. దామ,వ్యాళ,కటులు, = రజ్జువు, క్రూరమృగము, శవము (పీనుగు). భీమ, భాస, దృఢులు = భీషణుడు, ప్రకాశుడు, అకంపితుడు.]

**వీతరాగై ర్గతద్వేషైః, సతతం సమదృష్టిభిః ॥ 28 ॥**
**ప్రాప్తేఽర్థకారిభి ర్భీమైః, వర్తమానాఽనువర్తిభిః ।**
**దేవసేనా హతా భూయః, జగామ శరణం హరిమ్ ॥ 29 ॥**

28-29. రాగద్వేషరహితులు, సతతము సమదర్శనులు, ప్రాప్తేఽర్థకారులు, రౌద్రులు, వర్తమానపరిస్థితుల ననుసరించి వర్తించువారునైన ఆ భీమాదుల చేత మరల, ఆ దేవతల సైన్యము హతము కాగా, దేవతలు హరికి శరణాగతులైనారు.

**చక్రేణాఽథ హతా స్తేన, సఙ్గరే భృశదారుణే ।**
**నిర్వాసనా మహాత్మానః, పరాం శాన్తి ముపాగతాః ॥ 30 ॥**

30. తరువాత భీమాదులు, అత్యంతభయంకరమైన యుద్ధమున, హరిచే చక్రహతులైనారు. మహో(విషయ) వాసనా రహితులైన ఆ మహాత్ములు,

పరమైన శాంతిపదమును పొందినారు.

తస్మాద్ వాసనయా బద్ధం, ముక్తం నిర్వాసనం మనః[1]
సమ్యగాలోకనాత్సత్యాత్[2] వాసనా ప్రవిలీయతే ॥ 31 ॥

31\. (విషయ) వాసనాయుక్తమగు మనస్సు బద్ధము; (విషయ) వాసనా రహితమైన మనస్సు ముక్తము. సత్య సాక్షాత్కారము (సమ్యగ్దర్శనము) వలన (విషయ) వాసన, సమూలముగ లయించుచున్నది.

వాసనావిలయే చేతః, శామ్యత్యస్నేహదీపవత్ ।
అస్య సంసారదుఃఖస్య, సర్వోపద్రవ కారిణః ॥ 32 ॥
ఉపాయ ఏక ఏవాఽస్తి, మనసః స్వస్య నిగ్రహః[3] ।

32-33. విషయవాసనలు విలయమందగా, తైలరహితమైన దీపము వలె, చిత్తము

---

(1) పోల్చు :– "మన ఏవ మనుష్యాణాం, కారణం బన్ధమోక్షయోః ।
బన్ధాయ విషయాసక్తం, ముక్త్యై నిర్విషయం స్మృతమ్" (అమృత బిందు–ఉ–2)

(2) పోల్చు :- "రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ।" (భ.గీ. II 59)
సమ్యగ్జ్ఞానమువలననే, రాగాది నివృత్తి. మఱి యేయితర ఆశ్రయము వలనను, రాగములు నివర్తింపవు. ఈ యుపాఖ్యానము పూర్వోక్తదామవ్యాళాఖ్యానమున కనుబంధము. ఆత్మస్వస్వరూప సాక్షాత్కారమందిన మహాత్ముని హృదయమున, ఆత్మసంరక్షణ కాంక్ష, యుత్పన్నముకాదేరదను వాక్య అంశమే ఇందలి విశేషము.

(3) "దానం, స్వధర్మో, నియమో, యమశ్చ, శ్రుతం చ కర్మాణి చ సద్వ్రతాని ।
సర్వే మనో నిగ్రహ లక్షణాన్తాః, పరో హి యోగో మనసః సమాధిః ।
దానాదులగు ఉపాయములన్నియును, మనో నిగ్రహ లక్షణ రూపమగు ఫలసిద్ధికే. మనోనిగ్రహమే, ఉత్తమోత్తమయోగము; జ్ఞానము. సంసారచక్రపరివర్తనమునకు, సుఖదుఃఖములకు, మనస్సే కారణమని శ్రుతులు చెప్పుచున్నవి. [భాగ. XI - 23- 46]
"మనోవశేఽన్యే హ్యభవంశ్చ దేవా,
మనశ్చ నాఽన్యస్య వశం సమేతి ।
భీష్మోహి దేవః సహసస్సహీయాన్,
యుంజ్యాద్వశం తం స హి దేవదేవః" ।

ఇతర దేవత లందఱు (ఇంద్రియములు, లేక, తదధిష్ఠాతలగు దేవతలు) మనో వశవర్తులు; మనస్సు దేని వశమందును లేదు. మనస్సు, యోగులకు పైతము భయంకరమైన దేవుడు. దీనిని వశము చేసికొన్న మహాత్ముడే దేవదేవుడు. (భాగ.XI.23-48)
చూడు– ధమ్మపదం గాథలు, 1,2, సాదటీక – డా॥ రత్నాకరం బాలరాజు (1994)

ఉపశమింపుచున్నది. సర్వోపద్రవకారకమైన సంసారదుఃఖమునకు కేవలనివారణోపాయము, తన మనస్సును నిగ్రహించుటయే.

**భోగేచ్ఛామాత్రకో బన్ధః, తత్త్యాగో మోక్ష ఉచ్యతే ॥ 33 ।**
**మనసోఽభ్యుదయో నాశః, మనోనాశో మహోదయః ।**

**33-34.** విషయ భోగముల యందలి ఆకాంక్షయే బంధము. విషయ భోగముల యందలి ఆకాంక్షా త్యాగమే మోక్షమనబడుచున్నది. మనో విజృంభణమే, నాశము. మనో నాశమే, మహోదయము. – [మహోన్నత ఫలసిద్ధి.]

## 4. జీవాఽవిర్భావః – జీవుని అభివ్యక్తి (అవతరణము)

**యథా సర్వగతః సౌక్ష్మ్యా దాకాశో నోపలిప్యతే ॥ 34 ।**
**తథా నిరంశ శ్చిద్భావః, సర్వగోఽపి న లక్ష్యతే ।**

**34-35** ఆకాశము, సర్వగతమయ్యును, సూక్ష్మమగుట వలన గ్రాహ్యము కానట్లే, (కనబడని యట్లే), చిదాత్మయు, నిరంశము(నిరవయవము), సర్వవ్యాపక మయ్యును, గోచరింపదు.

[నిరంశము :– అవిభాజ్యము, భాగరహితము. సూక్ష్మము, లఘువు (తేలిక)నైన 'ఈథర్ (ether)– అను పదార్థముచే అంతరిక్షము ఆవరింపబడియున్నదని తత్త్వవేత్తలు మాత్రమే కాక, భౌతిక శాస్త్రవేత్తలును విశ్వసింతురు]

**సైషా చిదవినాశ్యాత్మా, స్వాఽత్మేత్యాదికృతాఽభిధా ॥ 35 ।**
**నాఽస్తమేతి న చోదేతి, నోత్తిష్ఠతి న తిష్ఠతి ।**
**న చ యాతి న చాఽఽయాతి, న చేహ న చ నేహ చిత్ ॥ 36 ॥**

**35-36.** ఉపదేశించుటకై జ్ఞానులు, దీనిని 'చైతన్యము'ని, 'అవినాశి' యని, 'ఆత్మ'యని, 'స్వాత్మ'యని – ఇత్యాది నామములుచే వ్యవహరింతురు. దీనికి, ఉదయాస్తమయములు కాని, చలనాఽచలనములు గాని, రాకపోకలు కాని, ఇచ్చట లేదు, ఇచ్చట లేకుండుటయును లేదు, అను వ్యవహారములు కాని, లేవు. ఇది శుద్ధచైతన్యము.

రాఘవేయం ప్రపఞ్చేన జగన్నామ్నా విజృమ్భతే।
యేన శబ్దం రసం రూపం, గన్ధం జానాసి రాఘవ![1] । 37 ।

37. శ్రీరామా! ఇది దృగ్విషయమగు ప్రపంచముతో, జగత్తను నామమున విజృంభించుచున్నది - భాసించుచున్నది. దీని చేతనే నీవు, శబ్దమును, రసమును, రూపమును; గంధమును, స్పర్శమును, ఎఱుగుచున్నావు.

సోఽయమాత్మా పరం బ్రహ్మ, సర్వ మాపూర్య సంస్థితః।
ద్వితీయా కల్పనైవేహ, న రఘూద్వహ! విద్యతే ॥ 38 ।
బ్రహ్మమాత్రా ధృతే వహ్ని రౌష్ణ్యమాత్రా దృతే యథా।

38-39. ఈ ఆత్మ పరబ్రహ్మము, సర్వమును ఆపూరణమొనర్చి, (మిక్కిలి నిండించి) నిలిచియున్నది. శ్రీరామా! అగ్ని యందు ఔష్ణ్యము (వేడిమి) తప్ప, అన్యమేదియు లేనట్లు, బ్రహ్మము తప్ప ఇందు ద్వితీయమగు కల్పన (భావన) ఏదియును లేదు.

ఆదౌ శమదమ[2] ప్రాయై ర్గుణైః శిష్యం ప్రబోధయేత్ । 39 ।
పశ్చాత్ సర్వమిదం బ్రహ్మ, శుద్ధ స్త్వ మితి బోధయేత్ ।

39-40. మొదట శిష్యునికి, శమము, దమము, వంటి గుణములను బోధింపవలెను. తరువాత, 'ఇది యంతయు బ్రహ్మమే; నీవు శుద్ధుడవు' అని బోధింపవలెను.

అజ్ఞస్యాఽర్ధ ప్రబుద్ధస్య, 'సర్వం బ్రహ్మే'తి యో వదేత్ । 40 ।
మహానరకజాలేషు, స తేన వినియోజితః ।

---

(1) "యేన రూపం రసం గన్ధం శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్।
ఏతేనైవ విజానాతి, కిమత్ర పరిశిష్యతే; ఏతద్వైతత్ ।" (కఠ. ఉ.II.1-3)

విజ్ఞాన స్వభావముగు దేహాదివ్యతిరిక్తమగు ఈ ఆత్మ చేతనే, ప్రాణి సముదాయమంతయు, శబ్ద స్పర్శాదులను, సంభోగవిషయక సౌఖ్యములను, చక్కగా నెఱుగుచున్నది. ఈ ప్రపంచమున ఏమి మిగిలి యుండును? విజ్ఞాన స్వభావము గల ఆత్మ చేత, తెలిసికొనుటకు అశక్యమై నదేదియు మిగిలి యుండలేదని భావము.

(2) పోల్చు :- "సదైవ వాసనా త్యాగః 'శమోఽ'య మితి శబ్దితః।
నిగ్రహో బాహ్యవృత్తీనాం, 'దమ' ఇత్యభిధీయతే ।"
(శంకరుడు – అపరోక్షానుభూతి – 6)

ఎల్లప్పుడు విషయవాసనల నిగ్రహించి యుండుట 'శమ'మనబడును. బాహ్య వృత్తుల నిగ్రహించి యుండుట 'దమ' మనబడును.

**40-41.** అర్ధప్రబుద్ధుడైన (సగము మెలకువ కలవాడైన) అజ్ఞునికి 'సర్వము బ్రహ్మమే' సుమా! అని బోధించువాడు, అజ్ఞుడగు ఆ శిష్యుని, మహారౌరవాది నరకముల పాలు చేసినవాడగును. (దాన, గురువు సైతము మహానరకమును, పొందును.)

**అవిద్యయైవోత్తమయా,* స్వాత్మనాశోద్యమోత్థయా । 41 ।**
**విద్యా సా ప్రాప్యతే యద్వత్, మలేన క్షాళ్యతే మలమ్ ।**

**41-42.** తన మనస్సును నాశమొనరించు కొనుటకు చేయు ప్రయత్నము నుండి (బహుజన్మసంచితమై, విశుద్ధాంతఃకరణముగా మారి) యుదయించు ఉత్తమమైన అవిద్య (అజ్ఞానము)చే, విద్యను (పరతత్త్వ జ్ఞానమును) ప్రాపించుట, **మాలిన్యమును మాలిన్యముచేతనే** కడిగి వేయుట వంటిదే. **[చౌటి మట్టిచే వస్త్రపు మాలిన్యమును కడిగివేయు నట్లని భావము]**

[ఆధ్యాత్మిక సాధనావస్థ యందు, ధ్యానాదులైన యే మానసిక సాధనలు –(భావనలు)–ను, భావాతీతమైన శుద్ధచైతన్యస్వభావమగు పరతత్త్వము నకు ఆవరణమును కల్గించుట వలన, అవి యన్నియును, అవిద్యామయములే. కాని, అట్టి సాధనలు, సాధకుని, మనస్సు నతిక్రమింపజేసి, సచ్చిదానందరూపమగు పరతత్త్వమున ప్రతిష్ఠించుచున్నవి.]

---

★ పోల్చు :- "విద్యాం చాఽవిద్యాం చ యస్తద్వేదోభయం సహ ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా, విద్యయాఽమృతమశ్నుతే ।"
(ఈశా – ఉ. 11)

ఎవడు విద్యాఽవిద్యల రెంటిని ఆచరింపవలయునని తెలిసికొనునో, వాడు, అవిద్య చేత, (సత్కర్మానుష్ఠానము చేత) మృత్యువును దాటి, విద్యచే అమృతమును పొందుచున్నాడు.

**"They grope in darkness who worship this ignorant world, the world that is produced out of ignorance, thinking of it as Existance, and those who live their whole lives in this world and never find anything better or higher are groping in still greater darkness. But he who knows the secret of nature, seeing that which is beyond nature through the help of nature, he crosses death and through the help of that which is beyond nature, he enjoys Eternal Bliss.**
**Swami Vivekananda – Jnanayoga – God in Everything -**
**C.W. Vol. II - Mayavati Memorial Edition 1989 – P. 154.**

**కుతోఽవిద్యా చ జాతేతి రామ! మాఽస్తు విచారణా ‖ 42 ‖**
**ఇమాం కథ మహం హన్మీత్యేషా తేఽస్తు విచారణా ।**

**42-43** శ్రీరామా! ఈ అవిద్య ఎందుండి ఎట్లు జనించుచున్నదను విచారణ నీకు వలదు. ఈ అవిద్య నెట్లు నేను నశింపజేయగలనను విచారణ నీకు కలుగుగాక!

**అస్తం గతాయాం క్షీణాయా మస్యాం జ్ఞాస్యసి రాఘవ! ‖ 43 ‖**
**యత ఏషా యయా చైషా, యథా నష్టేత్యఖణ్డితమ్ ।**

**కిఞ్చిత్ క్షుభితరూపా సా, చిచ్ఛక్తి శ్చిన్మహార్ణవే ‖ 44 ‖**

**43-44.** శ్రీరామా! ఈ అవిద్య తొలగి, క్షీణించి, నశించిపోయినంతనే, అది ఎక్కడిదో, ఎవరిచే నుత్పన్నమో, ఎట్లు నశించినదో, అది యంతయు (తజ్జననాదివికారములు) సంపూర్ణముగ నీవే తెలిసికొనగలవు. ఈ **చైతన్య మహాసాగరమున, ఆ చిచ్ఛక్తి, కొంచెము క్షుభితమైన రూపము** గలదిగా దోచును.

**వికల్పకలితాకారం, దేశకాలక్రియాఽఽస్పదమ్ ।**
**చితో రూపం, మహాబాహో! క్షేత్రజ్ఞ ఇతి కథ్యతే ‖ 45 ‖**

**45.** మహాబాహుడ(వీరశ్రేష్ఠుడ)వైన శ్రీరామా! దేశకాల క్రియలకు ఆస్పదమై, వికల్పములచే మలినమైన ఆకృతి గల చిద్రూపమే, **క్షేత్రజ్ఞుడని (జీవుడని) చెప్పబడినది.** (చిత్తు, క్షేత్రజ్ఞుడగుట, క్షేత్రోపాధికల్పనాధీనము. క్షేత్ర మనగా శరీరము).

**వాసనాం★ కలయన్ సోఽపి, యాత్యహఙ్కారతాం పునః ।**
**అహఙ్కారో వినిర్ణేతా, కలఙ్కీ బుద్ధి రుచ్యతే ‖ 46 ‖**

**46** క్షేత్రజ్ఞుడును వాసనావిశిష్టుడై మరల అహంకార మగుచున్నాడు. **అహంకారమే, నిర్ణయముల తీసికొనునది – వినిర్ణేత (నిశ్చయాత్మకమైనది).** ఈ అహంకారమే, దేహాత్మాభిమాన మను కళంకముతో, బుద్ధి యనబడుచున్నది.

---

★ **వాసనాః – పా.భే.**

**బుద్ధిః సఙ్కల్పకలితా, ప్రయాతి మననాఽఽస్పదమ్ ।**
**మనో ఘనవికల్పం తు, గచ్ఛతీన్ద్రియతాం శనైః ॥ 47 ॥**
**పాణిపాదాదిమద్దేహ మిన్ద్రియాణి విదుర్బుధాః ।**

**47-48.** బుద్ధి, సంకల్పములతో కూడి, మన స్సగుచున్నది. ఆ మనస్సు అనిశ్చితమైన పలుసంకల్పములతో ఘనమై, క్రమముగా ఇంద్రియత్వ మును బొందుచున్నది. కరచరణాదియుక్తమైన దేహమును, ఇంద్రియములని జ్ఞాను లెఱుగుదురు [అవిభాజ్యమైన చైతన్యము నుండి, స్థూలదేహము క్రమముగా ఉత్పన్న మగుటను పై నాల్గు శ్లోకములు వివరించుచున్నవి]

**ఏవం జీవో హి, సఙ్కల్పవాసనారజ్జువేష్టితః ॥ 48 ॥**
**దుఃఖజాలపరీతాత్మా, క్రమా దాయాతి చిత్తతామ్ ।**

**48-49.** ఇట్లు జీవుడు (క్షేత్రజ్ఞుడు) సంకల్పవాసనలనెడి రజ్జువు (త్రాడు)చే బద్ధుడై, దుఃఖజాలముచే చుట్టుకొనబడినవాడై, క్రమముగా దుఃఖమే స్వరూపముగా గల చిత్తముగ పరిణమించుచున్నాడు – అనగా బాహ్యార్థ చేతన (చింతనా) సమర్థతను బొందుచున్నాడు.

**ఇతి శక్తిమయం చేతో, ఘనాఽహఙ్కారతాం గతమ్ ॥ 49 ॥**
**కోశకారకృమిర్యద్వత్ (క్రిమిరివ) స్వేచ్ఛయా యాతి బన్ధనమ్**
**ఏవం జీవా శ్చితో భావాః, భవభావనయోహితాః★ ॥ 50 ॥**

---

★ పోల్చు :- "భవభావనయా – సంసారవాసనయా, ఊహితాః– ప్రవాహితాః" । (యో.తా.ప్ర.)
"ఆత్మా భాసా తతో బుద్ధి, బుద్ధ్యాభాసం తతోమనః ।
అక్షాణి మన ఆభాసా న్యక్షాభాస మిదం వపుః ।
అత ఏవాఽఽత్మతా బుద్ధి, దేహాదా వనాత్మని ।
[శంకరుడు – సర్వవేదాంతసిద్ధాంతసార సంగ్రహము– 474 శ్లో]
బుద్ధి, ఆత్మాభాసమనియు, మనస్సు, బుద్ధ్యాభాసమనియు, ఇంద్రియములు, మానసాభాసములనియు, శరీరము, ఇంద్రియాభాసమనియు, దేహాదుల యందు ఆత్మ బుద్ధి కల్గుటకు ఇదియే కారణమనియు చెప్పబడినది.
బ్రహ్మమే ఇట్లు కాంక్షించెనని సాలంకారముగ ఉపనిషత్తులు వర్ణించును.
"తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి" । ( ఛాం. ఉ. VI-II.3) నేను అనేకము అగుదును గాక! నేను విస్తరించి వృద్ధి పొందుదును గాక! అని అది (బ్రహ్మము) వీక్షించెను – (సంకల్పించెను). సృష్టి సంకల్పపూర్వకమని శ్రుతి భావము.
చూడు :- శ్రీ.సీ.రా. సం– రాజయోగదర్శనము . XIV – ప్రకరణము పుటలు. 330 – 331 – డా॥ రత్నాకరం బాలరాజు (1982).

**49-50.** ఇట్లు (రాగద్వేషాది) శక్తి ప్రచురమైన చిత్తము, ఘనమైన అహంకారముగ పరిణమించి, పట్టుపురుగువలె, తన ఇచ్ఛచేతనే, బంధనము పొందుచున్నది. ఇట్లు అద్వయచైతన్యభావులైన జీవులు, భవభావనచే (సంసారవాసనచే), ప్రవాహితులగుచున్నారు.

**బ్రహ్మణః కల్పితాకారాః, దేవతిర్యఙ్నరాదయః ।**
**విభిన్నా ఇవ దృశ్యన్తే, బుద్బుదా వారిధే రివ ॥ 51 ॥**

**51.** బ్రహ్మము నుండి కల్పితమైన ఆకారము గల దేవతలు, తిర్యక్కులు (పశుపక్షులు), మానవులు, మొదలగువారు, సముద్రము నందలి **జలబుద్బుదముల (నీటిబుడగల)** వలె, విభిన్నులట్లు గోచరించుచున్నారు.

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'దామాద్యుపాఖ్యానం' నామ నవమః సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'దామాద్యుపాఖ్యాన'మను నవమ (తొమ్మిదవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## దశమసర్గము

## దాశూరోపాఖ్యానమ్ – దాశూరుని కథ

### 1. సృష్టిక్రమః – సృష్టిక్రమము (సంసారాఽవతరణక్రమము)

వశిష్ఠ ఉవాచ :–

బ్రాహ్మ్యం శృణు మహాబాహో! శరీరగ్రహణక్రమమ్ ।
దిక్కాలాద్యనవచ్ఛిన్న మాత్మతత్త్వం స్వశక్తితః ॥ 1 ॥
లీలయైవ యదాఽఽదత్తే, దిక్కాల కలితం వపుః ।
తదైవ జీవపర్యాయం, వాసనావశతః పరమ్ ॥ 2 ॥
మనః సంపద్యతే లోలం, కలనాకలనోన్ముఖమ్ *।

---

★ కలనాఽకలనోన్ముఖమ్ః – పూర్వ సర్గమున ఆకాశాది క్రమమున ఆవిర్భవించిన హిరణ్య గర్భుని అహం గ్రహోపాసన చేత సంస్కరింపబడిన మనస్సు, ఆ విధముగనే అవ్యాకృతమున లీనమైన మనస్సు, శక్తి యనబడును. ఆ శక్తి, ఆ క్రమముననే, తన ఆవిర్భావమును కల్పించుకొనుచున్నది. [కలనాఽకలనోన్ముఖ మితి యదుక్తం తద్వివృణోతి. – కలయన్తీత్యాదినా। పూర్వసర్గే ఆకాశాది

1-3. వసిష్ఠుడు :- మహాబాహుడవైన శ్రీరామా! బ్రహ్మముయొక్క శరీర గ్రహణవిషయమును క్రమముగ చెప్పెద వినుము. దిక్కాలాద్యన వచ్ఛిన్నమైన (దేశ కాలములచే పరిచ్ఛిన్నము కాని) ఆత్మతత్త్వము, తన శక్తి వలన విలాసముగ దిక్కాల కలితమైన శరీరమును దాల్చినపుడే వాసనావశమున, జీవుడను మఱి యొక పేరును పొందుచున్నది. తరువాత, ఆజీవుడే, కలనాకలనోన్ముఖమునగు (కల్పనాఽకల్పనోన్ముఖమునగు) చంచలమనోరూపమునుపొందుచున్నాడు.

**కలయన్తీ మనఃశక్తి రాదౌ భావయతి క్షణాత్ ॥ 3 ॥**
**ఆకాశభావనా మచ్ఛాం, శబ్దబీజరసోన్ముఖీమ్ ॥1॥**

3. **మనఃశక్తి**, చింతించుచు, మొదట, క్షణములో, శబ్దబీజరసోన్ముఖమైన, స్వచ్ఛాఽఽకాశభావనను భావించుచున్నది. (మనస్సు యొక్క శబ్దతన్మాత్రాఽఽకాంక్ష, ఆకాశము నుత్పాదించుచున్నది.)

**తతః తత్ ఘనతాం యాతం, ఘనస్పన్ద క్రమా న్మనః ॥ 4 ॥**
**భావయత్యనిలస్పన్దం, స్పర్శబీజరసోన్ముఖమ్ ।**

4-5. అట్టి ఆకాశభావనను ప్రాపించి, ఘనత్వమును (వృద్ధి) పొందిన మనస్సు, ఘనస్పందక్రమమున, స్పర్శబీజరసోన్ముఖమైన అనిల (వాయు) స్పందము (కొంత చలనము)ను భావించుచున్నది. (మనస్సు యొక్క స్పర్శ తన్మాత్రాఽఽకాంక్ష, వాయువు నుత్పాదించుచున్నది.)

**తాభ్యా మాకాశవాతాభ్యాం, దృఢాఽభ్యాసోత్పన్న స్తతః ॥ 5 ॥**
**శబ్దస్పర్శస్వరూపాభ్యాం, సంఘర్షా జ్జాయతేఽనలః ।**

5-6. శబ్దస్పర్శరూపములైన ఆకాశవాయువులను ఆ రెంటి (భూతముల) నుండి, వాని ఉపచయము (వృద్ధి) వలనను, సంఘర్షణ వలనను, అగ్ని, ఉత్పన్నమగుచున్నది (మనస్సు యొక్క రూపతన్మాత్రాఽఽ కాంక్ష, అగ్నిని ఉత్పాదించుచున్నది.)

---

క్రమాఽఽవిర్భూత హిరణ్యగర్భాఽహం గ్రహోపాసనసంస్కృతం మన స్తథైవాఽవ్యాకృతే లీనం మనః శక్తి రిత్యుచ్యతే, సా తేనైవ క్రమేణ ప్రాఽఽవిర్భావం కల్పయన్తీ సతీత్యర్థః ।
[శ్రీ సదానంద బోధేంద్ర సరస్వతి - యో.వా. తాత్పర్య ప్రకాశికా]

**మన స్తాదృగ్గుణాఽఽవిష్టం, రసతన్మాత్ర వేదనమ్ ॥ 6 ॥**
**క్షణాత్ చేతత్యపాం, శైత్యం, జలసంవి త్త్[1]తో భవేత్ ।**

**6-7.** మనస్సు, ఇట్లే మూడింటి (ఆకాశ, వాయు, తేజస్సుల) రూపమున పరిణమించుటచే, వాని గుణములచే నావిష్టమై, రసతన్మాత్రవేదనను భావించి, (రసతన్మాత్రానుభూతిని కాంక్షించి), క్షణములో జలముల శీతలత్వము (రసతన్మాత్రను) గ్రహించి, **జలమను** సంవేదనమునకు – (ప్రతీతికి) అర్హమగుచున్నది.

**తత స్తాదృగ్గుణాఽఽ విష్టం, మనో భావయతి క్షణాత్ ॥ 7 ॥**
**గన్ధతన్మాత్ర మేతస్మాత్, భూ మిసంవి త్తతో భవేత్ ।**

**7-8.** తరువాత, అట్టి (నాల్గు) గుణములతో కూడి మనస్సు, క్షణములో తన స్వరూపమును, గంధతన్మాత్రగ భావించుచున్నది. దీని వలన, అది, **భూమియను** సంవేదనమునకు (ప్రతీతికి) యోగ్యమగుచున్నది.

**అథేత్థం భూతతన్మాత్రైః, వేష్టితం తనుతాం త్యజ[2]త్ ॥ 8 ॥**
**వపు ర్వహ్నికణాఽఽకారం, స్ఫురితం వ్యోమ్ని పశ్యతి ।**

**8-9.** తరువాత, ఇట్లు పంచభూత తన్మాత్రలతో (శబ్ద, స్పర్శ, రూప,రస, గంధ తన్మాత్రలతో) సంవేష్టితమై, తన సూక్ష్మభావమును త్యజించి, **మనస్సు,** చిదాకాశమున, అగ్నికణాకారమున స్ఫురించిన, శరీరమును గాంచుచున్నది.

**తస్మిన్ తత్తీవ్రసంవేగాత్, భావయ ద్భాసురం వపుః ॥ 9 ॥**
**స్థూలతా మేతి పాకేన, మనో బిల్వఫలం యథా ।**

**9-10.** చిదాకాశమున ప్రకాశించు భాసురమైన శరీరమును భావించుచు, ఆ తీవ్రసంవేగ(సంక్షోభ)మువలన, మనస్సు, కర్మపరిపాకమువలన **బిల్వఫలము వలె,** స్థూలత్వము నందుచున్నది.

---

(1) **అపాం, శైత్యం రసతన్మాత్రం ప్రాప్య,జలమితి సంవేద్యత ఇతి సంవిత్ప్రతీత్యర్థం భవేదిత్యర్థః ।**
(యో.వా. తాత్పర్య ప్రకాశిక)
**జలమను ప్రతీతికి యోగ్యమగుచున్నదని భావము.**

(2) **జహత్ – పా.భే.**

మూషాస్థ ద్రుతహేమాభం, స్ఫురితం విమలాఽమ్బరే । 10 ।
సన్నివేశ మథాఽఽదత్తే, తత్తేజః స్వస్వభావతః ।

**10-11.** మూస యందు కరగిన స్వర్ణద్రవము వలె, నిర్మలా ఽఽకాశమున స్ఫురించిన ఆ తేజస్సు, తన స్వభావము వలన, ఒకానొక సన్నివేశమును (ఆకృతిని) పొందుచున్నది.

కాలేన స్ఫుటతా మేత్య, భవత్యమల విగ్రహః । 11 ।
బుద్ధిసత్త్వబలోత్సాహ విజ్ఞానైశ్వర్య సంస్థితః ।*
స ఏవ భగవాన్ బ్రహ్మా, సర్వలోక పితామహః । 12 ।

**11-12.** అది, కాలక్రమమున పరిస్ఫుటమై, నిర్మలాకృతి గలది యగుచున్నది; బుద్ధి, సత్త్వము, బలము, ఉత్సాహము, విజ్ఞానము, ఐశ్వర్యము – అనువాని యందు ప్రతిష్ఠితమగుచున్నది. **ఈ ఆకృతియే, సర్వలోక పితామహుడగు భగవంతుడు బ్రహ్మ.** [ఇట్లు మననశీలమగు మనస్సే స్వశరీరవృద్ధిచే బ్రహ్మపదమును పొందుచున్నది].

సంస్మృత్య సర్వబృన్దాని, సమతీతాన్యనేకశః ।
లీలయా కల్పయత్యేష, చిత్రాః సఙ్కల్పజాః ప్రజాః । 13 ।

**13.** కడచిపోయిన అనేక సృష్టిపరంపరలను సంస్మరించి, ఆ బ్రహ్మ దేవుడు, లీలామాత్రముగ చిత్రవిచిత్రములగు తన సంకల్పములచే, ప్రజలను కల్పించుచున్నాడు.

తాసాం స్వర్గాఽపవర్గాఽర్థం, ధర్మకామాఽర్థ సిద్ధయే ।
అనన్తాని విచిత్రాణి, శాస్త్రాణి సమకల్పయత్ । 14 ।

**14.** వారికి (ఆ ప్రాణులకు) స్వర్గమోక్షముల ప్రాప్తి కొఱకు, ధర్మార్థకామములు సిద్ధించు నిమిత్తము, చిత్రవిచిత్రములైన **అనంతశాస్త్రములను** కల్పించినాడు.

---

★ పోల్చు :- "జ్ఞాన మప్రతిమం యస్య, వైరాగ్యం చ జగత్పతేః ।
ఐశ్వర్యం చైవ ధర్మశ్చ, సహసిద్ధం చతుష్టయమ్" । –
ఇతి స్మృతి ప్రసిద్ధవిశేషణసిద్ధం తస్య దర్శయతి । (యో.వా. తాత్పర్య ప్రకాశము)

సృష్టిరేవ మియం రామ!, సర్గేఽస్మిన్ స్థితి మాగతా ।
సఙ్కల్పజం జగత్పశ్య, సుదీర్ఘస్వప్న ముత్థితమ్ ॥ 15 ॥

15. శ్రీరామా! ఇట్లీ సృష్టి ఈ సర్గము నందు స్థితిని పొందినది. సంకల్పము నుండి ఉద్భవించిన జగత్తును చూడుము. ఇది, దీర్ఘ స్వప్నము నుండి సంభవించినది.

సఙ్కల్పస్యోపశాన్తౌ తచ్ఛామ్యత్యస్నేహదీపవత్ ।
అతో రాఘవ! తత్త్వజ్ఞో, వ్యవహారేషు సంస్థితః ॥ 16 ॥
నష్టం నష్ట ముపేక్షేత, ప్రాప్తం ప్రాప్త ముపాహరేత్ ।

16-17. సంకల్పము ఉపశమింపగా, జగము, తైలరహితమగు దీపము వలె శాంతించుచున్నది. (నశించుచున్నది). కాన, రాఘవా! తత్త్వజ్ఞుడైన వాడు, ప్రపంచ వ్యవహారముల యందు, స్థితుడై, వినష్టమైన పదార్థములను ఉపేక్షింపవలయును; ప్రాప్తించినవానినే సేవింపవలయును.

అనాగతానాం భోగానా మవాఞ్ఛన మకృత్రిమమ్ ॥ 17 ॥
ఆగతానాం చ సంభోగ ఇతి పణ్డిత లక్షణమ్ ।

17-18. స్వభావముగనే అప్రాప్తభోగములను కాంక్షింపకుండుట, ప్రాప్తించిన వానినే అనుభవించుట జ్ఞానులకు లక్షణము.

యస్య వేచ్ఛా న వాఽనిచ్ఛా, జ్ఞస్య కర్మణి తిష్ఠతః ॥ 18 ॥
న తస్య లిప్యతే ప్రజ్ఞా, పద్మపత్ర* మివాఽమ్బుభిః ।

18-19. ఇష్టాఽనిష్టరహితముగ కర్మముల నాచరించు ప్రాజ్ఞుని యొక్క బుద్ధిని పద్మపత్రమును జల మంటనట్లు, కర్మదోషములంటవు.

---

★ పోల్చు :- "వివేకీ సర్వదా ముక్తః, కుర్వతో నాఽస్తి కర్తృతా।
అలేపవాద మాశ్రిత్య, శ్రీకృష్ణ జనకౌ యథా ।
[కఠ – ఉ.II-19 ఆనందగిరి భాష్యటీకా.]

ధర్మాధర్మాది లక్షణమగు సంసారము, అనాత్మజ్ఞవిషయము. ధర్మాఽధర్మాద్యాచరణమున, కర్తృత్వభావము లేనందున, వివేకశాలి యగువానిని కర్మఫలము లంటవు. అలేపవాదము నాశ్రయించి, అతడు, శ్రీకృష్ణ జనకుల వలె సంగరహితముగ కర్మల నాచరించును.

మఱియు :– "బ్రహ్మణ్యాధాయ కర్మాణి, సఙ్గం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన, పద్మపత్ర మివాఽమ్భసా ॥ (భ.గీ.-V-16)

బ్రహ్మము నందు మనస్సును సమాధానపఱచి, కర్మఫలము లందు పైతము సంగమును త్యజించి, కర్మల నాచరించు వానిని, పద్మపత్రమును (తామరాకును) జలమంటనియట్లు, పుణ్య పాప రూపములగు కర్మదోషము లంటవు.

## 2. దాశూరతపః – దాశూరుని తపస్సు

వసిష్ఠ ఉవాచ :–

బహుప్రకారా సా సృష్టి, ర్నాఽస్యాం తు నియమః క్వచిత్ ॥ 19 ॥
జగన్మాయా స్వరూపస్య, వర్ణనావ్యపదేశతః ।
దాశూరాఽఽఖ్యాయికాం రామ!, వర్ణ్యమానాం మయా శృణు ॥ 20 ॥

19-20. వసిష్ఠుడు :–ఈ సృష్టి బహు ప్రకారమైనది; ఇందు ఎచ్చటను నియమ మనునది (నిశ్చితమైన విధానము) లేదు. శ్రీరామా! జగన్మాయా స్వరూపమును వర్ణించు నిమిత్తము, దాశూరోపాఖ్యానమును నీకు వర్ణించి చెప్పెదను; వినుము.

దాశూరాఽఽఖ్యో మునేః పుత్రః, మాగధేషు* వనే వసన్ ।
మాతాపితృవియోగేన, శోకమగ్నో రురోద హ ॥ 21 ॥

21. దాశూరుడను పేరు గల ముని కుమారుడు, మాగధనామకజనపదము నందు, వనమున నివసించుచు, మాతాపితృవియోగవశమున శోకమగ్నుడై విలపించు చుండెను.

తం తదాఽఽశ్వాసయామాసాఽశరీరా వనదేవతా ।
'ఋషిపుత్ర! మహాప్రాజ్ఞ!, కి మజ్ఞ ఇవ రోదిషి'? ॥22॥

22. అపు డతనిని, అదృశ్యరూపిణియగు వనదేవత 'ఋషికుమారా! మహా ప్రాజ్ఞుడవైన నీవు, అజ్ఞాని వలె ఏల ఏడ్చెదవు?' – అని ఓదార్చినది.

'సర్వదైవేదృశీ సాధో! సంసారస్య స్థితి శ్చలా ।
జాయతే జీవ్యతే పశ్చా దవశ్యం చ వినశ్యతి' ॥ 23 ॥

23. 'సౌమ్యుడా! సంసారస్థితి ఎల్లప్పుడును ఇట్లు చంచలస్వభావము గలదియే. (నశ్వరమైనదియే) ప్రాణి పుట్టును, వృద్ధి పొందును, తరువాత, తప్పక నశించి తీరును'.

ఏవ మాశ్వాసితో ధైర్య మాలమ్బ్య కృతవా నసౌ ।
పాశ్చాత్యం పైతృకం కర్మ, తతో బ్రాహ్మేణ కర్మణా ॥ 24 ॥

---
★ "మగధానాం నివాసో జనపదో మాగధః" ।(యో.వా.తా.ప్ర.)

**తపసా శ్రోత్రియో[1] భూత్వా, దృష్ట్వాఽశుద్ధం ధరాతలమ్ ।**
**'ఉగ్రేణ తపసా వహ్నే మా రాద్ధుం శుద్ధమణ్డలమ్ ॥ 25 ॥**

**యతో నాఽప్నోమి వృక్షాణా ముపరిస్థితి రస్తు మే' ।**

**24-26.** ఇట్టు ఓదార్పబడినవాడై, ధైర్యమవలంబించి, మరణానంతర మాచరింప దగిన పితృకర్మల (ఉత్తర క్రియల) నొనర్చి, తపమాచరింప అతడు నిశ్చయించినాడు. బ్రాహ్మములైన(వైదిక)కర్మముల నవలంబించి, తప మాచరించి, శ్రోత్రియుడై, భూతల మంతయు అశుద్ధముగా నుండుట కాంచి, 'ఉగ్ర తపముచే అగ్నిని ఆరాధించుటకు శుద్ధమండలము నాకు లభింప నంత వఱకు, వృక్షాగ్రమునందే నా నివాస మగుకాక!' – అని ఆతడు నిశ్చయించినాడు.

**ఇతి సంప్రార్థ్య సంప్రాప్తే, నీపవృక్షే లతాగృహే ॥ 26 ॥**

**దృఢం పద్మాసనం బద్ధ్వా, దిగ్భ్యః ప్రత్యాహృతాఽఽత్మనా ।**
**అజ్ఞాతపరమార్థేన, దశవర్షాణి తత్ర చ ॥ 27 ॥**

**గవాఽశ్వ నరమేధాద్యైః, మనసైవాఽయజత్ సురాన్ ।**

**26-28.** ఇట్లు కాంక్షించి, సంప్రాప్తమైన కదంబవృక్షమున లతాగృహమును చేరి, దృఢముగ పద్మాసనస్థుడై, దిక్కుల నుండి చిత్తమును మరలించి, **పరమార్థ జ్ఞాన శూన్యుడైన అతడు,** పదిసంవత్సరము లచ్చట మనస్సు చేతనే, గవాఽశ్వ నరమేధాది యజ్ఞములను దేవతల ప్రీత్యర్థము ఆచరించినాడు.

**కాలేనాఽమలతాం[2] యాతే, వితతే తస్య చేతసి ॥ 28 ॥**
**బలాద[3]వతతారాఽవ్యర్థాన మాత్మప్రసాదజమ్ ।**

**28-29.** కొంత కాలమునకు, ఆతని చిత్తము, (రాగాదిదోషశూన్యమై) నిర్మలమై,

(1) శ్రోత్రియత్వం – వేదాధ్యయన, తదర్థవిచారాఽనుష్ఠాన నిష్ఠత్వమ్ ।
(యో.వా. తాత్పర్య ప్రకాశము)

(2) అమలతాం – రాగాదిదోష శూన్యతామ్ ।

(3) బలాత్ – ప్రాగ్జన్మకృత శ్రవణ సంస్కారోద్బోధబలాత్ । (యో.వా. తా.ప్ర.)

విశాలత్వము చెందగా, చిత్తప్రశాంతిజన్యమైన జ్ఞానము,-(పూర్వ జన్మకృత శ్రవణసంస్కారఉద్బోధ) - బలముపలన అంతఃకరణమున అవతరించినది.

## 3. పుత్రప్రబోధనమ్ –

(దాశూరుడు పుత్రునికి జ్ఞానోపదేశము చేయుట)

**వనదేవీ తత స్తంచ, సుతం కాన్త మయాచత I 29 I**
**దాశూరో దయయా తస్మై, పుష్పం దత్త్వా వ్యసర్జయత I**
**అథ దీర్ఘేణ కాలేన, తత్ర సా వన దేవతా I 30 I**
**ద్వాదశాబ్ద ముపాదాయ, సుతంముని ముపాయయౌ I**

30-31. తరువాత, వనదేవత, దాశూరుని, సుందరాంగుడైన పుత్రుని, తనకు అనుగ్రహింపుమని ప్రార్థించినది. దయతో దాశూరుడు, తన చేతనున్న పుష్పము నామె కొసగి పంపినాడు. బహు కాలానంతరము, ఆ వనదేవత, పండ్రెండేండ్ల ప్రాయముగల తన కొడుకును వెంట బెట్టుకొని యచ్చట (ఆ యరణ్యమున) ముని సన్నిధి కేతెంచినది.

**"కృతో మయైష సర్వాసాం, కలానా మపి కోవిదః I 31 I**
**జ్ఞానం త్వస్య భవానేవ, కృప యోపదిశ"త్వితి I**
**తయా ప్రోక్త స్తదా పుత్రం, బహుధైవ మబోధయత్ I 32 I**

31-32. "ఈ నా కుమారుని సర్వకళలలో కోవిదునిగా చేసితిని. కృపతో వీనికి మీరు పరమజ్ఞాన ముపదేశింపవలయును".- అని వనదేవత కోరగా, దాశూరుడు, బహువిధముల జ్ఞానమును కుమారునకు బోధించినాడు.

**దాశూర ఉవాచ :-**

**"స్వోత్థనామా★ నృపః కశ్చి ద్విఖ్యాతో భువనత్రయే I**
**యస్యేమ శాసనం సర్వే, శిరోభి ర్ధారయన్తి చ I 33 I**

33. **దాశూరుడు :-** ముల్లోకములందు ప్రసిద్ధుడైన **స్వోత్థుడను** పేరు గల

---

★ **ఖోత్థ (ఆకాశ సంభవుడు) పా.భే.**
**స్వోత్థః = స్వయంభువుడు- స్వయముగా జనించినవాడు.**

ఒకానొక రాజుండెను. ఆతని ఆజ్ఞలను సర్వులును, (బ్రహ్మాది దేవతలును) శిరసావహించి వర్తించుచుండిరి.

**త్రయ స్తస్య మహాబాహోః, దేహాః విహరణక్షమాః ।**
**జగదాక్రమ్య తిష్ఠన్తి, హ్యుత్తమాఽధమమధ్యమాః ॥ 34 ॥**

34. మహాబాహుడైన ఆ రాజునకు సర్వవ్యవహారవిహారసమర్థములైన ఉత్తమ మధ్యమాఽధమములను **మూడు శరీరములు**, జగముల నాక్రమించి యున్నవి.

**వ్యోమన్యేవ హి జాతోఽసౌ, తత్రైవ చ స్థితిం గతః ।**
**చతుర్దశమహారథ్యం, నగరం తేన నిర్మితమ్ ॥ 35 ॥**

35. అవ్యాకృతాఽఽకాశముననే ఆతడు జనించి, అచటనే స్థితి బొంది, చతుర్దశ (14) విశాలమార్గములు★గల (బ్రహ్మాండరూపమగు) నగరము నాతడు నిర్మించినాడు.

**వాపీ సప్తకభూషాఢ్యం, దీపద్వయ విరాజితమ్ ।**
**నానాఽపవరకాః సృష్టాః, నవద్వారవిభూషితాః ॥ 36 ॥**

36. ఆ నగరము, సప్త (సముద్రములను) కూపములతో, శోభితము; (సూర్యచంద్రులను) రెండు దీపములచే విరాజితము. నవద్వారాలంకృతములైన నానావిధములైన సౌధములు (**అంతర్గృహములు**) అందు సృజింపబడినవి

(అపవరకమ్ - గర్భగృహము)

---

★ చతుర్దశ భువనములు, లేక, చతుర్దశ విద్యలు.
పోల్చు :- పురంజనోపాఖ్యానము – భాగవతము (IV-స్కంధము. 25–28 అధ్యాయములు).
"గృహేషు కూటధర్మేషు, పుత్రదార ధనార్థధీః ।
న పరం విన్దతే మూఢో, భ్రామ్యన్ సంసార వర్త్మసు" ।
(భాగ - IV - 25 -6)

కపటధర్మాత్మకములైన గేహములందు సంసక్తి చెంది, జాయా, తనూజాత, ధనాదికములే, భూరిపురుషార్థములుగ బుద్ధి తలచుచు, మూఢుడు (మతివిహీనుడైన మనుజుడు), సంసారమార్గము లందు పరిభ్రమించుచు, పరమశ్రేయోరూపమగు మోక్షపదము పొందజాలడు.

**తేష్వస్త ర్వివిధాం క్రీడాం, కరోత్యేష మహీపతిః ।**
**నిర్మాయాఽన్యత్ పురం గత్వా, తత ఉత్థాయ ధావతి ॥ 37 ।**

37. సౌధాంతరములందు ఆ రాజు, అనేకవిధములైన క్రీడలొనరించు చుండును. మఱియొక పురమును నిర్మించి, అచట కేగి మరల అందుండి లేచి, పరుగెత్తుచుండును.

**స్వేనైవ వ్యవహృత్యాఽసౌ, కదాచి త్పరిభూయతే ।**
**ముదమేతి కదాచిచ్చ, దుఃఖితోఽస్మీతి శోచతి ॥ 38 ।**

38. ఒకప్పుడు తన వ్యవహారముచేతనే తాను పరిభవింపబడుచుండును; మఱియొకప్పుడు ముద మొందుచుండును. మఱియు, దుఃఖితుడ నైతినని శోకించుచుండును.

4. సఙ్కల్పప్రభావః – మనోవ్యాపారప్రభావము

**పుత్ర ఉవాచ :–**

**"క ఏష భవతా ప్రోక్తః, స్వోత్థ నామా మహీపతిః " ।**

**పుత్రుడు :–** "పూజ్యులైన మీరు పేర్కొన్న స్వోత్థుడను పేరు గల ఆ రాజెవ్వడు"?

**దాశూర ఉవాచ :–**

**"ఇదం సంసారసంస్థాన, మేవం తే కథితం మయా ॥ 39 ।**

39. **దాశూరుడు :–** "ఈ సంసారస్వరూప మిట్లు, నీకు నేను (పరోక్షరూపమున) వర్ణించి, చెప్పితిని.

**పరమాన్నభసో జాతః, సఙ్కల్పః స్వోత్థ ఉచ్యతే ।**
**జాయతే స్వయ మేవాఽసౌ, స్వయ మేవ విలీయతే ॥ 40 ।**

40. అవ్యాకృతాఽఽకాశమునుండి (పరమాఽఽకాశమునుండి) ఉద్భవించిన **సంకల్పమే** – (సంకల్పప్రధానమైన మనస్సే) – **స్వోత్థు** డనబడును. అతడు స్వయముగ పుట్టి, స్వయముగనే వినాశము నొందును.

శూన్యే వ్యోమని తేనేదం, నిర్మితం త్రిజగత్పురమ్ ।
చతుర్దశాఽత్ర[1] లోకా హి, దీపౌ చన్ద్రదివాకరౌ ॥ 41 ॥

**41.** శూన్యమగు పరమాఽఽకాశమున (జగత్సత్తారహితమగు బ్రహ్మము నందు), సంకల్పమయమగు ఈ మనస్సు చేత, త్రిలోకనగరము నిర్మింపబడినది. చంద్రసూర్యులే అందు (చల్లని, వెచ్చని) రెండు దీపములు.

క్రీడార్థ మాత్మనః చిత్రా, దేహాఽవసరకాః కృతాః ।
స్వయైవ చేష్టయా దుఃఖీ, సుఖీ చైవ స్వచేష్టయా ॥ 42 ॥

**42.** తనకు క్రీడార్థమై అతడు (ఈ సంకల్ప రూపమగు మనస్సు) విచిత్రములగు దేహరూపసౌధములను నిర్మించుకొన్నాడు; తనచేష్టల చేతనే, దుఃఖితుడు, సుఖియు నగుచున్నాడు.

తమః, సత్త్వం, రజశ్చేతి, తస్య దేహాః త్రయః స్మృతాః ।
తమోరూపో హి సఙ్కల్పో, నిత్యప్రాకృతచేష్టయా ॥ 43 ॥
పరాం కృపణతా మేత్య, ప్రయాతి కృమికీటతామ్ ।

**43-44.** తమస్సు, సత్త్వము, రజస్సు, అని అతనికి మూడు దేహములు కలవు. ప్రాకృత (స్వాభావిక) క్రియలచే, నిత్యము తమోగుణ రూప సంకల్పము కల్గుచున్నది. దాని వలన, పరమదైన్యమును పొంది, క్రిమికీట స్థావరాది యోనుల ప్రాపించుచున్నాడు.

సత్త్వరూపో హి సఙ్కల్పో, ధర్మజ్ఞానపరాయణః[2] ॥ 44 ॥
అదూరకేవలీభావం, స్వారాజ్య[3] మధితిష్ఠతి ।

(1) చతుర్దశ లోకములు— పురాణముల ననుసరించి భూమికిపైన, ఏడు (ఊర్ధ్వ) లోకములు క్రింద, ఏడు (అధో) లోకములు కలవు. ఈ సముదాయ మంతయు స్వర్గ, మర్త్య, పాతాళములను విశాల విభాగములతో కూడిన విశ్వముగ, వర్ణింపబడినది.

(2) అధ్యవసాయో బుద్ధి ర్ధర్మో జ్ఞానం విరాగ ఐశ్వర్యమ్ । సాత్త్విక మేతద్రూపమ్ ।
(సాంఖ్యకారిక–28)

(3) "అదూర కేవలీ భావం, సన్నిహిత మోక్షం, స్వారాజ్యం, హైరణ్యగర్భ భావాఖ్య దేవతా పదమ్" – (యో.వా.తా.ప్ర.)

**44-45.** సత్త్వగుణ రూపమైన సంకల్పము, ధర్మజ్ఞానములందు ఆసక్తి కలదియై యుండును. దీనివలనసన్నిహితకేవలీభావమైన (మోక్షరూపమైన) స్వారాజ్యము పొందుచున్నాడు.

**<u>రజోరూపో</u> హి సఙ్కల్పో, లోకసంవ్యవహారవాన్ ॥45॥**
**పరితిష్ఠతి సంసారే, పుత్రదారాఽను రఞ్జితః । ★**

**45-46.** రజోగుణరూపమైన సంకల్పమువలన, మనుష్యజన్మము నెత్తి, తదుచితమగు లోకవ్యవహారముల నాచరించుచు, భోగవాసనలతో పుత్రదారధనాదులచే, ప్రమోదమును పొందుచు, జనన మరణ రూపమగు సంసారమున నుండును.

**<u>త్రివిధం తు పరిత్యజ్య, సఙ్కల్పం పర మశ్నుతే । 46 ।</u>**
**<u>సఙ్కల్పస్య లయః కార్యః</u>, నియమ్య మనసా మనః ।**

త్రివిధములైన సంకల్పముల **పరిత్యజించి,** అతడు (మనోరూపుడగు జీవుడు), పరమపద రూపమైన **మోక్షమును** బొందుచున్నాడు. మనస్సును, మనస్సు చేతనే, వశపఱచుకొని, **సంకల్పము** అన్నిటిని క్షయింప **జేయుటయే, కర్తవ్యము.**

**యది వర్షసహస్రాణి, తపశ్చరతి దారుణమ్ । 47 ।**
**నాఽన్యః కశ్చిదుపాయోఽస్తి, సఙ్కల్పోపశమా దృతే ।**
**నిస్సఙ్కల్పో యథాప్రాప్తవ్యవహారపరో భవ ! । 48 ।**

**47-48.** వేల కొలది సంవత్సరములు ఘోరమగు తప మొనరించినను, **సంకల్ప క్షయమున తప్ప, మోక్షమునకు అన్యోపాయ మేదియును లేదు.** సంకల్పరహితుడవై ప్రాప్తించిన వ్యవహారముల నాచరింపుము.

**చిదచేత్యోన్ముఖత్వం హి, యాతి సఙ్కల్పసంక్షయే ।**
**వికల్పజాల ముత్సృజ్య, ప్రాప్యతే సుఖమద్వయమ్" । 49 ।**

---

★ **పోల్చు–** భ.గీ. - XIV - 14, 15, 16, 17.
**ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా, మధ్యే తిష్ఠన్తి రాజసాః ।**
**జఘన్య గుణవృత్తిస్థా, అధోగచ్ఛన్తి తామసాః ।** (భ.గీ.- XIV - 18)
**సత్త్వగుణ ప్రధానులు, దేవలోకములందును, రజోగుణప్రధానులు మనుష్య లోకమునందును, ప్రమాదాలస్యనిద్రాదియుతులు, తమోగుణప్రధానులగు మూఢులు, పశుపక్ష్యాది యోనులందును జన్మమందుచున్నారు.**

49. సంకల్పములు క్షయింపగా, చిదాత్మ, దృశ్యములను విషయముల నుండి పరాఙ్ముఖమగును; అనిశ్చితభ్రమజాలము(వల)ను, దూరముగ విసర్జించి, అద్వయమైన సుఖమును ప్రాప్తించును"

**పుత్ర ఉవాచ :-**

**"కీదృశ స్తాత! సఙ్కల్పః?, కథ ముత్పద్యతే చ సః? ।**
**కథం చ వృద్ధి మాయాతి?, కథం చైష వినశ్యతి"? । 50 ।**

50. పుత్రుడు :- "తండ్రీ! ఆ సంకల్పమెట్టిది? అది ఎట్లు ఉత్పన్నమై, వృద్ధి బొందుచున్నది? ఎ ట్లది వినాశ మందుచున్నది?"

**దాశూరోవాచ :-**

**"అనన్తస్యాఽఽత్మతత్త్వస్య, సత్తాసామాన్యరూపిణః ।**
**చితః చైత్యోన్ముఖం యత్తత్, తత్, సఙ్కల్పాఽఙ్కురం విదుః ।51।**

51. దాశూరుడు :- "కుమారా! అనంతమును సత్తాసామాన్యరూపమును నగు ఆత్మతత్త్వము యొక్క చైతన్యము (చిచ్ఛక్తి) **విషయోన్ముఖ (సంసారోన్ముఖ)** మగుటయే, సంకల్పము యొక్క **అంకురమని** జ్ఞానులెఱుగుదురు.

**భావయన్తీ చితిః చైత్యం, వ్యతిరిక్త మివాఽఽత్మనః ।**
**సఙ్కల్పతా ముపాఽఽయాతి, బీజ మఙ్కురతా మివ । 52 ।**

52. ఈ చిచ్ఛక్తి, చైత్యమును (విషయ రూపమును) తన కంటె భిన్నముగ భావించుచు, బీజ మంకురత్వమును బొందునట్లు, సంకల్ప రూపమును బొందుచున్నది.

**సఙ్కల్పేన హి సఙ్కల్పః, స్వయ మేవ ప్రజాయతే ।**
**వర్ధతే స్వయమేవాఽఽశు, దుఃఖాయ న సుఖాయ తు । 53 ।**

53. సంకల్పము చేతనే సంకల్పము, స్వయముగ జనించును; స్వయముగ శీఘ్రమే వృద్ధి పొందును. ఇది దుఃఖము నిమిత్తమే కాని, సుఖ నిమిత్తము కాదు. [మూలాంకురముల నుండి శాఖాంకురము వలె, బాహ్య విషయాకార

సంకల్పపరంపరచే, సంకల్పము, స్వయముగ అభివృద్ధి చెందును]

**భావనాఽభావమాత్రేణ,[1] సఙ్కల్పః క్షీయతే స్వయమ్ ।**
**తణ్డులస్య యథా చర్మ, నశ్యతి క్రియయా సుత ! ॥ 54 ॥**
**జీవస్య సహజోఽప్యేషః, నశ్యత్యేవ న సంశయః ।"**

**54-55.** (పూర్వానుభూతసుఖదుఃఖాది) భావనలయొక్క అభావనచేతనే (స్మరింపకుండుట చేతనే) సంకల్పము, తనంత తానే క్షయించును. కుమారా! బియ్యముపైని ఊక (బియ్యమును దంచుటయను) క్రియచే నశించుచున్నట్లే, జీవునకు సహజమైనను, ఈ సంకల్పము తప్పక నశించును; సందేహము లేదు."

**వసిష్ఠ ఉవాచ :–**

**దాశూరాఖ్యాయికైషా తే, కథితా చిన్త్యతాం త్వయా[2] ॥ 55 ॥**

---

(1) **స్మృతేర్హి పూర్వభావే తదుపాదాన హానాద్యర్థం సఙ్కల్పోదయః స్యాదేవేతి భావః ।**
పూర్వానుభూత సుఖదుఃఖాది భావముల స్మరించుట వలన, వాని కారణ వినాశముల కొఱకై, సంకల్పముదయించుచున్నది. ఈ భావనలు అభావము కాగా, అఖండమైన శుద్ధ చైతన్యము మాత్రమే మిగులుచున్నది. (యో.వా. తాత్పర్య ప్రకాశము)

(2) ఘోర తపశ్చరణము, వేదోక్తయజ్ఞాచరణము – ఇవి ఏవియు, శాంతిని ప్రసాదింపజాలవు. తపో యజ్ఞాదికర్మల వలన అతిశయలాభ మేదైన నున్న దన్నచో, అది కేవలము బుద్ధిని పరిశుద్ధ మొనర్చుట మాత్రమే! అదియు, వానిని వివేకపూర్వకముగ, స్వార్థరహితముగ (ఫలాభిసంధి రహితముగ) నాచరించినపుడు మాత్రమే, సిద్ధింపగలదు. నిత్యాఽనిత్య వస్తు విచార పూర్వకముగు పరతత్త్వధ్యానము చేత మాత్రమే, ఆత్మజ్ఞాన ముదయించునని ఈ దాశూరోపాఖ్యానము నిర్దేశించుచున్నది.
పోల్చు :- "ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపాః" । (ముం.ఉ.I-2-7.)
జ్ఞాన రహిత యజ్ఞ యాగాది కర్మ సముదాయము, నిస్సారము, దుఃఖమునకు మూలభూతమునని శ్రుతి వచనము. [చూడు :- బుద్ధదర్శనము–డా॥ రత్నాకరం బాలరాజు 1995 – పుట–100–102]
"చిత్తస్య శుద్ధయే కర్మ, న తు వస్తూపలబ్ధయే ।
వస్తుసిద్ధి ర్విచారేణ న కించిత్కర్మ కోటిభిః । (వి.చూ. 11 – శంకరుడు)
కేవలకర్మకలాపాసక్తి (సీలబ్బత పరామాస) దశవిధ సంయోజనములలో నొకటి యని గౌతమబుద్ధుని బోధ. సంయోజన మనగా భవ–(సంసార)–చక్రమునకు, జీవుల బంధించునదియని అర్థము.
చూడు :- ధమ్మపదం – 90 గాథ – పాదటీక – డా॥ రత్నాకరం బాలరాజు – 1994.

55. వసిష్ఠుడు :— దాశూరుని కథ నీకు చెప్పబడినది. దీనిని నీవు విచారింతువు గాక!

5. వాసనాత్యాగః – మానసిక సూక్ష్మ సంస్కార పరిత్యాగము

కర్తృతాఽకర్తృతా చోభే, విద్యేతే పరమాత్మని ।
సర్వస్థోఽహ మకర్తేతి, దృఢభావనయా ఽనఘ! ॥ 56 ॥
ప్రవాహపతితం కార్యం, కుర్వన్నపి న లిప్యతే ।

56-57. కర్తృత్వము, అకర్తృత్వము అను ఈ రెండును పరమాత్మ యందున్నవి. పాపరహితుడవగు శ్రీరామా! నేను సర్వభూత స్థితుడను; అ కర్తను, - అను దృఢభావనచే, ప్రవాహపతితమైన, అనగా తనంతటనే ప్రాప్తించిన – చేయవలసిన కార్యమును ఆచరించుచున్నను, మనుజుడు, కర్మలచే లిప్తుడు కాడు.

అథ 'సర్వం కరోమీ'తి, మహాకర్తృతయా తయా ॥ 57 ॥
యదీచ్ఛసి స్థితిం రామ! తత్ తామప్యుత్తమాం విదుః ।

57-58. శ్రీరామా! కాని, 'అంతయు నేనే చేయుచున్నా' నను మహాకర్తృత్వ భావమునందు స్థితి బొందుటకు నీవు కాంక్షించినచో, అదియును ఉత్తమస్థితియని జ్ఞాను లెఱుగుదురు.

అథవా సర్వకర్తృత్వ మకర్తృత్వం చ రాఘవ ! ॥ 58 ॥
సర్వం త్యక్త్వా మనః పీత్వా, సత్తామాత్రః స్థిరోభవ ।

58-59. లేక, రాఘవా! కర్తృత్వాఽకర్తృత్వముల నన్నిటిని త్యజించి, మనస్సును లయింపజేసి, సత్తామాత్రస్వరూపమున (కేవల సత్స్వరూపమున) స్థిరుడవు కమ్ము.

సవ్యాజ్యా సా ప్రయత్నేన, దేహోఽహమితి యా స్థితి : ॥ 59 ॥
బన్ధో హి వాసనాబన్ధో, మోక్షస్స్యా ద్వాసనాక్షయః ।
వాసనాం తాం పరిత్యజ్య, మోక్షాఽర్థిత్వమపి త్యజ ॥ 60 ॥

59-60. దేహమే నేను అను బుద్ధిస్థితి, ప్రయత్నముతో త్యజింపదగినది. వాసనా

బంధమే నిజముగ బంధము; వాసనాక్షయమే మోక్షము. ఈ వాసనను పరిత్యజించి, మోక్షాసక్తిని సైతము విడనాడుము.

**తామసీవాసనాః పూర్వం, త్యక్త్వా విషయవాసితాః ।**
**మైత్ర్యాది భావనానామ్నీః*, గృహాణాఽమలవాసనాః ॥ 61 ॥**

61. మొదట, విషయసుఖవాసితములు, తమోగుణప్రధానములునైన అశుభావాసనల త్యజించి, మైత్ర్యాదిభావన లనబడు నిర్మలశుభ వాసనల గ్రహింపుము.

**తా అప్యన్తః పరిత్యజ్య, తాభిః వ్యవహరన్నపి ।**
**అన్తః శాన్తసమస్తేహో, భవ! చిన్మాత్ర వాసనః ॥ 62 ॥**

62 మైత్ర్యాది శుభవాసనలతో వ్యవహరించుచు, క్రమముగ వానిని సైతము విడనాడి, అంతఃకరణమున కోరికలనన్నిటిని ఉపశమింపజేసి, నేను చిన్మాత్రుడనే యన్న చిన్మాత్రవాసనాసహితుడవు కమ్ము!

---

★ చూడు :- పతంజలి యోగదర్శనము –

"మైత్రీ, కరుణా, ముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాఽపుణ్య
విషయాణాం భావనాతశ్చిత్త ప్రసాదనమ్ ।　(I-33).

సుఖవంతుల విషయమున మైత్రిని, దుఃఖితుల యందు కరుణను, పుణ్య క్రియల యందు ముదిత (సంతుష్టత)ను, కుబుద్ధుల యందు ఉపేక్ష (ఉదాసీనత)ను, ధ్యానించు (భావించు)ట వలన, రాగలోభాదిదోషాదులచే కలుషితమైన అంతరాత్మ, ప్రసన్నతను బొందుచున్నది. బుద్ధభగవానుడీ మైత్ర్యాదులను బ్రహ్మవిహారములని వర్ణించినాడు.

చూడు :- బుద్ధ దర్శనము పుట 108 –

డా॥ రత్నాకరం బాలరాజు. (1995) మఱియు, సుత్తనిపాతము – మెత్త సుత్తం – 8.

"మెత్తం చ సబ్బలోకస్మిం, మానసం భావయే అపరిమాణం ।
ఉద్ధం అధో చ తిరియం చ, అసంబాధం అవేరం అసపత్తం" ।

విద్వేషశత్రుత్వరహితముగ, సర్వలోకములందును, ఊర్ధ్వముఖముగ, అధోముఖముగ, తిర్యఙ్ముఖముగ అపరిమాణ (విస్తృత) మైత్రీభావనను అబాధకముగ భావింపవలయును – అనుష్ఠింపవలయును.

"మైత్ర్యాదివాసనాలభ్యా :–" మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష– అను ఈ వాసనా చతుష్టయము – ఈ గుణములు – గల వారికి సులభముగ పరదేవత ప్రసన్నురాలగునని లలితా సహస్రనామావళి. (570)

**తా మప్యథ పరిత్యజ్య, మనోబుద్ధిసమన్వితామ్ ।**
**శేషే స్థిరసమాధానో, యేన త్యజసి తత్త్యజ(1) ॥ 63 ॥**

63. పిమ్మట, మనోబుద్ధియుక్తమగు ఆ చిన్మాత్రవాసనను సైతము పరిత్యజించి, శేషించియున్న ఆత్మ స్వరూపమునందు, సుస్థిర విశ్రాంతి పడసిన వాడవై, దేని చేత అనగా, ఏ అహంకారము చేత వెనుక చెప్పబడిన సర్వవాసనలను త్యజింతువో, అద్దానిని (ఆ యహంకారమును)సైతము త్యజింపుము.

**సమాధి మథ కర్మాణి, మా కరోతు కరోతు వా ।**
**హృదయేనాఽస్త సర్వాఽఽస్థో, ముక్త ఏవోత్తమాఽఽశయః ॥ 64 ॥**

64. హృదయమున సమస్తాఽపేక్షలును అస్తమించిన శుద్ధాంతఃకరణుడైన మనుజుడు, సమాధినిష్ఠుడై యున్నను, లేక, కర్మల నాచరించినను, ముక్తుడే యగును. (అభ్యాసపరిపాకవశమున, ఉత్తమజ్ఞాన(సప్తమ) భూమికారూఢుడైన సిద్ధపురుషునకు,కృతకృత్యతయేగాని, కర్తవ్యాంతర శేషముండదు)

**నైష్కర్మ్యేణ న తస్యాఽర్థో, న తస్యాఽర్థోఽస్తి కర్మభిః(2)।**
**సమ్యక్ వాసనాత్మనా దృతే నాఽస్త్యుత్తమం పదమ్ (3) ॥ 65 ॥**

(1) మనోబుద్ధులకు అతీతమైన చరమసత్యము - (అఖండచైతన్యస్వరూపము) - యొక్క సాక్షాత్కారము, "నేతి, నేతి" (ఇది కాదు, ఇది కాదు), అని సకలమానసిక ప్రయత్నమును, సంకల్పములను నిషేధించి, చింతనాసంకల్పభూమి నతిక్రమించు సత్తామాత్రమగు శుద్ధ చైతన్యమున మనుజుడు, తన్ను ప్రతిష్ఠించుకొనుటవలననే సాధ్యపడునన్న వేదాంతసత్యమును, గూఢార్థ యుక్తమునగు ఈ దాశూరోపాఖ్యానము నిరూపించుచున్నది.

(2) పోల్చు :- "నైవ తస్య కృతేనాఽర్థో, నాఽకృతేనేహకశ్చన ।
న చాఽస్య సర్వభూతేషు, కశ్చిదర్థ వ్యపాశ్రయః ॥" (భ.గీ. III-18)
పరమాత్మరతుడైన వానికి, కర్మానుష్ఠానము వలన ప్రయోజనము లేదు. కర్మ మొనర్పకున్నను అతనికెట్టి ప్రత్యవాయము కలుగదు. బ్రహ్మాదిస్థావరపర్యంతము గల ఏ ప్రాణి తోడను అతనికి ప్రయోజన సంబంధము (ఆశ్రయింపవలసిన పని) లేదు.

(3) "తస్మాద్బ్రాహ్మణః పాణ్డిత్యం నిర్విద్య, బాల్యేన తిష్ఠాసే ద్బాల్యం చ పాణ్డిత్యం నిర్విద్యాఽథ, ముని, రమౌనం చ మౌనం చ నిర్విద్యాఽథ బ్రాహ్మణః ॥" - (బృ.ఉ. III-5-1)
ఈషణాత్రయమును పరిత్యజించి బ్రహ్మవేత్త, పాండిత్యగర్వమును విసర్జించి, రాగద్వేషశూన్యుడైన బాలుని వలె చరించవలెను. బాల్యమును -(మూర్ఖతను)-. పాండిత్యమును విసర్జించి, వానిపై నిర్వేదమంది, ముని కావలెను, మౌనామౌనములు రెంటిని విడనాడి, విరాగియైన వాడే బ్రాహ్మణుడు. ఇచ్చట భాష్యకారుడు శంకరుడు, వేఱు విధముగ వ్యాఖ్యానించినాడు.

**65.** వాసనారహితచిత్తునకు, నైష్కర్మ్యము చేతగాని, కర్మలచే గాని, ఏ విధమైన ప్రయోజనమును లేదు. వాసనా త్యాగ రూపమగు మౌనమున★ కంటె ఉత్తమమైన పదము లేదు.

న కేచన జగద్భావాస్తత్త్వజ్ఞం రఞ్జయన్త్యమీ ।
బార్హస్పత్యః కచః, పూర్వం సమాధేః ఉత్థితో జగౌ ॥ 66 ॥

**66.** వైరాగ్యదార్ఢ్యమున భోగవాసనారహితశుద్ధాంతఃకరణుడైన తత్త్వజ్ఞునికి జగత్తు నందలి యేపదార్థములును (లోకపాలోప భోగ్య త్రైలోక్యరాజ్యాది జగద్భావములుసైతము) రంజింపజేయజాలవు. పూర్వము, బృహస్పతిపుత్రుడైన కచుడు, యోగ సమాధిని విరమించి లేచినపుడు, ఈ గాథల నుచ్చరించినాడు.

కచుని గాథలు

"కిం కరోమి?, క్వగచ్ఛామి?, కింగృహ్ణామి?, త్యజామి కిమ్ ? ।
ఆత్మనా పూరితం విశ్వం, మహాకల్పాఽమ్బునా యథా ॥ 67 ॥

న తదస్తి న యత్రాఽహం, న తదస్తి న యన్మయి ।
కి మన్య దభివాఞ్ఛామి?, సర్వం సంవిన్మయం స్థితమ్" ॥ 68 ॥

**67-68.** "నేనేమి చేయుదును? ఎటకేగెదను? దేనిని గ్రహింతును? దేనిని త్యజింతును? మహాప్రళయకాలజలమున వలె, విశ్వమంతయు ఆత్మచేత నిబిడమై పరిపూర్ణమై యున్నది. నేను లేని చోటు లేదు. నా యందు లేని పదార్థము లేదు. ఇతరమును దేనిని నేను అభిలషింతును? సమస్తమును శుద్ధచైతన్యపరిపూర్ణమై యున్నది." (ఆరూఢుడగు బ్రహ్మవేత్త యొక్క పదము పూర్ణము; సార్వాత్మ్య స్థితి బోధకమనుట నీ గాథలు వివరించుచున్నవి.)

---

పండిత భావము - ఆత్మ జ్ఞానము (పాణ్డిత్యమ్) 'నిర్విద్య' - అనగా నిశ్శేషముగ తెలిసికొని, జ్ఞానబలభావమున (బాల్యేన) బ్రహ్మవేత్త యుండును. ఈ జ్ఞానబలభావమును (బాల్యమ్), ఆత్మ జ్ఞానమును (పాణ్డిత్యమ్) పూర్ణముగ పొంది (నిర్విద్య), మౌని కావలెను. పరబ్రహ్మమున కంటె అన్యమేదియు లేదని, మననము (నిదిధ్యాసనము) చేయుటయే మౌనము. అట్టి మౌనమును నిశ్శేషముగ ప్రాపించి (నిర్విద్య), బ్రహ్మాఽభిన్నాఽఽత్మసాక్షాత్కృతిని బొందుచున్నాడు. అతడే బ్రాహ్మణుడు. (శం.భా.బృ.ఉ.III-5-1)

★ పోల్చు :- "యతో న వేదా మనసా సహైవ
మనుప్రవిశన్తి తతోఽథ మౌనమ్ ।
యత్రోత్థితో వేదశబ్దస్తథాఽయం,

**యే హి రాఘవ ! సత్త్వస్థాః, రమన్తే శిష్టవర్త్మని ।**
**సమాః సమరసాః సౌమ్యాః, సతతం సాధువృత్తయః । 69 ।**

69. రాఘవా! (శ్రీరామా!) సత్త్వగుణమున ప్రతిష్ఠితులైనవారు, ధర్మ పథమున నానందింతురు. వారు, సర్వావస్థలయందును సములు, సమరసులు, సౌమ్యులు, సతతము సాధువర్తనులుగా నుందురు.

**తేషాం పదం మహాబాహో!, ఽ నుగన్తవ్యం హి సర్వదా ।**
**'కోఽహం? కథ మిదం'? చేతి, ప్రయత్నేన విచార్యతామ్ । 70 ।**

70. మహాబాహుడవైన శ్రీరామా! సర్వదా, వారిపదన్యాసము, అనుసరణీయము. 'నేనెవడను? దృశ్యమానమగు ఈ జగ మెందుండి జనించినది?' - అని ఇట్లు ప్రయత్నముతో విచార మొనరింపవలెను.

**తామసీ రాజసీ చైవ, జాతి మన్యామపి శ్రితాః ।★**
**స్వవివేకవశా ద్యాన్తి, సన్తః సాత్త్విక జాతితామ్ । 71 ।**

71. **తామసరాజసగుణసంజాతులు, మఱియు ఇతరులును, స్వవివేక ప్రభావవశమున, సాత్త్విక జాత్యవస్థను పడయగలరు.**
(నిరుపమాన పౌరుషము నాశ్రయించి, తపమున క్రమముగ, కామ క్రోధాది (తామస రాజస) చిత్త వికారముల జయించి, జీవన్ముక్త స్థితికి, (బ్రహ్మర్షిత్వమునకు), పరిణమించిన విశ్వామిత్ర మహర్షి జీవితము, దీనికి దృష్టాంతము.)

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'దాశూరోపాఖ్యానం' నామ దశమః సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున
'దాశూరోపాఖ్యాన'మను దశమ (పదియవ) సర్గము సమాప్తము.



ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।

---

**స తన్మయత్వేన విభాతి రాజన్ !"। (సనత్సుజాతీయము)**
వేదములు మనస్సుతో సహా, పరమాత్మను పొందజాలని కారణమున, పరమాత్మ మౌనమని వర్ణింపబడినాడు. శాస్త్రయోనియగు పరమాత్మ, వేదమయుడై జ్యోతిర్మయుడై ప్రకాశించు చున్నాడు.

★ **పోల్చు :- భ.గీ. XIV - 17. త్రిగుణ స్వరూపవివరణము**
**"సత్త్వాత్సం జాయతే జ్ఞానం, రజసో లోభ ఏవచ ।**
**ప్రమాదమోహౌ తమసో, భవతోఽజ్ఞానమేవ చ. ।**
సత్త్వగుణము నుండి సుఖహేతువగు జ్ఞానము, రజోగుణము నుండి దుఃఖహేతువగు లోభము, తమోగుణము నుండి అవివేకము – (అనవధానత), విమూఢత్వమును కలుగుచున్నవి.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవా౽వ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ఏకాదశసర్గము

## జనకోపాఖ్యానమ్ – జనకుని వృత్తాంతము

### 1. సిద్ధగీతాశ్రవణమ్ – సిద్ధుల గీతముల నాలకించుట

వసిష్ఠ ఉవాచ :–
సమస్తం ఖల్విదం బ్రహ్మ, సర్వ మాత్మేద మాతతమ్ ।
అహ మన్య దిదం చా౽న్య దితి భ్రాన్తిం త్యజా౽నఘ ! ।1।

1 వసిష్ఠుడు :– పాపరహితుడవగు శ్రీరామా! సమస్తమును బ్రహ్మమే. వ్యాపించి యున్న ఈ సర్వమును ఆత్మయే. కాన, 'నేను వేఱు, ఇది వేఱు' ( నాకంటె భిన్నమైనది) – అను భ్రాంతిని విడనాడుము.

తతో బ్రహ్మఘనే నిత్యే, సంభవన్తి న కల్పనాః ।
యథాప్రాప్తా౽నుభవనాత్, సర్వత్రా౽నభివాఞ్ఛనాత్ ।2।
త్యాగా౽౽దాన పరిత్యాగాత్, విజ్వరో భవ రాఘవ ! ।

2-3. శ్రీరామా! నిత్యము, ఘనము (దేశకాలవస్తుపరిచ్ఛేదశూన్యము) నగు బ్రహ్మమున, ఏ కల్పనలును, ఉదయింపవు. యథా ప్రాప్తములైన

వాని ననుభవించుచు, సర్వత్ర, సర్వవేళల, వాంఛారహితుడవై, ఏ పదార్థమును గ్రహింపని వాడవు, పరిత్యజింపనివాడవునై, (గ్రహణ త్యాగ వివర్జితుడవై) జ్వరవిముక్తుడవు (దుఃఖతాపరహితుడవు) కమ్ము.

**యస్యేదం జన్మ పాశ్చాత్యం, విద్యా హి విమలా తథా ॥ 3 ॥**
**ఆర్యతా, హృద్యతా, మైత్రీ, సౌమ్యతా, ముక్తతా,[1]జ్ఞతా ।**
**సమాశ్రయన్తి తం నిత్యం, సర్వే వాఞ్ఛన్తి తం జనాః ॥ 4 ॥**

**3-4.** ఎవని కీ జన్మము అంతిమ జన్మమో, ఎవని జ్ఞానము విమలమో, అట్టి వానిని, ఆర్యత్వము, హృద్యత్వము, మైత్రి, సౌమ్యత్వము, (కరుణ) ముక్తత్వము, జ్ఞానము, మున్నగు గుణములు, నిరంతర మాశ్రయించును. జను లందఱు అతనిని కాంక్షింతురు.

**ఏష తావత్క్రమః ప్రోక్తః,సామాన్యః సర్వదేహినామ్ ।**
**ఏష ఏవ గురుప్రోక్తా దనుష్ఠానాచ్ఛనైః శనైః ॥ 5 ॥**
**జన్మనా జన్మభి ర్వాఽపి సిద్ధిదః సముదాహృతః ।**

**5-6.** శ్రీరామా! సర్వజీవసామాన్యమైన-ఈ క్రమమును (అధ్యాత్మ సాధనను) వివరించితిని. గురూపదిష్టమార్గము ననుష్ఠించుటచేత, మెల్ల మెల్లగ, ఒక జన్మమున గాని, బహుజన్మములవలన గాని, ఇది, సిద్ధిని కలుగజేయునని చెప్పబడినది. **(ఇది మొదటి పద్ధతి).**

**ద్వితీయః స్వాత్మనైవాఽఽశు, కించి ద్వ్యుత్పన్నచేతసామ్ ॥ 6 ॥**
**భవతి జ్ఞానసంప్రాప్తిః, ఆకాశఫలపాకవత్ ।[2]**

**6-7.** రెండవదిగా, కించిత్పరిపక్వచిత్తము గల వారికి, దైవోపనీత జీవజగత్తత్త్వ విచారము చేత స్వయముగనే, శీఘ్రముగ **ఆకాశఫలప్రాప్తి వలె, ఆకస్మికముగ** జ్ఞానము సంప్రాప్తించుచున్నది.

---

(1) కరుణా – పా.భే.
(2) పోల్చు :– చిత్తే సత్త్వే త్పత్తౌ, తటిదివ బోధోదయో భవతి ।
తర్హ్యేవం స స్థిరః స్యాద్యది చిత్తం శుద్ధముపయాతి ॥
(శంకరుడు–ప్రబోధసుధాకరము–166)
చిత్తము సత్త్వగుణ సంపన్న మైనంతనే, మెఱుపు వలె, ఆత్మజ్ఞానము సిద్ధించును. చిత్తము పరిశుద్ధమగు కొలది, ఆ జ్ఞానము స్థిరత్వమున నెలకొనును.
మఱియు –
"చిత్తే హ్యాదర్శవద్యస్మాచ్ఛుద్ధే విద్యా ప్రకాశతే ।
యమైర్నిత్యైశ్చ, యజ్ఞైశ్చ, తపోభిస్తస్యశోధనమ్ ॥" (శంకరుడు – ఉపదేశసాహస్రి-XVII-22)
చిత్తము, అద్దము వలె, నిర్మలమైనపుడు, అందు, జ్ఞానము (విద్య) ప్రకాశించును. కాన, నిరంతరము యమ, నియమ, యజ్ఞ, తపస్సుల చేత, చిత్తమును పరిశుద్ధ మొ[illegible]చుకొనవలెను.

అత్రేదం శృణు వృత్తాన్తం, జనకస్య మహీపతేః ॥ 7 ॥
ఏకదోపవనే రమ్యే, ఏకాన్తే విచచార సః ।
తత్ర శుశ్రావ సంఛన్నైః, సిద్ధై ర్గీతా మహాత్మభిః । 8 ।

7-8. ఈ విషయమును నిరూపించు జనకరాజుయొక్క వృత్తాంతము నాలకింపుము. ఒకప్పుడా రాజు వసంతసమయమున రమ్యమైన ఆరామమున, నేకాంతముగ విహరించుచుండగా, అచ్చట అదృశ్య రూపులైన మహాత్ములగు సిద్ధులు గాన మొనరించిన గీతలను విన్నాడు.

"ద్రష్టృ దర్శన దృశ్యాని,[1] త్యక్త్వా వాసనయా సహ ।
ప్రకాశనం ప్రకాశ్యానా మాత్మానం సముపాస్మహే । 9 ।

9. "ద్రష్ట, దర్శనము, దృశ్యము – ఈ మూడింటిని (త్రిపుటిని) వాసనలతో (చిత్తసంస్కారములతో) పాటు, త్యజించి, ప్రకాశ్యములైన వాని కన్నిటికిని, ప్రకాశనమైన (దృశ్యమానములైన సర్వపదార్థములను తన ప్రకాశనము వలన నెఱుగ చేయుచున్న) ఆత్మను ఉపాసించుచున్నాము.

సర్వేష్వవస్థితం[2] హంస ముచ్చైరస్త ముపాస్మహే ।
సన్త్యజ్య హృద్గుహేశానం, దేవ మన్యం ప్రయాన్తి యే । 10 ।
తే రత్న మభి వాఞ్ఛన్తి, త్యక్త్వా హస్తస్థ కౌస్తుభమ్[3] ।
సర్వాశాః కిల సన్త్యజ్య, ఫల మేత దవాప్యతే । 11 ।

(1) ద్రష్ట :– చక్షురాది ఇంద్రియముల ద్వారా, సకలవిషయములను తెలిసికొనువాడు - అనుభవించువాడు. దర్శనము:- ఈ క్షణము – చూచుట.
దృశ్యము:- విషయములు– చూడబడునవి.

(2) అఙ్గుష్ఠమాత్రః, పురుషోఽన్తరాత్మా,
సదా జనానాం హృదయే సన్నివిష్టః ।
హృదా మనీషీ మనసాఽభిక్లృప్తో (మనసాభిగుప్తో), ।
య ఏత ద్విదు రమృతా స్తే భవన్తి । [శ్వే. ఉ. III-13]

హృదయగుహాపరిమాణాపేక్షచే, అంగుష్ఠమాత్రుడని వర్ణింపబడిన పరమాత్మ, జ్ఞానేశుడు (మనీషః); సర్వభూతహృదయాంతర్వర్తి; పూర్ణత్వము చేతను, హృదయమున శయనించి యుండుట చేతను, పురుషుడనియు అభివర్ణితుడు. వివేకబుద్ధిచే, విచారసాధ్యైకతత్త్వజ్ఞానముచే పరమాత్మ, అఖండైకరససర్వరూపమున అభివ్యక్తుడగును. (అభిక్లృప్తః).
దీనినెఱుగువారు, అమృతత్వమును పొందుదురు.

(3) కౌస్తుభో మణిః (అమరకోశము. I-28) – విష్ణుదేవుని వక్షః స్థలము నందలి మణి.

**10-11.** సర్వజీవులందును వర్తించు హంసను (పరమాత్మను) జగద్రూపమున ప్రకాశితమగు దానిని, మేము ఉపాసింతుము. హృదయగుహాధిపతియగు దేవుని (పరమాత్మను) వర్జించి, అన్యదైవముల నాశ్రయించువారు, హస్తస్థితమగు కౌస్తుభమణిని వదలి, ఇతరరత్నమును కోరువారగుదురు. సకలాశలను పరిత్యజించినచో, హృదయ మందున్నదియు, జ్ఞాన ఫలమును నగు, అధ్యాత్మసాక్షాత్కారము సిద్ధించుచున్నది.

[హంస ముచ్చరన్తమ్ -హంసమంత్రమును సురనర తిర్యగాద్యశేషశరీరాకారములందు ('సోఽహమ్' అని) '**అజపా**' గాయత్రీరూపమున, శ్వాసోచ్ఛ్వాసచ్ఛలమున, (21600 మార్లు) నిరంతర ముచ్చరించు దానిని - (యో.వా.తా.ప్ర.)]

**బుద్ధ్వాఽప్యత్యన్త వైరస్యం, యః పదార్థేషు దుర్మతిః ।**
**బధ్నాతి భావనాం భూయో, నరో నాఽసౌ స గర్దభః । 12 ।**

**12.** భోగ్యపదార్థములు, అత్యంత విరసములని యెఱిగియు, వాని యందు మరల దృఢానురక్తి కల దుర్బుద్ధి, **మానవుడు కాడు; వాడు కేవలము గార్దభమే (గాడిదయే).**

**ఉత్థితానుత్థితానేతా నిన్ద్రియారీ**[(1)] **స్తథా పునః ।**
**అఙ్గై రఙ్గాన్ సమాక్రమ్య, హన్యాత్ప్రత్యుక్పునః పునః । 13 ।**
**ప్రశాన్తమనసః స్వస్మిన్, భవత్యేవ సుఖే స్థితిః ॥"**

**13-14.** మాటి మాటికి విజృంభించుచున్న **ఇంద్రియములను శత్రువులను,** అంగములచే అంగముల నాక్రమించి (వానిని పూర్తిగ జయించి) మరల మరల, తెగగొట్టవలెను. **ప్రశమితమనస్కునకు తన ఆత్మయందే, పరమసుఖస్థితి లభించుచున్నది."**

**ఇతి సిద్ధగణై ర్గీతా,**[(2)] **గీతాః శ్రుత్వా మహీపతిః । 14 ।**
**విషాద మాజగామాఽసౌ వ్యాకులో విలలాప చ ।**

**14-15.** ఇట్లు, సిద్ధగణము పాడిన శుభగీతముల నాలకించి, **జనకమహీపతి, విషాదమును పొంది, విలపించినాడు.**

---

(1) ఇంద్రియాఽహీన్ – (ఇంద్రియములను సర్పములను) అని పాఠాంతరము)
(2) సిద్ధగణోద్గీతా (పా.భే.)

## 2. జనకస్య ప్రబోధః – జనకుని ప్రబోధము (మేలుకోలు)

**"అపర్యన్తస్య కాలస్య, కోఽప్యంశో జీవితే మయా ॥ 15 ॥**
**తస్మిన్ భావం నిబధ్నామి, ధిఙ్మా మధమచేతనమ్ ।**
**కియన్మాత్ర మిదం నామ, రాజ్య మాజీవితం మమ? ॥ 16 ॥**

**15-16.** "నిరవధికమైన కాలమున నొక అంశము (కళ) మాత్రమే నా బ్రతుకు. అట్టి అల్పకాలికజీవితము నందాసక్తి గల నేను. ఛీ! ఛీ! అధమ చిత్తుడను. (నన్ను నేనే నిందించుకొనవలెను) నా జీవితపర్యంతమగు ఈ రాజ్య మననెంత? మిగుల అల్పమైనది.

**కోటయో బ్రహ్మణాం యాతాః, గతాః సర్గపరంపరాః ।***
**ప్రయాతాః పాంశువద్భూపాః, కా ధృతి ర్మమ జీవితే ? ॥ 17 ॥**

**17.** కోట్లకొలది బ్రహ్మలు గతించినారు; సృష్టిపరంపరలు గడచిపోయినవి. ఎందఱో రాజులు, ధూళివలె వినష్టమైనారు. ఇక నా జీవితమందు నాకీ ధృతి (నమ్మిక) ఏల? [అభినివేశము తగదు.]

**అజ్ఞానైకహతో బాల్యే, యౌవనే మదనాఽఽహతః ।**
**శేషే కళత్రచిన్తాఽఽర్తః, కిం కరోతు కదా జడః? ॥ 18 ॥**

**18.** మూర్ఖుడు, బాల్యమున కేవలము అజ్ఞానము చేతను, యౌవనమున కాముని (మన్మథుని) చేతను, వార్ధకమున కళత్ర (భార్యా) చింత చేతను, పీడితుడగుచున్నాడు. ఇక మిగిలిన కాలమున ఆ మూర్ఖుడేమి చేయగలడు? ఎప్పుడు? (తన్నుద్ధరించుకొను టిక అసాధ్యమని భావము)

**సతోఽసత్తా స్థితా మూర్ధ్ని, మూర్ధ్ని రమ్యేఽప్యరమ్యతా ।**
**సుఖేషు మూర్ధ్ని దుఃఖాని, కి మేకం సంశ్రయామ్యహమ్? ॥ 19 ॥**

---

★ పోల్చు :- "క్వ ధనాని మహీపానాం, బ్రహ్మణః క్వ జగన్తి వా।
ప్రాక్తనాని ప్రయాతాని, గతాః సర్గపరంపరాః।" (శ్రీయజ్ఞవరాహ భగవద్గీత - 129.)
ఈ శ్లోకము ఈషత్ భేదముతో యోగవాసిష్ఠమునందును పేర్కొనబడినది.
(చూడుః- సర్గ-I- శ్లో.62-పాదటీక)

వ్యర్గపరంపరా – పా.భే.

మఱియు పోల్చు :- "బాలస్తావత్ క్రీడాసక్తః, తరుణస్తావత్ తరుణీ సక్తః (రక్తః) ।
వృద్ధస్తావచ్చిన్తాసక్తః (మగ్నః), పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః (లగ్నః)"।
(శంకరుడు-మోహముద్గరము-7)

19 సత్త (వర్తమానదృశ్యజగము) నెత్తి మీద అసత్త, (నాశము), మఱియు రమ్యవస్తువులనెత్తిపై, అరమ్యత్వము, సుఖముల నెత్తి మీదను దుఃఖములు నెలకొని యుండగా, ఇక నేను (దుఃఖరహితమగు దానిని) దేనిని ఆశ్రయింతును?

**యేషాం నిమేషణోన్మేషౌ, జగతాం ప్రళయోదయౌ ।[1]**
**తాదృశాః పురుషాః యాన్తి, (సన్తి) మాదృశాం గణనైవ కా? ॥ 20 ॥**

20. ఎవరు కన్ను విచ్చిన యంత జగముల సృష్టియు, కన్ను మూసిన యంత వాని ప్రళయమును కల్గుచుండునో, అట్టి మహాత్ములు సైతము, నశించుచుండగా, ఇక, కేవలము మాబోటి వారిని గూర్చి గణించుటేల?

**సంసార ఏవ దుఃఖానాం, సీమాన్తః కిల కథ్యతే ।**
**తన్మధ్యపతితే దేహే, సుఖ మాసాద్యతే కథమ్? ॥ 21 ॥**

21. సంసారమే సర్వదుఃఖములకు పరమావధియని మహాత్ములందురు కదా. అట్టి దాని మధ్యమున, దేహము పడియున్నపుడు, సుఖ మెట్లు కలుగును?

**సంసారం శోషయిష్యామి, సఙ్కల్పోపశమేన తు ।**
**ప్రబుద్ధోఽస్మి ప్రహృష్టోఽస్మి, దృష్టః చోరో [2] మయాఽఽత్మనః ॥22॥**

22 సంకల్పములను ఉపశమింపజేయుటచే, నేనీసంసారమును క్షయింప

(1) బ్రహ్మదేవుని యొక్క పగలు రాగానే – (దినారంభమున) –, జగములుద్భవించుచున్నవి. రాత్రి ఆరంభము కాగానే, జగములు అవ్యక్తమనబడు కారణమున లయించుచున్నవి. బ్రహ్మదేవుని ఆయువు సైతము, పరిమితమైనదే. వేయిచతుర్యుగములు బ్రహ్మదేవున కొక్క దినము (12 గంటలు) అగుచున్నది. అట్లే అతని రాత్రియు వేయి చతుర్యుగముల పరిమితము. "చతుర్యుగ సహస్రం తు కథ్యతే బ్రహ్మణో దినమ్" (వి. పు. VI-3.11). ఇట్టి దివారాత్ర పరిగణనమున, బ్రహ్మదేవుని ఆయువు శతవర్షములు (నూఱేండ్లు). కృత, త్రేతా, ద్వాపర, కలియుగము నాల్గును కలసి, ఒక మహా యుగము. ఇట్టి మహాయుగములు రెండు వేలు, బ్రహ్మదేవున కొక పగలు రాత్రియు నగుచున్నవి. చూడు :- భ.గీ. - VIII-17,18.

(2) పోల్చు:– ధమ్మపదం – గాథలు 153, 154 (1994) పాదటీకలు.
డా॥ రత్నాకరం బాలరాజు.
అధ్యాత్మవిద్యాగ్రంథరత్నమాల, సాకేత నిలయం
21, S.B.I. Colony, అనంతపురం (ఆం.ప్ర.) 515 001
"గహకారక! దిట్ఠోసి పునగేహం నకాహసి" । ఇత్యాది.
"ఓ గృహనిర్మాతా! నిన్ను కనుగొన్నాను. ఇక, నీవీ గృహమును మరల నిర్మింపజాలవు."

జేసెదను. నేనిపుడు ప్రబుద్ధుడను - (మేల్కొంటిని). ప్రసన్నుడనైతిని. పరమార్థమగు ఆత్మను అపహరించిన చోరుని కనుగొంటిని.

**మనో నామేహ హన్మ్యేనం,★ మనసాఽస్మి చిరం హతః ।**
**విబుధైః సాధుభిః సిద్ధై రహం సాధు ప్రబోధితః । 23 ।**
**ఆత్మాన మనుగచ్ఛామి, పరమాఽఽనన్దసాధనమ్ ।"**

**23-24.** (అట్టి చోరుడైన) ఈ మనస్సును నిట, నిస్సందేహముగ సంహరింతును. ఇది నన్ను చిరకాలము పీడించినది. జ్ఞానులు, సాధువులు, నగు సిద్ధుల చేత, చక్కగ ప్రబోధింపబడితిని. ఇక, నిరతిశయానందసాధనమైన ఆత్మను అనుసరింతును."

**ఇతి మత్వా చిరం తూష్ణీం, స్థిత్వోత్థాయ పున ర్జగౌ । 24 ।**
**"కిముపాదేయ మస్తీహ?, యత్నా త్సంసాధయామి కిమ్? ।**
**కిం మే క్రియాపరతయా? కిం మే నిష్క్రియయాఽపి వా"? । 25 ।**

**24-25.** ఇట్లు విచారించి, చాలసేపూరకుండి, లేచి మరల నిట్లు ఆలపించినాడు. "ఇచ్చట, - ఈ సంసారమున, గ్రహింపదగిన వస్తువేది? ప్రయత్న పూర్వకముగ దేనిని సాధింతును? క్రియాపరత్వముచే గాని, నిష్క్రియా పరత్వముచే గాని, నాకేమి ప్రయోజనము?"

**ఇతి సంచిన్త్య జనకో, యథాప్రాప్తం క్రియాం తతః ।**
**అసక్తః కర్తు ముత్తస్థౌ, దినం దినపతి ర్యథా । 26 ।**

**26.** జనకు డిట్లు చింతించి, దినక్రియ నొనర్చు సూర్యుని వలె తత్కాల ప్రాప్తములైన కార్యములను నిరీహుడై, (కర్తృత్వ భోక్తృత్వాఽభిమాన లక్షణాఽఽసంగరహితుడై,), ఆచరించుటకు ప్రవృత్తుడయినాడు.

**భవిష్య న్నాఽనుసన్ధత్తే, నాఽతీతం చిన్తయత్యసౌ ।**
**వర్తమాననిమేషం తు హసన్నేవాఽనువర్తతే । 27 ।**

**27.** అతడు, భవిష్యత్తును (కాబోవు వానిని) అనుసంధింపడు. గతమును గూర్చి చింతింపడు. వర్తమానమున, ప్రతిక్షణమును సహజానందాను వృత్తితో, నవ్వుచునే-అనువర్తించును.

★ మనోనామ నిహన్మ్యేనం - పా.భే.

స్వవిచారవశా త్తేన, ప్రాప్తం ప్రాప్య మశేషతః ।[1]
సీమానం సర్వదుఃఖానా మాపదాం కోశ ముత్తమమ్ ॥ 28 ॥

బీజం సంసారవృక్షాణాం, ప్రజ్ఞామాన్ద్యం వినాశయేత్ ।[2]
తస్మాత్ప్రయత్నః కర్తవ్యః, సమ్యక్ప్రజ్ఞా వివృద్ధయే ॥ 29 ॥

**28-29.** స్వవిచారము చేతనే, జనకరాజునకు ప్రాప్యమగు ఆత్మ, పూర్తిగ ప్రాప్తించినది. సర్వ దుఃఖములకు (దుర్దశలకు) పరమావధి, ఆపదలకు ఉత్తమ స్థానభూతము, సంసార వృక్షమునకు బీజమునైన ప్రజ్ఞామాంద్యమును ప్రయత్నముతో నాశమొనర్పవలెను. కావున, సంపూర్ణముగ ప్రజ్ఞను వృద్ధి పొందించుట కొఱకు యుక్తప్రయత్నము కర్తవ్యము.

[ఇందు నిర్దేశింపబడిన "ప్రజ్ఞావివృద్ధి" మానవచైతన్యము యొక్క ప్రబోధనము, లేక, సమున్నతి. కాని, ఇది ప్రాపంచికజ్ఞానము, లేక, సమాచారము యొక్క సముపార్జనము మాత్రము కాదు.]

చిన్తామణి రియం ప్రజ్ఞా, హృత్కోశస్థా వివేకినః ।
ఫలం కల్పలతేవైషా, చిన్తితం సంప్రయచ్ఛతి ॥ 30 ॥

---

(1) యాదృచ్ఛికమైన ఉపదేశము సైతము, ఒకొకప్పుడు, ఒక వ్యక్తి యొక్క నిద్రాణమైయున్న, పూర్వానుభవమునకు సంబంధించిన వివేకరూపసంస్కారములను – (స్వభావమును) మేల్కొల్పునను సత్యమును, ఈ జనకోపాఖ్యానము నిరూపించుచున్నది.

(2) పోల్చు :- "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥ (కఠ. ఉ. III-12)

ఏకాగ్రతాయుక్తమై, ఇంద్రియాదికము కంటె ఉత్తరోత్తరము, క్రమముగ, సూక్ష్మమైన వస్తువును (పరతత్త్వమును) నిరూపింపగల బుద్ధి చేత, సూక్ష్మదర్శనశీలురైన జ్ఞానులు, పరమపురుషుని దర్శింతురు. ఇంద్రియమనోబుద్ధులకు పరునిగా, పురుషుని (బ్రహ్మమును) శ్రుతులు వర్ణించుచున్నవి. దృశ్యములగు వీని కన్నిటికిని, ద్రష్ట, పరమాత్మ.

"ఇన్ద్రియేభ్యః పరాహ్యర్థా, అర్థేభ్యశ్చ పరం మనః ।
మనసశ్చ పరా బుద్ధి, ర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥
మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషః పరః ।
పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సా పరాగతిః ।" (కఠ. ఉ. III.10, 11)

మఱియు భ.గీ. III. 42, 43.

30. వివేకవంతుల హృదయకోశమున సంస్థితమగు ఈ ప్రజ్ఞ, చింతామణి తుల్యమైనది. కల్పవృక్షలత వలె నది అభీష్ట ఫలముల నొసగుచున్నది.

[శుద్ధచైతన్యము, మానవాత్మ యొక్క సూక్ష్మతమావస్థ. సంకల్పము లుపశమింపగా, నిది యుదయించి, కడపట పరమాత్మైక్యమున పర్యవసించి, సాఫల్యమునందుచున్నది.]

**నిత్య మన్తర్విచారస్య, పశ్యత శ్చఞ్చలం జగత్ ।**
**జనకస్యేవ కాలేన, స్వయ మాత్మా ప్రసీదతి ॥ 31 ॥**

31. నిరంతర మాత్మవిచారశాలియై, జగమును, చంచలముగ, అనిత్యముగ, గాంచు వానికి, ఆత్మ, కాలక్రమమున జనకునికి వలెనే, స్వయముగ ప్రసన్నమగును.

## 3. వాసనాత్యాగో ద్వివిధః – మానసిక సంస్కారముల (వాసనల) త్యాగము, రెండు విధములు

**న దైవం న చ కర్మాణి, న ధనాని న బాన్ధవాః ।**
**శరణం భవభీతానాం, స్వప్రయత్నా దృతే నృణామ్ ॥ 32 ॥**

32. సంసారము (భవము) వలని భీతి గలవారికి, ఆత్మజ్ఞానమునకు, పురుష

---

"దృష్టవన్త మజరం పరం మహః ।
కేవలం ధిషణయా గురుం వినా" (శ్రీ రమణగీత. XVIII-21)

ఆధునికయుగమున సైతము, సూక్ష్మమగు ప్రజ్ఞ (వివేకబుద్ధి) చే, స్వబోధము చేతనే, జరారహితము, అవికార్యమునైన పరమాత్మజ్యోతిని గురువు లేకుండగనే సాక్షాత్కరించుకొన్న కొందఱు మహాత్ములున్నారనుటకు, భగవాన్ రమణమహర్షి యిందుకు నిదర్శనము.

(2) ప్రజ్ఞామాంద్యము :- తమోగుణలక్షణము; తమస్సు, ఆంధ్యము అజ్ఞానము.

"తమ స్త్వజ్ఞానజం విద్ధి, మోహనం సర్వదేహినామ్"
"అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ ।
తమస్యేతాని జాయన్తే, వివృద్ధే కురునందన !" (భ.గీ.XIV-8,13.)

అవివేకము, ప్రయత్నశూన్యత, కర్తవ్యము పట్ల ఔదాసీన్యము, మూఢత్వము, ఇవి తమోగుణ వృద్ధి వలన కల్గుచున్నవి.

ప్రయత్నము తప్ప, మఱియే దైవము (విధి - Fate) గాని, కర్మములు గాని, ధనములు గాని, బంధువులుగాని శరణము (రక్షకము) కానేరరు.

**ఉపాదేయాఽనుపతనం*, హేయైకాన్త వివర్జనమ్ ।**
**యదేత న్మనసో రామ!, తం బన్ధం విద్ధి నేతరత్ ॥ 33 ॥**

**33.** శ్రీరామా! గ్రహింపదగిన (ఉపాదేయ) వస్తువులందలి **రాగము,** త్యజింపదగిన (హేయ) వస్తువులందలి **ద్వేషము** - అను మనఃస్థితియే, బంధమగును గాని, ఇతరము కాదు.

**హేయాఽఽదేయదృశౌ త్యక్త్వా, శేషస్థః సుస్థిరో భవ ! ।**
**సంవిద్వీర్య వశా త్ప్రాప్తం, దృశ్య మాశ్రయతే మనః ॥ 34 ॥**

**34.** ఇది, హేయము (త్యాజ్యము) ఇది ఆదేయము (గ్రాహ్యము) అను దృష్టిని పరిత్యజించి, శేషించిన **సాక్షి స్వరూపమగు ఆత్మ** యందు నిష్ఠాపరుడవు కమ్ము (నిలుకడ పొందుము). సంవిత్తు యొక్క శక్తి వలన, (చిచ్ఛక్తి వలన) ప్రాప్తమైన దృశ్యపదార్థమును, మనస్సు ఆశ్రయించుచున్నది.

**యదాఽఽశ్రయసి దృశ్యం త్వం, తత్సచిత్తోఽసి బన్ధవాన్ ।**
**యదా దృశ్యం సన్త్యజసి, తదాఽచిత్తోఽసి మోక్షవాన్ ॥ 35 ॥**
**అహంభావమయీం ఛిత్వా, భవ! సంసారపారగః ।**

**35-36** దృశ్యము నాశ్రయించినపుడు నీవు, **చిత్తయుక్తుడవై,** బంధము పొందుచున్నావు. దృశ్యమును త్యజించినపుడు **చిత్తరహితుడవై**

---

* పోల్చు :- **"అవిద్యాఽస్మితా రాగద్వేషాఽభినివేశాః పంచక్లేశాః" ।**
అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము, అభినివేశము - అనునివి పంచక్లేశములు.
**"సుఖాఽనుశాయీ రాగః ।"**
సుఖ ప్రతీతి గల అనుకూల పదార్థముల (సుఖ సాధనముల) ననుసరించి యుండు ఆసక్తి, లేక, ప్రీతి, రాగమనబడును.
**"దుఃఖాఽనుశాయీ ద్వేషః ।"**
దుఃఖ ప్రతీతి గల ప్రతికూల పదార్థముల ననుసరించి యుండు క్రోధము -(పగ) ద్వేష మనబడును. (పాతంజలయోగదర్శనము II-3,7,8)

మోక్షమును, బొందుచున్నావు. అహంభావమయమగు సంకల్పమును ఛేదించి, భవసాగరము యొక్క ఆవలి తీరమును చేరుము.

శ్రీరామ ఉవాచ :-

'అతిగమ్భీర మేవైతత్ భగవన్! వచనం తవ ‖ 36 ‖
యది త్యజామ్యహఙ్కారం, దేహో నూనం వినశ్యతి ।'

36-37. శ్రీరాముడు :- 'స్వామీ! (అహంకారతృష్ణను త్యజింపు మను) తమ వచనము, మిగుల గంభీరమై నది. కాని, నేను అహంకారమును త్యజించుచో, దేహము అవశ్యముగ నశించును కదా !'

వసిష్ఠ ఉవాచ :-

ద్వివిధో వాసనాత్యాగో, ధ్యేయో జ్ఞేయశ్చ నామతః ‖ 37 ‖

37. వసిష్ఠుడు :- వాసనాత్యాగము, ధ్యేయ మనియు, జ్ఞేయ మనియు, రెండు విధములు.

'అహ మేషాం పదార్థానా* మేతే చ మమ జీవితమ్ ।
నాఽహమేతై ర్వినా కశ్చిత్, న మయైతే వినా కిల' ‖ 38 ‖

ఇత్య న్తర్నిశ్చయం కృత్వా, విచార్య మనసా దృఢమ్ ।
మత్వా 'నాఽహం పదార్థస్య, న పదార్థో మమే'త్యపి ‖ 39 ‖

అన్తఃశీతలయా బుద్ధ్యా, కుర్వతో లీలయా క్రియాః ।
యో నూనం వాసనాత్యాగో, ధ్యేయో రామ! స కీర్తితః ‖ 40 ‖

38-40. 'నే నీపదార్థముల యొక్క సంఘాతస్వరూపుడను. ఇవియే నా జీవితము. ఇవి లేనిచో, నేను గాని, నేను లేనిచో ఇవి గాని, యుండజాలవు.' ఇట్లంతఃకరణమున నిశ్చయించి, తరువాత మనస్సుచే దృఢముగ సదసత్ తత్త్వవిచారమొనరించి, 'నేనీ పదార్థముల సంఘాతస్వరూపుడను కాను.

---

* ఏషాం పదార్థానామ్ – ఏషాం దేహేన్ద్రియాదీనాం, బాహ్యాఽన్నపానాదీనాం చోపభుక్తానాం పదార్థానామ్ ।. దేహేంద్రియాదుల యొక్కయు, ఉపభుక్తములైన బాహ్యములగు అన్నపానాదులయిన పదార్థముల యొక్కయు – అని భావము. (యో.వా.తా.ప్ర.)

నావి కా వీపదార్థములు'- అని, లోపల చల్లనైన (ప్రశాంతమైన) బుద్ధితో, క్రియలను (బాహ్యవ్యవహారములను), లీలామాత్రముగ (విలాసముగ) నొనర్చు వాని యొక్క వాసనాత్యాగము, ధ్యేయ త్యాగమని కీర్తింపబడినది.

[వివేకసంపన్నమైన ఇచ్ఛాశక్తి బలమున నొనర్చిన వాసనా త్యాగము, కడపట,చిత్తప్రసన్నతనుగల్గించి, ఆత్మసాక్షాత్కారమునకు హేతువగు మన్నది]

**సర్వం సమతయా బుద్ధ్వా, యం కృత్వా వాసనా క్షయమ్ ।**
**జహాతి నిర్మమో దేహం, జ్ఞేయోఽసౌ వాసనా క్షయః ॥ 41 ॥**

41. సర్వమును (జగత్తును) సమత్వముతో (బ్రహ్మభావమున) తెలిసికొని, వాసనలను క్షయింపచేసి, నిర్మముడు, నిరహంకారుడునై, మనస్సుతో దేహసంబంధమును వదలుకొనునట్టి వాసనాక్షయము, జ్ఞేయ త్యాగమన బడుచున్నది.

[అహంకారమమకారములు, సర్వసంకల్పములు, తొలగిపోయిన పరిపూర్ణ బ్రహ్మనిర్వాణమును ఇది నిర్దేశించుచున్నది.]

**ద్వావేతౌ రాఘవ! త్యాగౌ, సమౌ ముక్తపదే స్థితౌ ।**
**ద్వావేతౌ బ్రహ్మతాం యాతౌ, ద్వావేతౌ విగతజ్వరౌ ॥ 42 ॥**

42. ఈ రెండు త్యాగములును, శ్రీరామా! సమానములు; ముక్తిప్రదములు; బ్రహ్మత్వప్రాపకములు, జ్వర (సంతాప)రహితములని తెలియుము.

**ఈ ప్సితాఽనీప్సితే న స్తో, యస్యాఽన్తః సర్వవస్తుషు ।**
**సుప్తవచ్చేష్టతే* యశ్చ, స ముక్త ఇతి కథ్యతే ॥ 43 ॥**

43. సర్వ పదార్థముల యందును, రాగద్వేషరహితుడును, సుషుప్తి యందున్న వాని వలె, ప్రాప్తవ్యవహారముల నాచరించువాడును, నైన మనుజుడు ముక్తుడని చెప్పబడును.

* ఇది, అచేతనత్వమును గాని, సామర్థ్యరాహిత్యమును గాని, నిర్దేశింపదు. సుషుప్తి యందున్న వ్యక్తికి, రాగ ద్వేష భావములు లేనట్లే, సంకల్పోపశమును గాంచి యోగియు, ప్రాపంచిక విషయములు, లేక, పరిస్థితుల పట్ల, రాగద్వేషదూరుడై యుండునని భావము.

హర్షాఽమర్ష భయక్రోధ కామకార్పణ్యదృష్టిభిః ।
న పరామృశ్యతే యోఽన్తః, స జీవన్ముక్త ఉచ్యతే । 44 ।

44. ముదము, మత్సరము, భయము, క్రోధము, కామము, కృపణత్వము (దైన్యము) మొదలగు బుద్ధులచే నెవడు, లోన, (అంతఃకరణమున) క్షోభపొందడో, వాడు జీవన్ముక్తు డనబడును.

### 4. నిశ్చయః చతుర్విధః – నిశ్చయము నాల్గు విధములు

చతుర్ధా నిశ్చయః ప్రోక్తః, పురుషస్య విచారిణః ।
'ఆపాదమస్తకం చాఽహం, మాతాపితృవినిర్మితః' । 45 ।
ఇత్యేకో నిశ్చయో రామ! బన్ధాయాఽసద్విలోకనాత్ ।

45-46. విచారశాలియగు మనుజునకు నిశ్చయము నాల్గు విధములుగ నున్నది. 'మాతా పితృ వినిర్మితము, ఆపాద మస్తకమునైన ఈ దేహమే నేను' – ఇట్టిదగు మొదటి నిశ్చయము శ్రీరామా! బంధహేతువైనది; అజ్ఞానదృష్టి వలన కల్గినది.

'అతీతః సర్వభావేభ్యో, వాలాఽగ్రాదప్యహం* తనుః' । 46 ।
ఇతి ద్వితీయో మోక్షాయ, నిశ్చయో జాయతే సతామ్ ।

---

* పోల్చు :- "వాలాగ్రశతభాగస్య, శతధా కల్పితస్య చ ।
భాగో జీవః స విజ్ఞేయః, స చాఽఽనన్త్యాయ కల్పతే । (శ్వే.ఉ.V.9)
"అంగుష్ఠమాత్రో రవితుల్యరూపః,
సఙ్కల్పాఽహఙ్కార సమన్వితో యః ।
బుద్ధే ర్గుణేనాఽఽత్మ గుణేన చైవ,
ఆరాగ్రమాత్రో హ్యవరోఽపి దృష్టః ॥" (శ్వే.ఉ.V.8)

కేశాగ్రశతభాగములోని శత భాగము జీవుడని తెలియవలెను. లింగశరీరము అతి సూక్ష్మమగుట వలన తత్పరిమాణము ననుసరించి ఇట్లు జీవస్వరూపము. వ్యపదేశింపబడినది. అంగుష్ఠమాత్రుడనియు, ఆరాగ్ర (మూదికొన) మాత్రుడనియు, జ్యోతిః స్వరూపుడనియు, జీవ స్వరూపమును వ్యపదేశించుట, హృదయాకాశ (దహరాకాశ) పరిమాణాపేక్ష చేతనే యని, గ్రహింపవలెను. జీవుని స్వస్వరూపము నిరుపాధికము, అనన్త్యమని శ్రుతి బోధించుచున్నది. మలినవాసనాయుక్తమగు దేహాత్మభావనము (నిశ్చయము) తప్ప, తదితరములగు మూడుభావములు (నిశ్చయములు)ను మోక్ష ప్రదము లేయని వసిష్ఠుని ఉపదేశము.
మఱియు చూడు :– సర్గ IX-21- పాదటీక.

46-47. 'సర్వ పదార్థములకు (దేహేంద్రియాదులకు) అతీతమై, కేశాగ్ర భాగమున కంటె సూక్ష్మమైన వాడను నేను' - అను ద్వితీయమగు నిశ్చయము మోక్షము నిమిత్తమై, సత్పురుషులకు కల్గుచున్నది.

**'జగజ్జాల పదార్థాఽఽత్మా, సర్వ మేవాఽహ మక్షయః' । 47 ।**
**తృతీయో నిశ్చయోఽప్యేవం, మోక్షాయైవ రఘూత్తమ ! ।**

47-48. రఘుకులశ్రేష్ఠుడవైన శ్రీరామా! 'నేను సర్వజగజ్జాలపదార్థముల యొక్క అంతరాత్మస్వరూపుడను. ఈ సర్వమును నేనే; నేను అవినాశిని,' - అన్న తృతీయమగు నిశ్చయమును, మోక్షమునే కల్గించుచున్నది.

**'అహం చేదం జగత్సర్వం, శూన్యవ్యోమసమం సదా' । 48 ।**
**ఏవ మేవ చతుర్థోఽపి, నిశ్చయో మోక్ష సిద్ధయే ।**

48-49. 'నేనును, (ఆధ్యాత్మిక పరిచ్ఛేదోపాధి) ఈ సకలజగత్తును, (ఆధిదైవికాద్యుపాధి) సదా (త్రికాలములందును) శూన్యము, ఆకాశతుల్యము' -అను సర్వదృశ్యబాధాత్మకమగు చతుర్థ నిశ్చయము సైతము మోక్షప్రదమే.

**ఏతేషాం ప్రథమః ప్రోక్తః, తృష్ణయా బన్ధకృత్సదా । 49 ।**
**శుద్ధతృష్ణాః త్రయస్త్వన్యే, జీవన్ముక్తి విలాసినః ।**

49-50. వీనిలో మొదటి నిశ్చయము మలినతృష్ణా (వాసనా) యుక్తమగుటచే, ఎల్లపుడును బంధకారణమగుచున్నది. తక్కిన మూడును శుద్ధతృష్ణా (వాసనా)యుక్తములు; స్వచ్ఛములు; జీవన్ముక్తవిలాసమును కలిగించునవి. (జీవన్ముక్తుల కనుసరింప యోగ్యమైనవి).

**పూర్ణాం దృష్టి మవష్టభ్య, ధ్యేయత్యాగవిలాసినీమ్ । 50 ।**
**జీవన్ముక్తతయా స్వస్థో, లోకే విహర రాఘవ ! ।**

50. శ్రీరామా! నీవు ధ్యేయవాసనాత్యాగవిలాసముగల పూర్ణదృష్టినవలంబించి, జీవన్ముక్తిచే స్వస్థచిత్తుడవై, లోకమున విహరింపుము.

**నాఽభినన్దతి నద్వేష్టి, న శోచతి, న కాంక్షతి । 51 ।**
**ఈహితాఽనీహితై ర్ముక్తః, సంసారే నాఽవసీదతి ।**

**51-52.** ఇష్టవస్తుప్రాప్తిచే సంతోషింపని వాడును, అనిష్టప్రాప్తిచే ద్వేషింపని, దుఃఖింపని వాడును, దేనిని వాంఛింపని వాడును, ఈప్సితానీప్సితములు లేనివాడు [ఇచ్ఛాద్వేష విముక్తుడు] నైన ముక్తాత్ముడీ సంసారమున దుఃఖితుడు కాడు.

**అన్తః సన్త్యక్తసర్వాశో, వీతరాగో వివాసనః । 52 ।**
**బహిః సర్వసమాచారో, లోకే విహర రాఘవ !**

**52-53.** శ్రీరామా! అంతరంగమున, సర్వాశలను త్యజించిన వాడవు, రాగరహితుడవు, వాసనారహితుడవునై, బాహ్యమున, అన్ని యాచారముల నాచరించుచు, లోకమున విహరింపుము.

## సర్వబన్ధుత్వమ్ – త్రిలోకబంధుత్వము

**అయం బన్ధు రయం నేతి, గణనా లఘుచేతసామ్ । 53 ।**
**ఉదారచరితానాం తు, త్రిలోకీ బన్ధుతాం వ్రజేత్ ।** ★

**53-54.** 'ఇతడు బంధువు, ఈతడు బంధువు గాడు' – అనెడి పరిగణన – (భేద దృష్టి) – అల్పబుద్ధులకే యుండును. ఉదారచరితులకు త్రిలోక యుక్తమగు విశ్వమంతయు బంధుత్వస్థానమునే పొందుచున్నది – బంధువర్గమే. (వారు, వసుధైక కుటుంబికులు)

## 5. పుణ్యపావనసంవాదః – పుణ్యపావనుల సంవాదము

**అత్రైవో దాహరన్తీమం, సంవాదం మునిపుత్రయోః । 54 ।**
**ఆసీ 'ద్దీర్ఘతపా' నామ, మహేన్ద్రే జ్ఞానవాన్ మునిః ।**
**పుత్రౌ బభూవతు స్తస్య, పుణ్యపావననామకౌ । 55 ।**

---

★ పోల్చు :- "ఉదారచరితానాం తు, వసుధైవ కుటుంబకమ్!"
(హితోపదేశము–మిత్రలాభము–శ్లో.75)

మఱియు–
"సమా సర్వత్ర భా భానోః, సమా వృష్టిః పయోముచః ।
సమా భగవతో దృష్టిః, సర్వసత్త్వానుకమ్పినః ॥"
(క్షేమేంద్రుడు – బోధిసత్త్వావదానకల్పలత–ముక్తాలతావదానము–VII-10)

సూర్యరశ్మి సర్వత్ర సమముగ ప్రసరించును. మేఘము సర్వత్ర సమముగ వర్షించును. సర్వభూతదయాప్రసన్న హృదయుడు భగవంతుని (బుద్ధుని) దృష్టి సర్వత్ర సమముగ నుండును. అనగా, పరమార్థ దర్శనులైన బుద్ధుల (జ్ఞానుల) దృష్టి, భేదశూన్యమై సర్వత్ర సమముగ నుండును. అట్టి వారే ఉదారచరితులు; వసుధైక కుటుంబికులు.

54-55. ఈ విషయమున ఇరువురు మునికుమారుల సంవాదమును, పెద్దలు ఉదాహరింతురు. మహేంద్ర పర్వతమున **దీర్ఘతపుడను** జ్ఞానవంతుడగు నొక ముని యుండెను. **పుణ్యుడు, పావనుడు,** నను పేర్లు గల ఇరువురు **పుత్రు లాతనికి కల్గిరి.** [ఈ పేర్లు పరమార్థ వ్యంజకములు. **దీర్ఘతపు**డనగా చిరకాలము తపమాచరించినవాడు. **పుణ్యు**డనగా సుకృతశాలి. **పావను**డనగా పవిత్రుడు.]

**మాతా పిత్రోర్వియోగేఽసౌ, ఔర్ధ్వ దైహికకర్మణి ।**
**పుణ్య ఏవ స్థితోఽవ్యగ్రః, పావనో దుఃఖ మాయయౌ ॥ 56 ॥**

56. తల్లిదండ్రులు మరణింపగా, ఔర్ధ్వదైహిక కర్మమున (దహనక్రియాది కర్మమున) పుణ్యుడు, **కలవరపాటు లేకుండ** తదేకనిష్ఠుడై ఉత్తర క్రియల నాచరింపసాగెను. కాని, పావనుడు మాత్రము **దుఃఖాక్రాంతుడై** యుండెను.

**పావనోఽర్ధ ప్రబుద్ధోఽభూత్, జ్ఞానవాన్ పుణ్య ఏవహి ।**
**పావనం శోకసన్తప్తం, పుణ్యో వచన మబ్రవీత్ ॥ 57 ॥**

57. పావనుడు **అర్ధప్రబుద్ధుడు** – అనగా సగము తెలిసినవాడు. పుణ్యుడు మాత్రమే, **అధ్యాత్మజ్ఞానశాలి.** శోక సంతప్తుడైన పావనునికి, పుణ్యుడిట్లు వచించెను.

**"స్వామేవ పరమామాత్మ పదవీం, మోక్షనామికామ్ ।**
**స్వభావరూప మాపన్నే, కిం పిత ర్యను శోచసి ? ॥ 58 ॥**

58. "మోక్షనామకమైన స్వీయము ఉత్కృష్టమునగు **పరమాత్మపదవిని,** స్వభావ స్వరూపమును, (జననీసహితుడై), పొందిన జనకునికై ఏల శోకించుచున్నావు?

**మాతాపితృసహస్రాణి, సమతీతాని తే పురా ।**
**పుత్రబాన్ధవ బృన్దాని, జన్మో ర్జన్మని జన్మని ॥ 59 ॥**

59. పూర్వము నీకు వేలకొలది తలిదండ్రులు గతించినారు. ప్రతి జన్మము నందును జననధర్మంగు మనుజాల కనేకులు పుత్రులు, బాంధవులు, కల్గుచున్నారు.

**శోచనీయా యది స్నేహాత్, మా తాపితృమతాదయః ।**
**తర్హ్యతీతాః న శోచ్యన్తే, కథ మేతే సహస్రశః"? ॥ 60 ॥**

60. మాతా పితృ సుతాదులు, ప్రేమవశమున శోకింపదగిన వారైనచో, ఇది వఱకు గతించిన వేల కొలది మాతా పిత్రాదులకై ఏల శోకింపకున్నావు?

**సింహ, వానర, మాతఙ్గ, ఖర, కాకాది యోనిషు ।**
**పావన! త్వం హి జాతోఽసి, పురా శతసహస్రశః ॥ 61 ॥**

61. పావనా! సింహము, వానరము, గజము, ఖరము, కాకము, మొదలైన జాతులందు, లక్షల కొలది మారులు, పూర్వము నీవు నిశ్చితముగ జన్మించినావు.

**తత్రత్యాః బన్ధవో యాతాః, తాన్ కథం నాఽను శోచసి? ।**

62. ఆ జన్మములందలి బంధువులు గతించి పోయినారు. వారిని గూర్చి నీ వేల శోకించుట లేదు?

**భావాఽభావ వినిర్ముక్తం, జరామరణవర్జితం ॥ 62 ॥**
**సంస్మరాఽఽత్మాన మవ్యగ్రం, మా త్వం మూఢమతి ర్భవ ! ।"**

62-63. "భావాఽభావములు కాని, జరామరణములు గాని, లేని ఆత్మను, సాఽవధాన మనస్కుడవై సంస్మరింపుము ; మూఢచిత్తుడవు కాకుము."

**ఏవం ప్రబోధిత స్తేన, తథా పుణ్యేన పావనః ॥ 63 ।**
**ఉభావపి తతో జాతౌ, జ్ఞానవిజ్ఞానపారగౌ ।**
**ఏవ మేవ త్వయా భావ్యం, చిన్తారహితచేతసా * ॥ 64 ।**

63-64. ఇట్లు, పుణ్యునిచే పావనుడు బోధింపబడినాడు. తరువాత వారిరువురును జ్ఞాన విజ్ఞాన పారగులైనారు – అధ్యాత్మ జ్ఞానమును, ఆత్మ సాక్షాత్కారమును, పొందినారు. నీవును అట్లే, చింతావిముక్త చిత్తముతో దీనిని విచారింపుము.

***ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'జనకోపాఖ్యానం' నామ ఏకాదశః సర్గః ।***

*ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'జనకోపాఖ్యానము'ను ఏకాదశ (పదునొకండవ) సర్గము సమాప్తము.*

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



---

★ మన పూర్వజన్మ పరంపర యొక్క సుదీర్ఘచరిత్రలో, మనకు అసంఖ్యేయ మాతా పితృపుత్రాది సంబంధములున్నవని తెలియవలెను. మనకు ప్రేమాస్పదుడైన యొకవ్యక్తితో మనకు ఎడబాటు కల్గినపుడు, అనగా అతడు మృతి చెందినపుడు, వివశులమై శోకించుట అయుక్తము, నిరర్థకమునని తెలుపుటకే పుణ్య పావనోపాఖ్యానము చెప్పబడినది.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ద్వాదశసర్గము

## బల్యుపాఖ్యానమ్ – బలిచక్రవర్తి కథ

### 1. బలేః నిర్వేదః – బలిచక్రవర్తి నిర్వేదము (విషాదము)

వసిష్ఠ ఉవాచ –
చిన్తనే నైధతే చిన్తా, త్విన్ధనేనేవ పావకః ।
నశ్య త్యచిన్తనేనైవ, వినేన్ధన మివాఽనలః ॥ 1 ॥

1. వసిష్ఠుడు :– ఇంధనముచే (కట్టెలచే) అగ్ని ప్రజ్వరిల్లుచునట్లు, విషయ చింతనల చేతనే, చింత, వృద్ధి పొందుచున్నది. అట్టి విషయచింతన లేనిచో, ఇంధన రహితమగు అగ్ని వలెనే, చింతయు నశించుచున్నది.

వినివారితసర్వార్థా దపహస్తితబాన్ధవాత్ ।
న వ్యాధైర్యా ద్ధృతే, కశ్చి దభ్యు ద్ధరతి సఙ్కటాత్ ॥ 2 ॥

2. అనర్థమూలములైన సకలవిషయ కామనల (సర్వ సంపదల) నిశ్శేషముగ పరిత్యజించు నదియు, సకలబాంధవులను నిరాకరింప గల్గునదియునైన స్వధైర్యమున కంటె, మనుజుని సంసారసంకటముల నుండి యుద్ధరించునది వేఱొకటేదియును లేదు.

వైరాగ్యేణ చ శాస్త్రేణ, మహత్త్వాదిగుణై రపి ।
యత్నేనాऽऽపద్విఘాతాऽర్థం, స్వయమేవోన్నమే న్మనః ॥ 3 ॥

3. వైరాగ్యముచేతను,మోక్షశాస్త్రాऽధ్యయనశ్రవణాదులచేతను, మహత్త్వాది గుణములచేతను, సంసారరూపమైన ఆపదను నశింపజేసికొనుటకు ప్రయత్నపూర్వకముగా తన మనస్సును తానే ఉత్కృష్ట మొనరించు కొనవలెను. (విషయగర్తము నుండి లేవ నెత్తుకొనవలెను).

పూర్ణే మనసి సంపూర్ణం, జగత్సర్వం సుధాద్రవైః ।
ఉపానద్గూఢపాదస్య, నను చర్మాస్తృతైవ భూః ॥ 4 ॥

4. మనస్సు (బ్రహ్మజ్ఞాన)పరిపూర్ణమైనపుడు, జగత్తంతయు అమృత ద్రవపరిపూర్ణముగ భాసించును. పాదరక్షలు గలవానికి, భూమి యంతయు చర్మముచే ఆచ్ఛాదింప బడినదే యగును కదా!

వైరాగ్యా త్పూర్ణతా మేతి, మనో నాऽऽశావశానుగమ్ ।
న తథా భాతి పూర్ణేన్దు, ర్న పూర్ణః క్షీరసాగరః ॥ 5 ॥
న లక్ష్మీవదనం కాన్తం, స్పృహాహీనం యథా మనః ।

5-6. ఆశకు వశము కాని మనస్సే, వైరాగ్యముచే పూర్ణత్వమును పొందును. (న+ఆశావశానుగమ్ = నాऽऽశావశానుగమ్). పూర్ణచంద్రుడు గాని, క్షీరసాగరముగాని, మనోజ్ఞమైన లక్ష్మీవదనముగాని, స్పృహా (కామ) రహితమైన మనస్సు వలె శోభావంతములు కావు.

అథవా బలి వద్బుద్ధి భేదేన* జ్ఞానమాప్నుతామ్ ॥ 6 ॥
పాతాళే, దానవో రాజా, విరోచనసుతో బలిః ।
దశకోటీస్తు వర్షాణాం దైత్యరాజ్యం చకార హ ॥ 7 ॥

---

* బుద్ధి భేదేన :- అకస్మాద్విచారోదయేన. (యో.వా.తా.ప్ర.V-22-1)

7. అట్లు కాదేని, బలిచక్రవర్తి వలె ఆకస్మికవిచారోదయము చేత, జ్ఞానమును పొందవలెను. పాతాళలోకమున, విరోచనుని కుమారుడు, దానవరాజగు బలిచక్రవర్తి, పదికోట్లసంవత్సరములు ప్రసిద్ధముగ రాక్షసరాజ్యమేలినాడు.

**అజస్ర మతిభుక్తేషు, త్రైలోక్యోదారవృత్తిషు ।**
**అరుచిం ప్రాప్య భోగేషు,[1] చిన్తయామాస చైకదా ॥ 8 ॥**

8. నిరంతరము, ముల్లోకములందును, ఉత్కృష్టములని భావింపబడిన విషయ భోగముల నన్నిటిని, అతిశయముగ ననుభవించిన మీదట, ఆ విషయసుఖముల యందు విరక్తిని బొంది, ఒకనాడు అతడిట్లు విచారించినాడు.

**కిం వా భవతి భుక్తేన?, కిం నామేదం సుఖావహమ్? ।**
**పునరాలిఙ్గ్యతే కాన్తా, పునరేవ చ భుజ్యతే ॥ 9 ॥**
**పునః పునరిదం కుర్వన్, ప్రాజ్ఞః కస్మా న్నలజ్జతే ।**
**కృతయాఽన్యయా నిత్యం, క్రియయా కృతకార్యయా? ॥ 10 ॥**

9-10. విషయసుఖముల ననుభవించుటచే, ఏ ఫలము శక్యమగుచున్నది? సుఖావహ మనునది ఏది? మరల ఆ కాంతాలింగనమే. మరల ఆ భోగానుభవమే. మరల, మరల, ఈ క్రియలనే దిన దినమాచరించుచు ప్రాజ్ఞు డేల నిత్యము కృతకార్యమైన ఈ క్రియల యెడల లజ్జింపడు? (జీవుని కృతార్థుని చేయు కార్యమెట్టిదో?)

---

(1) పోల్చు :- "ఉప్యమానం ముహుః క్షేత్రం, స్వయం నిర్వీర్యతా మియాత్ ।
న కల్పతే పునస్సూత్యై, ఉప్తం బీజం చ నశ్యతి ।
ఏవం కామాఽశయం చిత్తం, కామానా మతిసేవయా ।
విరజ్యేత యథా రాజన్నాఽగ్ని వద్ ఘృతబిన్దుభిః ।"
(భాగవతము - VII-11-33,34)

కాలుకాలున దున్నెడు క్షేత్రము, క్రమముగ నిర్వీర్యమై, అందు జల్లిన బీజములు నిస్తేజములై, మరల చక్కగా నంకురింపవు. అట్లే నిరంతరకామానుసంధానము వలన, కామోన్ముఖమైన చిత్తము, కామము లందు విరక్తి చెందును. రాజా! ఘృతబిందువులతో కాక, నిరంతరఘృతధారలతో అగ్ని పైతము ఉపశమించుచున్నది కదా! యయాతి, సౌభరి, ప్రముఖులును, ఇట్లే విషయవిరక్తిని పొందినారు.

చూడు :- యయాతి వృత్తాంతము – భాగ. IX-19 అధ్యాయము. మరియు, వి.పు. అంశ IV-అ.10; సౌభరి చరిత్రము—వి.పు. IV-2.

[స్పష్టమైన ఈ వచనము, వివేకవంతులను సైతము,స్థిరములైన మానుష్యపు విలువలను, నిత్యసుఖపదప్రాప్తిని విస్మరింపజేసి, పూర్తిగ బద్ధులుగ, బానిసలుగ, నొనర్చు అత్యంతశక్తిమంతములైన మానవ ప్రవృత్తులను నిర్దేశించుచున్నది. కామము (మైథునము) యొక్క ప్రవృత్తి ద్వివిధము. (1) సంతానోత్పాదనము (2) పరిణామము. మొదటికార్యము (సంతానోత్పత్తి) నెఱవేరిన (నైతికము, ఆధ్యాత్మికమునైన పరిధులలో ధర్మాఽ విరుద్ధమైన సంతృప్తి పొందిన) పిదప, ఉన్నత ప్రయోజనము (పరమపురుషార్థము) కొఱకు, పవిత్రతను, పొంది, మనుజుడు ప్రయత్నింపవలెను.]

**కోఽర్థః స్యాత్ తాదృశో యేన, పునః కర్మ న విద్యతే ? ।★**

11. ఏది లభించిన పిదప, మరల చేయవలసిన కర్మ, యుండదో, అట్టి కృతకృత్యతను కల్గించు, ప్రయోజనము (కార్యము) ఏదై యుండును?

## 2. పిత్రా ఉపదేశః – తండ్రిచే ఉపదేశము

**ఆః! స్మృతం యత్పురా పృష్టో, మయా తాతో విరోచనః । 11 ।**

11. అహో! పూర్వము, మా తండ్రి విరోచనుని నేనడిగిన దిపుడు జ్ఞప్తికి వచ్చినది.

**"పితః! సకల దుఃఖానాం, సుఖానాం చాఽపి సర్వశః ।**
**యత్ర సర్వే భ్రమాః శాన్తాః, కోఽపి సీమాన్త ఉచ్యతామ్" । 12 ।**

12 "తండ్రీ! సర్వవిధముల సకలదుఃఖపరిహారమునకు, సకలసాంసారిక సుఖప్రాప్తికి, ఉపాయభూతములగు వ్యవహార భ్రమలన్నియు, శాంతించు సంసారపరమావధి యేదో? దానిని నాకు తెలుపుము."

**ఇత్యుక్తో భగవాన్ ప్రాహ, "సీమాన్తోఽస్తి హి తాదృశః ।**
**యత్ర పృథ్వీ న నాఽఽకాశం, సాగరా న న చాఽద్రయః । 13 ।**

★ "యేన లబ్ధేన, పునః కర్మ న విద్యతే, కృతకృత్యతా స్యాత్, తాదృశోఽర్థః కః స్యాత్" । (యో.వా.తా.ప్ర. V-22-37)

న వనాని న తీర్థాని, న నద్యో న సరాంసి చ ।
సుమహా నేక ఏవాఽస్తి, తత్ర రాజా మహాద్యుతిః ॥ 14 ॥

**13-14.** ఇట్లు నేను ప్రశ్నింపగా, ఆ భగవంతుడు – విరోచను డిట్లు వచించెను. "అట్టి పరమావధి వాస్తవముగ కలదు. అచ్చట భూమ్యాకాశములు గాని, సముద్రములు గాని, పర్వతములు గాని, వనములు గాని, తీర్థములు గాని, నదులు, సరస్సులు గాని, ఏవియును లేవు. అచ్చట గొప్ప మహనీయుడు, మహాతేజశ్శాలి యగు ఒక్క రాజు (ఆత్మ) మాత్రమే యున్నాడు.

సర్వకృత్ సర్వగః సర్వః, స చ తూష్ణీం వ్యవస్థిత: ।
తేన సఙ్కల్పితో మన్త్రీ, సర్వతో మన్త్రణోన్ముఖః ॥ 15 ॥
అఘటం ఘటయ త్యాశు, ఘటం విఘట యత్యపి ।
భోక్తుం కిఞ్చి న్నశక్నోతి, న చ జానాతి కిఞ్చన ॥ 16 ॥

**15-16.** ఆ రాజు సర్వకర్త, సర్వవ్యాపి, సర్వరూపుడు, అత డెప్పుడును మౌనమున స్వస్థుడై, ఊరక యుండును. అత డొక మంత్రిని (మనస్సును) సంకల్పములచే కల్పించినాడు. అతడు అన్నివిధముల, మంత్రణకార్య మొనర్చ, సదా సంసిద్ధుడై యుండును. అతడు ఘటింపని దానిని ఘటింపజేయును. ఘటించిన దానిని విఘటింపజేయును; దేనిని అనుభవింపజాలడు; దేనిని ఎఱుగడు. [ఆత్మకు సంసారిత్వమును ఘటిల్ల జేయును; ఆత్మ యొక్క పూర్ణానందత్వము విఘటిత మొనర్చును]

రాజాఽర్థం కేవలం సర్వం, కరోత్యజ్ఞోఽపి సన్ సదా ।
రాజా కేవలం మేకాన్తే స్వస్థ, ఏవాఽవ తిష్ఠతి ॥ 17 ॥

**17.** అత డట్లు జడు డయ్యును, కేవలము, రాజార్థమై, సర్వకార్యముల నొనర్చుచుండును. రాజు మాత్రమే, కేవల మేకాంత స్థలమున స్వస్థుడై యుండును.

న తత్ర బలవాన్ మన్త్రీ, దేవాఽ సురగణైః సుత! ।
న లక్ష గుణితై ర్వాఽపి, సర్వై రాక్రమ్యతే మనాక్ ॥ 18 ॥

18. కుమారా! అప్పుడు బలశాలియగు ఆ మంత్రిని, లక్షగుణితములైన దేవాసురసమూహములు సైతము, కొంచెమైనను ఆక్రమింపజాలవు.

ప్రభుణైవ తు జయ్యోఽయం, యుక్త్యాఽఽయాతి స వశ్యతామ్ ।

19. కాని, అతడా రాజు చేత మాత్రమే విజితుడు కాగలడు. యుక్తిచే ఆతడు సులభముగ వశీకృతుడగును.

దేశనామ్నా మయోక్తస్తే, మోక్షః సకలదుఃఖహా ॥ 19 ।
రాజా చ భగవా నాత్మా, మన్త్రీ ప్రాజ్ఞో మనో భవేత్ ।
విషయాన్ ప్రత్యనాస్థా స్యాత్, యుక్తిర్హి మనసో జయే । 20 ॥

19-20. నీకు నేను వచించిన యా దేశము సకలదుఃఖముల నశింపజేయునది యగు మోక్షము. భగవంతుడు పరమాత్మయే ఆ రాజు. సర్వప్రజ్ఞానమష్టి రూపమగు మనస్సు, ఆ మంత్రి. ఆ మనస్సును జయించుటకు యుక్తి (ఉపాయము), సర్వవిషయముల యందు [అనాస్థ –అస్పృహ] – కోరిక లేకుండుటయే.

చిత్తస్య భాగౌ ద్వౌ భోగైః*, శాస్త్రైణైకం ప్రపూరయేత్ ।
గురుశుశ్రూషయా చైక, మవ్యుత్పన్నస్య సత్క్రమే । 21 ।

21. అపరిపక్వ(అప్రాజ్ఞ)చిత్తవిషయమున, దినము యొక్క రెండు పాదములు, దేహనిర్వహణమునకు కావలసిన ఉపభోగముల చేతను, ఒకపాదమును మోక్షశాస్త్ర శ్రవణము చేతను, మఱియొక పాదమును సన్మార్గారంభమున శాస్త్రోక్తక్రమమున గురుశుశ్రూష చేతను, పూరింప (వినియోగింప) వలెను.

కిఞ్చిత్ వ్యుత్పత్తి యుక్తస్య, భాగం భోగైః ప్రపూరయేత్ ।
గురుశుశ్రూషయా భాగౌ, భాగం శాస్త్రాఽర్థచిన్తయా । 22 ।

---

★ తత్ర చిత్తపరిపాకభేదాఽనుసారేణ, భూమికా భేదాన్ వివక్షుః,
ప్రథమ భూమికా మాహ – చిత్తస్యేతి! భోగైః దేహమాత్రోపాయైః
ద్వౌ దివస్య కాల భాగౌ ।(యో.వా.తా.ప్ర.V-24-25)
భాగః– పాదము (1/4 భాగము)

22. తత్త్వాభిముఖముగ కొంత పరిపక్వమైన (అల్పప్రాజ్ఞ) చిత్తమైనచో, నొకపాదమును భోగముల చేతను, రెండు పాదములు గురుశుశ్రూష చేతను, ఒక పాదమును మోక్షశాస్త్రార్థవిచారణ చేతను, పూరింపవలెను.

**వ్యుత్పత్తి మనుయాతస్య, ద్వౌభాగావపి చేతసః ।**
**పూరయేత్ శాస్త్ర వైరాగ్యైః, ద్వౌ ధ్యానగురుపూజయా । 23 ।**

23. తత్త్వపథమున బాగుగ పరిపాకమును పొందిన (ప్రాజ్ఞ) చిత్తమైనచో, రెండుపాదములు మోక్షశాస్త్రార్థవిచారణవైరాగ్యములచేతను, రెండు పాదములు ధ్యానగురుశుశ్రూషల చేతను పూర్తి జేయవలెను.

**ప్రజ్ఞయా చ విచారేణ, సమ్యమాత్మాఽవలోకనమ్ ।**
**తృష్ణా సన్త్యాగమేవాఽపి, సదా తీవ్రం సమాహరేత్" । 24 ।**

24. ప్రజ్ఞావిచారణలచేత సమముగా, **ఆత్మావలోకనమును, తృష్ణా పరిత్యాగమును,** నిరంతరము అతిశయముగ, సమకూర్చుకొను చుండవలెను"

**ఇతి మే కథితం పూర్వం, దిష్ట్యాఽద్య సంస్మృతం మయా ।**
**దిష్ట్యా బోధోఽపి మే జాతః, జాతా భోగేషు చాఽరతిః । 25 ।**
**దిష్ట్యా శమసుఖం స్వచ్ఛం, విశామ్యమృతశీతలమ్ ।**

25-26. ఇట్లు పూర్వము నాకు కథితమైనది, దైవవశమున నాచే నిపుడు సంస్మరింపబడినది. దైవవశముననే నాకు బోధోదయమైనది; విషయ భోగములందు అరతి –(వైరాగ్యమును) కల్గినది. దైవవశమున స్వచ్ఛము **అమృత శీతలమునైన శమసుఖమున నేను ప్రవేశించుచున్నాను.** (అది నాకు స్వాధీనపడుచున్నది.)

## 3. శుక్రేణ ఉపదేశః – శుక్రుని చేత ఉపదేశము

**'కోఽహం? తావదయం కిం స్యా, దాత్మేత్యాఽఽత్మాఽవలోకనమ్।26।**
**పృచ్ఛామి భార్గవం శుక్రం, మితి ధ్యానా త్వమాగతమ్ ।**
**భార్గవం పూజయామాస, పాదాభివన్దనాదినా । 27 ।**

26-27. 'వాస్తవముగా నేనెవరను? (అహంప్రత్యయవేద్యమైన జీవతత్త్వమెట్టిది?) ఇది ఏమి? (ఈదృశ్యప్రపంచమేమి?) ఆత్మయననేది? ఆత్మావ

లోకనమునకు, ఉపాయమేది?' అని ఆత్మసాక్షాత్కారవంతుడైన - భృగుపుత్రుడు శుక్రుని ప్రశ్నించుతును. - ఇట్లు ధ్యానించుట చేత. సమాగతుడైన భార్గవుని (శుక్రుని) పాదాభివందనాదులచే బలిచక్రవర్తి పూజించినాడు.

**తత స్తత్ర సమాసీనం, గురుం పప్రచ్ఛ దైత్యరాట్ ।**
**"గురో! కోఽహం? కిమేతే వా, లోకా? ఇతి వద ప్రభో"! ॥ 28 ॥**

**28.** తరువాత, దైత్యరాజగు బలి, అచట సమాసీనుడైన గురువు నిట్లు ప్రశ్నించినాడు. "గురుదేవా! నేనెవరను? ఈ లోకము లేమి? ప్రభూ! ఇది నా కెఱిగింపుము."

శుక్ర ఉవాచ

**"బహునాఽత్ర కిముక్తేన, సారం సంక్షేపతః శృణు ।**
**చిత్ త్వం చి దహమేతే చ, లోకాః చిదితి సంగ్రహః ॥ 29 ॥**

**29.** **శుక్రుడు :—** "ఈ విషయమున నధికముగ వచించుట వలని ప్రయోజన మేమి? సంక్షేపముగ **సారమును** వచింతును; **వినుము.** నీవు శుద్ధచైతన్య రూపుడవు. నేనును శుద్ధచైతన్యమయుడనే, ఈ లోకమున్నియు చైతన్యమయములే. ఇట్టిదే తత్త్వసారసంగ్రహము.

**ఇతి నిశ్చయ మాదాయ, విలోకయ ధియేద్ధయా ।**
**స్వయమేవాఽఽత్మనాఽఽత్మాన మనన్తపద మాప్స్యసి" ॥ 30 ॥**

**30.** ఇట్టి నిశ్చయమును గ్రహించి, ప్రకాశమానమగు బుద్ధితో, స్వయముగనే ఆత్మచే (శుద్ధాంతఃకరణముచే) ఆత్మను విలోకింపుము. అనంతమైన శాశ్వతపదమును పొందెదవు."

**ఏవముక్త్వా గతే శుక్రే, సర్వం చిన్మాత్ర మేవ హి ।**
**ఇతి భావనయా ధ్యాయన్, ప్రశాన్తకలనాగణః ॥ 31 ॥**
**ధ్యాతృ ధ్యేయ ధ్యాన హీనో,*నిర్మనాః శాన్తవాసనః ।**

---

★ **నిర్వికల్పసమాధిః :- చూడు :- పాతంజలయోగదర్శనము –I-47-51**
**నిర్విచార వైశారద్యే అధ్యాత్మప్రసాదః ।**
నిర్విచారసమాధి యొక్క నైర్మల్యము సిద్ధింపగా, అధ్యాత్మప్రసాదము కల్గుచున్నది - **పరమాత్మసాక్షాత్కారము సిద్ధించుచున్నది.**

**బభూవాఽవాత దీపాఽఽభో, బలిః ప్రాప్తమహాపదః ॥ 32 ॥**

**31-32.** ఇట్లు ఉపదేశించి శుక్రుడు నిర్గమింపగా, సర్వము వాస్తవముగ చిన్మాత్రమే యన్న భావనతో ధ్యానించి, ఉపశమించిన (కల్పనలు) మనో వృత్తి సమూహములు కలవాడై, ధ్యాతృ ధ్యేయ ధ్యాన వర్జితుడు, అమనస్కుడు, సర్వవాసన లుపశమించిన వాడును నగు బలిచక్రవర్తి, మహనీయమగు పదమును ప్రాపించి, నివాతదీపసముడై (గాలి లేని దీపము వలె, చలనరహితుడై) యుండెను. (నిర్వికల్పసమాధిని పొందెను).

**నిర్వికల్పసమాధానే, చిరం స్థిత్వా సముత్థితః ।**
**రాజకార్యాణి సర్వాణి, సంవ్యధాత్ స యథాక్రమమ్ ॥ 33 ॥**

**33.** నిర్వికల్పసమాధియందు చిరకాల ముండి, అందుండి లేచి, యథాక్రమముగ రాజకార్యము లన్నిటిని అతడు నిర్వర్తించినాడు.

**ఆపదం సంపదం చైవ, సమదృష్ట్యైవ పశ్యతి ।**
**నాఽస్తమేతి న చోదేతి, తత్ప్రజ్ఞా సుఖదుఃఖయోః ॥ 34 ॥**

**34** అతడు ఆపదలను, సంపదలను, సమబుద్ధితో గాంచుచుండెను.

---

**ఋతంభరా తత్ర ప్రజ్ఞా ।**
ఈ సమయమున యోగికి, ప్రజ్ఞ (బుద్ధి) 'ఋతంభర' అగుచున్నది – సత్యవస్తు సాక్షాత్కారము కల్గించునది యని భావము.
**శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యా మన్యవిషయా విశేషాఽర్థత్వాత్ ।**
ఈ ఋతంభరా ప్రజ్ఞ, ఆగమ, అనుమాన, ప్రమాణముల యొక్క ప్రజ్ఞ కంటె, విశేషార్థ యుక్త మగుటచే విలక్షణమైనది.
**తజ్జః సంస్కారోఽన్యసంస్కార ప్రతిబన్ధీ ।**
ఋతంభరాప్రజ్ఞాజన్యమగు సంస్కారము, ప్రాకృతరాగద్వేషాదిసంస్కారముల వశింప జేయుచున్నది.
**తస్యాఽపి నిరోధే, సర్వనిరోధాత్ నిర్బీజసమాధిః ।**
ఈ ప్రజ్ఞా సంస్కారమునుసైతము నిరోధించుటచే, సర్వప్రజ్ఞా సంస్కార నిరోధము వలన, అవిద్యాబంధరహితమైన, కైవల్యము సిద్ధించుచున్నది.
[అప్పుడు పురుషుడు స్వస్వరూపమాత్ర ప్రతిష్ఠుడు, అంతఃశుద్ధుడవై కేవలము ముక్తుడగుచున్నాడు]
– ఇదియే నిర్వికల్పసమాధి – నిర్బీజసమాధి (రాగద్వేషాదిబీజరహితమైనది)
యో.ద. I - 47 - 51 సూత్రములు.
మఱియు:–"అహమేవ పరం బ్రహ్మ, బ్రహ్మాఽహమితి సంస్థితిః ।
సమాధిః స తు విజ్ఞేయః, సర్వవృత్తి వివర్జితః ।
(త్రిశిఖ బ్రాహ్మోపనిషత్ – 161)

సుఖదుఃఖములందు. అతని ప్రజ్ఞ (బుద్ధి) ఉదయాఽస్తమయములు లేనిదై, అచంచలమై యుండెను.

**యేషు యేషు ప్రదేశేషు, మనో మజ్జతి బాలవత్ ।[1]**
**తేభ్య స్తేభ్యః సముద్ధృత్య, తద్ధి తత్త్వే నియోజయేత్ ॥ 35 ॥**

**35.** ఏ యే ప్రదేశము(విషయము)లందు బాలునివలె మనస్సు నిమగ్నమగు చుండునో, వానివాని నుండి, దానిని సముద్ధరించి, తత్తదధిష్ఠానమైన తత్త్వము (చిన్మాత్రము) నందే నెలకొల్పవలెను.

**ఏవ మభ్యస్యతాఽభ్యాసం,[2] మనోమత్తమతజ్గజమ్ ।**
**విబధ్య సర్వభావేన, పరం శ్రేయోఽధిగమ్యతే ॥ 36 ॥**

**36.** ఇట్లు అధ్యాత్మ యోగము నభ్యసించువాడు, **మనస్సను మదగజమును** సర్వప్రయత్నము చేతను, సర్వాత్మభావముచేతను నిరోధించి, పరమ శ్రేయస్సును (మోక్షమును) పొందుచున్నాడు.

[వస్తుజాతమంతయు, చైతన్యస్వరూపమే యను సత్యమును ధ్యానించుట వలన, నిర్వికల్పసమాధి సిద్ధించు ననుటనే ఈ **బల్యుపాఖ్యానము వ్యాఖ్యానించుచున్నది**]

***ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'బల్యు పాఖ్యానం' నామ ద్వాదశః సర్గః ।***

*ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున '**బలి ఉపాఖ్యానము**'ను ద్వాదశ (పండ్రెండవ) సర్గము సమాప్తము.*

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



(1) **పోల్చు :- 'యతో యతో నిశ్చరతి, మనశ్చంచల మస్థిరమ్ ।**
**తతస్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥** (భ.గీ. VI-26)
చంచలము, అస్థిరమునగు మనస్సు, ఏయే విషయముల వైపు ఆకర్షితమగునో, ఆయా విషయముల నుండి దానిని మరల్చి, ఆత్మ యందే స్థిరమొనర్పవలెను.

(2) **ఏవ మభ్యాగతాఽభ్యాసం – (పా.భే.)**

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## త్రయోదశసర్గము

## ప్రహ్లాదోపాఖ్యానమ్ – ప్రహ్లాదుని కథ

### 1. హరితోషణమ్ – హరి సంతోషము

**వసిష్ఠ ఉవాచ :–**

**అథేమం పరమం రామ!, విజ్ఞానాఽధిగమే క్రమమ్ ।**
**శృణు! దైత్యేశ్వరః సిద్ధః, ప్రహ్లాదః స్వాత్మనా యథా ॥ 1 ॥**

1 వసిష్ఠుడు :– శ్రీరామా! ఇక ఇప్పుడు, నిర్విఘ్నముగా విజ్ఞానమును పొందుటకు, మంచిక్రమము నెఱిగింతును; వినుము: రాక్షసరాజైన ప్రహ్లాదు డాక్రమము ననుసరించి స్వయముగా సిద్ధు డయినాడు.

**ప్రహ్లాదోఽచిన్తయ ద్దృష్ట్వా, దానవాన్ హరిణా హతాన్ ।**
**'హరే రాక్రమణే నాఽన్యం, హరి రేవ హి సాధనమ్ ॥ 2 ॥**
**తమేవ శరణం యాయా' మితి నిశ్చిత్య మాధవమ్ ।**
**మనసా పూజయామాస, సంభార భర భారిణా ॥ 3 ॥**

**2-3.** హరిచే హతులైన దానవులను గాంచి, ప్రహ్లాదు డిట్లు చింతించినాడు. 'హరిని వశీకరించుకొనుటకు నిశ్చయముగా హరియే సాధనము – (ఉపాయము). ఆ భగవంతునే శరణు జొత్తునుగాక!' అని నిశ్చయించి ప్రహ్లాదుడు, మనఃకల్పితములైన విస్తృత పూజా సంభారములచే మాధవుని (లక్ష్మీపతిని) పూజించినాడు.

**రత్నౌఘపాత్రపటలైః శ్చన్దనాదివిలేపనైః ।**
**ధూపై ర్దీపైః పవిత్రైశ్చ, నానావిభవభూషణైః । 4 ।**

**4.** రత్న ఖచిత పాత్రల చేత గావింపబడిన అభిషేకముల చేతను, చందనాది విలేపనముల చేతను, పవిత్రములైన ధూపదీపముల చేతను, నానావిధ విభవాలంకారముల చేతను, ఆతడు మానసికముగా, మాధవు నర్చించినాడు.

**అథ తస్మిన్ పురే దైత్యాః, తతః ప్రభృతి వైష్ణవాః ।**
**సర్వ ఏవాఽభవన్ భక్త్యా, రాజా హ్యాఽఽచార కారణమ్ * । 5 ।**

**5.** అంత, ఆ పురమున అది మొదలు, దానవు లందఱును, భక్తితో విష్ణుభక్తులైనారు. రాజే కదా ప్రజల ఆచారమునకు కారణభూతుడు.

**శ్రుత్వా తద్విస్మితా దేవాః, పప్రచ్ఛు ర్భోగిశాయినమ్ ।**
**'కిమేతద్భగవన్ ! దైత్యాః, విరుద్ధా స్త్వాముపాసతే । 6 ।**
**వరాకో దానవో హీనజాతి ర్భక్తిః క్వ వైష్ణవీ? ।**

---

* పోల్చు :- "రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః, పాపే పాపాః, సమే సమాః ।
తద్ధర్మ మనువర్తన్తే, యథా రాజా తథా ప్రజాః ।
ధర్మాధర్మములన్నిటి యందును, ప్రజలు, రాజునే అనుసరింతురు. రా జెట్టివాడో ప్రజలును అట్టివారే యగుదురు.
మఱియు :-"యద్యదాచరతి శ్రేష్ఠః, స్తత్తదేవేతరో జనః ।
స యత్ప్రమాణం కురుతే, లోకస్త దనువర్తతే ।" (భ.గీ. III-21)
లోకకల్యాణకారి యగు శ్రేష్ఠుని (ప్రముఖుని) ఆచరణమునే, సాధారణజనము అనుకరించును. అతడు దేనిని ప్రామాణికబుద్ధితో అనుష్ఠించునో, దానినే సాధారణ జనము సైతము అనుసరించును.

6-7. ఇది విని, దేవతలందఱు ఆశ్చర్యపడి, శేషశాయియగు విష్ణువు నిట్లు ప్రశ్నించినారు. 'దేవా! విరోధులగు దైత్యు లిపుడు మిమ్ము ఉపాసించు చున్నారు? ఇదియేమి? అధముడు, హీనజాతియునైన దానవు డెక్కడ? విష్ణుభక్తి యెక్కడ?

శ్రీ భగవానువాచ :-

'విబుధాః మా విషణ్ణాః స్థ, ప్రహ్లాదో భక్తిమా నితి ॥ 7 ॥
పాశ్చాత్యం జన్మ తస్యేదం, మోక్షార్హోఽసౌ వరిష్ఠమః ।
గుణవాన్ నిర్గుణో జాత, ఇత్యనర్థక్రమం విదుః ॥ 8 ॥
నిర్గుణో గుణవాన్ జాత, ఇత్యాహుః సిద్ధిదం క్రమమ్ '

7-9. భగవంతుడు :- 'దేవతలారా! ప్రహ్లాదుడు నా భక్తుడైనాడని విషాదము పొందకుడు. వానికిది అంతిమజన్మము. శత్రునాశకుడగు నాత డిప్పుడు మోక్షార్హుడు. గుణవంతుడు, గుణహీనుడగుట అనర్థక్రమమనియు, గుణహీనుడు, గుణవంతుడగుట సిద్ధిదాయకమగు క్రమమనియు, పెద్దలు వచించినారు.'

ప్రహ్లాదం ప్రతి గీర్వాణా స్తతః, స్నిగ్ధత్వ మాయయుః ॥ 9 ॥

9. భగవంతు డిట్లు వచింపగా, దేవతలు, ప్రహ్లాదుని యందు స్నేహ భావము కలవారైనారు.

మనసా కర్మణా వాచా, ప్రహ్లాదో భక్తిమానపి ।
త్యక్తభోగాదికలనః, విశ్రాన్తి మనుపాగతః ॥ 10 ॥

10. ప్రహ్లాదుడు, మనోవాక్కాయ కర్మములచేత భక్తియుక్తుడై, విషయభోగాది ఆసక్తిని త్యజించి యున్నను, పరిపూర్ణ విశ్రాంతిని పొంద డయ్యెను.

తాం స్థితిం తు హరిః జ్ఞాత్వా, తస్య పూజా గృహం యయౌ ।
విజ్ఞాయ పూజయా దేవం, సంపూజ్య ద్విగుణేద్ధయా ॥ 11 ॥
ప్రహ్లాదః పరమప్రీతో, గిరా తుష్టావ పుష్టయా ।

11-12 ఆ స్థితిని హరి యెఱిగి, ప్రహ్లాదుని పూజా మందిరమునకు వచ్చినాడు; భగవంతుని ఆగమనమును తెలిసికొని, దీప్తమగు ద్విగుణోపచారములచే

ఆ దేవుని పూజించి, ప్రహ్లాదుడు పరమప్రీతుడై, అర్థవంత మగు వాక్కులచే స్తుతించినాడు.

శ్రీభగవానువాచ –

'వరం గృహాణ తే భూయో జన్మదుఃఖోపశాన్తయే' ॥ 12 ॥

12. భగవంతుడు:- 'ప్రహ్లాదా! బహుజన్మదుఃఖోపశాంతి కొఱకు నీవు వరమును స్వీకరింపుము.'

ప్రహ్లాద ఉవాచ –

'యదు దారతమం వేత్సి, తదేవాఽఽ దిశ మే విభో!' ।

13. ప్రహ్లాదుడు :- 'స్వామీ! నీకేది ఉదారతమ(సర్వకార్పణ్యనివారక)మని తోచునో, అదియే నాకు వరముగ దయ చేయుము.'

శ్రీభగవానువాచ –

'సర్వసంభ్రమ సంశాన్త్యై, పరమాయ ఫలాయ చ ॥ 13 ॥
బ్రహ్మవిశ్రాన్తి పర్యన్తో, విచారోఽస్తు తవాఽనఘ!' ।

13-14. భగవంతుడు :-'పాపరహితుడా! ఆత్యంతిక అనర్థ నివృత్తి (సర్వసంసార భ్రమవినాశము) కొఱకు, నిరతిశయానందఫలప్రాప్తి కొఱకును, బ్రహ్మమున విశ్రాంతిని పొందు వఱకు, నీకు తత్త్వవిచారము సిద్ధించు గాక!'

## 2. ఆత్మవిచారణమ్ :- ఆత్మతత్త్వవిచారము

ఇత్యుక్త్వాఽన్తర్హితే దేవే, సమాప్యాఽర్చాం యథాక్రమమ్ ॥ 14 ॥
ఉపవిశ్యాఽథ దైత్యేన్ద్రోఽకరో దాత్మవిచారణమ్ ।

14-15. ఇట్లు పచించి, భగవంతు డంతర్హితుడు కాగా, దానవేంద్రుడు (ప్రహ్లాదుడు) యథాక్రమముగ పూజను పూర్తి చేసి, ఉపవిష్టుడై, ఆత్మతత్త్వవిచార మొనర్చినాడు.

"జగత్త్వదిదం నాఽహం, బాహ్యం తజ్జడమేవ హి ॥ 15 ॥
నాఽహం దేహో జడో నాశ్యః, పవనేనైవ విస్ఫురన్ ।"

15-16. "ఈ జగత్తు నేను కాను, ఇది వాస్తవముగ నాకు బాహ్యము, జడమునైనది. జడము, నశ్వరము, ప్రాణవాయువుచే చలించునదియునైన దేహమును నేను కాను."

"జడయా కర్ణశష్కుల్యా, కల్ప్యమానః క్షణక్షయీ ౹ 16 ౹
శూన్యాఽఽకృతిః, శూన్యభవః, శబ్దో నాఽహ మచేతనః ౹"

16-17. "జడమైన కర్ణగోళమందు కల్పితమును, క్షణకాలముననే క్షయించునదియు, శూన్యాకృతియు, శూన్యమగు ఆకాశము నుండి యుత్పన్నమైనదియు, అచేతనమునగు శబ్దమును నేనుకాను."

"త్వచా క్షణవినాశిన్యా, ప్రాప్యోఽప్రాప్యోఽయ మన్యథా ౹ 17 ౹
చిత్ప్రసాదోపలబ్ధాత్మా, స్పర్శో నాఽహ మచేతనః ౹"

17-18. "క్షణ వినాశినియగు త్వగింద్రియముచే ప్రాప్యమగునదియు, మఱియొక విధముగా ప్రాప్యము కానిదియు, చైతన్యానుగ్రహముచే నుపలబ్ధమగు స్వరూపము కలదియు, అచేతనమునగు స్పర్శమును నేను కాను."

"దృశ్యదర్శనయో[(1)]ర్లీనం, క్షయిక్షణవినాశినోః ౹ 18 ౹
కేవలే ద్రష్టరి క్షీణం, రూపం నాఽహ మచేతనమ్ ౹"

18-19. "అనిత్యములైన దృశ్యదర్శనముల యందు లయమగునదియు, కేవలము ద్రష్టయందు, ఉపభోగమును కల్గించి, క్షీణమగునదియు, అచేతనమునైన రూపమును నేను కాను."

[దృశ్యము :- చూడబడుచున్న పదార్థము. (ద్రవ్యము).
దర్శనము :- చూచునట్టి చక్షువు. ఈ రెంటి యందు లీనమగునది, అనగా ఈ రెండింటి అధీనమున నుండునది యని భావము]

"లబ్ధాఽఽత్మా జిహ్వయా తుచ్ఛ్యా, లోల క్షణికసత్తయా[(2)] ౹ 19 ౹
స్వల్పస్పన్దో ద్రవ్యనిష్ఠో, రసో నాఽహ మచేతనః ౹"

19-20. "అనిత్యము, చంచలమునైన జిహ్వచే లబ్ధమగు స్వరూపము కలదియు;

(1) దృశ్యే ద్రవ్యే దర్శనే చక్షుషి - (యో.వా.తా.ప్ర.)
(2) లబ్ధాత్మా జిహ్వయా తుచ్ఛ్యా లోలయా లోలసత్తయా ౹ పా.భే.

(రసనేంద్రియాదీనమును), తుచ్ఛమును, స్వల్పస్పందమును (జిహ్వాగ్రము నుండి కంఠప్రదేశము వఱకు మాత్రమే ఆస్వాదమును కలుగజేయునదియును), ద్రవ్యనిష్ఠమును, అచేతనమునైన రసమును నేను కాను.

"వాసయాఽప్యన్ధజడయా, క్షయిణా పరికల్పితః ॥ 20 ॥
పేలవోఽనియతాకారో, గన్ధోనాఽహ మచేతనః ॥"

20-21. "ప్రకాశరహితము, నశ్వరము, జడమునగు ఘ్రాణేంద్రియముచే కల్పింప బడినదియు, కోమలమును, అనియతాకృతియు (అనేక విధములుగ మాఱుచుండునదియు) అచేతనమునైన, గంధమును నేను కాను."

"నిర్మమోఽమననః శాన్తో, గతపఞ్చేన్ద్రియభ్రమః ॥ 21 ॥
శుద్ధచేతన ఏవాఽహం, కలాఽకలనవర్జితః ।
చేత్యవర్జితచిన్మాత్ర, మహమేషోఽవభాసకః ॥ 22 ॥
సబాహ్యాభ్యన్తరవ్యాపీ, నిష్కలాఽమలసన్మయః ।
అ! ఇదానీం స్మృతం సత్య మేతత్తదఖిలం మయా" ॥ 23 ॥

21-23. "మమతారహితము, మనోమననశూన్యము, శాంతము, పంచేంద్రియ భ్రమ రహితము, కలాకలన (సంకల్పవికల్ప) వర్జితము, నైనశుద్ధచిన్మాత్ర స్వరూపమగు ఆత్మను నేను.

చేత్య(విషయ)వర్జితచిన్మాత్రమగు నేనే, సర్వప్రకాశకుడను. బాహ్యాభ్యంతరముల వ్యాపించి యున్నవాడను, నిష్కళుడను, నిర్మలుడను, సన్మాత్ర స్వరూపుడను. అహో! ఇప్పటికి పరిపూర్ణముగ యథార్థము జ్ఞప్తికి వచ్చినది."

(**కలా కలన వర్జితః** – కలా=భాగము. కలనం=పరిగణనము – ఇవి లేనిది కలాకలనవర్జితము – అనియు వివరింపవచ్చును)

"నిర్వికల్పచిదాభాస, ఏష ఆత్మాఽస్మి సర్వగః ।
మయైవ చేతనేనేమే, సర్వే ఘటపటాఽఽదయః ॥ 24 ॥

సూర్యాద్యా అవభాసన్తే, దీపేనోత్తమ తేజసా ।
మయ్యేవైతాః స్ఫురన్తీహ, విచిత్రేన్ద్రియ వృత్తయః ॥25॥
తేజసాఽన్తః ప్రకాశేన, యథాఽగ్ని కణపఙ్క్తయః ।"(1)

24-26. "నిర్వికల్ప చిదాభాసము, సర్వగతమునైన ఆత్మను నేను. ఘటపటాదులు (కుండ, వస్త్రము మొదలగునవి) మొదలుకొని, సూర్యుని వఱకు గల పదార్థములన్నియు, అత్యంత కాంతిమంతమగు దీపము చేత వలె, శుద్ధ చైతన్య స్వరూపుడనైన నాచే ప్రకాశితములగుచున్నవి. అంతర్గతమైన తేజఃప్రకాశము చేత, అగ్నికణపంక్తుల యట్లు, చిత్ర విచిత్రములైన ఇంద్రియవృత్తులన్నియు, నా వలననే స్ఫురించుచున్నవి."

"సర్వభావాఽన్తరస్థాయ, చైత్యముక్తచిదాత్మనే ॥ 26 ॥
ప్రత్యక్చేతన రూపాయ, మహ్యమేవ నమో నమః ।
స్వయ మేవోదితం స్వస్థం, నమామి స్వవశం స్వయమ్(2)" ॥ 27 ॥

---

(1) పోల్చు :- "న తత్ర సూర్యోభాతి, న చన్ద్రతారకం,
నేమా విద్యుతోభాన్తి, కుతోఽయమగ్నిః ।
త మేవభాన్త మనుభాతి నిత్యం,
తస్య భాసా సర్వమిదం విభాతి ।  (కఠ–ఉ.II-15)
స్వాత్మభూతమగు ఆపరబ్రహ్మమునందు, సూర్యచంద్ర నక్షత్రములు, విద్యుత్తులు (మెఱపులు), ప్రకాశించుట లేదు. అగ్ని యెట్లు ప్రకాశించును? సూర్యచంద్రాది సర్వ తేజస్సులును, ప్రకాశించుచున్న ఆ పరబ్రహ్మమునే అనుసరించి ప్రకాశించుచున్నవి. ఆపరబ్రహ్మము యొక్క కాంతి చేతనే, ఈ సూర్యచంద్రాది తేజఃసమూహము సర్వమును, అధికముగ ప్రకాశించుచున్నది.

(2) పోల్చు :- "అహో! అహం నమో మహ్య మేకోఽహం దేహవా నపి ।
క్వచిన్నగన్తా, నాఽఽగన్తా, వ్యాప్య విశ్వ మవస్థితః ।  (అష్టావక్ర గీత.II-12)
అహో! ఆశ్చర్యము ! దేహవంతుడనైనను, నాకు రాకపోకలు లేవు, విశ్వమును వ్యాపించి యున్నాను. అద్వయుడనైన నాకు నేనే నమస్కరించుచున్నాను.
[అహంకారము, దేహము యొక్క మార్పు ననుసరించి క్షణక్షణము మారుచున్నది. క్షణక్షణము, మాలినమగు 'అహము' ఉత్పన్నమగుచున్నది. కాని, ఈ క్షణక్షణ పరిణామ ధర్మముల నన్నటిని అతిక్రమించి, ఆత్మ, అవిక్రియము, అవ్యయము, అక్షరము, నిత్యము, సర్వగతమునై యున్నది.]
మఱియు పోల్చు :- "పఞ్చభూతాత్మకం విశ్వం మరీచిజలసన్నిభమ్ ।
కస్యాఽప్యహో! నమస్కుర్యా మహ మేకో నిరఞ్జనః ।"
(దత్తాత్రేయుడు – అవధూత గీత -I-3)
పంచభూతాత్మకమగు ఈ విశ్వము, ఎండమావులలోని జలముల వలె కేవలము దృశ్యము – మిథ్యారూపము. అహో! నిరంజనుడు (నిర్మలుడు) అద్వయుడునైన నేను ఎవనికి నమస్కరింతును? ఆత్మకంటె రెండవది యగు పదార్థ మేదియును లేదని భావము.

26-27. "సర్వ పదార్థముల యందును స్థితి గల్గి, విషయ వర్జితమును, చిదాత్మయు, ప్రత్యగాత్మస్వరూపమునగు నాకు, నేనే పలుమారు వందనము అర్పించుకొనుచున్నాను. స్వయంజాతము, స్వస్థము, స్వవశము (స్వతంత్రము) స్వయమునైన ఆత్మకు నమస్కరింతును."

"తిష్ఠన్నపి హి నాఽఽసీనో, గచ్ఛన్నపి నగచ్ఛతి ।
శాన్తోఽపి వ్యవహారస్థః, కుర్వన్నపి న లిప్యతే"★ ॥ 28 ॥

28. "ఈ ఆత్మ కూర్చుండియు, (నిష్క్రియు డయ్యును), కూర్చుండని (ఉపవిష్టుడు కాని) వాడు. నడుచుచున్నను నడవని వాడు. శాంతుడయ్యును సర్వ వ్యవహారముల నొనర్చువాడు; అన్నిటి నొనర్చుచున్నను నిర్లిప్తుడు."

"ఏష ఏవ పదాఽన్వేష్యః, స్తుత్యో ధ్యాతవ్య ఏవ చ
జరామరణ సమ్మోహా దనేనోత్తీర్య గమ్యతే" ॥ 29 ॥

29 "ఈ పరమాత్మయే, సదా అన్వేషింప దగినవాడు, స్తుతింపదగినవాడు, ధ్యానింపదగినవాడు. జరామరణసమ్మోహము నుండి, పరమాత్మను ఆశ్రయించుట చేతనే, మనుజుడు తరించి, పరమాత్మను పొందు చున్నాడు."

"న మే భోగస్థితౌ వాఞ్ఛా, న మే భోగవివర్జనే ।
యదాఽఽయాతి తదాఽఽయాతు, యత్ప్రయాతి ప్రయాతు తత్"
॥ 30 ॥

30 "నాకు భోగానుభవమును గూర్చి కాని, భోగానుభవవర్జనమును గూర్చికాని, ఏ కాంక్షయును లేదు. వచ్చినది రానిమ్ము; పోవునది పోనిమ్ము."

"మనసా మనసి చ్ఛిన్నే, నిరహఙ్కారతాం గతే ।
భావేన గళితే భావే, స్వస్థ స్తిష్ఠామి కేవలః" ॥ 31 ॥

---

★ పోల్చు :- "అనేజ దేకం మనసో జవీయో,
నైన ద్దేవా ఆప్నువ న్పూర్వ మర్షత్ ।
తద్ధావతోఽన్యా నత్యేతి తిష్ఠత్,
తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ।"

"త దేజతి తన్నైజతి, త ద్దూరే తద్వదన్తికే ।
తదన్తరస్య సర్వస్య, తదు సర్వస్యాఽస్య బాహ్యతః ।  (ఈశా.ఉ. 4, 5)
చలనము లేనిదీ ఆత్మతత్త్వము. సర్వభూతములందును ఏకరూపమై యున్నది.

31. "మనస్సు, మనస్సుచే ఛేదింపబడి, అహంకార రహితము కాగా, 'బ్రహ్మాఽహం' భావముచే 'దేహోఽహంభావము' గళితము కాగా (నశింపగా), నేనిపుడు కేవలము ఆత్మస్థితుడనై (స్వస్థుడనై) యున్నాను.

**"జయ సర్వాఽఽగమాతీత! జయ సర్వాఽఽగమాఽఽస్పద★! ।**
**జయ భావ! జయాఽభావ! జయ శాన్తిపరాయణ! " । 32 ।**

32. "సర్వాగమములకును అతీతుడైన వానికి జయము! సకలా గమములకును నిలయమైన వానికి (సర్వ ప్రమాణ వేద్యునికి) జయము! సద్రూపునికి జయము!

అసద్రూపునికి జయము! శాంతిపరాయణునికి జయము!"

**ఇతి మత్వా సమాధౌ సః, నిర్వికల్పే చిరం స్థితః ।**

33. ఇట్లు భావించి, ప్రహ్లాదుడు, చిరకాలము, నిర్వికల్ప సమాధి యందుండెను.

## 3. హరిణా ప్రబోధనమ్ – హరిచే ప్రహ్లాదప్రబోధనము

**ఏవం తస్మింస్తు విశ్రాన్తే, హరి రేవం వ్యచిన్తయత్ । 33 ।**

33. ఇట్లు ప్రహ్లాదుడు, బ్రహ్మపదమున విశ్రాంతి నందగా, హరి యిట్లు వితర్కించెను.

**"దైత్యరాజే శమం యాతే, శత్రుహీనాః సురాః ధ్రువమ్ ।**
**శమమేత్య గమిష్యన్తి, మోక్షాఖ్యం పద ముత్తమమ్ । 34 ।**

34. "దైత్యరాజు (ప్రహ్లాదుడు) బ్రహ్మపదమున విశ్రాంతిని పొందగా, దేవతలు శత్రురహితులై, శమమును పొంది, మోక్షాఖ్యమగు ఉత్తమపదమును నిశ్చయముగ ప్రాపింపగలరు.

**దేవాఽభావేఽఫలాః సర్వాః, భువి యజ్ఞతపః క్రియాః ।**
**క్రియా స్వథోపశాన్తాసు, భూలోకోఽవ్యస్త మేష్యతి । 35 ।**

---

★ పోల్చు :- శాస్త్రయోనిత్వాత్ । బ్ర.సూ. I-1.3
(i) బ్రహ్మము, వేద విజ్ఞానమునకు కారణము, (ii) జగజ్జన్మాదులకు కారణము బ్రహ్మమని బ్రహ్మస్వరూప బోధక సమ్యగ్ జ్ఞానమునకు వేదమే మనకు ప్రమాణము.
మఱియు :–
"అహ మేవాఽక్షయో నిత్యః పరమాత్మాఽఽత్మసంశ్రయః ।
బ్రహ్మసంజ్ఞోఽహమేవాఽగ్రే, తథాఽన్తే చ పరః పుమాన్ ।
(విష్ణుపురాణము–అంశ I అధ్యాయం–19. శ్లో.86)

35. దేవతలు లేమిచే, భూలోకమున యజ్ఞములు, తపస్సులు, మొదలగు విహితకర్మములు, నిష్ఫలములగును. క్రియలు నశించినచో, కర్మ భూమియగు భూలోకము సైతము నశించును".

**అసంసారప్రసఙ్గోఽథ, తస్య నాశే భవిష్యతి ।**
**నేహ శ్రేయోఽనుపశ్యామి, జగ త్యేవం శమం గతే" । 36 ।**

36. భూలోకము నశింపగా, సంసారము లేనట్లే యగును. జగ మిట్లు ఉపశమింపగా, (నశింపగా), ఇచ్చట ఏ శ్రేయమును నేను గాంచుట లేదు."

**ఇతి సంచిన్త్య దైత్యేన్ద్రం, పాఞ్చజన్యరవేణ సః ।**
**ప్రబోధ్య త మువాచేదం, "సాధో! స్మర నిజాఽఽకృతిమ్ । 37 ।**

37. ఇట్లు విచారించి హరి, పాంచజన్య (దివ్యశంఖ) రవముచే, దైత్యేంద్రుని (ప్రహ్లాదుని) మేల్కొల్పి, అతనితో నిట్లు వచించినాడు. "సౌమ్యుడా! నీ నిజాకృతిని స్మరించుకొనుము.

**జీవన్ముక్తేన భవతా, రాజ్య ఏవ హి తిష్ఠతా ।**
**క్షపణీయా గతోద్వేగ మాకల్పాన్త మియం తనుః" । 38 ।**

38. "జీవన్ముక్తుడవగు నీచే రాజ్యమందే యుండి (రాజ్య పాలన మొనర్చుచు) నిరుద్వేగ భావమున ఆకల్పాంతము, ఈ శరీరము కొనసాగింపదగినది.

**'కృశోఽతి దుఃఖీ మూఢోఽహ' మితి చాఽన్యాశ్చ భావనాః ।**
**మతిం యస్యాఽవలుమ్పన్తి, మరణం తస్య రాజతే । 39 ।**

39. 'నేను కృశుడను, మిగుల దుఃఖితుడను, మూఢుడను' - అను నిట్టివియు, మఱియు నిట్టివేయగు ఇతర భావనలు, ఎవని బుద్ధిని బాధించునో, (లోపింప జేయునో), వానికే కదా! **మరణము శోభించును.**

---

**ఏవం పశ్చ్య త్తయన్ విష్ణు మభేదేనాఽఽత్మనో ద్విజ! ।**
**తన్మయత్వ మవాప్య గ్ర్యం, మేనే చాత్మానమచ్యుతమ్ ।**
**విసస్మార తథాఽఽత్మానం, నాఽన్యత్కి ఞ్చదజానత ।**
**అహమేవాఽవ్యయోఽనన్తః పరమాత్మేత్యచిన్తయత్ ।"** (వి.పు. అంశ I.అధ్యాయ-20 శ్లో-1,2)
**ప్రహ్లాదుడు, నారాయణధ్యానమున, తన్మయత్వమును ప్రాపించి, సర్వము విస్మరించి తానే పరమాత్మనను అద్వైతభావము నధిగమించెనని భావము. ఇది పరాభక్తికిని పరమ జ్ఞానమునకును అభేదమును స్థాపించుచున్నది.**

**యస్య నాऽహఙ్కృతో భావః, బుద్ధి ర్యస్య న లిప్యతే ।**
**యః సమః సర్వభూతేషు, జీవితం తస్య శోభతే ॥ 40 ॥**

40. ఎవని భావము అహంకారరహితమో, బుద్ధి, నిర్లిప్తమో, ఎవడు సర్వభూతముల యందును, సముడో, అట్టివానికే, జీవితము శోభించును.

**ఆశాపాశనిబద్ధోఽన్త రితశ్చేతశ్చ నీయతే ।**
**యో విలోలమనోవృత్త్యా, మరణం తస్య రాజతే" ॥ 41 ॥**

41. ఆశాపాశ బద్ధాంతఃకరణుడై, చంచలములగు మనోవృత్తులచే, ఇటునటు నీడ్వబడుచుండు వానికి మృత్యువే శోభించును."

**యోఽన్తః శీతలయా బుద్ధ్యా, రాగద్వేషవిముక్తయా ।**
**సాక్షివ త్పశ్యతీదం హి, జీవితం తస్య శోభతే ॥ 42 ॥**

42. ఎవడు రాగద్వేషాదులు లేక, లోపల చల్లనైనబుద్ధితో, దీని (జగత్తు) నంతయును, సాక్షి వలె చూచుచుండునో, వానికి కదా! జీవితము శోభించును.

**తదుత్తిష్ఠాऽసురాऽధీశ!, సింహాసన ముపాశ్రయ ।**
**యావన్మేరు ర్ధరా యావత్, యావత్ చన్ద్రార్క మణ్డలమ్*॥43॥**

43. కావున దానవరాజా! లెమ్ము, సింహాసన మధిరోహింపుము. మేరువు, భూమి, చంద్రార్కమండలములు ఎంత వఱకుండునో --

**అఖణ్డితగుణశ్లాఘీ, తావద్రాజా భవాఽనఘ! " ।**
**ఇత్యుక్త్వా పుణ్డరీకాక్షః, తత్రైవాऽన్తర్ధిమాయయౌ ॥ 44 ॥**

44. అంత వఱకు, జనులచే శ్లాఘింపదగిన సమస్త గుణములతోనొప్పారుచు, రాజ్యమును పాలింపుము" - ఇట్లు వచించి పుండరీకాక్షుడు (విష్ణువు) అచటనే, అంతర్హితుడయినాడు.

**శ్రీరామ ఉవాచ -**

**కథం ప్రబుద్ధం భగవన్! ప్రహ్లాదస్య మహాత్మనః ।**
**పదే పదే దృఢం లీనం, పాఞ్చజన్య స్వనై ర్మనః? ॥ 45 ॥**

---

* చన్ద్రార్కమణ్డలే - పా.భే.

**45.** శ్రీరాముడు :- స్వామీ! పరమపదము నందు దృఢముగ లీనమై యున్న మహాత్ముడగు ప్రహ్లాదుని మనస్సు, ఎట్లు పాంచజన్య దివ్యశంఖారావముల చే మేలుకొన్నది?

**వసిష్ఠ ఉవాచ :-**

**భృష్టబీజోపమా భూయో జన్మాఙ్కుర వివర్జితా ।**
**హృది జీవద్విముక్తానాం, శుద్ధా వసతి వాసనా ॥ 46 ॥**

**46.** **వసిష్ఠుడు :-** జీవన్ముక్తుల హృదయమున, వేచిన గింజను పోలినదియు, పునర్జన్మాంకుర రహితమై నదియునగు,విశుద్ధ వాసన నిలిచి యుండును.

**అపి వర్ష సహస్రాన్తే, తయైవాన్తరవస్థయా ।**
**సతి దేహే ప్రబుధ్యన్తే, కుతోఽప్యుచ్ఛ్వాసయా శనైః ॥ 47 ॥**

**47.** శ్రీరామా! వేయి సంవత్సరముల తరువాత నైనను, శరీర ముండినచో, ఈ లోపలి ఉన్నతచిత్తవృత్తి (వాసన) వలననే వారు, మెల్లగా మేలుకొందురు.★

ఇతి శ్రీ యోగవాసిష్ఠసంగ్రహే 'ప్రహ్లాదోపాఖ్యానం' నామ త్రయోదశః సర్గః ।

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠసంగ్రహమున 'ప్రహ్లాదోపాఖ్యానము'ను

త్రయోదశ - (పదుమూడవ) సర్గము సమాప్తము

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



★ పరమేశ్వరానుగ్రహము వలన కాని, తత్త్వ విచారమును, బ్రహ్మవిశ్రాంతియు, సంభవింప దనుటను ఈ ఉపాఖ్యానము వివరించుచున్నది. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసా మద్వైత వాసనా" (అవధూతగీత–I-1)

"ఈశప్రసాదలభ్యోఽపి, నేశ్వరే దీయతాం భరః ।
పౌరుషేణేన్ద్రియాఽఽక్రమ్య సాధ్యం జ్ఞాన మితీర్యతే ॥"
(ఆనందబోధేంద్ర సరస్వతి–యో.వా.తా.ప్ర.V-43.1)

పరమేశ్వర ప్రసాద లభ్యమైనను, పరమేశ్వరునిపైననే భారమువేయక, పౌరుషమున, నింద్రియముల నాక్రమించుటచే, జ్ఞానము సాధ్యమనియును, ఇది తెల్పుచున్నది.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యో, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## చతుర్దశసర్గము

## గాధ్యుపాఖ్యానమ్ – గాధి వృత్తాంతము

### 1. స్వస్య శ్వపచత్వాదిదర్శనమ్ – గాధి తాను చండాలత్వాదులను పొందుటను దర్శించుట

వసిష్ఠ ఉవాచ –
జగన్మాయాప్రపఞ్చస్య, వైచిత్ర్యప్రతిపత్తయే ।
ఇతిహాస మిమం, వక్ష్యే, శృణుష్వాఽవహితోఽనఘ ! ॥ 1 ॥

1. వసిష్ఠుడు :- అనఘా! జగత్తను మాయా విస్తారము యొక్క వైచిత్ర్యమును ప్రతిపాదించుట కొఱకు, నీకొక ఇతిహాసమును చెప్పెదను. సావధాన మనస్కుడవై వినుము.

కోసలేషు ద్విజః కశ్చిత్, గుణీ గాధి ఇతి శ్రుతః ।
ఆకణ్ఠ మమ్బు నిర్మగ్నః, తపశ్చక్రే తతో హరిః ॥ 2 ॥

ఆగత్యోచే "ద్విజోత్తిష్ఠ! గృహాణాఽభిమతం వరమ్" ।

2. కోసలదేశమున గుణశాలియగు గాధి యనునొక బ్రాహ్మణుడుండెను. అతడు కంఠపర్యంతము, జలమున మునిగి, తపమాచరించినాడు. తరువాత, శ్రీహరి అతని కడకేతెంచి, "బ్రాహ్మణా! లెమ్ము! నీ కభీష్టమగు వరమును గైకొమ్ము." - అని పలికినాడు.

**గాధి రువాచ :-**

**"త్వయా సృష్టా మిమాం మాయాం భగవన్ ! పారమాత్మికీమ్ ।3।**
**ద్రష్టు మిచ్ఛామి సంసారనామ్నీ మాశ్చర్యకారిణీమ్ ।"**

3-4. గాధి :- "భగవంతుడా! పరమాత్మయందు నీచే కల్పింపబడిన ఆశ్చర్య కారిణియగు సంసారనామకమగు మాయను దర్శింప గోరుచున్నాను."

**'ఇమాం ద్రక్ష్యసి మాయాం త్వ' మిత్యుక్త్వాఽన్తర్దధే హరిః । 4 ।**

4. భగవంతుడు,"నీ వీమాయను దర్శింపగల"వని పలికి అదృశ్యుడయ్యెను.

**స్నానాఽర్థ మేకదా గాధిః, మమజ్జాఽన్తర్జలం తదా ।**
**అపశ్య న్మృత మాత్మానం, స్వగృహే బన్ధుభి ర్వృతమ్ । 5 ।**

5. ఒకప్పుడు గాధి, స్నానార్థమై వెళ్లి, జలముల యందు మునిగెను. అప్పుడు స్వగృహమున బంధుపరివృతుడై, తాను మరణించియున్నట్లు గాంచినాడు.

**తతో నీత్వా శ్మశానం తే, చక్రు స్తం భస్మసాచ్ఛవమ్ ।**
**అథాఽపశ్యదసౌ భూయో, హూణగ్రామ నివాసినామ్ । 6 ।**
**శ్వపచానాం గృహే జాత మాత్మానం కాన్తయా యుతమ్ ।**

6-7. తరువాత, బంధువులు శవమును శ్మశానమునకు గొనిపోయి, భస్మ సాత్కార మొనరించిరి. అప్పుడు, మరల, హూణగ్రామనివాసులైన చండాలుర గృహమున తాను జన్మించినట్లును, భార్యాయుక్తుడై యున్నట్లును, అతడు దర్శించెను.

**తతో జరఠతాం యాతం, మృత్యునా హృతబాన్ధవమ్ ॥ 7 ॥**

7. అనంతరము అతడు వృద్ధుడై యుండగా, అతని బంధువు లందఱు గతించి నట్లాతడుగాంచెను.

**తతః శోకపరీతాత్మా, నిజం దేశం విహాయ సః ।**
**నగరం ప్రాప్య కీరాణాం, రాజమార్గే స్థిత స్తదా ॥ 8 ॥**

8. శోకాకులచిత్తుడై తరువాత అతడు, స్వదేశమును పరిత్యజించి, కీర దేశవాసుల నగరమును (కాశ్మీరదేశమును) చేరి, రాజమార్గమున నిలిచి యుండగా అప్పుడు –

**మృతే రాజని రాజాఽర్థం, విహరన్త మితస్తతః ।**
**హస్తినం స దదర్శాఽథ, కరేణాఽఽదాయ తం గజః ॥ 9 ॥**
**స్కన్ధే న్యవేశయత్ మోదా న్నేదుర్దున్దుభయ స్తదా ।**
**ఏవం గవల నామ్నాఽసౌ, కీరరాజో బభూవ హ ॥ 10 ॥**

9-10. అతడు, ఇటునటు తిరుగాడుచున్న నొక గజమును కాంచినాడు. ఆ దేశపురాజు మరణింపగా, ఆ గజము, మఱియొక అదృష్టవంతుని రాజ పదవి యందు ప్రతిష్ఠించుటకు అన్వేషించుచుండెను. ఆ హస్తి, అతనిని తొండముతో గ్రహించి, సంతోషమున కుంభస్థలమున కూర్చుండ బెట్టుకొన్నది. విజయదుందుభు లపుడు మ్రోగినవి. ఇ ట్లతడు కీర రాజ్యమున గవలుడను పేరున ప్రసిద్ధుడైనాడు.

**అష్టౌ వర్షాణి రాజ్యం స, చకార మన్త్రి పూజితః ।**

11. మంత్రులచే సేవింపబడుచు అతడు, ఎనిమిది సంవత్సరములు రాజ్య మేలినాడు.

**యదృచ్ఛయైకదా తం తు, నిర్గతం త్యక్తభూషణమ్ ॥ 11 ॥**
**ఆలక్ష్య శ్వపచః కశ్చిత్, ప్రోచే చ 'చిరబాన్ధవ ! ।**
**దర్శనేన తవాఽద్యాఽహం, పరాం నిర్వృతి మాగతః' ॥ 12 ॥**

11-12. ఒకనాడు యథేష్టముగా తన భూషణములను –(రాజవేషమును) విడిచి, బయలు వెడలిన అతనిని గాంచి, యొక చండాలుడు 'చిరకాల

బాంధవా! నీ దర్శనమున నిపుడు, నేను పరమానందమును పొందితి'నని యన్నాడు.

**శ్రుత్వేదం మన్త్రిణః సర్వే, వాతాఽయనగతాః స్త్రియః ।**
**శ్వపచోఽయం మహీపాల, ఇతి నిశ్చిత్య దుఃఖితాః ॥ 13 ॥**

**13.** ఇది విని మంత్రు లందలు, వాతాయనముల (గవాక్షముల) నుండి గమనించుచున్న అంతఃపురకాంతలును, రాజును చండాలుడని నిశ్చయించి, మిగుల దుఃఖించినారు.

**తతః ప్రభృతి నాఽస్ప్రాక్షుః, తిష్ఠన్తం తం శవం యథా ।**
**అథ సర్వే 'వయం దీర్ఘకాలం శ్వపచదూషితాః ॥ 14 ॥**
**ప్రాయశ్చిత్తై ర్న శుద్ధ్యామః, ప్రవిశామో హుతాశనమ్' ।**
**ఇతి నిర్ణీయ సర్వేఽగ్నిం, వివిశుః సహ బన్ధుభిః ॥ 15 ॥**

**14-15.** అది మొద లెవ్వరును, అతనిని శవము వలె చూచుచు, స్పృశింప మానినారు. 'మనము చాలకాలము చండాలస్పర్శదూషితులమై నాము. ప్రాయశ్చిత్తములచే శుద్ధులము కాజాలము. అగ్నిలో ప్రవేశింతుము గాక!' – అని నిర్ణయించుకొని, వారందఱు బంధుయుక్తముగ అగ్నియందు ప్రవేశించినారు.

**రాజా మత్వా 'మ దర్థం హి దేశేఽనర్థోఽయమాగతః' ।**
**ఇతి వహ్నౌ వముద్వేగ మాజుహావ నిజం వపుః ॥ 16 ॥**

**16.** 'ఈ దేశమున నా వలననే కదా ఈ యనర్థము దాపరించినది' – అని నిశ్చయించుకొని రాజు, ఉద్వేగరహితముగ, తన దేహమును అగ్నికి ఆహుత మొనర్చెను.

**అత్రాన్తరేఽ నలక్షుబ్ధో, గాధి ర్మోహా దబుధ్యత ।**
**'కోఽహం? కిమివ పశ్యామి?, కిమకార్ష మహం కిల' ? ॥ 17 ॥**
**ఏవం విచారయంశ్చాత్ర ముదస్థా దుదకాన్తరాత్ ।**

**17-18.** అంతలో, అగ్ని వలన, క్షుభితుడైన – (కలత జెందిన) గాధి, ఆభ్రాంతి నుండి మేల్కొన్నాడు. 'నేనెవడను? ఏమిగాంచుచున్నాను? ఇంత

వఱ కేమిచేసితిని?' – అని ఇట్లు, జరిగిన విచిత్రమును విచారించుచు, నీటిలో నుండి పైకి లేచినాడు.

## 2. మిథ్యాదృష్టస్య సత్యతా – మిథ్యగా కాంచబడిన దాని యొక్క సత్యత (ప్రత్యక్షావలోకనము)

**'చేతో భ్రమ త్యనన్తాసు, భ్రాన్తిదృష్టిషు దేహినామ్' । 18 ।**
**ఇతి మత్వా స్థితే తస్మిన్, ఆజగామ ప్రియోఽతిథిః ।**
**క్రమాత్ శయన మాసాద్య, గాధిః పప్రచ్ఛ తం ద్విజమ్ । 19 ।**

18-19. 'దేహధారుల చిత్తము, అనంతములైన భ్రాంతిదృష్టుల – (కల్పనల) యందు తిరుగాడుచుండును' – అని నిశ్చయించుకొని ఆశ్రమమున నుండగా, ప్రియుడైన అతిథి యొక డాతని కడ కేతెంచినాడు. క్రమముగ శయ్యాయం దాతని నాసీనుని చేసి, గాధి, ఆ బ్రాహ్మణు నిట్లు ప్రశ్నించినాడు.

**'కిం బ్రహ్మన్ ! సంకృశాఙ్గ స్త్వం కిమితి శ్రమవానసి'? ।**

20. 'బ్రాహ్మణుడా! నీవేల కృశించియున్నావు? ఏల యిట్లు శ్రమపడితివి?'

**అతిథి రువాచ :–**

**"కీరేషు వ్యవసం మాసం, తత్రైషా హి కథా శ్రుతా" । 20 ।**

20. **అతిథి :–** "కీరదేశమున నొక్క మాసము వసించితిని. అచ్చట ఈ కథను నేను విన్నాను.

**'ఇహాఽభూత్ శ్వపచో రాజా, వర్షాణ్యష్టౌ ద్విజోత్తమ ! ।**
**స ఏకాన్తే పరిజ్ఞాతః, ప్రవిష్టో జ్వలనం జవాత్ । 21 ।**
**తథా ద్విజశతానీహ, ప్రవిష్టాని హుతాశనమ్ ।**

21-22. 'బ్రాహ్మణోత్తమా! ఇచ్చట నొక చండాలుడు, ఎనిమిది సంవత్సరములు రాజుగ నుండెను. కడపట అతడు ఛండాలు డని తెలియబడగానే, ఆ రాజు, శీఘ్రముగ నగ్ని ప్రవేశ మొనర్చెను. అట్లే, ఆ నగరమందలి బ్రాహ్మణులును, వందల కొలదిగ, అగ్ని ప్రవేశ మొనర్చినారు.'

"ఇతి శ్రుత్వా తతో గత్వా, ప్రాయశ్చిత్తం విధాయ చ ॥ 22 ॥
క్రమాత్ చాన్ద్రాయణస్యా*ఽన్తే, పారణార్థ మిహాఽఽగతః ।
శ్రాన్తోఽహ ముపవాసేన, నాఽన్యదస్తి హి కారణమ్" ॥ 23 ॥

**22-23.** "ఇట్లు విన్న తరువాత, అట నుండి బయలుదేరి, ప్రాయశ్చిత్త మొనరించుకొని, చాంద్రాయణవ్రతానంతరము పారణార్థ మిట కేతెంచితిని. ఉపవాసము వలన అలసితిని. వాస్తవముగ మఱియే ఇతరకారణమును లేదు."

ఇతి తేనోదితం శ్రుత్వా, విస్మయావిష్టమానసః ।
గాధిశ్చ చిన్తయామాస, 'మద్వృత్తాన్తోఽయ మీదృశః' ॥ 24 ॥

**24.** ఇట్లు తడు చెప్పిన వృత్తాంతమును విని, గాధి, విస్మయావిష్టచిత్తుడై 'ఈ నా వృత్తాంత మిట్టిది' – అని చింతించినాడు.

అథ నిర్గత్య స ద్రష్టుం, హూణమణ్డల మాగతః ।
తత్ర దృష్ట్వా యథా పూర్వం, నిజం శ్వపచమన్దిరమ్ ॥ 25 ॥
కీరమణ్డల మాసాద్య, స్వానుభూతాని దృష్టవాన్ ।

**25-26.** తరువాత బయలుదేరి, హూణమండలమును చూచుటకు గాధి, యేతెంచి, అచ్చట, యథాపూర్వమగు తన చండాలగృహమును గాంచి, అట నుండి, కీరదేశమును చేరి, తాను అనుభవించిన వానిని నన్నిటిని గాంచినాడు.

విస్మయోత్కమ్పిత శిరాః, ధాతుశ్చేష్టాం పరామృశన్ ॥ 26 ॥
భూయో గాధిః తపశ్చక్రే, తీవ్రం శైలస్యకన్దరే ।
ఆగత్య చ తపః ప్రీత, ఊచే చక్రగదాధరః ॥ 27 ॥

---

★ చాంద్రాయణము– శుక్ల, కృష్ణ, పక్షములందు, చంద్రకళల వృద్ధి క్షయముల ననుసరించి, ప్రతిదినము భోజనమును క్రమముగా హెచ్చు తగ్గులుగా ఆచరించునట్టి ప్రాయశ్చిత్త రూపమగు వొక వ్రతము. మూడువేళల స్నానమొనర్పవలెను.

"ఏకైకం హ్రాసయేత్ పిణ్డం కృష్ణే, శుక్లే చ వర్ధయేత్ ।
ఉపస్పృశన్ త్రిషవణ మేతత్ చాన్ద్రాయణం వ్రతమ్" ।

26-27. ఆశ్చర్యముతో కంపించుచున్న శిరస్సుతో, విధాత (భగవంతుడగు విష్ణుని) చేష్టితమును పరామర్శించుచు, గాధి, మరల, పర్వతగుహ యందు తీవ్రతప మాచరించినాడు. చక్రగదాధరుడైన భగవంతు డాతని తపమునకు ప్రీతుడై యేతెంచి, ఇట్లు వచించెను.

**'మమ మాయా త్వయా దృష్టా, కి మన్య దభివాఞ్ఛసి' ? ।**

**గాధి రువాచ :—**

**'తస్యా మర్మ న జానామి, భ్రమః సత్యోఽభవత్ కథమ్'? । 28 ।**

28. 'నా మాయను గాంచితివి. మఱి ఇతరము దేనిని వాంఛింతువు'?

గాధి :- 'స్వామీ! మాయ యొక్క రహస్యమును నే నెఱుగను. భ్రమ, సత్య మెట్లయినది?'

### 3. భగవదుపదేశః – భగవంతుని ఉపదేశము

**భగవానువాచ :—**

**"చిత్తస్థం హి పృథివ్యాది, న బహిస్థం కదాచన ।**
**స్వప్నభ్రమపదార్థేషు, సర్వైరేవాఽనుభూయతే । 29 ।**

29. భగవంతుడు :- "పృథివ్యాదులు (పాంచభౌతికపదార్థములు) మనసునందే యున్నవి; కాని, ఎపుడైనను, అవి బయట వేఱుగ లేవు. అందఱును వానిని, స్వప్నము నందలి భ్రమాత్మకపదార్థములందు, అనుభవించు చున్నారు.

**యత్రాఽనన్త జగజ్జాలం, సంస్థితం తేన చేతసా (తేజసా) ।**
**దర్శితం శ్వపచత్వం చేత్తదాఽత్ర విస్మయః కుతః? । 30 ।**

30. ఏ చిత్తమున అనంతమగు జగజ్జాలము ఇమిడి యున్నవో, ఆచిత్తము చేతనే చండాలత్వము ప్రకటితమైనచో, అందు ఆశ్చర్యమేమున్నది? (ఈ శ్వపచత్వము, మనఃస్థితమైన అనంత వాసనాజాలమున, ఏకదేశ ప్రకటనమే. యో.వా.తా.ప్ర. V-48-56.)

**యథా శ్వపచతా దృష్టా, ప్రతిభావవశా త్త్వయా ।**
**తథైవాఽతిథి మాయాతం, దృష్టవానసి సంభ్రమే । 31 ।**

31. మాయాప్రభావమున, చండాలత్వమును నీవు గాంచినట్లే. ఆ భ్రాంతియందే, అతిథి ఏతెంచుటను కాంచితివి.

**తథా హూణస్థలం ప్రాప్య, దృష్టోఽసి ప్రాక్తనం గృహమ్ ।**
**తథా కీరేషు రాజత్వం, దృష్టవాన్ ప్రతిబిమ్బితమ్ । 32 ।**

32. అట్లే, హూణదేశమును చేరి, పూర్వపు గృహమును గాంచితివి. అట్లే, కీరదేశమున రాజత్వమును ప్రతిబింబము వలె కాంచితివి. (భ్రాంతి కారణమగు చిత్తమున ప్రతిబింబించిన దానిని కాంచితివి)

**కదాచిత్ ప్రతిభైకైవ, బహూనామపి జాయతే ।**
**తేనైవ సన్నివేశేన, శ్వపచోఽప్యభవత్పురా । 33 ।**

33. ఒకొక్కప్పుడు, ఒకే విధమైన ప్రతిభాస – (భ్రాంతి), – పలువురకు కలుగవచ్చును. అట్టి సన్నివేశము చేతనే, (ఇపుడు నీవు కాంచిన శరీర గ్రామగృహదారాదుల ఆకృతులతో కూడియే, పూర్వము (కటంజకుడను) – చండాలుడు జనించి యుండెను.

**స కీరనృపతి ర్భూత్వా, ప్రవివేశాఽనలం తతః ।**
**తవాఽభూత్ కేవలం చిత్తే, స్వసంబన్ధితయా హి తత్ । 34 ।**

34. అతడు కీరదేశమునకు రాజై, తరువాత (చండాలుడని తెలియబడినవాడై) అగ్ని ప్రవేశ మొనర్చెను. (ఇదియే నిజము) అది (ఆ చండాలుని ఆచార స్థితి), నా సంకల్పబలమున, స్వసంబంధిత్వము వలన, నీ చిత్తమున కేవలము ప్రతిభాసించినది.

**జ్ఞానస్యాఽపరిపూర్ణత్వాత్, న శక్నోషి మనోభ్రమమ్ ।**
**నివారయితుం తేన, తేనైవాఽఽక్రమ్యసే క్షణాత్ । 35 ।**

35. జ్ఞానము యొక్క అపరిపూర్ణత్వము వలన, చిత్తభ్రమను నీవు నివారింప జాలకున్నావు. కావున, నీ చిత్తమునం దేది ప్రతిభాసించునో, దాని చేతనే, నీవు క్షణముననే ఆక్రమింపబడుచున్నావు.

**తపః కురు త్వ ముత్థాయ, తతో జ్ఞాన మవాప్స్యసి ।**
**ఇత్యుక్త్వా త్యక్త సఙ్కల్పః, గాధిః తత్రాఽకరోత్తపః । 36 ।**
**ఆత్మచిన్తనరూపం చ, మనోభ్రమ నివృత్తయే ।**

దశవర్షాణి తేనాఽసౌ, వాత్మజ్ఞాన మవాప్తవాన్ ॥ 37 ॥
జీవన్ముక్త పదం ప్రాప్య, వీతశోకో బభూవ చ ।

**36-38.** గాధీ! నీ విక లేచి, మనోనిరోధరూపమగు తప మాచరింపుము. దానిచే నీవు అనంత జ్ఞానమును పొందగలవు." – ఇట్లు భగవంతునిచే వ్యపదిష్టుడై, సర్వసంకల్పములను త్యజించి గాధి, అచట, మనోభ్రమనివృత్తి కొఱకు, పదిసంవత్సరములు, ఆత్మచింతనరూపమగు తపమొనర్చి, ఆ తపోమహిమచే, ఆత్మజ్ఞానమును పొందినాడు. జీవన్ముక్త పదమును ప్రాపించి, అతడు శోకవిముక్తుడైనాడు.

ఏవ మేషాఽతివితతా, దుర్జ్ఞానా, రఘునందన! ॥ 38 ॥
పరమాత్మాఽఽశ్రయా మాయా, మహామోహకరీ సదా ।
చిత్తాఽఽక్రమణమాత్రాత్తు, పరమాదౌషధాదృతే ॥ 39 ॥
ప్రయత్నేనాఽపి సంసారమహారోగో న శామ్యతి ।

**38-40.** రఘునందనా! శ్రీరామా! ఇట్లు, ఈమాయ అతివిస్తారము, అచింత్యమునైనది. పరమాత్మాశ్రయమగు నీమాయ, సదా మహామోహకారిణి. చిత్తజయమను (చిత్తాక్రమణమను) పరమౌషధముచే తప్ప, నిరంతర ప్రయత్నములచే సైతము, ఈ సంసారమహారోగము శమింపదు. [ఉపాయాంతరమేదియు లేదని భావము.]

వర్తమానం క్రమాఽఽయాతం, భజద్బాహ్యధియా క్షణమ్ ॥ 40 ॥
అభజద్భావిభూతం చ, యాతి చిత్త మచిత్తతామ్ ।

**40-41.** క్రమముగ ప్రాప్తించిన వర్తమానవిషయములను, క్షణకాలము బాహ్యబుద్ధిచే సేవించుచు, భూతభవిష్యద్విషయములను అనుసంధింపక, (ధ్యానింపక), లేక, ఆమోదింపక యున్నచో, చిత్తము అచిత్తత్వదశ నొందును – క్రమముగ క్షీణించును.

చేతనం చిత్తరిక్తం హి, ప్రత్యక్చేతన ముచ్యతే ॥ 41 ॥
నిర్మనస్కస్వభావత్వు, న తత్ర కలనామలః ।

**41-42.** చిత్తరహితచేతన(జీవ)స్వరూపమే, ప్రత్యక్చేతన మనబడును. అది

నిర్మనస్క స్వభావమగుటచే, అందు కలనా (విషయకల్పనా) మాలిన్య ముండదు.

**మలం సంవేద్య ముత్సృజ్య, మనో నిర్మలయన్ పరమ్ । 42 ।**
**ఆశాపాశ నలం ఛిత్వా, సంవిన్మాత్రపరో భవ ।**
**తదైవ క్షీయతే మోహః, సంసారభ్రమ కారణమ్ । 43 ।**

**42-43.** సంవేద్యములగు బాహ్య విషయముల మాలిన్యమును త్యజించి, మనస్సును సంపూర్ణముగ నిర్మల మొనర్చి, ఆశాపాశములను పూర్తిగ ఛేదించి, కేవలము శుద్ధచైతన్యమున స్థిరుడవు కమ్ము. అప్పుడే సంసారభ్రమ కారణమైన మోహము, క్షీణించును. (ఆశాపాశాన్ + అలం – ఆశాపాశానలం)

**అనాత్మన్యాత్మ భావేన, మమేదమితి భావతః ।**
**అహఙ్కారవికారేణ, చేతో గచ్ఛతి పీనతామ్ । 44 ।**

**44.** అనాత్మ (దేహాదుల) యందు ఆత్మభావన చేతను, ఇది నాదియను మమకారభావము చేతను, అహంకారవికారము (రోగము) చేతను, చిత్తము (చింతలచే) స్థూలత్వమును (వృద్ధిని) పొందుచున్నది.

**హేయాఽఽదేయ విభాగేన, సమాశ్వాసేన సంసృతౌ ।**
**స్నేహేన, ధనలోభేన, చేతో గచ్ఛతి పీనతామ్*** **। 45 ।**

**45.** త్యాజ్య గ్రాహ్య రూపమగు విషయవిభాగము చేతను, ఈ సంసారము రమణీయ మనియు, చిరస్థాయి యనియు విశ్వసించుట చేతను, దారపుత్రాదుల స్నేహము చేతను, ధనలోభము చేతను, చిత్తము (చింతలచే) స్థూలత్వమును (వృద్ధిని) పొందుచున్నది.

---

★ మాయ యొక్క సృజనాత్మకశక్తి నిరూపించుటను, వ్యష్టిమానసమున (within an individual mind) సమానములైన వాస్తవికచారిత్రక సంఘటనలను, (The real historical series of events) కొన్ని క్షణముల కాలమునవే సంఘటిల్లినట్లు – కల్పనాత్మక జగత్తున ప్రదర్శించుట సంభవమే యని స్థాపించుటను ఈ యుపాఖ్యానము వ్యాఖ్యానించును.

ఉద్దాలకవ దాలూనం, విశీర్ణం భూతపఞ్చకమ్ ।
కృత్వాకృత్వా ధియా ధీర! ధీరయాఽన్తర్విచారయ ॥ 46 ॥

46. ధీరుడవగు శ్రీరామా! దేహాదుల నారంభించునదియు, బాహ్యప్రపంచము నారంభించు నదియునగు **భూత పంచకమును** (భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశములను పంచభూతములను) **ఉద్దాలకుని వలె తత్త్వం పదార్థ శోధన పరయు, ధీరయునగు బుద్ధిచేత, మాటి మాటికి, కోసి వేసి, వానిని విశీర్ణమొనర్చి (ధ్వస్తము చేసి) వానికి అధిష్ఠానమైన సన్మాత్రమును లోపల అన్వేషింపుము.** [పంచభూతాత్మకమైన బాహ్య జగత్తు నుండి చిత్తమును క్షయింపజేసి, స్వస్వరూపమున తన్ను ప్రతిష్ఠించుకొనుటకై, **పరమాత్మస్వరూపాన్వేషణమును** ఇది నిర్దేశించుచున్నది]

*ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'గాధ్యుపాఖ్యానం' నామ చతుర్దశః సర్గః ।*

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'గాధి ఉపాఖ్యానమను'
చతుర్దశ (పదునాల్గవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య-పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో, వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## పంచదశసర్గము

## ఉద్దాలకోపాఖ్యానమ్ – ఉద్దాలకుని కథ

1. విశ్రాన్త్యపేక్షా :- చిత్త విశ్రాంతిని గూర్చి ఆకాంక్ష.

**శ్రీరామ ఉవాచ:–**

**ఉద్దాలకేన భగవన్! కథ మన్తర్విచారితమ్ ।**

1. శ్రీరాముడు :- స్వామీ! ఉద్దాలకునిచే నెట్లు అంతఃకరణమున, ఆత్మ విచారణ మొనర్చబడినది?

**వసిష్ఠ ఉవాచ :-**

**ఉద్దాలకో మునిః కశ్చి దల్పప్రజ్ఞో విచారవాన్ ॥ 1 ॥**

తతః క్రమేణ తపసా, శాస్త్రార్థైర్నియమైః యమైః ।[1]
వివేకవాన్ బభూవాఽథ, చిన్తయామాస ధీరధీః ॥ 2 ॥

1-2. వసిష్ఠుడు :- ఉద్దాలకుడను నొకముని (మొదట) అల్పప్రజ్ఞుడును పరతత్త్వవిచారశీలుడునై యుండెను. పిదప కాలక్రమమున తపస్సు చేతను, శాస్త్రార్థాధ్యయనము చేతను, యమనియమానుష్ఠానము చేతను, వివేకవంతుడయ్యెను. అంతట ధీరధీశాలియగు నాత డిట్లు చింతన మొనర్చినాడు.

"కిం తత్ ప్రాప్యం ప్రధానం స్యాద్యద్విశ్రాన్తౌ న శోచ్యతే ।
కదాఽహం మననాఽతీతే, పదే పరమపావనే ॥ 3 ॥
చిరం విశ్రాన్తి మేష్యామి, నిర్వికల్పసమాధినా" ।
ఇతి చిన్తాపరవశో, ధ్యానాఽభ్యాసం చకార సః ॥ 4 ॥

3-4. ఎందు విశ్రాంతి నొందిన మనుజుడు, మరల దుఃఖింపడో, పురుషార్థము లలో ప్రధానమగు అట్టి ప్రాప్యవస్తువేది? పరమపావనమును, మనోవ్యాపార రహితమునైన ఆ యుత్తమపదమున, నిర్వికల్పసమాధి యందు (అపర మేరు శృంగమట్లు) చిర విశ్రాంతి నెపుడు పొందుదునో!" - ఇట్లు చింతాపరవశుడై యాతడు ధ్యానాభ్యాస మొనర్చుచుండెను.

విషయై ర్నీయమానే తు, చిత్తే మర్కటచఞ్చలే ।
న స లేభే సమాధానప్రతిష్ఠాం,[2] ప్రీతిదాయినీమ్ ॥ 5 ॥

---

(1) పోల్చు :- "అహింసా,సత్యా, ఽస్తేయ, బ్రహ్మచర్యా,ఽ పరిగ్రహా యమాః ।"
"శౌచ, సన్తోష, తపః, స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః ।"
[యోగదర్శనము -II-30,32]

(2) పోల్చు :- "సమ్యగాస్థాపనం బుద్ధేః, శుద్ధే బ్రహ్మణి సర్వదా ।
తత్ సమాధాన మిత్యుక్తం న తు చిత్తస్య లాలనమ్ ।"
(శంకరుడు-వివేకచూడామణి.27)

అధ్యవసాయాత్మకమగు (నిర్ణయాత్మకవృత్తిమంతమగు) బుద్ధిని, సర్వోపాధి వినిర్ముక్తమగు బ్రహ్మమున, (లేక, ఈశ్వరుని యందు) స్థాపించుట సమాధానమనబడును. సమాధానము శమము యొక్క పరిపాక ఫలము. కాని, యథేష్టమగు విషయమార్గ సంచరణము వలన చిత్తమును, (రోదించు బాలునికి తదిష్టము నొసగి లాలించునట్లు) లాలించుట కాదు. అత్యంత ప్రయత్నమున చిత్తమును శుభపథమున స్థిరపఱచవలయును.

5. మర్కటము (కోతి) వలె చపలమగు మనస్సును, విషయములు తమ వైపునకు ఈడ్చుకొని పోవుచుండుట వలన, **ఆనందదాయకమగు** సమాధి యందు స్థిరప్రతిష్ఠ నాతడు పొందజాలకపోయెను.

**కదాచి దుదితాఽర్కాభం, తేజః పశ్యతి విస్తృతమ్ ।**
**కదాచి త్కేవలం వ్యోమ, కదాచి న్నిబిడం తమః । 6 ।**

6. ఒకప్పు డాతడు, విస్తృతమై, ఉదయభానునితో సమానమగు తేజస్సును గాంచును; మఱియొకప్పుడు **కేవలాకాశమును**, ఇంకొకప్పుడు గాఢమైన **చీకటిని** గాంచును.

**ఏవం పర్యాకులమనాః, స లుఠన్ ధ్యానవృత్తిషు ।**
**ఏకదా గిరికాన్తారే, చోపవిశ్యాఽసనే క్వచిత్ । 7 ।**
**నిశ్చలం సుదృఢం బధ్వా, పద్మాసన ముదఙ్ముఖః ।**
**నిర్వికల్పసమాధ్యర్థం, చకారేమాం విచారణామ్ । 8 ।**

7-8. ఇట్లు పర్యాకులితచిత్తుడై, ఉద్దాలకుడు, ధ్యానవృత్తుల యందు దొర్లుచు, ఒకప్పుడు, పర్వతారణ్యమున నొకచోట, నిశ్చలముగ, సుదృఢముగ, **బద్ధపద్మాసనస్థుడై, ఉత్తరాభిముఖముగ** కూర్చుండి, నిర్వికల్పసమాధి సిద్ధి కొఱకు, ఈ విచారణ (అన్వేషణ) మొనర్చెను.

## 2. అన్తర్విచారణా :– అంతఃకరణమున ఉద్దాలకుని విచారణ

**అపి మూర్ఖ! మనః! కోఽర్థ స్తవ సంసారవృత్తిభిః ।**
**యది యాసి మహీరన్ధ్రం, బ్రహ్మలోక మథాఽపివా । 9 ।**
**తన్న నిర్వాణ మాయాసి, వినోపశమనాఽమృతమ్ ।**

9-10. ఓ మూర్ఖ మానసమా! సంసారవృత్తుల వలన నీకేమి ప్రయోజనము సిద్ధించును? ఓ మనస్సా! నీవు పాతాళమున క్రుంకినను, లేక బ్రహ్మలోకమునకు పోయినను, సరే, నీకు **ఉపశమనామృతము (శాంతియను అమృతము) లేనిచో,** విషయప్రపంచవిముక్తము, పరమాత్మైక్య స్వరూపము, నిరతిశయానందరూపమునగు **నిర్వాణము సిద్ధింపదు.**

**శ్రోత్రతాం మూర్ఖ! సంప్రాప్య, నిష్ఫలోద్యమవర్ధితామ్ । 10 ।**
**ధియా శబ్దాఽమసారిణ్యా, మాగవ న్నా క్షయం వ్రజ ।**

**10-11.** మూర్ఖచిత్తమా! నిష్ఫలోద్యమముచే వృద్ధి చెందిన శ్రోత్రేంద్రియ భావమును, శబ్దానుసారిణియగు బుద్ధి చేత పొంది, మృగము **(లేడి)** వలె నశింపకుము. (వేటకాని సంగీతనాదమును విని చొక్కి, హరిణము, అత డొడ్డిన వలలో పడుట నిది నిర్దేశించును).

**త్వక్త్వ మాగత్య దుఃఖాయ, స్పర్శోన్ముఖతయా ధియా ॥ 11 ॥**
**మూర్ఖ! మా బద్ధతా మేహి, గజీలుబ్ధగజేన్ద్రవత్ ।**

**11-12.** మూర్ఖచిత్తమా! బాహ్యస్పర్శోన్ముఖమైన బుద్ధితో, దుఃఖానుభవము కొఱకు చర్మభావమును (త్వగింద్రియముతో అభేదమును) పొంది **కరిణీలోభముచే(ఆడేనుగు స్పర్శమును గోరిన), కరీంద్రుని వలె, బంధమున తగుల్కొనకుము.**

[స్వాధీనమైన ఆడేనుగును, అడవియేనుగును వంచనతో నాకర్షించుటకు సాధనముగ ఉపయోగించు యోజన నిది నిర్దేశించును.]

**చాక్షుషీం వృత్తి మాశ్రిత్య, ప్రభారూపచయోన్ముఖీమ్ ॥ 12 ॥**
**మాగచ్ఛ దగ్ధతాం మూర్ఖ!, కాన్తిలుబ్ధపతఙ్గవత్ ।**

**12-13.** మూర్ఖమానసమా! కాంతితో సంబంధము గల్గి, నానారూపములవైపు పరువెత్తు నేత్రవృత్తి నాశ్రయించి (నేత్రేంద్రియముతో అభేదమును పొంది) **రూపలోభముచే, దీపము నాశించిన మిడుత వలె,** దగ్ధము కాకుము. దీపకాంతిచే ఆకర్షింపబడి, మిడుత దగ్ధమగుచున్నది. [ప్రభా సౌందర్యములు రెంటికిని, కాంతిశబ్ద మన్వయించును. **రూప సౌందర్యము కామాత్ములకు వినాశహేతు వగుచున్నది.]**

**రసనాభావ మాగత్య, దురన్నాఽఽస్వాదకాంక్షయా ॥ 13 ॥**
**మా నాశ మేహి బడిశపిణ్డీలమ్పటమత్స్యవత్ ।**

**13-14.** దుష్టాన్నలోభముచే, రసనేంద్రియభావము (జిహ్వేంద్రియముతో అభేదమును) పొంది, గాలమునందలి **ఎఱచవి నాశించిన మత్స్యము-(చేప)వలె,** నశింపకుము.

[**చేప, గాలమందలి ఎఱచే** ఆకర్షింపబడి, దాని రుచి నాస్వాదించు కోరికతో, గాలమున చిక్కి నశించుచున్నది. మనుజుడు సైతము తన దంతములతోనే, తన గోరీని, తానే త్రవ్వుకొన సమర్థుడు కదా!]

**ఘ్రాణమార్గ ముపాశ్రిత్య, శరీరాఽమ్భోజకోటరే ॥ 14 ॥**
**గన్ధోన్ముఖతయా బన్ధం, మా సమాశ్రయ భృఙ్గవత్ ।**

**14-15.** నాసికాభావమును (నాసికతో అభేదమును) పొంది, శరీర మను కమల గర్భమున, గంధోన్ముఖత్వముచే, తుమ్మెద వలె, బంధము నాశ్రయింపకుము.

[మధుపము, పద్మగంధముచే నాకర్షితమై, పద్మగర్భమును చేరి, కడపట, ఆ పద్మము ముకుళితము కాగా, అందు చిక్కి నశించుచున్నది. అట్లు చిక్కి చెడిపోకుమని ఉద్దాలకుడు తన మనస్సును ప్రబోధించుచున్నాడు]

**కురఙ్గాఽలి పతఙ్గేభ మీనా స్త్వేకైకశో హతాః । 15 ।**
**సర్వైరేతై రనర్థైశ్చ వ్యాప్తస్యాఽజ్ఞ! కుతః సుఖమ్ ? ।***

★ పోల్చు :- "శబ్దాదిభిః పఞ్చభిరేవ పఞ్చ, పఞ్చత్వమాపుః స్వగుణేన బద్ధాః ।
కురఙ్గ మాతఙ్గ పతఙ్గ మీనభృఙ్గా నరః పఞ్చభి రఞ్చితః కిమ్" ? ।
[ఆదిశంకరుల వివేకచూడామణి – 78]

శబ్దాది పంచ విషయములలో వొక్కొక్కటియు, అనర్థకారణము. మఱి యీ ఐదింటిచేతను ప్రేరితుడగు మనుజుని గతి ఇక యేమని చెప్పవలెను?

అవశీకృతములై, ఇంద్రియార్థములందు స్వైర విహార మొనర్చు శ్రోత్రాది ఇంద్రియములలో, నేయొక్క ఇంద్రియముతోనైనను, మనస్సు సహచరించినచో, ఆ ఒక్క ఇంద్రియమే, మనస్సు లేక, మనుజుని యొక్క బుద్ధిని హరించి, విషయవిక్షిప్త మొనర్చుచున్నది. ఇక, అన్ని ఇంద్రియములతో, మనస్సు యొక్క సహయోగము, ప్రజ్ఞను, నిశ్శేషముగ హరించునని ఏమి చెప్పవలయును? ప్రమత్తుడగు నావికుని నావను, వాయువు, సముద్రమున, సర్వదిక్కులం పరిభ్రమింపజేసి, ధ్వస్త మొనర్చును కదా!

కావున విక్షిప్తచిత్తునికి బ్రహ్మాత్మ భావనాశాంతి సుఖములు సిద్ధింపవు.

[చూడు:- భ.గీ.-II-67- శ్రీధరస్వామి కృత సుబోధినీ వ్యాఖ్య]

"వనకరి చిక్కె మైనసకు, వాచవికిం జెడిపోయె మీను, తా
వినికిడి జిక్కె జిల్వ, గనువేదురు జెందెను లేళ్లు, తావిలో
మనికి నశించెదేటి, తరమా యిరుమూటినిగెల్వ? వైదుషీ
ధనముల నీవె కావదగు దాశరథీ! కరుణాపయోనిధీ!।"

('దాశరథీ' శతకము–83. కంచెర్ల గోపన్న– భద్రాచలరామదాసు)

మఱియు పోల్చు :–

"యద్యద్త్యజతి కామానాం, తత్సుఖస్యాఽభిపూర్యతే ।
కామాఽనుసారీ పురుషః, కామాననువినశ్యతి ।" (మ.భా.శాంతి–మోక్షధర్మ–174.45)

కామముల ననుసరించు పురుషుడు, వానితోనే వినాశమొందును.

**కరోమ్యేష కిమర్థం వా, త్వైత దనుశాసనమ్ ? । 16 ।**

**15-16.** మూర్ఖచిత్తమా! కురంగము (లేడి), భ్రమరము, (తుమ్మెద) పతంగము (మిడుత), గజము (ఏనుగు), మత్స్యము (చేప) - ఇవి యన్నియు, ఒక్కొక్క ఇంద్రియార్థము వలని అనర్థముచే (విషయరాగముచే) నశించుచున్నవి. అట్టిచో, ఈ పంచేంద్రియార్థము లన్నిటితో కూడిన వాని కిక సుఖమెచ్చటు? ఏ ప్రయోజనము కొఱకు, ఈ నీ అనుశాసనమును, నేను పాటింతును?

**విచారణవతః పుంసః, చిత్త! త్వమపి నాఽస్తి యత్ ।**
**అనన్తస్యాఽఽత్మతత్త్వస్య, తన్వీ మనసి నంస్థితిః । 17 ।**
**న సంభవతి బిల్వాన్త ర్వాసితా దన్తినో యథా ।**

**17-18.** మానసమా! తత్త్వవిచారవంతుడగు మనుజునకు, నీవు (మనస్సు) సైతము ఉండవు. బిల్వ (మారేడు) ఫలమున, ఏనుగు, వసింపజాలనట్లు అనంతమగు ఆత్మ తత్త్వము, పరిచ్ఛిన్నమైన మనస్సున నిముడ గల్గుట అసంభవము.

**పాదాఽఙ్గుష్ఠాత్ శిరో యావత్, కణశః ప్రవిచారితమ్ । 18 ।**
**న లబ్ధోఽ సావహంనామా, కో వా స్యాదహ మిత్యయమ్ ? ।**

**18-19.** కాలి బొటనవ్రేలి నుండి, శిరస్సు వఱకు గల ఈ దేహము యొక్క అణు వణువును నేను లెస్సగా విచారించితిని, కాని, 'అహమ్' అనునది నా కెందును నగుపడలేదు. ఈ అహ మనునదేదియై యుండును?

---

"ఏతస్మా ద్విర మేన్ద్రియాఽర్థగహనా దాయాసకా దాశ్రయ,
శ్రేయో మార్గ మశేష దుఃఖశమన వ్యాపారదక్షం క్షణాత్ ।
శాన్తం (స్వాత్మ) భావ ముపైహి, సన్త్యజ నిజాం కల్లోలలోలాం గతిం,
మా భూయో భజ భఙ్గురాం భవరతిం, చేతః! ప్రసీదాఽధునా ॥"
(భర్తృహరి –వైరాగ్య–63)

"అయాచప్రద మింద్రియార్థగహనం బాత్రోవ వర్తింపు మీ,
శ్రేయోమార్గము సర్వదుఃఖనికరచ్ఛేదార్థమై చేరుమీ,
ధ్యేయాద్వైతము బొందుమీ, స్థిరతచే దీపింపుమీ, చిత్తమా !
మాయాకేళికి వెండియుం జొరకుమీ, మాలిన్యమున్ వీడుమీ ॥"

**ఇదం మాంస మిదం రక్త మిమాన్యస్థీని దేహకే ॥ 19 ॥**
**ఇమే తే శ్వాసమరుతః, కో వా స్యాదహ మిత్యయమ్ ।**

**19-20.** శరీరమున ఇది మాంసము, ఇది రక్తము, ఇవి యెముకలు, ఇవి నీ శ్వాస వాయువులు. ఇక ఈ దేహమున, అహ మనగా ఏదియై యుండును?

**ఇదం ఘ్రాణ మియం జిహ్వా, త్వగియం శ్రవణే ఇమే ॥ 20 ॥**
**ఇదం చక్షు రసౌ స్పర్శః, కో వా స్యా దహ మిత్యయమ్ ।**

**20-21.** ఇది నాసిక, ఇది జిహ్వ, ఇది చర్మము, ఇవి చెవులు. ఇవి కన్నులు, ఇది స్పర్శము. అహ మనగా నిం దేదియై యుండును?

**అహ మేవ హి సర్వత్ర, నాఽహం కిఞ్చి దపీహ వా ॥ 21 ॥**
**ఇత్యేవం వాస్తవీ దృష్టిః, నేతరో విద్యతే క్రమః ।**

**21-22.** అధ్యారోపదృష్టిచే, సర్వత్ర నేనే యున్నాను. అపవాదదృష్టిచే నే నేమియును కాను. ఇదియే వాస్తవమగు దృష్టి. అంతేకాని, వేఱుక్రమము లేనేలేదు. [ఇది యంతయు నేనేయని కాని, నే నేదియు కానని కాని, భావించుటయే, వాస్తవదృష్టి- సన్మయదృష్టి]

**చిర మజ్ఞానధూర్తేన, పోథితోఽస్మి హ్యహన్తయా ॥ 22 ॥**
**పున ర్న సంశ్రయామ్యేనం, స్వరూపాఽర్థాపహారిణమ్ ।**

**22-23.** అజ్ఞానమను ధూర్తునిచే, అహంకారము వలన, చిరకాలము నేను బాధింప బడితిని. పారమార్థికమగు స్వరూపార్థమును (ఆత్మ ధనమును) అపహరించునట్టి వీనిని (అజ్ఞానధూర్తుని) నే నిక మరల ఆశ్రయింపను.

**వాసనాహీన మప్యేతత్,(1) చక్షురాదీన్ద్రియైః స్వతః ॥ 23 ॥**
**ప్రవర్తతే బహిః స్వార్థే, వాసనా నాఽత్ర కారణమ్ ।**

**23-24.** శరీరము, వాసనారహితమైనను, స్వార్థమైన, అనగా, తన జీవనహేతువగు కర్మము నందు, చక్షు రాదులగు ఇంద్రియములచే స్వతఃసిద్ధముగ బాహ్యమున ప్రవర్తించుచు నుండును. కాన, నీ విషయమున వాసన కారణము కాదు.

[యుద్ధమునకు పూర్వము, దామ, వ్యాళ, కటుల ప్రవృత్తి, దీనికి నిదర్శనము. IX సర్గము – 6]

---

★ "వాసనాహీనమపీతి ఏతత్ శరీరం, స్వార్థే, జీవనహేతౌ కర్మణి వాసనాహీనమపి ప్రవర్తతే । దామవ్యాళకటానాం ప్రాగ్యుద్ధాది ప్రవృత్తి వర్ణనాదితిభావః" ।(యో.వా.తా.ప్ర.)

**తదిన్ద్రియాణి మూర్ఖాణి, త్యక్త్వాఽన్తర్వాసనాం నిజామ్ । 24 ।**
**సఙ్కల్పపాదపం తృష్ణాలతం★ ఛిత్వా మనోవనమ్ ।**
**వితతాం భూమి మాసాద్య, విహరామి యథా సుఖమ్ । 25 ।**

**24-25.** కాన, మూర్ఖములైన ఈ ఇంద్రియములను, వాని నైజమైన లోపలి వాసనలను త్యజించి, తృష్ణాలతా సంయుతమైన సంకల్పవృక్షములతోడి మనస్సను అరణ్యమును ఛేదించి, పరమాత్మయను విశాలభూమిని పొంది, యథాసుఖముగ విహరింతును.

### 3. సత్తాసామాన్యప్రాప్తిః – సత్తాసామాన్యమగు బ్రహ్మముతో ఏకత్వప్రాప్తి

**మని రేవం వినిర్ణీయ, హ్యర్ధోన్మీలితలోచనః ।**
**ఓ మిత్యుచ్చారయన్ తస్థౌ, ప్రాణాయామ క్రమేణ సః । 26 ।**

**26.** ఆ ముని (ఉద్దాలకుడు) ఇట్లు నిర్ణయించుకొని, అర్ధోన్మీలితనేత్రుడై, ప్రాణాయామ క్రమమున, ఓంకారము నుచ్చరించుచు, స్థిరుడై యుండెను.

**దేహస్థితిం దృఢాం కృత్వా, నిబద్ధేన్ద్రియ పఞ్చకమ్ ।**
**చిన్తయా హృదయాఽమ్భోజే, చేతో భ్రమరచఞ్చలమ్ । 27 ।**
**బలా త్సంరోధయామాస, సేతు ర్జలమివ ద్రుతమ్ ।**
**సామ్యతా మనయత్ మౌనీ, ప్రాణాఽపానజవం ముఖే । 28 ।**

**27-28.** శరీర స్థితిని, దృఢమొనర్చి, పంచేంద్రియములను బంధించి, పరమార్థ విచారముచే, హృదయాంభోజమున తుమ్మెద వలె చంచలమైన చిత్తమును ప్రవాహోన్ముఖమైన జలమును సేతువు వలె, బలవంతముగ

★ ధమ్మపదం – గాథలు 337, 338 (1994 – డా॥ రత్నాకరం బాలరాజు)
మఱియు, పోల్చు :-
"దిజో యథా కుబ్బనకం పహాయ, బహుప్ఫలం కాననం ఆవసెయ్య ।
ఏవం పహం అప్పదస్సే పహాయ, మహోదధిం హంసరివ జ్ఝపత్తో ॥"
పక్షి, అల్పవనమును విసర్జించి, ఫలబహుళమగు సుందరకాననమును ప్రవేశించి అందువసించునట్లు, నేనును, సంకుచితబుద్ధులను (అల్పదర్శులను) విసర్జించి, హంసమట్లు మహోదధిని చేరుకొంటిని.
(సుత్తనిపాతం–పారాయణవగ్గ - XVIII-II)

అతడు నిరోధించినాడు. ఆ పిమ్మట నాసాంతర్గత వాయులగు ప్రాణాపానముల వేగమును సామ్యావస్థను పొందజేసినాడు.

**ఇన్ద్రియాణీన్ద్రియార్థేభ్యః పృథక్ చక్రే ప్రయత్నతః ।**
**బాహ్యాన్ స్పర్శా నశేషేణ, * జహౌ దూరే స ధీరధీః । 29 ॥**

29. ఇంద్రియములను శబ్దాది విషయముల నుండి, ప్రయత్న పూర్వకముగ వేఱుపఱచి, బాహ్య విషయములను, ధీరబుద్ధియగు నాముని దూరముగ త్యజించినాడు.

**బభార హృదయాకాశే, మనః సంయమ మాగతమ్ ।**
**దుధావాఽథ వికల్పౌఘాన్, ప్రతిభాస ముపేయుషః । 30 ॥**

30. సంయయోన్ముఖమైన (వశీకృతమైన) మనస్సును, హృదయాకాశమున భరించెను. ప్రతిభాసమును పొందుచున్న (మరలమరల అంకురించుచున్న) విపరీత భావనా వికల్పములను,విచ్ఛిన్న మొనర్చెను.

**ఆగచ్ఛతో యథాకామం, ప్రతిభాసాన్ పునః పునః ।**
**అచ్ఛిన న్మనసా శూరః, ఖడ్గేనేవ రణే రిపూన్ । 31 ॥**

31. శూరుడు ఖడ్గముచే రణరంగమున శత్రువులను వలె, మాటి మాటికి, యథేచ్ఛముగా వచ్చుచున్న ప్రతిభాసములను మనస్సుచే నాతడు ఛేదించెను.

**వికల్పౌఘే తథా లూనే, దృష్ట్వాఽ జ్ఞానం హృదన్తరే ।**
**తదప్యుచ్ఛేదయామాస, సమ్యక్ స్వాన్తర్వివస్వతా । 32 ।**

---

★ పోల్చు :- "స్పర్శాన్ కృత్వా బహి ర్బాహ్యాం, శ్చక్షు శ్చైవాఽన్తరే భ్రువోః ।
ప్రాణాఽపానౌ సమౌకృత్వా, నాసాఽభ్యన్తర చారిణౌ ।
యతేన్ద్రియ మనోబుద్ధి ర్మని ర్మోక్ష పరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో, యః సదా ముక్త ఏవ సః ॥ [భ.గీ. V-27-28]

బాహ్యార్థములతో (శబ్దాదివిషయములతో) ఇంద్రియసుఖదుఃఖరూపములగు సంయోగములను మనస్సున ప్రవేశింపనీయక, దృష్టిని భ్రూమధ్యమున నిలిపి (అర్ధనిమీలిత మొనర్చి) ప్రాణాపానములను సమాన మొనర్చి, ఇంద్రియ మనోబుద్ధులను సంయమించినవాడు, ఇచ్ఛాభయక్రోధ రహితుడును, మోక్ష పరాయణుడునైన ముని, యెప్పుడును, (జీవద్దశ యందును) ముక్తుడే కదా!

**32.** వికల్పజాలము నశింపగనే, హృదయాకాశము నందలి అజ్ఞానమును (అంధకారమును) గాంచి, దానిని సైతము తన యాత్మ యందలి జ్ఞాన భాస్కరునిచే పూర్తిగ నున్మూలించినాడు.

**గతే తమసి చాఽజ్ఞానే, తేజః పుఞ్జం దదర్శ సః ।**
**తేజస్యపి తతో లూనే, నిద్రాం ప్రాప్య లులావ తామ్ ॥ 33 ॥**

**33.** అజ్ఞానాంధకారము తొలగిపోగా, నొక తేజః పుంజము నాతడు దర్శించెను. అంతట, ఆ తేజస్సు సైతము ఉపరతము కాగా, నిద్రను పొంది, మరల నా నిద్రను సైతము, నాతడు వినష్ట మొనర్చెను.

**నిద్రాయాం చ నిరస్తాయాం, శూన్యా సంవి త్సముద్యయౌ ।**
**శూన్యసంవిది నష్టాయాం, మూఢం తస్యాఽభవ న్మనః ॥ 34 ॥**

**34.** నిద్రయు నశింపగా, శూన్యచైతన్య ముదయించినది. అదియును తొలగి పోగా, అతని మనస్సు విమూఢమైనది.

**మనసో మోహ మప్యేషః, సమ్మమార్జ మహాశయః ।**
**తత స్తేజస్తమో నిద్రా మోహాది పరివర్జితామ్ ॥ 35 ॥**
**కామప్యవస్థా మాసాద్య, విశశ్రామ మనః క్షణమ్ ।**

**35-36.** ఉదారచిత్తుడగు నా ఉద్దాలకుడు, ఆ మనోమోహమును సైతము, పూర్తిగా విశోధించి, తొలగించుకొన్నాడు. తరువాత, **తేజస్తమో నిద్రా మోహాది శూన్యమై, వాగగోచరమైన ఒకానొక పరమావస్థను** (నిర్వికల్ప సమాధిని) పొంది, అతని మనస్సు, క్షణకాలము విశ్రమించినది.

**విశ్రమ్యాఽఽశు పపాత స్వసంవిదం, విశ్వరూపిణీమ్ ॥ 36 ॥**
**చిరాఽనుసన్ధానవశాత్, స్పాదనాచ్చ స్వసంవిదః ।**
**మన శ్చిన్మయతా మాగాత్, హేమ నూపురతా మివ ॥ 37 ॥**

**36-37.** ఇట్లు విశ్రమించి, విక్షేప సంస్కార ప్రాబల్యము వలన, అందు, స్థైర్యమును పొందజాలక, వెంటనే మరల వాని మనస్సు, బాహ్యప్రపంచ సమాకారమగు తన **వృత్తిజ్ఞానమునకు మరలినది** - (పడిపోయినది) తరువాత, పూర్వము ధ్యానాదులచే చిరకాలానుసంధానము చేతను, సమాధి

యందలి ఆత్మానందరసాస్వాదనముచేతను, సువర్ణము (బంగారు) నూపురత్వమును (అందియరూపమును) పొందినట్లు అతని మనస్సు చిన్మయత్వమును ప్రాపించినది.

చిత్తత్వ మథ సన్త్యజ్య, చిత్తం చిత్తత్త్వతాం గతమ్ ।
చైత్యం సన్త్యజ్య చిత్ శుద్ధా, చిత్సామాన్యం సమాయయౌ ॥ 38 ॥
త్యక్త వీచ్యాది భేదోఽబ్ధిః, వాఃసామాన్యమివైక ధీః ।

38-39. అంతట, అతని చిత్తము, తన చిత్తత్వమును త్యజించి చిత్తత్త్వత్వమును – (చిత్+తత్త్వతామ్–చిద్రూపత్వమును) పొందినది. తరువాత, వృత్తిగతచైతన్యము, స్వీయవిషయాకారమును వదలి, శుద్ధమై ,తరంగాది భేదరహితమగు సాగరము, జలసామాన్య స్థితిని పొందినట్లు, సర్వవృత్తి సాధారణ సాక్షి భూతమగు ఏకరూపమగు చిత్సామాన్య స్థితిని పొందినది.

చిదాకాశం తతః శుద్ధం, సోఽభవ ద్బోధమాగతః ॥ 39 ॥
తత్ర ప్రాపదథాఽఽ నన్దం, దృశ్యదర్శనవర్జితమ్ ।
సత్తా సామాన్య రూపాత్మా, బభూవాఽఽనన్ద సాగరః ॥ 40 ॥

39-40. అనంతరము, ఉద్దాలకు డాసమాధి ద్వారా, పరమబోధమును పడసి, శుద్ధమగు చిదాకాశ స్వరూపము నొందెను. అట్టి స్థితి యందు దృశ్య దర్శన వర్జితమగు ఆనందమును ప్రాపించెను. పరమాత్మ యొక్క సత్తా సామాన్యరూపత్వము పడసి, అతడు ఆనందసాగరమే అయినాడు.

జీవన్ముక్తపదం తత్తు, యత్స సంప్రాప్తవాన్ ద్విజః ।
ఉద్దాలకోఽత్ర షణ్మాసాన్, దూరోత్సారితసిద్ధిభూః ॥ 41 ॥
కదాచి దహ్నా మాసేన, కదాచి ద్వత్సరేణ చ ।
కదాచి ద్వత్సరౌఘేణ, ధ్యానాఽఽసక్తో వ్యబుధ్యత ॥ 42 ॥

41-42. సర్వోత్కృష్టమగు జీవన్ముక్త పదమును, నిశ్చయముగా ఆ బ్రాహ్మణుడు ప్రాపించెను. ఉద్దాలకుడు అణిమాది సిద్ధులన్నిటిని దూరముగ పారద్రోలి, (వానిని లక్ష్యము చేయక) సమాధి స్థితి యందాఱు మాసములుండెను. ఒకప్పుడొక్క దినము, ఒకప్పుడొక మాసము, ఒకప్పుడొక సంవత్సరము,

మఱియొకప్పుడు పెక్కు సంవత్సరములు, ధ్యానసమాధి యందుండి, మరల మేల్కొనుచుండెను.

**చిత్తత్త్వైకఘనాఽభ్యాసా న్మహాచిత్త్వ ముపేత్య సః ।**
**చిత్సామాన్యచిరాఽభ్యాసాత్, సత్తాసామాన్య మాయయౌ ॥ 43 ॥**

**43.** చిత్తత్త్వైక (చిత్+తత్త్వ+ఏక) ఘనాఽభ్యాసము వలన, అపరిచ్ఛిన్న చిద్భావమును పొంది, అతడు చిత్ సామాన్య చిరకాలాభ్యాసము వలన, సత్తా సామాన్యమును (పరబ్రహ్మమును) పొందినాడు.

## 4. పరా విశ్రాన్తిః – పరమోత్కృష్ట విశ్రాంతి

**శ్రీరామ ఉవాచ :-**

**సత్తాసామాన్య మిత్యుక్తం, కీదృశం కేన వా భవేత్ ?।**

**44.** శ్రీరాముడు :- స్వామీ! మీరు చెప్పుచున్న సత్తాసామాన్య మనగా నేమి? దేని వలన నది కల్గుచున్నది?

**వసిష్ఠ ఉవాచ : -**

**యదా సంక్షీయతే చిత్త మభావాఽత్యన్తభావనాత్ ॥ 44 ॥**
**చిత్సామాన్యస్వరూపస్య, సత్తా సామాన్యతా తదా ।**

**44-45.** వసిష్ఠుడు :- విషయసంస్కారములన్నియు, పూర్తిగా శూన్యము (అభావము) కాగా, చిత్త మెపుడు నశించునో అపుడే, చిత్ సామాన్య స్వరూపమునకు సత్తా సామాన్యత్వము కల్గుచున్నది.

**యదా సర్వమిదం చైత్యం, సబాహ్యాభ్యన్తరాఽఽత్మకమ్ ॥ 45 ॥**
**అవలప్య వసేత్ చేతః, సత్తాసామాన్యతా తదా ।**

**45-46.** చిత్తవృత్తి యందు అభివ్యక్తమగు అఖండ చైతన్యము. బాహ్యా భ్యంతరమగు సర్వజగత్తును నిరాకరించి, కేవలము, స్వస్వరూపమున నెపుడుండునో, అపుడే, సత్తాసామాన్యత్వము సిద్ధించుచున్నది.

వ్యుత్థితస్య భవత్యేషా, సమాధిస్థస్య చాఽనఘ! । 46 ।
ఏనా మాలమ్బ్య పదవీం, సమస్తభయనాశినీమ్ ।
ఉద్దాలకోఽవసల్లోకే, యావదిచ్ఛం యథాసుఖమ్ । 47 ।

46-47. అనఘా! శ్రీరామా! నిర్వికల్పసమాధి నుండి వ్యుత్థితుడగు వానికిని (లేచిన వానికిని), సమాధి యందుండు వానికిని, ఈ సత్తా సామాన్యత్వ దృష్టి కలుగును. (కేవలము అజ్ఞానికి మాత్రము కలుగదు) సర్వభయ వినాశినియగు ఈ పదవి నాశ్రయించి, ఉద్దాలకుడు తన కిష్టమైనంత కాలము, ఈ లోకమున వసించినాడు.

అథ కాలేన మహతా, బుద్ధి స్తస్య బభూవ హ ।
'విదేహముక్త స్తిష్ఠామి, దేహం త్యక్త్వే'తి నిశ్చలా । 48 ।

48. అనంతరము, చాల కాలమునకు, అతనికి 'దేహమును త్యజించి విదేహ ముక్తుడనై యుందు'నను నిశ్చలమైన బుద్ధి కల్గినది.

తతః పద్మాసనాసీన శ్చార్ధోన్మీలిత లోచనః ।
సంయమ్య గుదసంరోధా ద్ద్వారాణి నవ చేతసః★ । 49 ।

★ చిత్తవృత్తి చైతన్యమును అతిక్రమించి, అఖండ స్వస్వరూప శుద్ధ చైతన్యమున సాధకుడు తన్ను ప్రతిష్ఠించుకొను యోగవిధి ఈ శ్లోకము వర్ణించుచున్నది. ఇంద్రియసంస్కారములను మనస్సునకు చేర్చు నవరంధ్రములే ఈ నవద్వారములు. రెండు కన్నులు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రములు, నోరు, ఉపస్థ (జననేంద్రియము), పాయువు (గుదము) – ఇవియే ఈ నవరంధ్రములు. హఠయోగమునకు సంబంధించిన గుదసంరోధము (మడమచే గుదమును బంధించుట), శ్వాసవాయునిరోధము (ప్రాణాయామము), ధ్యానము, ఇందు నిర్దేశింపబడినవి.

చూడు :- XV–1 29వ శ్లోక పాదటీకా.

పోల్చు :- "మనోనవద్వార నిషిద్ధవృత్తి, హృదివ్యవస్థాప్య సమాధివశ్యమ్ ।
యమక్షరం క్షేత్రవిదో విదు స్తమాత్మాన మాత్మ న్యవలోకయన్తమ్ ।"
పరమేశ్వరుడు, (శివుడు) మనస్సును, శ్రోత్రచక్షుర్నాసికాముఖపాయుఉపస్థ లను తొమ్మిది ద్వారముల గుండ సంచరింపనీక, యోగముచే స్వాధీనము చేసికొని, హృదయమున నెలకొల్పుకొని, క్షేత్రము యొక్క స్వరూప మెఱిగిన జ్ఞాను లెవనిని, అక్షరస్వరూపునిగ (అవినాశిగ), నెఱుగుదురో ఆ పరమాత్మని తన్నుగానే సాక్షాత్కరించుకొని యుండెను. (కుమార సంభవము – III-50-కాళిదాసమహాకవి.)

పద్మాసన లక్షణము :–
"ఉత్తానౌ చరణౌ కృత్వా, ఊరు సంస్థౌ ప్రయత్నతః ।
ఊరుమధ్యే తథోత్తానౌ, పాణీ కృత్వా తతో దృశౌ ।"

**సంరుద్ధ ప్రాణపవనః, భావితస్వాత్మచిద్ఘనః ।**
**అజ్ఞచిత్సంవిదభ్యాసాత్,[1] చిత్సామాన్య ముపాదదే ॥ 50 ॥**

**49-50.** పిదప అతడు పద్మాసనస్థుడై, అర్ధోన్మీలిత నేత్రుడై, అంఘ్రి మూలమున గుదద్వారమును (మూలాధారమును) నిరోధించి, తొమ్మిది ఇంద్రియద్వారములను సంయమించి, (వానిని శబ్దాదివిషయముల నుండి మరలించి), చిద్ఘన స్వరూపమైన తన ఆత్మను ధ్యానించుచు, ప్రాణాదివాయువులను నిరోధించెను. **సోపాధిభూతఅంతఃకరణవృత్తుల విలయాభ్యాసము వలన,** బింబభూతచిత్సామాన్యరూపమును, ఉద్దాలకుడు అధిగమించెను.

**తదభ్యాసా దవాపాఽన్త రానన్దస్పన్ద ముత్తమమ్ ।**
**తదాస్వాదనతో లీనచిత్సామాన్యదశాక్రమమ్ ॥ 51 ॥**
**విశ్వంభర మనన్తాత్మసత్తాసామాన్య మాయయా ।**

---

"నాసాఽగ్రే విన్యసేద్ రాజదన్త మూలే తు జిహ్వయా ।
ఉత్తమ్భ్య చిబుకం వక్షస్యుత్థాప్య పవనం శనైః ।
"ఇదం పద్మాసనం ప్రోక్తం సర్వవ్యాధివినాశనమ్ ।
దుర్లభం యేనకేనాఽపి, ధీమతా లభ్యతే భువి । (హఠయోగప్రదీపికా I-45,46,47)

ప్రయత్నపూర్వకముగ నెడమ తొడపై కుడిపాదమును, కుడితొడపై నెడమ పాదమును, వెలికిలగనుంచి, తొడల మధ్యమున, నట్లే హస్తములను వెలికిలగ నుంచి, నాసికాగ్రమున దృష్టి నిలుపవలయును. (అనగా, కన్నులు సగము మూసి - నాసికాగ్రమును చూచుచున్నట్లు మాత్రమే కాని, నాసికాగ్రమును చూచుచుండవలయునని కాదు - భ.గీ. VI. 11-13 శంకరభాష్యము) దంత మూలమున జిహ్వాగ్రమును హత్తించి, వక్షమున గడ్డము నుంచి, మెల్ల మెల్లగ ప్రాణ వాయువును పూరింపవలయును. (అంఘ్రి మూలమున మూలాధార చక్రము పీడించి, అపాన వాయువును ఊర్ధ్వమున కాకర్షింపవలయును. ఇదియే మూలబంధ మనబడును. (హఠయోగప్రదీపిక - III-61). మూలాధారబంధము, ప్రాణవాయునిరోధము, మొదలగు హఠయోగ ప్రక్రియలు గురుముఖముననే యెఱుగవలయును)
పద్మాసనము సర్వవ్యాధి వినాశకము. సామాన్యులగు భాగ్యహీనుల కిది దుర్లభము. ధీమంతులకు మాత్రమే భువియందిది లభ్యము.

(1) పోల్చు :- "సఙ్కల్పశూన్యతా యా హి, వృత్తిశూన్యం తదేవ హి ।
తస్మిన్ విలయం యాతి, తత్తురీయ మితీర్యతే ।"

సంకల్పరాహిత్యమే, వృత్తి రాహిత్యము, వృత్తి రాహిత్యమే మనోలయము. ఇదియే తురీయము. - బ్రహ్మైవస్థ. (అద్వైతము) (శారదాచతుశ్శతి. II-56)

**51-52.** ఈ యభ్యాసవశమున (బింబభూతమగు చిన్మాత్రాభ్యాసముచే) హృదయమున సర్వోత్తమమైన బ్రహ్మానందమును పొందెను. బ్రహ్మానంద రసాస్వాదనమున, చిత్సామాన్యదశాక్రమము అయింపగా, విశ్వమున కాశ్రయభూతము, అనంతము, సర్వవ్యాపకమునగు ఆత్మస్వరూప సత్తా సామాన్యము నాతడు (ఉద్దాలకుడు) పొందెను.

**తస్థౌ సమసమాభోగః,(1) పరాం విశ్రాన్తి మాగతః ॥ 52 ॥**
**ఉపశాన్తః శనై రేవః, స్వపదే విమలాత్మని ।**
**సర్వోపాధి వినిర్ముక్తో, బ్రహ్మరూపో బభూవ సః(2) ॥ 53॥**

**52-53.** అతడు సమములైన వాని కంటెను సమమైన - (ఆత్యంతికవిక్షేప వైషమ్యశూన్యమైన) స్వరూపము గలవాడై, పరమవిశ్రాంతిని (సర్వోత్కృష్ట మగు ఆనందమును) పొంది యుండెను. అల్లనల్లన అతడు ఆత్మస్వరూపమగు స్వనిర్మలపదమున (నిర్వాణమున) ప్రశమన మొందినాడు; సర్వోపాధివినిర్ముక్తుడై బ్రహ్మస్వరూపుడైనాడు.

*ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'ఉద్దాలకోపాఖ్యానం' నామ పంచదశః సర్గః*

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'ఉద్దాలకోపాఖ్యానము'ను
పంచదశ (పదునైదవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



---

(1) సమేభ్యోఽపి సమ ఆత్యన్తికవిక్షేప వైషమ్య శూన్య ఆభోగః స్వరూపం యస్య ।
(యో.వా.తా.ప్ర. V-55-20)

(2) మహోపనిగ్రహోపాయమును, ధ్యానాభ్యాసము వలన ఆత్మస్వరూపసాక్షాత్కారమును, ప్రాణ వాయువిరోధమును, ఈ యుపాఖ్యానము నిరూపించుచున్నది.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## షోడశసర్గము

## సురఘూపాఖ్యానమ్ – సురఘుని కథ

### 1. అన్తఃశీతలతా – అంతరంగము లోని చల్లదనము

శ్రీరామ ఉవాచ :–
కశ్చిద్ధి దృశ్యతే లోకే, క్రమా జ్జాతసమాధికః।
ప్రబుద్ధ ఇవ విశ్రాన్తో, వ్యవహారపరోఽపి సన్ ॥ 1 ॥
కశ్చిదేకాన్త మాశ్రిత్య, సమాధినియమస్థితః।
తయోస్తు కతరః శ్రేయా నితి మే భగవన్ ! వద ॥ 2 ॥

1-2. శ్రీరాముడు :– విచార వైరాగ్య అభ్యాసక్రమమున నుదయించిన సమాధి గలవాడై, మేల్కొన్న వాని వలె, సర్వవ్యవహారముల చక్కగా నాచరించుచున్నను, చిత్తసంక్షోభరహితుడై, నిరంతరవిశ్రాంతి నొందినట్టి

జ్ఞాని, యొకడు లోకమున కన్పించుచున్నాడు. మఱియొక జ్ఞాని, ఏకాంతవాసము నాశ్రయించి, నియతముగ సమాధినిష్ఠ యందున్నాడు. స్వామీ! మీ రిరువురిలో నెవడు శ్రేష్ఠుడో వచింపుము.

**వసిష్ఠ ఉవాచ –**

**ఇమం గుణసమాహార మనాత్మత్వేన పశ్యతః ।**
**అన్తః శీతలతా యాఽసౌ, సమాధి రితి కథ్యతే । 3 ।**

3. **వసిష్ఠుడు :–** ఈ సత్త్వాదులగు అఖిలగుణసముదాయమును (దృశ్య ప్రపంచమును) అనాత్మగా చూచు వానికి కల్గు **అంతఃశీతలత్వమే (అంతరంగము చల్లనైనదియే – జ్ఞానప్రతిష్ఠా ఫలమగు పూర్ణకామత్వమే)** సమాధి యనబడుచున్నది.

**దృశ్యై ర్మమ న సంబన్ధ, ఇతి నిశ్చిత్య శీతలః ।**
**వ్యవహారస్థితః కశ్చిత్, కశ్చిద్ధ్యానవ్యవస్థితః । 4 ।**
**ద్వావేతౌ సుఖినౌ రామ! యద్యన్తః పరిశీతలౌ ।**
**ద్వావేతౌ సుసమౌ నూన మపద్దేహపదం గతౌ । 5 ।**

4-5. దృశ్యములతో నాకు (ఆత్మకు) సంబంధము లేదని నిశ్చయించి, అంతఃశీతలుడై (చిత్తమున శాంతరూపమగు చల్లదనము కలవాడై) పూర్ణకాముడై – ఒకడు **వ్యవహారపరుడు**గను, మఱియొకడు **సమాధిస్థుడు**గను నుండును.

శ్రీరామా! మీ రిరువురును అంతరంగమున, ఏ తాపము లేనివారై, శాంతి రూపమగు చల్లదనము కలవారై, పూర్ణకాములై యున్నచో, శాంతి సౌఖ్యము కలవారే. **లోకవ్యవహార తత్పరుడగు జ్ఞానియు, సమాధిస్థుడగు** జ్ఞానియు, ఇరువురును **నిరుపాధికచేతఃశీతలత్వము** గలవారగుటచే, సమానులే; నిశ్చయముగ, **సర్వసందేహరహితమగు పరమపదమును** పొందినవారు.[మాయా(అవిద్యా) తమస్సును పరామర్శించి, ప్రబుద్ధులై, వాసనాజాలమును నాశమొనర్చినవారు, వ్యవహార ప్రసక్తులై యున్నను, కాకున్నను సమాధి స్థితులే యని భావము]

అకర్తృ కుర్వదప్యేతత్, చేతః ప్రతనువాసనమ్ ।
దూరంగతమనా జన్తుః, కథాసంశ్రవణే యథా ॥ 6 ॥

6. కాంతాదికథాసంశ్రవణమున, ఎవని చిత్తము, అన్యస్థానగతమగునో, (అన్యత్ర ప్రసక్తమనస్కుడైనచో,) అతడా కథకు సంబంధించిన రాగద్వేషములచే బంధింపబడని యట్లు, అంతర్వాసనలు నశించినచో, క్రియ లొనర్చుచున్నను, చిత్తము, అకర్తయే యగుచున్నది.

(ప్రతనువాసనమ్ – నిర్వాసనమ్)

అకుర్వదపి కర్త్రేవ, చేతః ప్రఘనవాసనమ్ ।
నిష్పన్దాఽఙ్గ మపి స్వప్నే, శ్వభ్రపాతస్థితావివ ॥ 7 ॥

7. అంగములు చలింపక, చేష్టారహితములై యున్నను, సుప్తుడు కలలో, తాను గోతి యందు పడినట్లు భావించుటచే, చిత్తము కర్తృత్వమును కలదియే యగుచున్నది. అట్లే ఘనవాసనాయుక్తమగు చిత్తము కర్తగాకున్నను, కర్తయగుచున్నది.

యస్త్వాత్మరతిరేవాఽన్తః, కుర్వన్ కర్మేన్ద్రియైః క్రియాః ।*
న వశో హర్షశోకాభ్యాం, స సమాహిత ఉచ్యతే ॥ 8 ॥

8. అంతరంగమున కేవల మాత్మ యందే ప్రీతి కలవాడు, (అహంకార మమతారహితుడు) కర్మేంద్రియములచే క్రియ లొనర్చుచున్నను, హర్షశోకాది విక్షేపములకు లేశమైనను వశుడు కాడు. అతడే సమాహితుడు, అనగా సమాధిస్థు డనియే చెప్పదగినవాడు.

ఆత్మ వత్సర్వభూతాని, పరద్రవ్యాణి లోష్టవత్ ।
స్వభావాదేవ నో భీత్యా, యః పశ్యతి స పశ్యతి ॥ 9 ॥

9. సర్వభూతములను తనవలెను, పరుల ధనాదికమును మంటిగడ్డ వలెను,

---

* పోల్చు :- త్యక్త్వా కర్మఫలాఽఽసఙ్గం, నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభి ప్రవృత్తోఽపి నైవ కిఞ్చిత్ కరోతి సః ॥ (భ.గీ.IV.20)

కర్మఫలాసక్తిని వీడి, నిత్యతృప్తుడు, నిరవలంబనుడునగుచు, కర్మము లాచరించుచున్నను, అతడు ఏమియు నొనర్పనివాడే. ఏలయన, అతని కర్తృత్వబుద్ధి, జ్ఞానాగ్నిచే, దగ్ధము. అతడు సమాహితుడే.

భయముచే కాక, స్వభావముచేతనే గాంచునో, అతడే నిజముగ కాంచువాడు. వాని దృష్టియే సంపూర్ణమైన దృష్టియని భావము.

## 2. మాణ్డవ్యోపదేశః - మాండవుని ఉపదేశము

**అత్రైవోదాహరన్తీమం, వృత్తాన్తం సురఘోః కిల ।**
**సురఘు ర్నామ బలవాన్, కిరాతేశోఽభవత్ పురా ॥ 10 ॥**

10. ఈ విషయమున సురఘుడను వాని పురాతన ఇతిహాసమును, తత్త్వవేత్తలు ఉదాహరింతురు. పూర్వము, సురఘుడను పేరు గల బలశాలియగు కిరాతాధిపతి యుండెను.

**స చక్రే రాజ్యకార్యాణి, నిగ్రహాఽనుగ్రహక్రమైః ।**
**తజ్జాభ్యాం సుఖదుఃఖాభ్యాం, తస్య దోలాయితం మనః ॥ 11 ॥**

11. అతడు, దుష్టనిగ్రహశిష్టానుగ్రహక్రమములచే, రాజ్యపాలన మొనర్చుచుండెను. అట్టి కార్యములచే కల్గుచున్న హర్షశోకములతో అతని మనస్సు, ఊయల యట్లు వెనుకకు ముందుకు నూగుచుండెను. (వ్యాకులమయ్యెను.)

**అథైకదా స పప్రచ్ఛ, మాణ్డవ్యం ముని మాగతమ్ ।**
**సంపూజ్య విధి వద్భక్త్యా "సన్దేహం ఛిన్ధి మే ప్రభో! ॥ 12 ॥**
**నిగ్రహాఽనుగ్రహై ర్జాతా, మద్భృత్య వపుషి స్థితాః ।**
**కష్టి మా మలం చిన్తాః, సమతోదేతి మే కథమ్?" ॥ 13 ॥**

12-13. అనంతర మొకప్పుడు, మాండవ్యుడను ముని, తన చెంతకు రాగా, ఆ మునిని, విధి పూర్వకముగ పూజించి, సురఘుడు ఇట్లు ప్రశ్నించెను.

"స్వామీ! శత్రుమిత్రాదులగు నా ప్రజల విషయమున నేనొనర్చు నిగ్రహానుగ్రహముల వలన కల్గు చింతలు, నన్ను రాయిడి పెట్టుచున్నవి. నా యందు సమత్వ మెట్లుదయించునో, ఉపదేశించి, ఈ సందేహమును విచ్ఛిన్న మొనర్పుము.

మాణ్డవ్య ఉవాచ :-

"స్వవిచారణయైవాఽఽశు, శామ్య త్యన్త ర్మనోజ్వరః ।
'కోఽహం? కథ మిదం? కిం వా?, కథం మరణజన్మనీ'? । 14 ।
విచార్యైవం పరిజ్ఞాతస్వభావస్య సత స్తవ ।
మనః స్వరూప ముత్సృజ్య, శమ మేష్యతి విజ్వరమ్ । 15 ।

l-15. మాండవ్యుడు :- "స్వవిచారణ (ఆత్మ విచారణ) చేతనే, శీఘ్రముగ లోని మనఃసంతాపము (జ్వరము) ఉపశమించును. 'నేనెవడను? ఇది (ప్రపంచము) ఎట్టిది? మరణమననేమి? జన్మమననేమి?' - అని ఇట్లు విచారించినచో, నీవు నీ సత్స్వభావము నెఱుగుదువు. అపుడు నీ మనస్సు తన స్వరూపమును విసర్జించి, పూర్వసిద్ధ బ్రహ్మ స్వభావమును పొంది, సంతాప(జ్వర)రహితమై, పరమమైన శాంతిని పొందును.

యావత్సర్వం న సన్త్యక్తం, తావదాత్మా న లభ్యతే ।
ఆత్మాఽవలోకనార్థం హి, తస్మా త్సర్వం పరిత్యజేత్" । 16 ।

5. సర్వపదార్థములు పరిత్యక్తములు కానంత వఱకు, ఆత్మప్రాప్తి సిద్ధింపదు. కాన, స్వాత్మావలోకనమునకై సర్వమును పరిత్యజింపవలెను."

ఏవముక్త్వా మునౌ యాతే, రాజా స్వయ మచిన్తయత్ ।
"దేహ మాత్ర మహం నాఽస్మి, హస్తపాదా ద్యచేతనమ్ । 17 ।
కర్మేన్ద్రియాణి[1] నైవాఽహం, న చ కర్మేన్ద్రియాణి మే ।
జడాన్యతత్స్వరూపాణి, న చ బుద్ధీన్ద్రియాణ్య[2]హమ్ । 18 ।

7-18. ఇట్లుపదేశించి ముని వెళ్లిన తరువాత, రాజు స్వబుద్ధితో నిట్లు విచారించినాడు. "కరచరణాదులతో కూడిజడమైన కేవల దేహ మేనుకాను.

) వాక్కు (జిహ్వ) - హస్తములు, పాదములు, పాయువు (గుదము) ఉపస్థ (జననేంద్రియము) - ఇవి ఐదును కర్మేంద్రియములు (Organs of action)

:) చక్షువు (కన్ను), శ్రోత్రము (చెవి), ఘ్రాణము (ముక్కు), త్వక్కు (చర్మము), రసన (నాలుక), - ఇవి ఐదును జ్ఞానేంద్రియములు. (Organs of perception) (మాట్లాడునపుడు నాలుక కర్మేంద్రియము. రుచి చూచునపు డది జ్ఞానేంద్రియము.

కర్మేంద్రియములును నేను కాను. అవి నావి కావు. జడములు మిథ్యా రూపములునైన జ్ఞానేంద్రియములును నేను కాను. అవియు నావి కావు.

**నాఽహ మేవం శరీరాది, శిష్ట మాలోకయా మ్యహమ్ ।**
**శేషో వికల్పహీనో హి, విశుద్ధా చిదహం తతః ॥ 19 ॥**
**సర్వభావగతా సూక్ష్మా, భావాఽభావవివర్జితా ।**
**స ఏవ భగవానాత్మా, తన్తు ర్ముక్తాస్వివ స్థితః" ॥ 20 ॥**

**19-20.** దేహము మొదలుకొని, మనోబుద్ధీంద్రియాదుల పర్యంతము కలవేవియు. నేను కాను. ఇక మిగిలిన దానిని (శిష్టమును) గూర్చి విచారింతును. ఈ శేషించినది వికల్పరహితము, విశుద్ధమునగు సాక్షిచైతన్యము. ఇదియే నిక్కముగా నేను. ఇది సర్వ భావగతము, సూక్ష్మము, సదసద్భావరహితము (ఉన్నది, లేదు – అను భావముల కతీతము) ఇదియే ఆత్మ, భగవంతుడు. మౌక్తికహారము నందు సూత్రము వలె అనుగతమై, సర్వపదార్థముల యందును నున్నది."

**ఇతి జ్ఞాత్వా కిరాతేశో, లేభే పద మనుత్తమమ్ ।**
**వివేకాఽధ్యవసాయేన, బ్రాహ్మణ్య మివ గాధిజః ॥ 21 ॥**

**21.** ఇట్లు తెలిసికొని, వివేకనిశ్చయముచే ప్రయత్నించి, గాధిపుత్రుడు (విశ్వామిత్రుడు) బ్రాహ్మణత్వమును పొందినట్లు, ఆ కిరాతరాజు – సురఘుడు పరమోత్కృష్ట బ్రహ్మపదమును పొందెను.

## 3. పరిఘేణ సంవాదః – పరిఘుడను వానితోడి సంవాదము.

**బభూవ పారసీకానాం, పరిఘోనామ పార్థివః ।**
**స బభూవ పరం మిత్రం, సురఘోరస్య భూపతేః★ ॥ 22 ॥.**

**22.** పారసీక దేశమునకు పరిఘు డను రాజుండెను. అతడు, ఈ సురఘురాజునకు పరమమిత్రుడు.

---

★ సురఘో రఘునందన ! – (పా.భే.)

కదాచి జ్ఞాతదుర్భిక్షం, రాజ్యం త్యక్త్వా వనం గతః ।
భక్షయన్ శుష్కపర్ణాని, పర్ణాదః పరిఘః స్మృతః । 23 ।

23. ఒకప్పుడు, అతని దేశమున క్షామము తటస్థింపగా, పరిఘుడు, రాజ్యమును విడిచి, వనమున కేగినాడు. అచ్చట పండి, రాలిన పర్ణములు (ఆకులు) మాత్రమే భక్షించుచుండుటచే, పరిఘుడు, 'పర్ణాదుడ'ను పేర ప్రసిద్ధుడయ్యెను.

తతో వర్షసహస్రేణ, తపసా దారుణాత్మనా ।
అభ్యాసవశతః ప్రాపత్, జ్ఞాన మాత్మ ప్రసాదజమ్ । 24 ।

24. తరువాత, వేయి సంవత్సరముల తీవ్రతపము చేతను, ధ్యానసమాధి అభ్యాసము చేతను, ఆత్మప్రసాదజన్యమైన★(చిత్తశుద్ధి, ఈశ్వరానుగ్రహము వలన కలిగిన) ఆత్మజ్ఞానమును, ఆ రాజు పొందినాడు.

ఏకదా పరిఘః ప్రాప, సదనం సురఘో ర్ముదా ।
తే తత్ర ప్రాక్తనే మిత్రే, అన్యోన్య మిద మూచతుః । 25 ।

25. ఒకప్పుడు పరిఘుడు సంతోషముతో సురఘుని యింటికి వచ్చినాడు. అచ్చట, ఆ పురాతన మిత్రులు, పరస్పర మిట్లు సంభాషించుకొన్నారు.

పరిఘ ఉవాచః–

"జ్ఞాన మేతన్మయా ప్రాప్తం, త్వయా జ్ఞానం యథా పురా ।
కచ్చిత్ కరోషి సమయా, సుప్రసన్నగభీరయా । 26 ।

దృష్ట్యా సుభగకార్యాణి, కర్మాణ్యేవ నరాధిప ! ।
ఆపాతరమణీయే చ, కచ్చిద్భోగే న సజ్జసి । 27 ।
కచ్చిచ్ఛ్రోపశమం శ్రేయః, సమాధి మనుతిష్ఠసి ।

26-27. పరిఘుడుః– "రాజా! మునుపు నీవు ఆత్మజ్ఞానము పొందినట్లు నేనును, జ్ఞానప్రాప్తిని పడసితిని. జ్ఞానప్రభావము వలన సమము మిగుల శాంతము, గంభీరమునైన దృష్టి (బుద్ధి) నవలంబించి, సర్వజనహితకరములు,

★ ఆత్మప్రసాదః– చిత్త శుద్ధిరీశ్వరానుగ్రహశ్చ, తస్మాజ్జాతం, జ్ఞానమ్ । (యో.వా.తా.ప్ర)

అవశ్యకర్తవ్యములునైన కార్యములను, కర్మములను, ఆచరించుచుంటివా? అవిచారవశమున, క్షణకాలము మాత్రము రమణీయముగ కాన్పించు ప్రేయోరూపములైన విషయభోగములందు, నీ మనస్సు సంసక్తము కాదు కదా! పరమోహవశమము, శ్రేయోరూపమునగు సమాధి ననుష్ఠించుచున్నావు కదా!"

సురఘు రువాచ –

"నిత్యప్రబుద్ధచిత్తత్వా త్కుర్వన్తోఽపి జగత్క్రియాః ॥ 28 ॥
ఆత్మైకతత్త్వసన్నిష్ఠాః, సదైవ సుసమాధయః ।

తత్త్వాఽవబోధో భగవన్! సర్వాఽఽశాతృణపావకః ॥ 29 ॥
ప్రోక్తః సమాధిశబ్దేన, న చ తూష్ణీ మవస్థితిః ।

**28-29.** సురఘు డుః– "నిత్య ప్రబుద్ధ (జ్ఞానయుక్త) చిత్తము వలన, జగద్వ్యవహార కార్యముల నాచరించుచున్నను, (ఆచరింపకున్నను కూడ), పరమాత్మైక తత్త్వనిష్ఠులగువారు, సదా, పరమసమాధియుతులయ్యే యుందురు. స్వామీ! సమస్తములగు ఆశ లనెడు తృణజాలమునకు, పరతత్త్వజ్ఞానము దహించు అగ్ని వంటిది కదా! ఈ తత్త్వజ్ఞానమే సమాధిశబ్దముచే పేర్కొనబడుచున్నది. కాని, తూష్ణీం స్థితి, అనగా, ఊరక కూర్చుండుట సమాధి యెంత మాత్రము కాదు.

అక్షుబ్ధా నిరహఙ్కారా, ద్వన్ద్వేష్వననుపాతినీ ॥ 30 ॥
నిశ్చిన్తాఽధిగతాఽభీష్టా,* హేయోపాదేయవర్జితా ।
ప్రోక్తా సమాధిశబ్దేన, పరిపూర్ణా మనోగతిః " ॥ 31 ॥

**30-31.** ఏ విధమైన సంక్షోభము లేనిది, అహంకారమమకారశూన్యమైనది, శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వముల యందు ప్రవేశింపనిది, చింతావిరహితమైనది, అభీష్టప్రాప్తి పొందినది, ఇది విడువదగినది (హేయము) ఇది గ్రహింపదగినది (ఉపాదేయము) యను భేదమును వర్జించినది,

---

★ విగతాఽభీష్టా – అభీష్టమేదియు లేనిది. పా.భే.

సర్వత్ర పరిపూర్ణమున్నైనదియు నగు మనఃస్థితి, సమాధిశబ్దముచే పేర్కొనబడినది."

పరిఘు ఉవాచ –

"రాజన్! నూనం ప్రబుద్ధోఽసి, ప్రాప్తవానసి తత్పదమ్ ।
సంశీతలాన్తఃకరణో, గతాఽహఙ్కారవిక్లబః" ॥ 32 ॥

32. "పరిఘుడు :- రాజా! నీవు నిక్కముగ జ్ఞానవంతుడవైతివి. పొందదగిన ఆ పరమపదమును పొందితివి. అందుచే చల్లనైన అంతఃకరణము కల్గి, అహంకారవ్యాకులత్వము లేనివాడవైతివి."

సురఘుః పరిఘుశ్చైవ, విచార్యైవం జగద్భ్రమమ్ ।
మిథః ప్రపూజితౌ తుష్టౌ, స్వవ్యాపారపరౌ గతౌ ॥ 33 ॥

33. ఇట్లు సురఘుడును, పరిఘుడును, జగద్భ్రాంతిని గుఱించి విచారణ మొనరించి, పరస్పరము పూజాదులచే సత్కరించుకొని, సంతుష్టులై, స్వస్వవ్యాపారపరాయణులై బయలుదేరి వెళ్లినారు. (జగద్వ్యవహారముల నడుమ సైతము, సమదృష్టిని పొందుటను ఈ కథ వ్యాఖ్యానించును.)

## 4. స్వాత్మ సముద్ధరణమ్ – తన్ను తాను ఉద్ధరించుకొనుట

యో హ్యధ్యాత్మమయో నిత్యం, నిత్య మన్తర్ముఖః సుఖీ ।
నిత్యం చిదనుసన్ధానః, స న శోకేన బాధ్యతే ॥ 34 ॥

34. ఎవడు నిత్యము ఆత్మైకవిచారతత్పరుడై, బాహ్య వస్తువుల యందు దాసక్తి లేక, అంతర్ముఖుడై, సుఖరూపుడై, శుద్ధచైతన్య (పరమాత్మ) ధ్యాన పరుడై యుండునో, వాడు మనఃశోకములచే పీడింపబడడు.

యస్మిన్ దేశే గిరౌ★ తదజ్ఞో, నాఽస్తి సజ్జన పాదపః ।
సఫలః శీతలచ్ఛాయో, న తత్ర నివసేద్బుధః ॥ 35 ॥

---

★ యస్మిన్దేశమరౌ – (పా.భే.) దేశో మరురివ దేశమరుస్తస్మిన్ । (యో.వా.తా.ప్ర.)
(ఎడారి వంటి దేశము నందు)

35. ఏ దేశమున, లేక, ఏ పర్వతమున, ఫలభరితము శీతలచ్ఛాయా యుక్తము నగు పరతత్త్వజ్ఞాని యను చంపకవృక్షము లేదో అది, బుద్ధిమంతునకు నివాస యోగ్యము కాజాలదు. ఫలసంయుక్తమై, శీతలచ్ఛాయ నొసగు వృక్షములు లేని పర్వతమును, మనుజు డెవడును ఆశ్రయింపడు. అట్లే, జ్ఞానమను ఫలమును, చిత్తశాంతియను శీతలచ్ఛాయను నొసగగల ఆత్మజ్ఞాని లేని దేశమున, బుద్ధిమంతు డెవడును నివసింపరాదు.[పై శ్లోకమందలి దేశపర్వతముల సాదృశ్యము నందలి భావము సుస్పష్టము.]

**న ధనాని న మిత్రాణి, న శాస్త్రాణి న బాన్ధవాః ।**
**నరాణా ముపకుర్వన్తి, మగ్నస్యాత్మసముద్ధృతౌ ॥ 36 ॥**

36. ధనములు గాని, మిత్రులు గాని, ఇతరములైన శాస్త్రములు గాని, దారపుత్రాదులగు బంధువులు గాని, అజ్ఞానసాగరమున నిమగ్నమగు తన ఆత్మ నుద్ధరించుట యందు, నరులకు ఉపకరింపజాలరు.

**మనోమాత్రేణ మిత్రేణ (సుహృదా), సదైవ సహవాసినా ।[1]**
**సహ కిఞ్చిత్పరా మృశ్య, భవత్యాత్మా సముద్ధృతః ॥ 37 ॥**

37. సర్వకాల సర్వావస్థల యందును, తనతో సహవాసి యగు శుద్ధ మానవ మను మిత్రునితో కొంచెము పరామర్శించినచో, – (ఆత్మవిచార మొనరించినచో) – ఆత్మ సముద్ధరణము సంభవమగును.

**మనోఽహఙ్కారవిలయే,[2] సర్వభావాన్తరస్థితా ।**
**సముదేతి పరానన్దా, యా తనుః పారమేశ్వరీ ॥ 38 ॥**

38. మనస్సు, అహంకారము, లయింపగా (ఉపాధి నశింపగా) సర్వ పదార్థములలో, ఏకరూపముగ నున్న (తత్, త్వం పద లక్ష్యరూపమగు)

---

(1) పోల్చు :- భ.గీ. VI-5,6; మఱియు, ధమ్మపదం – గాథలు –160; 380.
**డా॥ రత్నాకరం బాలరాజు – అధ్యాత్మవిద్యాగ్రంథరత్నమాల, అనంతపురం, (1994)**

(2) ఘటవిలయే, తదాకాశస్య మహాకాశత్వమివ ॥ యో.వా.తా.ప్ర.

పరమేశ్వరుని పరానందము ఉదయించుచున్నది.

సా స్వయం యోగసంసిద్ధా, పరమా విగతోపమా।
న గమ్యా వచసాం రామ!, హృద్యేవేహాఽనుభూయతే ॥ 39 ॥

39. శ్రీరామా! అట్టి పరమస్థితి స్వయముగ యోగముచే సిద్ధించును. అది వాచామగోచరము. (వాక్కులకు అందనిది). మఱియు, ఏచట హృదయమునవనే, ఇది అనుభూత మగుచున్నది.

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'సురఘూపాఖ్యానం'నామ షోడశః సర్గః॥

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'సురఘూ పాఖ్యానము'ను
షోడశ (పదునాఱవ) సర్గము సమాప్తము

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## సప్తదశసర్గము

## మనోనాశప్రకారః – మనోనాశవిధానము

### 1. భాసవిలాస సంవాదః – భాసవిలాసులను వారి సంవాదము

వసిష్ఠ ఉవాచ –
మనసైవ మన శ్ఛిత్త్వా, యద్యాత్మా నాఽవలోక్యతే ।
నాఽస్తమేతి జగద్దుఃఖం, మనశ్ఛేదే సుఖాఽఽత్మధీః ॥ 1 ॥

1. వసిష్ఠుడు :– మనస్సు చేత మనస్సును ఛేదించి, ఆత్మదర్శనము గావింపనిచో, ఈ జగద్దుఃఖ మస్తమింపదు. మనస్సు ఉచ్ఛిన్నము కాగా, పరమసుఖస్వరూపమగు ఆత్మజ్ఞానము కల్గుచున్నది.

సుహృదో రత్ర సంవాదం, శృణు భాసవిలాసయోః ।
పురా సహ్యగిరేః సానౌ, తాపసౌ ద్వౌ బభూవతుః ॥ 2 ॥

2. ఈ విషయమున, భాస విలాసులను నిరువురు మిత్రుల సంవాదమును వినుము. పూర్వము సహ్యపర్వత శిఖరారణ్యమున నిరువురు తాపసులు నివసించుచుండిరి.

**ఆస్తా మన్యోన్యసుస్నిగ్ధౌ, తయో రప్యాత్మజావుభౌ ।**
**విలాస భాసనామానౌ, సమ మాసీత్తయో ర్మనః ॥ 3 ॥**

3. పరస్పరము వారు పరమమిత్రులు. వారి యిరువురు పుత్రులు భాసుడు, విలాసుడు అను పేర్లు కలవారు. వా రిద్దరి మనస్సులును ఏకమై సమముగా నుండెను.

**మృతౌ తు పితరౌ దృష్ట్వా, చక్రాతే పరిదేవనమ్ ।**
**తతస్తౌ తపసా కాలం, క్షపయామాసతుః పృథక్ ॥ 4 ॥**

4. మరణించిన పితరులను గాంచి, వారు విలపించినారు. తరువాత వారు వేర్వేఱుగా తప మొనర్చుచు కాలము గడపిరి.

**ఏకదా సఙ్గతౌ తౌ చ, హ్యేవ మన్యోన్య మూచతుః ।**
**విలాస ఉవాచ :-**
**"వద క్వ క్షపితః కాలః?, కచ్చిత్తే సఫలం తపః ?॥ 5 ॥**
**కచ్చిత్తే విజ్వరా బుద్ధిః?, కచ్చిత్ కుశల వానసి? ॥"**

5-6. వా రిరువురు చాల కాలమునకు, ఒకప్పుడు, కలసికొన్నారు: పరస్పరమిట్లు సంభాషించుకొన్నారు. అప్పుడు, విలాసుడు భాసునితో "ఇంతకాలము నీవెచ్చట గడపితివి? నీ తపము ఫలించినదా? నీ బుద్ధి, యే తాపము లేకుండ నున్నదా? నీవు, నిరంతరము, కుశలముగ నున్నావా?" – అని ప్రశ్నించినాడు.

**భాస ఉవాచ :–**
**"కుశలం తు కుతోఽస్మాకం, సంసారే తిష్ఠతా మిహ? ॥ 6 ॥**
**యావన్నాఽధిగతం జ్ఞేయం, యావత్ క్షీణా న చిత్తభూః ।**
**యావత్తీర్ణో న సంసారః, తావ న్నః కుశలం కుతః? ॥ 7 ॥**

6-7. భాసుడు :– "సంసారమున నున్న మా కిక కుశలమెచ్చట? జ్ఞేయము (ఎఱుగదగినబ్రహ్మమును) నెఱుగ (పొంద)నంత వఱకు, కామసంకల్పాదులు, నశింపనంత వఱకు, సంసారసాగరమును తరింపనంత వఱకు, మాకు క్షేమ మెక్కడిది?

యావన్నాఽభ్యుదితో బోధః, తావ న్నః కుశలం కుతః ? ।"
ఏవం తౌ కుశలం ప్రశ్నం, కృతవన్తౌ పరస్పరమ్ ॥ 8 ॥
కాలేన*విమలం జ్ఞానం, లబ్ధ్వా మోక్ష మవాపతుః ।

8-9. పరమబోధము ఉదయింప నంత వఱకు, మాకు సౌఖ్యమెక్కడిది?" - ఇట్లు వా రిర్వురు పరస్పరము - (సంసారాఽసారతా విచార బహుళమైన) - కుశలప్రశ్న లొనర్చుకొని, మఱి కొంతకాలమునకు, నిర్మల జ్ఞానము నొంది, మోక్షమును ప్రాపించినారు. [మనోనిగ్రహము, ఆత్మసాక్షాత్కారము లేక, పరమశాంతి యందు ప్రతిష్ఠితు డగుట అసంభవమని ఈ యుపాఖ్యానము నిరూపించును.]

అతో వచ్మి మహాబాహో! యథా జ్ఞానేతరా గతిః ॥ 9 ॥
సంసారతరణే నాఽస్తి, సఙ్గబద్ధస్య చేతసః ।
అసక్తం నిర్మలం చిత్తం, ముక్తం సంసార్యపి స్ఫుటమ్ ॥ 10 ॥
సక్తం దీర్ఘతపో యుక్త, మపి బద్ధం భవేదిహ ।

9-11. మహాబాహుడవగు శ్రీరామా! ఈ కారణమున సంసారసాగరమును తరించుటకు జ్ఞానము తక్క, వేఱు ఉపాయము విషయసంగబద్ధమైన మనస్సునకు లేదని నేను వచింతును. విషయసంగరహితము, నిర్మలమునైన చిత్తము, సంసారమున నున్నను విముక్తమే యనుట స్పష్టము. చిరకాలము ఉగ్రతపోయుక్తమైనను, విషయసంసక్తమైన చిత్త మిచట,

★ ".... For in all things there is a cycle of their action and a period of the divine movement.
(See: The Four Aids – The Synthesis of Yoga - Chapter I - Sri Aurobindo)

మఱియు :– "కాలేన పాదం లభతే తథాఽయం,
తథైవ పాదం గురుయోగతశ్చ
ఉత్సాహయోగేన చ పాదమృచ్ఛేత్,
శాస్త్రేణ పాదం చ తతోఽభియాతి" (సనత్సుజాతీయము III-13)

ఈ శ్లోకము నందు క్రమము అవివక్షితము. శ్రీ అరవిందుల ననుసరించి క్రమము :– (1) శాస్త్రము, (2) ఉత్సాహము, (3) గురువు, (4) కాలము. ఇవి బ్రహ్మవిద్యాప్రాప్తికి నాల్గు పాదములు – (సహకారకము)లని (సనత్కుమారుని) ఉపదేశము
కాని, శంకరుని ననుసరించి క్రమమిట్లున్నది –
(1) గురుయోగము, (2) ఉత్సాహయోగము, (3) కాలము, (4) శాస్త్రము. బుద్ధి పరిపాకము (maturity of understanding) కాలమువలనే సిద్ధించును కాన, కాలము, వరుస యందు కడపటిదిగా నుండుటయే సమంజసము.
"కాలేనాఽఽత్మని విన్దతి ।" (భ.గీ.IV-38)

దృఢబంధనయుతమే యగుచున్నది. ★

## 2. సంసక్తిః – ప్రగాఢమగు సంగము

శ్రీరామ ఉవాచ –

"కీదృశో భగవన్! సఙ్గో, నృణాం బన్ధాయ కీదృశః ॥ 11 ॥
కీదృశో వాఽపి మోక్షాయ, కథం చైష చికిత్స్యతే? ।"

11-12. శ్రీరాముడు :– "స్వామీ! సంగమనగా నెట్టిది? మనుజుల కీసంగము, బంధ మెట్లు కలుగజేయును? మోక్షమెట్లు కలుగజేయును? ఈ సంగమునకు చికిత్సయేది? (అది ఎట్లు నివారింపబడును?)"

వసిష్ఠ ఉవాచ –

దేహదేహి విభాగైక పరిత్యాగేన భావనాత్ । 12 ।
దేహ మాత్రే తు విశ్వాసః, సఙ్గో బన్ధార్థ ఉచ్యతే ।"

12-13. వసిష్ఠుడు :– క్షేత్రమగు దేహమునకు, క్షేత్రజ్ఞుడగు దేహికి (ఆత్మకు) గల భేదమును త్యజించుటచే గల్గు విపరీతభావనచే, దేహమాత్రమునవే విశ్వాసము గల్గి యుండుట (దేహమే తా నని విశ్వసించుట) యను సంసక్తి, బంధార్థమని వచింపబడినది.

ఆత్మైవ ఖల్విదం సర్వం, కిం గృహ్ణామి త్యజామి కిమ్? । 13 ।
ఇత్యసఙ్గస్థితిం విద్ధి, జీవన్ముక్తత్వ ముత్థితమ్ ।

13-14. "ఇది యంతయు పరమాత్మయే కాన, దేనిని గ్రహింతును? దేనిని త్యజింతును?" – అనునిట్టి అసంగస్థితియే మహోన్నతమగు జీవన్ముక్తత్వమని తెలిసికొనుము.

నాఽభినన్దతి నైష్కర్మ్యం, న కర్మస్వనురుధ్యతే । 14 ।
సుసమో యః ఫలత్యాగీ, సోఽసంసక్త ఇతి స్మృతః ।

---

★ పోల్చు :- "వనేఽపి దోషాః ప్రభవన్తి రాగిణాం,
గృహేఽపి పఞ్చేన్ద్రియనిగ్రహస్తపః ।
అకుత్సితే కర్మణి యః ప్రవర్తతే,
నివృత్తరాగస్య గృహం తపోవనమ్ ।" (హితోపదేశము–సంధి–శ్లో–86)

రాగాత్ములు అరణ్యమున నివసించినను, దోషములే వారికి సంభవించును. గృహమందున్నను, పంచేంద్రియసంయమమే, తపఫలము వొసగును. సత్కర్మ నిరతుడు, రాగరహితుడునైన వాని గృహమే తపోవనము.

**14-15.** నైష్కర్మ్యమును (సర్వకర్మత్యాగమును). అభినందింపకయు, కర్మముల యందు బద్ధుడు కాకయు, సిద్ధి, అసిద్ధుల యందు సమబుద్ధియై, ఫలత్యాగి యగు వాడు అసంసక్తు డనబడును.

**అసంసజ్జేన సర్వాశ్చ, చేష్టాః నానావిజృమ్భితాః ॥ 15 ॥**
**చికిత్సితా భవన్త్యేవ, శ్రేయః సంపాదయన్తి చ ।**

**15-16.** అసంసక్తి వలననే, ఫలరాగవిజృంభితములైన నానావిధములైన దుశ్చేష్టలు, చికిత్సితములగుచున్నవి. (నివారింపబడుచున్నవి). శ్రవణమననాది చేష్టలును, నిర్విఘ్నముగ శ్రేయ మొనగూర్చుచున్నవి.

**భూతాని యదనన్తాని, తరఙ్గిణి తరఙ్గవత్ ॥ 16 ॥**
**ఉత్పద్యోత్పద్య లీయన్తే, తత్సంసక్తి విజృమ్భితమ్ ।**

**16-17.** సాగరమున తరంగముల వలె, అనంతమగు ప్రాణిసముదాయము, మరల మరల ఉత్పన్నమై నశించుచుండుటకు, ఈ సంసక్తి యొక్క విజృంభణమే, కారణము.

**సంసక్తి ర్ద్వివిధా ప్రోక్తా, వన్ధ్యా, వన్ద్యా చ రాఘవ ! ॥ 17 ॥**
**వన్ధ్యా సర్వత్ర మూఢానాం, వన్ద్యా తత్త్వవిదాం నిజా ।**

**17-18.** శ్రీరామా! ఈ సంసక్తి, వంధ్య (పరమపురుషార్థఫలశూన్యము) యనియు, వంద్య (ప్రశస్యము) యనియు రెండు విధములు. వంధ్యాసంసక్తి మూఢులకును, మఱియు, వంద్యాసంసక్తి సర్వత్ర, ఆత్మజ్ఞానులకును స్వాభావికమై యున్నది.

**ఆత్మతత్త్వాఽవబోధేన, హీనా దేహాదివస్తుజా ॥ 18 ॥**
**భూయః సంసారసక్తి ర్యా, దృఢా వన్ధ్యేతి కథ్యతే ।**

**18-19.** ఆత్మతత్త్వజ్ఞానరహితము, దేహాదిసర్వపదార్థముల నాశ్రయించి కల్గినదియు, అపారము, దృఢమునగు సంసారసక్తి, వంధ్య (నిష్ఫలము) అని పేర్కొనబడినది.

**ఆత్మతత్త్వాఽవబోధేన, సత్యభూతవివేకజా ॥ 19 ॥**
**వన్ద్యా హి కథ్యతే సక్తి, ర్భూయః సంసారవర్జితా ।**

**19-20.** ఆత్మతత్త్వ జ్ఞానముచే, పరమసత్యము, పాంచభౌతిక జగత్తు - వీనిని గూర్చి యొనర్చిన, వివేకము వలన జనించినదై, మరల సంసార వర్జితమునైన సంసక్తి, వంద్య (పూజనీయము - ప్రశస్యము) - అని పేర్కొనబడినది.

**బ్రహ్మాద్యాః లోకపాలాశ్చ, వన్ద్యసక్తి యుతాః స్మృతాః । 20 ।**

**20** బ్రహ్మాదులును, ఇంద్రాదులగు లోకపాలురును, వంద్యసక్తి (ప్రశస్యమగు సంసక్తి) యుతులని భావింపబడినారు. ( ఈ సంసక్తి నాశ్రయించియే వీరు, తమ తమ విహితకార్యముల నొనర్చుచున్నారని భావము).

**సర్వదా సర్వసంస్థేన, సర్వేణ సహ తిష్ఠతా ।**
**సర్వకర్మరతేనాఽపి, మనః కార్యం విజానతా । 21 ।**
**న సక్త మిహ చేష్టాసు, న చిన్తాసు న వస్తుషు ।**

**21-22.** సర్వదా, తత్తత్కాలోచిత సర్వవ్యవహారము లొనర్చుచున్నను, ఇష్ట, మిత్ర, భృత్య, పుత్ర, దారాదు లందఱితో కూడియున్నను, అనిషిద్ధ లౌకికశాస్త్రీయకర్మములన్నిటి యందును తత్పరుడై యున్నను, వివేకవంతుడు, తన మనస్సును, సాధ్యవిషయముల గూర్చిన క్రియలందును, అతీతవిషయముల గూర్చిన చింతలయందును, వర్తమాన కాలికములగు పదార్థములందును, అసంసక్తముగ నుండునట్లు నియమన మొనర్చుకొనవలెను.

**కేవలం చితి విశ్రమ్య, కిఞ్చిత్ చేత్యాఽవలమ్బ్యపి । 22 ।**
**సర్వత్ర నీరసమివ,★ తిష్ఠత్యాత్మరసం మనః ।**

**22-23.** కొంతవఱకు, దృశ్యపదార్థముల నాశ్రయించియున్నను, మనస్సు,

---

★ పోల్చు :- "విషయా వినివర్తన్తే, నిరాహారస్య దేహినః ।
రసవర్జం, రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే । [భ.గీ. II-59]

విషయముల గ్రహింప అశక్తుడగు వానికి, శబ్దాదులగు ఇంద్రియవిషయములు నివర్తించినను, విషయస్పృహ మాత్రము అంతరింపదు. కాని, పరబ్రహ్మాఽనుభవముకల్గిన పిదప, సర్వ విషయ స్పృహయును వదలిపోవును. మఱియు, భాగ. - XI-8-20,21.

కేవలము బుద్ధిసాక్షియగు చిన్మాత్రమున విశ్రమించి, ఆత్మరస (భూమానంద) ప్రవణమై, విషయ పదార్థములను, సర్వత్ర, నీరసము లట్లు భావించుచు నుండవలెను.

**తత్రస్థో విగతాఽఽసఙ్గో, జీవోఽజీవత్వ మాగతః । 23 ।**
**వ్యవహార మిమం సర్వం, న కరోతు కరోతు వా ।**

**23-24.** బ్రహ్మమున స్థితుడై, సంగరహితుడగు జీవుడు, (వ్యష్టి) - **అజీవత్వము (బ్రహ్మత్వము)ను పొందును.** అట్టి పరమస్థితి యందు ప్రాపంచిక వ్యవహారముల నాతడు చేయుగాక! లేక, చేయకుండుగాక!

**అథవా తమపి త్యక్త్వా, చేత్యాఽంశం శాన్తచిద్ఘనః । 24 ।**
**జీవ స్తిష్ఠతు సంశాన్తో, జ్వలన్మణి రివాఽఽత్మని ।**[1]

**24-25.** లేక, ఆ దృశ్యపదార్థదర్శనమును సైతము విసర్జించి, శాంతుడై, చైతన్యఘనరూపుడై దేదీప్యమానమగు **మణి** వలె జీవుడు, స్వాత్మ యందు పరమోపశమమున స్థితుడగు గాక! [జీవుడు (వ్యష్టి) జ్వలించు **మణితో** ఉపమింపబడినాడు. అఖండశుద్ధచైతన్యము (ఆత్మ)యొక్క మహోజ్జ్వలతేజమున నున్న **జ్వలించు మణి** వలె జీవు డగునని భావము]

**ఏషైవ రామ! సౌషుప్తీ, స్థితి రభ్యాస యోగతః । 25 ।**
**ప్రౌఢా సతీ తురీయేతి,**[2] **కథితా తత్త్వకోవిదైః ।**

**25-26.** శ్రీరామా! ఇదియే **సుషుప్తి సంబంధిని యగు పరమ విశ్రాంతి. ఈ స్థితి** అభ్యాసయోగముచే నెపుడు దృఢపడునో, అప్పుడది **తురీయావస్థ** యని తత్త్వజ్ఞులగు మహాత్ములు వచింతురు.

### 3. జీవన్ముక్త సమాచారః — జీవన్ముక్తుల వ్యవహారచర్య.

**యస్తు తస్యా మవస్థాయాం, స్థితిం ప్రాప్యాఽవినాశినీమ్ । 26 ।**
**అనన్దైకాన్తశీలత్వా దవానన్దపదా ద్గతః ।**

(1) పోల్చు :- "మనసి శూన్యమహశ్శశి సన్నిభే ।" – (శ్రీరమణగీత – XVIII-6)
(2) జాగరణాదిక స్థానత్రయము నపేక్షించి, ఈ అవస్థ, తురీయము (నాల్గవది) అని పేర్కొనబడినది.

**అనానన్దమహానన్ద కలాతీత, స్తతోఽపి సః ॥ 27 ॥**
**ముక్త ఇత్యుచ్యతే యోగీ, తుర్యాతీతపదం గతః ।**

**26-27** అవినాశిని యగుస్థితిని తురీయావస్థ యందు పొంది, నిరతిశయానంద మగ్నుడై, దుఃఖరూపమగు (జాగ్రత్స్వప్నసుషుప్తులను) అవస్థాత్రయ మును దాటి, తరువాత, అనానందము (అవస్థాత్రయము) మహానందము (తురీయావస్థ) అను కళలను (ఉపాధివిశేషములను) నతిక్రమించిన **యోగి, తుర్యాఽతీతపదమును పొంది, ముక్తు డనబడుచున్నాడు.**

[తురీయావస్థ యందు, సచ్చిదానందరూపమగు స్వస్వరూపము నొంది, యోగి, జీవన్ముక్తుడగుచున్నాడు. కడపట, తురీయాతీతమను పదమున, ఈ యవస్థ సైతము, అతిక్రాంతమగుచున్నది. ఇది కేవలము అఖండ చైతన్య పదము. దీనిని పొందుటయే **విదేహముక్తి,** లేక, **కైవల్యము.**]

**దృశ్య దర్శన నిర్ముక్తా, యాఽనుభూతి రనామయా ॥ 28 ॥**
**తా మవష్టభ్య తిష్ఠ! త్వం, సౌషుప్తం తాం భజ! స్థితిమ్ ।**

**28-29.** శ్రీరామా! దృశ్యదర్శనవర్జితము, సర్వోపద్రవరహితము (మోక్ష స్వరూపము) నగు ఈ అనుభూతిని ఆశ్రయించి, సుషుప్తి సంబంధిని యగు పరమసుఖస్థితిని అనుభవింపుము.

**న మోక్షో నభసః పృష్ఠే, న పాతాళే న భూతలే ॥ 29 ॥**
**సర్వాఽఽశాసంక్షయే చేతః క్షయో మోక్ష ఇతీష్యతే ।**

**29-30.** మోక్షమనునది (సంసార విముక్తి) ఆకాశము యొక్క ఆవలి వైపున గాని, పాతాళము నందుగాని, భూమి యందు గాని లేదు. **వాంఛితార్థములన్నిటి యందు గల ఆసక్తిని త్యజింపగా కలుగు చిత్తక్షయమే మోక్షమని చెప్పబడుచున్నది.**

**మోక్షో మేఽస్త్వితి చిన్తాఽన్తర్జాతా చే దుత్థితం మనః ॥ 30 ॥**
**మననోత్థే మనస్యేష్వేర్బన్ధః★ సాంసారికో దృఢః ।**

**30-31.** "**నాకు మోక్షము కలుగుగాక!**" - అను చింత, లోన జనింపగా, మనస్సు

★ **పోల్చు :-** "**తదా బన్ధో యదా చిత్తం, కిఞ్చిద్వాఞ్ఛతి శోచతి ।**
**కిఞ్చిన్ముఞ్చతి గృహ్ణాతి కిఞ్చిద్ధృష్యతి కుప్యతి ।** (అష్టావక్రసంహిత - VIII-I)
"నిస్సఙ్గో నిష్క్రియోఽపి త్వం, స్వప్రకాశో నిరఞ్జనః ।
**అయ మేవహి తే బన్ధః, సమాధి మనుతిష్ఠసి ।** (అష్టావక్ర సంహిత –I-15)

ఉత్పన్నమగుచున్నది. మనస్సున అధికముగ మననము ఉదయింపగా, సాంసారికమగు బంధము దృఢమగుచున్నది. (మననమే, శరీరాకారమును బొందుచున్నది)

**ఆత్మన్యతీతే సర్వస్మాత్, సర్వభూతేఽథవాఽఽతతే ॥ 31 ॥**
**కో బన్ధః? కశ్చవా మోక్షః?, నిర్మూలం మననం కురు ।**

**31-32.** ఆత్మ, సర్వాతీతమై, సర్వమునై, లేక, సర్వభూతములందును వ్యాపించియుండగా, ఇక బంధ మేది? మోక్షమేది? కావున నీవు పరిచ్ఛేదరూపమగు మననమును నిర్మూలింపుము. (మనస్సును మనన రహితమొనర్పుము).

**ద్వన్ద్వదోష భయాన్ముక్తః, తీర్ణసంసారసాగరః ॥ 32 ॥**
**ప్రాప్తోఽనుత్తమవిశ్రాన్తిః, లబ్ధాఽలభ్యపరాస్పదః ।**

**32-33.** శ్రీరామా! శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వదోషభయవిముక్తుడవై, సంసారసాగరమును తరించిన వాడవై, సర్వోత్తమమైన విశ్రాంతిని పొందినవాడవై, అలభ్యమైన పరమపదమును పొందిన వాడవు కమ్ము.

**శరీరా ద్వ్యతిరిక్తం జ్ఞం, పశ్యతః ప్రవివేకినః ॥ 33 ॥**
**వికర్తితాఽ ఙ్గకస్యాఽపి,★ న హి కిఞ్చిద్వికర్తితమ్ ।**

---

"ఎపుడు చిత్తము, దేనివేని వాంఛించునో దేనిని గూర్చి గాని శోకించునో, అపుడు బంధము కల్గుచున్నది."

"నీవు నిస్సంగుడవు, నిష్క్రియుడవు, స్వప్రకాశుడవు, నిరంజనుడవు – (దోష శూన్యుడవు). ఇట్టినీవు (మోక్షార్థమై) సమాధి నభ్యసించుటయే, వాస్తవమున నీకు బంధము."

★ **పోల్చు :- 'ఖంతి (క్షాంతి) వాది జాతకము'**

[బుద్ధదర్శనము – పుటలు 184–188–డా॥ రత్నాకరం బాలరాజు (1995)

**"ఖంతీ పరమం తపో తితిక్ఖా, నిబ్బానం పరమం వదంతి బుద్ధా" ।**

క్షాంతి (క్షమ) పరమ తపస్సు. తితిక్ష, పరమ నిర్వాణమని బుద్ధులు (జ్ఞానులు) వచింతురు. (ధమ్మపదం – డా॥ రత్నాకరం బాలరాజు – 1994 – గాథ 184)

**మఱియు :-"తద్దేశ మభ్యేత్య వరేశ్వరోఽథ, దృష్ట్వా వధూభిః పరివారితం తం ।**
**ఈర్ష్యా ప్రకోపాఽనల దుర్నిరీక్ష్యః, చిచ్ఛేద తస్యాఽఽశు స పాణిపాదమ్ ।**
**ఛిన్నాఽఙ్గవర్గోఽపి, స నిర్వికారస్చుకోప భూపాయ న వామధీరః ॥"**
**(క్షేమేంద్రకృత అవదానకల్పలత – 38 క్షాన్త్యవదానమ్)**

రాజు, ఆ ప్రదేశమున కేతెంచి, వధూజన పరివారితుడై యున్న ఆ మునీంద్రుని గాంచి, ఈర్ష్యా ప్రకోపాగ్నిచే దుర్నిరీక్ష్యుడై, వెంటనే, ఆ ముని హస్తపాదములను ఖండించెను. స్వశరీరాంగములు ఛేదింపబడినను, ధీరుడగు ఆ ముని, నిర్వికారుడై, రాజుపై ఆగ్రహింపడయ్యెను. (ఇదియే క్షాంతి; తితిక్షా స్వరూపము)

**33-34.** చైతన్య స్వరూపమగు ఆత్మను, శరీరాదులకంటెను భిన్నముగ కాంచు **వివేకశాలికి,** అతని యొక్క అవయవములు ఛేదింపబడినను, వాస్తవముగ ఛేదింపబడనివే యగుచున్నవి.

**అనుభూతో గుడః స్వాదు రపి దాహవికర్తనైః ॥ 34 ॥**
**న శక్యతేఽన్యథా కర్తుం, తత్త్వాఽఽలోక స్తథాఽఽత్మనః ।**

**34-35.** అనుభవింపబడిన బెల్లము యొక్క మాధుర్యానుభవము అనుభవకారణమగు **జిహ్వాదులను** గానీ, అనుభవించిన **దేవదత్తాదులను** గాని, కాల్చుట, చూర్ణము చేయుట, మొదలగు యత్న శతములచేతనైనను, ఆ మాధుర్యానుభవమును, వేఱువిధముగ - (తిక్తాద్యనుభవముగ) చేయుటకు సాధ్యపడనట్లు, ఆత్మ యొక్క తాత్త్వికానందానుభవము సైతము అట్లే, వేఱు విధముగా నొనర్పబడదు. [బెల్లము యొక్క మాధుర్యానుభవము, అనుభవించిన వానిని కాల్చినను, చూర్ణము చేసినను, దాని స్వాభావికమాధుర్యానుభవము మాఱదు. అట్లే, ఆత్మ దర్శనానందము, ఆత్మకు ఆవాసమగు దేహమున కల్గు వికారములచే ఎట్టి మార్పును పొందదు.]

**పరవ్యసనినీ నారీ, వ్యగ్రాఽపి గృహకర్మణి ॥ 35 ॥**
**తదేవాఽఽస్వాదయ త్యన్తః, పరసఙ్గరసాయనమ్ ।**

**35-36.** పర పురుషానురక్తి గల భామిని (**జారిణి**) గృహకృత్యములందు సదా, నిమగ్నయై యున్నను, ఒక్కసారి మాత్రమే అనుభవించినదైన ఆ పరపురుషసాంగత్యరసా(సుఖా)ఽనుభూతినే (అంతరంగమున) పొందుచున్నది.

**ఏవం తత్త్వే పరే శుద్ధే, ధీరో విశ్రాన్తి మాగతః ॥ 36 ॥**
**తదేవాస్వాదయ త్యన్తః, బహి ర్వ్యవహరన్నపి ।***

**36-37.** అట్లే, శుద్ధపరతత్త్వము (బ్రహ్మము)న విశ్రాంతి నొందిన ధీరుడు,

★ పోల్పు :- "పరపురుషానురక్తిగల భామిని, యెల్లపనుల్ గృహంబునం
బొరిబొరి జేయుచుం, బ్రియుని పొందు సుఖంబుగ జూచురీతి, భా
స్వరపరతత్త్వవేది, నిజవర్ణనిజాశ్రమ యోగ్యధర్మముల్
నిరతము సల్పుచుం, బరమనిర్మల సౌఖ్యము గాంచు నెమ్మదిన్ ।"
(శ్రీ పి.రా.సం. రాజయోగదర్పణము-పుటలు 401-402-1982 డా॥ రత్నాకరం బాలరాజు)
మఱియు - "యోషా జార మివ ప్రియమ్" - (శ్రుతి) (విద్యారణ్యులు - పంచదశి-IX-84,85,87)

బాహ్యమున సర్వవ్యవహారముల నొనర్చుచున్నను, అంతరంగమున ఆ బ్రహ్మానందమునే ఆస్వాదించుచుండును.

నాఽపేక్షతే భవిష్యచ్చ, వర్తమానే న తిష్ఠతి ॥ 37 ॥
న సంస్మరత్యతీతం చ, సర్వమేవ కరోతి చ ।

**37-38.** జీవన్ముక్తుడగు ఆత్మజ్ఞుడు, భవిష్యమును (రాబోవుదానిని) అభిలషింపడు. వర్తమానమున ఆసక్తి (ప్రీతి) నుంచడు. గతమును గూర్చి చింతింపడు. కాని, ఎప్పుడేది తటస్థించిన, అప్పుడద్దానిని చేయుచునే యుండును. **(సర్వము నాచరించుచునే యుండును).**

**భక్తే భక్తసమాచారః, శఠే శఠ ఇవ స్థితః ॥ 38 ॥**
**బాలో బాలేషు, వృద్ధేషు వృద్ధో, ధీరేషు ధైర్యవాన్ ।**
**యువా యౌవన వృత్తేషు, దుఃఖితేషు స దుఃఖధీః ॥ 39 ॥**

**38-39.** అతడు దైవభక్తులలో దైవభక్తుడుగను, ధూర్తులలో ధూర్తుడుగను, బాలురలో బాలుడుగను, వృద్ధులలో వృద్ధుడుగను, ధీరులలో ధైర్యవంతుడుగను, యౌవనవృత్తాంతములందు యువకుడుగను, దుఃఖితులందు దుఃఖమనస్కుడుగను వర్తించుచుండును.

**అపి శీతరుచా వర్కే, సుతప్తేఽపీన్దుమణ్డలే ।**
**అప్యధః ప్రసరత్యగ్నౌ, విస్మయోఽస్య న జాయతే★ ॥ 40 ॥**

---

★ పోల్చు :- "సవిత ర్యపి శీతరుచౌ, చన్ద్రే తీక్ష్ణేఽప్యధో వహ త్యగ్నౌ ।
మాయక మిద మితి జానన్, జీవన్ముక్తో న విస్మయీ భవతి"
(సదాశివబ్రహ్మేంద్రుడు – ఆత్మవిద్యావిలాసము – 18)

ఈ ప్రపంచమంతయు మాయామయ మగుటచే, దీనికి వాస్తవమగు స్వరూపమే లేదను దృఢనిశ్చయశాలి యగుటచే, సూర్యుడు చల్లనైనను, చంద్రుడు వేడియైనను, అగ్ని జలమువలె క్రిందికి ప్రవహించినను, జీవన్ముక్తుడగు మహాత్మునకు, ఆశ్చర్యమేమియు గలుగదు.

మఱియు చూడు :–

"ఏతస్మాత్కిమివేన్ద్రజాల మపరం యద్గర్భవాసే స్థితమ్,
రేత శ్చేతతి హస్తమస్తకపద ప్రోద్భూత నానాఽఙ్కురమ్।
పర్యాయేణ శిశుత్వయౌవన జరావేషై రనేకై ర్వృతం,
పశ్య త్యత్తి శృణోతి జిఘ్రతి తథా గచ్ఛత్యథాఽఽ గచ్ఛతి"
(విద్యారణ్యులు – పంచదశి. VI - 147)

స్త్రీ గర్భగోళమునందు ప్రవిష్టమైన పురుషుని రేతస్సు (వీర్యము), హస్త పాదాది రూపముగ నానావిధోత్పత్తి గలదియై, క్రమముగ పరిణమించి, బాల్య, యౌవన, వార్ధకములను వేషములతో కూడుకొని, చేతనాయుక్తమై, చూచుచున్నది, తినుచున్నది, వినుచున్నది, వాసన చూచుచున్నది, వచ్చుచున్నది, ఆట్లే, పోవుచున్నది. **దీనికంటె వేఱొకటి యైన ఇంద్రజాలము (గారడి) ఏమున్నది? ఈసంసారమే గొప్ప ఇంద్రజాలము.**

40. సూర్యుడు, చల్లనికాంతితో ప్రకాశించినను, చంద్రమండలము అతిశయముగ ఉష్ణత్వము నొందినను, అగ్ని (జ్వాలలు) క్రిందికి ప్రసరించినను, ఆత్మజ్ఞానికి ఆశ్చర్యము కలుగదు.

4. చిత్త స్పన్దనిరోధః – మనశ్చాంచల్య నిగ్రహము

**చిదాత్మన ఇమా ఇత్థం, ప్రసరన్తీహ శక్తయః ।**
**ఇత్యస్యాఽఽశ్చర్య జాలేషు, నాఽభ్యుదేతి కుతూహలమ్ ॥ 41 ॥**

41. శుద్ధచైతన్యరూపమగుఆత్మయొక్కవివిధశక్తులిచట ఇట్లు ప్రసరించుచుండు (స్ఫురించుచుండు)నని భావించు జ్ఞానికి, వీని విస్మయజాలము (మాయ) అందు, కుతూహల ముదయింపదు.

**యథా జలపరిస్పన్దా ద్వ్యతిరిక్త ఇవాఽమ్బునః ।**
**దృశ్యతే వర్తులాఽఽవర్తః, చిత్తస్పన్దాత్తథా జగత్ ॥ 42 ॥**

42. చలనము వలన జలమందలి వర్తులనాభ్యాకారమగు ఆవర్తము (నీటి సుడి), జలమునకు భిన్నముగ తోచుచున్నట్లు, చిత్తస్పందము వలన ఈ జగత్తు చిత్తమునకు భిన్నముగనున్నట్లు గాన్పించుచున్నది.

**శ్రీరామ ఉవాచ :–**

**యేన ప్రస్పన్దతే చిత్తం, యేన న స్పన్దతేఽథవా ।**
**తద్బ్రహ్మన్! బ్రూహి మే యేన, చికిత్స్యేయం తదేవ హి ॥ 43 ॥**

43. **శ్రీరాముడు :–** మహాత్మా! దేనిచే చిత్తము చలించుచున్నది? ఏ యుపాయముచే నది చలింపకుండును? ఏ యుపాయముచే నేను దీనికి (చిత్తచలనమునకు) చికిత్స చేయగలనో, వచింపవేడెదను.

**వసిష్ఠ ఉవాచ :–**

**ద్వౌక్రమౌ చిత్తనాశాయ, యోగో, జ్ఞానం, చ రాఘవ ! ।**
**యోగస్త ద్వృత్తి రోధో హి[1] జ్ఞానం సమ్యగవేక్షణమ్ ॥ 44 ॥**

---

(1) పోల్చు :- యోగ శ్చిత్త వృత్తి నిరోధః । తదా ద్రష్టుః స్వరూపేఽవస్థానమ్ ।
(పాతంజలయోగదర్శనము I-1,2)

రజోగుణతమోగుణవృత్తుల నిరోధించుట యోగము. అప్పుడు ఆత్మకు స్వస్వరూపమున నిలుకడ సిద్ధించును.

మఱియు I-34; II-49 సూత్రముల పై వ్యాస భాష్యము

44. వసిష్ఠుడు:- శ్రీరామా! చిత్తనాశనమునకై, యోగమనియు, జ్ఞానమనియు, రెండు క్రమములు (ఉపాయములు)న్నవి. యోగ మనగా ధ్యానముచే చిత్తవృత్తుల నిరోధించుట. జ్ఞానమనగా సమ్యగ్దర్శనము.

**ప్రాణాధీన పరిస్పన్దం,(1) చిత్తమాహుర్మనీషిణః ।**
**తస్మిన్ సంరోధితే నూన ముపశాన్తం భవేన్మనః । 45 ।**

45. చిత్తము యొక్క పరిస్పందము (చలనము), ప్రాణాఽపాన వాయువుల అధీనమున నున్నది. ప్రాణాఽపానవాయునిరోధము వలన, మనస్సు తప్పక ఉపశమించుచున్నది.

**మనః స్పన్దోపశాన్త్యాఽయం, సంసారః ప్రవిలీయతే ।**
**సూర్యాఽఽలోక పరిస్పన్ద శాన్తౌ, వ్యవహృతి ర్యథా । 46 ।**

46. మనఃస్పందనము (చలనము) ఉపశమింపగా, సూర్యప్రకాశము ఉపశమించినంతనే ప్రాపంచికవ్యవహారములట్లు, సంసారము (జగత్తు) విలయమందుచున్నది.

**శ్రీరామ ఉవాచ :-**

**ప్రాణాదీనాం పరిస్పన్దో, వాయూనాం రోధ్యతే కథమ్ ।**

47. శ్రీరాముడు:-ప్రాణాది వాయువుల చలన మెట్లు నిరోధింపబడుచున్నది?

---

(1) పోల్చు :- **"చలే వాతే చలం చిత్తం, నిశ్చలే నిశ్చలం భవేత్ ।**
**యోగీ స్థాణుత్వ మాప్నోతి, తతో వాయుం నిరోధయేత్ ।**
(స్వాత్మారామయోగి – హఠయోగప్రదీపిక -II-2)

వాయువు చలింపగా, చిత్తము చలించుచున్నది. వాయువు నిశ్చలము కాగా, చిత్తమును నిశ్చలమగుచున్నది. వాయువు, చిత్తము రెండును నిశ్చలము కాగా, యోగి, స్థాణుత్వమును – స్థిర దీర్ఘ జీవిత్వము, పరమేశ్వరత్వమును పొందుచున్నాడు.
(మఱియు. శ్వే. ఉ. II–9–శంకరభాష్యము.)

చూడు :- శ్రీ సీతారామాంజనేయ సంవాద రాజయోగదర్శనము. XIII ప్రకరణము – పుటలు 244–296 డా॥ రత్నాకరం బాలరాజు (1982)

"నియమ్యాఽనిలం న్యస్తనాసాగ్రదృష్టిః - బుద్ధభగవానుడు పైతమీ యోగ ప్రక్రియ నాశ్రయించుట, గమనార్హము. **(దశావతారస్తోత్రము – శంకరుడు)**

వసిష్ఠ ఉవాచ :—

శాస్త్ర సజ్జన సంపర్క్యవైరాగ్యాఽభ్యాస యోగతః । 47 ।
ఏకతత్త్వ ఘనాఽభ్యాసాత్,* ప్రాణ స్పన్దో నిరుధ్యతే ।

47-48. వసిష్ఠుడు:— వేదాంతశాస్త్రాధ్యయన, అనుష్ఠాన, సజ్జనసాంగత్యముల చేతను, వైరాగ్యాఽభ్యాస యోగములచేతను, ఏకతత్త్వము (బ్రహ్మము) యొక్క దృఢాభ్యాసము చేతను, ప్రాణవాయుచలనము నిరోధింప బడుచున్నది.

---

★ పోల్చు :- అసంశయం మహాబాహో!, మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌన్తేయ!, వైరాగ్యేణ చ గృహ్యతే । (భ.గీ.-VI-35)

మహావీరుడవగు అర్జునా! మనసు, దుర్నిరోధము, చంచలము , ననుటలో సందేహము లేదు. ధ్యానాభ్యాసము చేతను, దృష్టాఽదృష్టవిషయవైరాగ్యము చేతను మనశ్చలనమును నిరోధింపవచ్చును.

మఱియు :— "అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః । (పా.యో.ద. I-12)

విషయప్రవృత్తుల యందు వైరాగ్యము చేతను, ధ్యానయోగాభ్యాసము చేతను, చిత్తవృత్తుల ప్రవాహము ఉపశమించుచున్నది.

"ఫందనం చపలం చిత్తం, దురక్ఖం, దున్నివారయం ।
ఉజుం కరోతి మేధావీ, ఉసుకారోవ తేజనం ।" [ధమ్మపదం – 33]

శరకారుడు, శరమునకు నిశితత్వమును(వాడిని)– సమకూర్చునట్లు, బుద్ధిశాలియగు మనుజుడు, చంచలము, చపలమును రక్షించుటకు కాని, నిగ్రహించుటకు కాని, దుఃసాధమునైన చిత్తమును, ఋజువుగ నొనర్చును. [చూడు :— ధమ్మపదం – డా॥ రత్నాకరం బాలరాజు. (1994) అధ్యాత్మవిద్యాగ్రంథరత్నమాల, సాకేత నిలయం –21, S.B.I. Colony, అనంతపురం (ఆం.ప్ర.) 515 001]

మఱియు :- "జపేన వాఽథమన్త్రాణాం, మనసో నిగ్రహో భవేత్ ।
మానసేన తదా మన్త్రప్రాణయో రేకతాం వ్రజేత్ ।
మన్త్రాక్షరాణాం ప్రాణేన, సాయుజ్యం ధ్యాన ముచ్యతే ।
సహజస్థితయే ధ్యానం, దృఢ భూమి ప్రకల్పతే ।
సహవాసేన మహతాం, సతా మారూఢ చేతసాం ।
క్రియమాణేన వా నిత్యం, స్థానే లీనం మనో భవేత్ ।"

"ప్రణవ మంత్ర జపము, భగవన్నామజపము, మంత్రజపములచే మనో నిగ్రహము సిద్ధించును. అప్పుడు(మనోనిగ్రహము కలుగగా), మంత్రప్రాణములు రెండును, నిగ్రహింపబడిన మనస్సుతో నైక్యమందుచున్నవి. ప్రాణముతో మంత్రవర్ణములు ఐక్యమగుటయే ధ్యానము. దృఢధ్యానమే సహజమగు ఆత్మనిష్ఠను కలుగజేయగలదు. మనోజయము సాధించిన సత్పురుషులతో సహవాసము నిత్యమొనర్చుచున్నచో, మనస్సునకు ఆత్యంతిక శ్రేయోలాభము – ఆత్మస్వరూపమున, ఐక్యము సిద్ధించుచున్నది." – అరుణాచల రమణ మహర్షి. (రమణగీత – VI–10,11,12)

అవాసనా న్మనోధ్యానా దసంస్పృష్ట వికల్పతః ॥ 48 ॥
పూరకాద్యనిలాఽఽయామా దోఙ్కా రోచ్చారణేన వా ।
గురూక్తాఽన్యక్రమాద్వాఽపి, ప్రాణస్పన్దో నిరుధ్యతే ॥ 49 ॥

**48-49.** వాసనారాహిత్యము చేతను, చిత్తధ్యానము చేతను, వికల్పములం (సంశయములం) సంస్పర్శలేమి చేతను, రేచక పూరక కుంభక రూపమగు ప్రాణాయామము చేతను, ఓంకార జపము చేతను, లేక, గురూక్తములైన అన్యక్రమములం చేతను, ప్రాణచలనము నిరోధింపబడు చున్నది.

అభ్యాసేన పరిస్పన్దే ప్రాణానాం క్షయమాగతే ।
మనః ప్రశమ మాయాతి, నిర్వాణ మవశిష్యతే ॥ 50 ॥

**50.** పూర్వోక్తోపాయములలో నేదానినైన నభ్యసించుటచే, ప్రాణ వాయువుల చలనము నశింపగా, మనస్సు ఉపశమము (శాంతి) నొందుచున్నది. మఱియు నిర్వాణము మాత్రమే (బ్రహ్మము, లేక, మోక్షపదము మాత్రమే) శేషించు (మిగులు) చున్నది.

శ్రీరామ ఉవాచ :-

ఏవం చిత్తశమః ప్రోక్తః, సమ్యగ్ జ్ఞానం కథం? ప్రభో ! ।

**51.** శ్రీరాముడు :- "స్వామీ! చిత్తోపశమనార్థము ఉపాయమిట్లు మీచే ప్రోక్తమైనది. సమ్యగ్ జ్ఞానమెట్లు సిద్ధించునో తెలుపవలెను.

వసిష్ఠ ఉవాచ :-

యథా భూతార్థదర్శిత్వం, సమ్యగ్ జ్ఞానం భవేద్యతః ॥ 51 ॥
ఇమా ఘటపటాకార పదార్థశతపఙ్క్తయః ।
ఆత్మైవ నాఽన్యదస్తీతి, నిశ్చయః సమ్యగీక్షణమ్ ॥ 52 ॥

**51-52.** వసిష్ఠుడు :- పదార్థములం యథాభూతార్థదర్శిత్వమే, సమ్యగ్జ్ఞానము. ఘట పటాద్యాకారములం దోచుచున్న పదార్థశతపంక్తులు (అనేక పదార్థ సముదాయములు) అన్నియు ఆత్మయే గాని, అన్యము గాదను నిశ్చయమే సమ్యగ్ జ్ఞానము.

న చైత్య మన్యన్నో చిత్తం, బ్రహ్మైవేదం విజృమ్భతే ।
సర్వ మేకం పరంబ్రహ్మ, కో మోక్షః? కస్య బన్ధతా? ★ ॥ 53 ॥

53. ఆత్మకు భిన్నముగ దృశ్య పదార్థము గాని, చిత్తము గాని లేవు. బ్రహ్మమే దృశ్యరూపమగు జగత్తుగా, విజృంభించుచున్నది. ఈ జగత్తంతయు పరబ్రహ్మమై యుండగా, నిక మోక్షమెట్టిది? బంధమెవరికి?

సమ్యగాలోకితే రూపే, కాష్ఠ పాషాణ వాససామ్ ।
మనాగపి న భేదోఽస్తి, క్వాఽసి సఙ్కల్పనోన్ముఖః ॥ 54 ॥

54. శ్రీరామా! కాష్ఠము (కట్టె) శిల, వస్త్రము - వీని రూపమును (తత్త్వమును), అధిష్ఠాన సన్మాత్ర దృష్టిచే లెస్సగా విచారించి చూచిన, వాని యందు లేశమైనను భేదము కాన్పింపదు. కావున, నీ విక దేనికై ఎక్కడ సంకల్పోన్ముఖుడవగుచున్నావు? (ఇంక, నీవు దేనిని గూర్చి సంకల్పింతువు?)

ఆదావన్తే చ సంశాన్తం, స్వరూప మవినాశి యత్ ।
వస్తు నామాఽఽత్మనస్త్వేవం, తన్మయో భవ రాఘవ !॥ 55 ॥

55. శ్రీరామా! ఆద్యంతములందు ప్రశాంతము, నాశరహితమునై, స్వరూపమే, 'వస్తు'వని ప్రసిద్ధి గాంచినది. అదియే ఆత్మస్వరూపము. నీవు ఆత్మమయుడవు కమ్ము.

ఇతి శ్రీయోగవాసిష్ఠ సంగ్రహే 'మనోనాశ ప్రకారోనామ' సప్తదశః సర్గః ।

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'మనోనాశ ప్రకారమ'ను సప్తదశ -(పదునేడవ)సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



★ పోల్చు :- "న నిరోధో న చోత్పత్తి ర్న బద్ధో న చ సాధకః ।
న ముముక్షు ర్నవైముక్త, ఇత్యేషా పరమార్థతా ।

ద్వైతము అసత్యమనియు, ఆత్మ యొక్కడే పరమార్థమనియు, నిర్ణీతమైనపుడు, లౌకిక వైదికములగు సమస్త వ్యవహారములును అవిద్యా విషయమేయని విశదమగును. అపుడు విరోధమేదియు నుండదు. (మాండూక్యకారికలు-II-32)

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## అష్టాదశసర్గము

## వీతహవ్యోపాఖ్యానమ్ – వీతహవ్యుని కథ

### 1. ప్రాణ స్పన్ద విరోధః – ప్రాణవాయువుల చలన నిగ్రహము.

**వసిష్ఠ ఉవాచ :–**
**అథేమా మపరాం రామ!, శృణు దృష్టిం పదప్రదామ్ ।**
**వీతహవ్యో మునిః కశ్చి దుద్విగ్నో హి క్రియాక్రమాత్ । 1 ।**
**నిర్వికల్పసమాధ్యర్థం, సన్త్యజ్య సకలాః క్రియాః ।**
**ఉపవిశ్యాఽఽసనే శుద్ధే, సంజహార మనః శనైః । 2 ।**

**1-2.** వసిష్ఠుడు :– శ్రీరామా! మఱియొక విధమగు ఇంద్రియ మనః ప్రబోధన రూపము, బ్రహ్మపదప్రదమునైన ఈ ఉత్తమదృష్టిని గూర్చి నీవిపుడు వినుము. వీతహవ్యుడను నొకముని, కర్మకాండాచరణము వలన విరక్తచిత్తుడై, నిర్వికల్పసమాధిని సాధించు కొఱకు సకల క్రియలను

పరిత్యజించి, శుద్ధమగు ప్రదేశమున సుఖాసనమున కూర్చుండి, మెల్ల మెల్లగా తన మనస్సును విషయముల నుండి మరలించి, నిగ్రహించినాడు.

**బాహ్యా నాభ్యన్తరాం శ్చైవ, స్పర్శాన్ పరిజహత్ క్రమాత్ ।**
**తతః స్వమనసః స్థైర్యం, కాఙ్క్షమాణో వ్యచిన్తయత్ ॥ 3 ॥**

3. క్రమముగా బాహ్యములు, (ఇంద్రియకములు) ఆభ్యంతరములు (మానసములు) నైన విషయ సమూహములను త్యజించి, తరువాత, తన మనస్సు యొక్క స్థైర్యమును ఆకాంక్షించుచు నిట్లు విచారించినాడు.

**(ఇంద్రియానుశాసనము)**

**"అహో! ను చఞ్చలం చిత్తం, ప్రత్యాహృత మపి క్షణాత్ ।**
**ఘటాత్పట ముపాయాతి, పటాత్ శకట ముత్కటమ్ ॥ 4 ॥**

4. "ఆహా! చిత్తమెంత చపలమై నది. సర్వ పదార్థముల నుండి మరలింపబడిన దయ్యును, క్షణముననే మరల ఘటము నుండి పటము (వస్త్రము) నకును, పటము నుండి శకటమునకును, అతివేగముగ పరుగిడు చున్నది.

**చిత్త మర్థేష్వహో! యాతి, పాదపేష్వివ మర్కటః ।**
**అహం చేతన మిత్యేవ చిత్త! త్వం మన్యసే వృథా ॥ 5 ॥**

5. ఔరా! వృక్షములందు వానరము వలె, చిత్తము పదార్థములందు చరించుచున్నది. ఓ చిత్తమా! 'నేను కేవలము చేతనము'నని నీవు తలచుట వ్యర్థము.

**అత్యన్తభిన్నయో రైక్యం, నాఽస్తి చిన్మనసోః శఠ ! ।**
**అహఙ్కారా దహం జీవ, ఇత్యపి త్యజ భావనామ్ ॥ 6 ॥**

6. ధూర్తుడా! అత్యంతభిన్నములును, జడచేతనములునైన చిత్త చైతన్యములకు ఐక్యమెప్పుడును సంభవింపదు. అహంకారము వలన కలిగిన నేను జీవుడ నను భావమును సైతము త్యజింపుము.

**ఏతావదేవ తే రూపం, యావన్నాఽస్తి విచారణమ్ ।**
**విచారేణోపశాన్తం త్వ మాలోకేన తమో యథా ॥ 7 ॥**

7. నీ స్వభావమును గూర్చిన విచారణ లేనంత వఱకే, నీకు రూపముండును. వెలుగుచే చీకటి వలె, విచారణచే నీవు నశింతువు.

స్వాత్మన్యేవాఽవతిష్ఠేఽహం, తుర్యరూపపదే స్థితః ।
హన్తేన్ద్రియగణా! యూయం కిం నిరర్థక మాకులాః ?" । 8 ।

8. తుర్యావస్థా రూప మను పదమున స్థితుడనై, నా యాత్మయందే నేను ప్రతిష్ఠితుడనై యుందును. అయ్యో! ఇంద్రియగణములారా! నిరర్థకముగ మీరేం వ్యాకుల పడెదరు?"

ఇతి చిత్తం సమాధాయ, తస్థౌ వస్త్వద్వితేన్ద్రియః ।
అన్తరేవ శశామాఽస్య, క్రమేణ ప్రాణసన్తతిః* । 9 ।

9. ఇట్లు చిత్తమును సద్వస్తువునందు ఏకాగ్ర మొనరించి, ఇంద్రియచలన రహితుడై అత డుండెను. క్రమముగా అతని ప్రాణ వాయువులు లోననే, ఉపశమించినవి (క్షయించినవి).

తథైవ తిష్ఠత స్తస్య, సంవత్సర శతత్రయమ్ ।
కాయో హి వీతహవ్యస్య, పఙ్కేనోర్వీతలే కృతః । 10 ।

---

* జ్ఞాని యొక్క ప్రాణాదులు (పదునాఱు కళలును) బ్రహ్మము నందే లయించుచున్నవి.
పోల్చు :- "స యథేమా నద్యః స్యన్దమానాః సముద్రాఽయణాః
సముద్రం ప్రాప్యాఽస్తంగచ్ఛన్తి భిద్యేతే తాసాం నామరూపే,
సముద్ర ఇత్యేవం ప్రోచ్యతే, ఏవ మేవాఽస్య పరిద్రష్టు
రిమాః షోడశకలాః పురుషాఽయణాః పురుషం ప్రాప్యాఽస్తం
గచ్ఛన్తి భిద్యేతే తాసాం నామరూపే, పురుష ఇత్యేవం
ప్రోచ్యతే, స ఏషోఽకలోఽమృతో భవతి । (ప్రశ్నోపనిషత్తు - VI-5)

న తస్య ప్రాణా ఉత్క్రామన్తి, బ్రహ్మైవ సన్
బ్రహ్మాఽప్యేతి । (బృ.ఉ.IV-46)
బ్రహ్మవిదుని ప్రాణములు ఉత్క్రాంతిని బొందవు. అతడు బ్రహ్మమే యగుచు, బ్రహ్మమును బొందుచున్నాడు.

".... అత్రైవ సమవలీయన్తే (బృ.ఉ. III-2-11)
బ్రహ్మవిదుని యందే సముద్రమున నూర్మిల వలె ప్రాణములు లయించుచున్నవి.
మఱియు - "తాని పరే తథా హ్యాహ ।
అవిభాగో వచనాత్ । (బ్ర.సూ. IV-2-15.16)
బ్రహ్మవిదుని ఇంద్రియములును, భూతములును, బ్రహ్మ మందే లయించుచున్నవని శ్రుతి చెప్పుచున్నది. బ్రహ్మవిదుని కళలకును – (సూక్ష్మశరీరమునకును) – బ్రహ్మమునకును భేదము లేదు. 'కృత్స్నం కలాజాతం బ్రహ్మవిదో బ్రహ్మైవ సంపద్యతే । (శంకరుడు.)
చూడు :- సర్గ–18–శ్లో.41.

10. ఇట్లు మున్నూఱేండ్లు సమాధిస్థితుడై యున్న వీతహవ్యుని దేహము, వర్షాకాలము నాటి బురదచే, భూమి క్రింద కూరుకొనిపోయినది. (భూమిలో పూడిపోయినది).

**వర్షత్రయశతే యాతే, సోఽబుధ్యత స్వయం మునిః ।**
**సంవిదేవాఽస్య తం దేహం, జగ్రాహోర్వీనిపీడితమ్ ॥ 11 ॥**

11. మున్నూఱేండ్లు గడచిన తరువాత, ఆ ముని స్వయముగ మేల్కొన్నాడు. భూబిలమున పీడితమై యుండిన అతని దేహమును చెడిపోకుండ, చైతన్యమే రక్షించినది.

**నాఽభూత్ ప్రాణపరిస్పన్దః, సర్వచ్ఛిద్రాఽవరోధతః ।**
**ఉత్పత్తి ప్రౌఢి మాసాద్య, హృద్యేవాఽనుబభూవ సః ॥ 12 ॥**

12. సర్వ రంధ్రములు (నాసాది నవరంధ్రములు) నిరోధింపబడి యుండుట వలన, ప్రాణవాయుచలనము లేకుండెను. శేషించిన ప్రారబ్ధము నను భవించుటకై, ఆతని జీవచైతన్యము హృదయమున ఉన్మేషక్రమమున ప్రౌఢిని (స్థూలత్వము) పొంది, స్వమనోరూపమును ధరించి (ఈ చెప్పబోవు) సర్వవిషయములను హృదయముననే అనుభవించెను.

**కైలాసాద్రౌ ముని ర్భూత్వా, సంవత్సరశతం తతః ।**
**విద్యాధరత్వమిన్ద్రత్వం, శమ్భోశ్చ గణతాం తతః ॥ 13 ॥**
**ప్రతిభాసవశాదేవాఽనుభూయ, స్వయ మిచ్ఛయా ।**
**ప్రాగ్జన్మను భవాన్ దేహన్, దృష్ట్వా చింతావశః పునః ॥ 14 ॥**
**పఙ్కమగ్న మిమం దేహ, ముద్ధర్తుం రవి మావిశత్ ।**

13-15. కైలాసపర్వతమున మున్నూఱేండ్లు మునియై యుండి, తరువాత విద్యాధరత్వమును, ఇంద్రత్వమును, శివగణత్వమును, స్వయముగ కాంక్షించి, ప్రతిభాసవశమున ననుభవించి, పూర్వజన్మము లందలి దేహములను గాంచి చింతావశుడై, మరల బురదలో పూడిపోయి యున్న ఈ దేహము నుద్ధరించుటకు, సూర్యమండలమున ప్రవేశించెను.

భానునాఽథాఽభ్యనుజ్ఞాతం, వీతహవ్యాఽభిదం మనః ॥ 15 ॥
ప్రవిశ్య పిఙ్గళాఽఽకారం, గత్వా విన్ధ్యస్య కన్దరమ్ ।
ఉద్ధృత్య చ ధరాకోశాత్ స్వం దేహం ప్రవివేశ సః ॥ 16 ॥

15-16. అనంతరము వీతహవ్యనామకమగు మనస్సు, సూర్యునిచే నాజ్ఞాపింప బడినదై, పింగళాకారమగు రూపమున ప్రవేశించి, వింధ్యపర్వత గుహ కేగి భూబిలము నుండి తనదేహమును ఉద్ధరించి, అందు ప్రవేశించెను.

తతః స్నాత్వా జపం కృత్వా, సంపూజ్య చ దివాకరమ్ ।
వీతహవ్యో యథా పూర్వం, ప్రజ్ఞయా భూషితో బభౌ ॥ 17 ॥

17 అనంతరము, స్నానము చేసి, జపమొనర్చి, సూర్యుని పూజించి, వీతహవ్యుడు, పూర్వము వలెనే ప్రజ్ఞాభూషితుడై ప్రకాశించినాడు.

## 2. చిత్త సమాధానమ్ – చిత్త సమాధి

దినాఽన్తే స సమాధాతుం, పునరేవ మనో దధే ।
"ఇదానీం చిన్తయా నాఽర్థః, తత స్తిష్ఠామి శైలవత్ ॥ 18 ॥
కలనా మస్తి నాఽస్తీతి భఙ్క్త్వాఽతి స్వచ్ఛతాం గతః ।"

18-19. సాయంసమయమున మరల ఆ ముని సమాధి నాచరించుటకు మనోధారణ యొనర్చెను. "ఇపుడు దీర్ఘచింత వలని ప్రయోజనము లేదు. 'కలదు', 'లేద'ను కల్పనలను త్రుంచివైచి, నిర్మలత్వమొంది పర్వతము వలె అచంచలుడనై యుందును."

ఇతి సఞ్చిన్త్య స ధ్యానే, పున స్తస్థౌ దినాని షట్ ॥ 19 ॥
తతః ప్రబోధ మాపన్నః, క్షణసుప్త ఇవాఽధ్వగః ।
తతః సిద్ధః చిరం కాలం, జీవన్ముక్తతయా స్థితః ॥ 20 ॥

19-20. ఇట్లు విచారించి, ఆ ముని, ధ్యాన సమాధి యందు ఆఱు దినములుండెను. తరువాత క్షణకాలము నిద్రించి లేచిన బాటసారి వలె, నాతడు సమాధి నుండి మేల్కాంచెను. అనంతరము, సిద్ధుడై, జీవన్ముక్తరూపమున చిరకాలము చరించెను.

విదేహకేవలీభావే, వాఞ్ఛాం ప్రాప్య తతః క్రమాత్ ।
బద్ధపద్మాసనః స్థిత్వా, తత్రోవాచాఽఽత్మనాఽఽత్మని ॥ 21 ॥

21. పిమ్మట క్రమముగా విదేహకేవలీభావమును వాంఛించి, అచట బద్ధ పద్మాసనస్థుడై, తనలో తానిట్లు ప్రసంగించుకొన్నాడు.

(ఇంద్రియవర్గనిరాకరణము)

"రాగ! నీరాగతాం గచ్ఛ, ద్వేష! నిర్ద్వేషతాం వ్రజ !
భవద్భ్యాం సుచిరం కాల మిహ ప్రక్రీడితం మయా ॥ 22 ॥

22. ఓ రాగమా! విరాగత్వ మొందుము. ద్వేషమా! నిర్ద్వేషత్వమును (మైత్రిని) పొందుము. ఇచట మీ రిరువురతో చిరకాలము నేను క్రీడించితిని.

భోగా! నమోఽస్తు యుష్మభ్యం, జన్మకోటి శతాన్యహమ్ ।
భవద్భి ర్లాలితో లోకే, లాలకై రివ బాలకః ॥ 23 ॥

23. ఓ భోగము లారా! మీకు నమస్కారము. కోట్లశతములగు జన్మములలో, లాలించు దాదులచే బాలకుని వలె, ఈ లోకమున మీచే లాలింపబడితిని కదా!

ఇమా మపి పరాం పుణ్యాం, నిర్వాణపదవీ మహమ్ ।
యేన విస్మారిత స్తస్మై, సుఖాయాఽస్తు నమో నమః ॥ 24 ॥

24. ఓ విషయసుఖమా! పరమపుణ్యరూపమగు నిర్వాణపదవిని నేను విస్మరించు నట్లొనర్చితివి. నీకు మరల మరల నమస్కారములు.

త్వదుత్తప్తేన హే దుఃఖ ! మయాఽఽత్మాఽన్విష్ట మాదరాత్ ।
తస్మాత్త్వదుప దిష్టోఽయం, మమ మార్గో నమోఽస్తుతే ॥ 25 ॥

25. ఓ దుఃఖమా! నీచే సంతప్తుడనై, నేను ఆదరముతో ఆత్మను అన్వేషించితిని. ఈ ఆత్మమార్గమును నీవే నాకు ఉపదేశించితివి. కావున, నీకును నమస్కారము.

మిత్ర! కాయ! మయాఽద్య త్వాం, త్యజ్యాసే చిరబాన్ధవః ।
అధిగమ్యాఽఽత్మ విజ్ఞానం, స్వస్య నాశః కృత స్త్వయా ॥ 26 ॥

26. ఓ మిత్రమా! దేహమా! చిరకాలబంధువగు నిన్ను ఇప్పుడు నేను త్యజించుచున్నాను. ఆత్మవిజ్ఞానమును పొంది, నిన్ను నీవే నశింపజేసికొన్నావు.

**ఏకాకిన్యా విశుష్యన్త్యా, ప్రశాన్తే మయి దీనయా।**
**త్వయా దుఃఖం న కర్తవ్యం, మాతః! తృష్ణే! నమోఽస్తుతే। 27 ।**

27. తల్లీ! తృష్ణ (ఆశా!) నేను ప్రశాంతి నొందగా, నీ వొంటరి దానవై శుష్కించుచు, దీనురాలవై దుఃఖించుట తగదు. నీకు నమస్కారము.

**క్షన్తవ్యాః కామ! భగవన్! విపరీతాఽపరాధజాః।**
**దోషా ఉపశమైకాన్తం, వ్రజామ్యాదిశ! మఙ్గళమ్ । 28 ।**

28. ఓ కామదేవా! (మన్మథుడా!) నీ వినాశమునకై నేను, వైరాగ్యాదుల నవలంబించితిని. ఆ విపరీతములైన అపరాధ జన్యములగు దోషములను క్షమింపుము. నేనిపుడు పరమ శాంతి (అత్యంతి కోపశమ) పదమును పొందబోవుచున్నాను. మంగళము నాదేశింపుము (నన్నాశీర్వదింపుము).

**నమః సుకృతదేవాయ, భవతేఽస్తు త్వయా పురా।**
**నరకేభ్యః సముత్తార్య, స్వర్గేఽహ మభియోజితః । 29 ।**

29. ఓ దేవా! పుణ్యమా! నీకు నమస్కారము. పూర్వము నీవు నన్ను నరకముల నుండి సముద్ధరించి, స్వర్గమునకు పంపి యుంటివి.

**భవన్తః సహజాః ప్రాణాః!, ప్రాక్తనాః సుహృదో మయా।**
**క్రమేణాఽద్యోత్సృతా నూనం, స్వస్తి వోఽస్తు వ్రజామ్యహమ్" । 30 ।**

30. ఓ ప్రాణము లారా! మీరు నా పూర్వకాలపు సహజమిత్రులు. నేడు క్రమముగా మిమ్మును విసర్జించితిని. మీకు స్వస్తియగు గాక! నేనిదిగో పోవుచున్నాను."

## 3. కేవలీభావః – కైవల్యము

**ఏవం కలితవా న్వక్తుః, ప్రశాన్తమననైషణః।**
**శనై రుచ్చారయం స్తారం, ప్రణవం ప్రాప్తభూమికః । 31 ।**

జహావిన్ద్రియతన్మాత్రం, తమో మాత్రం జహౌ తతః ।
ఉత్తిష్ఠత్ప్రస్ఫురద్రూపం, క్షణం తేజో విచార్య సః ॥ 32 ॥
త్యక్త్వా తం చ బభూవాఽథ, న తమో న ప్రకాశనమ్ ।

**31-33.** శ్రీరామా! ఇట్లు అతడు తనలో విచారించి, మననరహితుడును, సర్వేచ్ఛారహితుడునై, మెలమెల్లగా, **ఓంకారము** (ప్రణవము) నుచ్చరించుచు, నొక్కొక్కటి చొప్పున **జ్ఞానభూమికలను** నధిరోహించి, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములగు సూక్ష్మతన్మాత్రలను త్యజించి, తరువాత, స్ఫురించిన కేవల తమస్సును వర్జించెను. అంతట, ప్రస్ఫురద్రూపమున నావిర్భవించిన ప్రకాశమును క్షణకాలము విచారించి (ధ్యానించి), దానిని సైతము త్యజించి వైచి, **తేజస్తిమిరములకు అతీతమై, తేజము గాని, తమస్సు గాని లేని పదమును** ఆ మునీంద్రుడు పొందినాడు. **[తమోగుణ రూపమైన చీకటిని, సత్త్వగుణరూపమైన వెలుతురును, (ప్రకాశమును) గూడ వదలి, త్రిగుణాతీత పదమును పొందినాడు]**

తా మవస్థా మథాఽఽసాద్య, నిమేషాఽర్ధా న్మనోఽపతత్ ॥ 33 ॥
తతోఽఙ్గ!★ సంవిదం స్వస్థాం, ప్రతిభాస ముపాగతమ్ ।
నిమేషాఽర్ధాఽర్ధ భాగేన, కాలేన కలనాం జహౌ ॥ 34 ॥

**33-34.** శ్రీరామా! తమఃప్రకాశరహితమగు ఆస్థితిని పొందగా, నిమేషార్ధకాలముననే, అతని మనసు పడిపోయినది. (ఉచ్ఛిన్నమైనది). పిమ్మట ప్రతిభాసమైన (నివాతదీపమువలె స్ఫుట ప్రకాశ రూపమొందిన) స్వస్థమగు **సంవిత్తును,** ఆలంబన మొనర్చుకొని, నిమేషచతుర్థభాగమగు కాలముననే ఆ **కల్పనను,** ఆ ముని త్యజించి వైచెను.

[ఇది యోగ సమాధి యందు జీవ (వ్యష్టి) భావ విలయమును, అఖండ శుద్ధచైతన్యప్రాప్తిని నిర్దేశించును. ఇదియే **'పశ్యన్తీ' స్థితి.**]

**పశ్యన్తీ పద మాసాద్య, సత్తామాత్రాత్మకం తతః ।**
**సుషుప్తపద మాలమ్బ్య, తస్థౌ గిరి రివాఽచలః ॥ 35 ॥**

**35.** తరువాత, సాక్షిమాత్రమున శేషించిన **'పశ్యన్తీ'** పదము నతడు పొందినాడు. ఇదియే, సర్వకారణమగు కేవలము **సత్తామాత్రమునగు బ్రహ్మరూప**

★ అఙ్గేతి సంబోధనే । యో.వా.తా.ప్ర.

స్థితి. ఈ బాహ్యస్థితి లక్షణముగు సుషుప్త పదమును (ప్రగాఢవిశ్రాంతి) నవలంబించి, పర్వతము వలె ఆ ముని, నిశ్చేష్టుడై అప్రకంపనుడై యుండెను. (ఇవి సదేహావస్థలగు షష్ఠ సప్తమ జ్ఞాన భూమికలు)

సుషుప్తే స్థైర్య మాసాద్య, తుర్యరూప ముపాయయౌ ।
నిరానన్దోఽపి సాఽఽనన్దః, సచ్చాఽ సచ్చాఽపి తత్ర సః ॥ 36 ॥
చిన్మయోఽచిన్మయశ్చాఽపి, 'నేతి' 'నేతి' యదుచ్యతే ।

36-37. సుషుప్తపదమున స్థిరత్వమును వడసి, తరువాత తురీయపదమును పొందెను. (జాగరణాదిపదత్రయము నపేక్షించి దీనికి తురీయ – (చతుర్థ) పదమని పేరు గల్గినది). ఈ పదమున, ఆ ముని, విషయానంద శూన్యుడయ్యెను, స్వరూపానందసహితుడు. స్వాతిరిక్తసత్తా శూన్యుడయ్యెను. సద్రూపుడే. (ఆత్మసత్తాసహితుడు). ప్రకాశ్యవిషయ శూన్యమగుటచే, అచిన్మయమైనను, స్వయముగ చిన్మయమును, 'నేతి' (ఇది కాదు) 'నేతి' (ఇది కాదు) అని శ్రుతులు వర్ణించు వాగగోచరమగు పరమావస్థను ఆ ముని పొందినాడు.

['నేతి' 'నేతి' అనునదియే బ్రహ్మమునకు సరియైన నిర్దేశము. దాని పవిత్ర నామధేయము 'సత్యస్యసత్యమ్'(1) – చరమ సత్యము. ఈ విరోధాభాస రూపమగు వర్ణనము, తురీయపదము అనుభవాతీత మనియు, ఏవిధమైన నిర్వచనమును, నిర్దేశమును ఈ స్థితి తిరస్కరించు ననియు వివరించును.]

తత స్తత్ సంబభూవాఽసౌ, యద్గిరా మప్యగోచరః ॥ 37 ॥
పురుషో యో హి సాంఖ్యానాం, బ్రహ్మ బ్రహ్మవిదాం తథా ।
శివః శైవమతస్థానాం, సర్వం సుసమచేతసామ్ ॥ 38 ॥
యత్సర్వ శాస్త్ర సిద్ధాన్తో(2), యత్సర్వ హృదయాఽనుగమ్ ।
య దనుత్తమనిష్పన్దం(3), దీపకం తేజసామపి(4) ॥ 39 ॥

---

(1) "అథాఽత ఆదేశో 'నేతి' 'నేతి', నహ్యేతస్మాదితి నేత్యన్యత్పర మస్త్యథనామ ధేయగ్ సత్య స్య సత్యమితి ।" (బృ. ఉ. II-3.6)
(2) పోల్చు :- 'సర్వే వేదా యత్పద మామనన్తి ।(కఠ. ఉ. II-15)
సర్వవేదము లేవస్తువును పొందదగిన దానిగా ఏకగ్రీవముగ పలుకుచున్నవో ।
(3) 'అనుత్తమనిష్పన్దమ్' – 'అత్యన్తనిష్క్రియమ్' ।(యో.వా.ప్ర.)
(4) న తత్ర సూర్యోభాతి, న చన్ద్ర తారకం,
నేమా విద్యుతోభాన్తి, కుతోఽయ మగ్నిః! ।
తమేవ భాన్తమను భాతి సర్వం,
తస్య భాసా సర్వ మిదం విభాతి ।(కఠ. ఉ. V.15)

స్వానుభూత్యైక మాత్రం చ, సర్వం చ సర్వగం తథా ।
యదేకం చాఽప్యనేకం చ, విజరామరణం పదమ్ ॥ 40 ॥

37-40. ఏది, సాంఖ్యయోగులకు పురుషుడో, బ్రహ్మ విదులకు బ్రహ్మమో, శైవ మతస్థులకు సదాశివుడో, సమచిత్తులగు జీవన్ముక్తులకు నిరవశేష పూర్ణస్వరూపమో, ఏది సర్వశాస్త్రముల సిద్ధాంతమో, ఏది అందఱి హృదయములందున్న ప్రత్యగాత్మస్వరూపమో, ఏది అత్యంత నిష్క్రియమై, సూర్యాదిప్రకాశవస్తువులను సైతము ప్రకాశింప జేయుచున్నదో, నిజానుభవ రూపమైనదో, ఏది సర్వమును, సర్వగతమునై యున్నదో, ఏది స్వయముగ ఏకమై, ఉపాధి భేదముచే ననేకమునునై యున్నదో, ఏది జరామరణరహితమో అట్టి వాచామగోచరమైనట్టి సద్రూపమై ఆ ముని యుండెను.

త్రింశద్వర్ష సహస్రాణి, విహృత్యైవం యథా సుఖమ్ ।
వీతహవ్యః శశామైవం*, పునర్జన్మ వివర్జితః ॥ 41 ॥

---

ఆ పరమేశ్వరుని ప్రకాశము చేతనే, సూర్యాదితేజస్సమూహము ప్రకాశించుచున్నది. ఈ తేజస్సమూహమంతయు, ఆ పరమేశ్వరుని అనుసరించియే ప్రకాశించుచున్నది. మఱియు. భ.గీ. XIII-17. "జ్యోతిషామపి తజ్జ్యోతిః, తమసః పరముచ్యతే ॥ ఇత్యాది.

పోల్చు :- "యం శైవాః సముపాసతే శివ ఇతి, బ్రహ్మేతి వేదాన్తినః ।
బౌద్ధాః బుద్ధ ఇతి ప్రమాణపటవః, కర్తేతి నైయాయికాః ।
అర్హన్నిత్యథ జైన శాసనరతాః, కర్మేతి మీమాంసకాః ।
సోఽయం వో విదధాతు వాఞ్ఛితఫలం, త్రైలోక్యనాథో హరిః ॥ "

హొయసల రాజులు నిర్మించిన బేలూరు (క్రీ.శ. 1117) చెన్నకేశవాలయము నందొక శిలాఫలకముపై ఈ శ్లోకము లిఖింపబడియున్నది. ఇది భారతీయ మహోన్నత తత్త్వ దర్శనమునకు సర్వ ధర్మ సమన్వయాలోకమునకు నిదర్శనమై యున్నది.

"గాయత్రీ సశిరా తురీయసహితా, సన్ధ్యామయీత్యాగమై
రాఖ్యాతా, త్రిపురే! త్వమేవ, మహతాం శర్మప్రదా కర్మణామ్ ।
తత్తద్దర్శనముఖ్యశక్తి రపి చ, త్వం బ్రహ్మ, కర్మేశ్వరీ
కర్తాఽర్హన్, పురుషో, హరిశ్చ, సవితా, బుద్ధః, శివ, స్త్వం గురుః ॥
(త్రిపురామహిమ్నః స్తోత్రము – 20)

మఱియు – "బుద్ధస్త్వమేవ విబుధాఽర్చిత బుద్ధి యోగాత్,
త్వం శంకరోఽపి భువనత్రయ శంకరత్వాత్ ।
ధాతాఽసి ధీరశివమార్గవిధేర్విధానాద్,
వ్యక్తం త్వమేవ భగవాన్ పురుషోత్తమోఽసి ॥" (భక్తాఽమరస్తోత్రము –26)

41. శ్రీరామా! వీతహవ్యుడీ విధముగా, ముప్పదివేల (30,000) సంవత్సరములు సుఖపూర్వకముగ నీలోకమున విహరించి, పునర్జన్మము కలుగనీయని పరమాత్మపదమున విశ్రాంతిని (నిర్వాణమును) పొందినాడు.

### 4. చిత్తనాశో ద్వివిధః – మనోనాశము రెండు విధములు

శ్రీరామ ఉవాచ –

జీవన్ముక్త శరీరాణాం కథ మాత్మవిదాం వర ! ।
శక్తయో నేహ దృశ్యన్తే, ఆకాశగమనాదికాః । 42 ।

42. శ్రీరాముడు :- ఆత్మవేత్తలలో శ్రేష్ఠుడవైన మహాత్మా! జీవన్ముక్త దేహులైన వారి యందు ఆకాశగమనాది శక్తులేల కన్పించుట లేదు?

వసిష్ఠ ఉవాచ :-
అనాత్మవి దముక్తోఽపి, నభోవిహరణాదికమ్ ।
ద్రవ్యమన్త్ర క్రియా కాలశక్త్యా, ప్రాప్నోతి[1] రాఘవ! । 43 ।

43. వసిష్ఠుడు :- రాఘవా! ఆత్మజ్ఞానరహితుడైనను, ముక్తుడు కాని వాడైనను, మణి ఔషధాదులను ద్రవ్యశక్తి చేతను, మంత్రశక్తి చేతను, యోగాభ్యాసాదులను క్రియాశక్తి చేతను, వాని పరిపాక మను కాలశక్తుల చేతను, ఆకాశగమనాది సిద్ధులను పొందగలడు.

నాఽఽత్మజ్ఞస్యైష విషయ, ఆత్మజ్ఞో హ్యాత్మదృక్ స్వయమ్ ।
యస్యేచ్ఛా విద్యతే కాచిత్, స సిద్ధీః సాధ యత్యలమ్ । 44 ।

---

"త్రయీ, సాంఖ్యం, యోగః, పశుపతిమతం, వైష్ణవమితి,
ప్రభిన్నే ప్రస్థానే పరమిదమదః పథ్యమితి చ ।
రుచీనాం వైచిత్ర్యాదృజు కుటిలనానాపథజుషాం,
నృణామేకో గమ్యస్త్వమసి పయసా మర్ణవ ఇవ" (పుష్పదన్త విరచిత శివమహిమ్నః స్తోత్రము-7) వేదములు, సాంఖ్యము, యోగము, పాశుపతము, వైష్ణవమునని, విభిన్న మార్గములందు, 'ఇది ఉత్కృష్టము', 'అది అనుసరణీయము' – అని, అభిరుచుల వైచిత్ర్యము వలన, సరళములు, వక్రములునైన నానామార్గముల సేవించు నరులందఱికిని, పరమేశ్వరా! జలములకు సాగరమువలె, నీవే గమ్యము. ★ చూడు :- 18 సర్గ – 9వ శ్లోకము – పాదటీక.

(1) పోల్చు :- "జన్మౌషధి మన్త్ర తపస్సమాధిజాః సిద్ధయః । (పా.యో.ద.- IV - I)
కపిలాదిమహర్షులు కొందఱు జన్మ చేతనే సిద్ధుల పొందినారు. మాండవ్యాది మునులు కొందఱు, రసాయనాదుల సేవించుట చేత, కాయసిద్ధిని పొందినారు. వసిష్ఠాదులగు మహర్షులు కొందఱు మంత్రజపము చేత, అణిమాది సిద్ధులను పొందినారు. విశ్వామిత్రాది మహర్షులు కొందఱు తపోమహిమ చేత, సిద్ధులను పడసినారు.

44. ఆకాశగమనాది సిద్ధులు, ఆత్మ జ్ఞానులు కాంక్షింపదగినవి కావు. ఏలయన, ఆత్మజ్ఞాని, స్వయముగ ఆత్మద్రష్ట. అఖండశుద్ధచైతన్యస్వరూపము నాతడు పొందినాడు. ఎవనికి కోర్కెయుండునో ఆతడే సిద్ధులను పూర్తిగ సంపాదింపగలడు.

ఆత్మజ్ఞస్య తు పూర్ణస్య, నేచ్ఛా సమ్భవతి క్వచిత్ ।
పరమాత్మపదప్రాప్తౌ, నోపకుర్వన్తి సిద్ధయః ॥ 45 ॥

45. కాని, పరిపూర్ణుడగు ఆత్మ జ్ఞానికి, ఏ కోర్కెయు నుండదు. పరమాత్మ పదప్రాప్తికి సిద్ధు లుపకరింపవు.

శ్రీరామ ఉవాచ –

వీతహవ్యతను ర్మగ్నా, కథం క్లిన్నా న భూతలే ?।

46. శ్రీరాముడు :- భూమి యందు పూడిపోయిన వీతహవ్యముని దేహము, పంకాదులచే శిథిలమెందుకు కాలేదు?

వసిష్ఠ ఉవాచ –

సబాహ్యాఽఽభ్యన్తరః స్పన్దః, శ్చిత్తజో వాతజోఽథవా ॥ 46 ॥
న యస్య విద్యతే తస్య, దూరస్థౌ విక్రియా క్షయౌ ।

46-47. వసిష్ఠుడు :- ఆభ్యంతరములైన ప్రాణాదులతోను, బాహ్యములైన హస్త పాదాదులతోను కూడిన దేహమున, చిత్తముచేగాని, లేక, ప్రాణ వాయువులచే గాని, ఉత్పన్నమగు స్పందన మెవనికి లేదో, అట్టి వానికి వికృతి (మార్పు), క్షయము (నాశము)ను ఉండవు.

సబాహ్యాఽఽభ్యన్తరే శాన్తే, స్పన్దే పవన చేతసోః ॥ 47 ॥
ధాతవః సంస్థితిం దేహే, న త్యజన్తి కదాచన* ।

---

* మరణానంతరము, ఈ శతాబ్దమునకు చెందిన మహా యోగులగు శ్రీ అరవిందుల యొక్కయు, శ్రీ పరమహంస యోగానందుల యొక్కయు, పార్థివ దేహములందు విశీర్ణతకు సంబంధించిన అపక్షయ లక్షణాలేవియు కన్పింపకుండుటయే (Absence of any Physical signs of decay in the dead body) ఇందులకు ప్రబలమగు ప్రత్యక్ష నిదర్శనము. జీవితమందే కాక, మరణ మందు కూడ వారు అనుపమానులే.
"న తస్య రోగో, న జరా, న మృత్యుః ।
ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్ ॥" (శ్వే. ఉ. II-12)

47. ప్రాణవాయువు యొక్కయు, చిత్తముయొక్కయు, బాహ్యమును, అభ్యంతరమునైన స్పందనము, ఉపశమింపగా, దేహమున, త్వఙ్మాంసాది ధాతువులు తమ పూర్వ స్థితి నెన్నటికిని త్యజింపకుండును (కావుననే, యోగుల శరీరములు చెడవు)

**యే తు విజ్ఞాతవిజ్ఞేయాః, వీతరాగా మహాధియః । 48 ।**
**విచ్ఛిన్న గ్రన్థయః[1] సర్వే, తే స్వతన్త్రా స్తనౌ స్థితాః ।**

48-49. ఆత్మజ్ఞానులు, వీతరాగులు, మహాధీమంతులు, విచ్ఛిన్న హృదయగ్రంథులు నైన మహాత్ములు, తమ దేహవిషయము లందు స్వతంత్రులై యుందురు. [దేహస్థులై యున్నను, వారు, బాహ్యప్రకృతికి వశులై, పరాధీనులుగా నుండరు.]

**శ్రీరామ ఉవాచ :-**

**వివేకాఽభ్యుదయాత్ చిత్తస్వరూపే, ఽన్తర్హితే మునేః । 49 ।**
**మైత్ర్యాదయో గుణాః కుత్ర జాయన్తే మాం ప్రభో! వద।**

49-50. శ్రీరాముడు :- స్వామీ! వివేక ముదయించుట వలన, ముని యొక్క చిత్తము, ఆత్మ యందు లయింపగా, మరల మైత్ర్యాది గుణము లెక్కడ జనింపగలవు?-దీనిని నాకు తెలియజేయుము.

**వసిష్ఠ ఉవాచ :-**

**ద్వివిధ శ్చిత్తనాశోఽస్తి, సరూపోఽరూప ఏవ చ । 50 ।**
**జీవన్ముక్తౌ సరూపః స్యా దరూపోఽ దేహముక్తిజః । [2]**

50-51. వసిష్ఠుడు :- శ్రీరామా! సరూపము, అరూపమునని చిత్తనాశము రెండు

(1) "శరీరస్యాఽత్మనశ్చాఽపి సంబన్ధో గ్రంథిరుచ్యతే" । (అరుణాచల రమణర్షి)
శరీరమునకు ఆత్మకు గల సంబంధము గ్రంథి (ముడి) యనబడుచున్నది.

హృదయగ్రంథిః- అవిద్యా వాసనామయః । (శంకరుడు. ముం.ఉ. II-2-9)
గ్రంథి (ముడి) వలె విడిపించుకొనుటకు దుస్సాధమైన హృదయస్థ రాగద్వేషాదులు.

(2) "లయవినాశనే ఉభయ రోధనే లయగతం పున ర్భవతి న మృతమ్"
(అరుణాచల రమణమహర్షి ఉపదేశసారము - 13)

విధములు. జీవన్ముక్తి యందు మనోనాశము సరూపము, విదేహ ముక్తి యందు మనోనాశము అరూపమును నగును.

**చిత్తసత్తేహ దుఃఖాయ, చిత్తనాశః సుఖాయ తు ॥ 51 ॥**
**చిత్తసత్తాం క్షయం నీత్వా, చిత్తనాశ ముపానయేత్ ।** ★

**51-52.** చిత్తము యొక్క సత్తయే (ఉనికియే), దుఃఖకారణము. చిత్తనాశమే, సుఖ కారణము. కాన, చిత్తము యొక్క **సత్తను** (ఉనికిని) అణచి, దానిని నశింపజేయవలెను.

**సుఖదుఃఖాద్యవష్టబ్ధ మస్మీత్యేవ వినిశ్చలమ్ ॥ 52 ॥**
**విద్యమానం మనోవిద్ధి, సంసారద్రుమదోహదమ్ ।**

**52-53.** 'నేను ఉన్నాను' (అహమస్మి) అను భావమే, సుఖదుఃఖాదులను, దృఢముగ ప్రతిష్ఠించుచున్నది. ఈ మనస్సే సంసారవృక్షమునకు దోహదము – మూలము. (మొగ్గ తొడుగు సమయమునందలి అధికేచ్ఛ)

[**దోహదము :–** తీవ్రేచ్ఛ, గర్భచిహ్నము. గర్భవతులగు కాంతలు, గర్భ సమయమున వింత వింత కోరికలు కోరుచుండునట్లు, మొగ్గ తొడుగు సమయమున **అశోకవృక్షము, యువతుల పాదతాడనమును, వకుళ వృక్షము, కాంతల పుక్కిటి మధురసమును, తీవ్రముగ గాంక్షించునని (లోకగాథయందు) చెప్పబడినది.** సంసారవృక్షము, వివిధవిషయ పదార్థముల నుత్పాదించు నపుడు, మొట్ట మొదట నుద్భవించునది మనస్సే. ఇదియే తరువాత ప్రపంచోత్పత్తికి కారణ మగుచున్నది.]

---

★ చిత్తము (మనస్సు) అనేక జన్మములందలి కర్మవాసనలకు ఆశ్రయమైనది. కర్మము, మనస్సు, అభిన్నమనియు, కర్మశక్తియే మనస్సనియు, వసిష్ఠుని సిద్ధాంతము. ఇది నశింపనిచో, బ్రహ్మానంద ప్రాప్తిలేదు. బ్రహ్మానందానుభూతి లేకున్న, నితాంతమైన సంసారదుఃఖమయసంతాపము చల్లారదు.

"నానాకర్మజవాసనాన్వితమనోనాశంబు గాకున్న బ్ర
హ్మానందానుభవంబు గల్గునె? యనాయాసంబుగా, నిప్పుడీ
యానందాంబుధి నోలలాడకయ బాహ్యాభ్యంతరార్థాను సం
ధానోద్భూత నితాంత దుఃఖమయ సంతాపంబు చల్లారునే?" ।

చూడు :– శ్రీ సీతారామాంజనేయ సంవాద రాజయోగదర్శనము –
డా॥ రత్నాకరం బాలరాజు – (1982)

సుఖదుఃఖదశా ఆప న్మదో మాన్ద్యం మహోత్సవః ॥ 53 ॥
యం నయన్తి న వైరూప్యం, తస్య నష్టం మనో విదుః ।

**53-54.** సుఖదుఃఖావస్థలు, ఆపద, మదము, జడత్వము, మహోత్సవము, మొదలగునవి, యెవని ముఖమున వైవర్ణ్యము కలుగజేయజాలవో, అట్టి వాని మనస్సు నశించినదని యోగు లెఱుగుదురు.

మైత్ర్యాదిభిర్గుణై ర్యుక్తం[1], భవత్యుత్తమవాసనమ్ ॥ 54 ।
భూయో జన్మవినిర్ముక్తం, జీవన్ముక్తస్య తన్మనః ।
సరూపోఽసౌ మనోనాశః, యత్ర భాన్తి గుణా ఇమే । 55 ॥

**54-55.** శ్రీరామా! జీవన్ముక్తుని మనస్సు, మైత్ర్యాది గుణ సంపన్నమై, ఉత్తమ వాసనామయమై, పునర్జన్మనిర్ముక్తమై, యుండును. ఎచ్చట ఈ మైత్ర్యాది గుణములు ప్రకాశించుచుండునో, అది సరూప మనోనాశము – ఇది జీవన్ముక్తుల కుండును.

[ సద్వాసనావశముననే, జీవన్ముక్తుల యందు స్వాభావికముగ నీ మైత్ర్యాదిగుణసంపద, అభివ్యక్తమగును. కాని, ఈ గుణములు మనస్సును, సంసారబద్ధ మొనర్పజాలవు. ఈ మనస్సు సర్వదా విముక్తము. ]

అరూప స్తు మనో నాశో, విదేహముక్తిజో భవేత్ ।
సమగ్రాఽగ్ర్య గుణాధార మపి సత్త్వం ప్రలీయతే [2] । 56 ।

**56.** అరూపమనోనాశము, విదేహముక్తి వలన కలుగును. ఉత్తమ గుణములకన్నిటికిని ఆధారభూతమైన సత్త్వము (ప్రాతిభాసికమనస్సు) విదేహముక్తి యందు, పరమపావనమగు పదమున విలీనమైపోవును.

---

(1) మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాఽపుణ్య విషయాణాం భావనాత శ్చిత్త ప్రసాదమ్ । (పా.యో.ద. I-33)
చూడు :– (X సర్గ – 61 శ్లో। పాదటీకా.)

(2) సత్త్వపురుషయోః శుద్ధిసామ్యే కైవల్యమ్ । (పా.యో.ద.III-55)
సత్త్వమునకు, పురుషునకు, (ఆత్మకు), సర్వవృత్తి శూన్యత్వమను శుద్ధియొక్కయు, కల్పిత భోగశూన్యత్వమను శుద్ధి యొక్కయు, సామ్యము సిద్ధించుటయే, స్వస్వరూప ప్రతిష్ఠ లక్షణమగు పరమపదము (కైవల్యము).

చిత్తనాశే విరూపాఖ్యే, న కిఞ్చిదపి విద్యతే ।
న గుణా నాఽగుణాస్తత్ర, న హర్షాఽమర్ష సంవిదః★ । 57 ॥

57. రూపరహిత మనబడు ఈ చిత్తనాశస్థితి యందు, దృశ్య మేమాత్రము నుండదు. గుణములు గాని, అగుణములు గాని, హర్షశోకముల సంవేదనము గాని, ఈ **అరూపచిత్త నాశస్థితి** యందు ఉండవు. (అఖండ శుద్ధ చైతన్యము, మానసికములగు అవధులకు అతీతము).

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'వీతహవ్యోపాఖ్యానం' నామ అష్టాదశః సర్గః ।

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'వీతహవ్యోపాఖ్యానమను' అష్టాదశ - (పదునెనిమిదవ) - సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



---

★ పురుషార్థశూన్యానాం ప్రతిప్రసవః కైవల్యం,
స్వరూపప్రతిష్ఠా వా చితిశక్తిరితి । (పా.యో.ద. IV-33)

పురుషునికి (ఆత్మకు) ప్రయోజనములగు భోగాపవర్గముల రాహిత్యముచే - (పురుషుని కొఱకు ఏ కర్తవ్యశేషము లేనందున) సత్త్వరజస్తమోగుణములు, స్వకారణప్రధానప్రకృతి యందు లయింపగా, కైవల్యము సిద్ధించుచున్నది. వృత్తి సారూప్యము పరిహృతమగుట వలన, ద్రష్ట (చితిశక్తి) స్వస్వరూపమున ప్రతిష్ఠితుడగుచున్నాడని భావము. [చితిశక్తి యొక్క కేవలావస్థయే కైవల్యము]

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ఏకోనవింశసర్గము

## చిత్తప్రశమనమ్ – చిత్తోపశాంతి

### 1. చిత్తస్య ద్వే బీజే – చిత్తముయొక్క రెండు బీజములు – (కారణములు)

**శ్రీరామ ఉవాచ :–**

**"బ్రహ్మన్! సంసృతి మృద్వీకాలతాయా వితతాఽఽ కృతేః ।**
**కిం బీజం? తస్య కిం బీజం?, బీజం తస్యాఽపి కిం భవేత్?।" ॥ 1 ॥**

1. శ్రీరాముడు :– "మహాత్మా! విస్తారమగు ఆకృతి గల సంసార మను ద్రాక్షాలతకు బీజమేది? ఆ బీజమునకు బీజమేది? దానికి సైతము మరల బీజమేది?"

**వసిష్ఠ ఉవాచ :–**

**సంసృతివ్రతతే ర్బీజం, శరీరం విద్ధి రాఘవ !।**
**బీజ మస్య శరీరస్య, చిత్త మాశావశానుగమ్ ॥ 2 ॥**

2. వసిష్ఠుడు :- శ్రీరామా! శరీరమే ఈ సంసారలతకు బీజమని తెలిసికొనుము. ఆశలకు వశమై, వాని ననుసరించినదియగు చిత్తమే, ఈ శరీరమునకు బీజము. [లింగ(సూక్ష్మ) దేహమున, ప్రచ్ఛన్నములు, విచిత్రములును అనంత కార్యములకు ఆరంభములునగు, శుభాఽశుభకర్మములే, జగత్కాననము నాక్రమించి, వ్యాపించి యున్న, ఈ సంసారలతకు మహాంకురములు]

ద్వే బీజే చిత్త వృక్షస్య, వృత్తి[1]వ్రతతి ధారిణః।
ఏకం ప్రాణ[2]పరిస్పన్దో, ద్వితీయం దృఢభావనా ॥ 3 ॥

3. వృత్తి యను తీగె గల చిత్త మను వృక్షమునకు, బీజములు రెండు. ఒకటి ప్రాణపరిస్పందము (ప్రాణచలనము), రెండు, దృఢవాసన. (ఇది తృతీయ ప్రశ్నకు ఉత్తరము)

యదా ప్రస్పన్దతే ప్రాణో, నాడీసంస్పర్శనోద్యతః।
తదా సంవేదనమయం, చిత్త మాఽఽశు ప్రజాయతే ॥ 4 ॥

4 నాడులను స్పృశింప నుద్యుక్తమగు ప్రాణము, ఎపుడు చలించునో, అపుడే, శీఘ్రముగా, సంవేదనమయము (చిద్వికార ప్రాయము) అగు చిత్తము జనించుచున్నది.

సతీ సర్వసమా సంవి త్ప్రాణ స్పన్దేన బోధితా।
సంవేద్య మాదరా ద్యాతి, తతో దుఃఖాని చేతసః ॥ 5 ॥

5. సర్వసమముగా, చలనరహితముగా, నున్న సంవిత్తు (చైతన్యము) ప్రాణచలనము చేతనే ప్రబోధింప బడుచున్నది; ప్రియాతి ప్రియమైన శబ్దాదివిషయముల (సంవేద్యముల) వైపునకు ఆసక్తితో పరుగిడుచున్నది. దాని వలననే, చిత్తమునకు దుఃఖము లుదయించుచున్నవి.

యోగిన శ్చిత్త శాన్త్యర్థం, కుర్వన్తి ప్రాణరోధనమ్।
చిత్తస్యోత్పత్తి మపరాం, వాసనా[3]జనితాం శృణు ॥ 6 ॥

(1) వృత్తి - సంకల్పము. (Mental Operation)

(2) ప్రాణ మనగా, శ్వాసముకాదు. అది దేహ ధర్మ క్రియలకు హేతువగు ప్రాణ శక్తి. ఈ ప్రాణ శక్తి, శరీరనాడుల ద్వారా, పని చేయును. శ్వాసము ప్రాణశక్తి యొక్క అభివ్యక్తులలో నొక్కటి మాత్రమే. తఱచుగా, యోగశాస్త్రములు, ప్రాణాయామము ద్వారా, జీవశక్తిని వశమొనరించుకొను విషయమున శ్వాసమును ప్రాణమని వ్యవహరించుచున్నవి. ప్రాణాయామము- (ప్రాణ+ఆయామము) ప్రాణసంయమమునకు అత్యంతకార్యసాధకమైన మార్గము.

(3) ఈ మానసిక సంస్కారములు, లేక, వాసనలు, ప్రస్తుత జన్మమందలి అనుభూతుల స్మృతులను, సుప్త చేతన యందు పూర్వ జన్మ సంచితములై యున్న సంస్కారములను నిరూపించుచున్నవి.

6. యోగులు, చిత్తవిశ్రాంతి కొఱకు, ప్రాణవాయువును నిరోధించు చున్నారు. ప్రాక్తనజన్మపరంపరాగతములగు వాసనలచే జనించు అన్యవిధమగు చిత్తోత్పత్తిని గూర్చి వినుము.

దృఢభావనయా త్యక్తపూర్వాఽపర విచారణమ్ ।
యదాఽఽదానం పదార్థస్య, వాసనా సా ప్రకీర్తితా ॥ 7 ॥

7. ప్రాక్తన జన్మ సంబంధియగు దృఢ భావనచేత, పూర్వాపర విచారణను వదలి, దేహాది పదార్థములను 'నేను', 'నాది', మున్నగు సంస్కారములచే గ్రహించుటయే, వాసన యని చెప్పబడినది. (ఈ వాసన, దేహాది భావనచే ఆత్మను భావించును.)

భావిత స్తీవ్ర సంవేగా దాత్మనా య త్తదేవ సః ।
భవత్యాశు చ తద్రూపో, వాసనావివశీకృతః ॥ 8 ॥

8. వాసనచే వివశీకృతుడై, ఎవడు తన ఆత్మతో, తీవ్ర సంవేగమున నెట్టి భావన నొనర్చునో, శీఘ్రముగ అట్టి రూపమునే అతడు పొందుచున్నాడు.

ప్రపశ్యతి యదేవైతత్, సద్వస్త్వితి విముహ్యతి ।
వాసనావేగ వైవశ్యాత్, స్వరూపం ప్రజహాతి సః ॥ 9 ॥

9. వాసనా వేగముచే వివశీకృతుడైనవాడు, ఆ వాసనారూపముచే, దేనిని గాంచునో, అదియే సద్వస్తువని, విమోహితుడై, తన సత్యస్వరూపమును పూర్తిగ త్యజించుచున్నాడు.

య దవస్తుని వస్తుత్వం, తచ్చిత్తం విద్ధి రాఘవ ! ।
దృఢాఽభ్యాస పదార్థైకవాసనా దతిచఞ్చలమ్ ॥ 10 ॥
చిత్తం సంజాయతే జన్మజరామరణకారణమ్ ।

10-11. శ్రీరామా! అవస్తువులందు (దేహాదులందు) వస్తుత్వమును (ఆత్మను) గాంచునదియే, చిత్తమని యెఱుగుము. దృఢాభ్యాసముచే, దేహాది పదార్థముతోడి అభేదరూపవాసనవలన, జన్మజరామరణ కారణమును, అతిచంచలమునైన చిత్తము జనించుచున్నది.

యదా న వాస్యతే కిఞ్చి ద్ధేయోపాదేయరూపి యత్ । 11 ॥
స్థీయతే సకలం త్యక్త్వా, తదా చిత్తం న జాయతే ।

**11-12.** చైతన్య మెప్పుడు హేయోపాదేయ (త్యాజ్య గ్రాహ్య) దృష్టిని అవలంబింపక, సమస్తమును వీడి, వాసనారహితమై యుండునో, అప్పుడు చిత్తము జనింపదు.

సర్వ మంతః పరిత్యజ్య, శీతలాఽఽశయవర్తి యత్ ॥ 12 ।
వృత్తిస్థమపి తచ్చిత్త, మసద్రూప ముదాహృతమ్ ।

**12-13.** అంతఃకరణమున సర్వమును పరిత్యజించి, శీతలాశయవర్తియగు చిత్తము, వృత్తితో (సంకల్పముతో) కూడియున్నను – (దగ్ధవస్త్రావభాసము* వలె,) అసద్రూపమనియే –(లేనిదనియే) – చెప్పబడును.

భృష్ట బీజోపమా యేషాం, వాసనా రసవర్జితా । 13 ॥
అచిత్తా ఇతి కథ్యన్తే, జీవన్ముక్తా హి తే స్థితాః ।

---

★ పోల్చు :- “కార్యాఽకార్యం కిమపి చరతో నైవ కర్తృత్వమస్తి,
జీవన్ముక్తి స్థితి రిహ గతా దగ్ధవస్త్రాఽవభాసా ।
ఏవం దేహే ప్రచలితతయా దృశ్యమానః స ముక్తో,
నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః? కో నిషేధః? ।” (శుకాఽష్టకము – 7)

ఆత్మజ్ఞానికి, కర్తృత్వాభిమానము లేదు. కాన, కార్యాఽకార్యవిభేదమును ఆతనికి ఉండదు. ఒక వస్త్రము; సంపూర్ణముగా కాలిపోయినను, వస్త్రముగానే కన్పించునట్లు, ఆత్మవేత్తకు కర్తృత్వాభిమాన మేమాత్రమును లేకున్నను, ఉన్నట్లు లోకులకు కన్పించుచుండును. లోకుల కతడు సంచరించుచున్నట్లు కనిపించినను, ఆత్మ సర్వగతమగుటచే, ఆతనికి రాకపోకలు సైతము ఉండవు.

“పుమాన్ సర్వగతో వ్యాపీ, ఆకాశ వదయం యతః ।
కుతః కుత్ర క్వగన్తాఽసీ త్యేతదప్యర్థవత్కథమ్ ?
సోఽహం గన్తా, న చాఽఽగన్తా, నైకదేశనికేతనః । (విష్ణు పురాణము II-15.24,25)

“ఆత్మతత్త్వ పురుష డాకసము బోలె,
నెందునైన నుండు నెల్ల ప్రొద్దు;
కాన నేను రాను బో నొక్కచో నుండ,
నివ్విధములు నీవె యెఱిగి కొనుము” (ఆంధ్రవిష్ణు పురాణము III-359)

అని, ఋభుమహర్షి, నిదాఘుడను శిష్యునకు తత్త్వబోధ మొనర్చెను.

**13-14.** ఎవరి వాసన, రాగరహితమై, అంకురింపజాలని వేయించిన విత్తనమును పోలి యుండునో, వారు **చిత్తరహితులనియే** చెప్పబడుదురు. వారు నిశ్చయముగా **జీవన్ముక్తులైయే** యున్నారు.

**వాసనావశతః ప్రాణస్పన్ద స్తేన చ వాసనా ॥ 14 ॥**
**జాయతే చిత్తబీజస్య, తేన బీజాఙ్కురక్రమః ।**
**ఏకస్మిం స్తు తయోః క్షీణే, క్షిప్రం ద్వే అపి నశ్యతః ॥ 15 ॥**

**14-15.** వాసనచే ప్రాణస్పందము (ప్రాణచలనము)ను, ప్రాణస్పందముచే వాసనయు, జనించుచున్నవి. దానిచే, చిత్తబీజమునకు, బీజాంకుర క్రమము కల్గుచున్నది. వీనిలో నే యొక్కటి నశించినను, శీఘ్రముగా రెండును నశించుచున్నవి.

## 2. అసంవేదనమ్ – శబ్దాది విషయానుభూతి లేమి

**సంవేద్య మేతయో ర్బీజం, తత్త్యాగా న్నశ్యతి ద్వయమ్ ।**
**సంవిదం విద్ధి సంవేద్యబీజం రామ! తయా వినా ॥ 16 ॥**
**న సమ్భవతి సంవేద్యం, తైలహీన స్తిలో యథా ।**

**16-17.** సంవేద్యము, (ప్రియాప్రియమగు శబ్దాదివిషయానుభూతి,) ప్రాణస్పందమునకు, వాసనలకు, బీజము. దీనిని వర్జించినచో, ఆ రెండును నశించును. శ్రీరామా! **సంవిత్తే** (అభేదభావనారూపమగు జ్ఞానమే) తన స్వాభావిక ధీరత్వమును వీడి, **సంవేద్య(జ్ఞేయ)రూపమై,** చిత్తమునకు బీజమగుచున్నదని తెలిసికొనుము. సంవిత్తు(జ్ఞానరూపమైన బ్రహ్మము) లేనిచో, **నూనె లేని నూవుగింజ లేనట్లు,** సంవేద్యము (శబ్దాది విషయానుభూతి రూపమగు జ్ఞేయము) లేనేలేదు.

**సంవేదన మనర్థాయ, దుఃఖాయ జననాఽఽత్మనే ॥ 17 ॥**
**అసంవిత్తి రజాడ్యస్థా, సుఖాయాఽ జననాత్మనే ।**

**17-18.** సంవేదన మనగా వేద్యమగు శబ్దాదివిషయదర్శనము. ఇది **జనన మరణాది రూపమగు** అనంతదుఃఖమునకు కారణమగుచున్నది. చిదేక రసస్వభావమున ప్రతిష్ఠితము (జడత్వరహితము) నగు **అసంవిత్తి,**

అనగా, శబ్దాదివిషయదర్శనరాహిత్యమే, నిత్యాత్మ (అజననాత్మ) సుఖరూపమున పరిణమించుచున్నది.

శ్రీరామ ఉవాచ :-

**అసంవిత్తి రజాడ్యస్థా, కీదృశీ భవతి? ప్రభో! ॥ 18 ।**
**అసంవిత్తౌ చ జాడ్యం తత్కథం వా వినివర్తతే ? ।**

18-19. శ్రీరాముడు :- స్వామీ! చిదేక రసమున ప్రతిష్ఠితమై, జడత్వ రహితమైన ఆ అసంవిత్తి ఎట్టిది? అసంవిత్తి(శబ్దాదివిషయజ్ఞానరాహిత్యస్థితి) యందు, జడత్వమెట్లు నివర్తించును? [దృశ్యజ్ఞానరహితుడై, కేవల చైతన్యమాత్ర స్వరూపుడుగ నుండు టెట్లు సంభవించును?]

వసిష్ఠ ఉవాచ –

**యః సర్వత్రాఽనవస్థాఽఽస్థో, విశ్రాన్తాఽఽస్థో న కుత్రచిత్ । 19 ।**
**జీవో న విన్దతే కిఞ్చి దసంవి దజడో హి సః ।**
**జీవన్ముక్తః స విజ్ఞేయః, కుర్వన్ కార్య శతాన్యపి । 20 ।**

19-20. వసిష్ఠుడు :- శ్రీరామా! బాహ్యార్థములు సత్యములని యెఱుగుటయే 'సంవిత్తు'.★ జీవన్ముక్తుడు, వర్తమానవిషయములన్నిటి యందును, కాంక్షా (ఆస్థా) రహితుడు; అతీతాఽనాగత విషయములందును వాసనాక్షయము వలన, నిలుకడ చెందిన కాంక్షలేనివాడు, ఆతనికి వేద్య మొకింతయు నుండదు. కాన, నతడు, (కాష్ఠ శిలాదులట్లు) **సంవేదన రహితుడును (అసంవిత్తు),** స్వప్రకాశచిదేకరసపూర్ణుడగుటచే, **జడత్వరహితుడు** నగుచున్నాడు. **అతడు, సర్వకార్యములొనర్చుచున్నను, జీవన్ముక్తుడని యెఱుగవలెను.**

[జీవన్ముక్తుడు జ్ఞేయమును కాంక్షింపడు. జ్ఞేయపదార్థమున అతని చిత్తము విశ్రమింపదు. అతని చిత్తమునకు ఎందునను ఆలంబనము లేదు. శుద్ధసంవిత్తున (చైతన్యమున), గతకాలవిషయవిముక్తుడై, అనాగతము సృజింపక, ఆతడు స్థితుడై యుండును.]

**సమస్త వాసనాం త్యక్త్వా, నిర్వికల్పసమాధితః ।**
**అసన్దిత్వం భవేద్యచ్చ, తదసృష్టర్నిలీయతే । 21 ।**

---

★ **సం సత్యతయా బాహ్యాఽర్థవేదనం, సంవేదితి ।** (యో.వా.తా.ప్ర.)

21. సమస్తవాసనను త్యజించి, యుండుటచే నిర్వికల్ప సమాధి జన్యమగు ఆనందస్థితి సిద్ధించుచున్నది. ఈ ఆనందస్థితి సైతము, బ్రహ్మప్రకాశమధ్యముననే విలీనమగుచున్నది.

(అనాది, అనంత, అపరిచ్ఛిన్న బ్రహ్మాకార వృత్తి యొక్క సంవేదనము (ఆనందావస్థ) సైతము. స్వప్రకాశమగు బ్రహ్మజ్యోతి యందు విలీనమగుచున్నదని భావము).

**అజడో గళితాఽఽనన్ద స్త్యక్త సంవేదనః సుఖీ ।**
**తరే ద్దుఃఖాఽమ్బుధేః పార మపారగుణసాగర ! ॥ 22 ॥**

22. అపార గుణ సాగరుడవగు శ్రీరామా! అన్య సంవేదనలను త్యజించిన వాడును, అజడుడును, బ్రహ్మప్రకాశమున విలీనమైన ఆనందము గలవాడును, నిరంతరసుఖవంతుడునైన మనుజుడు, దుఃఖసాగరపారమును తరింపగలడు.

**అథాఽస్యాః సంవిదో రామ!, సన్మాత్రం బీజ ముచ్యతే ।**
**ద్వేరూపే తత్ర సత్తాయాః, నానా చైకమితి స్మృతే ॥ 23 ॥**

23. శ్రీరామా! కేవలము సన్మాత్రరూపమగు బ్రహ్మమే, ఈ ప్రతిబింబితములైన సంవిత్తులకు బీజము –(కారణము). సత్తారూపమగు బ్రహ్మమునకు ఏకము, అనేకమునని రెండు రూపములని చెప్పబడినవి.

**ఘటతా పటతా తత్తా, త్వత్తా మత్తేతి కథ్యతే ।**
**సత్తారూపవిభాగేన, యత్తన్నానాఽఽకృతి స్మృతమ్ ॥ 24 ॥**

24. లోకమున ఘటము కలదు, పటము (వస్త్రము) కలదు, అది కలదు. నీవు కలవు, నేను కలను – అనునట్టి రూపవిభాగములచే చెప్పబడు వ్యావహారికమగు సత్త, వివిధరూపములు గలదిగా భావింపబడుచున్నది.

**విశేషం సంపరిత్యజ్య, సన్మాత్రం య దలేపకమ్ ।**
**ఏకరూపం మహారూపం, సత్తాయా స్తత్పదం విదుః★ ॥ 25 ॥**

★ పోల్చు :- "నాఽసతో విద్యతే భావో, నాఽభావో విద్యతే సతః ।
ఉభయో రపి దృష్టోఽన్తస్త్వనయో స్తత్త్వదర్శిభిః ॥ (భ.గీ.II-16)
...... "సర్వత్ర బుద్ధిద్వయోపలబ్ధేః సద్బుద్ధి రసద్బుద్ధిశ్చేతి ।
యద్విషయా బుద్ధిర్న వ్యభిచరతి తత్ సత్, యద్విషయా వ్యభిచరతి తదసత్, సదసద్విభాగే బుద్ధితన్త్రే స్థితే, సర్వత్ర ద్వేబుద్ధీ సర్వైరుపలభ్యేతే సమానాధి కరణే న నీలోత్పలవత్ ! సన్ ఘటః, సన్ పటః, సన్ హస్తీ ఇతి. ఏవం సర్వత్ర, తయోర్బుద్ధ్యోర్ఘటాఽదిబుద్ధి ర్వ్యభిచరతి! తథా చ దర్శితం ।

25. ఘటపటాదివిశేషములను పరిత్యజించి, సర్వగతమై, నిర్లిప్తమై, యున్న సన్మాత్రము యొక్క ఏకమగు మహారూపమునే, సత్తారూపమగు (వస్తుతత్త్వమగు) బ్రహ్మపదమని తత్త్వవేత్త లెఱుగుదురు.

సత్తాసామాన్యమాత్రస్య, యా కోటిః పరమాఽవధిః ।
సైవాఽస్య జగతో బీజం, యత స్తస్యా హి జాయతే । 26 ।

26. శ్రీరామా! సత్తా సామాన్యము యొక్క పరమావధి యగు సత్తయే ఈ జగత్తు యొక్కయు, ప్రతిబింబిత చైతన్యము యొక్కయు, బీజము. కాన, ఈ జగత్తు దాని నుండే జనించుచున్నది.

తద్ధేతుః సర్వహేతూనాం, తస్య బీజం న విద్యతే ।
న సారః సర్వసారాణాం, తస్మాత్సారో న విద్యతే । 27 ।
తస్మింశ్చాఽవగతే చేతః, శాన్తి మాప్నోతి నైష్ఠికీమ్ ।

27-28. అదియే సర్వకారణములకు కారణము. దానికి మఱొక కారణ మేదియును లేదు. సర్వవస్తువుల సార మదియే. దానికి మించి, సారము మఱొకటి లేదు. దాని నెఱిగినచో చిత్తము, విష్టప్రభవమై, అచలమగు శాశ్వతశాంతిని పొందుచున్నది.

---

న తు సద్బుద్ధిః । తత్తస్మాత్ ఘటాది బుద్ధి విషయోఽసన్, వ్యభిచారాత్, న తు సద్బుద్ధి విషయః, అవ్యభిచారాత్" ఇత్యాది ।

(భ.గీ.II-10-(శంకరభాష్యము)

సర్వత్ర, అనుభవమందు, సద్బుద్ధి, అసద్బుద్ధి – అని సత్యాఽసత్యములకు సంబంధించిన రెండు జ్ఞానములు – బుద్ధులు (Cognitions or Awarenesses) ఉన్నవి. దేని విషయమున జ్ఞానము (బుద్ధి) నిలుకడ కల్గినదై, మార్పు చెందదో (వ్యభిచరింపదో), అది సత్యము (సత్తు). దేని విషయమున, జ్ఞానము (బుద్ధి) నిలుకడ లేనిదై మార్పు చెందునో, అది అసత్యము (అసత్తు). ఇట్లు సదసద్విభాగము, సత్యాఽసత్యముల నిరూపణ, జ్ఞానము(బుద్ధి)పై ఆధారపడియున్నది. కాన, సర్వవ్యావహారికానుభవములందును, ప్రతివ్యక్తికిని, ఒకే యొక (సమానాధికరణమగు) వస్తువును గూర్చిన రెండు జ్ఞానములున్నవి. ఘటము (కుండ) సత్యము – (ఉన్నది) పటము (వస్త్రము) సత్యము (ఉన్నది). హస్తి (ఏనుగు) సత్యము (ఉన్నది) అను ఈ జ్ఞానములందు ఘటాదులకు సంబంధించిన జ్ఞానము మారుచున్నది (వ్యభిచరించుచున్నది). కాని, సత్యము (ఉన్నది) అను జ్ఞానమున మార్పు లేదు. కాన, ఘటాది జ్ఞానము (బుద్ధి) అసత్యము (అసత్తు). సత్యము (ఉన్నది) అను జ్ఞానము (బుద్ధి) మారనందున, సత్తు. ఇదియే సన్మాత్రమగు బ్రహ్మము.

శ్రీరామ ఉవాచ –

"ఏతాని తాని ప్రోక్తాని, త్వయా బీజాని మానద ! ॥ 28 ॥
కతమస్య ప్రయోగేణ, శీఘ్ర మాసాద్యతే పదమ్" ? ।

28-29. "శ్రీరాముడు :- గౌరవప్రదుడవగు మహాత్మా! సంసారలతకు దేహాదులగు బీజముల నన్నిటిని, తమరు వివరించినారు. వానికి, ఏ యుపాయ ప్రయోగముచే నివృత్తి గల్గి, పరమపదము సంప్రాప్తించును.?"

వసిష్ఠ ఉవాచ –

ఏతేషాం దుఃఖబీజానాం, ప్రోక్తం యద్యన్మయోత్తరమ్ ॥ 29 ॥
తస్యతస్య ప్రయోగేణ, శీఘ్ర మాసాద్యతే పదమ్ ।

29-30. వసిష్ఠుడు :- శ్రీరామా! దుఃఖబీజములను గూర్చి నేను ఏయే సమాధానముల నొసగితినో, వాని వాని ఉపాయప్రయోగములచేతనే, శీఘ్రముగ పరమపదము సంప్రాప్తించును.

సత్తాసామాన్యకోటిస్థే ద్రాగిత్యేవ పదే యది ॥ 30 ॥
పౌరుషేణ ప్రయత్నేన, బలాత్ సన్త్యజ్య వాసనాః ।
స్థితిం బధ్నాసి చేత్ సాధు, పదం ప్రాప్నోషి తత్క్షణే★ ॥ 31 ॥

30-31. సౌమ్యుడా! శ్రీరామా! పురుషప్రయత్న బలమున, సర్వవాసనలను బలవంతముగా పరిత్యజించి, **సత్తాసామాన్యము (శోధింపబడిన తత్పదార్థము) యొక్క పరాకాష్ఠ (పరమావధి) యందువ్న చిద్రూపము (శోధింపబడిన త్వం పదార్థము)** యొక్క ఐక్యముచే, అఖండైకరస స్వరూపపదమున, దృఢస్థితి పొందితివేని, తత్క్షణమే నీ వా మనోజ్ఞమగు (అఖండశుద్ధ చైతన్య) పదమును పొందగలవు.

★ పోల్చు :- "యది దేహం పృథక్కృత్య, చితి విశ్రామ్య తిష్ఠసి ।
అధునైవ సుఖీ శాన్తో, బన్ధముక్తో భవిష్యసి ।" (అష్టావక్ర సంహిత-I-4)
నీవు, దేహమును, నీ నుండి వేఱు చేసి, శుద్ధ చైతన్యమగు బ్రహ్మమున విశ్రమించి నిల్చినచో, ఇప్పుడే సుఖవంతుడవు, శాంతుడవు బంధముక్తుడవు కాగలవు – అని, అష్టావక్ర మహర్షి, జనక రాజునకు బోధించెను.

**సత్తా సామాన్య రూపే వా, కరోషి స్థితి మఙ్గ! చేత్ ।**
**తత్కించ్చి దధికేనైవ, యత్నేనాఽప్నోషి తత్పదమ్ ॥ 32 ॥**

32. సౌమ్యుడా! శ్రీరామా! అట్లు కాని పక్షమున, సత్తా సామాన్య రూపమున (శోధింపబడిన జగత్కారణతత్త్వమున) నీవు విచారబలమున స్థిరత్వమును పొందగల్గినచో, కొద్ది పాటి అధికప్రయత్నము చేతనే, నీ వాత్మ పదమును పొందగలవు. (**ఆత్మసత్త యొక్కటియేయని యెఱుగుట, సత్తా సామాన్యాఽతీత పదము నెఱుగుట కంటెను సుకరము కదా!**)

**సంవిత్తత్త్వే కృతధ్యానో, యది తిష్ఠసి రాఘవ ! ।**
**తద్యత్నేనాఽధికేనోచ్చై రాసాదయసి తత్పదమ్*। 33 ।**

33 శ్రీరామా! అట్లును కాక! శోధిత 'త్వం' పదార్థ రూపమగు సంవిత్ తత్త్వమున (జ్ఞానరూపమైన తత్త్వమున) ధ్యానబలమున నిలుకడ నొందినచో, అత్యధిక ప్రయత్నమున, సత్తాసామాన్యాఽతీతమగు ఆ యున్నత పదమును పొందగలవు.

## 3. మనోనాశాదిత్రయమ్ –

### మనోనాశాదులగు మూడు ఉపాయములు

**సంవేద్యే కేవలే ధ్యానం, నైవ సిధ్యత్యసమ్భవాత్ ।**
**వాసనాసంపరిత్యాగే, యది యత్నం కరోషి చ ॥ 34 ॥**
**తత్ తే శిథిలతాం యాన్తి, సర్వాఽఽధి వ్యాధయః క్షణాత్ ।**

34-35. కేవలము సంవేద్యము (దృశ్య విషయము)న, అది నిలుకడ లేనిదగుటచే,

---

* పై మూడు శ్లోకములు, ఉత్తరోత్తరము ఒకదాని కంటెను మఱొకటి క్రిందిది యని, దృశ్య విముక్తికి, పరమాత్మైక్యమునకు, సంబంధించిన విముక్తి క్రమమును వర్ణించుచున్నవి. (1) పురుషప్రయత్నబలమున, సర్వవాసనా పరిత్యాగముచే, సత్తాసామాన్యాతీతమైన అఖండైక చిద్రూపమున దృఢ స్థితి కల్గి తత్పదమును పొందుట. (2) కేవల సత్తా సామాన్యమున విచార బలమున, స్థితి పొందుట. ఇది క్రమముగ కొద్దిపాటి అధిక ప్రయత్నముచే సత్తా సామాన్యాతీతమగు అఖండాత్మపదమును పొందజేయగలదు. (3) జ్ఞానరూప (సంవిత్) తత్త్వమున చింతన నతిక్రమించి ధ్యాననిష్ఠుడై యుండుట. ఇది క్రమముగా అత్యధికప్రయత్నముచే, వ్యష్టిజీవభావము నతిక్రమింపజేసి, అఖండాత్మపదమును పొందజేయగలదు.

ధ్యానము సంభవింపదు. కాన, సిద్ధింపదు. వాసనాపరిత్యాగముననూ, మనోనాశముననూ, నీవు ప్రయత్న మొనర్చితివేని, క్షణములో మానసిక శారీరక దుఃఖము (ఆధివ్యాధు) లన్నియు నశించును.

యావ న్నలీయతే చిత్తం, న తావ ద్వాసనాక్షయః ‖ 35 ‖
న క్షీణా వాసనా యావత్, తా వచ్చిత్తం న శామ్యతి ।

**35-36.** చిత్తము లయింప నంత వఱకు, వాసనాక్షయము కలుగదు. వాసనలు క్షయింప నంత వఱకును, చిత్తము శాంతింపదు.

యావ న్నతత్త్వవిజ్ఞానం, న తావచ్చిత్త సంక్షయః ‖ 36 ‖
న చిత్తోపశమో యావ న్నతావ త్తత్త్వవేదనమ్ ।

**36-37.** తత్త్వ (సత్య పదార్థ) విజ్ఞానము కలుగ నంత వఱకు, చిత్త ముపశమింపదు. చిత్త ముపశమింప నంత వఱకును, తత్త్వజ్ఞానము సిద్ధింపదు.

యావ న్నవాసనానాశ స్తావత్ తత్త్వాఽఽగమః కుతః ? ‖ 37 ‖
యావ న్నతత్త్వసంప్రాప్తి ర్న తావ ద్వాసనాక్షయః ।

**37-38.** వాసనలు నశింప నంత వఱకు తత్త్వ జ్ఞాన మెచ్చట? ఆత్మ తత్త్వ ప్రాప్తి కలుగ నంతవఱకును వాసనలు క్షీణింపవు.

తత్త్వజ్ఞానం, మనోనాశో, వాసనాక్షయ, ఏవ చ ‖ 38 ‖
మిథః కారణతాం గత్వా, దుస్సాధ్యాని భవన్తి హి ।

**38-39.** తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములు మూడును, పరస్పరము కారణత్వము బొందినవగుట చేత, యథార్థముగ దుస్సాధ్యములై యున్నవి.

తస్మాద్రాఘవ! యత్నేన, పౌరుషేణ వివేకతః ‖ 39 ‖
భోగేచ్ఛాం దూరతః కృత్వా, త్రయమేతత్ సమాశ్రయేత్ ।

**39-40.** కావున శ్రీరామా! వివేక వైరాగ్యయుక్తమగు పురుష ప్రయత్నముచే, భోగేచ్ఛలను దూరమొనర్చి, ఈ మూడింటిని (తత్త్వజ్ఞాన, మనోనాశ, వాసనాక్షయములను) సమాశ్రయింపవలెను. (అభ్యసింపవలెను.)

సమకాలం చిరాఽభ్యస్తా, భవన్తి ఫలదా మునేః ॥ 40 ॥
త్రిభి రేభి శ్చిరాఽభ్యస్తై స్త్రృట్యన్తి గ్రన్థయోఽఖిలాః ।

40-41. వాసనాక్షయ, మనోనాశ, తత్త్వజ్ఞానములు మూడింటిని, సమముగ చిరకాల మభ్యసించినచో, మననశీలుడగు మనుజునకు (మునికి), ఇవి ఫలదాయకములగును. ఈ మూడింటివి చిరకాల మభ్యసించిన, హృదయ గ్రంథులు నిశ్శేషముగా తెగిపోవును.

వాసనా సంపరిత్యాగసమం ప్రాణనిరోధనమ్ ॥ 41 ॥

41. ఫలమొసగుటలో ప్రాణవాయునిరోధనము, వాసనాసంపరిత్యాగముతో సమమైనది.

ప్రాణాయామ దృఢాభ్యాసై ర్యుక్త్యా చ గురుదత్తయా ।
ఆసనాఽశన యోగేన, ప్రాణస్పన్దో నిరుధ్యతే ॥ 42 ॥

42 దృఢమైన ప్రాణాయామాఽభ్యాసముల చేతను, యోగాభ్యాసకుశలులైన గురువు లుపదేశించిన యుక్తి చేతను, స్వస్తికాద్యాసనజయము చేతను, హితమితపవిత్రాహారము చేతను, యమనియ మాదియోగము చేతను, ప్రాణచలనము నిరుద్ధమగును.

అధ్యాత్మవిద్యాఽధిగమః, సాధుసఙ్గమ ఏవ చ ।
వాసనాసంపరిత్యాగః, ప్రాణస్పన్దనిరోధనమ్ ॥ 43 ॥
ఏతాస్తా యుక్తయః పుష్టా స్సన్తి చిత్తజయే కిల ।
చేత స్తే దీప ముత్సృజ్య, వినిఘ్నన్తి తమోఽఞ్జనైః ॥ 44 ॥

43-44. చిత్తజయమునకు అధ్యాత్మవిద్యాప్రాప్తి, సజ్జనసాంగత్యము, వాసనా సంపరిత్యాగము, ప్రాణచలననిరోధము - అను నీ ఉత్తమోపాయము లుండగా, వీని నాశ్రయింపక, హఠమున, బలవంతముగా చిత్తమును నిగ్రహింప దలచువారు దీపమును వదలి, కాటుకచే అంధకారమును నశింపజేయ వారగుదురు. (హఠమున చిత్తమును నిగ్రహించుట అసాధ్యము)

### 4. అధ్యాత్మవిచారః – పరమాత్మతత్త్వవిచారము

**తస్మాదేతాం పరిత్యజ్య, దుర్దృష్టిం రఘునన్దన ! ।**
**శుద్ధాం సంవిద మాశ్రిత్య వీతరాగః స్థిరో భవ! ॥ 45 ॥**

45. శ్రీరామా! హఠాదిలక్షణమగు చెడుదృష్టిని పరిత్యజించి, సర్వ దృశ్యముల యందును వ్యాపించి యున్న శుద్ధచైతన్యమును నాశ్రయించి, రాగద్వేష రహితుడవై, స్థిరముగ నుండుము.

**"కి మిదం స్యా జ్జగత్?, కిం స్యా దహ"? మిత్యనిశం శనైః ।**
**విచారయాఽధ్యాత్మదృశా, స్వయం వా సజ్జనైః సహ ॥ 46 ॥**

46. శ్రీరామా! "ఈ జగత్తనగా నేమి? ఈ దేహమనగా నేమి?"-అని నెమ్మదిగా, నిరంతరము **అధ్యాత్మదృష్టితో** స్వయముగనో, లేక, సజ్జనులతో గూడియో, **విచారణ** సల్పుచుండుము.

**విచారోత్థాఽఽత్మవిజ్ఞానం, జ్ఞానస్యాఽఙ్గం విదుర్బుధాః ।**
**జ్ఞానాఽభిగమ మాత్రేణ, స్వయం చిత్తం ప్రసీదతి ॥ 47 ॥**

47. విచారము వలన గలిగిన ఆత్మజ్ఞానమునే, విజ్ఞులు, పరమాత్మధ్యానము వలన సిద్ధించిన జ్ఞానము యొక్క అంగముగా భావింతురు.

**జ్ఞానప్రాప్తి మాత్రముననే, చిత్తము ప్రసన్నతను బొందుచున్నది.**

**అతత్త్వజ్ఞ మవిశ్రాన్త మలబ్ధాత్మాన మస్థితమ్ ।**
**వినిర్లున్త్రియాణ్యాఽఽశు, హరిణా ఇవ పల్లవమ్ ॥ 48 ॥**

48. **ఇంద్రియములు, తత్త్వము నెఱుగని వానిని, చిత్త విశ్రాంతి లేని వానిని, స్వస్వరూప స్థితి లేని వానిని, చంచలుని, హరిణములు (జింకలు), లేత చివుళ్లను వలె, శీఘ్రముగ కబళించివైచుచున్నవి.**

**సఙ్గః కారణ మర్థానాం, సఙ్గః సంసారకారణమ్ ।**
**సఙ్గః కారణ మాశానాం, సఙ్గః కారణ మాపదామ్ ॥ 49 ॥**

49. **సంగమే సర్వపదార్థములకు, సంసారమునకు, ఆశలకు, ఆపదలకును, మూలకారణమగుచున్నది.**

మలినా వాసనా యైషా, సా సజ్ఞ ఇతి కథ్యతే ।
జీవన్ముక్త శరీరాణా మపునర్జన్మకారిణీ ॥ 50 ॥
ముక్తా హర్షవిషాదాభ్యాం, శుద్ధా భవతి వాసనా ।

50. ఇష్టాఽనిష్టపదార్థముల సంయోగవియోగములందు, హర్షశోకాది వికారములను కలుగజేయు మలిన వాసనయే, సంగమని చెప్పబడినది. జీవన్ముక్తుల శరీరములకు, పునర్జన్మమును కలుగజేయనిదియు, హర్షవిషాద వివర్జితమునైన వాసనయే శుద్ధవాసన యగుచున్నది.

అజీవన్ముక్తరూపాణాం, దీనానాం మూఢచేతసామ్ ॥ 51 ॥
కథ్యతే సజ్గశబ్దేన, వాసనా భవకారిణీ ।

51-52. జీవన్ముక్తులు కానట్టి దీనులును, మూఢచిత్తులునైన వారి పునర్జన్మ కారిణియైన వాసన, సంగశబ్దముచే నిర్దేశింపబడినది.

సంపది విపది చాఽఽత్మా, యది తే లక్ష్యతే సమః ॥ 52 ॥
దుఃఖై ర్న గ్లాని మాయాసి, యది హృష్యసి నో సుఖైః ।
యథా ప్రాప్తాఽనువర్తీ చ, తదాఽసజ్గోఽసి రాఘవ ! ॥ 53 ॥

52-53. ఎపుడు, సంపదలందును, ఆపదలందునను, నీ చిత్తము సమముగా గాంచబడునో, దుఃఖములందు క్రుంగుట గాని, సుఖములందు పొంగుట గాని లేక, యథాప్రాప్తములగు క్రియలనాచరించుచుందువో, అపుడు శ్రీరామా! నీవు అసంగుడవై* యుందువు.

---

* పోల్చు :- "న చాఽస్య మహతీం లక్ష్మీం, రాజ్యనాశోఽ పకర్షతి ।
లోకకాన్తస్య కాన్తత్వాచ్ఛీత రశ్మేరివ క్షపా ।
న వనం గన్తుకామస్య, త్యజతశ్చ వసున్ధరామ్ ।
సర్వలోకాఽతిగస్యేవ, లక్ష్యతే చిత్తవిక్రియా ॥"
(వాల్మీకి రామాయణము – అయోధ్య – XIX - 32,33)
భువనసుందరుడైన శ్రీరాముని మహనీయమైన ముఖలక్ష్మిని, రాత్రి, చంద్రుని కాంతిని వలె, రాజ్యనాశము, క్షయింపజేయలేదు. రాజ్యము విడిచి వనమునకు పోవకోరుచున్న శ్రీరామునికి, సర్వలోకాతీతుడైన, మానావమానముల లక్ష్య పెట్టని మహాయోగీంద్రునికి వలె, చిత్తము వికారము

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే '<u>చిత్త ప్రశమనం</u>' నామ
ఏకోనవింశః సర్గః ।

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున '<u>చిత్త ప్రశమనము</u>'ను
ఏకోనవింశ (పందొమ్మిదవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



---

పొందుట కొప్పింపలేదు. శ్రీ రాముడు, వసిష్ఠమహర్షి చెంత, శాంతిశాస్త్రమును, ఆత్మవిద్యను అభ్యసించినాడు. పరిపూర్తిగా, ఈ విద్య వెలుగుటచే, మానవుడు సర్వావస్థల యందును సముడై, ఆత్మానందస్థితుడై, ప్రాప్తములైన లోకవ్యవహారములను అసంగుడై చక్కగా నాచరింపగలడు.

"For He had learned the Science of peace, the Science of the Self, that Science which once understood in its fulness, shows all earthly things indeed as empty without satisfying power, but also gives them their true place as helpers in the evolution of man. One who has thus learned is more diligent in work than the man of the world, though utterly indifferent to work's objects for himself, and rejoicing only in the Self."

[Sri Rama Chandra, The Ideal King –
Annie Besant - (1905) Chapter II - page – 26]

మఱియు చూడు :- శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహము XVIII సర్గము – 53, 54 శ్లోకముల వివరణ.

మఱియు పంచదశి IX - 87 శ్లో (విద్యారణ్యులు)

"ఏవం ధ్యానైక నిష్ఠోఽపి లేశా ల్లౌకిక మాచరేత్ ।
తత్త్వవి త్త్వవిరోధిత్వా ల్లౌకికం సమ్యగాచరేత్ ॥"

ధ్యానైకనిష్ఠుడు, లోకవ్యవహారమును స్వల్పముగ నాచరించును. కాని, బ్రహ్మవేత్త, లోకవ్యవహారము తన్ను బాధింపనందున, చక్కగా నాచరించును.

మఱియు చూడు :– సర్గ III – శ్లో–25. పాదటీక.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## వింశతితమసర్గము

## చిదాత్మభావనా – శుద్ధచైతన్యస్వరూపమగు ఆత్మధ్యానము

### 1. భ్రమకారణమ్ – భ్రాంతిహేతువు

వసిష్ఠ ఉవాచ :–
దిక్కాలాద్యనవచ్ఛిన్నం, శాన్తం చిన్మాత్ర మక్షయమ్ ।
బ్రహ్మైవాఽహమితి స్థిత్వా, మౌనీ స్వాఽఽత్మ సుఖో భవ ॥ 1 ॥

1. వసిష్ఠుడు:– శ్రీరామా! దేశకాలాదివిభాగరహితము, శాంతము, చిన్మాత్రము, అక్షయమునగు బ్రహ్మమే నేనవి, ధ్యానస్థితుడవై, మౌనివి, ఆత్మసుఖ సంపన్నుడవును, కమ్ము !

అజ్ఞానకలనా యావ ద్యావ దబ్రహ్మ భావనా ।
యావదాస్థా జగజ్జాలే, దృశ్యే యావచ్చ సత్యతా ॥ 2 ॥

దేహే యావ దహంభావ స్తావచ్చిత్తాదికల్పనా ।

2-3. ఎంత వఱకు, అజ్ఞాన కల్పనలు, బ్రహ్మ భావనా రాహిత్యము, జగత్పదార్థ జాలమున ఆస్థ (తత్పరత్వమగు ఆసక్తి), దృశ్యవిషయములందు సత్యత్వభావన, దేహమున అహమ్మమత్వబుద్ధియు నుండునో, అంత వఱకు, చిత్తము మొదలగు వాని విభ్రమకల్పనలును ఉండి తీరును. (చిత్తాదులు నశింపవు).

భోగేష్వనాస్థచిత్తస్య, శీతలాఽమల నిర్వృతేః ॥ 3 ॥
ఛిన్నాఽఽశాపాశజాలస్య, క్షీయతే చిత్తవిభ్రమః ।

3-4. విషయభోగము లం దనాసక్తచిత్తుడు, చల్లనై, నిర్మలమైన సుఖము (నిర్వృతి) కలవాడు, ఆశాపాశజాలములు తెగిపోయినవాడునైన మహాత్మునకు, చిత్తభ్రాంతి క్షీణించుచున్నది.

అన్తర్ముఖతయా సర్వం, చిద్వహ్నౌ త్రిజగత్తృణమ్ ॥ 4 ॥
జుహ్వతోఽన్తర్నివర్తన్తే, మునే శ్చిత్తాదివిభ్రమాః ।
చిత్తం జ్ఞానాఽగ్నినా దగ్ధం, న భూయః పరిరోహతి* ॥ 5 ॥

4-5. అంతర్ముఖుడై, త్రిలోకముల రూపముననున్న గడ్డిపోచలను చిదగ్నియందు హోమమొనర్చిన మునికి, చిత్తము మొదలగు భ్రాంతులు అంతరంగముననే నివర్తించును. జ్ఞానాగ్నిచే దగ్ధమైన చిత్తము, మరల నంకురింపదు.

సర్వేషామపి జీవానాం, స్థితై పైషా చిదవ్యయా ।
కిన్త్వబోధవశాదస్యాః, సర్వే కృపణతాం గతాః ॥ 6 ॥

---

* పోల్చు :- "విజ్ఞానమాత్రా దమలాఽద్వితీయతః ।
తస్మాదవిద్యా న పునర్భవిష్యతి, ।
యదిస్మ నష్టే న పునః ప్రసూయతే,
కర్తాఽహ మస్యేతి మతిః కథం భవేత్ ? " ।
[ శ్రీరామగీత – అధ్యాత్మ రామాయణము -VII-5-19-20]

పరమార్థతత్త్వము కేవలము జ్ఞానస్వరూపము, నిర్మలము, అద్వితీయమునని యెఱుగుట వలన, మరల అవిద్య ఉత్పన్నము కాజాలదు. నశించిన అవిద్యకు, పునర్జన్మము లేనందున, బ్రహ్మవేత్తకు, కర్తృత్వ బుద్ధి యెట్లు కలుగును?

6. అవ్యయమగు ఈ చిదాత్మ, సర్వజీవులందును నున్నది. కాని, తమ యందున్న ఆ చిదాత్మ నెఱుగమి చేత, నిరర్థకముగ నందఱును దైన్యమును పొందుచున్నారు.

**అజ్ఞాన మాపదాం నిష్ఠా, కా హి నాప దజానతః ? ।**
**ఇయం సంసారసరణి, ర్వహ త్యజ్ఞప్రమాదతః ॥ 7 ॥**

7. **అజ్ఞానమే** సకలాపదలకు **పరమావధి.** అజ్ఞానికి ఆపద కాని దేది? అజ్ఞుని ప్రమాదము వలననే, ఈ **సంసారసరణి** ప్రవహించుచున్నది. (నిరంతము కొనసాగుచున్నది) [అజ్ఞానము యొక్క హేయత్వమును ప్రదర్శించుటకు మాత్రమే అజ్ఞనిందనమొనర్పబడినది. దీనికి హేతువు కారుణ్యమే కాని, ద్వేషము కాదు]

**సంవేద్యేనాఽ పరామృష్టం, శాన్తం సర్వాత్మకం చ యత్ ।**
**తత్ సచ్చిదాభాసమయే మస్తీహ కలనోజ్ఝితమ్ ★ ॥ 8 ॥**

8. దృశ్యమగు జగదాకారముచే, నే సంబంధము లేనిదియు, శాంతము, సర్వాత్మకము, సర్వకల్పనా వివర్జితము, సచ్చిత్ప్రకాశ ప్రచురమునగు **సన్మాత్రము** (సర్గమునకు పూర్వము) ఉన్నది. [పరతత్త్వము జ్ఞేయ వివర్జితము. జ్ఞానము, మనోవ్యాపారము. అఖండ సచ్చిత్స్వరూపమగుటచే పరతత్త్వము, జ్ఞేయరహితము.]

## 2. అవిద్యా విభాగః – అవిద్య (ప్రకృతి) యందలి విభాగములు

**సముదేతి స్వతస్తస్మాత్, కలా కలనరూపిణీ ।**
**సూక్ష్మా మధ్యా, తథా స్థూలా, చేతి సా కల్ప్యతే త్రిధా ॥ 9 ॥**

9. ఈ పరబ్రహ్మము నుండి జగత్సంస్కారోద్బోధక సంకల్పరూపమగు కళ (చిదాభాసస్ఫూర్తి) తనంతనే, సృష్టికాలమున ఉదయించుచున్నది. ఈ కళయే, సూర్యతేజము, ప్రౌఢాతపము, (ముదురు ఎండ), మందాతపము,(లేతయెండ), ఛాయలు (నీడలు)గా, భావింపబడుచున్నట్లు **సూక్ష్మ, మధ్య, స్థూలములని,** మూడువిధములుగ కల్పింపబడుచున్నది.

★ పోల్చు :- "యత్రత్వస్య సర్వమాత్మైవాఽభూత్, తత్కేన కం పశ్యేత్? ॥ (బృ.ఉ-IV-5.15) సర్వము ఆత్మ అయినపుడు, దేనిచే దేనిని చూడవలెను? – కాన, అఖండమగు పరమార్థమున, జ్ఞాతృ జ్ఞేయాది కల్పన లుండుట అసంభవము.

సత్త్వం రజ స్తమ ఇతి, చైషైవ ప్రకృతిః స్మృతా ।
ఏషైవ సంసృతి ర్జన్తో రస్యాః పారం పరం పదమ్ ॥ 10 ॥

10. శుద్ధచైతన్యము నుండి కేవలము దృశ్యరూపమగు ఈ కళ, సత్త్వ రజస్తమోగుణమయమై, ప్రకృతియని భావింపబడినది. ఇదియే, జనన ధర్మము గల మనుజునకు సంసారరూపము. దీని పారమే – ఆవలి తీరమే – పరమ పదము.

అత్ర యే తు త్రయః, ప్రోక్తా, గుణాస్తేఽపి త్రిధా స్మృతాః ।
నవధైవం విభక్తేయ, మవిద్యా గుణభేదతః ॥ 11 ॥

11. ఇచ్చట పేర్కొనబడిన త్రిగుణములలో, మరల ఒక్కొక్కటియు, అవాంతర త్రైవిధ్యము పొందినది (మూడు విధములైనది). కనుక, గుణభేదము వలన **అవిద్యా (ప్రకృతి) విభాగములు, తొమ్మిది** (3 × 3 = 9) యగుచున్నవి.

సాత్త్వికస్యాఽస్య భాగస్య, నాగా విద్యాధరా స్తమః ।
రజస్తు, మునయ స్సిద్ధాః, సత్త్వం దేవా హరాదయః ॥ 12 ॥

12. ఈ అవాంతరవిభాగమున, సాత్త్వికభాగమున మరల, నాగులు, విద్యాధరులు, తమోంశ సంభూతులు. మునులు, సిద్ధులు రజోంశసంభూతులు. హరాదులగు దేవతలు, సత్త్వాంశ సంభూతులు

**శుద్ధం సత్త్వం హ్యవిద్యాయా, భాగో విద్యేతి కథ్యతే ।**
**తిష్ఠన్తి జ్ఞానినో ముక్తా, యావద్దేహం జగత్ స్థితౌ ॥ 13 ॥**

13. అవిద్య యందలి శుద్ధసత్త్వ భాగము విద్యయని వ్యవహరింపబడినది. ఈ సత్త్వాంశమునకు చెందిన జ్ఞానులు, ఈ జగత్స్థితి యందు, దేహ మున్నంత వఱకును జీవన్ముక్తులై యుందురు.

**మౌర్ఖ్యపిణ్డః స్థావరాది స్తమస్యా అవధిం గతః ।**
**తత్రాఽమనస్త్వ మప్రాప్త, మనస్త్వాదపి చ చ్యుతమ్ ॥ 14 ॥**

14 **తమోగుణము యొక్క పరమావధి నధిగమించిన స్థావరాదులు, (వృక్షములు పర్వతములు మొదలగునవి) ఘనీభవించిన మూర్ఖత్వపు ముద్దలు. ఈ తమోగుణపరాకాష్ఠ యందివి మనోవిముక్తిని (అమనస్త్వమును– సుషుప్తియందు వలె, సుఖదుఃఖసంవేదన లేని మనోలక్షణమును) పొందజాలవు; మనఃస్థితి (పూర్వాపరపరామర్శ సామర్థ్యముతో, మనవ యోగ్యతాలక్షణమగు స్థితి) నుండి కూడ ఇవి భ్రష్టమైనవి.**

**సుప్త పుర్యష్టకా*యత్ర, చిత్ స్థితా దుఃఖదాయినీ ।**
**మూకాఽన్ధ జడవత్తత్ర, సత్తామాత్రేణ తిష్ఠతి ॥ 15 ॥**

15. పుర్యష్టకముతోడి చైతన్యము నిద్రాణమై (వివేకశక్తి శూన్యమై) యున్న ఈ స్థితి, దుఃఖప్రతీకారశక్తి లేనిదగుట వలన అత్యంతదుఃఖదాయక మగుచున్నది. కర్మేంద్రియ,జ్ఞానేంద్రియ,మనఃప్రచారశూన్యము లగుటచే, మూకాంధజడములవలె నివి(స్థావరాదులు) సత్తామాత్రములై (కేవలము ఉనికి కలవియై) యున్నవి.

**శ్రీరామ ఉవాచ :-**

**సత్తా మాత్రేణ సంస్థానం, ముక్తేః సన్నిహితం ఖలు? ।**

16. శ్రీరాముడు :- సత్తామాత్ర స్థితి, ముక్తికి సన్నిహితము కదా?

**వసిష్ఠ ఉవాచ :-**

**బుద్ధి పూర్వం విచార్యైవ, యథా వస్త్వవలోకనాత్ । 16 ।**
**సత్తాసామాన్యబోధో యః, స మోక్షః స్యాత్ న చాఽన్యథా ।**

16-17. వసిష్ఠుడు :- బుద్ధిపూర్వకముగ తత్త్వవిచారమొనర్చుటచే సిద్ధించిన, తత్త్వసాక్షాత్కారము వలని సత్తాసామాన్య జ్ఞానము మాత్రమే, మోక్షమగును కాని, స్థావరాదులకు బుద్ధి పూర్వక విచారము లేమిచే, వాని స్థితి, మోక్ష స్థితి కాజాలదు.

**పరిజ్ఞాయ పరిత్యాగో, వాసనాసా మపేక్ష్యతే । 17 ।**
**అన్తః సుప్తా స్థితా మన్దా, యత్ర బీజ ఇవాఽఙ్కురః ।**
**వాసనా తత్ సుషుప్తత్వం, విద్ధి జన్మప్రదం పునః । 18 ।**

17-18. ఆత్మతత్త్వమును చక్కగా నెఱిగిన తరువాత, వాసనాపరిత్యాగము అపేక్షింపబడుచున్నది. బీజమందు అంకురమట్లు అంతఃసుప్తమై మూఢస్థితి

★ పుర్యష్టకము :- పంచతన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు), మనో,బుద్ధి, అహంకారములు, ఎనిమిది కలసి, పుర్యష్టకమనబడును. ఇది జీవుని శరీరము. ఇందు చైతన్యము నిద్రాణమై యున్నది. చైతన్యము ప్రబుద్ధము, లేక, ఉపాధివిముక్తమైనపుడు మాత్రమే, స్వస్వరూపమున ప్రకాశించుచున్నది.

యందున్న వాసనయే, సుషుప్తత్వమనియు, ఇది పునర్జన్మమునకు కారణమనియు, తెలియును.

**స్థావరాదయ ఏతే హి, సుషుప్తపదమాశ్రితాః ।**
**తేషా మన్తః స్థితా ఏవ, వాసనా బీజరూపతః ॥ 19 ॥**

19. శిలలు, వృక్షముల వంటి స్థావరాదులు, సుషుప్తాఽవస్థను ఆశ్రయించి యున్నవి. వీని యందు వాసనలు, బీజరూపమున అణగి యుండునే కాని, నశింపవు.

**యత్రాఽస్తి వాసనాబీజం, తత్ సుషుప్తం* న సిద్ధయే ।**
**నిర్బీజా వాసనా యత్ర, తత్తుర్యం సిద్ధిదం స్మృతమ్ ॥ 20 ॥**

20. వాసన, బీజరూపమున అణగి యుండుటయే సుషుప్తాఽవస్థ. ఇది సిద్ధిప్రదము కాదు. వాసన, బీజరహితమై (జ్ఞానాగ్నిదగ్ధబీజశక్తియై), సమూలముగ నశించిన స్థితియే, తురీయావస్థ. ఇది సిద్ధిప్రదమని భావింపబడినది.

**వాసనాయా స్తథా వహ్నేః, ఋణవ్యాధిద్విషామపి ।**
**స్నేహ వైర విషాణాం చ, శేషః స్వల్పోఽపి బాధతే ॥ 21 ॥**

21. వాసన, స్వల్పముగనైనను శేషించి యున్నచో, అది, అగ్ని, ఋణ, వ్యాధి, శత్రు, స్నేహ, వైర, విషశేషముల వలె, క్రమాభివృద్ధి నొంది, మహానర్థ హేతువు కాగలదు. (వానిని, నిశ్శేషముగ క్షయింపజేయుట కర్తవ్యము.)

**నిర్దగ్ధవాసనాబీజః, సత్తాసామాన్యరూపవాన్ ।**
**సదేహో వా విదేహో వా, న భూయో దుఃఖ భాగ్భవేత్ ॥ 22 ॥**

22. వాసనాబీజమును, జ్ఞానాగ్నిచే పూర్తిగ దగ్ధమొనర్చి, సత్తాసామాన్య స్వరూప మొందిన జ్ఞాని, సశరీరుడైనను అశరీరుడైనను, మరల దుఃఖము పాలు కాడు.

**ఆత్మదృష్టి రదృష్టైషా, సంసారభ్రమదాయినీ ।**
**దృష్టా సతీ సమగ్రాణాం, దుఃఖానాం క్షయకారిణీ ॥ 23 ॥**

---

★ "సుషుప్త్యాఖ్యం తమోఽజ్ఞానం బీజం స్వప్న ప్రబోధయోః ।
స్వాత్మబోధప్రదగ్ధం స్యాద్బీజం దగ్ధం యథాఽభవమ్" [శంకరుడు–ఉపదేశసాహస్రి- XVII-26]
సుషుప్తి (గాఢనిద్ర) యనబడు, తమస్సు, అజ్ఞానము, స్వప్న జాగ్రదవస్థలకు బీజము. ఇది ఆత్మజ్ఞానాగ్నిచే దగ్ధమై, దగ్ధబీజమట్లు మరల నంకురింపదు–జన్మాదులకు హేతువు కాజాలదు. (చూడు:- సర్గ–7–శ్లో.58.పాదటీక)

23. ఆత్మదృష్టి(ఆత్మజ్ఞానము) అభివ్యక్తము కాకుండుటే, సంసార భ్రమను కల్గించును. అది అభివ్యక్తమైనచో, సర్వదుఃఖములను నశింపజేయుచున్నది.

**అస్యాస్త్వదర్శనం యత్త దవిద్యేత్యుచ్యతే బుధైః ।**
**అవిద్యా హి జగద్ధేతు, స్తతః సర్వం ప్రవర్తతే ॥ 24 ॥**

24. ఆత్మదృష్టి(ఆత్మజ్ఞానము) అభివ్యక్తము కాకుండుటే, **అవిద్య** యని జ్ఞానులు వచింతురు. ఈ **అవిద్యయే జగత్కారణము.** దీని నుండియే సర్వము నుద్భవించుచున్నది.

### 3. అనుసన్ధానక్రమః – సూక్ష్మవిచారణ (అన్వేషణ) క్రమము

**ఏతావదేవాఽ విద్యాత్వం, నేదం బ్రహ్మేతి నిశ్చయః ।**
**ఏష ఏవ క్షయోఽస్యాః యద్బ్రహ్మే దమితి నిశ్చయః ॥ 25 ॥**

25. 'ఇది(ప్రపంచము) బ్రహ్మము కాద'ను నిశ్చయమే అవిద్యాస్వరూపము. 'ఇదంతయు బ్రహ్మమే' యను నిశ్చయమే అవిద్యాక్షయము.

**అభ్యాసేన* వినా రామ!, నోదేతి బ్రహ్మ భావనా ।**
**బ్రహ్మ చిద్బ్రహ్మ భువనం, బ్రహ్మ భూతపరమ్పరా ॥ 26 ॥**
**బ్రహ్మాఽహం బ్రహ్మ మచ్ఛత్రుర్బ్రహ్మ మన్మిత్ర బాన్ధవాః ।**
**సర్వమేవ హి బ్రహ్మేతి, భావితేఽతిసుఖీ కిల ॥ 27 ॥**

26-27. శ్రవణమననాది అభ్యాసము లేకున్న, బ్రహ్మభావన, ఉదయింపదు. "బ్రహ్మమే శుద్ధచైతన్యము. ఈ భువనము (జగత్తు) బ్రహ్మమే. జీవకోటులు బ్రహ్మమే. నేనును బ్రహ్మమే. బ్రహ్మమే నా శత్రువులును.

---

★ **ఆవృత్తి రసకృదుపదేశాత్ ।** [బ్ర.సూ. IV-1-1]
**శ్రుతులు పలుమా ఉపదేశించి యుండుట వలన, ఆత్మను గురించిన శ్రవణ మనన నిదిధ్యాసనముల ఆవృత్తి (అభ్యాసము) అవసరము.**
చూడు:- **"ఆత్మా వా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మన్తవ్యో, నిదిధ్యాసితవ్యః ।"** (బృ.ఉ. II-4.5)
**"త మేవ ధీరో విజ్ఞాయ, ప్రజ్ఞాం కుర్వీత ।"** (బృ.ఉ. IV-4-21)
**"సోఽన్వేష్టవ్యః, స విజిజ్ఞాసితవ్యః ।"** (ఛాం.ఉ.VIII-7-1)
**ఇత్యాది శ్రుతులు బ్రహ్మాభ్యాసమును ఉపదేశించుచున్నవి.**

నా మిత్రబాంధవులును బ్రహ్మమే. సర్వమును బ్రహ్మమే" యని ధ్యానించువాడే అత్యంత సుఖవంతుడు.

దుఃఖౌఘమయ మజ్ఞస్య, జ్ఞస్యాఽఽనన్దమయం జగత్ ।
అన్ధం భువన మన్ధస్య, ప్రకాశం తు సచక్షుషః ★ । 28 ।

28. అజ్ఞానికి, ఈ సర్వజగము దుఃఖప్రవాహమయము. తత్త్వవిదుడగు జ్ఞానికి, ఇది ఆనందైక రసమయము. అంధున కీభువనము, అంధకార మయము. కాని చక్షుఃశాలికి (కనులున్నవానికి) ఇది ప్రకాశమయము.

"ప్రశాన్తసర్వసఙ్కల్పం, చిదాత్మాన ముపాస్మహే ।
శబ్దరూపరసస్పర్శగన్ధై రాభాసమాగతమ్ । 29 ।
తైరేవ రహితం శాన్తం, చిదాత్మాన ముపాస్మహే ।
మహామహిమసంయుక్తం, రహితం సర్వభూతిభిః । 30 ।
కర్తృత్వే వాఽప్యకర్తారం, చిదాత్మాన ముపాస్మహే ।"

29-31. "సర్వసంకల్ప శూన్యమగు చిదాత్మను ఉపాసించు(ధ్యానించు)చున్నాము. శబ్దస్పర్శరూపరసగంధములచే అభివ్యక్తమయ్యును, తచ్ఛూన్యమును, శాంతమునగు చిదాత్మను ఉపాసించు (ధ్యానించు)చున్నాము. మహామహిమశాలి యయ్యును, ఐశ్వర్య(అణిమాదికమగు అష్టసిద్ధులు) రహితమును, సర్వకర్తయయ్యును, అకర్తయునగు చిదాత్మను ఉపాసించు (ధ్యానించు)చున్నాము."

ఇతి నిశ్చిత్య యే సత్యే, పదే సుఖ మవస్థితాః । 31 ।
న నన్దన్తి న నిన్దన్తి, జీవితం మరణం తథా ।

---

★ పోల్చు :- దీఘా జాగరతో రత్తి, దీఘం సన్తస్స యోజనం ।
దీఘో బాలానం సంసారో, సద్ధమ్మం అవిజానతం ।　(ధమ్మపదం -60)
నిద్రరాని వానికి రాత్రి, దీర్ఘము. అలసిన వానికి, యోజనము దీర్ఘము. సద్ధర్మ మెఱుగని మూర్ఖులకు సంసారము దీర్ఘము.
చూడు:– ధమ్మపదము (1994) – డా॥ రత్నాకరం బాలరాజు
పుటలు 37–38 పాదటీకలు.
మఱియు :- "యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః, సదాఽశుచిః ।
న స తత్పద మాప్నోతి, సంసారం చాఽధిగచ్ఛతి ।" (కఠ. ఉ. III-7)
వివేకహీనుడు, మనోనిగ్రహరహితుడు, అపవిత్రుడునైనవాడు, ఆ మోక్షపదమును పొందజాలడు. జననమరణాదిలక్షణమగు సంసారమునే పొందుచున్నాడు.

మనస్త్వేషాం తు నీరాగ మనుపాధి గతభ్రమమ్ । 32 ।
అసక్తం ముక్త మాశాన్తం, పరం సత్త్వపదం గతమ్ ।

31-33. ఇట్లు నిశ్చయించి, సత్యపదమున సుఖముగ విలసిల్లు మహాత్ములు, జీవితమును ప్రశంసింపరు; మరణమును నిందింపరు. వారి చిత్తము రాగద్వేషశూన్యము, నిరుపాధికము, (దేశకాలాదిశూన్యము) భ్రమ రహితము, ఆసక్తిశూన్యము, ముక్తము,పరిపూర్ణశాంతమునై, పరమసత్త్వ పదము పొందియున్నది.

ప్రాకృతాచార సంప్రాప్తే, కుర్వన్తః కర్మ కేవలమ్ । 33 ॥
స్థితా విగత సంరమ్భ మపరా ఇవ మేరవః ।

33-34. తమ తమ వర్ణోచిత (స్వభావోచిత) ఆచారములు ప్రాప్తించగా, ఆ కర్మలను, పూర్తిగ నాచరించుచు, ఆవేగరహితులై, అపరమేరు పర్వతముల వలె వారు, అప్రకంపనులై యుందురు.

### 4. ద్వివిధో యోగః – యోగము రెండు విధములు

శ్రీరామ ఉవాచ :–

ప్రాణస్పన్దనిరోధేన, వాసనా విలయోదయే । 34 ।
జీవన్ముక్తపదే బ్రహ్మన్! వద విశ్రమ్యతే కథమ్? ।

34-35. శ్రీరాముడు :– స్వామీ! ప్రాణవాయుచలననిరోధముచేత, వాసనా (సంస్కార) క్షయము సిద్ధింపగా, జీవన్ముక్త పదమున విశ్రాంతిని పొందు విధము నెఱిగింపుడు.

వసిష్ఠ ఉవాచ :–

సంసారతరణే యుక్తి ర్యోగ శబ్దేన కథ్యతే । 35 ।
తాం విద్ధి ద్విప్రకారం త్వం, చిత్తోపశమధర్మిణీమ్ ’ ।
ఆత్మజ్ఞానప్రకారోఽథ, ప్రాణానాం సంయమ స్తథా । 36 ।

35-36. వసిష్ఠుడు :– సంసార తరణోపాయమే ‘యోగ’ శబ్దముచేత చెప్పబడినది. ఈ యోగము చిత్త విశ్రాంతిని కల్గించు స్వభావము కలది. (1) ఆత్మ జ్ఞానము, (2) ప్రాణచలననిరోధము, అని ఇది రెండు విధములు.

ప్రకారౌ ద్వావపి ప్రోక్తౌ, యోగశబ్దేన యద్యపి ।
తథాఽపి రూఢిమాయాతః, ప్రాణయుక్తావసౌ భృశమ్ ॥ 37 ॥

37. యోగశబ్దము చేత ఈ రెండు ప్రకారములును చెప్పబడియున్నను, యోగశబ్దము, ప్రాణవాయునిరోధము నందధికముగ రూఢమై యున్నది.

సమావుపాయౌ శాస్త్రోక్తౌ, నూన మేక ఫలప్రదౌ ।
అసాధ్యః కస్యచిద్యోగః, కస్యచిద్ జ్ఞాననిశ్చయః ॥ 38 ॥

38. శాస్త్రోక్తములైన ఈ యుపాయములు రెండును సమములు. ఇవి ప్రసాదించు ఫలమును ఒక్కటియే. కాని, కొందఱకు యోగము అసాధ్యము. మఱికొందఱకు జ్ఞానవిచారము, అసాధ్యము.

మమ త్వభిమతో రామ!, సుసాధ్యో జ్ఞాననిశ్చయః ।
తయోః జ్ఞానం తవప్రోక్తం, యోగోఽయం ప్రోచ్యతే శృణు ॥ 39 ॥

39. కాని, శ్రీరామా! జ్ఞాన విచారము, (శుద్ధచిత్తుడును, విచారకుశలుడునగు వానికి) సుసాధ్యమే యని నా అభిమతము. ఈ రెంటిలో జ్ఞానము నీ కెఱిగింపబడినది. ఇపుడు యోగమును వివరింతును, వినుము.

*ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'చిదాత్మభావనా' నామ వింశః సర్గః ।*

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'చిదాత్మ భావన'యను
వింశ (ఇరువదవ) సర్గము సమాప్తము

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ఏకవింశసర్గము

## భుశుణ్డోపాఖ్యానమ్ – భుశుండుని వృత్తాంతము

### 1. భుశుణ్డోత్పత్తిః –భుశుండుని జననము

వసిష్ఠ ఉవాచ :–
అత్ర తే కథయిష్యామి, వృత్తాన్తం పరమాఽద్భుతమ్ ।
శాతాఽఽతపో మునిః ప్రాహ, పురాఽఽస్థానే శతక్రతోః ॥ 1 ॥

1. వసిష్ఠుడు :– ఈ విషయమున పరమాద్భుతమైన వృత్తాంతమును నీ కెఱిగింతును. పూర్వము దేవేంద్రుని సభ యందు, శాతాతపుడను నొక ముని దీనిని వచించెను.

"మేరో రీశానకోణస్థ కల్పవృక్షస్య* మూర్ధని ।

★ కల్పవృక్షము – మందారము, పారిజాతము, సంతానము, హరిచందనము, కల్పవృక్షము నను ఈ (5) ఐదును దేవవృక్షములు; కోరిన కోర్కులను ప్రసాదించునవి.
"పఞ్చైతే దేవతరవో, మన్దారః, పారిజాతకః ।
సన్తానః కల్పవృక్షశ్చ పుంసి వా హరిచన్దనమ్ ॥" (అమరకోశము -I-50)

కశ్చి న్నివసతి శ్రీమాన్, భుశుణ్డో నామ వాయసః । 2 ।

2. మేరు పర్వతముయొక్క ఈశాన్య దిగ్భాగమున నున్న కల్ప వృక్షముపై భుశుండు డను పేరు గల వివేకవంత మగు కాక మొకటి నివసించుచుండును.

స విశ్రాన్తమతిః శాన్తో, వీతరాగో మహామతిః ।
చిరంజీవీ తథా స్వర్గే, న భూతో న భవిష్యతి" । 3 ।

3. ఆ వాయసరాజు, పరమమగు చిత్తవిశ్రాంతి నొందిన వాడు, శాంతుడు, రాగద్వేషరహితుడు, మహామతి, చిరంజీవి. అట్టిచిరంజీవి, స్వర్గలోకమున, గతమున లేడు; భవిష్యమున ఉండబోడు."

ఇదం శ్రుత్వా చ తం ద్రష్టు మహం యాతః కుతూహలాత్ ।
కల్పద్రుమస్థ మద్రాక్షం, భుశుణ్డం, ద్విజ*సేవితమ్ । 4 ।

4. ఇది విని, నేను, కుతూహలమున ఆ వాయసమును దర్శించుట కేగితిని. కల్పవృక్షమున ద్విజసేవితుడై యున్న భుశుండుని గాంచితిని.

అశఙ్కిత మపి ప్రాప్తం, వసిష్ఠ మవబుధ్య మామ్ ।
అర్ఘ్యపాద్యాది సంపాద్య, మా మువాచ ఖగాఽధిపః । 5 ।

5. అవితర్కితముగ, అసంభావితముగా, ప్రాప్తించిన వాడనై నను, నన్ను వసిష్ఠుడని యెఱిగి, ఆవాయసరాజు, అర్ఘ్యపాద్యాదులు సమర్పించి, నాతో నిట్లన్నాడు.

"కిమర్థ మద్యాఽఽగమన మాజ్ఞాం మే దాతు మర్హసి । "
ఇత్యుక్తోఽహం తదాఽపృచ్ఛం, "జాతః కస్మిన్ కులే భవాన్? । 6 ।
కియ దాయుశ్చ తే? సాధో!, జ్ఞాతజ్ఞేయః కథం భవాన్? " ।
ఇతి పృష్టో భుశుణ్డోఽసౌ, ప్రవక్తు ముపచక్రమే । 7 ।

6-7. "ఇపుడు మీ ఆగమనమునకు హేతువేది? నన్నాజ్ఞాపించుటకు మీ రర్హులు." అత డిట్లనగా, నే నపుడతని నిట్లు ప్రశ్నించితిని. "ఏ వంశమున నీవు జన్మించితివి? సౌమ్యుడా! నీ ఆయువెంత? పూజ్యుడవైన నీవు ఎఱుగ వలసిన తత్త్వము (పరమాత్మ) నెట్లెఱిగితివి?" - ఇట్లు ప్రశ్నింపబడి, భుశుండుడు చెప్పుట కుపక్రమించినాడు.

---
* ద్విజులు :- బ్రాహ్మణులు; పక్షులు.

భుశుణ్డ ఉవాచ :—

"హరస్య ప్రమథా యద్వత్, పరివారో హి మాతరః।
జయా, చ విజయా, చైవ, జయన్తీ, చాఽపరాజితా, । 8 ।
సిద్ధా, రక్తాఽలంబుసా, చాప్యుత్పలా, చేతి విశ్రుతాః।
కదా చిన్మిళితా చక్రు రుత్సవం పరమం ముదా । 9 ।

8-9. భుశుండుడు :—"శివునకు ప్రమథగణముల వలెనే, మాతృకాపరివారమును కలదు. జయ, విజయ, జయంతి, అపరాజిత, సిద్ధ, రక్త, అలంబుస, ఉత్పల, యని ఆ మాతృకల పేర్లు. ఒకప్పుడు వారందఱును నొకచో కలసికొని, ఆనందమున పరమోత్సవము సల్పినారు.

తదా తాసాం చ వాహశ్చ, ననృతుః సపు రాసవమ్।
వజ్రాస్థితుణ్డ శ్చణ్డాఖ్యః, కాకోఽహ్యలంబుసారథః । 10 ।

10. అపుడు, వారి వాహనములగు పక్షులును, ఆసవ పానమొనర్చి, నృత్యము చేయసాగినవి. వజ్రసదృశమగు అస్థితుండము గల చండుడను పేరు గల వాయసము, అలంబుసకు వాహనము.

రథహంస్యః స్థితా బ్రాహ్మ్యాః తేన కాకేన రేమిరే।
అథ తా గర్భధారిణ్యః, సువతే స్మాఽణ్డ జాన్ క్రమాత్ । 11 ।
వైరిఞ్చే సరసి స్ఫారే, తనయా నేకవింశతిమ్।

11-12. బ్రాహ్మిశక్తికి (సరస్వతికి) వాహనములైన ఆడు హంసలు, ఆ వాయసముతో రమించినవి. ఆ హంసాంగనలు గర్భమును దాల్చి, కాలక్రమమున సత్యలోకమునందలి బ్రహ్మదేవుని విశాలసరస్సున ఇరువదియొక్కరు (21) పుత్రులను (పక్షులను) ప్రసవించినవి. [కైలాసగిరిపైని మానస సరోవరము, హంసల నివాసమని పురాణములు పేర్కొనును]

ఏవం తాభ్య స్తు హంసీభ్యో, జాతా వయ మిమే మునే ! । 12 ।

12. మునీంద్రా! ఆ హంసాంగనల నుండి మేమిట్లు జనించితిమి.

2. కల్పాఽన్తేషు స్థితిః – కల్పాంతములందును అవిచ్ఛిన్న స్థితి.

మాతృభిః సహ హంసీభి, ర్బ్రాహ్మీ భగవతీ తతః ।
చిర మారాధితాఽ స్మాభిః, ప్రసాదపరయా తతః ॥ 13 ॥
తథైవాఽనుగృహీతాః స్మో, యథా ముక్తా వయం స్థితా ః ।

13-14. తరువాత, మా తల్లులైన హంసవధువుల చేతను, మా చేతను, భగవతి యగు బ్రాహ్మి (సరస్వతి), చిరకాల మారాధింపబడినది. అంతట, కేవలము ప్రసన్నురాలైన వాణిచే, మేము ముక్తస్థితి నొందునట్లు అనుగ్రహింపబడితిమి.

'సంతృప్త మనసః శాన్తా స్త్వేకాన్తే ధ్యానసంస్థితా ॥ 14 ॥
తిష్ఠామ' ఇతి నిశ్చిత్య, పితుః పార్శ్వే వయం గతా ః ।

14-15. 'సంతృప్తమనస్కులము, శాంతులమునై, ఏకాంతస్థలమున ధ్యాన సమాధినిష్ఠులమై యుందుము గాక!?' – అని నిశ్చయించు కొని పితృ సన్నిధి కరిగితిమి.

తేనాఽయం సర్వబాధానా మగమ్యః కల్పపాదపః ॥ 15 ॥
కథితం స్థాన మస్మాకం, తిష్ఠామోఽత్ర గతజ్వరాః ।
అద్య మే సఫలం పుణ్యం, భవదాగమనేన హి" ॥ 16 ॥

15-16. సర్వబాధలకును అగమ్యమగు ఈ కల్పవృక్షము, మాకు నివాస స్థానముగ ఆతనిచే నిర్దేశింపబడినది. ఇచ్చట మేము తాప (ఉద్వేగ) రహితులమై వసించుచున్నాము. పూజ్యులగు మీ ఆగమనముచే, నా పుణ్యము నేడు విశేషముగ ఫలించినది."

ఇత్యుక్త్వోపరతే తస్మి, న్నిదం రామాఽహ ముక్తవాన్ ।
"భ్రాతరస్తే విహఙ్గేశ! తాదృశస్త్వా మహాధియః ॥ 17 ॥
ఇహ కస్మాన్న దృశ్యన్తే?, త్వమేవైకో హి దృశ్యసే ।"

17-18. శ్రీరామా! ఇట్లు వచించి విరమించిన అతనితో నేనిట్లు పలికితిని. "విహంగరాజా! మీ వలెనే సత్త్వసంపన్నులు, మహాధీమంతులునైన మీ

సోదరులిచట కాన్పింపకుండుటకు హేతువేమి? నీ వొక్కడవు మాత్రమే ఇట కాన్పించుచున్నావు"

భుశుణ్డ ఉవాచ :—

"తిష్ఠతా మిహ నః కాలో, మహా నతిగతో మునే ! ॥ 18 ॥
యుగానాం పఙ్క్తయః క్షీణాః, కల్పానాం* చ మహామతే ! ।

18-19. భుశుండుడు :—"మహామతివగు మునీంద్రా! ఇచ్చట నివసించుచున్న మాకు, దీర్ఘకాలము కడచిపోయినది. యుగసమూహములు, బ్రహ్మ కల్పసమూహములును గతించినవి.

ఏతావతా చ కాలేన, సర్వ ఏవ మమాఽనుజాః ॥ 19 ॥
తనూ స్తృణమివ త్యక్త్వా, శివే పరిణతాః పదే ।

19-20. అంతటి దీర్ఘకాలమున, నా సోదరు లందఱును, శరీరములను తృణము వలె త్యజించి శివ (పరమాత్మ) పదమును పొందిరి.

దీర్ఘయుషో మహాన్తోఽపి, సన్తోఽపి బలినోఽపి చ ॥ 20 ॥
సర్వ ఏవ విగీర్యన్తే, కాలేనాఽకలితాత్మనా ।"

20-21. దీర్ఘాయువులును, మహాత్ములును, సజ్జనులును, బలవంతులునైనను, అందఱును, అలక్షితస్వరూపమగు కాలముచే కబళింపబడివారు."

---

★ పురాణ సంహితల ననుసరించి, బ్రహ్మదేవునకొక దినము (పగలు) అగు ప్రతికల్పము యొక్క అంతమున, ఈ విశ్వము లయమగుచున్నది. 1000 (వేయి) చతుర్యుగ(మహాయుగ)ములు, విధాతకు ఒక దినము (పగలు). రాత్రి కాలము సైతము, 1000 (వేయి) చతుర్యుగములు (మహాయుగములు) కృత, త్రేతా, ద్వాపర, కలి యుగములు, నాల్గును కలిసి, ఒక చతుర్యగ (మహా యుగ) మనబడును. మానవ కాలమానము ననుసరించి, 4320000000 సంవత్సరములు, (వేయిచతుర్యుగములు) బ్రహ్మ దేవునికొక పగలని చెప్పబడినది. ఇదియే కల్పమనబడును. కృత, త్రేతా, ద్వాపర, కలి యుగముల కాలపరిమితి మానవ సంవత్సరములలో క్రమముగ 1728000, 1296000, 864000, 432000 సంవత్సరములు. కలియుగాది గతాబ్దములు నేటికి (1996-97) 5097 సంలనియు, సృష్ట్యాది గతాబ్దములు 195, 58, 85096. [195 కోట్ల, 58 లక్షల 85 వేల 97 సౌర సంవత్సరములు.]

ఇత్యుక్తేన మయా పృష్టో, భుశుణ్డో వాయసాఽధిపః । 21 ।
"కల్పాన్తేషు మహాబుద్ధే!, వహత్సూత్పాతవాయుషు ।
ప్రతపత్స్విన్దు భార్కేషు,[1] కథం తిష్ఠసి విజ్వరః?" । 22 ।

**21-22.** ఇట్లు భుశుండుడు వచింపగా, నే నా వాయసరాజునిట్లు ప్రశ్నించితిని. "మహామతీ! ప్రళయోత్పాతవాయువులు వీచు చుండగా, నక్షత్ర రాశులు, చంద్రసూర్యులు మండిపోవుచుండగా, ఆ కల్పాంత సమయమునందు తాపరహితుడవై (అనుద్వేగమనస్కుడవై) నీవెట్లుండగల్గితివి?"

భుశుణ్డ ఉవాచ :—

"యదా శామ్యతి కల్పాన్తే, వ్యవహారో జగద్గతః ।
ఆకాశ ఏవ తిష్ఠామి, విగతాఽఖిల కల్పనః । 23 ।

**23.** భుశుండుడు :- "కల్పాంతమున జగద్వ్యవహారము ఉపశమింపగా, (అణగిపోగా), సర్వసంస్కారవాసనా రహితుడనై, ఆకాశమునందే నిలిచి యుందును.

ప్రతపన్తి యదాఽఽదిత్యా వ్యోమాఙ్గణగతో హ్యహమ్ ।
వారుణీం ధారణాం[2] బద్ధ్వా, తదా తిష్ఠామి ధీరధీః । 24 ।

**24.** ద్వాదశాదిత్యులు మండిపోవునపుడు, ఆకాశాంగణమున, సమాహిత మనస్కుడనై, అత్యంతశీతలుడు, సర్వదిగ్వ్యాపి, అపరిచ్ఛేద్య జలాత్ముడు

---

(1) ఇన్దౌ, శేషు నక్షత్రేషు, అర్కేషు చ ప్రతపత్సు । [యో.వా.తా.ప్ర]
(2) పోల్చు :- "దేశబన్ధశ్చిత్తస్య ధారణా । [పా.యో.ద. III-1]
చిత్తమును, విషయాంతరములను పరిహరించి, ఏక వస్తువున బంధించి, స్థిరీకరించుట, 'ధారణ' (Concentration) యనబడును. యమనియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార సిద్ధి అనంతరము, చిత్తము నిట్లు స్థిరీకరించుట కర్తవ్యము.
బాహ్యే వా విషయే చిత్తస్య వృత్తి మాత్రేణ
బన్ధ ఇతి ధారణా ।[వ్యాస భాష్యము - యో.ద. III-1]
బాహ్య విషయము నందుగాని, చిత్తవృత్తిని స్థిరముగ నిలుపుట ధారణ యనబడును. లేక, తనకు ఇష్టమైన దేవతామూర్తిపై చిత్తమును స్థిరముగ కేంద్రీకరించుటయును ధారణ యనబడును.
ఇందు వలన కల్గు సిద్ధులను పతంజలి మహర్షి తన యోగదర్శనమున (III) విభూతి పాదమున విపులముగ నుపదేశించినాడు.

నగు 'వరుణుడను నేనే'నని చిత్తమున, నిరంతరము 'వారుణీ' ధారణ నొనర్చి, నిలిచియుందును.

**యదా శకలితాఽద్రీన్ద్రా, వాన్తి ప్రళయవాయవః ।**
**పార్వతీం ధారణాం బద్ధ్వా, ఖే తిష్ఠా మ్యచలం తదా । 25 ।**

**25.** పర్వతములను శకలములుగా నొనర్చుచు, ప్రళయవాయువులు వీచునపుడు, పర్వతసంబంధమైన ('పార్వతీ') ధారణ యందు చిత్తమును బంధించి, 'నేనే పర్వతమ'ని సంకల్పించి, అచలముగ ఆకాశమున నిలిచి యుందును.

**జగద్గళితమేర్వాది, యా త్యేకార్ణవతాం యదా ।**
**వాయవీం ధారణాం బద్ధ్వా, సంప్లవేఽచలధీ స్తదా । 26 ।**

**26.** మేర్వాదిగిరులు జగత్తు నుండి గళితములై, కరగిపోయి, జగత్తు, ఏకార్ణవమైనపుడు, నేను వాయు సంబంధమైన('వాయవీ') ధారణయందు చిత్తమును బంధించి 'నేనే వాయువ'ని సంకల్పించి అచల బుద్ధినై ఆ ప్రళయార్ణవమున తేలుచుందును.

**బ్రహ్మాణ్డపార మాసాద్య, తత్త్వాన్తే విమలే పదే ।**
**సుషుప్తాఽవస్థయా తావత్తిష్ఠామ్యచలరూపయా । 27 ।**

**27.** స్థూల సూక్ష్మ సమష్టియగు బ్రహ్మాండము యొక్క ఆవలి పారమును, పరమావధిని చేరి, సకల తత్త్వాంతమగు 'భూమా'ఖ్యమగు పరమపావన పదమున సుషుప్తావస్థ యనదగు నీకరస నిర్వికల్ప సమాధి నాశ్రయించి, నిశ్చలుడనై, (తరువాతి ప్రపంచము సృజింపబడు వఱకు నట్లే) నిలిచి యుందును.

### 3. విచిత్రాఽనుభవ : – ఆశ్చర్యకర నానావిధాఽనుభూతి

**యావత్పునః కమలజః, సృష్టికర్మణి తిష్ఠతి ।**
**తావత్ప్రవిశ్య బ్రహ్మాణ్డం, తిష్ఠామి విహగాఽఽలయే । 28 ।**

**28.** బ్రహ్మ, మరల సృష్టికార్యమును ప్రారంభించునంత వఱకును, అట్లే

యుండి, సృష్టి కాగానే - మరల బ్రహ్మాండమున ప్రవేశించి, ఈ విహగాలయము (ఈ కల్పవృక్షకులాయము)న నెలకొనియుందును.

మత్సఙ్కల్ప వశేనైవ, కల్పే కల్పే పునః పునః ।
అస్మిన్నేవ గిరేః శృఙ్గే, తరు రిత్థం భవత్యయమ్" ॥ 29 ॥

29. ప్రతికల్పము నందును, మరల మరల, నా సంకల్ప బలముననే, ఈ గిరిశిఖరము నందే, ఈ కల్పవృక్షము జనించుచున్నది."

వసిష్ఠ ఉవాచ :-

"యథా తిష్ఠసి పక్షీన్ద్ర! ధారణాభి రఖణ్డితః ।
కల్పాన్తేషు తథా కస్మా న్నాఽన్యే తిష్ఠన్తి యోగినః ?" ॥ 30 ॥

30. వసిష్ఠుడు :- "పక్షీంద్రా! ధారణాదులచే అఖండితముగ, కల్పాంతములందు నీ వుండునట్లు, ఇతర యోగు లేకారణమున నుండుట లేదు?"

భుశుణ్డ ఉవాచ :-

"బ్రహ్మన్! నియతి రేషా హి, దుర్లఙ్ఘ్యా పారమేశ్వరీ ।
ఈదృశేన మయా భావ్యం, భావ్యం నాఽన్యైశ్చ తాదృశైః" ॥ 31 ॥

31. భుశుండుడు :- "స్వామీ! తత్తత్ప్రారబ్ధానుసారిణియు, సత్యసంకల్ప రూపయునగు, పరమేశ్వరుని నియతి దీనికి కారణము. అది అనుల్లంఘనీయము. ఈదృశుడగు నాచే నిది భావ్యము. కాని, తాదృశులగు అన్యులచే నిది భావ్యము కాజాలదు (సాధింపబడదు)."

వసిష్ఠ ఉవాచ :-

"కిం కిం స్మరసి కల్యాణ!, చిత్ర మస్మిన్ జగత్క్రమే?" ।

32. వసిష్ఠుడు :- "కల్యాణుడా! ఈ జగత్పరంపర యందు, ఏయే ఆశ్చర్యకర విషయములను నీవు స్మరింతువో వచింపుము."

భుశుణ్డ ఉవాచ :-

"అశైలవనవృక్షౌఘాం, స్మరా మీమాం ధరా మధః ॥ 32 ॥

జన్మేన్దు భాస్కరాదీనా మిన్ద్రోపేన్ద్ర వ్యవస్థితిమ్ ।
హిరణ్యాక్షాఽపహరణం, వరాహోద్ధరణం క్షితేః ॥ 33 ॥
సాగరాణాం సముద్భూతి మమృతాఽర్థం చ మన్థనమ్ ।[1]

**32-34.** భుశుండుడు :- "క్రింది ఈ భూమి, శైలవనవృక్షశ్రేణీరహితముగ నుండు స్థితిని, సూర్యచంద్రాదుల జన్మమును, ఇంద్ర, ఉపేంద్రుల వ్యవస్థితిని, హిరణ్యాక్షునిచే భూమి అపహృతిని, హరి, వరాహావతారమున భూమి నుద్ధరించుటను, సముద్రముల యుత్పత్తిని, అమృతార్థమైన క్షీరసాగరమథనమును, నేను స్మరించుచున్నాను.

మునే! తే బ్రహ్మపుత్రస్య, జన్మాఽష్టమమిదం కిల ॥ 34 ॥
రేణుకాపుత్రతాం యాతః, షష్ఠవార మిమం హరిః ।

**34.** మునీంద్రా! బ్రహ్మపుత్రుడవైన తమ కిది యెనిమిదవ జన్మము కదా! ఇప్పటికి ఆఱు మాఱులు హరి, రేణుకాపుత్రత్వమును బొంది పరశురాముడయినాడు.

త్రింశత్ త్రిపురవిక్షోభాన్, ద్వౌ దక్షాఽ[2]ధ్వర సంక్షయౌ ॥ 35 ॥
స్మరామి ద్వాదశం చేద మమృతాఽమ్భోధిమన్థనమ్ ।
అధునైకాదశం జన్మ, రామనామ్నా హరే ర్భవేత్ ॥ 36 ॥
వసుదేవ గృహే చాఽపి, భవితా జన్మ షోడశమ్ [3]

**35-36.** ముప్పది త్రిపురసంహారములు, రెండు దక్షాధ్వరధ్వంసములు, పంద్రెండు మార్లు సురాఽసురులచే క్షీరసాగరమథనములను స్మరించుచున్నాను.

---

(1) పురాణముల ననుసరించి, ఈ శ్లోకములు వర్ణించు సంఘటనలు, విభిన్న యుగము లందు సంభవించినట్లు భావింపబడినవి.

(2) దక్షుడు – బ్రహ్మ కుమారులలో నొకడు; ప్రజాపతి.

(3) ఈ శ్లోకములు విశ్వము నందలి సంఘటనల పునః పునరావృత్తి స్వభావమును నిర్దేశించుచున్నవి. ప్రతికల్పము నందును, ఒకే విధమైన సంఘటనల ప్రగతి సంభవించుచున్నది. విశ్వసృష్టి చక్రము వలె తిరుగుచుండుటచే, సంఘటనల పునః పునరావృత్తి కలుగుచున్నది. విశ్వ జీవన సత్యములను, వసిష్ఠుడు జ్ఞాన, యోగాత్మకములైన ఆఖ్యాయికల ద్వారా సమమువోక్షముగ ఉపదేశించినాడు.

ఇప్పుడు రామనామమున విష్ణువు అవతరించుట. పదునొకండవది కాగలదు. వసుదేవుని గృహమున హరి అవతారము పదునాఱవది కాగలదు.

భ్రాన్తి రేషా జగద్రూపా, న కదాచన విద్యతే । 37 ।
విద్యతే తు కదాచిచ్చ, జలబుద్బుదవత్ స్థితా ।"

37-38. జగద్రూపమున నున్న ఈ భ్రాంతి, వాస్తవమున ఎప్పుడును లేనిదే. కాని, జలబుద్బుదము వలె, క్షణికస్థితి కలిగి ఒకానొకప్పు డుండును."

## 4. ప్రాణచిన్తా – ప్రాణచింతనము

వసిష్ఠ ఉవాచ :–

"చరతాం జగతః కోశే, వ్యవహారవతా మపి । 38 ।
కథం విహగరాజేన్ద్ర! దేహం మృత్యు ర్న బాధతే ? ।"

38-39. వసిష్ఠుడు :– "పక్షిరాజేంద్రా! ఈ సంసారముననే యుండి, సర్వ వ్యవహారముల నాచరించుచున్న వారి దేహ మెట్లు మృత్యువశము కాకుండ నుండగలదు? [ప్రాణులు మృత్యురహితులై, చిరజీవు లెట్లగుదురో తెల్పుము]"

భుశుణ్డ ఉవాచ :–

"దోషముక్తా ఫలప్రోతా, వాసనాతన్తు సన్తతిః । 39 ।
హృది న గ్రథితా యస్య, మృత్యు స్తం న జిఘాంసతి ।
ఆశా యం న దహత్యన్త ర్మృత్యు స్తం న జిఘాంసతి । 40 ।

39-40. భుశుండుడు :– "దోషములనెడి మౌక్తికములు (ముత్తెములు) వాసనలనెడి తంతువుల (దారముల)చే నెవని హృదయమున గ్రథితమై (కూర్పబడి) యుండవో, వానిని మృత్యువు చంపగోరదు. ఎవని హృదయమును దురాశలు దహింపవో, వానిని మృత్యువు హింసింప (చంప) గోరదు.

కామక్రోధవిహీనో యః మృత్యు స్తం న జిఘాంసతి ।
యస్య చిత్తం సువిశ్రాన్తం, పదే పరమపావనే । 41 ।
న చఞ్చలం మనో యస్య, తం మృత్యు ర్న జిఘాంసతి ।

41-42. ఎవడు కామక్రోధశూన్యుడో, ఎవని చిత్తము పరమపావనపదము (బ్రహ్మము)న, సువిశ్రాంతమో, ఎవని మనస్సు నిశ్చలమో, అట్టి వానిని, మృత్యువు హింసింపగోరదు. (అట్టి వారిని మృత్యు వేమియు చేయజాలదని భావము).

**ఏతే బ్రహ్మన్ ! మహా దోషాః, సంసారవ్యాధిహేతవః । 42 ।**
**మనాగపి న లుమ్పన్తి, చిత్త మేకసమాహితమ్ ।**

42-43. బ్రహ్మజ్ఞుడా! సంసారవ్యాధికి హేతువులైన ఈ మహాదోషములు, పరమాత్మ జ్ఞానసంపన్నమై, సమాధియుక్తమైన చిత్తమును, ఇంచుకైనను బాధింపజాలవు.

**ఆత్మచిన్తా మహాశ్రేష్ఠా, సర్వసఙ్కల్పవర్జితా । 43 ।**
**సర్వదుఃఖక్షయకరీ, సర్వసౌభాగ్యవర్ధినీ ।**
**కారణం జీవితస్యేహ, ప్రాణచిన్తా సమాశ్రితా" । 44 ।**

43-44. సర్వసంకల్పవర్జితమైన ఆత్మచింతనము ఉత్కృష్టమైనది. అది సర్వ దుఃఖములను నశింపజేయును; సర్వసౌభాగ్యమును వర్ధిల్లజేయును. ప్రాణచింతనమును సమాశ్రయించినచో, నది, చిరజీవితమునకు ఇచట హేతువు కాగలదు."

**ఏవ ముక్తే మయా పృష్టః, "ప్రాణచిన్తా కిముచ్యతే" ? ।**
**భుశుణ్డో మాం తతః ప్రాహ, "ప్రాణాఽపానావితి శ్రుతౌ । 45 ।**
**ఊర్ధ్వాఽధః కిల దేహేఽస్మిన్ ప్రసృతా వనిలా వుభౌ ।**

45-46. భుశుండు డిట్లు వచింపగా, "ప్రాణ చింత అనగానేమి?" అని, అతనిని నేను ప్రశ్నించితిని. "ప్రాణాఽపాన వాయువులు ఈ దేహమున క్రమముగ మీదికి, క్రిందికిని ప్రసరించుచున్నవి కదా!" యని భుశుండు డన్నాడు.

**"కళేబరమహాయన్త్రవాహయోః, శ్రమహీనయోః । 46 ।**
**హృదాకాశాఽర్కశశినో, రగ్నీషోమస్వరూపయోః ।**
**జాగ్రత్స్వప్న సుషుప్తేషు, సదైవ సమరూపయోః । 47 ।**

దుర్లక్ష్యా విద్యమానాఽపి, గతిః సూక్ష్మతరాఽనయోః ।
ప్రాణాఽపానావుభావేతే, స్పన్దశక్తీ సదాగతీ ॥ 48 ॥

46-48. ఈ ప్రాణాపానములు శరీరమహాయంత్రమునకు శ్రమరహితమైన వాహకములు. ఇవి హృదయాకాశమునకు సూర్యచంద్రులు. అగ్ని, సోమ స్వరూపములు, జాగ్రత్స్వప్న సుషుప్తులను త్రివిధావస్థలలోను, సర్వదా సమస్వభావముగల వీని గమనము (సంచారమార్గము) ఉన్నను, సూక్ష్మతర మగుటచే, కాంచుటకు అత్యంత దుర్లభమగుచున్నది. ప్రాణాఽపానములు రెండును దేహమున, స్పంద(చలన)శక్తులై, నిరంతర సంచారము గలవియై యున్నవి.

ఊర్ధ్వగస్తు స్థితః ప్రాణో,ఽపానః పునరవాక్ స్థితః ।

49. ప్రాణవాయువు, ఊర్ధ్వ గమనము కలది, అపాన వాయువు అధోగమనము కలది.

బాహ్యోన్ముఖత్వం ప్రాణానాం, యద్హృదమ్బుజ కోటరాత్ ॥ 49 ॥
స్వరసేనాఽస్త యత్నానాం, తం ధీరా రేచకం విదుః ।
ద్వాదశాఽఙ్గుళ పర్యన్తం బాహ్య మాక్రమతాం తతః ॥ 50 ॥
ప్రాణానా మఙ్గసంస్పర్శో, యః స పూరక ఉచ్యతే ।
బాహ్య త్పరాపతత్యన్త రపానే యత్నవర్జితః ॥ 51 ॥
యోఽయం ప్రపూరణస్పర్శో, విదు స్తమపి పూరకమ్ ।

49-52. పద్మాకారమున నున్న హృదయకోటరము (గర్భము) నుండి స్వాభావికముగ – అప్రయత్నముగ – ప్రాణవాయువులు వెలుపలికి వచ్చుటనే, ధీరులు రేచక మందురు. (Exhalation). ప్రాణ వాయువులు పండ్రెండు (12) అంగుళముల దూరము వఱకు నాసికారంధ్రముల నుండి బయటకు వచ్చి, అచ్చట అణగిపోవును. తరువాత, నాసాగ్రాది మూర్ధపర్యంతము, మూర్ధాది హృదయపర్యంతము – ద్వివిధమగు వాయువు యొక్క స్పర్శను, అంతఃపూరకమనియు (Inhalation) నందురు. అప్రయత్నముగ వెలుపల నుండి మరలి, ప్రాణములు

★ పరాపతతి – ప్రవిశతి । (యో.వా.తా.ప్ర.)

అపానములోనికి ప్రవేశించుటయే ప్రపూరణస్పర్శ అనబడును. దీనినే పూరకమని యందురు.

[వెలుపలికి పోవునది ప్రాణ వాయువనియు, లోనికి వచ్చునది అపాన వాయువనియు యోగశాస్త్రములు పేర్కొనును]

**అపానేఽస్తం గతే ప్రాణో, యావన్నాభ్యుదితో హృది ॥ 52 ॥**
**తావత్ సా కుమ్భకాఽవస్థా, యోగిభి ర్యాఽనుభూయతే ।**

**52-53.** అపాన ముపశమింపగా, హృదయమున ప్రాణవాయువు వెలుపలికి వచ్చుటకు ఉదయింపనంత వఱకు, గల వాయుధారణ స్థితి కుంభకావస్థ యనబడును.

**రేచకః పూరకశ్చైవ, కుమ్భకశ్చ త్రిధా స్థితాః ॥ 53 ॥**
**బాహ్యశ్చాఽఽభ్యన్తర శ్చేతి, తత్త ల్లక్షణ లక్షితాః ।**

**53-54.** రేచక, పూరక, కుంభకము అని ప్రాణయామము యొక్క మూడు విధులు. రేచక, పూరక, కుంభకములు, మూడును బాహ్యములు, ఆభ్యంతరములు నని, ఆయా లక్షణములచే పేర్కొనబడినవి.

## 5. చిరజీవితకారణమ్ – చిరజీవితమునకు కారణము

**అవ్యగ్ర మస్మిన్ వ్యాపారే, బాహ్యం పరిహరన్ మనః ॥ 54 ॥**
**దినైః కతిపయైరేవ, పరమాప్నోతి కేవలమ్ ।**

**54-55.** చిత్తమును బాహ్య వ్యాపారము నుండి మరలించి, ఈ ప్రాణ చింతనమున నేకాగ్రముగ నిలుపునట్టి సాధకుడు, కొలది దినములలోనే పరమ కైవల్యమును పొందును.

**ఏషా హి చిత్తవిశ్రాన్తి, ర్మయా ప్రాణ సమాధినా★ ॥ 55 ॥**
**క్రమేణాఽనేన సంప్రాప్తా, స్వయ మాత్మని నిర్మలే ।**

**55-56.** ఈ విధమున ప్రాణసమాధానము వలన, క్రమముగ నేను, నిర్మలాత్మ స్వరూపమున స్వయముగ సంపూర్ణచిత్తవిశ్రాంతిని పొందితిని.

★ "The breathing is also to be kept regular and smooth, as there is a vital connection between the flow of thoughts and the rhythm of the breath". "Because breath comes out of the heart; unrhythmical breathing comes from the heart's unrest. Therefore one must breathe in and out quite softly so that it remains inaudible to the ear."

[See: The Secret of the Golden Flower, a Chinese Taoist book of Yoga]

న భూతం న భవిష్యచ్చ, చిన్తయామి కదాచన । 56 ।
దృష్టి మాలమ్బ్య తిష్ఠామి, వర్తమాన మిహాఽఽత్మనా ।

**56-57.** నే నెపుడును, కడచిన దానిని (గతమును) కాని, రాబోవు దానిని (భవిష్యమును) కాని, గుఱించి చింతింపను. వర్తమాన దృష్టిని, – అనగా నిత్యవర్తమానస్వభావమగు సాక్షిదృష్టిని, మనసున నవలంబించి, యిచట ఆత్మ యందు నిలిచి యున్నాను.

న తుష్యతి శుభప్రాప్తౌ, నాఽశుభేష్వపి ఖిద్యతే । 57 ।
మనో మమ సమం నిత్యం, తేన జీవా మ్యనామయః ।

**57-58.** నా మనస్సు శుభప్రాప్తి యందు హర్షమును, అశుభప్రాప్తి యందు శోకమును, పొందదు. సకలావస్థల యందును నిర్లిప్తమై, నిత్యము సర్వ సమముగ నుండును. కావున, నేను నిరామయుడనై, (రోగరహితుడనై) జీవించుచున్నాను.

అయం బన్ధుః పరశ్చాఽయం, మమాఽయ మయ మన్యథా ।58।
ఇతి బ్రహ్మన్! నజానామి, తేనాఽస్మి చిరజీవితః ।

**58-59.** బ్రహ్మజ్ఞుడా! వీడు బంధువు, వీడు శత్రువు, ఇది నాది, ఇది ఇతరు లది – అన్న భేదమును నేనెఱుగను కనుకనే, చిరజీవితుడనైతిని.

ఆశాపాశవిమున్నాయా, శ్చిత్తవృత్తేః సమాహితః । 59 ।
సంస్పర్శం న దదామ్యన్త స్తేన జీవా మ్యనామయః ।★
ఏతత్తే కథితం బ్రహ్మన్!, యథాఽస్మి చిరజీవితః" । 60 ।

**59-60.** ఎల్లపుడును సమాహితుడనై, ఆశాపాశప్రేరితమైన చిత్తవృత్తి యొక్క సంస్పర్శను, హృదయమున ప్రవేశింపనీయనందుననే, నేను నిరామ

★ "చిన్తాక్రాన్తం ధాతుబద్ధం శరీరం,
నష్టే చిత్తే, ధాతవో యాన్తి నాశమ్ ।
తస్మాచ్చిత్తం సర్వతో రక్షణీయమ్,
స్వస్థే చిత్తే బుద్ధయః సమ్భవన్తి । (అవధూత గీత -VIII-27)

"శరీరము చింతాక్రాంతమై నది. ఇది రక్తాది ధాతువులతో నిర్మింపబడినది. చిత్తము నష్టమైనచో, ధాతువులును నశించును. ధాతువులకు చిత్తము ధారకము కావున, దానిని అన్ని విధముల రక్షించుకొనవలెను. చిత్తము విశ్రాంతి నొందినచో, జ్ఞానములు సిద్ధించును." – అని దత్తాత్రేయుడు బోధించెను.

యుడనై - (రోగ రహితుడనై) - జీవించుచున్నాను. బ్రహ్మజ్ఞుడా! నే
నెట్లు చిరజీవితుడనైతినో. అదియంతయు నీకెఱిగించితిని."

**"అహో! ప్రోక్త స్తవోదన్తః, పరం విస్మయకారణాత్ !"**
**ఏవ ముక్త్వా త మామన్త్ర్య, మయా భూయో దివం గతమ్ ॥ 61 ॥**

61. "అహో! పరమాశ్చర్య హేతువగు నీ వృత్తాంత మెఱిగించితివి." అని,
భుశుండుని వీడ్కొని, నేను మరల స్వర్గమున కేగితిని.

**"యాతే కృతయుగస్యాఽఽదౌ, పున స్తేనాఽస్మి సఙ్గతః ।**
**మధ్యే త్రేతాయుగస్యాఽస్య, జాత స్త్వం రిపుసూదన ! ॥ 62 ॥**

62. "కృతయుగ ప్రారంభమున కొంత కాలము గడచిన తరువాతను, మరల
నొకసారి భుశుండుని నేను కలసి కొంటిని. శత్రునాశకుడవగు
శ్రీరామా! నీవు ఈ త్రేతాయుగమధ్యమున జన్మించితివి.

**పునరద్యాఽష్టమే వర్షే,* తత్రైవోపరి భూభృతః ।**
**మిళితోఽభూత్ భుశుణ్డో మే, తథైవాఽజరరూపవాన్ ॥ 63 ॥**

63. మరల ఈ ప్రస్తుత త్రేతాయుగమున, ఎనిమిదవ సంవత్సరమున, ఆ
పర్వతము (మేరువు) పైననే, **జరారహితరూపుడగు** భుశుండునిని
నేను కలసికొంటిని. అపుడును, కృతయుగము నం దెట్లుండెనో అట్లే
యుండెను.

**ఇదం తే కథితం చిత్రం, భుశుణ్డోదన్త ముత్తమమ్ ।**
**శ్రుత్వా విచార్య చైవాస్త ర్యద్యుక్తం తత్సమాచర " ॥ 64 ॥**

64. ఇట్లు, చిత్రమును, ఉత్తమమునైన భుశుండుని వృత్తాంతము నీ
కెఱిగించితిని. దీనిని నీవు హృదయమున చక్కగా విచారించి, **యుక్తమైన
విధము నాచరింపుము."**

***ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'భుశుణ్డోపాఖ్యానం' నామ ఏకవింశః సర్గః ।***

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'భుశుండోపాఖ్యాన' మను
ఏకవింశతితమ సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



★ యుగకాలవివరణ – చూడు :– ఈ సర్గమున 18వ శ్లోకముయొక్క పాదటీక.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో, వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ద్వావింశతితమసర్గము

## దేవార్చన విధానమ్ – దేవపూజావిధానము

### 1. విధాన ప్రశ్నః – పూజా విధానమును గురించిన ప్రశ్న.

**వసిష్ఠ ఉవాచ :–**

**ఆ భాసమాత్ర మేవేద మిత్థం సంప్రతి భాసతే ।**
**అయం నాహమిహి త్యస్త రసదేవ శరీరకమ్ । 1 ।**

1. వసిష్ఠుడు :– ఇట్లు, ఇప్పుడు కనిపించు (భాసించు)చున్న ఈ జగత్తు కేవలము దృశ్యమాత్రమే. యథార్థము కాదు. ఇది నా మేను అని లోన అభిమానించుటే కాని, దేహ మనెడి పదార్థము నిజమునకు లేనిదే (అసత్తే).

**సుఖతల్పగతో యేన, స్వప్నదేహేన దిక్తటమ్ ।**
**పరిభ్రమసి హే రామ!, స దేహ స్తే క్వ సంస్థితః ? । 2 ।**

2. శ్రీ రామా! సుఖతల్పమున శయనించి, స్వప్నదేహముతో దిగంతము లందు నీవు పరిభ్రమించుచున్నావు. ఆ నీ దేహమేది? ఎచ్చటనున్నది?

జాగరాయాం మనోరాజ్యే, యేన స్వర్గపురాన్తరమ్ ।
పరిభ్రమసి మేరుం వా, స దేహ స్తే క్వ సంస్థితః? ।

3. జాగ్రదవస్థ యందును, మనో రాజ్యమునందు, దేనితో మేరు పర్వతముపై గాని, స్వర్గపురము నందు గాని, నీవు విహరించుచున్నావో, ఆ నీ దేహ మెచ్చట నున్నది?

దీర్ఘ స్వప్న మిమం విద్ధి, దీర్ఘం వా చిత్తవిభ్రమమ్ ।
దీర్ఘం వాఽపి మనోరాజ్యం, సంసారం రఘునన్దన! । 4 ।

4. రఘునందనా! ఈ సంసారము దీర్ఘస్వప్నమని కాని, దీర్ఘచిత్త విభ్రమమని కాని, దీర్ఘమనోరాజ్యమని (ఆకాశహర్మ్యకల్పనమని) కాని, భావింపుము.

పరం పౌరుష మాస్థాయ, బలం ప్రజ్ఞాం చ యుక్తితః ।
నాభిం సంసారచక్రస్య, చిత్త మేవ నిరోధయేత్ । 5 ।

5. పరమమైన పురుషప్రయత్నమును, బలమును, ప్రజ్ఞను ఆశ్రయించి, యుక్తి (ఉపాయము)తో, సంసారచక్రమునకు నాభియైన చిత్తమును నిరోధింపవలయును.

ప్రజ్ఞాసౌజన్య యుక్తేన, శాస్త్ర సంవలితేన చ ।
పౌరుషేణ న యత్ప్రాప్తం, న తత్ క్వచన లభ్యతే । 6 ।

6. ప్రజ్ఞా,సౌజన్య,శాస్త్రసంవలితమగు పురుషప్రయత్నము చేత ప్రాప్తింపనిది, మఱి యెచ్చటను లభింపదు.

చిత్తయక్షదృఢాఽఽక్రాన్తం, న శాస్త్రాణి న బాన్ధవాః ।
శక్నువన్తి పరిత్రాతుం, గురవో న చ మానవమ్ । 7 ।

7. చిత్త మనెడు యక్షుని (పిశాచము) చేత నాక్రమింపబడిన పురుషుని, శాస్త్రవిచారములు గాని, బంధుజనులు గాని, గురువులు గాని రక్షింపజాలరు.

సంశాన్తచిత్తవేతాలం, గురుశాస్త్రార్థ బాన్ధవాః ।
శక్నువన్తి సముద్ధర్తుం, స్వల్పపఙ్కాన్మృగం యథా ॥ 8 ॥

8. చిత్తబేతాళుడు క్షీణించిన మనుజుని, కొద్ది పాటి బురద నుండి హరిణమును వలె, గురూపదేశములు, శాస్త్రార్థవిచారములు, బంధుజనులును, సునాయాసముగ సముద్ధరింపగలరు.

అత్రేమా మపరాం దృష్టిం, మహామోహవినాశినీమ్ ।
శృణు! యా కథితా పూర్వం, మహ్య మర్ధేన్దుమౌళినా ॥ 9 ॥

9. ఈ విషయమున, పూర్వము అర్ధేందుమౌళియగు పరమశివుడు నా కెఱిగించిన మహామోహవినాశిని యగు ఇంకొక దృష్టిని వినుము.

కదాచి జ్జాహ్నవీతీరే, స్థితోఽహం పూజయన్ శివమ్ ।
తదా శ్రావణపక్షస్య, బహుళస్యాఽష్టమే దివే ॥ 10 ॥
అపశ్యం కాననే తేజః, చన్ద్రబిమ్బగణోపమమ్ ।
యావత్పశ్యామి తం దేశం, ప్రాప్త శ్చన్ద్రకళాధరః ॥ 11 ॥
గౌరీకరాఽర్పితకరో, నన్దిప్రోత్సారితాఽగ్రగః ।

10-12. ఒకప్పుడు, నేను గంగానదీ తీరమున పరమ శివుని పూజించుచునుంటిని. అపుడు, శ్రావణమాస, కృష్ణపక్షాష్టమీ దివసమున, ఆ వనమున చంద్రబింబగణోపమమై ప్రకాశించునొక దివ్య తేజమును గాంచితిని. ఆ ప్రదేశమును కాంచుచుండునంతలో, పార్వతీ దేవి కరమున తన కరము నుంచి, చంద్రకళాధరుడైన పరమశివుడు, నందీశ్వరుడు మార్గమును జూపుచుండగా, అచటి కేతెంచినాడు.

అర్ఘ్యం పుష్పం తథా పాద్య మ భ్యుపేత్యాఽర్పితం మయా ॥ 12 ॥
నమస్కారై స్తథా స్తోత్రై ర్దేవీయుతశివోఽర్చిత ః ।
పూజాన్తే మా మువాచేద మతిశీతలయా గిరా ॥ 13 ॥

12-13. అర్ఘ్యము, పుష్పము, పాద్యము, మొదలగు పూజాద్రవ్యములను నే నాయన కెదురేగి, సమర్పించితిని. దేవీసమేతుడైన పరమశివుని నమస్కారములతో, స్తోత్రములతో అర్చించితిని. పూజాంతమున,

అత్యంత శీతలమైన (సుప్రసన్నమైన) వాక్కుతో పరమశివుడు, నాకు దీనిని వచించెను.

"కచ్చి త్తప స్తే నిర్విఘ్నం, కిం ప్రాప్తం ప్రాప్తవానసి"? ।
ఇత్యుక్తేన మయా ప్రోక్తం "త్వదనుస్మరణే సతి । 14 ।
కుతో విఘ్న ర్న దుష్ప్రాపం, భువి కిఞ్చన విద్యతే ।
అపవర్గపురద్వారం, త్వ దనుస్మరణం విభో ! । 15 ।

14-15. "నీ తపస్సు నిర్విఘ్నముగ సాగుచున్నదా? పొందదగిన దానిని (పరమాత్మయందు చిత్త విశ్రాంతిని) పొందితివి గదా!" అని శివుడు పలుకగా, "మహాదేవా! నీ అనుస్మరణ ముండగా, (నిన్ను సదా ధ్యానించు చుండగా) విఘ్నము లెక్కడ నుండి కలుగును? ఈ భువిలో పొంద రాని దేముండును? నీ అనుస్మరణము ప్రభూ! మోక్షపురద్వారము కదా!

కింతు పృచ్ఛామి దేవేశ! కిఞ్చి త్సందేహనిర్ణయమ్ ।
సర్వపాపక్షయకరం, సర్వకల్యాణవర్ధనమ్ । 16 ।
దేవాఽర్చన విధానం తత్, కీదృశం భవతి? ప్రభో !" ।

16-17. అయినను, దేవదేవా! కొంత సందేహనిర్ణయమును గూర్చి నే నడుగుచున్నాను. సర్వపాపక్షయకరము, సర్వకల్యాణ(శుభ)ములను ప్రసాదించి, వృద్ధి పొందించునదియునగు దేవపూజావిధాన మెట్టిదో ప్రభూ! నా కెఱిగింపవలయును."

## 2. ఆత్మైవ పరమో దేవః – ఆత్మయే పరమదైవము

మహేశ్వర ఉవాచ :–

న దేవః పుణ్డరీకాక్షో, న చ దేవ స్త్రిలోచనః । 17 ।
న దేవో దేహరూపీ హి, న దేవ శ్చిత్తరూపధృక్ ।
అకృత్రిమ మనాద్యన్తం, దేవనం దేవ ఉచ్యతే । 18 ।

17-18. మహేశ్వరుడు :– పుండరీకాక్షుడైన విష్ణుడు గాని, త్రిలోచనుడగు శివుడు గాని, దేహరూపుడు గాని, చిత్తరూపుడు గాని, దేవుడు కాడు. అకృత్రిమము (ఒకరి చేత ఏర్పఱుప బడుటకు శక్యము కానిదియు),

ఆద్యంతములు లేనిదియు నైన (నిత్యనిరతిశయానంద) స్వప్రకాశ స్వరూపమే నిజముగా దేవుడు.

అజ్ఞాతదేవతత్త్వానా మాకారాద్యర్చనం కృతమ్ ।
యోజనాధ్వన్యశక్తస్య, క్రోశాధ్వా పరికల్ప్యతే ॥ 19 ॥

19. దేవతత్త్వము నెఱుగని అజ్ఞానుల నిమిత్తము ఆకారాదుల అర్చనము విధింపబడినది. ఒక యోజన (ఎనిమిది మైళ్ళు) దూర మరుగ లేనివానికి ఒక క్రోశ (రెండు మైళ్లు) దూరము పరికల్పింపబడినది.

శమబోధాऽऽదిభిః పుష్పై, ర్దేవ ఆత్మా యదర్చ్యతే ।
తత్తు దేవార్చనం విద్ధి, నాऽऽకారాऽర్చన మర్చనమ్ ॥ 20 ॥

20. చిత్తశాంతి, జ్ఞానము, మొదలగు పుష్పములచే దేవుడగు ఆత్మ నర్చించుటయే దేవార్చనమని యెఱుగుము. ఆకారార్చనము, దేవార్చనము కాదు.

శమబోధాద్యభావే హి, పుష్పాద్యై రర్చనం స్మృతమ్ ।

21. శమదమాదిగుణసంపత్తి, తత్త్వజ్ఞానము, - ఇత్యాది గుణములు లేనప్పుడు మాత్రమే, పుష్పాదుల చేత అర్చనము, శాస్త్రము లందు విధింపబడినది.

సంవిత్సర్వ కళాతీతా, సత్తాసామాన్య రూపిణీ* ॥ 21 ॥
మహాసత్తాऽऽత్మతాం ప్రాప్తా, దేవశబ్దేన కథ్యతే ।

21-22. సర్వకళాతీతము - అనగా, నిరంశమైన సత్తా సామాన్య రూపిణియగు సంవిత్తు (శుద్ధచైతన్యము), మహా సత్తాత్మతను పొంది 'దేవ' శబ్దము చేత చెప్పబడుచున్నది.

దేశకాలాది శక్తీనా ముల్లాసై ర్వలితాక్రమాత్ ॥ 22 ॥
జీవో భూత్వా భవత్యాశు, బుద్ధిః పశ్చా దహం తతః ।
మనస్త్వం సముపాయాతా, సంసార మవలమ్బతే ॥ 23 ॥

22-23. ఆ శుద్ధ చైతన్యము, దేశ కాలాది శక్తుల విజృంభణముల చేత పరివేష్టితమై, (చుట్టబడి), క్రమముగ జీవరూపమును, అట నుండి బుద్ధి రూపమును, అట నుండి అహంకార రూపమును, అటు తరువాత మనోరూపమును

★ చూడు ౬- XV సర్గ – 44–47. శ్లోక వివరణ.

అత్యంత శీతలమైన (సుప్రసన్నమైన) వాక్కుతో పరమశివుడు, నాకు దీనిని వచించెను.

"కచ్చి త్తప స్తే నిర్విఘ్నం, కిం ప్రాప్తం ప్రాప్తవానసి"? ।
ఇత్యుక్తేన మయా ప్రోక్తం "త్వదనుస్మరణే సతి ॥ 14 ॥
కుతో విఘ్న ర్న దుష్ప్రాపం, భువి కిఞ్చన విద్యతే ।
అపవర్గపురద్వారం, త్వ దనుస్మరణం విభో ! ॥ 15 ॥

14-15. "నీ తపస్సు నిర్విఘ్నముగ సాగుచున్నదా? పొందదగిన దానిని (పరమాత్మయందు చిత్త విశ్రాంతిని) పొందితివి గదా!" అని శివుడు పలుకగా, "మహాదేవా! నీ అనుస్మరణ ముండగా, (నిన్ను సదా ధ్యానించు చుండగా) విఘ్నము లెక్కడ నుండి కలుగును? ఈ భువిలో పొంద రాని దేముండును? నీ అనుస్మరణము ప్రభూ! మోక్షపురద్వారము కదా!

కింతు పృచ్ఛామి దేవేశ! కిఞ్చి త్త్వందేహనిర్ణయమ్ ।
సర్వపాపక్షయకరం, సర్వకల్యాణవర్ధనమ్ ॥ 16 ॥
దేవాఽర్చన విధానం తత్, కీదృశం భవతి? ప్రభో !" ।

16-17. అయినను, దేవదేవా! కొంత సందేహనిర్ణయమును గూర్చి నే నడుగుచున్నాను. సర్వపాపక్షయకరము, సర్వకల్యాణ(శుభ)ములను ప్రసాదించి, వృద్ధి పొందించునదియునగు దేవపూజావిధాన మెట్టిదో ప్రభూ! నా కెఱిగింపవలయును."

## 2. ఆత్మైవ పరమో దేవః — ఆత్మయే పరమదైవము

మహేశ్వర ఉవాచ :—

న దేవః పుణ్డరీకాక్షో, న చ దేవ స్త్రిలోచనః ॥ 17 ॥
న దేవో దేహరూపీ హి, న దేవ శ్చిత్తరూపధృక్ ।
అకృత్రిమ మనాద్యన్తం, దేవనం దేవ ఉచ్యతే ॥ 18 ॥

17-18. మహేశ్వరుడు :— పుండరీకాక్షుడైన విష్ణుడు గాని, త్రిలోచనుడగు శివుడు గాని, దేహరూపుడు గాని, చిత్తరూపుడు గాని, దేవుడు కాడు. అకృత్రిమము (ఒకరి చేత ఏర్పఱుప బడుటకు శక్యము కానిదియు),

ఆద్యంతములు లేనిదియు నైన (నిత్యనిరతిశయానంద) స్వప్రకాశ స్వరూపమే నిజముగా దేవుడు.

అజ్ఞాతదేవతత్త్వానా మాకారాద్యర్చనం కృతమ్ ।
యోజనాధ్వన్యశక్తస్య, క్రోశాధ్వా పరికల్ప్యతే । 19 ।

19. దేవతత్త్వము నెఱుగని అజ్ఞానుల నిమిత్తము ఆకారాదుల అర్చనము విధింపబడినది. ఒక యోజన (ఎనిమిది మైళ్ళ) దూర మరుగ లేనివానికి ఒక క్రోశ (రెండు మైళ్లు) దూరము పరికల్పింపబడినది.

శమబోధాఽఽదిభిః పుష్పై, ర్దేవ ఆత్మా యదర్చ్యతే ।
తత్తు దేవార్చనం విద్ధి, నాఽఽకారాఽర్చన మర్చనమ్ । 20 ।

20. చిత్తశాంతి, జ్ఞానము, మొదలగు పుష్పములచే దేవుడగు ఆత్మ నర్చించుటయే దేవార్చనమని యెఱుగుము. ఆకారార్చనము, దేవార్చనము కాదు.

శమబోధాద్యభావే హి, పుష్పాద్యై రర్చనం స్మృతమ్ ।

21. శమదమాదిగుణసంపత్తి, తత్త్వజ్ఞానము, – ఇత్యాది గుణములు లేనప్పుడు మాత్రమే, పుష్పాదుల చేత అర్చనము, శాస్త్రము లందు విధింపబడినది.

సంవిత్సర్వ కళాతీతా, సత్తాసామాన్య రూపిణీ* । 21 ।
మహాసత్తాఽఽత్మతాం ప్రాప్తా, దేవశబ్దేన కథ్యతే ।

21-22. సర్వకళాతీతము – అనగా, నిరంశమైన సత్తా సామాన్య రూపిణియగు సంవిత్తు (శుద్ధచైతన్యము), మహా సత్తాత్మతను పొంది 'దేవ' శబ్దము చేత చెప్పబడుచున్నది.

దేశకాలాది శక్తీనా ముల్లాసై ర్వలితాక్రమాత్ । 22 ।
జీవో భూత్వా భవత్యాశు, బుద్ధిః పశ్చా దహం తతః ।
మనస్త్వం సముపాయాతా, సంసార మవలమ్బతే । 23 ।

22-23. ఆ శుద్ధ చైతన్యము, దేశ కాలాది శక్తుల విజృంభణముల చేత పరివేష్టితమై, (చుట్టబడి), క్రమముగ జీవరూపమును, అట నుండి బుద్ధి రూపమును, అట నుండి అహంకార రూపమును, అటు తరువాత మనోరూపమును

---

* చూడు ౭– XV సర్గ – 44–47. శ్లోక వివరణ.

పొందుచున్నది. ఇట్లు మనస్సుగా రూపొందిన తరువాత, సంసారమును అవలంబించుచున్నది.

**ఇయ మస్మీతి భావేన, దేహస్థా దుఃఖ మశ్నుతే ।**
**పుష్టం సఙ్కల్పమాత్రేణ, యదిదం దుఃఖమాగతమ్ ॥ 24 ॥**
**త దసఙ్కల్పమాత్రేణ, క్షీయతే నాఽత్రసంశయః ।**

**24-25.** ఈ సంవిత్తు (శుద్ధచైతన్యము) దేహస్థితమై, అస్మితాభావము - 'నేనున్నాను' - అను భావము చేత, దుఃఖమును పొందుచున్నది. సంకల్ప మాత్రము చేత, ఆగతమైన (కలిగిన) ఈ దుఃఖము పరిపుష్టమై, అసంకల్ప మాత్రముననే నశించుచున్నది. ఇందు సంశయమేమాత్రము లేదు.

**స్వసఙ్కల్పవకాలుష్యం, వినివార్యాఽఽత్మనాఽఽత్మనః ॥ 25 ॥**
**పరం ప్రసాద మాసాద్య, పరమాఽఽనన్దవాన్ భవ ! ।**

**25-26.** నీవు స్వయముగ, స్వసంకల్పజనితమగు ఆత్మమాలిన్యమును పూర్తిగ తుడిచివేసికొని, పరమనిర్మల (ప్రశాంతి) భావమును పొంది, పరమానందవంతుడవు కమ్ము.

**సర్వశక్తిమయో హ్యాఽఽత్మా, ★ సర్వమాసాద యత్యలమ్ ॥ 26 ॥**
**ఏష దేవః సర్వశ్రేష్ఠః, పూజ్య ఏవ సదా సతామ్ ।**

**26-27.** ఈ ఆత్మ, సర్వశక్తిమయమును సర్వమును సంపూర్ణముగా నిర్వహించునదియునై, యున్నది. ఆత్మయే, సర్వోత్తముడైన దేవుడు; సదా సత్పురుషులచే ఆరాధింపదగినవాడు.

---

★ పోల్చు :- "న తస్య కార్యం కరణం చ విద్యతే,
న తత్సమశ్చాఽభ్య ధికశ్చ దృశ్యతే ।
పరాఽస్య శక్తిర్వి విధైవ శ్రూయతే,
స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ" (శ్వే. ఉ. VI-8)

పరమాత్మకు శరీరమును, చక్షురాది ఇంద్రియములును, లేవు; సమానాధికులును లేరు. అతని శక్తి, సర్వాతిశయమై అనేక విధముగ - అనంతముగ నున్నది. స్వాభావికమగు జ్ఞాన బలక్రియా శక్తులు పరమాత్మకు కలవు. సర్వ విషయ జ్ఞాన ప్రవృత్తియే జ్ఞాన క్రియ. స్వసన్నిధి మాత్రము చేతనే, సర్వమును వశమొనరించుకొని, నిగ్రహించు శక్తియే, బలక్రియ; ఈ శక్తు లనంతములు.

## 3. పూజాక్రమః – ఆరాధనా విధానము

పూజనం ధ్యాన మేవాఽన్త ర్నాఽన్యదస్త్యస్య పూజనమ్ ‖ 27 ‖
తస్మా త్త్రి భువనాఽఽధారం, నిత్యం ధ్యానేన పూజయేత్ ।
చిద్రూపం సూర్యలక్షాభం, సమస్తాఽఽ భాసభాసనమ్ [(1)] ‖ 28 ‖

**27-28.** అంతరంగమున ధ్యానించుటయే ఈ దేవుని పూజ; ఇతరము కాదు. కావున, ముల్లోకములకును ఆధారభూతుడు, చైతన్యస్వరూపుడు లక్షసూర్యుల కాంతితో దేదీప్యమానముగ ప్రకాశించువాడునునై, సమస్త ప్రకాశములను ప్రకాశింపజేయుచున్న ఈ దేవుని, నిత్యము ధ్యానముచే పూజింపవలెను.

ఇచ్ఛాది శక్తయ[(2)] స్తస్య, చిన్తనీయా : శరీరగాః ।
అనన్తః స పరాధారః, సత్తామాత్రైక విగ్రహః ‖ 29 ‖
వివర్తితజగజ్జాలః, కాలోఽస్య ద్వారపాలకః ।

**29-30.** ఇచ్ఛాదులగు ఆ దేవుని శక్తులు, దేహమున నున్నట్లు ధ్యానింపవలయును. ఆ దేవుడు అనంతుడు; సర్వమునకు ముఖ్యాధారము. సత్తామాత్ర స్వరూపుడు; సర్వలోకజాలమును వివర్తమంద (విస్తరింప) జేయు కాల మాదేవునకు ద్వారపాలకుడు. (అవిశుద్ధి సమయమున మనస్సు యొక్క అంతఃప్రవేశమును నిరోధించి, విశుద్ధిసమయమున ప్రవేశానుకూలతను కల్పించు ద్వారపాలకుడనియు, ద్వారపాలక శబ్దమును వివరింపవచ్చును. – యో.వా.తా.ప్ర.)

---

(1) పోల్చు :- "న తత్ర సూర్యో భాతి, న చన్ద్రతారకమ్,
నేమా విద్యుతో భాన్తి, కుతోఽయమగ్నిః ।
త మేవ భాన్త మనుభాతి సర్వం,
తస్య భాసా సర్వమిదం విభాతి ।" (కఠ–ఉ–V-15)

సూర్యచంద్ర నక్షత్రములు, విద్యుత్తు, అగ్ని – ఇవి స్వయం ప్రకాశకములు కావు. దేదీప్యమానుడగు పరమేశ్వరుని ప్రకాశము వలననే సూర్యచంద్రాదిక మంతయు ప్రకాశించుచున్నది. మఱియు, భ.గీ. XV-12.

"యదాదిత్య గతం తేజో, జగద్భాసయతేఽఖిలమ్ ।
యచ్చన్ద్రమసి యచ్చాఽగ్నౌ, తత్తేజో విద్ధి మామకమ్ ।"

"సూర్యచంద్రాగ్నుల యందుండి, జగత్తు నంతటిని ప్రకాశింపజేయుచున్న దీప్తి, నాదియే యని ఎఱుగుము."

(2) ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, ఉత్సాహ శక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి, నిరోధ శక్తి. అనునవి.

సర్వత్రేక్షణ శక్త్యాఢ్యం, సర్వతో ఘ్రాణశక్తికమ్ ‖ 30 ‖
సర్వతః స్పర్శసంయుక్తం, సర్వతో రసనాఽన్వితమ్ ।
సర్వత్ర శ్రవణాఽఽకీర్ణం, సర్వత్ర మననాఽన్వితమ్ ‖ 31 ‖
సర్వతో మననాఽతీతం, సర్వత్ర పరమం శివమ్ ।★
ఇతి సంచిన్త్య దేవేశ, మర్చయే ద్విధివ త్తతః ‖ 32 ‖

**30-32.** ఈ దేవదేవుడు అంతటను ఈక్షణశక్తిని, ఘ్రాణశక్తిని, స్పర్శన శక్తిని, రసనశక్తిని, శ్రవణమననశక్తులను కలవాడు; సర్వవిధముల మననముకు అతీతుడు, సర్వదిగ్దేశకాలముల నంతటను, పరమశివ (మంగళ) స్వరూపుడు; ఇట్లు, దేవదేవుని ధ్యానించి, తరువాత శాస్త్రోక్తమార్గమున పూజింపవలయును.

స్వ సంవిదాత్మా దేవోఽయం, నోపహారేణ పూజ్యతే ।
నిత్య మక్లేశలభ్యేన, బోధేన స్వేన పూజ్యతే ‖ 33 ‖

---

★ పోల్చు :- సర్వతః పాణి పాదం తత్, సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమ ల్లోకే, సర్వమావృత్య తిష్ఠతి ‖ (భ.గీ. XIII-13)
ఆ పరబ్రహ్మము విశ్వమంతయును వ్యాపించి వెలయుచున్నది. దానికి సర్వత్ర హస్త పాదములు, చక్షుఃశ్రోత్రములు, శిరోముఖములు కలవు.

మఱియు చూడు :-

"ఏష హ దేవః ప్రదిశోఽనుసర్వాః,
పూర్వో హ జాతః స ఉ గర్భే అన్తః ।
స ఏవ జాతః, స జనిష్యమాణః,
ప్రత్యఙ్జనాం స్తిష్ఠతి సర్వతో ముఖః ‖" (శ్వే.ఉ.II.16)

అఖిలదిశలును, ఉపదిశలును ఆ దేవుడే. (సర్వగతుడు). పూర్వ (ప్రథమ) జాతుడైన హిరణ్యగర్భుడును, ఆ దేవుడే. బ్రహ్మాండ గర్భమున విరాడ్రూపమున నున్న దతడే, లేక, మాతృ గర్భమున నున్న శిశువును ఆ దేవుడే., జనించుచున్న, జనించిన ప్రాణిజాతమంతయు, ఆ భగవంతుడే. సకల భూతాంతస్థమగు ప్రత్యగాత్మయును ఆ దేవుడే, ఆతడు సర్వతోముఖుడు.

మఱియు. శ్వే. ఉ. IV. 1-4

"త్వం స్త్రీ, త్వం పుమా నసి, ఉత వా కుమారీ ।
త్వం జీర్ణో దణ్డేన వఞ్చసి, త్వం జాతో విశ్వతోముఖః ‖" ఇత్యాది.

"ఓం – సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షః సహస్రపాత్ ।
స భూమిం విశ్వతో వృత్వా, అత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్ ।
పురుష ఏవేదగ్ం సర్వమ్, యద్భూతం యచ్చ భవ్యమ్ ‖" ఇత్యాది

(తైత్తిరీయారణ్యక బ్రహ్మమేధే, పురుషసూక్తమ్)

33. ఆత్మరూపుడు, చిన్మయాత్ముడునగు ఈ దేవుడు, గంధపుష్పాది ఉపహారములచే పూజింపబడ జాలడు; తృప్తుడు కాడు. నిత్యము క్లేశ రహితముగ, సుఖముగ, లభించు, ఆత్మబోధము వలననే ఈతడు పూజింపబడగలడు.

బాహ్యసంపూజనం ప్రోక్త మేత దుత్తమ మాత్మనః ।
ఇదానీం సంప్రవక్ష్యేఽహ మన్తః పూజన మాత్మనః ॥ 34 ॥

34. ఆత్మ యొక్క సర్వోత్తమబాహ్యపూజను చెప్పితిని. ఇపుడు ఆత్మ యొక్క అంతఃపూజను వివరింతును. (28-32 -శ్లోకములీ సర్వోత్తమమగు బాహ్యపూజను నిర్దేశించుచున్నవి.)

నిత్యమేవ శరీరస్థ మిమం ధ్యాయేత్ పరం శివమ్ ।
స్వదేహే సంవిదాభాసో, దేవోఽయమితి భావయేత్ ॥ 35 ॥

35. నిత్యము శరీరమునందే యున్న పరమశివశబ్దవాచ్యుడైన, లేక, పరమమంగళస్వరూపుడైన శివుని (పరమాత్మను) ధ్యానింపవలెను. స్వదేహము నందలి శుద్ధచైతన్యప్రకాశమునే ఈ దేవుడని ధ్యానింపవలెను.

నష్టం నష్ట ముపేక్షేత,చ ప్రాప్తం ప్రాప్త ముపాఽఽహరేత్ ।
నిర్వికారతయైతద్ధి, పరమార్చన మాత్మనః ॥ 36 ॥

36. నిర్వికారభావమున (చిత్తసమత్వమున) వినష్టమైన విషయముల నుపేక్షింపవలెను; ప్రాప్తములైన విషయములను సంగ్రహింపవలెను. సర్వావస్థలయందును, ఇట్టి నిర్వికారచిత్తమున నుండుటయే, పరమోత్తమమైన ఆత్మార్చనము.

సర్వం బ్రహ్మేతి నిశ్చిత్య, నిత్యాఽఽత్మాఽర్చా వ్రతం చరేత్★।
ఆత్మార్చన విధానేఽస్మిన్, ప్రోక్తా ద్రవ్యక్రియస్తు యాః ॥ 37 ॥

★ ఉపనిషత్తులందు ఆత్మపూజ ఇట్లు వర్ణింపబడినది.
... "తస్య నిశ్చిన్త (న్తా) ధ్యానమ్, సర్వకర్మ నిరాకరణ మావాహనమ్, నిశ్చయజ్ఞాన మాసనమ్, ఉన్మనీభావః పాద్యమ్, సదాఽమనస్క మర్ఘ్యమ్, సదాదీప్తి రాచమనమ్, అపారాఽమృతవృత్తిః స్నానమ్, సర్వాత్మభావనా గన్ధః, దృక్స్వరూపాఽవస్థాన మక్షతాః, చిదాప్తిః పుష్పమ్, చిదగ్నిస్వరూపం ధూపః, చిదాదిత్యస్వరూపం దీపః, పరిపూర్ణ చన్ద్రామృత రసైకీకరణం నైవేద్యమ్, నిశ్చలత్వం ప్రదక్షిణమ్, సోఽహంభావో నమస్కారః, మౌనం స్తుతిః, సర్వసన్తోషో విసర్జన మితి, య ఏవం వేద" । (యజుర్వేదీయ మణ్డల బ్రాహ్మణోపనిషత్ । 2)

ఏకేనైవ శమేనైతా రసేన పరిభావితాః ।★

37-38. సర్వమును బ్రహ్మమని అభేద దృష్టితో నిశ్చయించి, నిత్యమగు ఆత్మ యొక్క పూజా వ్రతము నాచరింపవలెను. ఈ ఆత్మార్చన విధానమున పూజావస్తుసంపద్ద్రవ్యము లన్నియు, ఏకమగు శాంతరసము చేత, తిరస్కృతములు కాగలవు. (లేక, వానినన్నిటిని శాంతరసమున ఊర బెట్టవలెను. (ఆప్లావితమొనర్పవలెను) అట్లు చేసినచో, ఇతర రుచులు నిరస్తములై, అవి, కేవలము మధురములే యగుచున్నవి.)

శాస్త్రైర్ద్రి ర్బుధ్యతే నాఽఽత్మా, గురోర్వచనతో న చ । 38 ।
బుధ్యతే స్వయమేవైషః, స్వబోధవశతః స్వతః ।
గురూపదేశశాస్త్రార్థై ర్వినా చాఽఽత్మా న బుధ్యతే । 39 ।
ఏతత్ సంయోగ సత్తైవ, స్వాత్మజ్ఞానప్రకాశినీ ।

38-40. పరమాత్మ వస్తువు, శాస్త్రవిచారము వలన గాని, గురూపదేశము వలన గాని, గ్రహింపబడునది కాదు. స్వబోధవశమున, తనంతకు తానే స్వయముగా ఎఱుగబడుచున్నది. (అభివ్యక్తమగుచున్నది). కాని, శాస్త్రార్థవిచారము, గురూపదేశము లేకున్నచో, ఆత్మజ్ఞానము సిద్ధింపదు. ఈ రెంటి సంయోగము యొక్క కలిమియే, ఆత్మజ్ఞానమును అభివ్యంజింప (ప్రకాశింప) జేయుచున్నది. [శాస్త్రములు, గురూపదేశములు, కేవలము మార్గదర్శకములు మాత్రమే. సాధకుడు తన, ఆత్మతత్త్వవిచార ధ్యానముల చేతనే, జ్ఞానమును పొందుచున్నా డనుటయే, పై శ్లోకముల యొక్క ఉద్దేశము]

ఏవం దేవాఽర్చనం నిత్యం యః కరోతి సమాహితః । 40 ।
యత్రాఽస్మదాదయో భృత్యా స్తత్ప్రయాతి పరం పదమ్ ।

40-41. ఇట్లు, దేవార్చనమును నిత్యము, సమాహిత చిత్తమున ఆచరించువాడు, ఎందు, మా వంటివారు భృత్యులై వర్తించుచుందురో, అట్టి యా పరమపదమును పొందుచున్నాడు.

---

★ "నమ విచిత్ర దుఃఖరాగద్వేషాది వికారహేతవః, శుద్ధ్యశుద్ధి కటు తిక్తాదివిషమరసా భోగ్యద్రవ్యశ్రియః, కథ మవికారం గ్రహీతుం శక్యా ఇతి చిదేకేన సమరసేన, సర్వేషాం వైషమ్య విరోపేవ మధురీకరణాదితి". (యో.వా.తా.ప్ర.)

**ఇత్యుక్త్వా నీలకణ్ఠోఽసౌ వస్తర్ధానం క్షణాద్గతః । 41 ।**
**తతః ప్రభృతి తేనైవ, క్రమేణాఽర్చన మాత్మనః ।**
**అద్య యావద్గతవ్యగ్రః, కుర్వన్నహమవస్థితః । 42 ।**

**41-42.** ఇట్లు వచించి, నీలకంఠుడు (పరమశివుడు) క్షణములో అంతర్హితుడై నాడు. అది మొదలుకొని నేటి వఱకు, ఆ క్రమమున, చిత్తము నేకాగ్రమొనరించి, **వ్యామోహవిముక్తుడనై (దుఃఖరహితుడనై)** నేను, దేవార్చన మాచరించు చు, నిలుకడ నొందియున్నాను.

**అనేనాఽర్చావిధానేన, మయేమే రామ! వాసరాః ।**
**అఖిన్నేనాఽతివాహ్యన్తే, వ్యవహారపరా అపి । 43 ।**

**43.** శ్రీరామా! ఈ అర్చావిధానమున దీక్ష గలవాడనై యున్న నాకు, సర్వ వ్యవహార పరములైనను, దినములు ఖేదరహితముగ కడచిపోవుచున్నవి. ఎట్టి విపత్తులును, నాకు శోకమును కలిగించుట లేదు.

**అనయైవ చ సద్దృష్ట్యా, సఙ్గముక్తేన చేతసా ।**
**సంసారవిరళాఽరణ్యే, విహరాఽస్మిన్ న ఖిద్యసే । 44 ।**

**44.** శ్రీరామా! ఈ ధ్యానరూపమగు సద్దృష్టిని అవలంబించి, నిస్సంగమైన చిత్తమున, విచ్ఛిన్నమై పోయిన ఈ సంసారారణ్యము నందు విహరింపుము; నీవు దుఃఖమును పొందవు.

*ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'దేవాఽర్చన విధానం' నామ ద్వావింశః సర్గః ।*

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'దేవార్చన విధానము'ను ద్వావింశతితమ (ఇరువది రెండవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## త్రయోవింశసర్గము

## చిచ్ఛక్తి ప్రభావః – శుద్ధ చైతన్యశక్తి యొక్క ప్రభావము

### 1. బిల్వఫలాఽఽఖ్యానమ్ : – బిల్వఫలోపాఖ్యానము

### (మారేడు పండు కథ)

వసిష్ఠ ఉవాచ :–
వాసనారహితై రన్తరిన్ద్రియై రాహర క్రియాః ।
కేవలై రిన్ద్రియైః సార్ధం, వర్తమానాఽర్థవర్తినా । 1 ।
అసఙ్గమేన మనసా, యత్కరోషి న తత్కృతమ్ ।

1. వసిష్ఠుడు :– వాసనా (సంస్కార) శూన్యమైన అంతరింద్రియములగు చిత్తాదులనాశ్రయించి,క్రియలను, స్వీకరింపుము. కేవలము ఇంద్రియములతో, దేశకాలాదుల ననుసరించి వర్తమానమున తటస్థించిన కార్యములందు, రాగరహితము, అసంగమునైన మనస్సుతో, నీవేది ఆచరించినను, అది ఆచరింపనిదే యగుచున్నది; అది బంధహేతువు కాజాలదు.

**యథా ప్రాప్తిక్షణే వస్తు, ప్రథమం తుష్టయే తథా ॥ 2 ॥**
**న ప్రాప్త్యేక క్షణా దూర్ధ్వ మితి కో నాఽను భూతవాన్ ?।**

2. ప్రాప్తిక్షణమున, ప్రథమవేళ, సంతుష్టిని (ఆనందమును) కల్గించిన వస్తువు, ఆ క్షణము తరువాత, అట్లు సంతుష్టిని కల్గింపజాలదను అనుభవము లేనివాడెవడు? [ప్రాప్తి క్షణమునకు, ముందును, తరువాతను. (పూర్వోత్తర కాలములందు) - విషయముల యొక్క తుష్టిహేతుత్వము స్థిరముగ నుండక, మారుచున్నందున, విషయములు, తుష్టిని కలిగించునను నియమము లేదు.]

**వాఞ్ఛాకాలే యథా వస్తు, తుష్టయే నాఽన్యదా తథా ॥ 3 ॥**
**తస్మాత్ <u>క్షణసుఖే సక్తం, బాలో బధ్నాతి నేతరః</u> ।**

3-4. కోరిన (తమి) వేళ యందే, విషయములు, సంతోషమును కల్గించున్నవి; కాని ఆ మీద, మఱొక వేళ కల్గింపవు. ఇట్టి చిరానర్థము, క్షణికమునైన సుఖము నందాసక్తి మూర్ఖులకే కాని, జ్ఞానుల కుండదు.

o (క్షణికమైనను, వస్తులాభకృతమగు వాంఛను నిరోధించుట, సుఖహేతువైనచో, ఆత్యంతికవాంఛానిరోధము, నిరతిశయానంద హేతువగుటలో సందేహము లేదు.)

**వాఞ్ఛాక్షణే తు యా తుష్టి, స్తత్ర వాఞ్ఛైవ కారణమ్ ॥ 4 ॥**
**తుష్టి స్త్వతుష్టిపర్యన్తా, తస్మాద్వాఞ్ఛాం పరిత్యజ ।**

4-5. విషయమును వాంఛించిన క్షణమున కలుగు సంతుష్టికి (సుఖమునకు) ఆ **వాంఛయే** కారణము. ఈసంతుష్టి, అసంతుష్టి యందే, పర్యవసించుచున్నది. **కావున, ఈ క్షణికసుఖవాంఛను, త్యజింపుము.**

**ఆశా యాతు నిరాశత్వ మభావం యాతు భావనమ్ ॥ 5 ॥**
**అమనస్త్వం మనో యాతు, తవాఽ సఙ్గేన జీవతః ।**

5-6 నిస్సంగుడవై జీవించు నీకు, ఆశ, నిరాశత్వమును, భావనము, అభావమును, మనస్సు, అమనస్త్వమును (సంకల్పరాహిత్యమును) పొందుగాక!

**వాసనాప్రాణసంరోధా దనిమేషం మనః కురు ॥		॥ 6 ॥**
**యత్ర నాఽభ్యుదితం చిత్తం,* తద్ధి సుఖ మనుత్తమమ్ ।**

★ అంతఃకరణము, వృత్తి భేదము వలన (1) మనస్సు (2) బుద్ధి (3) అహంకారము, (4) చిత్తము నని నాల్గు విధముల వ్యవహరింపబడుచున్నది.

**అత్రేమా మవబోధాయ, రామ! రమ్యాం కథాం శృణు ॥ 7 ॥**

7. మానసికసంస్కారములగు వాసనలను, ప్రాణవాయుచలనమును, నిశ్శేషముగ నిరోధించుట వలన, మనస్సును నిశ్చల మొనరింపుము. శ్రీరామా! చిత్త మెచ్చట లేకుండునో, అదియే (అట్టి స్థితియే) **నిరుపమానమగు ఉత్తమోత్తమసుఖము.** ఇచ్చట, ఈ యర్థము బోధపడుటకై, రమణీయమైన కథ నెఱిగింతును, వినుము.

## (బిల్వఫలోపాఖ్యానము)

**యుగై రవ్యజరద్రూప మస్తి బిల్వఫలం మహత్ ।**
**మహాకల్పాన్త వాత్యాయా అపి వేగై రచాలితమ్ ॥ 8 ॥**

8. యుగము లెన్ని గడచినను, స్వాభావికముగ అజరమై, క్షీణింపని యొక **మహాబిల్వఫలము** (గొప్పమారేడుపండు) కలదు. ప్రళయకాలమున అతివేగముగ వీచు మహా ఆవర్త వాయువుల ధాటికి సైతమిది చలింపదు.

**వైపుల్యేనాఽపరిచ్ఛేద్యం, మూలమాద్యం జగత్ స్థితేః ।**
**తస్య బిల్వ ఫలస్యాచ్ఛై ర్బ్రహ్మాణ్డాని సమీపతః ॥ 9 ॥**

---

**"మనో, బుద్ధి, రహఙ్కార, శ్చిత్త మిత్యన్తరాత్మకమ్ ।**
**చతుర్ధా లక్ష్యతే భేదో, వృత్త్యా లక్షణ రూపయా ।"** (భాగ. III. 26.15 )

సంకల్పవికల్పాత్మికవృత్తి మనస్సు. నిశ్చయాత్మక వృత్తి బుద్ధి. అనుసంధానాత్మక వృత్తి చిత్తము. ఇది పైన పేర్కొన్న తత్త్వములకు ఆధారము; స్మృతికి ఆయతనము. అభిమానాత్మిక వృత్తి అహంకారము. బుద్ధియందు చిత్తము, మనస్సు నందు అహంకారము, అంతర్గతములు.

**"బుద్ధిర్నామ నిశ్చయాత్మికాన్తఃకరణ వృత్తిః" ।**
**"మనో నామ సఙ్కల్ప వికల్పాత్మికాఽన్తః కరణ వృత్తిః" ।**
**"అనయోరేవ చిత్తాఽహఙ్కార యో రన్తర్భావః ।"**
**"అనుసన్ధానాత్మికాఽన్తఃకరణ వృత్తి శ్చిత్తమ్ ।"**
**"అభిమానాత్మికాఽన్తః కరణవృత్తిః అహఙ్కారః ।**

(చూడు :- వేదాంతసారము 65 - 69)

సంకల్పవికల్పాత్మికవృత్తి, సాధారణముగ, చిత్తమని, మనస్సని, అభేదముగ వ్యవహరింపబడుచున్నది. **చిత్, లేక సంవిత్ - ఈ శబ్దములు ఆత్మను నిర్దేశించును. ఆత్మయే బ్రహ్మము; సచ్చిదానందరూపము, అని శ్రుతులు వర్ణించును. ఇదియే పరమార్థసత్యము (Ultimate Reality)**

**ఈ బ్రహ్మమే, ఈశ్వరుడని, పరదేవతయని, పరమాత్మయని, జీవేశ్వర ప్రకృతులను భిన్నముగ భావించు ఉపాసకులు వర్ణింతురు. ఆత్మను పురుషుడని, పరమాత్మను పురుషోత్తముడని, వీరు భావింతురు. ప్రకృతి, విశ్వమునకు ఉపాదాన కారణము. (The source of material universe).**

9. దాని వైశాల్య మింతయని నిర్ణయించుటకు సాధ్యపడదు. ఇది సకల జగత్ స్థితికి (స్థితి, విధారణ, నియమనములకు,). ఆద్యమూలము. బ్రహ్మాండసమూహములన్నియు, ఈ బిల్వఫలముపై, సమీపముగ నున్నవి.

**సమస్తఫలసారస్య, ఫలస్యాఽస్య మహాఽఽకృతేః ।**
**అన్తఃస్థితత్వ మాయాతి, సంవిచ్ఛక్తి చమత్కృతిః ॥ 10 ॥**

10. సమస్త ఫలముల సారరూపమును, మహా ఆకృతియునగు ఈ ఫలము యొక్క అంతర్భాగమున, శుద్ధచైతన్యము యొక్క శక్తిచమత్కృతి – ఆశ్చర్యకర – (ప్రకాశము) ఉన్నది.

**ఇదం వ్యోమ మహానన్త, మియం కాలమయీ కళా ।**
**ఇయం నియతి రుద్యుక్తా, క్రియేయం స్పన్దరూపిణీ ॥ 11 ॥**
**బ్రహ్మాణ్డమణ్డపం చేద, మిమా ఆశాః క్రమో హ్యయమ్ ।**

11-12. అనంతమగు ఈ **ఆకాశము, కాలాత్మకమైన కళలు** (భాగములు) ప్రపంచమును నియమించుట యందు నిత్యప్రవృత్త మగు **నియతి,** చలనాత్మకములగు **క్రియలు, బ్రహ్మాండ మండపము, దిక్కులు,** వాని (వరుస) **క్రమములు,** ఇవి యన్నియు ఈ **బిల్వ ఫలమే,** – దీని శక్తి చమత్కారములే.

**శ్రీరామ ఉవాచ :–**
**భగవన్! సర్వసారజ్ఞ!, త్వయైషా బిల్వరూపిణీ*** ॥ 12 ॥
**మహాచిద్ఘనసత్తేహ, కథితేతి మతి ర్మమ ।**

12-13. **శ్రీరాముడు :–** సర్వసారభూతమైన పరతత్త్వ మెఱిగిన మహాత్మా! మీరు నుడివిన ఈ బిల్వఫలరూపిణి, విశ్వరూపిణియగు, మహాచిద్ఘన బ్రహ్మముయొక్క సత్త(ఉనికి) యని నేను భావింతును. [మహాచైతన్య సత్తయే, బిల్వ ఫలరూపమున వర్ణింపబడిన దని, నేను తలచుచున్నాను]

## 2. మహాశిలాఽఽఖ్యానమ్ – మహాపాషాణోపాఖ్యానము

**వసిష్ఠ ఉవాచ :–**
**అన్యథా వర్ణ్యమానాం చ, కథా మేతాం మయా శృణు ॥ 13 ॥**

---

★ శుద్ధచైతన్య మీ ఆఖ్యానమునందు, బిల్వఫలముతో నుపమింపబడినది. సమస్త విశ్వమును ఈ చైతన్యాంతర్గతమేయను సత్యము నిది స్థాపించును.

13. వసిష్ఠుడు :- శ్రీరామా! మఱొకరీతి, నేను వర్ణించుచున్న ఈ కథను వినుము.

**స్నిగ్ధా స్పష్టా మృదుస్పర్శా, మహావిస్తారశాలినీ ।**
**నిబిడా నిత్యనీరన్ధ్రా, క్వచిదస్తి మహాశిలా ॥ 14 ॥**

14. స్నిగ్ధమును (నునుపైనదియు), ప్రకాశవంతమును, మృదుస్పర్శ కలదియు, మహావిశాలమును, ఘనమును, నిత్యనీరంధ్రము(కొంచెమైనను ఎడము లేక వ్యాపించి నదియు) నగు, మహాశిల యొకటి కలదు.

**తస్యా మన్తః ప్రఫుల్లాని, పద్మాని సుబహూని హి ।**
**అన్యోన్య ప్రోతపత్రాణి, గూఢాని ప్రకటాని చ ॥ 15 ॥**

15. ఈ శిల లోపల, రమ్యములై, ప్రఫుల్లములైన (వికసితములైన), పద్మము (తామర) అనేకములు కలవు. ఆ పద్మముల పత్రములు పరస్పరము కలిసి యున్నవి. ఆ పత్రములు కొన్ని ప్రచ్ఛన్నములుగాను, మఱికొన్ని ప్రకటములుగాను, ఉన్నవి.

**ఊర్ధ్వమూలా న్యధోమూలా న్యమూలానీతరాణి చ ।**
**చిచ్ఛి లైషా మయోక్తా తే, యస్యా మన్త ర్జగత్స్థితిః ॥ 16 ॥**

16. కొన్ని పద్మములు, ఊర్ధ్వ మూలములు కలవి; కొన్ని, అధో మూలములు కలవి. మఱికొన్ని, అమూలములు - మూలమే లేనివి. తన లోపల, జగత్తు యొక్క స్థితి గల్గిన, శుద్ధచిన్మయాత్మకమగు ఈ శిలను నీకెఱిగించితిని.

**ఘనత్వైకాత్మకత్వాది వశా దేషా, శిలైవ చిత్ ।**
**తథా చిద్విశ్వగర్భాఽపి, న ముఞ్చత్యేక పిణ్డతామ్ ॥ 17 ॥**
**తథాఽనన్త వికారాఢ్యా, చితౌ బ్రహ్మాణ్డమణ్డలీ ।**

17-18. ఈ శుద్ధ చైతన్యము, మిగుల ఘనమైనది(దట్టమైనది), ఏకరూపమైనది. ఇత్యాదికారణముల వలన, ఇది, శిల యని వర్ణింపబడినది. దీని గర్భమున, సమస్తవిశ్వమున్నను, ఇది ఏక ఘనత్వమునువిడనాడదు. అగణితవికారములతోడి బ్రహ్మాండసమూహములు, ఈ శుద్ధ చైతన్యమునందే నెలకొని యున్నవి. (మహాశిల, సంభవములగు విగ్రహములన్నిటిని తన యందే కల్గియున్నట్లు, బ్రహ్మము, విశ్వము యొక్క సమస్తనామరూపములను, బీజరూపమున తనయందే కల్గియున్నదను సత్యము నీ ఆఖ్యానము స్థాపించును.)

## 3. అర్జునోపాఖ్యానమ్ – అర్జునుని వృత్తాంతము

**శ్రీరామ ఉవాచ :–**

**పుర్యష్టక స్వరూపం మే, భగవన్! కీదృశం? వద । 18 ।**

18. శ్రీరాముడు :– భగవంతుడా! "పుర్యష్టక" (అష్టాంగక నగర) స్వరూప మెట్టిదో నాకెఱిగింపుము.

**వసిష్ఠ ఉవాచ :–**

**అనాద్యన్తం జగద్బీజం, యద్బ్రహ్మాఽస్తి నిరామయమ్ ।**
**తదేవ కలనాయుక్త మత్ర జీవ ఇతి స్మృతః । 19 ।**

19. వసిష్ఠుడు :– శ్రీరామా! ఆద్యంతములు లేనిదియు, సర్వజగత్తులకు మూలకారణమును, నిరామయమును, నగు బ్రహ్మమే, స్వసంకల్ప శక్తియుక్తమై, జీవుడని స్మరింపబడినది.

**స జీవః ఖలు దేహేఽస్మిన్, చినోతి స్పన్దతే స్ఫుటమ్ ।**
**అహంభావా దహఙ్కారో, మననా న్మన ఉచ్యతే । 20 ।**
**బోధనిశ్చయతో బుద్ధి, రిన్ద్రదృష్టే స్తథేన్ద్రియమ్ ।**
**దేహ భావనయా దేహో, ఘటభావనయా ఘటః★ । 21 ।**

20-21. ఆ జీవుడే, వాసనల వలన అవయవములు కల్పించుకొని, ఈ దేహమునందు బాహ్యాభ్యంతర వ్యాపార రూపమున స్పందించు( చలించు) చున్నాడు. అహంభావము వలన **అహంకారమనియు,** మననము వలన

---

★ జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, అంతఃకరణ చతుష్టయము (మనో, బుద్ధి, అహంకార, చిత్తములు) ప్రాణపంచకము అను ఈ 19 (పందొమ్మిది)యు కలసి, లింగ శరీరము, లేక, సూక్ష్మ శరీరమన బడును. వేదాంతప్రకరణములందు, సూక్ష్మశరీరము 17 (పదునేడు) తత్త్వములతో మాత్రమే కూడినదిగా చెప్పబడినది. కాని, చిత్తము బుద్ధియందును, అహంకారము మనస్సునందును, చేరియున్నవని తెలియవలయును. ఈ లింగశరీరము, అంగుష్ఠమాత్రప్రమాణము కలది యనియు, మహాభారత మందలి సావిత్రీఉపాఖ్యానము వలన తెలియుచున్నది." అఙ్గుష్ఠ మాత్రం పురుషం నిశ్చకర్ష యమో బలాత్ ॥"
(మ.భా. వన–296–16)
జీవుడే లింగ శరీరమునధిష్ఠించి యుండుటచే, లింగశరీరస్వరూపుడుగా వర్ణింపబడినాడు.

మనస్సనియు, బోధనిశ్చయము వలన బుద్ధి యనియు, తానే తనకంటె నన్యమై, తనచేతనే పదార్థములు చూడబడుచున్నట్లు భావించుట వలన (అధిష్ఠానదేవతాదృష్టి వలన) ఇంద్రియమనియు, తానే దేహమని భావించుట వలన దేహమనియు, ఘటమని భావించుట వలన, ఘటమనియు, వ్యవహరింపబడుచున్నాడు.

**ఏష ఏవ స్వభావాత్మా, జనైః పుర్యష్టకం[1] స్మృతః ।**
**జ్ఞత్వ, కర్తృత్వ, భోక్తృత్వ, సాక్షిత్వాద్యభిపాతినీ[2] । 22 ।**

22. సర్వ వ్యాపార సాధారణ స్వభావాత్మయై ,పుర్యష్టకమనియు ఈ జీవుడు (వ్యష్టిచైతన్యము) జనులచే వ్యవహరింపబడుచున్నాడు.

జ్ఞానేంద్రియ వ్యాపారము చేత, జ్ఞత్వము, (జ్ఞాతృత్వము), కర్మేంద్రియ వ్యాపారముచేత కర్తృత్వము, తత్ఫలములగు సుఖదుఃఖముల నాశ్రయించుట చేత భోక్తృత్వము అన్నిటి యందును ఔదాసీన్యము వహించుట చేతను, ప్రకాశము చేతను, సాక్షిత్వము, మొదలగు ధర్మములను అధ్యాసవశమున పొందిన శుద్ధచైతన్యమే (సంవిత్తే), చిత్ప్రధానముగ భావింపబడినపుడు జీవుడనియు, జడత్వ ప్రధానముగ భావింపబడినపుడు పుర్యష్టకమనియు వ్యవహరింపబడుచున్నది.

**యా సంవిద్ జీవ ఇత్యుక్తా, తద్ధి పుర్యష్టకం విదుః ।**
**పుర్యష్టక వశేనైవ స్వప్నే త్స్వాప్నాన్తరం యథా । 23 ।**
**అసత్యమేవ పశ్యన్తి, జనా స్తద్వదిదం జగత్ ।**

(1) పంచతన్మాత్రలు, మనస్సు, బుద్ధి, అహంకారము ఈ 8 (ఎనిమిది) తత్త్వములు కలసి, 'పుర్యష్టకము' అని వ్యవహరింపబడుచున్నది. (చూడుః- XXసర్గము-15 శ్లోకము-పాదటీక)
(2) "ధర్మాధర్మౌ మనశ్చైవ పఞ్చభూతాని యాని చ,
ఇన్ద్రియాణి చ పఞ్చైవ యాశ్చాన్యాః పఞ్చదేవతాః ।
తాశ్చైవ మనసా సర్వే, నిత్య మేవాఽభిమానతః,
జీవేన సహ గచ్ఛన్తి, యావత్తత్త్వం న విన్దతి ।" (ఉత్తరగీత -I-45,46)
సూక్ష్మ (లింగ) శరీర భాగముగు విజ్ఞానమయకోశమే, కర్తృత్వ, భోక్తృత్వ, సుఖిత్వ దుఃఖిత్వాది అభిమానము చేత, ఇహ పరలోకములందు జనన మరణముల చేత పరిభ్రమించు వ్యావహారిక జీవుడని వేదాంతులందురు.

23-24. ఇట్లు జీవుడని వర్ణింపబడిన శుద్ధచైతన్యమే(సంవిత్తే) పుర్యష్టకమనియును తెలియవలయును. ఈ పుర్యష్టకము వలననే, ఒక స్వప్నము నుండి మఱొక స్వప్నమును గాంచునట్లు, జనులు, మోహబద్ధులై, అసత్యమైన ఈ జగత్తును సత్యముగ గాంచుచున్నారు.

(అర్జునోపాఖ్యానము)

**అర్జునవద్ధి నిర్దుఃఖం, సుఖం క్షేపయ జీవితమ్ । 24 ।**
**యమః కరిష్యతి తపో, దమనా త్పాపశఙ్కయా ।**
**మహీయం తేన నీరన్ధ్రా, భూతై ర్మర్త్యై రమృత్యుభిః । 25 ।**
**భారేణ పరిభూతాఽఙ్గీ, హరిం శరణ మేష్యతి ।**
**హరి ర్దేహద్వయేనాఽథ, భూమా వవతరిష్యతి * । 26 ।**

24-26. శ్రీరామా! పాండు పుత్రుడగు అర్జునుని వలె నీవును, దుఃఖ విముక్తుడవై సుఖముగ జీవిత కాలమును గడుపుము. యముడు, జీవులను హింసించుట వలన తనకు పాపము కలుగుచున్నదను శంకతో తప మాచరించును. అందువలన, మృత్యురహితులైన ప్రాణులతో-మానవులతో-భూమి క్రిక్కిరిసి యుండును. భూభారక్లేశమున పరిభవింపబడిన దేహము గల పృథివి, శ్రీహరిని శరణు చొచ్చును. అప్పుడు భగవంతుడు, దేహద్వయముతో, నరనారాయణరూపములతో, అవతరించును.

**వాసుదేవోఽర్జున శ్చేతి, తదా యుద్ధే హ్యుపస్థితే ।**
**అర్జునః స్వజనాన్ శత్రూన్, దృష్ట్వైష్యతి విషణ్ణతామ్ । 27 ।**

27. వాసుదేవుడు (శ్రీకృష్ణుడు), అర్జునుడు నని, భగవంతు డవతరించును. అర్జుననకును, అతని జ్ఞాతులకును యుద్ధము సంభవింపగా, ఆ సమయమున, శత్రువులైన స్వజనులను గాంచి, అర్జునుడు విషాదమును పొందును.

---

★ నరనారాయణులు, లేక, శ్రీకృష్ణార్జునుల అవతరణము పురాణేతిహాసముల ననుసరించి తరువాతి యుగమున – (ద్వాపరమున) – సంభవించినది. వసిష్ఠుడు త్రేతాయుగమున, భవిష్యత్కాల దర్శనముతో ద్వాపరయుగమున జరుగబోవు కురుక్షేత్ర సంగ్రామమునందు భగవంతుడు, శ్రీకృష్ణుడు, అర్జునున కొసగిన సందేశమును (భగవద్గీతను) ఇచట, శ్రీరామునకు. వివరించుచున్నట్లు ఉపపాదింపబడినది. ఇట్లు ఇందు కనిపించు కాలనిర్దేశ ప్రమాదము కేవలము ఆ భాస మాత్రమే. అదియును కాక, భగవద్గీతోపదిష్టమహోన్నతజ్ఞానమును, దాని ప్రాముఖ్యమును, ఇది ఉద్దీపింపజేయుచున్నది. యోగవాసిష్ఠగ్రంథకర్త, ఆధ్యాత్మజ్ఞాన నిర్భరములైన గీతోపదేశములను తన గ్రంథమున నీ ఉపపత్తి ద్వారా, చేర్చుకొనుటకు ఆకాంక్షించినాడని భావింపవలయును. మఱియు, విదితవేద్యులు (పరమాత్మనెఱిగినవారు), త్రికాలముల దర్శనములగు వారికి, అంతయు, ప్రత్యక్షమే.

బోధయిష్యతి తం దేవః, ప్రాప్తకార్యైక సిద్ధయే ।
"ఆత్మా హ్యనాదిమధ్యాన్తః, హతే దేహే న హన్యతే । 28 ।
శాశ్వతోఽయ మజో నిత్యో, జన్మమృత్యు వివర్జితః ।[1]

28. ప్రాప్తించిన కార్యము సిద్ధించు నిమిత్తము, ఆ దేవుడు (శ్రీకృష్ణుడు) అర్జునున కిట్లు బోధించును. "ఆత్మ, ఆదిమధ్యాంతములు లేనిది. ఆత్మ, అజము, నిత్యము, శాశ్వతము, జన్మమృత్యువులు లేనిది. శరీరము హత (వినష్ట)-మగుచున్నను, ఆత్మ, హతము (వినష్టము) కాదు.

యోగస్థః కురు కర్మాణి, సఙ్గం త్యక్త్వా ఫలాని చ । 29 ।
సంన్యస్త సర్వసఙ్కల్పః, సమః శాన్తమనా భవ! ।
త్యాగః సఙ్కల్ప జాలానా, మసఙ్గ ఇతి కథ్యతే । 30 ।

29-30. సంగమును (సంసక్తిని), ఫలములను త్యజించి, యోగమున నెలకొన్న వాడవై (ఈశ్వరు నాశ్రయించి) కర్మముల నాచరింపుము. సర్వ సంకల్పములను త్యజించి, సముడవు, శాంతచిత్తుడవు కమ్ము. సంకల్పజాలమును త్యజించుటయే 'అసంగము' – అని చెప్పబడుచున్నది.

మన్మనా భవ మద్భక్తో, మద్యాజీ మాం నమస్కురు ।
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః[2] । 31 ।

"యదా విదితవేద్యః సంస్త్రికాలాఽమలదర్శనః ।
భవిష్యసి తదా తాని, ప్రత్యక్షేణైవ ద్రక్ష్యసి ।" (VI-నిర్వాణ-ఉత్తర-176.4)
"శ్రీరామా! తత్త్వజ్ఞుల యందు త్రికాలాఽమలదర్శనము ప్రసిద్ధము. కాన, జ్ఞేయమగు (ఎఱుగదగిన) పరమాత్మ నెఱిగి, త్రికాలాఽమల దర్శనము గల వాడవై నపుడు, సర్వత్ర (ఎల్లెడల) నీ యొక్క ద్రష్టృత్వ (సర్వజ్ఞత్వ)ము వలన, అతీత అనాగతములు, వ్యవహితములు, విప్రకృష్టములునైన (వ్యవధానము వలన దూరముగ నుండు నవియునైన) అనంత బ్రహ్మండములకును, వర్తమానమైన ఈ బ్రహ్మండమునకును, లేశమైనను విశేషము లేదని, ప్రత్యక్షముగ నీవే యెఱుగగలవు." అని వసిష్ఠుడుపదేశించెను.

(1) "న దేవం జాయతే, అస్తి, వర్ధతే, విపరిణమతే, అపక్షయతే, నశ్యతి" ।
ఆత్మకు (1) జన్మ, (2) అస్తిత్వము, (3) వృద్ధి, (4) పరిణామము (మార్పు) (5) అపక్షయము (తగ్గుట), (6) వినాశము – అను షడ్భావవికారములు లేవు. ఈ వికారములు జడవస్తు ధర్మములు. ఆత్మ, చిన్మయమగుటచే, అందీ షడ్విధవికారములు లేవు. సర్వ ప్రకారముల ఆత్మ, విక్రియా రహితము.

(2) పోల్చు :- "తస్మాత్ సర్వాత్మనా తాత! నిగృహాణ మనో ధియా ।
మయ్యావేశితయా యుక్త, ఏతావాన్ యోగ సంగ్రహః" । (భాగ. XI-23-61)
"కావున తండ్రీ! నా యందు ఆవేశితమైన బుద్ధితో యుక్తుడవై, సర్వవిధముల మనస్సును నిగ్రహింపుము. ఇదియే యోగసంగ్రహము" – అని భగవంతుడు ఉద్ధవున కుపదేశించెను.

31. నా యందు మనస్సును నిల్పుము, నా భక్తుడవు కమ్ము, నన్ను పూజింపుము, నాకు నమస్కృతి నొనర్పుము. ఇట్లు శరణాగతుడవై, మనస్సును నా యందు నిల్పినచో, పరమానందరూపుడనైన నన్నే పొందగలవు.

**సామాన్యం పరమం చేతి, ద్వేరూపే విద్ధి మే ఽనఘ! ।**
**పాణ్యాదియుక్తం సామాన్యం, పరం సూక్ష్మ మనామయమ్ ॥ 32 ॥**

32. పాపరహితుడా! సామాన్యరూపమనియు, పరరూపమనియు, నాకు రెండురూపము(ఆకృతు)లున్నవని తెలియుము. సర్వజన సాధారణముగ, హస్తపాదాది అవయవములు కల్గి, (శంఖచక్ర గదాదుల ధరించి) నది సామాన్యరూపము. పరరూపము సర్వాతీతమైనది, సూక్ష్మము, నిష్కళంకము. (నిరామయము).

**యావ దప్రతిబుద్ధ స్త్వం, తావత్సామాన్యకో భవ!।**
**తత్క్రమా త్వం ప్రబుద్ధ స్త్వం, తతో జ్ఞాస్యసి తత్ పరమ్ ॥ 33 ॥**

33. ఆత్మజ్ఞానము కలుగనంత వఱకు, సామాన్యకుడుగా నుండుము. [భగవంతుని ఆకారవంతునిగా పూజించుచుండుము].* అపుడు చిత్త

---

★ పోల్చు :- "యావ న్నపశ్యే దఖిలం మదాత్మకం,
తా వన్మదారాధన తత్పరో భవేత్ ।
శ్రద్ధాలు రత్యూర్జిత భక్తి లక్షణో,
య స్తస్య దృశ్యోఽహ మహర్నిశం హృది ।
(అధ్యాత్మరామాయణము –ఉత్తర – V-58 - శ్రీరామగీత)

మనుజుడు ఎంత వఱకు, సమస్తవిశ్వమును నా స్వరూపముగా గాంచ జాలడో, అంత వఱకు, నా ఆరాధన యందు నిష్ఠాపరుడు కావలెను. శ్రద్ధావంతుడును అతిశయ దృఢభక్తిలక్షణుడునైన వాని హృదయమున, రేపగలు, ఎల్లప్పుడును, నేను గాన్పించుచుందును.

మఱియు పోల్చు :- "నిత్యం స్మరన్ జలదనీల ముదారహార –
కేయూర కుండల కిరీట ధరం హరిం వా ।
గ్రీష్మే సుశీతమివ వా హ్రద మస్తశోకం,
బ్రహ్మ ప్రవిశ్య భజ! నిర్వృతి మాత్మనీనామ్ "।
(ప్రబోధచంద్రోదయము-V-31)

అనవరతము మేఘశ్యామలమూర్తియు, అమూల్యహారకేయూరకుండలకిరీటధారియు నైన హరిని (సగుణమూర్తిని), భజింపుము. లేదా, గ్రీష్మకాలమున తీవ్రతాపపరితప్తుడు, అత్యంత శీతలమునైన హ్రదమును (సరస్సును) ప్రవేశించునట్లు, సంసారకారణీభూతదుఃఖరహితమైన పరబ్రహ్మమును ప్రవేశించి, ఆత్మహితమగు పరమసుఖమును, పొందుము.

"యద్యపి గగనం శూన్యం తథాఽపి జలదాఽమృతాంశురూపేణ ।
చాతక చకోరనామ్నో ర్దృఢభావాత్ పూరయ త్యాశామ్ ।
తద్వ ద్భజతాం పుంసాం దృగ్వాఙ్మనసామగోచరోఽపి హరిః ।
కృపయా ఫల త్యకస్మాత్ సత్యానన్దాఽమృతేన విపులేన ।"
(శంకరుడు–ప్రబోధ సుధాకరము–256,57)

శుద్ధి క్రమమున, సంప్రబుద్ధుడవై నపుడు, సర్వాతీతమైన ఆ పరరూపము నెఱుగగలవు. (చూడు :- సర్గ XI. శ్లో.6. పాదటీక)

**అజ్ఞానా దాత్మనో నూనం, సత్తా మాయాతి వాసనా ।**
**ఆత్మజ్ఞానే మహాబోధా ద్విలయం యాతి వాసనా" ॥ 34 ॥**
**ఏవం సంబోధితః సమ్యక్, త్యక్త శోకో భవిష్యతి ।**

**34-35.** ఆత్మజ్ఞానము లేకుండుట వలననే, వాసన (మానసిక సంస్కారము) ఉత్పన్నమగుచున్నది. ఉనికిని పొందుచున్నది. ఆత్మ జ్ఞానమున మహా ప్రబోధము కల్గుట వలన, వాసన, సమూలముగ విలయ మందుచున్నది." ఇట్లు భగవంతునిచే ఉపదేశింపబడి అర్జునుడు, సంపూర్ణముగ శోక విముక్తుడగును

**4. భిక్షూపాఖ్యానమ్ –** భిక్షువు వృత్తాంతము, లేక, శతరుద్రోపాఖ్యానము

**అపరం కస్యచి ద్భిక్షో, రితిహాస మిమం శృణు ॥ 35 ॥**
**ఆసీత్కశ్చి న్మహాభిక్షుః, సమాధ్య భ్యాసతత్పరః ।**
**యచ్చిన్త యతి తచ్చిత్తం, తద్రూపం ప్రతిపద్యతే ॥ 36 ॥**

**35-36.** ఒకానొక భిక్షువు యొక్క **ఇతిహాసమును,** మఱొక దానిని వినుము. సమాధి నభ్యసించుట యందు ఆసక్తుడైన ఒక మహా భిక్షువు ఉండెను. దేని నతడు సంకల్పించునో, ఆసంకల్పితపదార్థ స్వరూపము నతడు పొందుచుండెను.

**కదా చిదేష లీలార్థ మభూ 'జీవట' నామకః ।**
**'జీవటో' విహరన్ స్వప్నే, కశ్చిద్విప్రో బభూవ హ ॥ 37 ॥**
**విప్రః స్వప్నేచ సామన్తః, సోఽపి స్వప్నేఽభవన్ నృపః ।**

**37-38.** ఒకప్పుడతడు విలాసార్థము, **జీవటుడను** పురుషుడై నాడు. ఆ జీవటుడు తనఇచ్ఛకువచ్చిన రీతి విహరించుచు, స్వప్నమున నొక **బ్రాహ్మణు డైనాడు.** ఆ విప్రుడును మరల స్వప్నమున, **సామంతరాజైనాడు.** ఆ సామంతరాజు సైతము, స్వప్నమున **ప్రభువైనాడు.**

---

ఆకాశము శూన్యమయ్యును, చాతకచకోరములకు దృఢభావము వలన, మేఘ, చంద్రరూపములతో, వాని ఆశను పూరించుచున్నట్లు, భగవంతుడు, దృగ్వ్యాప్తమనస్కులకు అగోచరుడయ్యును, కృపతో తన్ను భజించు భక్తులకు సాక్షాత్కరించి, నిరతిశయ సత్యానందామృత రూప ఫలమును అనుగ్రహించును.

ఏవం స క్రమశః స్వప్నే, సురస్త్రీ చ తతో మృగీ ॥ 38 ॥
భూత్వా తతో లతా భూత్వా, భ్రమరత్వ ముపాగతః ।
భ్రమరో వారణాఽఽలోకా ద్వారణత్వ మవాప్య సః ॥ 39 ॥
గణ్డస్థ భ్రమరాఽధ్యాసాద్గజో భూయోఽప్యభూద్అలిః ।
పార్శ్వస్థ హంససంవిత్త్యా, హంసో భూత్వా పునర్లుఠన్ ॥ 40 ॥
బ్రహ్మసారసతాం ప్రాప్తః, సోఽపశ్య ద్రుద్ర మేకదా ।
తదా బుద్ధి ర భూ త్తస్య, రుద్రోఽహమితి నిశ్చితా ॥ 41 ॥

**38-41.** ఇట్లు క్రమముగా, స్వప్నమున నతడు దేవాంగనగా, హరిణి (ఆడుజింక)గా, పుష్పలతగా, నయి, తుమ్మెదగా జన్మించినాడు. ఆ తుమ్మెదయు, నొక గజమును గాంచి, గజమైనది. ఆ గజమును, తన గండస్థలమున నున్న తుమ్మెద యొక్క అధ్యాస వలన, మరల తుమ్మెదయే యైనది. పార్శ్వమున నున్న హంసను భావించుట వలన, ఆ తుమ్మెదయు హంసగా, జన్మించినది. అదియే మరల ముందు వెనుకలకు జరిగి, తుదకు బ్రహ్మకు వాహనమైన హంసగా బుట్టినది. ఒకప్పుడది స్వేచ్ఛగా విహరించుచు, కైలాసమున రుద్రుని గాంచినది; "నేను రుద్రుడను కావలయు"నను నిశ్చిత బుద్ధి వలన రుద్రత్వమును పొందినది.

రుద్ర స్త్వమత్తమజ్ఞానవిలాసిన్యా ధియా తతః ।
స్వస్యాఽశేష ముదన్తం తం, దృష్ట్వావిస్మయమాగతః ॥ 42 ॥

**42.** రుద్రత్వమొందిన ఆ భిక్షువు (హంస) ఉత్క్రాన్త విశుద్ధవిజ్ఞాన విలాసిని యగు బుద్ధితో, తన వృత్తాంతమును (చిత్రవిచిత్రములైన తన వెనుకటి స్వప్నములను) సమగ్రముగా గాంచి, ఆశ్చర్యపరవశుడైనాడు.

"అహో ! విచిత్రం మా యేయం, బత ! విశ్వవిమోహినీ ।
అహం యోనిశతే భ్రాన్త్వా, రుద్రత్వ మధునా గతః ॥ 43 ॥

**43.** "ఔరా! విశ్వవిమోహిని యగు ఈ మాయ విచిత్రమైనది. జన్మ శతములందు పరిభ్రమించి, నేడు నేను రుద్రత్వ మొందితిని.

తాం స్తాన్ సర్వాన్ స్వసంసారా నుత్థాప్యాఽఽలోకయామ్యహమ్ ॥"
ఇతి సంచిన్త్య రుద్రోఽపి, యత్ర భిక్షు స్తతో గతః ॥ 44 ॥

44. నా పూర్వభిక్షుప్రభృతి సంసారశరీరసమూహముల నన్నిటిని లేపి, చూచెదను గాక!" - అని నిశ్చయించి, ఆ రుద్రుడు, భిక్షువున్న ప్రదేశమున కేగినాడు.

**సుప్తం తం బోధయిత్వాఽథ, చేతసా చేతనేన చ ।**
**యోజయామాస, సస్మార, భిక్షు రప్యాత్మనో భ్రమమ్ ।45 ।**

45. నిద్రించుచున్న వాని వలె పడియున్న ఆ భిక్షువును, రుద్రుడు మేల్కొల్పి, చిత్తమును, చైతన్యము (ప్రాణము)ను, వానికి కలిగించెను. ఈ భిక్షువును, చైతన్యమొంది, తన భ్రమను స్మరించెను.

**రుద్ర మాత్మానమాలోక్య, జీవటాది మయం తథా ।**
**ఉభౌ తౌ జగ్మతుః శీఘ్రం, జీవటస్య నివేశనమ్ ।46 ।**

46. తన రుద్రత్వమును, జీవటాది దేహపరంపరలను, అతడు కాంచినాడు. తరువాత వారిరువురును, శీఘ్రముగ, జీవటుని నివాసమున కేగినారు.

**తం ప్రబోధ్య నియోజ్యాఽఽశు, చేతసా చేతనేన చ ।**
**బోధయన్త స్త్రయో జగ్ము ర్విప్రసామన్తకాదికాన్ ।47 ।**

47. అతనిని మేల్కొల్పి, చిత్తమును, చైతన్యము (ప్రాణము)ను, కూర్చి, వెంటనే, ఆ ముగ్గురును, బ్రాహ్మణుడు, సామంతుడు మొదలగు వారి నివాసముల కేగి, వారిని సైతము మేల్కొల్పినారు.

**రుద్రాఽంశా స్తే తతః సర్వే, దివ్యజ్ఞానాః చకాశిరే ।**
**ప్రయయుః స్వాఽఽస్పదం తేఽపి, రుద్రేణాఽథ నియోజితాః ।48 ।**

48. తరువాత, వారందఱును, రుద్రాంశులును, దివ్యజ్ఞానవంతులునై, ప్రకాశించినారు; రుద్రునిచే నియుక్తులై వారు, తమ తమ నివాసముల కేగినారు.

**స్వకళత్రైః సమం దేహం, క్షపయిత్వాఽథ కాలతః ।**
**రుద్రేణ సహ తే సర్వే, దేహాఽన్తే రుద్ర మాప్నువన్ ।49 ।**

49. వారందఱును, తమ భార్యలతో కొంత కాలము భోగముల ననుభవించి,

కాలగమనమున, రుద్రునితో కూడ శరీరములను త్యజించి, రుద్రత్వ మొందినారు. (వ్యక్తి యొక్క జన్మపరంపరలపై, అతని, సంకల్పము, ఆకాంక్ష, భావన - వీని ప్రభావమును ఈ భిక్షూపాఖ్యానము వ్యాఖ్యానించుచున్నది. జగముల లోపల, జగములు కలవను సిద్ధాంతమును సైతమిది విశదపఱచుచున్నది.)

సర్వ మస్తి చితఃకోశే, యద్యథాఽఽలోక యత్యసా ।
సర్వం హ్యభిమతం కార్య, మేకనిష్ఠస్య సిధ్యతి* ॥ 50 ॥

50. దేని దేనిని, మనుజుడు గాంచునో, అది యంతయు సర్వగతమగు శుద్ధ చైతన్య కోశముననే వెలయుచున్నది. అభిమతములైన సర్వకార్యములును ఏకనిష్ఠ సంపన్నునకు (ఏకాగ్రచిత్తవృత్తి గలవానికి) సిద్ధించుచున్నవి.

---

* పోల్చు :- "వ్యుత్థాన నిరోధ సంస్కారయో రభిభవ ప్రాదుర్భావౌ
నిరోధక్షణ చిత్తాఽన్వయో నిరోధ పరిణామః ।"
"తస్య ప్రశాన్తవాహితా సంస్కారాత్ ।"
"సర్వార్థతైకాగ్ర తయోః క్షయోదయౌ చిత్తస్య సమాధిపరిణామః ।"
"తతః పునః శాన్తోదితౌ తుల్య ప్రత్యయౌ చిత్త స్యైకాగ్రతా పరిణామః ।"
"నిర్మాణ చిత్తాన్యస్మితా మాత్రాత్ ।"
"ప్రవృత్తి భేదే ప్రయోజకం చిత్తమేక మనేకేషామ్ ।
[యోగదర్శనము - III-9, 10, 11, 12, మఱియు IV-4,5 - సూత్రములు]

"రజస్తమోగుణజన్యములై, సమాధికి నిరోధములైన సంస్కారములను, తిరస్కరించి,సమాధికి అనుకూలమైన చిత్తవృత్తి నిరోధ సంస్కారములు పెంపొందగా, చిత్త మీవృత్తి నిరోధ సంస్కారముల ననుసరించుటే నిరోధ పరిణామము.
ఈ నిరోధసంస్కారబలము వలన, చిత్తమునకు ప్రశాంతి రూప ప్రవాహ స్థితి కల్గుచున్నది.
సకలవిక్షేపధర్మములను వదలి వేసి, చిత్తము ఏకధ్యేయవిషయచింతనమున నిలుకడ నొందుటే, చిత్త సమాధి పరిణామము.

సమాహితచిత్తముయొక్క గతాఽఽ గతవృత్తులన్నియు, సమానప్రత్యయవంతములై నిరవధికముగ కొనసాగుటే చిత్తముయొక్క ఏకాగ్రతా పరిణామము. ఏకనిష్ఠమైన చిత్తము సకలార్థ సాధకము.

యోగి, స్వయముగ నిర్మించుకొన్న శరీరములందు గల చిత్తములన్నియును, మూల కారణమగు అస్మితా మాత్రమనవే స్వాహంకార ప్రకృతి నుండియే, అగ్ని నుండి విస్ఫులింగములట్లు ప్రసరించును. అనేక చిత్తముల యొక్క నానా ప్రకారములైన ప్రవృత్తులకు, ఏకమగు ప్రధాన చిత్తమే నియామకము - ప్రభువు."

తస్మాదేకార్థ నిష్ఠత్వా ద్భిక్షుజీవేన రుద్రతామ్ ।
ప్రాప్య, రుద్రాత్మనా లబ్ధా, సఙ్కల్పార్థస్య సత్యతా । 51 ।

51. కావున, ఏకార్థనిష్ఠత్వము వలన, భిక్షుజీవనము గల యొక వ్యక్తి, రుద్రత్వమును పొంది, ఆ రుద్రభావమున, సంకల్పకల్పిత పదార్థములను సత్యమొనరించుకొని వానిని పొందగల్గినాడు.

భిక్షుసఙ్కల్పజీవా స్తే, ప్రత్యేకం సత్యతాం గతాః ।
రుద్రవిజ్ఞానవశత, స్త్వవిశు స్తత్పరం పదమ్ । 52 ।

52. భిక్షువుయొక్కసంకల్పమువలన జనించిన జీవటాదులగు జీవులంద ఱును, ప్రత్యేకముగ సత్యత్వమును పొంది, రుద్రవిజ్ఞానము వలన ఆ పరమ పదమును పొందినారు.

సహస్రధా భవే దేకః, సఙ్కల్పాద్ధి యథా హరిః ।
అంశావతారలీలాభిః, కురుతే జాగతీం స్థితిమ్ । 53 ।

53. భగవంతుడగు హరి ఒక్కడయ్యును, అంశావతార లీలలచే, జగత్‌స్థితిని ఆచరించుచున్నట్లు, సంకల్పము చేతనే ఒకడు, వేయివిధముల రూపములను పొందగలడు.

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'చిచ్ఛక్తి ప్రభావో' నామ త్రయోవింశః సర్గః ।
ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'చిచ్ఛక్తి ప్రభావ' మను త్రయోవింశతితమ (ఇరువది మూడవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యో, శ్రీ రామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## చతుర్వింశసర్గము

## భగీరథోపాఖ్యానమ్ – భగీరథుని వృత్తాంతము

### 1. సౌషుప్తమౌనమ్ – సుషుప్తికి సంబంధించిన మౌనము – (పరమచిత్తవిశ్రాంతి)

వసిష్ఠ ఉవాచ :-
సౌషుప్తమౌనవాన్ భూత్వా, త్యజ చిత్తవిలాసితమ్ ! ।

1 వసిష్ఠుడు :- సుషుప్త మౌనమును పొంది, చిత్తము యొక్క స్వాభావిక ప్రవృత్తుల ననుసరించుటను పూర్తిగ విడనాడుము.

శ్రీ రామ ఉవాచ :-
సౌషుప్తమౌన మిత్యే తద్బ్రూహి బ్రహ్మన్! కి ముచ్యతే? ॥ 1 ॥

1 శ్రీ రాముడు :- బ్రహ్మజ్ఞుడవగు స్వామీ! ఈ సౌషుప్తమౌనమనవేమో నాకు వివరింపుము.

వసిష్ఠ ఉవాచ :–

వాఙ్మౌనం వచసాం రోధో, బలాదింద్రియ నిగ్రహః ।
అక్షమౌనం, పరిత్యాగం చేష్టానాం కాష్ఠసంజ్ఞకమ్ ॥ 2 ॥
ప్రస్ఫురచ్చిత్తకలన మేతన్మౌనత్రయం భవేత్ ।

2-3. వసిష్ఠుడు :- వాగ్విషయకమగు నిరోధము (మాటలాడకూడదను సంకల్ప స్థైర్యము) వాఙ్మౌనము. బలవంతముగా, ప్రయత్నముతో, ఇంద్రియముల నిగ్రహించుట, అక్ష(ఇంద్రియ)మౌనము. సర్వకర్మములను (చేష్టలను) ప్రయత్నములను, పరిత్యజించుట కాష్ఠమౌనము. ఇవియే త్రివిధమౌనములు. ఇవి మూడును, వ్యుత్థానకాలమున (సమాధిని విరమించి లేచిన సమయమున), మరల చిత్తచాంచల్యమును కలిగించునవియే.

అవిభాగ మనభ్యాస మనాద్యన్తం యదాస్థితమ్ ॥ 3 ॥
ధ్యాయతోఽధ్యాయతశ్చైవ, సౌషుప్తం మౌన ముచ్యతే ।(1)

3-4. విభాజకవికల్పము క్షీణమగుటచే, (అఖండమగుటచే) తారతమ్యవిభాగ రహితమును, కావుననే, అభ్యాసనిరపేక్షమును, అపరిచ్ఛిన్నాత్మ రూపత్వము వలన అనాద్యంతమును, ధ్యానచిత్తులకు, అధ్యానచిత్తులకును సమమై, ధ్యాన, ధ్యేయ, ధ్యాతృ రూపమగు త్రిపుటి లేనిదియు నగు చిత్తు (ఆత్మ) స్థితియే, సౌషుప్త మౌనము. లేక, పరమచిత్తవిశ్రాంతి యనబడుచున్నది.

యథాభూత మిదం బుద్ధ్వా, జగ న్నానాత్వ విభ్రమమ్ ॥ 4 ॥
యథాస్థిత(2) మసన్దేహం, సౌషుప్తం మౌన(3) ముచ్యతే ।

(1) పోల్చు :- "సుషుప్తమౌనం తత్రాఽపి, తుర్యాతీత ప్రతిష్ఠితమ్ ।"
జీవన్ముక్తులగు మహాత్ములకు గల స్థితి, సుషుప్తమౌనమనబడును. ఇది తుర్యావస్థాతీతమైన స్థితి. పరమమగు చిత్త విశ్రాంతి. స్వభావ సిద్ధమైన ఆత్మ నిశ్చయమే, – సర్వసాక్షిత్వభావసిద్ధియే, సౌషుప్త మౌన మనియును ఇది వర్ణింపబడినది. సుషుప్తి అనగా గాఢ నిద్ర. గాఢ నిద్రాస్థితియే సుషుప్తి స్థితి. కాని, ఈ సందర్భమున ఏ శబ్దము పరమచిత్తవిశ్రాంతిని నిర్దేశించుచున్నది.

(2) "జగదితి నానాత్వవిభ్రమో యస్మిం స్తత్, ఇదం ఆత్మతత్త్వం యథాస్థితం బుద్ధ్వా ।"
[ఆనందబోధేంద్ర సరస్వతి – తాత్పర్య ప్రకాశాఖ్యవ్యాఖ్య – (నిర్వాణ–పూర్వార్ధ–68–19]

(3) సనత్సుజాతుడు (సనత్కుమారుడు) పరమాత్మయే 'మౌనము' అని వర్ణించును.
"యతో న వేదా మనసా సహైన
మనుప్రవిశన్తి తతోఽథ 'మౌనమ్' ।

4-5. నానాత్వభ్రాంతిపూర్ణమగు జగత్తును, ఉన్నదున్నట్లుగా తెలిసికొని, అది యంతయు ఆత్మతత్త్వమునందే వెలయుచున్న దనియు', ఆత్మ తత్త్వము, నానాత్వభేదరహితమను యథాస్థితిని, నిస్సందేహముగ నెఱుగుటయే సుషుప్త మౌనమనబడుచున్నది.

సౌషుప్త మౌనం యోగీశై ర్ద్వివిధైః ప్రాప్యతే ఖలు ॥ 5 ॥

5. సౌషుప్తమౌనమును, రెండుతెఱగులకు చెందిన యోగీంద్రులు పొందు చున్నారు.

సమ్యగ్ జ్ఞానాఽవబోధేన, నిత్యమేక సమాధినా ।
సంఖ్యయై★వాఽవబుద్ధా యే, తే సాంఖ్యయోగినః స్మృతాః ॥ 6 ॥

6. నిత్యము, ఏకతత్త్వనిష్ఠమగు ధ్యానసమాధిచే, సమ్యగ్జ్ఞానమును పడసి, వివేకవిచారప్రయుక్తమగు రాజయోగము వలననే, సౌషుప్తమౌనమును పొందువారు సాంఖ్యయోగు లనబడుచున్నారు.

ప్రాణాద్యనిలసంశాన్తౌ, యుక్త్యా యే పదమాగతాః ।
అనామయ మనాద్యన్తం, తే స్మృతా యోగయోగినః ॥ 7 ॥

7. ఉపాయముచే, ప్రాణాదివాయువుల నుపశమింపచేసి – (ప్రాణచలన నిరోధోపాయము నాశ్రయించి) ఆద్యంత రహితమును, నిర్వికారమునైన పదమును (పరబ్రహ్మమును) ప్రాపించువారు యోగయోగు లన బడుచున్నారు.

యత్ సాంఖ్యైః ప్రాప్యతే స్థానం, పరం యోగై స్తదేవ హి ।
ఏక తత్త్వ ఘనాఽభ్యాసః, ప్రాణానాం విలయ స్తథా ॥ 8 ॥
మనో వినిగ్రహశ్చేతి, మోక్ష శబ్దార్థ సంగ్రహః ।
ఏకస్మిన్నపి సంసిద్ధే, తే సిద్ధ్యన్తి పరస్పరమ్ ॥ 9 ॥

---

యత్రోత్థితో వేదశబ్దస్తథాఽయం,
న తన్మయత్వేన విభాతి రాజన్! ।" (సనత్సుజాతీయము-II-2)
వేదములే మనస్సుతో సహ, పరమాత్మను పొందజాలవు కాన, అతడు (పరమాత్మ) 'మౌన'మనబడుచున్నాడు. ('యతో వాచో నివర్తన్తే, అప్రాప్యమనసా సహ'।) సర్వశాస్త్రోత్పత్త్యాధార భూతమగు వేదశబ్దము, పరమాత్మ నుండి ఉత్థితము. (వేదకర్త పరమాత్మయే). వేదము, పరబ్రహ్మమును నిర్దేశించుటకే కల్గినది. పరమాత్మ, వేదమయుడై, జ్యోతిర్మయుడై ప్రకాశించుచున్నాడు.

★ సంఖ్యయా వివేకవిచారప్రయుక్త రాజయోగేన । (యో.వా.తా.ప్ర.)

8-9. వివేకవిచారప్రయుక్తమగు సాంఖ్యయోగము నాశ్రయించువారు, ఏకరూపమగు బ్రహ్మమును, ఆత్మగా భావించి నిరంతరదృఢాభ్యాస మొనర్చుటయును, ప్రాణచలననిరోధమును, మనోనిగ్రహము ననునవియే, మోక్షకారణమైన సాధనత్రయము. ఇదియే సర్వశాస్త్రార్థతాత్పర్య సంగ్రహము. వీనిలో ఒకదాని యందు సంపూర్ణముగ సిద్ధి కలిగినచో, తక్కినవన్నియు పరస్పరము, సంపూర్ణముగ సిద్ధించుచున్నవి.

**అవినాభావినీ నిత్యం, జన్తూనాం ప్రాణచేతసీ ।**
**కుసుమాఽఽమోదవ న్మిశ్రే, తిలతైల ఇవస్థితే ॥ 10 ॥**

10. జీవుల ప్రాణము, చిత్తము – ఇవి అవినాభావసంబంధముకలవి. ఎప్పటికిని పరస్పరము విడిచి యుండునవి కావు. పూవును, పరిమళము, వలెనే, నూవులు, నూనెయును, వలెనే, ఇవి, యైక్యము నొందియుండును.

**ఆధారాఽఽధేయవ చ్చైతా వేకాఽభావే వినశ్యతః ।**
**కురుతశ్చ స్వనాశేన, కార్యం మోక్షాఖ్య ముత్తమమ్ ॥ 11 ॥**

11. ఆధారాధేయములట్లు, ఇవి ఒకటి లేకున్న రెండవది యుండదు (నశించును). స్వనాశము వలన ఇవి రెండును, మోక్షాఖ్యమగు లోకోత్తర ఫలమును సంపాదించుచున్నవి.

## 2. వేతాళోపాఖ్యానమ్ – బేతాళుని వృత్తాంతము

**శుభా నాకర్ణయ ప్రశ్నాన్, ప్రసఙ్గాత్ స్మృతిమాగతాన్ ।**
**ఆసీ ద్విన్ధ్య మహాటవ్యాం, వేతాళో విపులాకృతిః ॥ 12 ॥**

12. ప్రసంగవశమున జ్ఞప్తికి వచ్చిన శుభకరములగు బేతాళుని ప్రశ్నలను ఆలకింపుము. వింధ్యపర్వతమహారణ్యమున మహాకాయుడగు బేతాళు డొక డుండెను.

**నిర్నిమిత్తం నిరాగస్కం, పురోఽభ్యాగతం నరమ్ ।**
**క్షుధితోఽపి న హన్త్యేష సన్తో హి న్యాయదర్శకాః ॥ 13 ॥**

13. ఆ బేతాళుడు, నిష్కారణముగ, నిరపరాధులను ఎవరిని, ఎదుటబడినను, తన కెంత ఆకలి యున్నను చంపడు. సత్పురుషులు న్యాయమార్గ దర్శకులు కదా!

**నిశాయా మేకదా ప్రాప్తం భూపాలం ప్రోక్తవా నసౌ ।**
**"మయా లబ్ధోఽసి రాజన్! త్వం, భవ భోజన మద్యమే" ॥ 14 ॥**

14. ఒకప్పుడు రాత్రి వేళ, ప్రాప్తించిన రాజుతో, అతడిట్లు పలికెను. "రాజా! నీవు నాకు లభించితివి. నేడు నాకు భోజనము కమ్ము."

**రాజోవాచ చ "నిర్న్యాయం, మాం చే దత్సి బలాదిహ ।**
**తత్తే సహస్రధా మూర్ధా, స్ఫుటిష్యతి న సంశయః" ॥ 15 ॥**

15. రాజు :- "న్యాయమార్గము తప్పి, బలగర్వమున నన్ను భక్షించినచో, నీ తల, వేయి వ్రక్కలై పోవును; సంశయము లేదు".

**వేతాళ శ్చ తతః ప్రాహ "న్యాయోఽయం హి మయోచ్యతే ।**
**రాజాఽసి సకలాఽఽశాశ్చ, పూరణీయా త్వయాఽర్థినామ్ ॥ 16 ॥**
**ప్రశ్నానా ముత్తరం దత్వా, ప్రపూరయ మమాఽర్థనామ్ ।**

16-17. **బేతాళుడు** :-"రాజా! నేను న్యాయమే పచింతును. నీవు రాజవు; అర్థిజనుల సకలాశలను తీర్చుట నీకు కర్తవ్యము. నా ప్రశ్నలకు సదుత్తరము లొసగి నా ప్రార్థనను సఫల మొనరింపుము.

**కస్య సూర్యస్య రశ్మీనాం బ్రహ్మాణ్డాని కృశాఽణవః ? ॥ 17 ॥**

17. బ్రహ్మాండము లన్నియు నే సూర్యుని కిరణములకు పరమాణువులు?

**స్వప్నాత్ స్వప్నాఽన్తరం గచ్ఛన్, శతశోఽథ సహస్రశః ।**
**త్యజన్ న త్యజతి స్వచ్ఛం, కః స్వరూపం ప్రభాస్వరమ్ ? ॥ 18 ॥**

18. ఒక స్వప్నము నుండి స్వప్నాంతరమునకు అరుగుచు, నూర్ల కొలది, వేల కొలది మాఱులు, వానిని(ఉత్తరోత్తర స్వప్నములందు, పూర్వపూర్వ సత్యతలను) త్యజించుచున్నను, నిర్మలమును, ప్రభాస్వరము (తేజోమయము)నైన తనస్వరూపమును త్యజింపని వా డెవ్వడు?

**బ్రహ్మాఽణ్డాఽఽకాశ భూతౌఘ సూర్యమణ్డల మేరవః ।**
**అపరిత్యజితోఽణుత్వం,కస్యాఽణోః పరమాఽణవః ? ॥ 19 ॥**

19. బ్రహ్మాండములు, ఆకాశములు, భూతసమూహములు (లేక,

పంచభూతములు) సూర్యాది మండలములు, మేరువులు, మొదలగునవి అన్నియు, అణుత్వస్వభావమును త్యజింపని ఏఅణువునకు పరమాణువులు? అత డెవడు?

**కస్యాఽనవయవస్యైవ, హ్యన్తర్మజ్జా జగత్త్రయీ" ।**
**ఇత్యుక్తవతి వేతాళే, విహస్యోవాచ భూపతిః । 20 ।**

20. అవయవ శూన్యుడైన ఎవనికి ఈ జగత్త్రయము (సర్వ సృష్టి) కేవలము అంతర్మజ్జారూపము. (నిబిడము, ఘనతరము నగు సత్త్వైకాంతరూప సారము)". – ఇట్లు బేతాళుడు ప్రశ్నింపగా, భూపతి నవ్వి, ఆ ప్రశ్నలకు సమాధాన మొసగుట కుపక్రమించినాడు.

**"త్వయా ప్రోక్తో హి చిత్సూర్యః, విజ్ఞానాత్మాఽతిభాస్వరః ।**
**సర్వాణి భువనానీహ, తస్యైవ త్రసరేణవః । 21 ।**

21. బేతాళా! విజ్ఞాన స్వరూపుడును, అతి భాస్వరుడును నైన సంవిత్సూర్యుని గూర్చి నీవు వర్ణించితివి. ఇచ్చట నున్న భువనములన్నియు ఆతని త్రసరేణువులే.★ (సూర్యకిరణములందు కదలుచు కనిపించు ధూళికణములు)

**జగదాఖ్యే మహాస్వప్నే, స్వప్నా త్స్వప్నాఽన్తరం వ్రజన్ ।**
**శాన్తం త్యజతి నో రూపం, జీవ భావం గతోఽపి చ । 22 ।**

22. జగత్తను దీర్ఘస్వప్నమున, స్వప్నము నుండి, స్వప్నాంతరమున కరుగుచు (జన్మపరంపరారూపములైన, బహుతరస్వప్నముల గాంచుచు), జీవ భావమును పొంది యున్నను, ఆ పరబ్రహ్మము, పరమశాంతి సంపన్నమైన నిజస్వరూపమును ఎన్నడును త్యజింపదు.

**సూక్ష్మత్వా దప్యలభ్యత్వాత్, పరమాత్మాఽణురుచ్యతే ।**
**పురతస్తస్య మేర్వాది, పరమాణు వదేవ హి । 23 ।**

23. సూక్ష్మమును, అలభ్యము నగుట చేత, పరబ్రహ్మము అణువని వర్ణింపబడినది. దీని యెదుట మేరుపర్వతాదులును, కేవలము పరమాణువుల వలె నున్నవి.

★ త్రసరేణువు – మువ్వది పరమాణువుల పరిమాణము. "జాలాన్తరగతే భానౌ, సూక్ష్మం యద్దృశ్యతే రజః ప్రథమం తత్ప్రమాణానాం, త్రసరేణుం ప్రచక్షతే ।"

సర్వాఽవయవరూపోఽపి, నిరస్తాఽవయవః పుమాన్ ।[1]
అస్య విజ్ఞప్తి[2]మాత్రస్య, మజ్జామాత్రం జగత్త్రయమ్ " ॥ 24 ॥

**24.** పరమపురుషుడు (పరబ్రహ్మము), అధ్యారోపదృష్టిచే, సర్వ మూర్తాఽమూర్త పదార్థములు, అవయవములుగా కల్గి యుండుటచే, అవయవి యైనను, 'నేతి' 'నేతి' అను అపవాదదృష్టిచే, కేవలము అవయవరహితుడే. విజ్ఞానమాత్రస్వరూపుడైన పరమాత్మకు జగత్త్రయము అంతఃసారమై యున్నది." [జగత్త్రయము విజ్ఞానమాత్రమే యని భావము]

---

(1) పోల్చు :- "సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్ ।
సర్వతః శ్రుతిమల్లోకే, సర్వమావృత్య తిష్ఠతి ॥"
"సర్వేన్ద్రియగుణాఽఽభాసం, సర్వేన్ద్రియవివర్జితమ్ ।
అసక్తం సర్వభృచ్చైవ, నిర్గుణం గుణభోక్తృచ ॥" (భ.గీ.XIII-13,14)

ఆ పరబ్రహ్మము విశ్వవ్యాప్తమై యున్నది. సర్వత్ర దాని హస్తపాదములు, నేత్రశిరోముఖ శ్రోత్రములును; పరబ్రహ్మము చక్షురాది ఇంద్రియముల యొక్క రూపాద్యాకార వృత్తులందు, ఆ, యా, ఆకారముచే ప్రతీతమగుచున్నది. కాని, అది ఇంద్రియ రహితము, సంగరహితమయ్యును, అది సర్వమును ధరించుచున్నది. (సర్వాధారమై యున్నది) సత్త్వాదిగుణశూన్యమయ్యును, ఆ గుణముల పాలించుచున్నది.

"అపాణిపాదో జవనో, గ్రహీతా,
పశ్య త్యచక్షుః, స శృణోత్యకర్ణః ।
స వేత్తి వేద్యం న చ తస్యాఽస్తి వేత్తా,
తమాహు రగ్ర్యం, పురుషం మహాన్తమ్ ॥" (శ్వేతాశ్వతర - ఉ.III-19)

పరమపురుషుడు పాద రహితుడయ్యును, దూరగామి. హస్తరహితుడయ్యును సర్వగ్రాహి, నేత్ర రహితుడయ్యును సర్వదర్శి. కర్ణరహితుడయ్యును సర్వశ్రోత. అమనస్కుడయ్యును, సర్వజ్ఞుడు.. సర్వకారణుడగుటచే ప్రథముడు, పరిపూర్ణుడు - ఇత్యాది. (మఱియు చూడు-సర్గ -22- శ్లో. 32 -పాదటీక)

(2) పోల్చు :- "జ్ఞాన స్వరూపో భగవాన్ యతోఽసౌ,
అశేష మూర్తి ర్నతు వస్తుభూతః ।
తతో హి శైలాఽబ్ధి ధరాఽది భేదాన్
జానీహి విజ్ఞానవిజృంభితాని ॥"

"యదా తు శుద్ధం నిజరూపి సర్వం,
కర్మక్షయే జ్ఞాన మపాస్త భేదమ్ ।
తదా హి సఙ్కల్పతరోః ఫలాని,
భవన్తి నో వస్తుషు వస్తు భేదాః ॥" (వి.పు.II-12-30-40)

పరమేశ్వరుడు జ్ఞాన స్వరూపి; సర్వమయుడు, పర్వత సముద్ర భూమ్యాది భేదములన్నియు, నీతమాత్ర విజ్ఞానము యొక్క విలాసము లేయని తెలిసికొనుము. పరమాత్మ విజ్ఞానము వలన జీవుడు, స్వస్వరూపస్థితుడైనపుడు, సంకల్ప వృక్ష ఫల రూపమగు పదార్థ భేద ప్రతీతి నశించి, సర్వమును వాసుదేవమయముగా కాన్పించును.

ఇతి రాజవచః శ్రుత్వా, వేతాళః శాన్తి మాయయౌ ।
బభూవ చ సదా ధ్యానీ, విస్మృత్య సకలాం క్షుధామ్ । 25 ।

25. ఇట్లు రాజు చెప్పిన నిజ ప్రశ్నోత్తరములు విని, బేతాళుడు శాంతుడయ్యెను; తన ఆకలి నంతటిని విస్మరించి, నిరంతరధ్యానపరాయణుడైనాడు. (బ్రహ్మవేత్తకు ఎచటను విపత్తు వాటిల్లదని ఈ యుపాఖ్యానము విశదపఱచినది.)

### 3. జ్ఞానసాధనాని – జ్ఞానప్రాప్తికి సాధనములు

సంహృత్య సర్వత శ్చిత్తం, సర్వత్ర సమదర్శినః ।
స్థిరబుద్ధే రమూఢస్య, యథాప్రాప్తాఽనువర్తినః । 26 ।
రాజ్ఞో భగీరథస్యేవ, దుఃసాధ్యమపి సిధ్యతి ।

26-27. బాహ్య విషయములన్నిటి నుండి మనస్సును ప్రత్యాహరించి (మరలించి) సమదర్శనుడును, స్థిరబుద్ధియు, మోహరహితుడునై, ప్రవాహపతిత న్యాయమున తటస్థించిన వాని నాచరించు వ్యక్తికి, భగీరథ మహారాజునకు వలె, సామాన్యులకును, కష్టసాధ్యమైన అభీష్టములన్నియు, అనాయాసముగ విధిగా, సిద్ధించుచున్నవి.

### (భగీరథోపాఖ్యానము)

ఆసీ ద్భగీరథో రామ!, రాజా పరమధార్మికః । 27 ।
యౌవనే వర్తమానోఽపి, లోకయాత్రాం విచారయన్ ।
అత్యుద్విగ్నమనా భూత్వా సోఽపృచ్ఛత్ త్రితలం* గురుమ్ । 28 ।

27-28. శ్రీరామా! భగీరథుడను రాజు పరమ ధార్మికుడు. ఆ రాజు, యౌవనము నందున్నను, లోకయాత్రను –(సంసారగతిని)–, ప్రాణుల ఆర్తిని, విచారించుచు, అతి ఉద్విగ్నమనస్కుడైనాడు. విరక్తచిత్తమున ఆ రాజు, త్రితలుడను తన గురువును చేరి ఇట్లు ప్రశ్నించినాడు.

"జరామరణ మోహాదిరూపాణాం, భయకారిణామ్ ।
భగవన్! సర్వదుఃఖానాం, కథ మన్తః ప్రజాయతే? । 29 ।

* త్రితలం – పా.భే. ఇది సరికాదు.

29. "భగవంతుడా! భయంకరములైన జరా, మరణ, మోహాది రూపములగు సమస్త దుఃఖములకును, నాశ మెట్లు కలుగుచున్నది?

**చిన్మాత్రం సర్వగం శాన్త మస్తి నిర్మల మచ్యుతమ్ ।**
**దేహాది నేతరత్ కిఞ్చి దితి వేద్మి మునీశ్వర! । 30 ।**

30. మునీంద్రా! కేవలము జ్ఞానస్వరూపము, సర్వవ్యాపకము, శాంతము, నిర్మలము, అచ్యుతము, (అవినాశియు) నైన పరమాత్మ యున్నది. దానికంటె నితరమగు దేహాదిరూపపదార్థ మేదియును లేదని నేనెఱుగుదును.

**కిన్త్వత్ర ప్రతిపత్తి ర్మే, స్ఫుటతా మేతి న ప్రభో! ।**
**ఏతావన్మాత్ర సంవిత్తిః, స్యా మహం సర్వదా కథమ్?" । 31 ।**

31. అయినను ప్రభూ! ఈ విషయమున నాకు, సదాత్మబోధరూపమగు ప్రతిపత్తి (జ్ఞానము) విశదమై, నిలుకడ నొందుట లేదు. ఏతన్మాత్రమగు శుద్ధచైతన్యస్థితిని, నేను నిరంతరము సర్వవిక్షేపరహితముగ నే యుపాయమున పొందగలను?"

**త్రితల ఉవాచ :-**

**"జ్ఞానేన జ్ఞేయనిష్ఠత్వ మేతి చేతో హృదమ్బరే ।**
**తతః సర్వాత్మకో భూత్వా, భూయో గచ్ఛేన్న జీవతామ్ । 32 ।**

32. త్రితలుడు :- రాజా! చిత్తము, అమానిత్వాదిసాధనరూపమైనఅధ్యాత్మ జ్ఞానము వలన, హృదయాకాశమున, జ్ఞేయమగు పరమాత్మతో నేకమయి, నిలుకడ నొందుచున్నది; పిమ్మట సర్వాత్మభావమును పొంది, మరల జీవభావమును పొందదు.

**అసక్తి రనభిష్వఙ్గః, పుత్రదారగృహాఽఽదిషు ।**
**నిత్యం చ సమచిత్తత్వ మిష్టాఽనిష్టోపపత్తిషు । 33 ।**
**ఆత్మన్యోఽనన్య యోగేన, తద్భావన మవారతమ్ ।**
**వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది । 34 ।**

అధ్యాత్మజ్ఞాననిష్ఠత్వం, తత్త్వజ్ఞానాఽర్థదర్శనమ్ ।
ఏతద్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం స్యాదితోఽన్యథా* ॥ 35 ॥

33-35. పుత్రదారగృహాదుల యందు, ఆసక్తిమమత్వములు లేకుండుట, శుభాఽశుభప్రాప్తులందు, చిత్తవృత్తిని నిత్యము సమముగా నుంచుకొనుట, అనన్యమగు ఏకాగ్రచిత్తమున, సర్వసంకల్పవర్జముగ పరమాత్మను ధ్యానించుట, అవినీతులగు జనుల సంఘము నం దుండవలయునన్న అభిరుచి నశించి, ఏకాంతస్థలమును సేవించుట, శ్రవణ,మనన,నిదిధ్యాసనాఽభ్యాసరూపమును, నిత్యమునగు అధ్యాత్మజ్ఞాననిష్ఠత్వము, తత్త్వజ్ఞానముచే సర్వసాధనల ఫలరూపమగు పరమాత్మదర్శనము - ఇది యంతయును (జ్ఞానసాధనమును, సహకారి కారణమునగుట వలన) జ్ఞానమని చెప్పబడినది. దీనికి భిన్నమైన దంతయును అజ్ఞానమైయున్నది.

అహం భావోపశాన్తౌ తద్రాజన్! జ్ఞాన మవాప్యతే ।

36. రాజా! అహంకారము నశించిన యంతనే,జ్ఞానము సిద్ధించుచున్నది. [అహంకారమున్నచో, అమానిత్వాది గుణములు ప్రాప్తింపవు]

భగీరథ ఉవాచ :-

శరీరేఽస్మి న్నహం భావ శ్చిరస్థ స్త్యజ్యతే కథమ్? ॥ 36 ॥

36. భగీరథుడు:- స్వామీ! ఈ శరీరమందు చిరకాలముగ వేరుదన్ని, దృఢముగ పాతుకొని పోయిన అహంకార మెట్లు తొలగునో, వచింపుము.

---

★ ఈ శ్లోకములు, భగవద్గీత (XIII-10,11,12) శ్లోకములతో అభిన్నములుగా నున్నవి. 34వ శ్లోకము ప్రథమార్థము మాత్రము గీత యందలి 11వ శ్లోకము ప్రథమార్ధమునకు భిన్నముగ నున్నది. విస్పష్టమైన ఆత్మచింతనమే, భగవద్భక్తియని, భక్తి యొక్క పరమరూపమును మాత్రమే ఇది వ్యాఖ్యానించుచున్నది.

పోల్చు :- నారదభక్తి సూత్రములు –"ఆత్మరత్య విరోధవేతి శాణ్డిల్యః". ।(సూ. 18).

ఆత్మరతికి అవిరోధమగు నదియే భక్తి. విశుద్ధాత్మస్థితి యందు అవిచ్ఛిన్నమగు, నిరంతరానందమే ఆత్మరతి. పరమేశ్వరుడు సర్వాత్మ స్వరూపుడు కాన, ఆ విశ్వాత్మ యందలి రతి, భక్తికి మరొక పేరు. శాండిల్యమహర్షి భక్తి నిట్లు నిర్వచించెనని, దేవర్షి నారదుడు వచించెను. జ్ఞేయస్వరూపమును, భ.గీ. XIII-12-17 వరకు గల శ్లోకములు వర్ణించుచున్నవి.

త్రితల ఉవాచ :-

పౌరుషేణ ప్రయత్నేన, త్యక్త్వా విషయభావనామ్ ।
సత్తా మాశ్రిత్య సంపూర్ణా మహఙ్కారో లయం వ్రజేత్ ॥ 37 ।

37. త్రితలుడు :- విషయసుఖభోగభావనను, పురుషప్రయత్నముచే త్యజించి, వికసితమైన అకామోపహతత్వముచే, స్ఫుటీభూతమై, సంపూర్ణమగు శుద్ధాత్మాకారత్వమును, ఆశ్రయించి యున్నచో, అహంకారము నశించును.

సర్వైషణాః పరిత్యజ్య, శాన్తాఽశేష విశేషణః ।
అకిఞ్చనత్వ మాయాతః, స శాన్తాఽహఙ్కృతి ర్భవేత్ । 38 ।

38. పుత్రదార విత్తాదికములగు సకలేచ్ఛలను పరిత్యజించి, సర్వవిశేషణముల – (రాజోపయుక్తములైన ఛత్ర చామరాది చిహ్నముల)ను, విసర్జించి, అకించనత్వమును (లేమిని) పొందిన వానికి, అహంకారము నశించు చున్నది.

## 4. చిత్త విశ్రాన్తిః – మనః ప్రశాంతి

ఏవం శ్రుత్వా గురో ర్వక్త్రాత్, సర్వ మేవ పరిత్యజన్ ।
రాజ్యం స్వ మరయే దత్వా, ఖిన్నప్రకృతి*పౌరకమ్ । 39 ।
అథోవాసోఽవశేషోఽసౌ, నిర్జగామ స్వమణ్డలాత్ ।
యత్ర న జ్ఞాయతే హ్యేష, తత్రైవోవాస ధైర్యవాన్ । 40 ।

39-40. గురుముఖమున నిట్లు విని, భగీరథుడు, సర్వమును పరిత్యజించి, మంత్రిపురోహితాదులు, పౌరులు, దుఃఖించుచుండగా, రాజ్యమును శత్రురాజునకు దత్త మొనర్చి, కట్టుగుడ్డతో (కౌపీనముతో) తన రాష్ట్రమును విడిచి, త న్నెవరును గుర్తింపజాలని చోటికి బోయి, అచటనే యా ధైర్యశాలి నివసించుచుండెను.

తతోఽల్పేనైవ కాలేన, ప్రశాన్తసకలైషణః ।
పరమేణ శమేనాఽసౌ, ప్రాప విశ్రాన్తి మాత్మని । 41 ।

---

★ "స్వామ్యమాత్య, సుహృత్, కోశ, రాష్ట్ర, దుర్గ, బలాని చ,
(రాజ్యాఙ్గాని) ప్రకృతయః, పౌరాణాం శ్రేణయోఽపి చ" । (అమరకోశము - II-474)
స్వామి (రాజు) మొదలుగా గల ఈ ఏడు (7)ను, పౌరసమూహమును, ప్రకృతులనబడును.

**41.** తరువాత అచిరకాలముననే, సకలవాంఛలు (వాసనలు) ఉపశమింపగా, పరమశాంతితో, ఆ రాజు, ఆత్మవిశ్రాంతిని పొందెను.

**ఏకదా స భ్రమన్ భూమౌ, స్వస్యైవ పుర మాయయౌ ।**
**'ప్రభో! రాజ్యం గృహాణేతి, ప్రార్థితోఽప్యరిణా తదా ॥ 42 ॥**
**నాఽఽదదే తృణ మప్యేషః, ఋతే భిక్షాం భగీరథః ।**

**42-43.** ఒకప్పుడాతడు, భూమిని పరిభ్రమించుచు, స్వనగరమున కేతెంచెను. 'ప్రభూ! నీ రాజ్యమును స్వీకరింపు'మని శత్రురాజు ప్రార్థించినను, భగీరథుడు, శరీర ధారణ నిమిత్తము భిక్షాన్నమును తక్క, ఇతరమును, తృణమును సైతము స్వీకరింపలేదు.

**ఆత్మారామం కదాచిచ్చ, స ప్రాప త్రితలం గురుమ్ ॥ 43 ॥**
**కిఞ్చిత్కాల మువాసాఽసౌ, తేన సార్ధం వనాదికే ।**

**43-44.** మఱియు నొకప్పుడు, ఆత్మారాముడగు తన గురువు – త్రితలుని చేరుకొని, భగీరథు డతనితో పాటు పర్వతవనగ్రామాదులందు వసించినాడు.

**సమతా ముపయాతౌ తౌ, గచ్ఛన్తౌ తు వనాద్వనమ్ ॥ 44 ॥**
**న నవన్దతు రానన్దం న దుఃఖం న చ మధ్యమమ్ ।**
**సిద్ధై రర్పితమైశ్వర్యం, మేనాతే జర్జరం తృణమ్ ॥ 45 ॥**

**44-45.** అధ్యాత్మదర్శనమున సమత్వము పొందిన వారిరువురును, ఒక వనము నుండి మఱొక వనమున కరుగుచుండిరి. వారి కానందము గాని, దుఃఖము గాని, మధ్యస్థితి గాని లేకుండెను. సిద్ధ పురుషులు సంతోషించి, సమర్పించిన అష్టైశ్వర్యములను, సైతము వారు, జర్జర (జీర్ణ) తృణ ప్రాయముగ భావించి నిరాకరించిరి.

**అథైకదా మృతో భూపః, కస్మింశ్చిన్మణ్డలాన్తరే ।**
**తత్రత్యాస్తు పరిజ్ఞాయ, మునిరూపం భగీరథమ్ ॥ 46 ॥**
**తమాపాద్య సమానీయ, మోదాత్ చక్రు ర్మహీపతిమ్ ।**

**46.** అటు తరువాత, భగీరథాస్పదమగు కోసల మండలమున కంటె వేఱగు

నొకానొక రాష్ట్రమున, రాజు మరణింపగా, ప్రజలు మునివేషధారియగు భగీరథుని గుర్తించి, కొని వచ్చి, ప్రమోదమున తమకు రాజుగ జేసికొనిరి.

**ఏవం తత్ర స్థితే రాజ్ఞి, ప్రాక్ప్రకృతయ ఆయయుః ॥ 47 ॥**
**అభిశ్చ ప్రార్థితో రాజా, పున స్తాసా మభూన్నృపః ।**
**సమః శాన్తమనా మౌనీ, వీతరాగో విమత్సరః ॥ 48 ॥**

**47-48.** అత డట్లా రాజ్యమునకు రాజై పాలించుచుండగా, పూర్వపు కోసల ప్రజలు రాజు వెంత కేతెంచినారు. వారిచే ప్రార్థితుడై భగీరథుడు, మరల వారికి చక్రవర్తియై, భూమండలమును పాలించుచుండెను. భగీరథుడు సర్వసముడును, ప్రశాంతమనస్కుడును, మౌనియు, రాగద్వేష రహితుడును, మాత్సర్య శూన్యుడును, జీవన్ముక్తుడునై యుండెను.

**అథ వర్ష సహస్రాణి, తపస్తప్త్వా సుదారుణమ్ ।**
**పితామహాన్ సముద్ధర్తుం భువి గఙ్గా మయోజయత్★। 49 ॥**

**49.** పిమ్మట భగీరథుడు తన అఱువది వేల (60000) మంది పితరులను సముద్ధరించుటకై, వేయి సంవత్సరములు బ్రహ్మను, శివుని, గూర్చి తీవ్ర తపమాచరించి తత్ప్రసాదమున వియద్గంగను, భూలోకమునకు గొని తెచ్చినాడు. [జీవన్ముక్తుడగు సిద్ధపురుషునకు, లౌకిక వ్యవహారములు (కర్మలు) అనవసరమైనను, లోక సంగ్రహార్థమాతడు, వాని నాచరించును. జీవన్ముక్తుని స్వభావమందలి ఈ విశిష్ట లక్షణము నీ యుపాఖ్యానము వ్యాఖ్యానించుచున్నది.]

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'భగీరథో పాఖ్యానం' నామ**
**చతుర్వింశః సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'భగీరథోపాఖ్యాన'మను
చతుర్వింశతితమ (ఇరువది నాల్గవ) సర్గము సమాప్తము.

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



★ చూడు :– వాల్మీకి రామాయణము – బాల – సర్గలు 40–44.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## పంచవింశసర్గము

## చూడాలా ప్రభావః – మహారాజ్ఞి చూడాల ప్రభావము

## (శిఖిధ్వజోపాఖ్యానము)

### 1. జ్ఞానోదయః – జ్ఞానప్రాప్తి

వసిష్ఠ ఉవాచ :–

ఆసీచ్ఛిఖిధ్వజో రాజా, మాళవానాం[1] పురే పురా ।
చూడాలాఖ్యా చ తత్పత్నీ, సురాష్ట్రాఽ[2]ధిపతేః సుతా ॥ 1 ॥

1. పూర్వము, మాళవదేశరాజధాని యగు ఉజ్జయినీపురమును శిఖిధ్వజుడను రాజు పాలించుచుండెను. ఆ రాజు భార్య, సురాష్ట్రదేశపు రాజపుత్రిక, చూడాల.

---

(1) ఇది నేటి మధ్య భారతమందలి మాళవదేశము

(2) భారతదేశ పశ్చిమ ప్రాంత మందలి నేటి సూరత్.

**అవర్థత తయోః ప్రీతి రన్యోఽన్యార్పిత చేతసోః ।**
**ఏవం బహుషు వర్షేషు, యాతేషు చ క్రమాత్తయోః ॥ 2 ॥**
**శనై ర్గళతి తారుణ్యే, భిన్నకుమ్భాదివాఽమ్బుని ।**
**'ఆత్మనో జ్ఞాన మేవ స్యాత్, సంసారవ్యాధి భేషజమ్' ॥ 3 ॥**
**ఇతి నిశ్చిత్య తావాస్తాం, తన్నిష్ఠౌ* తత్పరాయణౌ ।**

**2-4.** అన్యోన్యార్పిత హృదయులగు ఆ దంపతుల దృఢ ప్రేమానురాగము, దినదినాభివృద్ధిని చెందినది. ఇట్లు, చాల సంవత్సరములు గడచిపోగా, కాలక్రమమున, వారి యౌవనము, భిన్న భాండము నుండి జలము వలె, మెల్ల మెల్లగా స్రవించి పోవ (నశింప) నారంభించినది. **'ఆత్మజ్ఞానము మాత్రమే, సంసారమహావ్యాధికి, అమోఘమైన ఔషధ'**మని వారు నిశ్చయించు కొని, దానినే పరమలక్ష్యముగా గొని, **తన్నిష్ఠ పరాయణులైనారు.**

**అథ సాఽవిరతం రామ! శాస్త్రార్థమననే రతా ॥ 4 ॥**
**ఇత్థం విచారయామాస, స్వమాత్మాన మహర్నిశమ్ ।**

**4.** శ్రీరామా! తరువాత ఆమె **(చూడాల)** అధ్యాత్మశాస్త్రార్థ మననమున అశ్రాంతము, అహోరాత్రము, నిరతిశాలినియై, తన ఆత్మను గూర్చి యిట్లు విచారించినది.

**"కస్యాఽయ మాగతో మోహః?, కథ మభ్యుదితః? క్వ వా? ॥ 5 ॥**
**దేహ స్తావజ్జడో మూఢో, నాఽహ మిత్యేవ నిశ్చయః ।**
**కర్మేన్ద్రియ గణశ్చాఽసౌ, బుద్ధీన్ద్రియగణ స్తథా ॥ 6 ॥**
**జడ ఏవ భవే న్నూనం, ప్రేర్యతే మనసా యతః ।**

**5-7.** ఈ మోహము (భ్రాంతి) ఎవరికి వచ్చినది? ఇది యెట్లు, ఎక్కడ, పుట్టినది? మొదట, జడమును, మూఢమునైన శరీరము **'నేను' కా**వనుట నిశ్చయము. (వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలగు) కర్మేంద్రియ గణము వలెనే, (చక్షుః, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణ, త్వగ్రూపములగు) **జ్ఞానేంద్రియ గణమును**, మనస్సుచే ప్రేరితమగు చుండుట చేత, **కేవలము జడమే** యనుట నిశ్చయము.

---

* **'తచ్చింతనం తత్కథనమన్యోన్యం తత్ప్రబోధనమ్'** – ఇత్యాది బ్రహ్మాఽభ్యాసతత్పరత్వమును వారు పొందినారు. **"బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి ।"** (ఛా.ఉ.II-23-1) మఱియు, **"తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్ ।** (బ్ర.సూ.I-1-7) బ్రహ్మ సంలగ్న మనస్కుడు, అమృతత్వమును బొందును. బ్రహ్మమునందు నిష్ఠ గలవానికి మోక్షము కల్గునని శ్రుతి ఉపదేశము.

**మనోఽప్యేవం జడం యస్మాత్, ప్రేర్యతే బుద్ధి నిశ్చయైః ॥ 7 ॥**
**బుద్ధి శ్చాఽపి జడా యస్మా, దహఙ్కారేణ చాల్యతే ।**
**అహఙ్కారో జడో మూనం, జీవేన జన్యతే యతః ॥ 8 ॥**

7-8. బుద్ధినిశ్చయముల వలన ప్రేరణ పొందుచుండుటచే, మనస్సు సైతము జడమే. అహంకారము వలన చలనము నొందుచుండుటచే, బుద్ధియును జడమే. (ప్రాణాఽవచ్ఛిన్న చిదాభాసుడగు) జీవుని వలన నుత్పన్నమగు చుండుటచే, **అహంకారము** సైతము,**జడమే.** [వస్తుధర్మముల గూర్చిగాని, వాని ఉనికిని గూర్చి గాని వీనికి - (జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, మనో, బుద్ధి, అహంకారములకు) - స్వయంసంవేదనము లేకుండుటచే, ఇవి జడములని పై శ్లోకములు స్థాపించుచున్నవి.]

**జీవశ్చ కలనాకారః కేనాఽప్యన్యేన జీవతి ।***
**అహో ! జ్ఞాత మయం జీవ శ్చిద్రూపేణైవ జీవతి ॥ 9 ॥**

9. చైతన్య (చిదాభాస) రూపుడైన జీవుడును, తనకంటె నన్యమైన ఏదేనొక దానిచే జీవించుచున్నాడు. అహో! జీవుని కాధారభూతమైనది. జ్ఞానస్వరూపమైన పరమాత్మయేయని (విచారణవశమున) తెలిసి కొంటిని.

**ఇదానీం పునరీక్షేఽహం, కేనైషా చిత్ప్రచేత్యతే ।**
**అహో ! ను చిరకాలేన, జ్ఞాతం జ్ఞేయ మనామయమ్ ॥ 10 ॥**

---

* పోల్చు :- సర్వాఽఽజీవే సర్వసంస్థే బృహన్తే
అస్మి న్హంసో భ్రామ్యతే బ్రహ్మచక్రే ।
పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా,
జుష్ట స్తత స్తేనాఽమృతత్వ మేతి ॥ [శ్వే.ఉ.I-6]

సంసారము సైతము, బ్రహ్మాత్మకమగుట వలన, బ్రహ్మమయమే. ఇది సర్వాఽఽజీవమును, సర్వసంస్థయు, బృహత్తునైనది. అట్టి బ్రహ్మమయసంసారచక్రమున, దేహేంద్రియాది అనాత్మ వస్తువులందు ఆత్మబుద్ధితో, అవిద్యాపరవశుడై జీవేశ్వర భేదదర్శనమున పరిభ్రమించు హంస (జీవుడు), ఈశ్వరసేవనమున, ఈశ్వరానుగ్రహము వలన, బ్రహ్మాత్మాఽభేద దర్శనము, అమృతత్వమును, - పూర్ణానంద బ్రహ్మస్వరూపమును ప్రాపించుచున్నాడు.

"పశ్యత్యాఽఽత్మాన మన్యం తు, యావద్వై పరమాత్మనః ।
తావత్ సమ్భ్రామ్యతే జన్తు ర్మోహితో నిజకర్మణా ॥
సంక్షీణాఽశేషకర్మా తు, పరం బ్రహ్మ ప్రపశ్యతి ।
అభేదేనాఽఽత్మనః శుద్ధం, శుద్ధత్వా దక్షయో భవేత్ ।" (శ్రీవిష్ణు ధర్మము)

10. ఈ శుద్ధచైతన్యస్వరూపమగు పరమాత్మ, దేనిచేనైనను, ప్రబోధింపబడుచున్నదేమో అని, దీనికిని సాక్షి యేదైనను కలదేమో అని, ఇపుడు మరల విచారింతును. ఆహా! చిరకాలమునకు కళంకరహితమగు జ్ఞేయ తత్త్వము నేను కనుగొంటిని.

ఏతే హి చిద్విలాసాన్తాః,[1] మనోబుద్ధీన్ద్రియాఽఽదయః ।
అసన్తః సర్వ ఏవాఽహో!, అవధానం వినోత్థితాః ॥ 11 ॥

11. జీవపర్యంతమగు ఈ మనో, బుద్ధి, ఇంద్రియాదులన్నియును, ఆ శుద్ధ చైతన్య విలాసము యొక్క పరిచ్ఛేదమునకు హేతువులు కదా! ఆహా! ఇవి, అవధానము లేమిచే, ప్రమాదము వలని భ్రాంతిజన్యములు కాన, నివి బొత్తిగా శూన్యములే. (లేనివే).

మహాచిదేకైవాఽస్తీహ, నిరహఙ్కారరూపిణీ ।
సకృద్విభాతా విమలా, నిత్యోదయవతీ సదా ॥ 12 ॥
సా బ్రహ్మ, పరమాత్మాఽఽది నామభిః[2] పరిగీయతే ।"

(1) చిద్విలాసస్య అన్తాః – పరిచ్ఛేదహేతవః ॥ – (ఆనందబోధేంద్ర సరస్వతి – యో.వా.తా.ప్ర.)
(2) పోల్చు :- "వదన్తి త త్తత్త్వవిద స్తత్త్వం యద్ జ్ఞాన మద్వయమ్ ।
బ్రహ్మేతి, పరమాత్మేతి, భగవానితి, శబ్ద్యతే ।" (భాగ.I-2-12)
తత్త్వవేత్తలు, జ్ఞానైకస్వరూపమనియు, అద్వయమును, అవ్యయమునని దేనిని వర్ణింతురో, దానినే, ఔపనిషదులు బ్రహ్మమనియు, హైరణ్యగర్భులు (యోగులు) పరమాత్మమనియు, సాత్త్వతులు భగవంతుడనియు వ్యవహరించుచున్నారు.
మఱియు, కపిలోక్తమార్గమున అచిరకాలముననే దేవహూతి, పరము, ఆత్మ, బ్రహ్మము, నిర్వాణము, భగవంతుడునని వ్యవహరింపబడు పరతత్త్వమును ప్రాపించెనని భాగవతము, ఆ శబ్దములకు అభేదమును స్థాపించినది.
"ఏవం సా కపిలోక్తేన మార్గేణాఽచిరతః పరమ్ ।
ఆత్మానం, బ్రహ్మ, నిర్వాణం, భగవన్త మవాప హ ॥" (భాగ. III-33-30)
మఱియు చూడు :- యోగ వాసిష్ఠ సంగ్రహము (XVIII-37-40)
"న శివః, శంకరో, విష్ణుః, నరుద్రోఽపి న బుద్ధః ।
న జీవ ఈశ్వరో బ్రహ్మ న సోఽనన్తః న సిద్ధః ॥
ఏవం హి లక్షణ లక్షితో యః పరో నిష్కలో దేవః ।
దేహస్య మధ్యే న వసతి తయో ర్న విద్యతే భేదః ॥" (యోగసారము – 105, 106)
"సోఽయం సమరసీభావ స్తదేకీకరణం స్మృతమ్ ।
అపృథక్త్వేన యత్రాఽఽత్మా, లీయతే పరమాత్మని ॥" (జ్ఞానార్ణవము)
పై శ్లోకములు జైన గ్రంథములలోనివి. ఇవి సర్వదర్శనములలో అంతఃసూత్రమగు ఐకాత్మ్యమును, సర్వయోగుల ఆధ్యాత్మికానుభూతిని, ప్రకటించుచున్నవి. సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసులు

**12-13.** ఇటు, అహంకారశూన్యమగు మహాసత్త యనబడు శుద్ధచైతన్య మొక్కటియే యున్నది. మూలాఽవిద్యావరణము తొలగగా, ఒక పర్యాయము ప్రకాశించి, మరల దేని చేతను అది ఆవరింపబడదు. కావుననే, యది **నిత్యోదయవంతము**, సర్వకాలములందును, ఏకరూపమున ప్రకాశించు చున్నది. అది పరిశుద్ధమైనది. **ఆ శుద్ధ చైతన్యమే, బ్రహ్మ, పరమాత్మాది నామములచే, వేదాంతాది ఆధ్యాత్మశాస్త్రములందు లక్షణ ద్వారా వర్ణింపబడుచున్నది.**"

**దినాఽనుదిన మిత్యేషా, స్వాఽఽత్మారామతయా తథా ॥ 13 ॥**
**పరమాత్మ మహాలాభ పరిపూర్ణాఽన్తరాత్మనా ।**
**స్వవివేక ఘనాఽభ్యాస వశా దాత్మోదయేన సా ॥ 14 ॥**
**శుశుభే శోభనా తత్ర, చూడాలాఽపూర్వ శోభయా ।**

**13-15.** దినక్రమమున, స్వాత్మారామత్వము చేతను, పరమాత్మజ్ఞాన మహాలాభముచే పరిపూర్ణమైన ప్రత్యగాత్మ చేతను, స్వవివేకము యొక్క దృఢాభ్యాసము వలన, పూర్ణానందస్వరూపావిర్భావము చేతను, ఆ చూడాల, మనోజ్ఞ రూపిణియై, **అపూర్వ శోభతో** విరాజిల్లినది.

**తా మాలోక్య తదా రాజా, విస్మితో వ్యాజహార హ ॥ 15 ॥**
**"భూయో యౌవనయుక్తేవ, రాజసే నితరాం ప్రియే ! ।**
**గమ్భీరం చ ప్రశాన్తం చ, చేతః పశ్యామి తే ప్రియే ! " ॥ 16 ॥**

**15-16.** అప్పుడు రాజు ఆమెను గాంచి, ఆశ్చర్యపరవశుడై, ఆమెతో నిట్లు వచించెను. "**ప్రేయసీ! మరల నవయౌవన శాలిని వైనట్లు అత్యంతము శోభిల్లుచున్నావు.** నీ చిత్తము, ప్రసాదభాసురమును, గాంభీర్య శోభితమునునై, యుండుటను నేను గాంచుచున్నాను."

**చూడాలోవాచ :-**

**"ఇదం సర్వం పరిత్యజ్య, సర్వమన్య న్మయాఽఽశ్రితమ్ ।**
**యత్తత్సత్య మసత్యం చ తేనాఽస్మి శ్రీమతీ స్థితా ॥ 17 ॥**

---

**డా॥ వి. రాఘవన్,** జైన గ్రంథములందలి, యోగుల అద్వయతత్త్వానుభూతి ప్రకాశకములగు శ్లోకములను సంగ్రహించి - **"Some Gems of Sayings of Jain Saints and Mystics"** అను పేర ప్రకటించినారు. వాని నుండి పై శ్లోకములుదాహరింపబడినవి.

17. చూడాల :- "పరిచ్ఛిన్నమైన ఈ సర్వమును (ప్రాపంచికచింతనలను, అనుభవములను) పరిత్యజించి, అపరిచ్ఛిన్న సర్వస్వరూపమైన ఒకానొక అన్యపదార్థమును నేనాశ్రయించితిని. సత్యమును (అబాధితమై ఉన్నదియు) అసత్యము (ప్రపంచరూపమున లేనిదియు)నగు దాని నాశ్రయించుట చేతనే నేను శ్రీమతినై –కాంతిమతినై యున్నాను.

న హృష్యామి న కుప్యామి, తేనాఽహం శ్రీమతీ స్థితా ।
ఏకైవాఽకాశ సఙ్కాశే, కేవలే హృదయే రమే ॥ 18 ॥
సదాఽఽత్మన్యేవ తుష్యామి, తేనాఽహం శ్రీమతీ స్థితా ।

18-19. నా కిపుడు హర్షము గాని, అమర్షము గాని, కలుగుట లేదు. కనుకనే నేను, శ్రీమతినై – కాంతిమతినై – యున్నాను. నేనిపు డేకాంతస్థలమున, ఆకాశసదృశమై, కేవలమైన, నా హృదయముననే రమించుచున్నాను. నిరంతర మాత్మ యందే సంతోషించుచున్నాను. కనుకనే, నేను శ్రీమతినై – కాంతిమతినై – యున్నాను."

అబుద్ధ్వా తద్గిరా మర్థం, విహస్యోత్థాయ భూపతిః ॥ 19 ॥
అసంబద్ధ ప్రలాపోఽయ, మితి నిశ్చితవాన్ తదా ।

19-20. రాజు, ఆసాధ్వివాక్యములకు అర్థ మెఱుగజాలక, నవ్వుచు, లేచి, ఆమె వాక్కును, అసంబద్ధ ప్రలాపముగ నిశ్చయించినాడు.

"కష్టం నాఽఽత్మని విశ్రాన్తో, మద్వచోఽయం న బుద్ధవాన్" ॥ 20 ॥
ఇతి ఖిన్నా చ చూడాలా, స్వవ్యాపార పరాఽభవత్ ।

20-21. "అయ్యో! ఈతడు, చిత్తవిశ్రాంతిరహితుడు. నా వాక్యముల కర్థమును గ్రహింపజాలడు" అని చూడాల, ఖిన్నురాలై, తన పనిలో తా నుండెను.

## 2. కుణ్డలినీ – కుండలినీ శక్తి*

ఏకదా నిత్యతృప్తాయాః, నిరిచ్ఛాయా అపి స్వయమ్ ॥ 21 ॥
చూడాలాయా బభూవేచ్ఛా, హ్యాకాశ గమనాఽఽదిషు ।

---

* మూలాధారమున సర్పరూపమున చుట్టుకొని, నిద్రాణమై యున్న సూక్ష్మమగు ప్రాణశక్తి.

**21-22.** ఒకప్పుడు, పరిపూర్ణ తృప్తి నొందినదియు, ఏ కోరిక లేనిదియునైనను, చూడాలకు విలాసార్థము ఆకాశగమనాదిశక్తుల సంపాదింప కోరిక కల్గినది.

**తదర్థం సర్వభోగాన్ సా, సన్త్యజ్య నిర్జనే స్థలే । 22 ॥**
**ఊర్ధ్వగప్రాణపవనం, చిరాఽభ్యాసం చకార హ ।**

**22-23.** అందు కొఱకు, ఆమె సర్వభోగములను పరిత్యజించి, జనశూన్యమగు ఏకాంతస్థలమున, ప్రాణవాయువును అధోభాగమునుండి, ఊర్ధ్వ భాగమున కాకర్షించుచు, చిరకాలము యోగము నభ్యసించినది.

**చూడాలాయాః కథాయాం చ, ప్రసఙ్గ పతితా మిమామ్ । 23 ।**
**ప్రాణాది పవనాఽభ్యాసక్రియాం, సిద్ధి ఫలాం శృణు! ।**

**23-24.** చూడాలకథాప్రసంగమున సంప్రాప్తమైన అతిమానుషసిద్ధులను సఫలమొనరించు, ఈ ప్రాణాదివాయునిరోధము యొక్క అభ్యాస క్రియను వినుము.

**భోజనాఽఽసన శుద్ధ్యా చ, సాధుశాస్త్రాఽర్థభావనాత్ । 24 ।**
**భోగత్యాగాచ్చ కోపాది, త్యాగాత్ సజ్జనసేవనాత్ ।**
**ప్రాణాఽఽయామ ఘనాఽభ్యాసా ద్భృశం యాన్తి విధేయతామ్ ।25।**
**ప్రాణాః ప్రభుత్వా త్తద్జ్ఞస్య, పుంసో భృత్యా ఇవాఽఖిలాః ।**

**24-26.** భోజనాసనాదుల శుద్ధత్వము, వేదాంత శాస్త్రార్థముల ఉత్తమ విచారము, విషయభోగత్యాగము, కామక్రోధాది పరివర్జనము, సజ్జన సహవాసము, ప్రాణాయామ దృఢాభ్యాసము – వీని వలన, ప్రాణాది వాయువులన్నియు, వానినెఱిగి, వానిపై ఆధిపత్యము సాధించిన జ్ఞానికి, పురుషునకు భృత్యుల వలె,అత్యంతము వశములగుచున్నవి.

**రాజ్యాది మోక్ష పర్యన్తాః, సమస్తా ఏవ సంపదః । 26 ।**
**దేహాఽనిల విధేయత్వాత్, సాధ్యాః సర్వస్య రాఘవ ! ।**

**26-27.** రాఘవా! దేహాంతర్గతములగు ప్రాణాదివాయువులు వశపడినచో, భూలోకరాజ్యము మొదలుకొని, మోక్షసామ్రాజ్యము వఱకు గల సమస్తసంపదలును, సర్వజనులకును, కరతలామలకములట్లు సుసాధ్యములగుచున్నవి.

కీటాదిష్వపి సర్వేషు, మర్మస్థానం సమాశ్రితా ॥ 27 ॥
భోగి వన్మణ్డలాఽఽకారా, సర్వదా స్పన్దరూపిణీ ।
పావనీ పరమా శక్తిః, పవమానేన తిష్ఠతి(1) ॥ 28 ॥

**27-28.** సమస్తప్రాణులందును, కీటాదులందు సైతము, మర్మస్థానము - (మూలాధారము) నాశ్రయించినదియు, సర్పము వలె మండలాకారము కలదియు, నిరంతరమును మనోవృత్తులచే లోపల, బాహ్యమున, ప్రాణాది వాయువులచే స్పందరూపిణియు (వాయు వశమున నెల్లపుడును కదలుచుండునదియు) అతిపవిత్రము నగు ఒకానొక పరమశక్తి యున్నది. ఇదియే శరీరచలనమునకును కారణము.

సాఽతః కుణ్డలినీ ప్రోక్తా, నాడ్యో హృదయకోశగాః ।
అస్యాం సమస్తాః సంబద్ధాః, సైవ ప్రాణమయీ స్మృతా ॥ 29 ॥
ప్రాణాఽపాన స్వరూపత్వాదథ ఊర్ధ్వం వ్రజత్యసౌ(2) ।

---

(1) మోక్షద్వారమని యోగశాస్త్రములు, తంత్రగ్రంథములును నిర్దేశించు కుండలినీశక్తి ఇదియే. యోగశాస్త్ర ప్రామాణ్యమును, నేటి యోగసిద్ధుల అనుభవమును, ఏతద్విషయకములగు ఆధునిక గ్రంథములను అనుసరించి, కుండలిని సమస్తప్రాణులందలి మహత్తరపరిణామ శక్తియని నిరూఢమగుచున్నది. ఇది ప్రాణశక్తి యొక్క సూక్ష్మ రూపము; లేక, దానికి కేవలము ఆధారము. అధ్యాత్మయోగసాధన వలన నిది ప్రబుద్ధమై, సాధకుని, క్రమముగ, యోగభూమికల నధిగమింపజేసి, నిర్వికల్పసమాధిని ప్రాపింపజేయుచున్నది.
చూడు :- శ్రీ సీతారామాంజనేయసంవాద సమాలోచనాత్మక పరిశీలనము – రాజయోగదర్శనము డా॥ రత్నాకరం బాలరాజు – ప్రకరణము – XIII – పుటలు 272 – 276 – అధ్యాత్మ విద్యా గ్రంథ రత్నమాల, సాకేత నిలయం, 21, S.B.I. Colony అనంతపురం (ఆం.ప్ర.) 515 001–(1982).

(2) సాంప్రదాయికయోగశాస్త్రములందు 'కుండలిని' కిని, 'ప్రాణము'నకును సంబంధించిన విషయములన్నియు, యోగసంబంధమగు నిగూఢపరిభాష (Mystic Language) తో ప్రావృతమై యున్నవి. ఆధునిక జంతుశరీరధర్మశాస్త్ర (Physiological Knowledge) జ్ఞానముతో వీనిని పోల్చి, శరీరసంఘాతమున (Human body complex), వీని ఉనికిని ప్రత్యక్షముగా నిరూపించు ఏ ప్రయత్నమైనను తఱచుగా విఫలమగుచున్నది. కాని, ప్రాచీనులును, ఆధునికులునైన యోగుల యొక్క ప్రథమవిశిష్టానుభూతులు, వీని ఉనికికిని, మానవ చేతనాపరిణామమునందు వీని పాత్రను – (చర్యను) – నిరాక్షేపకమై, తిరస్కరించుటకు అసాధ్యమైన ప్రామాణ్యమును స్థాపించుచున్నవి.
చూడు :- Swami Vivekananda - RAJA YOGA - or CONQUERING THE INTERNAL NATURE [Chapter - IV - the Psychic prana - Advaita Ashrama–Calcutta-1973]

29-30. కావున ఈ శక్తి 'కుండలిని' అని వ్యవహరింపబడినది. హృదయమధ్య (కోశ) గతములగు నాడులన్నియు, ఈ కుండలినితో సంబంధించి యున్నవి. ఈ శక్తియే ప్రాణమయి (సర్వ ప్రాణములకును ఆధారము) అనియు భావింపబడినది. దీనికి ప్రాణాఽపానములే స్వరూపమగుటచేత, అది క్రిందికిని మీదికిని పోవుచుండును.

### 3. ఆధివ్యాధయః – మానసిక శారీరక వ్యాధులు

యద్యస్త ర్మారుతో రుద్ధో, వ్యాధి ర్జన్తో ర్న జాయతే ॥ 30 ॥
దేహదుఃఖం విదు ర్వ్యాధి మాధ్యాఖ్యం వాసనామయమ్ ॥

30-31. అంతర్వాయునిరోధము వలన, ప్రాణులకు వ్యాధులు కలుగవు. దేహమునకు కలుగు జ్వరాదిదుఃఖములు వ్యాధులనబడును. కేవల సంస్కారము (వాసన) వలన ఉత్పన్నమై, మనస్సును బాధించు చింతలు, ఆధు లనబడును.

దురన్నాఽభ్యవహారేణ, దుర్దేశాఽఽక్రమణేన చ ౹ 31 ॥
దుష్కాలవ్యవహారేణ, దుర్జనాఽఽసఙ్గదోషతః ౹
క్షీణత్వా ద్వాఽతి పూర్ణత్వా న్నాడీనాం రన్ధ్రసన్తతౌ ౹ 32 ౹
ప్రాణే విధురతాం యాతే, వ్యాధి ర్దేహే ప్రవర్తతే ౹

31-33. ఆహారశుద్ధిని పరిగణింపక, దుష్టాన్నమును భుజించుట చేతను, శ్మశానాది దుష్ప్రదేశము లందు నివసించుట చేతను, కాల విభాగ మెఱుగక, నిశీథ ప్రదోషాదిదుష్కాలములందు అశన, సంభోగాదు లొనర్చుచు, విచ్చలవిడిగా సంచరించుట చేతను, దుర్జనసహవాసము చేతను, నాడీ రంధ్రములందు, అన్నరసము తగినంతగా ప్రవేశింపమిచే, అవి క్షీణించుట వలనను, లేక, అన్నరస మధికముగ ప్రవేశించుటచే, అవి అధిక ప్రపూర్ణములగుట చేతను, కఫపిత్తాది ప్రకోపము వలన, ప్రాణము వ్యాకులత్వమొందుట చేతను, దేహమున వ్యాధు లుత్పన్నమగుచున్నవి.

ఆధిక్షయే చాఽధిభవాః, క్షీయన్తే వ్యాధయోఽప్యలమ్ ౹ 33 ౹
అనాధిజా వ్యాధయస్తు, ద్రవ్యమన్త్ర శుభక్రమైః ౹
చికిత్సకాది శాస్త్రోక్తై ర్నశ్యన్తి త్వం చ వేత్సి తత్ ౹ 34 ౹

**33-34.** ఆధి(మానసికదుర్గత) క్షీణింపగా, దాని వలన నుత్పన్నమైన వ్యాధులును తప్పక నశించుచున్నవి. ఆధులతో సంబంధము లేక కలిగిన వ్యాధులు (వాత, పిత్త, శ్లేష్మ, ప్రకోపము వలన కల్గినవి) వైద్యశాస్త్రాదులలో చెప్పబడిన ఔషధసేవనము వలనను, మంత్రశాస్త్రాదులందు చెప్పబడిన జపహోమాదిశుభకర్మల చేతను, మఱియు వృద్ధ పరంపరోపదిష్టములగు చికిత్సా పద్ధతుల చేతను నశించుచున్నవి. ఇది నీ వెఱిగిన విషయమే.

**చిత్తే విధురితే దేహః, సంక్షోభ ముపయాతి హి ।**
**సంక్షోభాత్సామ్య ముత్సృజ్య, వహన్తి ప్రాణవాయవః ।★ । 35 ।**

**35.** చిత్తము వ్యాకులమైనచో, దేహము, ఉద్వేగము (వికారము)ను పొందుచున్నది. ఉద్వేగము వలన, ప్రాణ వాయువులు సరిగా సంచరింపక, సమత్వమును కోల్పోయి ప్రవహించును.

**అసమే వహతి ప్రాణే, నాడ్యో యాన్తి విసంస్థితిమ్ ।**
**కుజీర్ణత్వ మజీర్ణత్వ మతిజీర్ణత్వ మేవ వా । 36 ।**
**దోషాయైవ ప్రయాత్యన్నం, నాడీప్రాణవిపర్యయాత్ ।**

**36-37.** ప్రాణ వాయువుల సంచారము క్రమము తప్పి విషమమైనచో, నాడులును, కఫపిత్తాదిపూర్ణతా ప్రయుక్తమగు విషమత్వమును(అవ్యవస్థితిని) జెందును. ప్రాణసంచారము విషమమై, నాడులును అవ్యవస్థితము కాగా, భుజింపబడిన అన్నము **కుజీర్ణత్వము** గాని, **అజీర్ణత్వము** గాని, **అతిజీర్ణత్వము** గాని జెంది, ఉపద్రవ (దోష)మును కల్గించుచున్నది.

**యాన్యన్నాని నిరోధేన, తిష్ఠన్త్యన్తః శరీరకే । 37 ।**
**తాన్యేవ వ్యాధితాం యాన్తి, పరిణామస్వభావతః ।**
**ఏవ మాధే ర్భవే ద్వ్యాధి రాధినాశాచ్చ నశ్యతి ।.38 ।**

**37-38.** సరిగా జీర్ణము కాక, ఏకీభవింపక, నిరోధింపబడిన అన్నములు, శరీరము నందుండి, ధాతువైషమ్యపరిణామస్వభావము వలన, వ్యాధిత్వము నొందుచున్నవి. (రోగమును పుట్టించుచున్నవి.) ఇట్లు, ఆధి(మానసిక

★ చూడు ౬-XXI సర్గ-59 శ్లోక పాదటీక.

రుగ్ణత) వలన, వ్యాధి పుట్టుచున్నది. ఆధి నశించుట వలన వ్యాధియును, నశించుచున్నది. ఈ విషమ స్థితులన్నిటికిని ఆధియే కారణము.

**యథా విరేకం కుర్వన్తి, హరీతక్యః స్వభావతః ।**
**భావనావశతో మన్త్రైః, కర్మణా సాధుసేవయా । 39 ।**
**మనః ప్రయాతి నైర్మల్య మానన్దో వర్ధతే తదా ।**

**39-40.** హరీతకీఫలములు (కరక్కాయలు) విరేచనమును స్వభావముగనే కల్గించునట్లు, మంత్రభావనాబలము వలనను, సత్కర్మానుష్ఠానము వలనను, సత్పురుషసేవ వలనను, మనస్సు నైర్మల్య మొందుచున్నది. మనస్సు శుద్ధమైన వెంటనే శరీరము, ఆనంద రస నిమగ్నమగుచున్నది. – (ఆనందము వృద్ధిపొందుచున్నది).

**సత్త్వశుద్ధ్యా వహన్త్యేతే, క్రమేణ ప్రాణవాయవః । 40 ।**
**జరయన్తి తథాఽన్నాని, వ్యాధి స్తేన వినశ్యతి ।**

**40-41.** అంతఃకరణశుద్ధి వలన, ప్రాణవాయుసంచారము, క్రమబద్ధమగును. అట్లే, భుజింపబడిన అన్నములును చక్కగా పచనమగుచున్నవి. దాని వలన, శారీరకములైన వ్యాధులును నశించుచున్నవి.

### 4. అణిమాది సిద్ధయః – అణిమాదులగు అష్టసిద్ధులు

**కుణ్డలిన్యాం, కథాయోగ మధునా ప్రకృతం శృణు । 41 ।**
**తాం యదా పూరకాఽభ్యాసా దాపూర్య★ స్థీయతే సమమ్ ।**
**తదైతి మైరవం స్థైర్యం, కాయస్యాఽఽపీనతాం తథా । 42 ।**

**41-42.** కుండలినీ కథాప్రసంగమున, నిపుడు ప్రకృతవిషయమును వినుము.

★ 'ఆపూర్య – కూర్మనాడ్యాం ప్రాణ మవష్టభ్య ఇత్యర్థః' (యో.వా.తా.ప్ర.)
కూర్మనాడి యందు ప్రాణమును నిలిపియని భావము.
'కూర్మనాడ్యాం స్థైర్యమ్' । (పా.యో.ద. III-32)
కంఠకూపమునకు (గొంతుకు) దిగువ వక్షస్థలమున, కూర్మాకారమున నున్న నాడియందు సంయమ మొనర్చుట వలన స్థైర్యము (మనఃస్థైర్యమును, కాయస్థైర్యమును) సిద్ధించుచున్నది ధ్యేయ విషయమున ధారణా, ధ్యాన, సమాధులు మూడింటిని కల్గి యుండుట సంయమనబడును.
"త్రయమేకత్ర సంయమః" (యో.ద.III-4)

కుండలిని, పూరక మను ప్రాణాయామాభ్యాస బలమున పూరించి, సమరూపమున స్థిరముగ నిలిచినచో, మేరువు వంటి స్థైర్యమును, గురుత్వమును సాధకుడు పొందును. శరీరము, స్థూలత్వమును - (మహాబలమును) - పొందును. ('గరిమ'యను సిద్ధిని సాధకుడు పొందును).

**యదా పూరకపూర్ణా ఽన్తరాయత ప్రాణమారుతమ్ ।**
**తదా సమస్తమేవేద, ముత్ప్లావయతి(1) దేహకమ్ ॥ 43 ॥**
**ఇత్యభ్యాస విలాసేన, ప్రాప్యతే వ్యోమగామితా ।**

**43-44.** పూరకముచే మూలాధారము నుండి బ్రహ్మరంధ్ర పర్యంతము, పూర్ణముగ నిండిన ప్రాణవాయువు, లోన నిరోధింపబడినపుడు, అది, ఆపాద మస్తకముగు సమస్త దేహమును తేలిక చేసి, పైకి లేపుచున్నది. ఇట్లు అభ్యాస బలమున, ఆకాశగామిత్వము సిద్ధించుచున్నది.

**బ్రహ్మనాడీ ప్రవాహేణ, శక్తిః కుణ్డలినీ యదా ॥ 44 ॥**
**బహి రూర్ధ్వం కపాటస్య ద్వాదశాఽఙ్గుళమూర్ధని ।**
**రేచకేన ప్రయోగేణ నాడ్యన్తర నిరోధినా ॥ 45 ॥**
**ముహూర్తం(2) స్థితి మాప్నోతి, తదా వ్యోమగదర్శనమ్ ।**

---

(1) ఉత్ప్లావయతి—ఊర్ధ్వం ప్లావయతి, ఉడ్డీనం కరోతి – పైకి ఎగురచేయుచున్నది. (యో.వా.తా.ప్ర)

(2) ముహూర్తః - రెండు గడియల కాలము, లేక, క్షణకాలము. యోగుల ననుసరించి శరీరమునందు డెబ్బది రెండు వేల (72000) నాడులున్నవి ఈ నాడులందు 'ఇడా' – 'పింగళా' – 'సుషుమ్నా' నాడులు ముఖ్యములు. సుషుమ్నా నాడి, మూలాధారము. (గుదస్థానము) నందలి అంచు నాశ్రయించి బ్రహ్మదండి (వెన్నుముక - ) మూలమున (లోపల బోలుగా నుండు కాలువ ద్వారా) భ్రూమధ్యము వరకు వ్యాపించి యున్నది. ఈ నాడికి ఎడమ భాగమున 'ఇడా' నాడియు, కుడి భాగమున 'పింగళా' నాడియు, మూలాధారము మొదలు, భ్రూమధ్యము వరకు వ్యాపించి యున్నవి. ఉచ్ఛ్వాసనిశ్వాసములు వీని ద్వారా జరుగుచుండును. 'సుషుమ్న'ను 'మధ్యనాడి' బ్రహ్మనాడి యనియు, వ్యవహరింతురు. "సుషు ఇత్యవ్యక్తం శబ్దం మ్నాయతీతి సుషుమ్నా" – అని సుషుమ్నా శబ్దమునకు వ్యుత్పత్తి చెప్పబడినది. అవ్యక్త మధురమగు నాద మొనర్చునది 'సుషుమ్న' అని యర్థము.
చూడు :– ఉత్తర గీత. II-11-14. మరియు Raja Yoga - Chapter V.
The Control of Psychic Prana - Swami Vivekananda (Advaita Asrama–Calcutta)
యోగ రహస్య పథముల నెరుగని వారి కిదియంతయు అసంబద్ధ ప్రలాపముగ గోచరించును. నిద్రాణముగ నున్న కుండలినీశక్తి ప్రబుద్ధమై, సుషుమ్నా (బ్రహ్మనాడీ) ద్వారమున పైకి పోయినపుడు, మనస్సు యొక్క ఆవరణములన్నియు తొలగి, వివిధదివ్యదర్శనములు, అద్భుతసిద్ధులు యోగికి కలుగునని యోగశాస్త్రములు చెప్పుచున్నవి.
చూడు :- శ్రీ సీతారామాంజనేయ సంవాద సమాలోచనాత్మక పరిశీలనము – (రాజయోగ దర్శనము) – 1982) డా॥ రత్నాకరం బాలరాజు, సాకేతనిలయం, 21, S.B.I. Colony, అనంతపురం (ఆం.ప్ర.). మరియు, ప్రబోధచంద్రోదయము I-1

**45-46.** ఇతర నాడీవ్యాపారనిరోధకమగు - (ప్రాణవాయువును బయటకు విడుచుట యనెడి) రేచకము చేత, ఊర్ధ్వమునకు ఆకర్షింపబడిన కుండలినీ శక్తి, బ్రహ్మనాడి యనబడు సుషుమ్నానాడి యందలి ప్రాణ వాయుప్రవాహముచే, శిరస్సు యొక్క రెండు కపాలముల సంధి రూపమగు **కపాటమునకు** ద్వాదశాంగుళముల వెలుపల, శిరస్సుపైన, **'షోడశాంత'**మను స్థానమున కేవలము ముహూర్తకాలము నిలిచినచో, ఆకాశగాములగు సిద్ధుల దర్శనము కలుగును.

**ముఖా ద్బహి ర్ద్వాదశాన్తే, రేచకాఽభ్యాసత శ్చిరమ్ । 46 ।**
**ప్రాణే చ స్థాపితే దేహ మన్యం చ ప్రవిశ త్యసౌ ।**

**46-47.** ప్రాణవాయువును బయటకు విడుచుట యనెడి రేచకమును దృఢముగ నభ్యసించుట చేత, ముఖమునకు (నాసాపుటములకు) పన్రెండం గుళముల వెలుపల ప్రాణ వాయువును చిరకాలము నిలుపగలిగినచో, యోగి, తనదేహమును విడిచి, మఱియొకదేహమునందు ప్రవేశింపవచ్చును. **[దీనినే పరకాయ ప్రవేశమందురు]**

**శ్రీరామ ఉవాచ :-**

**సూక్ష్మచ్ఛిద్రాది గత్యర్థం, పూరణార్థం చ ఖస్య వా । 47 ।**

**అణుతాం స్థూలతాం వాఽపి, కాయోఽయం నీయతే కథమ్ ।?**

**47-48.** **శ్రీరాముడు :-** స్వామీ! సూక్ష్మములైన రంధ్రాదుల నుండి పోవుటకును, ఆకాశమును నిండించుటకును, ఈదేహ మెట్లు **అణుత్వము** (సూక్ష్మత్వము)ను, మహత్త్వమును -(స్థూలత్వమును) పొందుచున్నది?

**వసిష్ఠ ఉవాచ :-**

**ఏకం చిన్మాత్ర మస్తీహ, సూక్ష్మాత్ సూక్ష్మతరం హి తత్ । 48 ।**
**అసత్యమేవ సఙ్కల్పభ్రమేణేదం శరీరకమ్ ।**
**ఏవం హి విదితాఽఽత్మానో, భావయన్తి యథైవ యత్ । 49 ।**
**తత్ తథైవాఽమ పశ్యన్తి, దృఢభావనయా తయా ।**

**48-50.** **వసిష్ఠుడు :–** ఇచట ఏకమగు శుద్ధచైతన్యము (బ్రహ్మము) మాత్రమే ఉన్నది. అది సూక్ష్మమున కంటెను సూక్ష్మతరము. ఈ శరీరము కేవలము లేనిదే – (అసత్యము); సంకల్పభ్రమ చేత కలిగినది. ఇట్లు ఆత్మవేత్తలయిన జ్ఞానులు, సత్య సంకల్పులైన మహాత్ములు, దేనినెట్లు భావింతురో, దాని నట్లే దృఢభావనచే కాంచ గల్గుచున్నారు.

**సత్యభావేన దృష్టోఽయం, దేహో దేహో భవ త్యలమ్ ‖ 50 ‖**
**దృష్ట స్త్వసత్యభావేన, వ్యోమతాం యాతి దేహకః ।**

**50-51.** ఈ దేహము, సత్యభావనచే చూడబడినచో, దేహమే యగుచున్నది; అసత్య భావనచే చూడబడినచో, బ్రహ్మాకాశత్వము నొందుచున్నది.

**అణిమాదిపదప్రాప్తౌ, భావనా యుక్తి రీదృశీ ‖ 51 ‖**
**సులభా చ భవత్యేషా, యోగసంసిద్ధిసంవిదామ్ ।**
**ఏవం బభూవ చూడాలా, ఘనాఽభ్యాసవతీ సతీ ‖ 52 ‖**

**51-52.** అణిమాదిసిద్ధిప్రాప్తికి, ఇట్టి దృఢభావనయే, యుక్తి – (ఉపాయము). ఈ భావన, యోగసంసిద్ధి నెఱిగిన జ్ఞానులకు సులభమగుచున్నది. పూర్వోక్తరీతి, ప్రాణధారణాది ఘనా (దృఢా) భ్యాసశాలిని యైనందున చూడాల, గుణైశ్వర్య యుక్తయైనది.* [**అణిమ మొదలగు అష్ట సిద్ధులను పొందినది**].

## 5. ఉపదేశ ప్రయోజనమ్ –

### గురూపదేశము యొక్క ప్రయోజనము (సాఫల్యము)

**వివేద నైవ రాజా తు, తామేవం గుణశాలినీమ్ ।**
**బహుశో బోధ్యమానోఽపి, తయా రాజా న బుద్ధవాన్ ‖ 53 ‖**

---

* **అష్టసిద్ధులు :-** "అణిమా, మహిమా, మూర్తే ర్లఘిమా, ప్రాప్తి రిన్ద్రియైః
ప్రాకామ్యం శ్రుత దృష్టేషు, శక్తి ప్రేరణ మీశితా, ।
గుణేష్వసఙ్గో వశితా, యత్కామ స్తదవస్యతి ॥"
(యోగసార సంగ్రహము–విజ్ఞానభిక్షువు)

**మఱియు :–** "విభూతి ర్భూతి రైశ్వర్య మణిమాఽఽదిక మష్టధా ।
అణిమా, మహిమా చైవ, గరిమా, లఘిమా తథా,
ప్రాప్తిః ప్రాకామ్య మీశిత్వం, వశిత్వం చాఽష్టసిద్ధయః ॥ (అమరకోశము I-36)

53. అట్టి గుణశాలినియైన (సిద్ధవిభవను,) చూడాలను, రాజు ఎఱుగ జాలడయ్యెను. పలుమాఱు, బోధింపబడినను, రాజు, తత్త్వము తెలిసికొనలేదు.

ఉపదేశక్రమో రామ! వ్యవస్థామాత్రపాలనమ్ ।
జ్ఞప్తే స్తు కారణం శుద్ధా, శిష్యప్రజ్ఞైవ కేవలమ్ ॥ 54 ॥

54. శ్రీరామా! గురూపదేశక్రమము, అధ్యాత్మజీవనమున, శాస్త్ర నియమమును రక్షించుటకు మాత్రమే. జ్ఞానప్రాప్తికి శిష్యుని శుద్ధమగు ప్రజ్ఞయే కేవలము కారణము.

శ్రీరామ ఉవాచ :-

ఏవం స్థితే మునే! బ్రూహి, కథ మేతత్ జగత్ స్థితౌ ?।
క్రమో గురూపదేశాఖ్యః, స్యాఽఽత్మజ్ఞానస్య కారణమ్? ॥ 55 ॥

55. శ్రీరాముడు :- మునీంద్రా! అట్లైనచో, ఈ జగత్తున అట్టి పరిస్థితియందు గురూపదేశ క్రమమనునది, ఆత్మజ్ఞానమునకు ఉపాయ మెట్లగునో? వచింపుము.

## (కిరాటోపాఖ్యానము)

వసిష్ఠ ఉవాచ :-

అత్యన్త కృపణః కశ్చిత్, పతితాం విన్ధ్యజాఙ్గలే ।
ఏకాం కరోటికాం ప్రాప్తుం, సర్వం తృణతుషాదికమ్ ॥ 56 ॥
దినత్రయం దుధావాఽథ, చిన్తామణి మవిన్దత ।
ఏవం కరోటికాఽన్వేషా ద్రత్నం లబ్ధ మఖేదివా ॥ 57 ॥

56-57. వసిష్ఠుడు :- వింధ్యపర్వతారణ్యమున, అత్యంతకృపణుడైన (పరమలోభియైన) ఒకానొక వణిజుడు, తనచేతి నుండి జారి క్రింద పడిపోయిన ఒక గవ్వను పొందుటకు అచటి గడ్డిగాదము నంతయు తొలగించి, మూడు దినములు శోధించి తుదకొక చింతామణి - (అమరమణి)ని కనుగొన్నాడు. ఇట్లు ఖేదరహితుడగు ఆ వర్తకుడు,

గవ్వను వెదుకబోయిన కారణమున, చింతామణిని పొందినాడు.

తథా శ్రుతోపదేశేన, స్వాఽఽత్మజ్ఞాన మవాప్యతే ।★
తత్త్వస్యాఽన్య మహార్థస్య, ప్రాప్తే యద్యపి కారణమ్ ॥ 58 ॥
న గురోః కథనం సాక్షాత్, తథాఽపి కారణం క్రమాత్ ।
చిన్తామణేః హి సంప్రాప్తౌ, యథా హేతుః కరోటికా ॥ 59 ॥

---

★ శాస్త్ర మాహాత్మ్యము :
"తటస్థితా బోధయన్తి గురవః శ్రుతయో యథా ।
ప్రజ్ఞయైవ తరేద్విద్వానీశ్వరాఽనుగృహీతయా ।" (శంకరుడు – వి.చూ. 477)
నదిలో నావ యందు పయనించుచు, దానిని నడుపుటకు తగిన కౌశలము లేనివానికి, ఒడ్డున నిలబడి (తటస్థుడై) నిపుణుడైన వ్యక్తిక్షేపణిని (నావ గడపు తెడ్డును) 'ఇట్లు, ఇట్లు' – గడపవలె (త్రోయవలె)నని బోధించు రీతి, గురువులు, ఉపనిషదాది శ్రుతులు, శాస్త్రములును, పరోక్ష జ్ఞానజనకములై, మార్గమును దర్శింపజేయుచున్నవి. వివేకశాలి, ఈశ్వరాఽనుగృహీతమైన ప్రజ్ఞ (చిన్మాత్రవృత్తి) చేతనే, సంసార సాగరమును తరింపవలయును. గురు, శాస్త్రాదులు బ్రహ్మప్రాప్తికి సాధనము లెట్లగుచున్నవో, తెలుపుటకు దృష్టాంతముగ వసిష్ఠుడు, ఈ కథను చెప్పెను. (యో.వా. VI-నిర్వాణ–ఉత్తర–196, 197 సర్గలు)

"కీరకులమను ఒక కోయజాతివారు, వైవధికులై (కావళ్లలో కట్టెలు మోయువారై) జీవించుచుండిరి. కుఠారములు (గొడ్డళ్లు) దాల్చి, చెట్లు నఱికి, కట్టెలమ్ముకొని, జీవించుచుండిరి. వారు చెట్లు నఱుకు వనాంతమున, గుప్తాగుప్త రత్నములు, శ్రీ చందనదారువులు, సువర్ణము – సమస్తము మున్నది. ఆ భారవాహులలో, కొందఱు, అదృష్టవంతులు, బంగారము, రత్నములు పొందిరి. కొందఱు శ్రీచందనదారువులు, కొందఱు పుష్పములు, మఱి కొందఱు ఫలములు విక్రయించి జీవించుచుండిరి. కట్టెల కొఱకు వారందఱు మహావనమును ప్రవేశించినను, కొందఱు మాత్రము, రత్నములు పొంది, దారిద్ర్య దుఃఖజ్వర విముక్తులు కాగా, అదృష్టహీనులైన కొందఱు దేనిని పొందక, కట్టెలమ్ముకొనియే జీవించుచుండిరి.

ఇట్లు, అజస్రము, వారు ఆ మహావనమును సేవించుచుండగా, అందొక ప్రదేశమున, వారికి, దైవవశమున దేవమణి–చింతామణియే–లభించినది. కట్టెల కొఱకు ప్రయత్నించువారు సకలాభీష్టదాయకమగు చింతామణిని పొంది, నిర్ద్వంద్వులై (నిరస్త శీతోష్ణ క్షుత్పిపాసాది దుఃఖరహితులై, స్వర్గవాసులు దేవతలట్లు పరమసుఖమును ప్రాపించిరి.)

శ్రీరామా! ఈ కాష్ఠ భారోపజీవులే జనులు. అజ్ఞానము, తాపత్రయ దుఃఖమే, వారి దారిద్ర్య దుఃఖము. గురుశాస్త్రాదికమే సకలార్థ గర్భమగు ఆ మహావనము. "నాకు లౌకిక భోగసముదయము సిద్ధించుగాక!" –అని మిక్కిలి కృపణులై, జనులు, భోగేచ్ఛతో శాస్త్రములందు ప్రవృత్తులైనను, ఆ శాస్త్రములు 'గుడజిహ్వికాన్యాయము'న మొదట వారు కోరిన ఫలములవే రుచి చూపించి, తద్విశ్వాస దార్ఢ్యమున, తరువాత, క్రమముగ, ఉక్త సాధనాభ్యాసము వలన, జ్ఞానభూమికారోహణము వలనను, చింతితమైన శాస్త్రము యొక్క పరమతాత్పర్యము మోక్షాఖ్యమగు ఆద్యపదమును బ్రహ్మమును ప్రాపింపజేయుచున్నవి.

శాస్త్రార్థవిచారమునవేమగునని సందేహశీలమున శాస్త్రాభ్యాసమున జనులు ప్రవృత్తులైనను, తరువాత వారు ఉత్తమపదమునే ప్రాపించుచున్నారు. పూర్వపుణ్యానవా(?)ప్రభావమున మోక్షాఖ్యమగు బ్రహ్మమును అపేక్షించు వారిని, శాస్త్రములు, స్వతాత్పర్య విషయమగు పరమార్థమును

**58-59.** అట్లే, గురూపదేశశాస్త్ర శ్రవణము వలన, ఆత్మజ్ఞానము సంప్రాప్తించుచున్నది. మహార్థమగు తత్త్వజ్ఞాన ప్రాప్తికి, గురూపదేశము సాక్షాత్తుగా కారణము కాకున్నను, కరోటిక (గవ్వ), చింతామణి ప్రాప్తికి హేతువైనట్లు, అది క్రమముగా మననము ద్వారా కారణమగుచున్నది. [గవ్వయే చేజారి క్రిందపడకున్నచో, ఆవణిజుడు గడ్డి గాదము తొలగించి దానిని వెదకి యుండడు; చింతామణియు వానికి లభించి యుండదు. స్థూలారుంధతీనిదర్శన న్యాయమున, శిష్యుని బుద్ధికి అంతర్ముఖత్వమును కల్గించుట ద్వారా, గురూపదేశాదులు శ్రవణమననాదులచే క్రమముగా ఆత్మజ్ఞానమునకు కారణమగుచున్నవి. సాఫల్యమును బొందుచున్నవి]

ఇతి శ్రీయోగవాసిష్ఠ సంగ్రహే 'చూడాలా ప్రభావో'నామ పంచవింశః సర్గః

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'చూడాలా ప్రభావ'మను

పంచవింశతితమ (ఇరువదియైదవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



---

పొందించుచున్నవి.

ఇట్లు కొందఱు, కామమును, కొందఱు అర్థమును, కొందఱు, ధర్మార్థకామాత్మకమగు త్రివర్గమును, కొందఱు పరమపురుషార్థమగు మోక్షమును, శాస్త్రము వలన పొందుచున్నారు.

"శాస్త్రార్థభావన వశేన గిరా గురూణాం,
సత్సఙ్గమేన, నియమేన, శమేన రామ ! ।
తత్ప్రాప్యతే నకలం విశ్వపదాదతీతం,
సర్వేశ్వరం పరమ మాద్యమనాది శర్మ॥" (యో వా VI నిర్వాణ-ఉత్తర 197.34)

శ్రీరామా! శాస్త్రార్థభావన వశమునను, గురూపదేశ వాక్యము వలనను, సత్సంగమము నియమశమాదుల చేతను, బ్రహ్మలోకాంతమగు ఐశ్వర్య సుఖమునకంటెను అతిశయితమగు, పావనము, సర్వేశ్వరము పరమము, మోక్షాఖ్యమునగు ఆద్యము అనాదిసుఖమును నరుడు ప్రాపించుచున్నాడు." అని వసిష్ఠుడు కాష్ఠవైవదికోపాఖ్యానము యొక్క రహస్యార్థమును వివరించినాడు.

ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## షడ్వింశసర్గము

## శిఖిధ్వజతపః – శిఖిధ్వజుని తపస్సు

### 1. కాననవాసః – శిఖిధ్వజుని అరణ్యనివాసము.

వసిష్ఠ ఉవాచ :–

రాజాఽఽత్మజ్ఞానహీనస్తు, దుఃఖేన పీడితో భృశమ్ ।
దదా వతితరాం దానం, తీర్థయాత్రాం చకార* చ ॥ 1 ॥

---

★ పోల్చు :- "నివృత్తి రపి మూఢస్య, ప్రవృత్తి రుపజాయతే ।
ప్రవృత్తి రపి ధీరస్య, నివృత్తి ఫలభాగినీ ॥" (అష్టావక్రసంహిత -XVIII-62)

ఆత్మ జ్ఞాన రహితుడగు మూఢుని కర్మత్యాగము (నివృత్తి) సైతము కర్మమే – (ప్రవృత్తియే) యగుచున్నది. ఆత్మజ్ఞాని యొక్క కర్మము – (ప్రవృత్తి) సైతము నైష్కర్మ్య (నివృత్తి) ఫల భాగమును పొందుచున్నది. (చూడాల, రాజ్యమేలుచున్నను, నివృత్తిపదమున నున్నది, నైష్కర్మ్యసిద్ధిని బడసినది. రాజ్యాదికమును త్యజించినను – శిఖిధ్వజుడు, కర్మతంత్రుడే (ప్రవృత్తి పరుడే): నైష్కర్మ్యసిద్ధిని అతడు పొందలేదు.

1. శిఖిధ్వజ మహారాజు, ఆత్మ జ్ఞాన రహితుడై అత్యంత దుఃఖ పీడితుడైనాడు. అత డధికముగ నెన్నో దానములను, తీర్థయాత్రలను చేసినాడు.

**తపః కృచ్ఛ్రాదికం చక్రే, న తు లబ్ధా విశోకతా ।**
**చూడాలా మేకదా భూపః, ప్రోచే మధురయా గిరా । 2 ॥**

2. అతడు కృచ్ఛ్రచాంద్రాయణాది తప మొనర్చినాడు. కాని, అతనికి శోకరాహిత్యము లభింపలేదు. ఒకానొక దినమున రాజు, చూడాలతో మధురవచనమున నిట్లన్నాడు.

**"భుక్తం రాజ్యం, చిరం కాలం, దృష్టా విభవభూమయః ।**
**అధునాఽస్మి విరాగేణ, యుక్తో గచ్ఛామి కాననమ్ । 3 ।**

3. "ప్రేయసీ! చిరకాలము రాజ్యమును, పలు విధములైన రాజ భోగములను అనుభవించితిని. ఇపుడు నేను విరాగయుక్తుడనై వనమున కేగుచున్నాను.

**రాజ్యా దప్యధికం మన్యే, సుఖం వననివాసినామ్ ।**
**అస్మిన్ సమ్మంత్రణే తన్వి! న విఘ్నం కర్తు మర్హసి । 4 ।**
**భవత్యా పాలయన్త్యేహ, రాజ్యే స్థాతవ్య ముత్తమే !" ।**

4-5. వననివాసుల యొక్క సుఖము, రాజ్యసుఖమున కంటె నధికమని భావింతును. ఉత్తమమైన ఈ మంతనమున తన్వీ! విఘ్న మొనరించుట నీకు తగదు. వరవర్ణినీ! ఈ రాజ్యము పాలించుచు, నీ విచటనే యుండవలయును."

**ఇత్యుక్త్వా దయితాం రాజా, హ్యర్ధరాత్రే వినిర్గతః । 5 ।**
**క్రమా న్మన్దరశైలస్య, తటస్థం, కాననం యయౌ ।**
**తత్రైకస్మిన్ సమే దేశే, స చకారోటజాఽఽలయమ్ । 6 ।**

5-6. ఇట్లు ప్రేయసికి తెలిపి, రాజు, అర్ధరాత్రమున, ఆమెను వదలి వెడలిపోయెను; క్రమముగ మందరాద్రి సమీపమున నున్న కాననమున కేగి, అచట నొక సమతలమున పర్ణశాలను నిర్మించుకొన్నాడు.

**సర్వం సంపాదితం తేన, యోగ్యం తాపసకర్మణి ।**
**సన్ధ్యాపూర్వం జపం ప్రాతః, ప్రహరే న తదాఽకరోత్ । 7 ।**

**పుష్పోచ్చయం ద్వితీయే తు, స్నానం దేవాఽర్చనం తతః ।**
**పశ్చాద్వన్యం ఫలం కిఞ్చిద్భుక్త్వా, జప్యపరోఽభవత్ ॥ 8 ॥**

7-8. తపశ్చర్యకు యోగ్యమైన వాని నన్నిటిని, అతడు సమకూర్చుకొన్నాడు. ఆ రాజు దినమున ప్రథమ యామమున, ప్రాతఃసంధ్యాపూర్వకమగు జప మొనరించెను. ద్వితీయయామమున పూజార్థము పుష్పముల సంగ్రహించెను. తరువాత స్నానమొనర్చి, దేవ పూజను నిర్వర్తించెను. పిమ్మట వన్యఫలములను, స్వల్పముగ భుజించి, ఇష్టమంత్ర జపపరాయణుడయ్యెను.

**పురే ప్రబుధ్య చూడాలా, భర్త్రా త్యక్తాఽతి ఖిన్నధీః ।**
**వాతరన్ధ్రేణ నిర్గత్య, పతిం దృష్ట్వా న్యవర్తత ॥ 9 ॥**

9 పురమున, పతిత్యక్తయైన చూడాల, నిద్ర నుండి మేల్కొని, మిక్కిలి ఖిన్నమతియై, యోగబలమున గవాక్షము ద్వారా, ఆకాశమార్గమున బయలుదేరిపోయి, భర్తను గాంచి వెనుకకు మరలి వచ్చినది.

**"ఆస్తాం మమాఽద్య గమనం!, కాలేనాఽతిచిరేణ హి ।**
**మయాఽస్య పార్శ్వం గన్తవ్య" మితి నిశ్చిత్య సా తదా ॥ 10 ॥**
**"కేనచి త్కారణేనాఽసౌ, గతః సంప్రతి భూపతిః" ।**
**ఇతి ప్రజాః సమాశ్వాస్య, భర్తూ రాజ్యం రరక్ష హ ॥ 11 ॥**

10-11. "నా గమన మిపుడు ఉండుగాక! (ఇపుడు కాదు). ఎంతో కాలము గడచిన పిదపనే, నేనాతని సన్నిధి కేగవలయును". అని ఆమె, నిశ్చయించి, "ఏదేనొక విశేషకారణమున, రాజు ప్రవాసమునకు జనె"నని ప్రజలనోదార్చి, తన భర్త యొక్క రాజ్యమును పాలించినది.

## 2. చూడాలయా కుమ్భరూపగ్రహణమ్ – చూడాల, కుంభుని రూపమును దాల్చుట

**అష్టాదశ చ వర్షాణి గతా న్యేవం యదా తదా ।**
**"భర్తుః పార్శ్వం మయా గన్తుం, ప్రాప్తః కాలోఽయ" మిత్యథ ॥12॥**
**సంచిన్త్య మన్దరం వ్యోమ్నా, గత్వా దృష్ట్వా పతిం తదా ।**

**12-13.** పదునెనిమిది సంవత్సరములు గడచిన తరువాత, నొకనాడు చూడాల, "భర్త యొక్క సన్నిధికి పోవుటకు తగిన కాల మిపుడు వచ్చినది" – అని భావించి, ఆకాశపథమున మందరపర్వతమున కేగి, తన భర్తను గాంచి (ఇట్లు తలపోసినది).

**"అహో! ను విషమం మౌర్ఖ్యం, దుర్దశాం యత్ప్రసాదతః ॥ 13 ॥**
**ఏవం విధాః సమాయాన్తి, శాస్త్రార్థదర్శినోఽపి హి ।**
**తదవశ్య మిహద్యైవ, తత్త్వం సంబోధయామి తమ్ ॥ 14 ॥**
**'బాలేయం మమ కాన్తే'తి, మదుక్తం న కరిష్యతి ।**
**తస్మా త్తాపసవేషేణ బోధయామి పతిం క్షణాత్" ॥ 15 ॥**

**13-15.** ఆహా! మూర్ఖత ఎంత విషమమైనది. శాస్త్రార్థము నెఱిగిన వారయినను, ఇట్టి పురుషులు, మూర్ఖత్వ ప్రసాదమున దుర్గతి పొలగుచున్నారు గదా! కావున ఇచ్చట, ఇప్పుడే, ఇతనికి పరమాత్మతత్త్వమును అవశ్యము బోధింతును. 'ఈ బాల, నా భార్య'యని నా వాక్యములను గ్రహించి ఆచరింపడు. కావున, తాపసవేషమున నొక్క క్షణముననే నా పతికి బోధన మొనరింతును.

**ఇతి సంచిన్త్య సా ధ్యానా ద్ద్విజపుత్రో బభూవ హ ।**
**శుక్లయజ్ఞోపవీతాఽఙ్గం, శుక్లామ్బరయుగాఽఽవృతమ్ ॥ 16 ॥**
**త మగ్రస్థిత మాలోక్య, రాజా వచన మబ్రవీత్ ।**

**16-17.** ఇట్లు నిశ్చయించి, ధ్యాన ప్రభావమున, ఆమె బ్రాహ్మణకుమారుడైనది. ధవళపరిశుభ్ర యజ్ఞోపవీతయుక్తుడును, ధవళ వస్త్రయుగళ ధారియునై (తెల్లని దోవతి, ఉత్తరీయమును దాల్చి) తన యెదుట నిలిచియున్న ద్విజకుమారుని గాంచి, రాజు ఇట్లు వచించెను.

**"దేవపుత్ర! మహాభాగ! కో భవాన్? కుత ఆగతః ? ॥ 17 ॥**
**దివసం సఫలం మన్యే, యత్త్వామద్యాఽస్మి దృష్టవాన్ ।"**
**ఇత్యుక్త్వా పాద్యమర్ఘ్యాది, దత్తవన్తం చ సాఽబ్రవీత్ ॥ 8 ॥**

**17-18.** "దేవకుమారా! మహాభాగా! తామెవరు? ఎట నుండి తమ రాక? తమ

దర్శనముచే ఈ దినము సఫలమైనదని భావింతును." - అని అర్ఘ్యపాద్యాదులొసగిన రాజునకు, ఆమె యిట్లు వచించినది.

**"స్ఫీతం రాజ్యం సముత్సృజ్య, కాననం సేవ్యతే త్వయా ।**
**శాన్తేన మనసా సాధో!, కచ్చిత్తే సంభృతం తపః ॥ 19 ॥**

19. "సౌమ్యుడా! సమృద్ధమగు రాజ్యమును పరిత్యజించి, అరణ్యము నాశ్రయించితివి. శాంత మనస్సుతో (నిర్వాణార్థమగు) నీ తపస్సు, పరిపూర్ణత నొందినదా?

**రాజన్! మే శృణు వృత్తాన్తం యథా పృష్టం త్వయాఽధునా ।**
**కదాచి న్నారదః పూర్వం, గుహాయాం ధ్యానమాస్థితః ॥ 20 ॥**
**అకస్మాల్లీలయా నద్యాం, క్రీడన్తం లలనాగణమ్ ।**
**ఆలోకయత్ తదా తస్య సహసైవ మనో మునేః ॥ 21 ॥**
**అనాశ్రిత వివేకం సత్, బభూవాఽఽనన్దితం స్ఫురత్ ।**

20-22. రాజా! నీవడిగినట్లు ఇపుడు నా వృత్తాంతమును వినుము. పూర్వ మొకప్పుడు దేవర్షి నారదుడు మేరుపర్వతగుహ యందు, ధ్యాన నిష్ఠుడై యుండి, యాదృచ్ఛికముగ, మందాకినీనది యందు సవిలాసముగ జలక్రీడలాడుచున్న సుందరీగణమును గాంచినాడు. అపు డాముని మనస్సు, ఆకస్మికముగ, సద్వివేకమును కోల్పోయి, స్పందించి, ఆనందితమైనది (ప్రమత్తమైనది.)

**ఆనన్దవలితే చిత్తే, క్షుబ్ధే ప్రాణాఽనిలే స్థితే ॥ 22 ॥**
**బభూవ తస్య తుష్టస్య, మదనస్ఖలితం తదా ॥"**

22-23. చిత్త మానంద సంవలితమై, ప్రాణానిలములు సంక్షోభమొందగా, అపుడు పరితుష్టుడైన ఆ మునికి, మదనవశమున, సర్వాంగసారమగు రేతస్సు స్ఖలనమైనది."

**రాజోవాచ :—**

**"తాదృశోఽపి బహుజ్ఞోఽపి, జీవన్ముక్తోఽప్యసౌ మునిః ॥ 23 ॥**
**కథ మేవం విధాం బ్రూహి, ప్రాప్తో మదనవశ్యతామ్ ? ॥"**

**23-24.** రాజు :- "మహాత్మా! బహుశాస్త్రార్థవేదియు, జీవన్ముక్తుడునైన అట్టి ముని, ఎట్లు మన్మథునకు వశుడయ్యెనో తెలుపుము."

**కుమ్భ ఉవాచ :-**

**"స్వరూపే నిర్మలే సత్యే, నిమేష మపి విస్మృతే I 24 I**
**దృశ్య ముల్లాస మాప్నోతి, ప్రావృషీవ పయోధరః I**

**24-25.** కుంభుడు :-"సత్యము, నిర్మలమునై యున్న స్వస్వరూపము నిమేష మాత్రమైనను విస్మరింపబడెనేని, అపుడు, వర్షాకాలమున మేఘము వలె దృశ్యము, (అనగా, ఇంద్రియానుభూతికి సంబంధించిన పదార్థము) ఉల్లాసము నొందుచున్నది. (విజృంభించుచున్నది.)

**సుఖదుఃఖకలాస్పన్దో, బన్ధో జీవస్య నేతరః I 25 I**
**తదభావో హి మోక్షః స్యా దితి ద్వేధా వ్యవస్థితిః ★I**

**25-26.** విషయముల గూర్చిన సుఖదుఃఖముల అనుభవము నందు, చిత్తముయొక్క స్పందనమే (రాగద్వేషరూపమగు చిత్తచలనమే) జీవునకు బంధము గాని, అన్యము కాదు. అది లేకుండుటే, అనగా **సుఖదుఃఖముల అభావముచేతనే మోక్షము.** ఇట్లు సంసరణ, అసంసరణముల చేత, బంధమోక్షముల యొక్క ద్వివిధమైన వ్యవస్థితి లోకమున కలదు."

---

★ రాజు (శిఖిధ్వజుని) ప్రశ్న (23/24), పరతత్త్వ ద్రష్టయగు మహర్షి నారదు డెట్లు కామోపహతుడై నాడను సంశయమును గల్గించుచున్నది. భగవద్గీత యందు పేర్కొన్నట్లు, కామవివశత్వము వేదాంత సిద్ధాంతమునకును, మహాత్ములు, మహర్షులునైన వారి అనుభవమునకును విరుద్ధము.

"విషయా వినివర్తన్తే, నిరాహారస్య దేహినః I
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే I" (భ.గీ. II-59)

నిరాహారుడగువానికి విషయములు నివర్తించినను, వాని యందున రసము, అనగా రాగము - (అభిలాష) వదలదు. ఆ రాగము, పరమాత్మదర్శనమున, స్థితప్రజ్ఞుడైన వానికి స్వయముగ నివర్తించును. విషయ విజ్ఞానము నిర్బీజము కాగలదు. కాని, కుంభుని సమాధానము (25/26), ఈ స్థితిని విశద మొనర్చుచున్నది. సుఖదుఃఖపీడితుడగు వ్యక్తి, ముక్తుడెన్నటికి కాజాలడు. ముక్తునకు సుఖమందు రాగముగాని, దుఃఖమందు ద్వేషము గాని, ఉండదు. శుద్ధ చిన్మాత్ర స్వరూపమగు తన ఆత్మ యందాతడు పరిపూర్ణుడు. కాన, ఈ వృత్తాంతము నందలి నారదుడు, నిత్యవిముక్తిదాయకమగు పరమావస్థను పొందలేదనుట, స్పష్టమగుచున్నది. తరువాత అతడు, సనత్కుమారుని ఆశ్రయించి పరమార్థమును (భూమావస్థను) ప్రాపించినాడు. [ఛాం. ఉ. సప్తమ ప్రపాఠకము - 1-16 ఖండములు (VII.1-16)]

రాజోవాచ :-

"అత్యుదారం మహాశ్చర్యం, వక్షి త్వం వదతాం వర ! ॥ 26 ॥
కిం తు తావత్సమాసేన, తవోత్పత్తిం వదాఽద్యమే ।
తతః శ్రోష్యామి యత్నేన, జ్ఞానగర్భాం గిరం తవ" ॥ 27 ॥

26-27. రాజు :- "అధ్యాత్మజ్ఞానవక్తలలో శ్రేష్ఠుడవగు మహాత్మా! అతి ఉదారమును, ఆశ్చర్యమున్నైన విషయమును వచించితివి. కాని, సంక్షేపముగ నీ యుత్పత్తిని నాకిపుడు తెలియజేయుము. అటు పిమ్మట ఆత్మజ్ఞాన గర్భితమగు నీ వాక్కులను శ్రద్ధతో నాలకింతును."

కుమ్భ ఉవాచ :-

క్షీరేణ పూరితే కుమ్భే, మునినా వీర్య మర్పితమ్ ।
మాసా త్సంపూర్ణసర్వాఽఙ్గః, కుమ్భాచ్చాఽహం వినిర్గతః ॥ 28 ॥

28. కుంభుడు :- క్షీరపూరితమైన స్ఫటికకుంభమున ముని, ఆ వీర్యము నుంచినాడు. ఒక మాసమున పరిపూర్ణసర్వాంగములతో, నేను అందుండి బయటకు వచ్చితిని.

మాం పాత్రం వీక్ష్య వేధాశ్చ, చకార జ్ఞానపారగమ్ ।
తతోఽహం కుమ్భనామాఽస్మి, యథా కామం చరామ్యహమ్ ॥ 29 ॥
ఆస్తా మేషా కథా తావత్! కస్త్వ మద్రౌ కరోషి కిమ్ ?॥"

29-30. పాత్రుడనైన నన్ను గాంచి బ్రహ్మదేవుడు, సర్వజ్ఞానపారంగతుని- సర్వజ్ఞుని - చేసినాడు. కావున నేను కుంభనామకుడనై యథేచ్ఛగా చరించుచున్నాను. ఆ కథ అట్లుండు గాక! నీవెవరవు? ఈ కొండ యందేమి చేయుచున్నావు?" [పురాణముల ననుసరించి నారదుడు బ్రహ్మమానసపుత్రుడు]

రాజోవాచ :-

"సంసార భయభీతత్వా ద్నివసామి వనాఽన్తరే ॥ 30 ॥
శిఖిధ్వజోఽహం భూపాల స్త్యక్త్వా రాజ్య మిహ స్థితః ।
దుఃఖాద్గచ్ఛామి దుఃఖౌఘం, కుర్వన్నపి క్రియా మిమామ్" ॥ 31 ॥

30-31. రాజు :- జననమరణరూపమైన సంసారరోగమునకు భయపడి, వనాంతరమున నివసించుచున్నాను. నేను శిఖిధ్వజుడను భూపాలుడను. రాజ్యపాలనమును వర్జించి ఇచట నున్నాను. తపఃక్రియ నాచరించు చున్నను, దుఃఖము నుండి దుఃఖప్రవాహములోనికి పోవుచున్నాను. దుఃఖము అవిచ్ఛిన్నమగుచున్నది."

## 3. చిన్తామణ్యుపాఖ్యానమ్ – సర్వాభీష్టప్రదమగు చింతామణి యను దివ్యమణి వృత్తాంతము

**కుమ్భ ఉవాచ :-**

**"జ్ఞానం హి పరమం శ్రేయః, కైవల్యం తేన లభ్యతే ।**
**అలబ్ధజ్ఞానదృష్టీనాం, క్రియా తు స్యాత్పరాయణమ్ । 32 ।**

32. "జ్ఞానమే పరమశ్రేయోరూపము. దాన, కైవల్యము (అవిద్యాకల్పిత దేహాదిప్రపంచనివృత్తి యందు, అద్వితీయబ్రహ్మభావప్రాప్తి రూపమైన కేవలత్వము, అఖండస్థితిరూపమగు నిర్వాణము) లభించును. జ్ఞానదృష్టి లభింపని **అజ్ఞానులకు క్రియలే పరాయణము** (ఉత్తమాశ్రయము) అగుచున్నవి.

**వాసనామాత్రసారత్వా దజ్ఞస్య సఫలాః క్రియాః ।**
**జ్ఞానినో వాసనానాశా దఫలాః సకలాః క్రియాః । 33 ।**

33. అజ్ఞానికి వాసనయే (సంస్కారమే) **సర్వాధారము** కావున, కర్మములు ఫలము నొసగుచున్నవి. కర్తృత్వభోక్తృత్వవాసన, ఉపశమింపగా, శ్రద్ధగాని, రాగము గాని, జ్ఞానికి సంభవింప నందున, అతనికి సకలకర్మములును అఫలము (నిష్ప్రయోజనము)లగుచున్నవి [వాసనాశూన్యములైన కర్మములు స్వతః సిద్ధముగా ఫలింపవు.]

**యస్యాఽజ్ఞత్వం క్షయం యాతి, సర్వం బ్రహ్మేతి భావనాత్ ।**
**నోదేతి వాసనా తస్య, ప్రాజ్ఞస్యేవాఽమ్బుధిః మరౌ । 34 ।**

34. సర్వమును బ్రహ్మమను భావన వలన అజ్ఞానము నశించిన వానికి,

వివేకశాలికి, మరుభూమియందు, జల బుద్ధి జనింపనియట్లు, వాసన ఉదయింపజాలదు.

సంసారతారకం జ్ఞానం, త్వం, కి మజ్ఞానవాన్ స్థితః ?।
కోఽహం? కథ మిదం జాతం?, కథం వా శామ్యతి ధ్రువమ్? ॥ 35 ॥

కథం బన్ధః? కథం మోక్షః?, ఇతి ప్రశ్నా నుదాహరన్ ।
పారాఽవారవిదాం* పాదాన్ కస్మాద్రాజన్! న సేవసే ?" ॥ 36 ॥

**35-36.** సంసార తారకమగు జ్ఞానమును నీవెందుకు ఎఱుగకుంటివి? 'నేనెవరను? ఈ విషయప్రపంచ మెట్లు కలిగినది? ఇది యెట్లు నిశ్చయముగా ఉపశమించును? బంధమెట్లు కలిగినది; మోక్షమెట్లు కలుగును' - అని విచారించుచు,పరిప్రశ్నించుచు, సంసారసాగరము యొక్క పారాఽవార తీరములను నెఱిగిన జ్ఞానుల నెందుకు ఆశ్రయించి, సేవింపవైతివి?" (పారతీరము–అవతలి యొడ్డు. అవారతీరము - ఇవతలి యొడ్డు - లేక, పారాఽవారము - పరమానంద సముద్రము)

రాజోవాచ :–

"అహో !ను బోధితోఽస్మ్యద్య, త్వం మే మిత్రం గురుః పితా ।
య దుదారతమం వేత్సి, యస్మిన్ జ్ఞాతే న శోచ్యతే ॥ 37 ॥
భవామి నిర్వృతో యేన, తద్బ్రహ్మోపదిశాఽఽశు మే ।

**37-38.** రాజు :– "ఆహా! నేడు నేను నీచే నిశ్చయముగ బోధింపబడితిని. (నీ యనుగ్రహమున నాకిపుడు తెలివి వచ్చినది). ఏది, సర్వోత్తమమవి నీ వెఱుగుదువో, దేని నెఱిగినంతనే మనుజు డిక దుఃఖమును పొందడో, దేని నెఱుగుటచే నేను సుఖవిశ్రాంతుడ నగుదునో -(నా తాపమంతయు నుపశమించునో) - అట్టి పరబ్రహ్మమును, శీఘ్రమే నాకుపదేశింపుము."

కుమ్భ ఉవాచ :–

"యద్యుపాదేయ వాక్యోఽహం, రాజర్షే! తద్వదామి తే ॥ 38 ॥
అన్యథాఽనేకథా ప్రోక్త మపి స్యా ద్విఫలం వచః ।

* సంసారసముద్రస్య పారమ్ – పరతీరం సన్మాత్రరూపః శోధితతత్పదార్థః ।
అవారమ్ – అవరతీరం, చిన్మాత్రరూపః, శోధిత త్వం పదార్థ
స్తదఖణ్డైక్యలక్షణవాక్యార్థవిదా మిత్యర్థః ।
అథవా పరమానన్దసముద్రః తద్విదా మిత్యర్థః । (యో.వా.తా.ప్ర.)

**38-39.** కుంభుడు:- "రాజర్షీ! నా వాక్య మాదరణీయమైనచో-నా వాక్యములందు నీ కాదరము, (శ్రద్ధ) కలదేని, అట్లే, సర్వమును నీకు వివరింతును. ఆదరము లేనిచో, ఎన్ని విధముల చెప్పినను, ఆ మాటలు వ్యర్థమగును గాని, ఫలింపజాలవు. ('శ్రద్ధస్వ సౌమ్య!' - అను శ్రుతి వలన శ్రద్ధారహితున కొనర్చు నుపదేశము మ్రోడు ముందర కాకరుతము వలె వ్యర్థము, నింద్యమును కాగలదు)

**సర్వశాస్త్రార్థ తత్త్వజ్ఞ, ఆసీత్కశ్చిన్మునిః పురా । 39 ।**
**అనన్తయత్నసంసాధ్యే, స చిన్తామణిసాధనే ।**
**అతీవ యత్నవాన్ భూత్వా, హస్తప్రాప్యం దదర్శ తమ్ । 40 ।**

**39-40.** పూర్వము, సర్వశాస్త్రార్థవేత్తయగు ముని యొకడుండెను. అనంత యత్న సాధ్యమును, **అభీష్టవరప్రదమునగు దివ్యమణిని -(చింతామణిని)-** సాధించుటకు, మహా ప్రయత్న శాలియై తపమాచరించి, ఆ చింతామణి, తన చెంతకు వచ్చి, చేతితో నందు కొనుటకు దగినట్టుగా నుండుటను గాంచినాడు.

**కిం తు సంశయ మాపన్నో, న జగ్రాహ మణిం తదా ।**
**'అహ మల్పతపాః సాధువరాకో మానుషః కిల । 41 ।**
**సిద్ధయః కథ మాయాన్తి, మా మ భాగ్యైక భాజనమ్ ।"**
**ఇతి తస్మిన్ స్థితే మూఢే, యాతో మణి రదృశ్యతామ్ । 42 ।**

**41-42.** కాని, సంశయాపన్నుడై అతడు, ఆ మణిని గ్రహింపలేదు. 'నేను స్వల్పకాలము మాత్రమే తపమాచరించితిని. కేవలము మందభాగ్యుడగు మనుష్యుడను కదా! **దురదృష్టవంతుడనగు నాకు సిద్ధులెట్లు కలుగును?'** - అని ఇట్లా **మూర్ఖుడు,** మణివిషయమున, వికల్పసంకల్పములతో నుండగా, అది, అంతర్హితమై పోయినది.

**ఏష భూయః క్రియాయత్నం కుర్వన్ రత్నేన్ద్రసాధనే ।**
**దదర్శాఽథ కచద్రూపం, కాచఖణ్డ మఖణ్డితమ్ । 43 ।**

**43.** అతడు మరల, ఆ రత్నరాజమును - చింతామణిని - సాధించుటకు క్రియాశాలియై ప్రయత్నించుచు, తరువాత, ప్రకాశించుచున్న **అఖండితమగు నొక కాచము (గాజు ముక్కను)** కాంచినాడు.

తత స్తం మణి మాదాయ, ప్రాక్తనీం స శ్రియం జహౌ ।
'సర్వం చిన్తామణే రస్మాత్ప్రాప్యతే కిం ధనై' రితి ॥ 44 ॥

44. అతడా దగ్ధమణిని (వ్యర్థమగు గాజు పూసను) దివ్యమణియని భావించి గ్రహించి 'ఈ చింతామణి వలన సర్వసమృద్ధులు ప్రాప్తించును; ఇక ధనములతో ప్రయోజనమేమి?' - అని తన పూర్వపు ధనధాన్యాది సంపదను త్యజించినాడు.
(తనకు ముందే లభించి యున్న అమూల్య వస్తువులను, మూర్ఖత్వమున ఉపేక్షించి, ఇతర వస్తువుల నన్వేషింప బోవువాడు దుఃఖమును బొందుననుటనీ కథ, వ్యాఖ్యానించును.)

ఆదాయైతం మణిం మూఢః, శూన్యకానన మాయయౌ ।
స కాచమణినా తత్ర, మహతీ మాపదం గతః ॥ 45 ॥

45. ఆ గాజు మణిని గ్రహించి, ఆ మూఢుడు, జనశూన్యమగు నరణ్యమున కేగెను. ఆ వనమున, ఆ కాచఖండము వలన (అది అభీష్టముల తీర్చు దివ్యమణి కాదు కాన), మహా విపత్తుకు లోనై, కష్టముల..పాలై నాడు.

## 4. వనగజాఽఽఖ్యానమ్ – అడవి ఏనుగు వృత్తాంతము

అస్తి ద్విన్ధ్యవనే హస్తీ, మహాయూథపయూథపః ।
స బద్ధో లోహజాలేన, హస్తిపేనైకదా కిల! ॥ 46 ॥

46. పూర్వము, వింధ్యపర్వతారణ్యమున, మహాగజయూథములకు రాజగు నొక గజేంద్రము నివసించుచుండెను. ఒకప్పుడది యొక మావటి వానిచే ఇనుపగొలుసులతో బంధింపబడినదట!

ఖేదా న్నిగడనిర్భేదం, దన్తాభ్యాం తు చకార సః ।
తద్దృష్ట్వా తం పునర్బద్ధుం, నిశ్చిత్య హస్తిప స్తదా ॥ 47 ॥
పపాతాఽథ గజేన్ద్రస్య, మూర్ధ్ని తాళతరో రధః ।
అపత ద్దుర్మతి ర్భూమావప్రాప్య కరిణః శిరః ॥ 48 ॥

47-48. ఆ గజము తన స్వేచ్ఛాభంగమునకు చింతించుచు, తుదకు, తన దంతములతో గొలుసులను త్రెంచి వైచినది. అపుడది గాంచి, మావటి వాడు, మరల దాని పట్టి బంధింపవలయునని నిశ్చయించి, తాటిచెట్టు పై నుండి క్రింద గజేంద్రుని శిరముపై దూకవలెననుకొని, గురి తప్పి,

ఆ దుర్మతి, గజ మూర్ధమున కాక, దాని యెదుట భూమిపై పడినాడు.

తం పురః పతితం దృష్ట్వా, మదేభః కరుణాం యయౌ ।
కేఽపి స్ఫారగుణాః సన్తి, తిర్యగ్జాతి గతేష్వపి* ॥ 49 ॥

49. తన యెదుట పడిన హస్తిపుని గాంచి, యా మదగజము కరుణ వహించినది. (కనికరించిది) తిర్యగ్జంతువులందు సైతము, కొన్ని విశాల గుణసంపదలు, పుణ్యావాసనలును, ఉన్నవి.

దయయా తం పరిత్యజ్య, స్వప్రదేశం యయౌ గజః ।
గతే గజే సముత్థాయ, పున స్తస్య జిఘృక్షయా ॥ 50 ॥
స ఖాతవలయం చక్రే, హస్తిపః కాననే శఠః ।

50-51. గజము దయతో వాని విడిచి, స్వస్థానమునకు పోయినది. మదగజ మట్లు వెడలిపోగా ధూర్తుడగు ఆ మావటి వాడు లేచి, మరల దానిని బంధించు కోరికతో, ఆ కాననమున వలయాకారముగ లోతైన కందకము (గొయ్యి) త్రవ్వెను.

తస్మిన్నిపతితః ఖాతే, వారణో విహరన్ వనే ॥ 51 ॥
తతో భూయో దృఢం బద్ధో, హస్తిపేన మహాగజః ।

51-52. వనమున సంచరించుచు వచ్చి మహాగజము, కందకమున (గోతిలో) పడిపోయినది; తరువాత ఆ మావటివానిచే, మునుపటి కంటె దృఢముగ బంధింపబడినది.

అహనిష్యత్పురైవాఽసౌ, యద్యగ్రే పతితం రిపుమ్ ॥ 52 ॥
తన్నాఽలప్స్యత తద్దుఃఖం, గజః ఖాతనిబన్ధనమ్ ।"

52-53. తన యెదుట పడిన శత్రువును మొదటనే ఆ ఏనుగు చంపియున్నచో, ఖాతబంధనరూపమైన ఆ దుఃఖమును అది, పొంది యుండెడిది కాదు కదా!"

---

★ పోల్చు :- "సర్వత్ర ఖలు దృశ్యన్తే, సాధవో ధర్మచారిణః ।
శూరాః శరణ్యాః సౌమిత్రే!, తిర్యగ్యోనిగతేష్వపి ।" (వా.రా. అరణ్య. 68-25).
"లక్ష్మణా! ధర్మసత్ప్రథవర్తులు, శూరులు, శరణ్యులు, సాధువులునైన వారు, లోకమున నెల్లయెడల, తిర్యగ్జంతువులందును కలరు." (శ్రీరాముడు)

రాజోవాచ :–

"మణిసాధక విన్ధ్యేభబన్ధనాత్ సూచితం వద " । 53 ।

53. రాజు :– "మణిసాధకుని యొక్కయు, వింధ్యారణ్యమున బంధింపబడిన గజరాజము యొక్కయు, కథలచే సూచింపబడిన అర్థమును వివరింప వేడెదను."

కుమ్భ ఉవాచ :–

"రత్నసంసాధకః ప్రోక్తః, స త్వమేవ మహీపతే ! ।
విద్ధి చిన్తామణిం సాధో!, సర్వత్యాగ మకృత్రిమమ్ । 54 ।

54. కుంభుడు:– "రాజా! రత్నసంసాధకుడుగా చెప్పబడిన వాడవు నీవే. సౌమ్యుడా! చింతామణియే, అకృత్రిమ (స్వేచ్ఛానురూప)మైన సర్వ పరిత్యాగము.

సన్త్యక్తం భవతా సర్వం, శేషితా కిం త్వహమ్మతిః ।
అసంపూర్ణే పరిత్యాగే, దృష్టః కాచః త్వయా తపః । 55 ।

55. నీచే సర్వము పరిత్యక్తము. కాని, 'అహ'మ్మను బుద్ధి మాత్రము మిగిలి యున్నది. సర్వపరిత్యాగము, ఇట్లు అసంపూర్ణము కాగా, తపస్సనెడి కాచమణి (గాజుపూస) నీచే కాంచబడి, గ్రహింపబడినది.

చిన్తామణి ర్మయా ప్రాప్త, ఇత్యలం బుద్ధవానపి ।
న లబ్ధవాన్ భవాన్ సాధో!, స్ఫటికస్యాఽపి ఖణ్డికామ్ । 56 ।

56. చింతామణి నాకు లభించినదని భావించితివి. కాని, సౌమ్యుడా! నీవు ఒక్క స్ఫటికోపలఖండమును సైతము పొందజాలవైతివి. (నీకు దొరికినది కేవలము గాజుపూసయే).

యోఽసావిన్ధ్యవనే హస్తీ, సోఽస్మిన్ భూమితలే భవాన్ !
యౌ వైరాగ్యవివేకాఽఽఖ్యౌ, తౌ తస్య దశనౌ సితౌ । 57 ।

57. వింధ్యారణ్యమందలి ఆ గజేంద్రము ఈ భూతలమున నీవే. వైరాగ్య వివేకము లనునవియే దాని తెల్లని దంతములు.

హస్తిప స్త్వదజ్ఞాన మాశాపాశాశ్చ శృఙ్ఖలా ।
భోగాన్ సన్త్యజతా భగ్నా, సా త్వయా భవతి ధ్రువమ్ ॥ 58 ॥

58. నీ అజ్ఞానమే మావటివాడు. ఆశా (రాగ) పాశములే, శృంఖల (ఇనుప గొలుసు), రాజ్యాదిసర్వభోగములను త్యజించిన నీచే, ఆ శృంఖల నిజముగా భగ్నమైనది (త్రెంపబడినది).

త్వయి త్యజతి తద్రాజ్య మజ్ఞానం పతితం కృతమ్ ।
హతం యది తదాఽజ్ఞానం, తత్ త్వాం నాఽహనిష్యత్ పునః ॥ 59 ॥

59. నీవు నీ రాజ్యమును విడువగానే నీ అజ్ఞానము పతిత మొనర్పబడినది. (క్రిందపడిపోయినది). నీ వపుడా అజ్ఞానమును తుదముట్టించి (చంపి) యున్నచో, అది మరల నిన్ను బాధించి యుండెడిది కాదు. (లోబడినపుడే, శత్రువుల నిర్మూలింపనిచో, మీదట, దుఃఖము సంభవించును.)

తపః ప్రపఞ్చఖాతే త్వం, పాతితోఽ జ్ఞాన వైరిణా ।
రాజన్! సర్వ పరిత్యాగః కస్మాన్నాఽనుష్ఠిత స్త్వయా" ॥ 60 ॥

60. నీవు ఉపేక్షించిన అజ్ఞానవైరిచే, మరల నీవు తపస్సనెడి విస్తారమైన దుఃఖ ఖాతము (కందకము)న పడద్రోయబడి బంధింపబడితివి. రాజా! సర్వ పరిత్యాగ మెందుకు నీవనుష్ఠింపజాలవైతివి?"

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'శిఖిధ్వజతపోనామ' షడ్వింశః సర్గః ।
ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'శిఖిధ్వజ తపస్సను'-
షడ్వింశతితమ (ఇరువది యాఱవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## సప్తవింశసర్గము

## చూడాలోపదేశః – చూడాల, భర్తకు జ్ఞానోపదేశమొనర్చుట

### 1. సర్వత్యాగః – సర్వత్యాగ స్వరూప నిరూపణము

**రాజోవాచ :–**

**"రాజ్యం త్యక్తం గృహం దేశో, దారాస్త్యక్తాశ్చ బాన్ధవాః ।**
**ఏతాన్, సన్త్యజతా సర్వత్యాగః కిం న మయా కృతః? ॥ 1 ॥**

1. రాజు :– "సర్వసమృద్ధయైన రాజ్యమును, మహాభోగసంపన్నమైన రాజమందిరమును, సౌఖ్యదాయకమగు స్వదేశమును, సర్వాంగసుందరి యగు భార్యను, బాంధవులను, సైతము త్యజించితిని. ఇట్లన్నిటిని త్యజించిన నేను సర్వత్యాగ మొనరింపలేదా?

ఏతే చేన్మమ నో సర్వం, తత్సర్వం వన మేవ హి ।
తచ్చ త్యజామ్యహం నూన" మిత్యుక్త్వా దృఢనిశ్చయః ॥ 2 ॥
వనే సక్తిం మమార్జాఽసౌ, వశీ ధీరః శిఖిధ్వజః ।

2-3. ఇవి యన్నియు నా 'సర్వము' కానిచో, ఆ 'సర్వమును నిశ్చయముగ ఈ వనమే.' దీని సైతము తప్పక నేను త్యజించుచున్నాను." – అని పలికి దృఢనిశ్చయముతో జితేంద్రియుడు (వశి), ధీరుడునైన శిఖిధ్వజుడు, వనమునం దాసక్తిని తుడిచివైచెను.

కుమ్భ ఉవాచ :–

ఏతచ్చాఽపి న తే సర్వం, సర్వత్యాగః కథం తవ? ॥ 3 ॥

3. కుంభుడు:– ఇదియును నీ సర్వము కాదు. కాన, నీకు సర్వత్యాగ మెట్లు సిద్ధించినదగును?

ఏతచ్చేన్మమ నో సర్వం, సర్వం మే భాజనాఽఽదికమ్ ।
సన్త్యజామీతి నిశ్చిత్య, దగ్ధ్వా పాత్రాఽఽదికం తతః ॥ 4 ॥
రాజా ప్రోవాచ సన్తుష్టః, "సర్వత్యాగీ స్థితోఽస్మ్యహమ్ ।

4-5. ఇవి అన్నియు నా "సర్వము" కానిచో, నా యజ్ఞపాత్రాదుల నన్నిటిని త్యజింతునని నిశ్చయించి, పాత్రాదికమును దగ్ధము చేసి, సంతుష్టుడై రాజు, "నేనిపుడు సర్వత్యాగినై యున్నాను" – అని వచించినాడు.

"యావద్యావత్ప్రహీయన్తే, వివిధా బన్ధహేతవః ॥ 5 ॥
తావత్తావత్సమాయాతి, పరమాం నిర్వృతిం మనః ।
దిగమ్బరో భవామ్యేవ, కిమన్య దవశిష్యతే " ॥ 6 ॥

5-6. "ఎంతెంత వఱకు వివిధబంధహేతువులు నశించిపోవునో, అంతంత వఱకు మనస్సు, పరమనిర్వృతిని (సుఖమును) పొందుచుండును. నేను కేవలము దిగంబరుడ నగుదును. ఇక అన్యమేది సర్వత్యాగమున మిగిలి యున్నది?"

కుమ్భ ఉవాచ :–

"సర్వం తు న పరిత్యక్తం మా ముధాఽభినయం కురు"! ।
ఏవముక్తం వచః శ్రుత్వా, కిఞ్చిత్సఞ్చిన్త్య భూపతిః ॥ 7 ॥

"శిష్యతే సర్వసన్న్యాగే, దేహో మాంసమయాఽఽకృతిః ।
వినాశ్య చ తమప్యద్య, సర్వత్యాగీ భవామ్యహమ్ " ॥ 8 ॥

7-8. కుంభుడుః- "కాని, సర్వమును పరిత్యక్తము కానే లేదు. వ్యర్థముగా (నాటకమునందు వలె) అభినయింపకుము." - అన్న పలుకులు విని రాజు, కొంత విచారించి "సర్వ త్యాగమున, రక్తమాంస మయాకృతియగు దేహ మొక్కటియే ఇంకను మిగిలి యున్నది. దీని సైతమిపుడ నాశమునర్చి సర్వత్యాగి నగుదును"

ఇత్యుక్త్వోత్థిత మేనం తు, కుమ్భరూపాఽభ్యువాచ సా ।
"త్యక్తేనాఽపి శరీరేణ, సర్వత్యాగో న సిధ్యతి ॥ 9 ॥

9. అని ఇట్లు పలికి, లేచిన రాజును, నిలువుమని నివారించి, కుంభరూపిణి యగు చూడాల యిట్లన్నది. "శరీరత్యాగముచేతను సర్వత్యాగము సిద్ధింపదు.

ఏనాఽయం క్షోభ్యతే దేహో, యద్బీజం జన్మకర్మణామ్ ।
తత్సర్వ్యజపి చేత్ త్యాజ్యం, తన్మహాత్యాగవాన్ భవేః " ॥ 10 ॥

10. ఏది జన్మకర్మములకు బీజమో, దేనిచే దేహము (మదగజముచే వృక్షము వలె) సంక్షోభమును పొందుచున్నదో, అట్టి త్యాజ్యము నెఱిగి, దానిని పూర్తిగ త్యజించినచో, నీవు మహాత్యాగవంతుడవు కాగలవు."

రాజోవాచ :-

"కేనాఽయం చాల్యతే దేహః? కిం బీజం జన్మకర్మణామ్ ? ।
కస్మిన్ త్యక్తే పరిత్యక్తం, సర్వం భవతి? మే వద" ॥ 11 ॥

11. రాజు :- "స్వామీ! ఈ దేహము దేని చేత చలితమగుచున్నది? నీవన్న జన్మకర్మములకు బీజ (కారణ)మేది? దేనిని త్యజించిన సర్వమును పరిత్యక్తమగునో దానిని నాకు తెలుపుము."

కుమ్భ ఉవాచ :-

"చిత్తం విద్ధి జగజ్జాలం, చిత్తం సర్వమితి స్మృతమ్ ।
[illegible] ॥ 12 ॥

12. కుంభుడు :- "రాజా! చిత్తమే ప్రపంచసముదాయమని తెలియుము. సర్వ వాసనాస్పదము, సంకల్పముచే సర్వజనకము నగుటచే, చిత్తమే సర్వమని చెప్పబడినది. సౌమ్యుడా! అట్టి చిత్తమును పరిత్యజించుట యందే, సర్వత్యాగము నిశ్చయముగా సిద్ధించుచున్నది.

**జన్మనాం కర్మణాం చాఽపి, చిత్తం బీజ ముదాహృతమ్ ।**
**పాదపః పవనేనేవ, దేహ శ్చిత్తేన చాల్యతే ॥ 13 ॥**

13. జన్మములకు, కర్మములకును, చిత్తమే, బీజ (కారణ)మని పేర్కొనబడినది. గాలి వృక్షమునువలె, చిత్తమే ఈ దేహమును చలింపజేయుచున్నది. (చిత్తమే, దేహమును పలువిధములైన వ్యాపారములందు ప్రవర్తింప జేయుచున్నది).

**చిత్తత్యాగం విదుః సర్వత్యాగం త్యాగవిదో జనాః★ ॥"**

14. త్యాగస్వరూపము నెఱిగిన మహాత్ములు, చిత్తత్యాగమునే సర్వ త్యాగమని యందురు."

## 2. చిత్తత్యాగక్రమః – చిత్తము (వాసనల) యొక్క స్వరూపము, తన్నాశోపాయ కథనము

**రాజోవాచ :-**

**"చిత్తస్యాఽదౌ స్వరూపం త్వం, తత్త్యాగ మపి మే వద" ! ॥ 14 ॥**

14. రాజు :- "స్వామీ! మొదట చిత్తము యొక్క స్వరూపమును, దానిని పరిత్యజించు నుపాయమును సైతము నాకు వివరింపుము."

**కుమ్భ ఉవాచ :-**

**"వాసనైవ మహారాజ! స్వరూపం విద్ధి చేతసః ।**

★ పోల్చు :- "న కర్మణా న ప్రజయా ధనేన, త్యాగేనైకే అమృతత్వ మానశుః ।
పరేణ నాకం నిహితం గుహాయాం, విభ్రాజతే యద్యతయో విశన్తి ॥"
(తైత్తిరీయారణ్యకము, నారాయణీయము – చతుర్థ ప్రశ్నము, దశమానువాకము 24)
అగ్నిహోత్రాది కర్మానుష్ఠానము చేతను, పితృ ఋణవిమోచక హేతువగు సంతానము చేతను, బహువిధ ఫలసాధన హేతువగు దానమును నిష్పాదింపజేయు సిరిసంపదల చేతను, అమృతత్వము సిద్ధింపదు. సర్వత్యాగము చేతనే అమృతత్వ ప్రాప్తియని శ్రుతి ఘోషించును. ఇంద్రియ సంయమశీలురగు యతీంద్రులు – అంతర్ముఖులు – మాత్రమే, హృదయ గుహయందు, పరమవ్యోమమున, నిహితమై వెలుగుచున్న ఈ అమృతత్వమును ప్రాపింతురు.

కుంభుడు:-"మహారాజా! వాసనయే చిత్తము యొక్క స్వరూపమని తెలియుము.

అహ మర్థోదయో యోఽయం, సర్వాఽనర్థైక భాజనమ్ । 15 ।
ఏతచ్చిత్తద్రుమస్యాఽస్య, విద్ధి బీజం మహామతే ! ।

**15-16.** మహామతీ! వేదనాత్మకమగు అహంకృతియే ('నేను' అను అహంకారోదయమే) సర్వోపద్రవములకును ఆశ్రయము. ఇదియే, చిత్తమనెడు వృక్షమునకు బీజ(మూల)మని తెలియుము.

ఏ తస్మాత్ప్రథమోద్భిన్నా దఙ్కురోఽనుభవాఽఽకృతిః । 16 ।
నిశ్చయాత్మా నిరాకారో, బుద్ధి రిత్యేవ సోచ్యతే ।

**16-17.** మొట్ట మొదట ఉద్భవించిన అహంకారబీజము నుండి, చిగిరించిన అనుభూతి రూపమగు అంకురము, నిరాకారమును నిశ్చయాత్మకమునైన బుద్ధియని పేర్కొనబడినది.

అస్య బుద్ధ్యభిధానస్య, యాఽఙ్కురస్య ప్రపీనతా । 17 ।
సఙ్కల్పరూపిణీ తస్యా శ్చిత్తనామ మనోఽభిధా ।

**17-18.** బుద్ధి యనబడు ఈ అంకురము (మొలక) పెరిగి వృద్ధి పొంది (పెద్ద వృక్షమై )సంకల్పరూపము నొందుచున్నది. ఇదియే, చిత్తము, మనస్సు అను నామములచే వ్యవహరింపబడుచున్నది. [చిత్తమన్నను, మనస్సన్నను, చేతస్సన్నను, మానసమన్నను, ఇవియన్నియును సంకల్పము యొక్క పర్యాయభేదములే]

వాసనా వివిధాః శాఖాః, ఫలన్త్యో వివిధం ఫలమ్ । 18 ।
శాఖావిలవనం గౌణం ముఖ్యం మూలవికర్తనమ్ ।*
స్వాత్మతత్త్వవిచారో హి, చిత్తబీజస్యనాశకః " । 19 ।

**18-19.** బహువివిధములైన అర్థములను ఫలించుచున్న శాఖలే (కొమ్మలే)

★ పోల్చు :- "అశ్వత్థ మేనం సువిరూఢమూలమ్, అసఙ్గశస్త్రేణ దృఢేన ఛిత్వా" ।
(భ.గీ.XV.)

"But let us lay the axe to the root, that being purged of passions, we may possess our minds in peace." (The Imitation of Christ Book first, Chap. XI-4).

వాసనలు(సూక్ష్మములగు చిత్తసంస్కారములు). శాఖలను(కొమ్మలను) నఱికి వేయుట యనునది గౌణము – అప్రధానము. చిత్తవృక్షముయొక్క మూలచ్ఛేదమే ముఖ్యావశ్యకము. స్వాత్మతత్త్వవిచారము మాత్రమే, చిత్తద్రుమ బీజమును నశింపజేయుచున్నది."

రాజోవాచ :-

"అహం దేహాఽఽదికం నేతి, బహుశః ప్రవిచారితమ్ ।
చిత్తద్రుమస్య యద్బీజ మహంభావాత్మకం హృది । 20 ।
తత్తు త్యక్తుం న శక్నోమి, త్యక్తం త్యక్త ముపైతి మామ్ ।
మునే! యస్మాన్న శక్నోమి,తేన తప్యే సుదారుణమ్ । 21 ।

20-21. రాజు :- "నేను, దేహేంద్రియాదికమును కానని పలుమాఱు ఆత్మ స్వరూపమును విచారించితిని. కాని, నా హృదయమున, చిత్తవృక్షమునకు బీజమగు అహంకారమును త్యజించుటకు నే నశక్తుడనైతిని. ఎన్ని మాఱులు త్యజించినను, -(మూలచ్ఛేదాఽభావము వలన)-అది మరల, మరల, నన్నాక్రమించుచున్నది. మునీంద్రా! అహంకారత్యాగము నాకు అశక్యమై నందున; సుదారుణముగ తపించుచున్నాను; తీవ్ర దుఃఖము ననుభవించుచున్నాను.

అహ మిత్యస్య దోషస్య, వేదనం వేద్మి కారణమ్ ।
తద్యథోపశమం యాతి, తన్మే వద మునీశ్వర ! । 22 ।

22. అహంకారమను ఈ దోషమునకు వేదనమే(శుద్ధ చైతన్యము నిర్వికారమై యుండక, దేహాదిదృశ్యాభిముఖమై యుండుటయే) కారణమని నే నెఱుగుదును. మునీంద్రా! ఈ దేహాది దృశ్యము(వేదనము) ఉపశమించు విధమును నా కెఱిగింపుము.

చిత శ్చేత్యోన్ముఖత్వేన, దుఃఖాయాఽయ మహం స్థితః ।
చేత్యోపశమనం బ్రూహి, మునే! దుఃఖోపశాన్తయే" । 23 ।

23. శుద్ధ చైతన్యము యొక్క వేదనోన్ముఖత్వముచేత, లేక, శుద్ధ చైతన్యము దృశ్యత్వము నొందుట వలన, ఈ అహంకృతి, దుఃఖ ప్రదమగుచున్నది. మునీంద్రా! దుఃఖోపశాంతికై, ఈ దృశ్య ముపశమించు విధమును నాకెఱిగింపుము."

కుమ్భ ఉవాచ :-

"కారణఞ్జోఽసి మే బ్రూహి, వేదనస్యాఽపి కారణమ్ ।"

24. కుంభుడు :- "రాజా! కారణముల నెఱిగిన నీవు, వేదనమునకు (శుద్ధ చైతన్యము దేహాది దృశ్యాభిముఖమగుటకు) కారణ మేదో చెప్పుము."

రాజోవాచ :-

"శరీరాదితయోదేతి, వేదనం వస్తుసత్తయా" । 24 ।

24. రాజు :- స్వామీ! దేహాదిరూపములైన దృశ్యపదార్థముల ఉనికియే, శుద్ధచైతన్యము దృశ్యాభిముఖమగుటకు (వేదనమునకు) కారణము."

కుమ్భ ఉవాచ :-

"విద్యతే యది దేహాది, వస్తుసత్తా తదా భవేత్ ।"

25. కుంభుడు :- "రాజా! దేహాదిక మున్నట్లయినచో, వస్తువుల ఉనికియు అప్పు డుండును."

రాజోవాచ :-

"సదాఽనుభూయమానోఽయం, దేహో న విద్యతే కథమ్?" । 25 ।

25. రాజు :- "నిరంతర మనుభూతమగుచున్న ఈ దేహము, లేదనుట ఎట్లు సాధ్యము"?

కుమ్భ ఉవాచ :-

"అకారణం హి యద్వస్తు, తన్మిథ్యా రజ్జు సర్పవత్ ।"

26. కుంభుడు :- "కారణరహితమై, ఉన్నట్లు తోచు వస్తువు, రజ్జు సర్పము వలె (త్రాడు, పామువలె తోచినట్లు), మిథ్యాదృశ్యము.

రాజోవాచ :-

"ఆద్యః పితామహో బ్రహ్మ, జగతః కారణం న కిమ్"? । 26 ।

26. రాజు :- "మహాత్మా! ఆద్యుడగు పితామహుడు , బ్రహ్మదేవుడు, జగమునకు కారణము కాడా?"

కుమ్భ ఉవాచ :-

"సర్గాదౌ కేవలం శాన్తం, బ్రహ్మైవ విద్యతే పరమ్ ।
ద్వితీయకలనాఽభావాద్వేధసోఽస్తి న కారణమ్" ॥ 27 ॥

27. కుంభుడు :- "సృష్టి ప్రారంభమున, (సృష్టికి పూర్వము) ఏకరూపము, శాంతమునైన పరబ్రహ్మ మొక్కటియే యున్నది. అందు ద్వితీయ కల్పన లేనందున, బ్రహ్మదేవునకును కారణము లేదు."

రాజోవాచ :-

"యద్యేవం పరమం బ్రహ్మ, కారణం వేధసోఽస్తి హి ।
కారణం తస్యనాఽస్తీతి కథం ప్రత్యేమి? తద్వద" ! ॥ 28 ॥

28. రాజు :- అట్లైనచో, పరబ్రహ్మమే ఆ బ్రహ్మదేవునకు నిశ్చయముగా కారణమగును. బ్రహ్మదేవునకు కారణము లేదనుటను నేనెట్లు విశ్వసింతును?"

కుమ్భ ఉవాచ :-

"అద్వితీయ మనాద్యన్తం, శివం సంశాన్త మవ్యయమ్ ।
తత్కథం కస్య? కే నైవ?, కర్తృ భోక్తృ కదా భవేత్ ? ॥ 29 ॥

29. కుంభుడు :-"అద్వితీయము, ఆద్యంతరహితము, శివము, (మంగళ స్వరూపము) పరమశాంతము, అవ్యయము (నాశరహితము)నైన పరబ్రహ్మము, దేనికి, దేనిచేత, ఎపుడు, ఎట్లు కర్తయు, భోక్తయు కాగలదు? (పరబ్రహ్మమున కంటెను వేఱయిన పదార్థమేదియు లేనందున, కార్యకారణములు, కర్తృత్వభోక్తృత్వము లుండుట అసంభవము)

చిన్మాత్ర కల్పితో వేధాః, చిదేవేతి వినిశ్చితః ।
తన్మాత్ర జనితః సర్గ స్తదాత్మక ఇతి స్థితిః ॥ 30 ॥
అతో నేదం కృతం కిఞ్చిత్, తస్మా న్నవిద్యతే జగత్ ।"

30-31, కేవలము శుద్ధచైతన్యము నుండియే కల్పితుడైన బ్రహ్మదేవుడు, చైతన్యస్వరూపమనియే, నిశ్చయింపబడినది. కేవలము తన్మాత్ర

జనితమగు సృష్టియు తత్స్వరూపమే. సర్వమును బ్రహ్మమే. ఇట్టిదే యథార్థ స్థితి. కావున, ఈ విషయ ప్రపంచము ఈషన్మాత్రమును సృజింపబడలేదు. కావున జగత్తు లేదు. (అసత్తే). ఉన్నది బ్రహ్మమే."

### 3. శిఖిధ్వజనిష్ఠా – శిఖిధ్వజుడు సమాధినిష్ఠుడగుట

**ఇత్యేవం బోధితో రాజా, భావయన్ తన్నిరన్తరమ్ । 31 ।**
**స్వయ మాత్మపదే తస్మిన్, క్షణం పరిణతోఽభవత్**
**తతో ముహూర్తమాత్రేణ,★ ప్రబుద్ధః పునరబ్రవీత్ । 32 ।**

31-32. ఈ విధమున కుంభరూపిణియైన చూడాలచే బోధింపబడి రాజు, దానిని నిరంతరము, భావించుచు, ఆత్మపదమున (చిదాత్మసౌఖ్య పదమున) స్వయముగ క్షణమాత్రము పరిణతుడైనాడు. తరువాత, అందుండి కొంతసేపునకు (రెండు గడియలకు) మేల్కొని మరల నిట్లు వచించినాడు.

**"భగవన్! త్వత్ప్రసాదేన, ప్రాప్త మాత్మపదం మయా ।**
**సతాం విదితవేద్యానాం, సఙ్గః సారఫలప్రదః । 33 ।**
**ఇదం మహాఽమృతం పూర్వం కథం నాఽఽసాదితం మయా? ।"**

33-34. "భగవంతుడా! నీ అనుగ్రహమున నేను, సర్వోన్నతమైన ఆత్మ పదమును (చిత్పదమును) పొందితిని. ఎఱుగదగిన దానిని (పరమాత్మను) ఎఱిగిన చిదాత్మవివేకులైన సజ్జనుల సంగమము (సహవాసము) అమృతసార ఫలప్రదము కదా! నా జీవితమున పూర్వము నే నెట్లీ మహాఽమృతమును పొందజాలనైతిని?"

**కుమ్భ ఉవాచ :–**

**"మనస్యుపశమం యాతే, త్యక్తభోగైషణే స్థితే । 34 ।**
**కషాయపాకే నిర్వృత్తే, సఫలా దేశికోక్తయః ।**
**ప్రబుద్ధోఽసి విముక్తోఽసి, స్వరూపే తిష్ఠ! నిర్మలే" । 35 ।**

34-35. కుంభుడు :– "ఇంద్రియోల్లాసకరములైన భోగేచ్ఛలు త్యక్తములై, మనస్సు

★ ముహూర్తము – రెండు గడియలు (48 నిమిషముల కాలము)

విశ్రాంతి నొందగా, రాగద్వేషాది కషాయముల (మనో మాలిన్యములు) పరిణతు లంతరింపగా, అపుడే, ఆచార్యుని హితవాక్యములు సఫలములగును. నీవు ప్రబుద్ధుడవైతివి; ముక్తుడవైతివి. పరమనిర్మలమగు స్వస్వరూపమున ప్రతిష్ఠితుడవగుము."

**రాజోవాచ :–**

**"ప్రబుద్ధానాం కథం చిత్తం, విహరన్తి? కథం చ తే? ।"**

36. **రాజు :–** "ఆత్మజ్ఞానులగు జీవన్ముక్తుల చిత్తమెట్లు వ్యవహరించును? చిత్తరహితముగ వారెట్లు విహరింతురు?

**కుమ్భ ఉవాచ :–**

**"పునర్జననయోగ్యా యా, వాసనా ఘనవాసనా । 36 ।**
**సా ప్రోక్తా చిత్తశబ్దేన, న సా తద్జ్ఞస్య విద్యతే ।**

36-37. **కుంభుడు :–** "పునర్జన్మ కారిణియగు గాఢవాసన, ఘనీభూతస్థితిచే చిత్తమని చెప్పబడినది. అది మలినవాసన. ఆత్మజ్ఞానులకు లేని దిదియే. (పునర్జన్మవివర్జితమగు **శుద్ధవాసన, సత్త్వమనబడును.**)

**అథ చేతసి తత్త్వజ్ఞ! స్పన్దాఽస్పన్దౌ త్వమేకతామ్ । 37 ।**
**నీత్వా తిష్ఠ! యథా కామ, మైక్య మాగత్య శాశ్వతమ్ ।"**

37-38. తత్త్వజ్ఞుడా! నీ చిత్తమున సాక్షిమాత్రతాదర్శనమున, దాని చలాఽచలత్వములను ఐక్యపఱచి, సాక్షిని సైతము, శాశ్వతమగు బ్రహ్మాత్మైక్యమును పొందించి, భూమానంద భావమున పూర్ణకాముడవై యుండుము."

**రాజోవాచ :–**

**"స్పన్దాఽస్పన్దా వుభౌ చిత్తే, ఐక్యం తు గచ్ఛతః కథమ్?" । 38 ।**

38. **రాజు :–** "చిత్తమున చలాఽచలత్వములు రెండును ఎట్లు ఐక్యమును పొందును?

**కుమ్భ ఉవాచ :–**

**"సర్గ శ్చిత్స్పన్దమాత్రాఽఽత్మా, సమ్యగ్దృష్టై విలీయతే ।**

39. కుంభుడు:- "సృష్టి కేవలము సద్రూపమగు చైతన్యము (బ్రహ్మము) యొక్క స్పందనమే (చలనరూపమే). సమ్యగ్దృష్టి యందిది, విలీనమగుచున్నది. (జలము, సముద్రమైనట్లు, సద్రూపమగు బ్రహ్మమే, జగత్తగుచున్నది. సాగరజలము, తరంగములతో చలించుచున్నట్లు, బ్రహ్మమును, బుద్ధివృత్తులతో కదలుచున్నట్లు తోచుచున్నది. రజ్జువునందు భ్రాంతిచే కల్గిన సర్పభయము, సమ్యగవలోకము చేత, ఆ రజ్జువు నందే విలీనమగుచున్నది – అణగిపోవుచున్నది.)

శాస్త్ర సజ్జనసంపర్క-సక్తతాఽభ్యాసయోగతః ॥ 39 ॥
చేత స్యమలతాం యాతే, జాయతే స్వయమేవ సా।
త్వయా సదైవ సంరక్ష్యా, దృష్టిరేషా హి పావనీ" ॥ 40 ॥

39-40. కావున, శాస్త్ర చింతనము, సజ్జనసాంగత్యము, నిరంతర అభ్యాసము, అను వీని చేత, కాలక్రమమున, చిత్తము నిర్మలము కాగా, ప్రపంచము బ్రహ్మమే యను సమ్యగ్దృష్టి స్వయముగ ఉదయించుచున్నది. పావనమగు ఈ దృష్టి నీచే సర్వదా రక్షణీయము."

ఏవ ముక్త్వా గతే కుమ్భే, పరం విస్మయమాగతః ।
"అహో! సు శీతలా శుద్ధా, శాన్తేయం పదవీ నిజా" ॥ 41 ॥
ఏవం సంచిన్త్య రాజాఽసౌ, నిర్వికల్పే నిరాశ్రయే ।
ప్రతిష్ఠాం నిశ్చలాం ప్రాప్య, సంతస్థౌ గిరిశృఙ్గవత్ ॥ 42 ॥

41-42. ఇట్లు ఉపదేశించి, కుంభరూపిణియగు చూడాల, అదృశ్య కాగా, రాజు పరమాశ్చర్య మొందెను. "ఆహా! ఈ స్వాత్మ (స్వస్వరూప) పదవి, శీతలము (చల్లనది), శుద్ధము (పావనము), శాంతమునై యున్నది." అని చక్కగ చింతన మొనర్చి, ఆ రాజు, నిరాశ్రయమగు పరమనిర్వికల్ప సమాధి యందు నిశ్చలస్థితిని పొంది, పర్వతశిఖరము వలె (అప్రకంపనుడై) చిరకాలము నిలిచి యుండెను.

### 4. శిఖిధ్వజ ప్రబోధనమ్ – శిఖిధ్వజుని జ్ఞానప్రాప్తి

చూడాలా తు పురం గత్వా, వ్యోమ్నా తత్ర దినత్రయమ్ ।
నిర్వర్త్య రాజ్యకార్యాణి, చాఽఽగత్య కుమ్భరూపిణీ ॥ 43 ॥

నిర్వికల్పసమాధిస్థం, భూపం స్పృష్ట్వా వ్యచిన్తయత్ ।
"అస్త్యేవ సత్త్వశేషోఽస్య, హృది సంబోధ కారణమ్" ॥ 44 ॥

43-44. యోగ బలమున చూడాల, ఆకాశమార్గమున తనరాజధానికేగి, అచ్చట మూడుదినములు రాజ్యకార్యములను నిర్వర్తించి, మరల కుంభరూపిణియై, శిఖిధ్వజుని చెంతకు వచ్చినది. నిర్వికల్పసమాధినిష్ఠుడై యున్న రాజును వీక్షించి, స్పృశించి, ఇట్లు చింతించినది. "నిర్వికల్పసమాధి నుండి తిరిగి మేల్కొనుటకు హేతువై, తగిన సత్త్వము (సత్త్వగుణాత్మక బుద్ధి), అతని హృదయమున ఇంకను మిగిలియున్నది."

శ్రీరామ ఉవాచ :-

భృశం ప్రశాన్తచిత్తస్య, కాష్ఠలోష్టసమస్థితేః ।
సత్త్వశేషః కథం బ్రహ్మన్!, జ్ఞాయతే ధ్యానశాలినః ? ॥ 45 ॥

45. శ్రీరాముడు :- బ్రహ్మజ్ఞుడవగు ఓ మహాత్మా! పరమప్రశాంతచిత్తుడై, కాష్ఠ లోష్ట(కొయ్య, మంటిగడ్డ) సమాన స్థితిని పొందిన ధ్యానశాలియగు యోగికి, సత్త్వశేషము కలదా? లేదా? - అను విషయ మెట్లు తెలియగలదో వివరింపవలయును.

వసిష్ఠ ఉవాచ :-

ప్రబోధ కారణం జ్ఞస్య దుర్లక్ష్యోఽణువపు ర్హృది ।
విద్యతే సత్త్వశేషోఽన్త ర్బీజే పుష్పఫలం యథా ॥ 46 ॥

46. వసిష్ఠుడు :- సమాధి నుండి మేల్కొనుటకు కారణమగు సత్త్వ గుణాత్మక(బుద్ధి)శేషము, జ్ఞానిహృదయమున అత్యంతసూక్ష్మరూపమై అగపడకున్నను, బీజ మందలి పుష్పము వలెను, ఫలము వలెను సత్తామాత్రమై యుండును.
[నేను (అహమ్) అను వృత్తికి ఆధారమై యున్న వ్యష్టి చైతన్యమును, సత్త్వశబ్దము ఇచ్చట నిర్దేశించుచున్నది - సత్త్వము, జీవన్ముక్తుల మనఃశేషమనియు చెప్పబడినది.]★

★ చూడు :- XVIII సర్గము 55 శ్లోక వివరణము; XX సర్గము - 13 శ్లోక వివరణము, మఱియు ఈ సర్గమున 36 శ్లోక వివరణము. దేహము నందు, బుద్ధి విపరిణామ, అపక్షయాది వికారము ఉదయింపకుండుటకు ఈ సత్త్వశేష స్థితియే, లింగము (గుర్తు).

**చిత్తస్పన్దవియుక్తస్య, తస్యాఽచలసమస్థితేః ।**
**కాయః సమసమా★ఽఽభోగో, న గ్లాయతి న హృష్యతి ॥ 47 ॥**

**47.** చిత్తచాంచల్యరహితుడై, పర్వతసన్నిభమైన (అచంచల) మనఃస్థితి కల యోగి యొక్క దేహము, గ్లానిని గాని, హర్షమును గాని, పొందదు, అనగా, క్షీణింపదు, అభివృద్ధి నొందదు. సదా, విక్రియాశూన్యత్వము వలన, **ఆకాశాదులతో** సమమైన ముఖాది అవయవస్థితి గల్గి, అసమాన పరిపూర్ణతను బొందియుండును. (సమ+సమ+ఆభోగః)

**యది దేహే న సత్త్వం స్యాత్, తదా పఞ్చత్వమాప్నుయాత్ ।**

**48.** దేహమున సత్త్వము (సత్త్వగుణాత్మక మగు బుద్ధిశేషము) లేకున్నచో, అప్పు డది శోషించి, నశించును.

**స్వదేహం సా పరిత్యజ్య, చిత్తత్త్వే సంస్థితా సతీ ॥ 48 ॥**
**తచ్చిత్త స్పన్దనం కృత్వా, స్వదేహం పునరాయయౌ ।**
**కుమ్భాకృతి రథ స్థిత్వా, సామగానం చకార సా ॥ 49 ॥**

**48-49.** చూడాల స్వదేహమును వీడి, చిత్తత్త్వమున **(చిత్+తత్త్వమున)** అనగా, ఆద్యంతరహితమగు **పరమాత్మతత్త్వమున** సంస్థితయై, శిఖిధ్వజుని చిత్తమును స్పందింప జేసినది (కదలించినది). అతని యెదుట నిలిచి, **సామవేదమును** గానమొనర్చినది.

**సామగానస్వనం శ్రుత్వా, ప్రబుధ్య భూపతి స్తదా ।**
**దదర్శాఽగ్రే స్థితం కుమ్భం సామవేద మివాఽపరమ్ ॥ 50 ॥**

**50.** సామగాననాదమును విని, రాజు మేల్కొని, అప్పుడు తన యెదుట, మూర్తీభవించిన **అపరసామవేదము** వలె నిలిచియున్న కుంభుని దర్శించెను.

---

★ "సదా విక్రియా శూన్యత్వాత్ సమేన ఆకాశాదినా సమ ఆభోగో ముఖాద్యవయవస్థితి ర్యస్య" - (యో.వా. తాత్పర్య ప్రకాశికా - శ్రీమదానంద బోధేంద్ర సరస్వతి.)
చిత్తమున హర్షాది వికారములు ఉపశమింపగా, శరీరమునందును వికారములు నివర్తించును. శరీరమును, చిత్తము, అహంతారూపమున పరిగ్రహించుటే, శరీరము యొక్క వృద్ధ్యాది వికారములకు హేతువగుచున్నది.

"అహో బత! వయం ధన్యాః, పునః ప్రాప్తో మునిః స్వతః !"
ఇత్యేవోదాహరన్తం తం, కుమ్భో రాజాన మబ్రవీత్ । 51 ।

51. "ఆహా! మేము ధన్యులము; మరల, ముని, స్వయముగా ప్రాప్తించినాడు." అని ఇట్లు పలుకుచున్న రాజునకు కుంభుడిట్లు వచించెను.

"యతః ప్రభృతి యాతోఽస్మి, త్వత్సకాశా దహం తదా ।
తతః ప్రభృతి మే చేత, స్త్వయైవేహ సమం స్థితమ్" । 52 ।

52. "రాజా! నిన్ను విడిచి వెళ్లినది మొదలుకొని, నా మనస్సు నీతో సమముగా ఇందే నిలిచి యున్నది."

రాజోవాచ :-

"అహోఽహం సుకృతీ యస్మా దిచ్ఛా తే మమ సఙ్గమే ।

53. రాజు :- అహో! నా సాంగత్యమునందు నీకు కోరిక కల్గినందు వలన, నేను సుకృతి నైతిని" - ( నా పుణ్యములన్నియు ఫలించినవి).

కుమ్భ ఉవాచ :-

"పరే పదే మహానన్దే, కచ్చిద్విశ్రాన్త వానసి । 53 ।
ఇదం భేదమయం దుఃఖం, కచ్చి త్త్వంత్యక్త వానసి?" ।

53-54. కుంభుడు:- "రాజా! నీవిప్పుడు, పరమానంద రూపమయిన పరమపదమున సంపూర్ణముగ విశ్రాంతి పొందితివి కదా? దుఃఖరూపమైన భేదదృష్టి సంపూర్ణముగ త్యజించితివి కదా!"

రాజోవాచ :-

భగవన్! త్వత్ప్రసాదేన, లబ్ధో లబ్ధవ్యనిశ్చయః । 54 ।
సర్వత్రైవాఽతితృప్తోఽస్మి, సంస్థితోఽస్మి గతజ్వరః ।

54-55. రాజు :- భగవంతుడా! నీ అనుగ్రహమువలన, పొందవలసిన

నిశ్చయార్థమును (పరమాత్మను) పొందితిని; సర్వదిగ్దేశకాలములందును, పరిపూర్ణముగ తృప్తుడనై యున్నాను. నా తాపములన్నియు చల్లారినవి.

**ఏవ మేతౌ సమోత్సాహౌ, సమసత్త్వౌ బభూవతుః । 55 ।**

55. ఇట్లు వారి రువురును సమోత్సాహులు, సమచిత్తులునై, యుండిరి.

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'చూడాలోపదేశో' నామ సప్తవింశః సర్గః ।

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'చూడాలోపదేశ'మను

సప్తవింశతితమ (ఇరువది యేడవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## అష్టావింశసర్గము

## శిఖిధ్వజపరీక్షా – చూడాల శిఖిధ్వజుని చిత్తమును పరీక్షించుట.

### 1. కుమ్భస్య రాత్రౌస్త్రీత్వమ్ – కుంభుడు ప్రతి రాత్రియు స్త్రీత్వమును పొందుట.

వసిష్ఠ ఉవాచః–

దినైః కతిపయై రేవం, సమచిత్తతయా చరన్ ।
కుమ్భతుల్యో బభౌ రాజా, దృష్ట్వా తం చ యథా స్థితిమ్ । 1 ।
చూడాలా సా తమామన్త్ర్య, త్యక్త్వా కుమ్భవపు ర్గతా ।
రాజకార్యా ణ్యశేషాణి, పురే సంపాద్య సత్వరమ్ । 2 ।
శిఖిధ్వజస్య పురతః, కుమ్భరూపధరాఽఽగతా ।

1-3. ఇట్లు కొన్ని దినములు, సమానమగు చిత్తవృత్తితో చరించుచు, ఆ

రాజు, (నిర్వాసనాత్మకమగు చిత్తము యొక్క ఉత్కృష్టతతో) కుంభునితో సమానుడై వెలసెను. అట్టి స్థితి యందున్న రాజును గాంచి చూడాల, ఆతని నుండి సెలవు గైకొని వెళ్లి, కుంభ రూపమును వీడి, పురమున రాజకార్యములు సత్వరముగ నిర్వర్తించి, మరల, కుంభ రూపధారిణియై యేతెంచి, శిఖిధ్వజుని యెదుట నిలిచినది.

**కుమ్భం ఖిన్నముఖం దృష్ట్వా, రాజోవాచేద మాదరాత్ ॥ 3 ॥**
**"దేవపుత్ర! నమస్తేఽస్తు, విమనా ఇవ లక్ష్యసే ।**
**సతాం విదితవేద్యానాం, శ్రమో నాఽస్తి విషాదజః" ॥ 4 ॥**

**3-4.** ఖిన్నమై యున్న కుంభుని ముఖమును గాంచి రాజు, ఆదరమున నిట్లు వచించెను. "దేవకుమారా! నీకు నమస్కారము. చింతాక్రాంత మనస్కుని యట్లు కాన్పించుచున్నావు. ఎఱుగదగిన పరమార్థము (పరమాత్మ) నెఱిగిన సత్పురుషులకు, విషాదజన్యమగు దుఃఖ ముండదుకదా!"

**కుమ్భ ఉవాచ :-**

**"యావద్దేహ మవస్థాసు, సమచిత్తతయైవ యే ।**
**కర్మేన్ద్రియై ర్నతిష్ఠన్తి, న తే తత్త్వవిదః శఠాః ॥ 5 ॥**

**5.** కుంభుడు:- "రాజా! దేహమున్నంత వఱకు (ప్రారబ్ధకర్మమున్నంత వఱకు) వచ్చుచుండు దేహావస్థలన్నిటి యందును సమచిత్తమున కర్మేంద్రియములతో యథాప్రాప్తములగు వాని నెవ రనుష్ఠింపరో, వారు తత్త్వవేత్తలు కారు; కేవలము లోకవంచకులు.

**పరమేష్ఠిప్రభృతయః సర్వ ఏవోదితాశయాః ।**
**దేహాఽవస్థాసు తిష్ఠన్తి, నియతేరేష నిశ్చయః ॥ 6 ॥**

**6.** బ్రహ్మాదులగు ప్రబుద్ధచిత్తులు, మహాత్ములందఱును, దేహావస్థల యందు యథాప్రాప్తములును, అనిషిద్ధములునైన, భోగములను కర్మేంద్రియములతో అనువర్తించుచున్నారు. ఇది ప్రారబ్ధ కర్మ నియతి యనుట, విధి విధానమనుట, నిశ్చయము.

**కథయామి తవాఽశేషం, స్వర్గే వృత్తం యదద్య మే ।**
**మహ్యద్యావేదితం దుఃఖం, పరమాయాతి తానవమ్ ॥ 7 ॥**

7. నేడు స్వర్గలోకమున నాకు జరిగిన వృత్తాంత మంతయు నీకు చెప్పెదను. తన దుఃఖము మిత్రున కెఱిగించి నంతనే, చాల పలుచబడి, అది ఉపశమించును కదా!

**అహం తావ దితో యాత శ్చిరం స్థిత్వా త్రివిష్టపే।**
**ఇహాఽఽగన్తుం, తదాఽఽకాశం, సముత్పతితవా నహమ్ ॥ 8 ॥**

8. ఇచటి నుండి వెళ్లి, స్వర్గమును చేరి, యచట చిరకాలముండి, అందుండి మరల నిచటి కేతెంచుటకై ఆకసమున కెగసితిని.

**అథాఽగ్రే, వారిపూర్ణానాం మేఘానాం మధ్యవర్త్మనా।**
**అపశ్యం ముని మాయాన్త మహం దుర్వాససం జవాత్ ॥ 9 ॥**

9. అంతట, జలపూర్ణములగు మేఘముల మధ్యమార్గమున, వేగముగ నేతెంచుచున్న దుర్వాసముని నెదుట గాంచితిని.

**కృత్వా తస్య నమస్కారం, లీలయోక్తం మయా నృప !।**
**"మునే! నీలాఽభ్రవస్త్ర స్త్వ మభిసారికయా * సమః" ॥ 10 ॥**

10. రాజా! అతనికి నమస్కారమొనర్చి, విలాసముగ నేనిట్లంటిని. "మహామునీ! నీలమేఘవస్త్రావరణము చేత, నీవు, తమిస్రాఽభి సారికతో సమముగ దోచుచున్నావు."

**ఇత్యాకర్ణ్య ముమోచాఽసౌ, కోపా చ్ఛాప మిమం మునిః।**
**"స్తన కేశవతీ కాన్తా, రాత్రౌ యోషా భవిష్యసి" ॥ 11 ॥**

11. ఇది విని, సులభకోపనుడగు ఆ ముని, కోపపరవశుడై, "నీవు రాత్రులందు స్తనకేశములతో కూడి, అత్యంత సుందరాంగియగు స్త్రీ వగుదువు గాక!" – అని నన్ను శపించినాడు.

---

* పోల్చు :- మదనాఽనల సన్తప్తా, యాఽభిసారయతి ప్రియమ్।
జ్యోత్స్నా తమస్వినీ యానయోగ్యాఽమ్బర విభూషణా ।
స్వయం వా ఽభి సరేద్యా తు, సా భవే దభిసారికా।

కామాగ్నిసంతప్తయయి, వెన్నెలరాత్రులందును, చీకటిరాత్రులందును, ప్రయాణమునకు యోగ్యమైన వస్త్రభూషణముల ధరించి, కాంతుని యొద్దకు పోవు నాయిక అభిసారిక యనబడును.

(రసార్ణవసుధాకరము – రంజకోల్లాసము – నాయికా ప్రకరణము – శ్లో. 134)

ఏవ ముద్విగ్నచిత్తోఽద్య ప్రాప్తోఽహం నభస స్థలాత్ ।
అతివాహ్యం దినాన్తేషు, స్త్రీత్వ మేకం మయా కథమ్" ? ॥ 12 ।

12. ఈ కారణమున నిట్లు ఖిన్న మనస్కుడనై, ఇపుడు నభ స్తలము (ఆకసము యొక్క అధోభాగము) నుండి ఇచటి కేతెంచితిని. రాత్రులందు ఇట్టి అపూర్వస్త్రీరూపత్వదశను నేనెట్లు గడపగలను?"

రాజోవాచ :-

"పరిదేవనయా కార్యం, కిఞ్చిన్నైవ హి విద్యతే ।
యదా యాతి తదాఽఽయాతు, దేహస్యాఽఽత్మా న లిప్యతే" ॥13॥

13. రాజు :- "విలాపము వలన నేకార్యము, సుంత యైనను సిద్ధింపదు. దేహమున కేది వచ్చినను రానిమ్ము. ఆత్మ నిర్లిప్తము కదా!"

సాయం సన్ధ్యా ముపాస్యాఽథ, స్థితయో రనయోః శనైః ।
కుమ్భో ధృత్వా వపుః స్త్రైణ మిదమాహ శిఖిధ్వజమ్ । 14 ।

14. అపుడా ఇరువురును, సాయం సమయమున సంధ్యావందనము ముగించి, నిలిచియుండగా, మెల్లి మెల్లగా కుంభుడు, స్త్రీరూపమును దాల్చి శిఖిధ్వజునితో నిట్లన్నాడు.

"పతామీవ స్ఫురామీవ, ద్రవామీవాఽఙ్గ యష్టిభిః ।
పశ్యేమే పరివర్ధన్తే, రాజన్! మమ శిరోరుహాః । 15 ।
పశ్యేమౌ మమ జాయేతే, ప్రోన్ముఖౌ పురసి స్తనౌ ।
ఆగుల్ఫమవలమ్బీని, సంపద్యన్తేఽ మ్బరాణి మే" । 16 ।

15-16. "రాజా! నేను నా శరీరాంగకములతో పడిపోవుచున్నట్లును, అదురుచున్నట్లును, కరగిపోవుచున్నట్లును ఉన్నది. నా శిరోజములు దీర్ఘముగ నెట్లు వృద్ధి నొందుచున్నవో చూడుము. నావక్షఃస్థలమున, స్తనద్వయమెట్లు ప్రోన్ముఖమై, వృద్ధినొందుచున్నదో చూడుము. నా వస్త్రములు జీరాడుచు, కాలిమడమల దాకుచున్నవి."

రాజోవాచ :-

"అవశ్యం భావి కార్యేఽస్మిన్, మా ఖిన్న హృదయోభవ ।"
ఏవ మాశ్వాసితా తేన, రాత్రౌ స్త్రీత్వ ముపాగతా । 17 ।

కుమ్భరూపధరా చాఽహ్ని విజహార దివే దివే ।

17-18. రాజు :- "అవశ్యము జరుగునట్టి ఈ విషయమున ఖిన్నహృదయుడవు కాకుము." - ఇట్లు రాజుచే నోదార్చబడి, కుంభరూపమున నున్న చూడాల, ప్రతిదినము రాత్రి, స్త్రీత్వమును బొందినదియై, పగలు, కుంభరూపమును ధరించి విహరించినది.

## 2. ప్రలోభనమ్ – చూడాల శిఖిధ్వజుని కాముకత్వమునకు ఆకర్షించుట

**తతః కతిపయే ష్వేవం, గతేషు దివసేషు సా ॥ 18 ॥**
**ఇదం ప్రోవాచ భర్తారం, కుమ్భరూపధరా సతీ ।**

18. అనంతరము, కొన్ని దినములు గడచిపోగా, కుంభరూపమున నున్న చూడాల, భర్తతో నిట్లన్నది.

**"నిశాయాం ప్రత్యహం తావద్భవామ్యేవాఽహ మఙ్గనా* ॥ 19 ॥**
**తదిచ్ఛామ్యఙ్గనా ధర్మం, విపుణేకర్తు మీదృశమ్ ।**
**గృహాణ మాం వివాహేన, భవానేవ పతిర్భవ"! ॥ 20 ॥**

19-20. "ప్రతిదినము రాత్రివేళల, నేను అంగన నగుచున్నాను. (సర్వాంగ సుందరియగు స్త్రీ రూపమును పొందుచున్నాను) – కాన, ఇట్టి అంగనా ధర్మమును సఫల మొనరించుకొన కోరుచున్నాను. (సంసార సౌఖ్యమును భవింప కోరిక కల్గుచున్నది) కాన, వివాహమున పూజ్యుడవగునీవు నన్ను స్వీకరించి నా భర్తవుకమ్ము".

**రాజోవాచ :-**

**"కృతేనాఽనేన కార్యేణ, న శుభం నాఽశుభం సఖే ! ।**
**పశ్యామి తన్మహాబుద్ధే ! యథేచ్ఛసి తథా కురు" ॥ 21 ॥**

21. రాజు :- "సఖుడా! ఈ కార్యమొనర్చుట వలన శుభమును గాని, అశుభమును గాని, నేను గాంచుట లేదు. మహామతీ! నీవు కోరినట్లే చేయుము.

* అఙ్గనా – ప్రశస్తాని అఙ్గాని అస్యాః । అందమైన అవయవములు కల స్త్రీ.

"ఏవం యది మహీపాల! లగ్న మద్యైవ శోభనమ్ ।"
ఇత్యుక్త్వా కుమ్భ ఉత్థాయ, సహ తేన మహీభృతా ॥ 22 ॥
శ్రీ గన్ధ పుష్పరత్నాది సఞ్చయం కృతవా నసౌ ।
సాన్ధ్యే కర్మణి నిర్వృత్తే, వధూత్వం కుమ్భ ఆయయౌ ॥ 23 ॥
"క్రమేణాఽగ్నిం చ సంజ్వాల్య, మమ పాణిం గృహాణ భోః" ।
ఏవముక్త స్తయా భూప స్తత్సర్వం సమవర్తయత్ ॥ 24 ॥

**22-24.** "రాజా! అట్లయినచో, నేడే శుభలగ్నము". - అని పలికి కుంభుడు రాజుతో గూడ లేచి, శ్రీ చందనము, పూవులు, రత్నములు, మొదలైన వివాహసంభారములను సమకూర్చినాడు. సంధ్యావందనాదినిత్య కృత్యములు ముగియగనే, కుంభుడు యథారీతి వధూత్వము (స్త్రీత్వము)నుపొందినాడు. "ప్రియుడా! క్రమముగ అగ్నిని ప్రజ్వలింపజేసి, నా పాణిని గ్రహింపుము" - అని చెప్పగా, రాజు సర్వమును నెఱవేర్చెను.

ఏవం వివాహితావిష్టౌ, సంపన్నౌ స్నిగ్ధదమ్పతీ ।

దినై స్త్రిభి స్త్రిభి ర్గత్వా, నిద్రాం యాతే శిఖిధ్వజే ॥ 25 ॥
చూడాలా రాజకార్యాణి, కృత్వా సా పునరాయయౌ ।

**25-26.** ఇట్లు వివాహితులై వారు అన్యోన్యానురక్తులు, సంతుష్టులు, స్నేహ యుక్తులు నైన దంపతు లైనారు. శిఖిధ్వజుడు నిద్రించుచుండగా, మూడు దినముల కొకసారి చూడాల, రాజధానికి పోయి, రాజకార్యములు నెఱవేర్చి, మరలి వచ్చుచుండెను.

తతో యాతేషు మాసేషు, శనైః కతిపయేషు సా ॥ 26 ॥
చూడాలా చిన్తయామాస, "పరీక్షేఽహం శిఖిధ్వజమ్ ।
సాంప్రతం భోగభారేణే" తీన్ద్రం ప్రాఽదర్శయత్తదా ॥ 27 ॥

**26-27.** ఇట్లు అనంతరము, కొన్ని మాసములు క్రమముగా గడచిన పిమ్మట, చూడాల, ఇట్లు తలచినది. "నే నిపుడు శిఖిధ్వజుని భోగేచ్ఛను భోగభారముచేత (అనేక భోగవిషయభారము చేత) పరీక్షింతును గాక!" అని యపుడు, తన యోగబలమున ఆమె, దేవరాజగు ఇంద్రుని రాజునకు గనుపఱచినది.

ఇన్ద్ర ఉవాచ :-

"ఉత్తిష్ఠ! స్వర్గమాగచ్ఛ!, తత్ర సర్వే త్వదున్ముఖాః ।
ఆకల్పం వివిధా భోగా, భోక్తవ్యాః సన్తి తే ప్రభో! ॥ 28 ।

28. ఇంద్రుడు :- "లెమ్ము, స్వర్గమునకు రమ్ము. అచ్చట అందఱును నీ రాక కెదురు చూచుచున్నారు. ప్రభూ! కల్పాంతము వఱకు నీకు అనుభవింపదగిన వివిధభోగము లచట నున్నవి."

రాజోవాచ :-

"సర్వత్రైవ మమ స్వర్గో, గమ్యో న కుత్రచిన్మయా* ।"
తతస్తాం శమమానీయ, మాయాం సా సమచిన్తయత్ । 29 ।

29. రాజు :- "నాకు సర్వదిగ్దేశకాలములందును స్వర్గమే యున్నది. అందుకొఱకు నేను పోవలసిన ప్రదేశ మెందును లేదు. ఎల్ల యెడలను నేను (పూర్ణకామత్వమున) సుఖముగా క్రీడింతును." పిమ్మట, ఆ మాయను ఉపశమింపజేసి, చూడాల ఇట్లు చింతించినది.

"నేమం హరతి భోగేచ్ఛా, కేనచి ద్బుద్ధిహారిణా ।
రాగద్వేష ప్రధానేన, పునః సంక్షోభయామ్యహమ్" । 30 ।

30. "ఇతనిని భోగేచ్ఛ హరింపజాలదు. బుద్ధిని (వివేకమును) హరింపజేయు రాగద్వేషప్రధానమగు. నొకానొక విషయమున నితనిని, మరల సంక్షోభింపజేయుదును గాక!" (వ్యాకుల పఱచెదను గాక!)

ఏకదా కల్పితం కాన్తం, సుమనః శయనే స్థితమ్ ।
ఆలిఙ్గ్య మోదా త్తిష్ఠన్తీ మాలోక్యా+ఽపి తుతోష సః । 31 ।

31. ఒకప్పుడు సంకల్పముచే కల్పింపబడి, పుష్పశయ్య యందున్న జార ప్రియుని మోదమున గాఢముగ కౌగిలించుకొని యున్న చూడాలను గాంచియును, అతడు సంతోషించెను. (+ ఆలక్ష్యాఽపి—పా.భే)

---

★ "సమ్పూర్ణం జగదేవ నన్దనవనం సర్వేఽపి కల్పద్రుమాః,
గాఙ్గం వారి సమస్తవారివివహాః పుణ్యాః సమస్తాః క్రియాః ।
వాచః ప్రాకృత సంస్కృతాః శ్రుతిగిరో వారాణసీ మేదినీ,
సర్వాఽవస్థితిరస్య వస్తువిషయా దృష్టే పరబ్రహ్మణి ।" (శంకరుడు – ధన్యాష్టకము–10)
(బ్రహ్మవేత్తకు జగత్తే నందనవనము. తరువులన్నియు కల్పవృక్షములే. సమస్తజలమును

"విఘ్నం మా కురుతం భీతౌ," ఇత్యుక్త్వా నిర్జగామ సః ।
తతో ముహూర్తమాత్రేణ, లజ్జాఽవనమితాఽఽననామ్ ॥ 32 ॥
రాజానం సముపాగమ్య, తిష్ఠన్తీ మబ్రవీ న్నృపః ।

**32-33.** "మీ సుఖమునకు, నావలన భయపడి విఘ్నమును కలిగించుకొనకుందురు గాక!" – అని చెప్పి, అతడు వెడలిపోయెను. తరువాత, క్షణమాత్రముననే, సిగ్గుతో తలవంచుకొని, రాజు సన్నిధి చేరి, నిలిచియున్న ఆమెతో రాజిట్లు పలికెను.

"భూయ స్తోషయితుం గచ్ఛ, కాన్తం ప్రణయవృత్తిభిః ॥ 33 ॥
పరస్పరేప్సితస్నేహో, దుర్లభో హి జగత్త్రయే ।"

**33-34.** "నీ ప్రియుని ప్రణయవృత్తుల (ప్రవర్తనల)తో సంతోషపఱచుటకు మరల పొయిరమ్మా. ముల్లోకములందును, అన్యోన్యాకాంక్షితమై, అకృత్రిమమైన అనురాగము, లభించుట దుర్లభము కదా!

**3. చూడాలయా సమాధానమ్ – చూడాల, సంశయనివారకమైన సమాధాన మొసగి, పరిస్థితిని విశదపఱచుట**

ఏవం సమతయా తత్ర, స్థితే తస్మిన్ శిఖిధ్వజే ॥ 34 ॥
"అహో బత! పరం సామ్యం* భగవా నయ మాగతః ।
ఆత్మవృత్తాన్త మఖిలం, తదేనం స్మారయామ్యహమ్" ॥ 35 ॥
ఇతి సంచిన్త్య చూడాలా, స్వకీయం వపు రాదదే ।

**34-36.** ఇట్లు శిఖిధ్వజుడు సమచిత్తుడై యుండుటను గాంచి చూడాల "ఆహా!

---

గంగయే. సమస్త క్రియలును పుణ్యక్రియలే. వాక్కులన్నియు – ప్రాకృతములు, సంస్కృతములు, అన్నియును, వేదవాక్యములే. భూమి అంతయు, కాశీక్షేత్రమే. పరబ్రహ్మసాక్షాత్కారమందినజ్ఞానికి సర్వమును బ్రహ్మమయమే.

★ పోల్చు :- "ఇహైవ తై ర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః ।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః ।
న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాఽప్రియమ్ ।
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః ।" (భ.గీ. V-19,20)

సర్వాంతర్యామిత్వ, సర్వాధిష్ఠానత్వ, సర్వవిలక్షణత్వములచే పరమసామ్యమగు బ్రహ్మమున, నెవరి మనస్సు నిశ్చలమై (సామ్య బ్రహ్మపన్నమై) యుండునో, వారీ జీవితముననే జన్మాది సంసారమును జయించుచున్నారు. బ్రహ్మము దోషరహితము; సామ్యము. కావున సమదృష్టిగలవారు సంసార నిరోధమగు బ్రహ్మమున వెలయుచుందురు. వారికి ప్రియాఽప్రియ ప్రాప్తులందు, హర్ష విషాదములుండవు. సర్వభూతములందును సమము, నిర్దోషము ఆత్మయని స్థిరబుద్ధిగలవారు, సమ్మోహవివర్జితులై బ్రహ్మభావాపన్నులై యుందురు.

మఱియు పోల్చు :- ఈశావాస్యోపనిషత్తు – 6,7 మంత్రములు. సర్వభూతస్థమగు ఆత్మను (ఏకత్వమును) దర్శించు జ్ఞానికి, జుగుప్సా శోకమోహములుండవు.

ఈ పూజ్యుడు, పరమసామ్యమును (పరమ శాంత స్థితిని) పొందియున్నాడు. నా వృత్తాంతమంతయు నీతని కెఱిగింతును గాక!" - అని నిశ్చయించి తన పూర్వ (చూడాలా) రూపమును దాల్చినది.

తాం దృష్ట్వా విస్మితో రాజా, సాఽఽశ్చర్య మిద మబ్రవీత్ I 36 I
"కా త్వం? కుత స్త్వమాయాతా?, కిమర్థమిహ తిష్ఠసి ? I
అఙ్గేన వ్యవహారేణ, స్మితేనాఽనునయేన చ I 37 I
మమ జాయా విలాసేన, చూడాలేవోపలక్ష్యసే" I

36-38. తనముందర నిలిచి యున్న యా యింతిని గాంచి రాజు, విస్మిత లోచనుడై, ఆశ్చర్యమున నిట్లు ప్రశ్నించెను. కాంతా! నీవెవ్వతెవు? ఎట నుండి ఇటకు వచ్చితివి? ఏ కారణమున నీ విచట నున్నావు? అవయవముల ఆకృతి చేతను, తచ్చేష్టాలక్షణమగు వ్యవహారము చేతను, మందస్మితము (చిరునగవు) చేతను, ప్రేమపూర్ణమగు మృదూక్తి చేతను, విలాసము చేతను, నా భార్యయగు చూడాల వలె దోచుచున్నావు.

చూడాలోవాచ : –

ఏవమేవ ప్రభో! విద్ధి, చూడాలాఽస్మి న సంశయః I 38 I
కుమ్భాదిదేహ నిర్మాణం, త్వాం బోధయితు మేవ మే I
సర్వం పశ్యసి తత్త్వజ్ఞ!, ధ్యానేనాఽథాఽవలోకయ! I 39 I

38-39. ప్రభూ! అది నిజమే. నేను చూడాలనే యని తెలియుము; సంశయము వలదు. నీకు ఆత్మజ్ఞానము కలిగించు నిమిత్తమే నేను కుంభాది రూపముల నిర్మించితిని (ధరించితిని) తత్త్వజ్ఞుడా! నీవు యథార్థమును సర్వమును గాంచగలవు. ఇపుడు ధ్యానదృష్టితో అవలోకింపుము.

ఆస్వరాజ్యపరిత్యాగా చ్చూడాలా దర్శనాఽవధి I
ధ్యానేనాఽఽలోక్య భూపాలో, విరరామ సమాధితః I I 40 I

40. తాను స్వరాజ్యమును వీడి వచ్చినది మొదలు కొని, ఇపుడు చూడాలను దర్శించినంత వఱకును, జరిగిన సర్వవిషయములను రాజు, ధ్యాన దృష్టితో నవలోకించి, నిజయోగసమాధిని విరమించెను.

రాజోవాచ :–

"ఏవం దురుత్తరా దస్మాత్, సంసారకుహరా దహమ్ I
ఉత్తారితో యథా యుక్త్యా, సా హి కేనోపమీయతే? I 41 I

కథ మస్యోపకారస్య కరిష్యే తే ప్రతిక్రియామ్? ।"

**41-42.** రాజు :- "దాటరాని సంసారగహ్వరము నుండి, ఉపాయముతో నన్ను దాటించిన ఆమె నెవరితో పోల్పవగును? ఆమెకు ఆమెయే సాటి. ఈ యుపకారమునకు నేనెట్లు నీకు ప్రత్యుపకారము నొనరింపగలను?"

**చూడాలోవాచ :-**

**"దేవ! శుష్క-క్రియాజాలపరే, త్వయ్యాకులాత్మని । 42 ।**
**భూయో భూయో విచిన్త్యాఽహం, త్వదర్థం దుఃఖితాఽభవమ్ ।**

**42-43.** చూడాల :- "దేవా! తత్త్వము నెఱుగక, నిరర్థకశుష్క-కర్మకాండపరుడవై, వ్యాకులచిత్తుడవైన నిన్ను గుఱించి, మాటి మాటికి విచారించి, నీ కొఱకు నేను శోకించితిని.

**తేన త్వదవబోధాన్మే, స్వార్థ ఏవోపపాదితః । 43 ॥**
**మయా తత్ర కథం దేవః, కరోతి మమ గౌరవమ్ ?।"**

**43-44.** కావున, నీ ఆత్మజ్ఞానసిద్ధి వలన, నా స్వార్థమే సమర్థింపబడినది. ఈ విషయమున నా ప్రభు వేల నా కింత గౌరవ మొసగవలయును?"

**రాజోవాచ :-**

**"నిరీహోఽస్మి నిరంశోఽస్మి, స్వస్థోఽస్మి విగతాఽఽశయః । 44 ।**
**యదస్మి తత్ తదేవాఽస్మి, వక్తుం శక్నోమి నేతరత్ ।**
**ప్రసాదేన విశాలాక్ష్యాః, తీర్ణోఽస్మి భవసాగరాత్" । 45 ।**

**44-45.** రాజు :- "నేను కోరికలు లేని వాడను. (ఇచ్ఛారహితుడను), అంశ (భాగ) వర్జితుడను, (నిరవయవుడను), స్వస్థుడను, (సంతుష్టుడను; నాయందే నేను నిలుకడ నొంది యున్నాను.), మనోరహితుడను - ఆశ్రయము లేనివాడను. కాన, ఏదియున్నదో అదియే (పరబ్రహ్మమే)యై యున్నాను. నా స్థితి యిట్టిదని ఇంత కంటె, వేఱేమియు నేను చెప్పజాలను. **విశాలాక్షి (చూడాల) యొక్క అనుగ్రహమున సంసారసాగరమును తరించితిని." (కులాంగనలందఱికిని, చూడాల ఆదర్శము కదా!)**

## 4. స్వరాజ్యాఽభిషేచనమ్ - శిఖిధ్వజుని స్వరాజ్యపట్టాభిషేకము

**చూడాలోవాచ :-**

**"కి మిదానీం ప్రభో! బ్రూహి రోచతే తే మహామతే ! ।**

46. చూడాల :- "ప్రభూ! మహామతీ! నీ మనసున కిపు డేది యింపుగ నున్నదో చెప్పుము."

రాజోవాచ :-

"ప్రతిషేధం న జానామి, న జానా మ్యభివాఞ్ఛితమ్ I 46 I
న స్తౌమి న చ నిన్దామి, యథేచ్ఛసి తథా కురు I★"

46-47. రాజు :- "నాకిది అక్కఱ లేదను ప్రతిషేధమును గాని, ఇది కావలయునను అభీష్టమును గాని, నేనెఱుగను. నేను దేనిని స్తుతింపను; నిందింపను. నీవెట్లు వాంఛింతువో, అట్లే ఆచరింపుము."

★ పోల్చు :- "పరిగ్రహేషు వైరాగ్యం, ప్రాయో మూఢస్య దృశ్యతే I
దేహే విగళితాఽఽశస్య, క్వ రాగః? క్వ విరాగతా?" II
[అష్టావక్ర సంహిత - XVIII-62]

దేహాత్మాభిమాని యగు మూఢునికి, దేహాభిమానమునకు అవసరములగు పరిగ్రహణము (భోగము) లందు వైరాగ్యము కాన్పించు చున్నది. కాని, దేహమున ఆశ, నిశ్శేషముగ అంతరించిన వానికి రాగవిరాగము లెక్కడివి? ఈ రాగవిరాగములు రెండును శరీరానురాగము నుండియే జనించుచున్నవి కదా!

ఇంకను పోల్చు :-

"నిరవధి సుఖభూమాఽనన్త సంవిత్పరాత్మ -
వ్యనుభవ మధిరూఢే, వాక్యతో యోగతో వా I
భవతు దృఢ సమాధి ర్లోక సఙ్గ్రాహకో వా,
భజతు విషయ జాతం, నైతి భూయోఽపి బన్ధమ్ I" (స్వారాజ్యసిద్ధి-కైవల్య-12)

గురూపదేశపూర్వకముగు మహావాక్యము వలన గాని, యోగానుష్ఠానము వలన గాని, నిరవధికానంద రూపము, పూర్ణచైతన్యస్వరూపమునగు పరమాత్మస్వరూపమును, స్వానుభవమున పొందిన జ్ఞాని, ఆ యానందానుభవమున నోలలాడుచు, యావజ్జీవము దృఢసమాధినిష్ఠుడు కావచ్చును, లేక, లోకసంగ్రహార్థము, దైవ ప్రాప్తములగు సకల విషయములను సేవింపవచ్చును. ఎట్లైనను, ఆతడు కర్మబంధమును మరల పొందజాలడు.

"వివేకీ సర్వదా ముక్తః, కుర్వతో నాఽస్తి కర్తృతా I
అలేపవాదమాశ్రిత్య, శ్రీకృష్ణజనకౌ యథా I

వివేకియగువాడు (ఆత్మజ్ఞుడు) సర్వదా ముక్తుడు. అట్టి వానికి, ధర్మాధర్మాద్యాచరణరూపమగు సంసారము లేనే లేదు. శ్రీకృష్ణ, ప్రియవ్రత, జనకాదుల వలె, ఆత్మవేత్త, దేహాదికమునందు, తాదాత్మ్యాద్యభిమాన శూన్యుడగుటచే, కర్మములచే నిర్లిప్తుడు.

"యోగరతో వా భోగరతో వా, సఙ్గరతో వా సఙ్గవిహీనః I
యస్య బ్రహ్మణి రమతే చిత్తం, నన్దతి నన్దతి నన్దత్యేవ I"
(ఆదిశంకరుడు-మోహముద్గరము-31.)

యోగరతుడగు గాక, లేక, భోగరతుడే యగు గాక! సంగియే యగు గాక, లేక, నిస్సంగియే యగుగాక! ఎవ్వని చిత్తము సర్వదా బ్రహ్మము నందు రమించుచుండునో, అతడే ఆనందించును.

చూడాలోవాచ :-

యద్యేవం తన్మహాబాహో!, సమాకర్ణయ మన్మతమ్ ‌। 47 ॥
రాజ్యేన ప్రకృతేనేమం, కాలం నీత్వా క్రమేణ చ ।
విదేహతాం ప్రయాస్యామః, ప్రభో! కాలేన కేనచిత్ । 48 ॥

47-48. చూడాల :- ప్రభూ! నా ఇష్టమే మీ యిష్టమైనచో, నా అభిమతమును వినుము. మనకు ప్రాప్తించిన రాజ్యమును పాలించుటచే, ఆయుఃశేష రూపమగు కాలమును గడపి, ఒకానొక సమయమున మనము, విదేహ కైవల్యమును పొందుదము.

రాజోవాచ :-

యుక్త ముక్తం విశాలాక్షి! త్వయైతత్ సమయా ధియా ।
యథా సంస్థాన మేవేమౌ, తిష్ఠావః స్వస్థతాం గతౌ । 49 ।

49. రాజు :- ఓ విశాలాక్షి! నీవు సమబుద్ధితో యుక్తమునే వచించితివి. స్వస్థతను పొంది (ఆత్మయందు నిలుకడ నొంది), సుఖదుఃఖాభిమాన రహితులమై, నిర్వికారముగ, యథాస్థితి కల్గి యుందుము.

(యథా సంస్థానమ్ = యథా స్థితమ్ - యో.వా.తా.ప్ర.)

అథోత్థాయ తు చూడాలా, రత్నకుమ్భం పురఃస్థితమ్ ।
కాన్తం సఙ్కల్పయామాస, పూర్ణం సప్తాఽబ్ధివారిభిః । 50 ।

50. అనంతరము చూడాల లేచి, సప్త సముద్ర జల పూర్ణమును, మనోజ్ఞమునైన రత్నకలశమును, ఎదుట నుండునట్లు సంకల్పించినది.

తేన మఙ్గళకుమ్భేన, తం పూర్వాఽభిముఖం స్థితమ్ ।
భార్యా భర్తార మేకాన్తే, స్వరాజ్యేఽభిషిషేచ సా । 51 ।

51. పుణ్యజల పూర్ణమైన ఆ మంగళ కలశముచే, నా పత్ని, పూర్వాభిముఖుడై యున్న తన భర్తను, ఏకాంతమున స్వరాజ్యమున నభిషిక్తునొనరించెను.

తథాఽఽసనే సమాస్థాప్య, మహాదేవీపదే తతః ।
అభిషిక్తాం చ చూడాలాం, చకార చ శిఖిధ్వజః ॥ 52 ॥

52. పిదప, అట్లే, శిఖిధ్వజుడును, చూడాలను సైతము, ఆసనమున కూర్చుండ బెట్టి, మహాదేవీపదమున (పట్టపురాణిగా) నభిషిక్తనొనరించెను.

తతః సఙ్కల్పమాత్రేణ, సైన్యేన పూరితం వనం ।
తతో ద్విపవరం దివ్య మారూఢౌ నృపదమ్పతీ ॥ 53 ॥

53. తరువాత, చూడాల యొక్క సంకల్ప మాత్రముననే, అరణ్యమంతయు సైన్యముచే క్రిక్కిఱిసిపోయినది. అంతట, దివ్యమగు భద్రగజముపై నా దంపతు లిరువురును నారూఢులైనారు.

తతః ప్రస్థాయ రాజాఽసౌ, మహిష్యా ప్రియయా సహ ।
ప్రాగల్పేనైవ*కాలేన, స్వాం పురీం స్వర్గశోభనామ్ ॥ 54 ॥

54. అనంతరము బయలుదేరి, రాజు, తన ప్రియపట్టమహిషీసమేతుడై స్వల్పకాలముననే, స్వర్గము వలె శోభమానమైన స్వపురమును చేరుకొన్నాడు.

తారతూర్యాదినా పౌరైః, ప్రత్యుద్యాతో వివేశ తామ్ ।
దశవర్షసహస్రాణి, రాజ్యం కృత్వా మహీతలే ॥ 55 ॥
సహ చూడాలయా రామ! విరతో దేహధారణాత్ ।
దేహం త్యక్త్వా జగమాఽసౌ పపున ర్జన్మవే నృపః ॥ 56 ॥

55-56. పౌరులు ఉచ్చస్వరయుక్తముగ, వేణువు మొదలగు వివిధమంగళ వాద్యములతో నెదుర్కొనగా, రాజు పురము ప్రవేశించెను. శ్రీరామా! ఇట్లు మహావైభవమున పురము ప్రవేశించి శిఖిధ్వజుడు, పదివేల సంవత్సరములు రాజ్యపాలన మొనర్చి చూడాలతో కూడ, తన దేహ ధారణమున విరక్తుడయి దేహమును త్యజించి, మరల జన్మింపకుండుటకై నిర్వాణపదమును పొందెను.

* ప్రాహాఽల్పేనైవ। పా.భే.

**ఏతత్తే కథితం సర్వం, శిఖిధ్వజకథానకమ్ ।**
**అనేన గచ్ఛ మార్గేణ, న కదాచన ఖిద్యసే । 57 ।**

57. శ్రీరామా! శిఖిధ్వజుని చరిత్రమును సర్వమునునీ కెఱిగించితిని. ఈ యుత్తమమార్గమున చరింపుము; ఎపుడును నీవు ఖేదమును, ఏ విధమైన సంక్షోభమును, పొందవు.

(చూడాలా శిఖిధ్వజుల చరిత్రము అత్యంతమనోజ్ఞము. బ్రహ్మ విద్యాలయమందు, స్త్రీ, బహిష్కృతకాదను సత్యము నిది వ్యాఖ్యానించును. ఆత్మజ్ఞానాధికారము నందు, స్త్రీకి సమానాధికారము కలదు. ఆమె ప్రయత్నించినచో, పురుషుని కంటె ముందుగనే, ఆత్మ సాక్షాత్కార లాభమును పడయగలదు. ఆత్మోపలబ్ధిని పొంది, ఆమె, తన భర్తకును, తత్ప్రథానువర్తనమున సాయపడగలదు.

ఆత్మసాక్షాత్కారమునకు, సత్యము, యథార్థమునైన, సర్వ త్యాగము, బాహ్యార్థములను, విధ్యుక్త ధర్మములను, విసర్జించుట కాదు; ఆంతరములైన కామ(విషయాభిలాష)తృష్ణలను విసర్జించుటయే యథార్థమగు సర్వత్యాగ మని ఈ ఆఖ్యాయిక నిరూపించుచున్నది.)

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'శిఖిధ్వజ పరీక్షా'నామ అష్టావింశః సర్గః

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'శిఖిధ్వజపరీక్ష'యను అష్టావింశతితమ (ఇరువది యెనిమిదవ) సర్గము సమాప్తము

*ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।*



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



*ఓం నమః పరమాత్మనే ।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ఏకోనత్రింశసర్గము

## చిన్మాత్రస్థితిః – కేవలము పూర్ణ చైతన్యమున స్థితి (నిలుకడ) నొందుట

### 1. కచోపాఖ్యానమ్ః – కచుని చరిత్రము

వసిష్ఠ ఉవాచః–

శిఖిధ్వజః క్రమేణైవ, యథా బోధ మవాప్తవాన్ ।
కచో బృహస్పతేః పుత్రః, ప్రాప్తో బోధం తథైవ హి । 1 ।

శిఖిధ్వజుడు క్రమముగ పరమజ్ఞానమును పొందినట్లే, బృహస్పతి కుమారుడైన కచుడును పరమ జ్ఞానమును ప్రాపించెను.

కచో బాల్యాత్ సముత్తీర్ణః, సంసారోత్తరణోన్ముఖః ।
పదపదార్థతత్త్వజ్ఞో, బృహస్పతి ముఖావత । 2 ।

"కథ ముత్తీర్యతే తాత!, ఘోరః సంసార సాగరః ?"

2-3. కచుడు బాల్యావస్థను దాటి, యౌవనమును ప్రవేశించిన యంతనే, సకలవిద్యాస్థానములందు నిష్ణాతుడై, తత్త్వమసి మహా వాక్య మందలి పదపదార్థముల నెఱిగి, సంసారమును తరింప నుద్యుక్తుడై, తన తండ్రియగు బృహస్పతి నిట్లు ప్రశ్నించెను. "తండ్రీ! ఘోరమగు సంసార సాగరమెట్లు తరింపనగును?

బృహస్పతి రువాచ :-

"ఉత్తీర్యతే విరుద్వేగం సర్వత్యాగేన పుత్రక !" ।3।

ఇత్యుక్త స కచః సర్వం త్యక్త్వైకాన్తవనం యయౌ ।

3-4. బృహస్పతి :- "కుమారా! (పరమవైరాగ్యదార్ఢ్యము వలన, విషయభోగములు త్యక్తములు కాగా, పశ్చాత్తాప, ఉద్వేగ(భయ)రహితముగ చేసిన) సర్వత్యాగము చేతనే, శీఘ్రముగ నీ సంసారసాగరమును తరింపవచ్చును." ఇట్లు బృహస్పతి తెలుపగా, కచుడు సర్వమును త్యజించి నిర్జనారణ్యమున కేగెను.

బృహస్పతే స్త ద్గమనం, నో ద్వేగాయ బభూవ హ ।4।

సంయోగే చ వియోగే చ, న క్షుభ్యన్తి మహాశయాః ।

4-5. పుత్రుడగు కచుని అరణ్యాగమనము వలన బృహస్పతి చిత్తము ఏ మాత్రము సంక్షోభ(దుఃఖ)మొందలేదు. మహాత్ములు సంయోగ వియోగములు కల్గినపుడు, హర్షశోకముల (సంక్షోభముల)ను పొందరు.

ఏకదా పితరం ప్రాప్తం, నత్వా పప్రచ్ఛ తం కచః ।5।

"అద్యేద మష్టమం వర్షం సర్వత్యాగః కృతో మయా ।

తథాఽపి తాత! విశ్రాన్తిం నాఽధిగచ్ఛామ్యహం కథమ్" ? ।6।

5-6. ఒకప్పుడు తన యొద్దకు వచ్చిన తండ్రిని కచుడిట్లు ప్రశ్నించినాడు. "తండ్రీ! నేను సర్వత్యాగ మొనర్చి నేటికి ఎనిమిది సంవత్సరములైనది. అయినను, సర్వోత్తమమైన చిత్తవిశ్రాంతిని నేనెందుకు పొందకున్నాను?"

**"సర్వమేవ త్యజ" – ఇత్యుక్త్వా యయౌ వాచస్పతి ర్దివమ్ ।**
**గతే తస్మిన్ కచో దేహాత్, వల్కలాద్యప్యథాఽత్యజత్ । 7 ।**

7. "సర్వమును త్యజింపుము" – అని పలికి బృహస్పతి స్వర్గమున కేగెను. అతడు వెళ్లగా, కచుడు తన దేహము నుండి వల్కలాదులను సైతము పరిత్యజించి దిగంబరుడైనాడు.

**వర్షత్రయాత్పరం చాఽపి, ప్రాప్తం పితర మబ్రవీత్ ।**
**"కన్థాం త్యక్త్వాఽపి విశ్రాన్తి ర్నైవాఽస్తి కిం కరోమ్యహమ్"? । 8 ।**

8. మూడు సంవత్సరముల అనంతరము, తన చెంతకు వచ్చిన తండ్రితో కచుడు, "తండ్రీ! కంథ (బొంత) మొదలగు వానినన్నిటిని విడిచి పెట్టినను, స్వస్వరూపవిశ్రాంతి మాత్రము లభింపలేదు. ఇంకేమి చేయుదును?" – అని యడిగినాడు.

**"చిత్తం సర్వం హి తత్త్యాగం, సర్వత్యాగం విదుర్బుధాః★ " ।**
**ఇత్యుక్త్వా చ గతే తాతే, చిత్తం కి మిత్యచిన్తయత్ । 9 ।**

9. "చిత్తమే (మనస్సే) నిశ్చయముగా సర్వమును. దానిని పరిత్యజించుటయే సర్వత్యాగమని బుధులెఱుగుదురు". (సర్వ త్యాగమునకు మహాత్ముల తాత్పర్యమిదియే) అని పలికి తండ్రి, బృహస్పతి వెడలిపోయినంతనే, కొడుకు 'చిత్తమనగా నేమిటో' యని విచారించెను.

**పదార్థబృన్దం దేహాది, న హి చిత్తం భవేదితి ।**
**నిశ్చిత్య పితరం గత్వా, పునః పప్రచ్ఛ తం కచః । 10 ।**

10. దేహము, వల్కలములు, కుటీరము, మొదలగు పదార్థసమూహములు చిత్తము కావు కదా – అని నిశ్చయించి, తానే తండ్రి యొద్దకు పోయి, చిత్త మెట్టిది? తత్త్యాగ మేవిధమున సంభవించునని, మరల కచుడు ప్రశ్నించినాడు.

---

★ బుధులు – సాక్షి భావమున చిత్తమును పృథక్కరించి, తత్స్వరూపము నెఱిగిన జీవన్ముక్తులగు మహాత్ములు –
"చిత్తవిదః సాక్షిణా చిత్తం పృథక్కృత్య జానన్తో
జీవన్ముక్త జనాః " । – (యో.వా.తా. ప్రకాశిక)

"చిత్తం కిం ప్రోచ్యతే తాత!" తస్యోత్తర మువాచ సః ।
"అన్తర్యోఽ యమహంభావో, జన్తో స్తచ్చిత్తముచ్యతే"★ ॥ 11 ॥

11. "తండ్రీ! చిత్తమని ఏది యనబడును?" - అని అడిగిన కచునకు బృహస్పతి, "జీవులయందలి అంతరభిమానము, అహంకారమే, చిత్తమనబడు"నని సమాధాన మొసగెను.

కచ ఉవాచ :-

"మన్యేఽస్య దుష్కర స్త్యాగః, స త్యక్తుం శక్యతే కథమ్? ।"

12. కచుడు :- "దీనిని (చిత్తమును) త్యజించుట దుష్కరమని భావింతును. దీని త్యజించుటకు సాధ్యమగు ఉపాయము నెఱిగింపుము."

బృహస్పతి రువాచ :-

"సుకరోఽహఙ్కృతే స్త్యాగో, న క్లేశోఽత్ర మనాగపి ॥ 12 ॥
మిథ్యారూపో హ్యహం భావో, లీయతే తత్త్వభావనాత్ ।"

12-13. బృహస్పతి :- "ఈ అహంకారమును త్యజించుట సుకరమే. ఈ విషయమున క్లేశ మేమాత్రమును లేదు. ఈ అహంభావము మిథ్యారూపము. నిరంతర పరమాత్మ తత్త్వ భావనము చేత, నిది తనంతనే అణగిపోవును.

దిక్కాలాఽద్యనవచ్ఛిన్నం, స్వచ్ఛం నిత్యోదితం తతమ్ ॥ 13 ॥
సర్వాఽర్థమయ మేకాఽర్థం, చిన్మాత్ర మమలం భవాన్ ।
తదేవ భావయన్ సాధు, శాన్త స్తిష్ఠ గతజ్వరః ॥ 14 ॥

13-14. దేశ కాలాది (విభాగ) రహితము, ఆకాశము వలె నిర్మలము, నిత్యోదితము (సర్వదా ఉదయాస్తమయ రహితమగు ఏక స్వరూపము) సర్వగతము, సర్వపదార్థసారభూతము, అద్వయము, నిరవద్యమునైన కేవల చిద్రూపమే

★ 9, 10, 11, శ్లోకములందలి 'చిత్తము' సర్వస్మృతులకును ఆలయము, ఆధారము. ఇదియే జ్ఞాతృ (The knower) జ్ఞేయ (The Known) భేదమునకు కారణమగుచున్నది. దీని ప్రథమాఽభివ్యక్తి. 'నేను'- అను అహంకారము (వ్యష్టిచైతన్యస్ఫురణము). ప్రతిప్రత్యయమును, నిశ్చయమును, ఈ అహంకారము నుండియే ఉద్భవించును. కాన, ఇది మనస్సు, లేక, అంతఃకరణములో అభిన్నముగా భావింపబడినది.

(జ్ఞాన స్వరూపమే) నీవు. సౌమ్యుడా! అద్దానినే సంపూర్ణముగ ధ్యానించుచు శాంతుడవు, తాపవిముక్తుడవునై యుండుము.

**ఇతి యోగం పితుః ప్రాప్య, జీవన్ముక్తో బభూవ సః ।**
**నిర్మమో నిరహఙ్కార, శ్ఛిన్నగ్రన్థిః ప్రశాన్తధీః । 15 ।**
**కచో యథాస్థితో రామ! తథా తిష్ఠాఽవికారవాన్ ।**

15. మోక్షదాయకమగు ఇట్టి ఆత్మాద్వైతయోగమును, తండ్రి వలన పొంది, కచుడు మమతాహంకారరహితుడు, విచ్ఛిన్నఅజ్ఞానగ్రంథి, (సర్వ సంశయవిముక్తుడు), ప్రశాంతబుద్ధియునై, జీవన్ముక్తుడైనాడు. కచుని వలె, శ్రీరామా! నీవును నిర్వికారుడవై (శోకరహితుడవై) వర్తింపుము.

## 2. మిథ్యాపురుషోపాఖ్యానమ్ – మిథ్యాపురుషుని కథ

**ఇమా మాఖ్యాయికాం చిత్రాం, శృణు రాఘవ! శోభనామ్ । 16 ।**

16. రాఘవా! విచిత్రమును, మనోజ్ఞమునైన ఈ కథను వినుము.

**మాయాయన్త్రమయః కశ్చి ద్బాలో మౌర్ఖ్యేన కేవలమ్ ।**
**నిష్ప్రపఞ్చే క్వచిత్ శూన్యే, జాత స్తత్రైవ తిష్ఠతి । 17 ।**

17. మాయాయంత్రనిర్మితుడై, బాలునివలె పేలవమైన బుద్ధి గల యొకానొక పురుషు డుండెను. అతడు కేవలము మూర్ఖత్వము (అజ్ఞానము) చేత సంవృతుడై, నిష్ప్రపంచమును, శూన్యమునైన ఒకానొక ప్రదేశమున జన్మించి, అచటనే యుండును.

**తస్మా దన్య న్న తత్రాఽస్తి, యదస్తి చ స ఏవ తత్ ।**
**యచ్చాఽన్యత్ తత్ తదాభాసం, న తు పశ్యతి మూఢధీః । 18 ।**

18. అతని కంటె (స్వస్వరూపమున కంటె) వేఱయిన పదార్థమేదియును, అచ్చట లేదు. అచట ఏదియున్నదో, అదియే అతడు. అన్యమైనదని తోచినదంతయు అతని ఆభాసరూపమే (ప్రతిబింబమే). ఇట్లుండియును, బుద్ధిహీనుడగుటచే, యథార్థతత్త్వము నాతడు గాంచజాలడు.

ఇష్టస్య వస్తునః ఖస్య, రక్షార్థ మకరో గ్గృహమ్ ।
అస్య కోశే బబన్ధాऽऽస్థాం, రక్షితం, ఖం మయేత్యసౌ ॥ 19 ॥

19. తన కిష్ట పదార్థమగు ఆకాశమునకు రక్షణార్థమై, ఆతడొక గృహమును నిర్మించినాడు. 'ఆకాశము నాచే రక్షింపబడిన'దని, ఆ గృహాంతర్భాగమున తన ఆశ్రయమును, లేక, అపేక్షను ఆతడు స్థాపించుకొన్నాడు.

అథ కాలేన తస్మింశ్చ, గృహే నాశ ముపాగతే ।
"హా! గృహాऽऽకాశ! నష్ట స్త్వం, హా! క్వ యాతోऽసి చ క్షణాత్" ॥20॥
ఇతి శోకా త్పునశ్చక్రే, ఖరక్షార్థం స కూపకమ్ ।

20-21. తరువాత, కాలక్రమమున ఆ గృహము నశించిపోగా, "హా! నా గృహాకాశమా! నీవు నశించితివి. హా! క్షణ కాలముననే ఎందుపోయితివి?"- అని మిగుల దుఃఖించి, మరల ఆ యాకాశరక్షణార్థమై ఆత డొక బావిని త్రవ్వెను.

కాలే కూపే లయం నీతే, కూపాऽऽకాశో గతో న్వితి ॥ 21 ॥
కూపాऽऽకాశ ప్రలాపాऽన్తే, శీఘ్రం కుమ్భ మథాऽకరోత్ ।
కుమ్భాऽऽకాశ పరో భూత్వా, మోహా న్నిర్వృతి మాయయౌ ॥ 22 ॥

21-22. కాలక్రమమున ఆ బావియును పూడిపోగా, కూపాకాశము నశించినదని వాడు, ఆ కూపాకాశమునకై, ప్రలాపించి, తుదకు వెంటనే, ఒక ఘటమును, నిర్మించినాడు; ఆ ఘటాకాశమున తన అభిమాన ముంచుకొని, తన్మయుడై భ్రాంతి వశమున తదభిమానసుఖమును, పొందినాడు.

తస్మిన్నపి వినష్టే సః, శోకాత్కుణ్డం చకార హ ।
తస్మిన్నపి వినష్టే స శ్చతుఃశాలం చకార హ ॥ 23 ॥

23. అదియు నశించి పోగా, ఘటమందలి ఆకాశము నశించినదని దుఃఖించి, తద్రక్షణార్థము మరల నొక గుంటను (గొయ్యిని) త్రవ్వినాడు. కొంత కాలమున కదియును పూడి నశించిపోగా, అందలి ఆకాశము పోయినదని శోకించి, పిదప నొక విశాలమైన చతుఃశాలను, (నాలుగిండ్లబవంతిని) నిర్మించి, అందలి ఆకాశము నందభిమానమున తన్మయుడై, వాడు సంతోషించుచుండెను.

తస్మిన్ కాలాద్గతే నాశం, కుసూలం స చకార హ ।
తదప్యస్య జహారాఽఽశు, కాలో వాత ఇవాఽమ్బుదమ్ ॥ 24 ।
"కుసూలాఽఽకాశ! నష్టస్త్వ" మిత్యసౌ పర్యతప్యత ।

**24-25.** చతుఃశాలయు, కాలగమనమున నశింపగా, వాడు దుఃఖించి మరల ఆకాశ రక్షణార్థమొక కుసూలము (ధాన్య ముంచెడు గరిసె)ను నిర్మించెను. మేఘమును వాయువు హరించునట్లు, దానిని సైతము కాలము శీఘ్రముగ హరించి వైచినది. "హా కుసూలాకాశమా! నీవు నశించితివి" - అని అతడు పరితపించినాడు.

ఏవ మాకాశరక్షార్థం, యతమానః, స మూఢధీః ॥ 25 ।
దుఃఖా ద్దుఃఖతరం ప్రాప్య, నైవ నిర్వృతి మాప్తవాన్ ।

**25-26.** ఇట్లు ఆ మూర్ఖుడు, ఆకాశరక్షార్థము ప్రయత్నించుచు, దుఃఖము నుండి అధికతరదుఃఖమును పొందుచు, నిర్వృతిని (సుఖమును) పొందజాలడయ్యెను.

ఏవ మాత్మాఽభవ చ్ఛుద్ధః, సర్గాఽదా వమ్బరోపమమ్ ॥ 26 ।
తస్మాదుదే త్యహఙ్కారః, పూర్వం స్పన్ద ఇవాఽనిలాత్ ।

**26-27.** ఇట్లు సృష్ట్యాది యందు ఆత్మ, ఆకాశము వలె నిర్మలమై యుండెను. దాని నుండి, వాయువు నందు స్పందము (చలనము) వలె, మొదట అహంకార ముదయించుచున్నది.

అనాత్మాఽఽత్మైక రక్షార్థం, దేహా న్నానావిధా నసౌ ॥ 27 ।
కూప, కుణ్డ, చతుశ్శాల, కుమ్భ, కుసూలతుల్యాన్ ।
భూయో భూయో వినాశేఽపి సృజన్నాకులతాం గతః ॥ 28 ।

**27-28.** అనాత్మయగు అహంకారము (అస్మిత) తన్ను దాను రక్షించుకొనుటకై, కూపము (బావి), కుంభము (ఘటము), కుండము (గుంట), చతుఃశాల, కుసూలము (గాదె), వంటి నానావిధశరీరములను నొకదాని వెనుక నొకటిగా, మరల మరల కల్పించుకొనుచు, అవి నశింపగా, ఆత్మకు హాని యయ్యెనని వ్యాకులత్వమును (దుఃఖమును) పొందినది.

ఆకాశాదపి విస్తీర్ణః, శుద్ధః సూక్ష్మః శివః శుభః ।
య ఆత్మా స కథం కేన, గృహ్యతే?, రక్ష్యతేఽథవా? ॥ 29 ॥

29. ఆకాశమున కంటెను విశాలము, విశుద్ధము, సూక్ష్మము, శివము, శుభమునగు ఆత్మ, దేనికి ఎట్లు, గ్రాహ్యమగును? లేక, ఎవని చేత ఎట్లు రక్షింపబడును?

ఘటాదిషు ప్రణష్టేషు, యథాఽఽకాశో న నశ్యతి ।
తథా దేహేషు నష్టేషు, దేహీ నిత్యో న నశ్యతి ॥ 30 ॥

30. ఘటాదులు(కుండ మొదలగునవి) నశించినను, అందలి ఆకాశము నశింపక, ఏక రూపమున నున్నట్లే, దేహములు నశించినను, నిత్యుడైన దేహి నశింపక ఏకరూపుడై యుండును.

స మిథ్యా పురుషో యద్వత్ రక్షన్ వ్యోమాఽఽత్మశఙ్కయా ।
ఘటాఽఽకాశాదిషు క్లిష్టః, తథా మా క్లేశవాన్ భవ ॥ 31 ॥
శుద్ధచిన్మాత్ర ఆత్మాఽయ మితి మత్వా సుఖీ భవ ।

31-32. శ్రీరామా! ఆ మిథ్యాపురుషుడు, ఘటాదులందలి ఆకాశమును ఆత్మ యను మిథ్యాభిమానమున దానిని, గృహాదుల నిర్మించుట చేత రక్షించితినని తలచుచు, అవి నశింపగా, ఆత్మ నశించెనని దుఃఖించినట్లు, నీవు మిథ్యాభిమానమున దుఃఖింపకుము. ఈ ఆత్మ, కేవలము శుద్ధ చైతన్యస్వరూపముగ భావించి సుఖింపుము.

## 3. భృఙ్గీశోపాఖ్యానమ్ – భృంగీశుని కథ

ఆత్మతత్త్వస్య విస్మృత్యా, జగత్ ప్రాప్నోతి సత్యతామ్★ ॥ 32 ॥
రజ్జుతత్త్వస్య విస్మృత్యా, భుజగో దృశ్యతే యథా ।

★ పోల్చు :- "పరస్మాద్బ్రహ్మణో విశ్వం, కదాచిన్నైవ భిద్యతే ।
రజ్జుసర్పో యథా రజ్జోః, స్వరూపేణ న భిద్యతే ।"
"అన్తర్దృష్టే స్వయం భాతి, హేమాఽఽకృత్యైవ కుణ్డలమ్ ।
హేమైవ కుణ్డలాఽఽకృత్యా, బహిర్దృష్టే ప్రతీయతే" ।

"శుక్త్యజ్ఞానాద్యథా రూప్యం, రజ్జ్వజ్ఞానా ద్యథోరగః ।
తథాఽధిష్ఠాన తద్బ్రహ్మాజ్ఞానాద్విశ్వం న దృశ్యతే" ।
[శంకరుడు:– మహావాక్య దర్పణము 104, 115, 143]

**32-33.** రజ్జుతత్త్వమును (త్రాటి యథార్థస్వరూపమును) మఱచుట చేత, దాని యందు సర్పము గోచరించుచున్నట్లు, పరమాత్మతత్త్వమును విస్మరించుట చేతనే, జగత్తు సత్యత్వమును పొందుచున్నది.

**కనకవ్యతిరేకేణ, కేయూరం యేన భావితమ్ ॥ 33 ॥**
**కేయూర మేవ తత్తస్య, న తస్య కనకం హి తత్ ।**

**33-34.** కేయూరము (సందికడియము)ను, సువర్ణమున కంటెను వేఱుగా భావించు వానికి, అది కేవలము కేయూరమే కాని, సువర్ణము కానేరదు కదా!

**కనకాఽ వ్యతిరేకేణ, కేయూరం యేన భావ్యతే ॥ 34 ॥**
**కనకైకమహాబుద్ధి ర్నిర్వికల్పః స ఉచ్యతే ।**

**34-35.** కనకమున కంటెను కేయూరము వేఱుగాదని భావించువాడు, సువర్ణ వికారములైన ఆ కేయూరాది ఆభరణము లందు సువర్ణమే ముఖ్యమను మహాబుద్ధి కలవాడై యుండును. వాడు నిర్వికల్పుడని పేర్కొనబడును. [వానికి కేవలసువర్ణదర్శనముచేత కేయూరముయొక్క నామ రూపములు అంతరించుచున్నవి. ఒక విధముగ నున్న దానిని, మఱియొక విధముగ భావించుటయే, వికల్పము.]

**నానాత్వ మఖిలం త్యక్త్వా, శుద్ధచిన్మాత్ర కోటరే ॥ 35 ॥**
**సంవేద్యేన వినిర్ముక్తే, సంవిత్ తత్త్వే స్థిరో భవ ।**

**35-36.** శ్రీరామా! నానాత్వ భావమును సర్వమును పరిత్యజించి, (సర్వమును ఏకమగు బ్రహ్మస్వరూపముగ గాంచుచు,) కేవలశుద్ధచైతన్యస్వరూపమగు బ్రహ్మమను గహ్వరమున, సంవేద్య నిర్ముక్తమైన (జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయమను విభాగరహితమైన) ఆ సంవిత్తత్త్వమునందే (పరబ్రహ్మము నందే) సుస్థిరుడవై, విహరింపుము.

---

అధిష్ఠానరూపములైన, సువర్ణ, శుక్తి, రజ్జువుల జ్ఞానము వలన, కర్ణకుండల, రూప్య, సర్పములు, అదృశ్యములగుచున్నట్లే, అధిష్ఠానరూపమైన బ్రహ్మము వెలుగుట వలన, భ్రాంతిచే ఆ బ్రహ్మము నందు దోచుచున్న విశ్వము అదృశ్యమగుచున్నదని శంకరుడు బోధించును. బ్రహ్మవేత్తల బోధము, ఏకరస స్వరూపమని దీని వలన నిరూఢమగుచున్నది.

పదార్థజాతే సర్వస్మిన్, సంవిత్ సారతయా స్థితః । 36 ।
అఖిలం సంవిదేవేదం, జగన్నాఽన్యాఽస్తి కల్పనా ।

36-37. పదార్థ సముదాయము నందంతయు, సంవిత్తు (శుద్ధ చైతన్య రూపమగు బ్రహ్మము) సార రూపమున నున్నది. ఈ సకల ప్రపంచమును, కేవల సంవిద్రూపమే. అన్యకల్పన యేదియును ఇందు లేనే లేదు.

సంభవా దఖిలాకారైరేకస్యా ఏవ సంవిదః । 37 ।
సంవేద్య మపి నాస్త్యేవ, బన్ధమోక్షావతః కథమ్? ।*

37-38. ఏకరూపమగు సంవిత్తు, అఖిలజగదాకారమున నిండి యుండుట వలన, దానికి సంవేద్యము వేఱొకటి లేనే లేదు కదా! ఇక బంధమోక్షము లెట్లుండును?

మహాకర్తా, మహా భోక్తా, మహాత్యాగీ, భవాఽనఘ! । 38 ।
ఏతత్త్రయం పురా ప్రోక్తం, భృఙ్గీశాయ హి శమ్భునా ।
తత్తేఽహం సంప్రవక్ష్యామి, శ్రద్ధయా శృణు రాఘవ! । 39 ।

38-39. పాపరహితుడవగు శ్రీరామా! నీవు మహాకర్తవు, మహాభోక్తవు, మహాత్యాగివి కమ్ము. ఈ మూడు వ్రతములను పరమేశ్వరుడు పూర్వము భృంగీశునికి ఉపదేశించినాడు. రాఘవా! వానిని శ్రద్ధతో వినుము.

ఈశ్వర ఉవాచ :-

రాగద్వేషౌ సుఖం దుఃఖం, ధర్మాఽధర్మౌ ఫలాఽఫలే ।
యః కరోత్యనపేక్ష్యైవ, 'మహాకర్తా'స ఉచ్యతే । 40 ।

---

★ పోల్చు :- బృ.ఉ. IV-5-15 "యత్ర ద్వైతమివ భవతి" – ఇత్యాది. ద్వైతమున్నట్లు అయిననే, శబ్ద స్పర్శాదులగు ఇంద్రియవ్యవహారములు సంభవములు కాగలవు. సర్వమును బ్రహ్మమే అయినపుడు వ్యక్తి, దేని చేత దేనిని చూడగలడు? ... ఆఘ్రాణింపగలడు?... రుచి చూడగలడు?... మాట్లాడగలడు?.... ఎఱుగగలడు? దేనిచే ఈ సర్వమును ఎఱుగుచున్నాడో, ఆ పరతత్త్వమును దేని చేత ఎఱుగగలడు? "విజ్ఞాతార మరే కేన విజానీయాత్"? – అద్వయమగు బ్రహ్మము నందు సంవేద్యము వేఱొకటి ఎట్లుండగలదు? అని యాజ్ఞ వల్క్యుడు తన పత్ని యగు మైత్రేయికి ఉపదేశించెను.

40. ఈశ్వరుడు :- ఎవడు రాగద్వేషములు లేక, సుఖదుఃఖములను లక్ష్య పెట్టక, ధర్మాధర్మములను పాటింపక, సిద్ధి, అసిద్ధుల యందు హర్ష శోకములను పొందక, (అంతటను పరతత్త్వమునే గాంచుచు, నిష్కామ మానసమున లోకసంగ్రహార్థమై,) కర్తవ్యకర్మల నాచరించుచుండునో అతడు 'మహాకర్త' యనబడును.

సర్వత్ర విగతస్నేహో, యః సాక్షి వదవస్థితః ।
నిరిచ్ఛం వర్తతే కార్యే, 'మహాకర్తా' స ఉచ్యతే । 41 ।

41. సర్వదిగ్దేశ కాలములందును, అన్నిటను, స్నేహరహితుడై, సాక్షివలె నుండి, కర్తవ్యకర్మలను కేవలము విధియను భావమున ఫలాభిసంధి రహితముగ నాచరించుచుండు నతడు 'మహాకర్త' యనబడును.

జన్మస్థితివినాశేషు, సోదయాఽస్తమయేషు చ ।
సమ మేవ మనో యస్య, 'మహాకర్తా' స ఉచ్యతే । 42 ।

42. జన్మ, స్థితి, వినాశములందును, వృద్ధి, అపక్షయ సహితములగు శరీరము లందును, నిర్వికార సన్మాత్రాత్మ దర్శనము వలన, ఎవని మనస్సు సమముగా నుండునో అతడు 'మహాకర్త' యనడును.

సుఖై ర్దుఃఖైః క్రియా యోగై, ర్భావాఽభావై ర్భ్రమప్రదైః ।
న సంక్షుభ్యతి యో భుఙ్క్తే 'ర్మహాభోక్తా' స ఉచ్యతే । 43 ।

43. కర్మాచరణ సంబంధమున, సుఖము ననుభవించునపుడు గాని, దుఃఖము ననుభవించునపుడు గాని, జయాపజయములయందుగాని, (లేక, లాభ వ్యయములయందుగాని) భ్రాంతిదాయకములైన కలిమిలేముల ననుభవించునపుడు గాని, ఎవడు చిత్త సంక్షోభమును పొందక, నిర్వికార స్థితి యందుండునో, అతడు 'మహాభోక్త' యనబడును.

ఇదం భోజ్య మభోజ్యం చేత్యేవం త్యక్త్వా వికల్పనమ్ ।
గతాఽఖిలాశం యో భుఙ్క్తే, 'మహాభోక్తా' స ఉచ్యతే । 44 ।

44. ఇది, భుజింపతగినది; ఇది, అస్వాదువు, తిక్తము (చేదు) నగుటచే, భుజింపశక్యము కానిది - అనెడి వికల్పము (సందేహము)ను వీడి,

సమభావనతో కోర్కెల నన్నిటిని వీడ్కొని, ప్రాప్తము ననుభవించు నతడు 'మహాభోక్త' యనబడును.

ఆపదం సంపదం మోహం, మానన్ద మపరం, పరమ్*।
యో భుఙ్క్తే సమయా బుద్ధ్యా, 'మహాభోక్తా' స ఉచ్యతే ॥ 45 ॥

45 ఆపదలను, సంపదలను, భ్రాంతిని, అపకృష్టములగు కదన్న(చెడ్డకూడు) కదాచ్ఛాదనాదుల (హీనవస్త్రాదుల) వలని అసంతుష్టిని, ఉత్కృష్టదివ్యాన్న దివ్యాచ్ఛాదనాదుల వలని ఆనందమును, – అన్నిటిని, సమబుద్ధితో ననుభవించుచుండునో, అతడే 'మహాభోక్త'యనబడును.

ధర్మోఽధర్మో సుఖం దుఃఖం, తథా మరణజన్మనీ।
ధియా యేన పరిత్యక్తాః, 'మహాత్యాగీ' స ఉచ్యతే ॥ 46 ॥

46. ధర్మాధర్మములు, సౌఖ్యదుఃఖములు, అట్లే జనన మరణములు మొదలగు ద్వంద్వములు లేవని, ఎవడు నిరతిశయానందపూర్ణ అద్వయాత్మ బుద్ధిచే పరిత్యజించునో, అతడే 'మహాత్యాగి' యనబడును. (తన స్వస్వరూపమగు శుద్ధచైతన్యమున ప్రతిష్ఠితుడై యుండుటచేత, యోగి, సుఖదుఃఖాదిద్వంద్వములందు నిర్లిప్తుడు.)

సర్వేచ్ఛాః సకలాః శఙ్కాః సర్వేహాః సర్వనిశ్చయాః।
ధియా యేన పరిత్యక్తాః, 'మహాత్యాగీ' స ఉచ్యతే ॥ 47 ॥

47. సకలేచ్ఛలు, సకలసందేహములు, వాఙ్మనః కాయ జన్యములైన సకల చేష్టలు, సకలనిశ్చయములు, (ఫలాకాంక్షలు), లేవని బుద్ధిచే నెవడు వానిని పరిత్యజించునో, అతడే 'మహాత్యాగి' యనబడును.

యావతీ దృశ్యకలనా, సకలేయం విలోక్యతే।
సా యేన సుష్ఠు సన్త్యక్తా, 'మహాత్యాగీ' స ఉచ్యతే ॥ 48 ॥

48. ఎంత వఱకు ఈ దృశ్య ప్రపంచ కల్పన ముండునో, అంత వఱకు,

---

★ అవరమ్ – అపకృష్టం, కోద్రవాఽన్న, కదాచ్ఛాదనాది।
పరమ్ – ఉత్కృష్టం దివ్యాన్నాచ్ఛాదనాది।
(కోద్రవాన్నము – ఆరుకలతో చేసిన కూడు. కత్ –నింద్యము; హీనము.)

ఇది యంతయు కాన్పించుచుండును. దృశ్యప్రపంచకల్పనను సంపూర్ణముగా సమ్యగ్దర్శనముచే, పరిత్యజించిన వాడే 'మహాత్యాగి' యనబడును. [జ్ఞాతృజ్ఞేయము లున్నపుడే, జ్ఞానము సంభవమగుచున్నది. ఈ విభజనము, సర్వసంవేదనలకు - **కల్పనలకు**, మూలము. జ్ఞాతృ జ్ఞేయ జ్ఞాన రూపమగు త్రిపుటి నశించినంతనే, కేవలము, **నిరవధియు, అద్వయమునగు శుద్ధచైతన్యము**(సంవిత్తు) మాత్రమే మిగిలి యుండును.]

**ఇత్యుక్తం దేవదేవేన, భృఙ్గీశాయ పురాఽనఘ ! ।**
**ఏతాం దృష్టి మవష్టభ్య, తిష్ఠ రామ! గతజ్వరః । 49 ।**

**49.** పాపరహితుడా! శ్రీరామా! ఇట్లు పూర్వము, భృంగీశునకు దేవదేవుడగు పరమేశ్వరు డుపదేశించెను. శ్రీరామా! నీవును, ఈ దృష్టి నవలంబించి **మహాకర్తవు, మహా భోక్తవు, మహాత్యాగివినై— తాపరహితుడవై సుఖింపుము.**

---

**ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'చిన్మాత్ర స్థితి'ర్నామ ఏకోన త్రింశస్సర్గః ।**

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'చిన్మాత్ర స్థితి'యను
ఏకోనత్రింశత్తమ (ఇరువది తొమ్మిదవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే।



*ఓం నమః పరమాత్మనే।*

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## త్రింశసర్గము

## ఇక్ష్వాకూపాఖ్యానమ్ – ఇక్ష్వాకురాజు వృత్తాంతము

### 1. సంసార కారణమ్ః – దృశ్య ప్రపంచమునకు కారణము

వసిష్ఠ ఉవాచః–
గళితే వా గళద్రూపే చిత్తేఽహఙ్కారనామని।
కోప స్తనవ మాయాతి, మోహో మాన్ద్యం హి గచ్ఛతి॥ 1॥
కామోఽపి క్లాన్తతాం యాతి, లోభః క్వాఽపి పలాయతే।
న దుఃఖాని విలిమ్పన్తి, న వల్గన్తి సుఖాని చ॥ 2॥
సర్వత్ర సమతోదేతి, హృది శైత్యప్రదాయినీ।

1-3. వసిష్ఠుడుః– అహంకారనామకమగు చిత్తము నశింపగా, లేక, దాని రూప మంతరించుచుండగా, కోపము, క్షీణించుము, మోహము, బలహీనమగును. కామము సైతము, వాడిపోవుము. లోభము, ఎచటికో పలాయనమగును.

దుఃఖములు అంటవు. సుఖములును, లాస్యమాడవు (గంతులు వేయవు). అంతటను, హృదయమున, చల్లదనమును (తాప నివృత్తిని) ప్రసాదించు సమత్వము ఉదయించును.

భవతా మాది పురుష, ఇక్ష్వాకు ర్నామ భూపతిః । 3 ।
ఏకదా పృష్టవాన్ నత్వా, బ్రహ్మలోకాఽఽగతం మనుమ్ ।
"అస్య దృశ్యప్రపఞ్చస్య, కో హేతుః స్యా" దితి స్వయమ్ ॥ 4 ।

3-4. మీ వంశ మూలపురుషుడు, ఇక్ష్వాకుమహారాజు ★, ఒకప్పుడు, బ్రహ్మలోకము నుండి యేతెంచిన మనువునకు ప్రణమిల్లి, స్వయముగ "మహాత్మా! ఈ దృశ్య ప్రపంచమునకు హేతు వెయ్యది?" అని యిట్లు ప్రశ్నించినాడు.

మను రువాచ :-

యదిదం దృశ్యతే కిఞ్చిత్, తన్నాఽస్తి నృప! కిఞ్చన ।
మరుస్థలే యథావారి, ఖే వా గన్ధర్వ పత్తనమ్ । 5 ।

5. మనువు :- రాజా! దేహాద్యమగు ఈ దృశ్యమంతయు (కనబడుచున్న దంతయు) మరుభూమి (ఎడారి) యందు దోచు జలము (మరుమరీచిక)

★ వివస్వంతుడు (సూర్యుడు), మనువు, ఇక్ష్వాకువు – వీరు ప్రాగైతిహాసిక కాలము (Prehistoric period) నకు చెందిన దేవాంశసంభూతులగు ఆది రాజన్యులు. సనాతనమైన మోక్షఫలప్రదమైన పూర్ణయోగమును ఆదికర్తయగు భగవంతుడు, నారాయణుని నుండి వివస్వంతుడు గ్రహించి, దానిని మనువునకు బోధించెను. మనువు తన పుత్రుడును, సూర్య వంశమున ఆదిరాజన్యుడైన ఇక్ష్వాకు మహారాజున కుపదేశించెను. ఇక్ష్వాకువు వలన, పిదప, నీ యోగము సకల లోక వ్యాప్తిని పొందినది. 'ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్' (భ.గీ. IV-1,2)
"త్రేతాయుగాదౌ చ తతో, వివస్వాన్ మనవే దదౌ ।
మనుశ్చ లోకభృత్యర్థం, సుతా యేక్ష్వాకవే దదౌ ॥
ఇక్ష్వాకుణా చ కథితో వ్యాప్య లోకా నవస్థితః ।
గమిష్యతి క్షయాన్తే చ పున ర్నారాయణం నృప ।" [మ.భా. శాంతి – 348–51,52]
త్రేతాయుగ ఆరంభమున కంటె అత్యంతపూర్వమున, సృష్ట్యాదిని, బ్రహ్మ యొక్క మనస్సంకల్పము వలన జనించిన పరమర్షి వసిష్ఠుడు బోధించిన ఈ (యోగవాసిష్ఠ మందలి) పరమ ప్రబోధమును, గురుపరంపరాక్రమమున రాజర్షులు పొందిన జ్ఞానమును ఒక్కటే. గౌతమ బుద్ధుడు, మహావీరుడు, శంకరుడు, రామానుజుడు మొదలగు మహాత్ములందఱును, సనాతనమైన ఈ పరమ జ్ఞానమునే పునః ప్రబోధ మొనర్చి స్థాపించినారు. ఈ జ్ఞానము నూతనముగ నుత్పాదించినది కాదు. భూత భవిష్యద్వర్తమాన కాలము లందిది నిర్వికల్పముగ నేకరూపమై యున్నది.

వలె, ఆకాశమున దోచు గంధర్వనగరము వలెను, వాస్తవముగ నాకింతైనను లేనిదియే యైనను, ఉన్నట్లు దోచుచున్నది.

**మనః షష్ఠేన్ద్రియాఽతీతం, యత్తు నో దృశ్యతే క్వచిత్ ।**
**అవినాశం తదస్తీహ, తత్ సదాత్మేతి కథ్యతే ॥ 6 ॥**

6. శ్రోత్రాదులైన ఐదింద్రియములకును, మనస్సునకును – ఈ ఆఱింటికిని-గోచరము కాక, అతీతమై, ఎప్పటికిని నశింపక (అవినాశియై) యేది యున్నదో దానినే సత్తనియు, ఆత్మయనియు నందురు.

**ఇయం తు సర్వదృశ్యాఽఽఢ్యా, రాజన్! సర్గపరమ్పరా ।**
**తస్మిన్నేవ మహాఽఽదర్శే, * ప్రతిబిమ్బ ముపాగతా ॥ 7 ॥**

7. రాజా! వివిధదృశ్యభేదములతో పూర్ణమగు ఈ సృష్టిపరంపర యంతయును, బ్రహ్మమను మహా దర్పణము నందే, ప్రతిబింబత్వము నొంది తోచుచున్నది. దానికి స్వతఃసత్త్వము లేదు.

**సఙ్కల్పోన్ముఖతాం యాతా, శ్చిన్మాత్రసంవిదో యదా ।**
**తదా జీవత్వ మాయాన్తి, యథా హ్యప స్తరఙ్గతామ్ ॥ 8 ॥**

8. ఆ యా సంస్కారవైచిత్రితోడి అవిద్య యందు ప్రతిబింబ రూపములైన చిన్మాత్రసంవిత్తులు, అంతఃకరణత్వముచే సంస్కారముల పరిణామము

---

★ పోల్చు :- "విశ్వం దర్పణ దృశ్యమాన నగరీతుల్యమ్ !" .... ।
(శంకరుడు – దక్షిణామూర్తి స్తోత్రమ్ – 1)

"అన్తరస్మిన్నిమే లోకా, అన్తర్విశ్వమిదం జగత్ ।
బహిర్వన్మాయయాఽఽభాతి దర్పణే స్వశరీరవత్ " ।
(మానసోల్లాసము –7– సురేశ్వరుడు)

లోకములన్నియు, పరమాత్మ యందే యున్నవి. జగత్తంతయు పరమాత్మలోనే యున్నది. మాయ వలన, దర్పణమున దోచు స్వశరీరమట్లు, బాహ్యమున నున్నట్లు దోచుచున్నది.

మఱియు:- "యథైవాఽఽదర్శ మధ్యస్థే రూపేఽన్తః పరితస్తు సః ।
తథైవాఽస్మిన్ శరీరేఽన్తః పరితః పరమేశ్వరః ॥" (అష్టావక్ర సంహిత -I-19)

దర్పణ మధ్యమున ప్రతిబింబించి దోచు రూపమునకు లోపల, బయటను దర్పణమున్నట్లే, ఈ శరీరమునకు లోపల, బయటను పరమేశ్వరుడున్నాడు. దర్పణ మందలి ప్రతిబింబము వాస్తవమున సత్తా శూన్యము; కేవలము దృశ్యము. దర్పణము మాత్రమే సత్యమని భావము. మనో దేహేంద్రియాదుల సత్త్వము (ఉనికి), సత్యము కాదు.. ఆత్మయందు కేవలము అధ్యారోపము వలననే, అవి, ఉన్నట్లు తోచుచున్నది. ప్రతిబింబము వలన దర్పణ మేవికృతిని పొందనట్లే, మనోదేహేంద్రియాదుల వలన, ఆత్మ, ఏ వికృతిని పొందదు.

నందు, అవచ్ఛిన్నములై (విభక్తములై) సంకల్పోన్ముఖములై, జలము, తరంగత్వము బొందు రీతి, జీవభావమును పొందుచున్నవి.

**సుఖదుఃఖదశా మోహో, మనస్యేవాఽస్తి నాఽఽత్మని ।**
**న శాస్త్రై ర్గురుణా వాఽపి, దృశ్యతే పరమేశ్వరః ॥ 9 ॥**
**దృశ్యతే స్వాత్మనైవాఽఽత్మా, స్వయా సత్త్వస్థయా ధియా ।**

9-10. సుఖదుఃఖావస్థలు, మోహము (భ్రాంతి) మనస్సు నందే యున్నవి గాని, ఆత్మ యందు లేవు. అధ్యాత్మశాస్త్రవిచారములచేతను, గురువుల బోధచేతను, పరమేశ్వరుడు (ఆత్మ) సాక్షాత్కరింపడు. దేహేంద్రియాదులందు, అహంకారమమకారరహితమైన, సత్త్వగుణసంస్థితమైన, ప్రసన్నమైన, తన బుద్ధి చేతనే, తనంతనే, మనుజుడు ఆత్మ సాక్షాత్కారమందుచున్నాడు.

**దేహోఽహ మితి యా బుద్ధిః, సా సంసార నిబన్ధినీ ॥ 10 ॥**
**న కదాచిదియం బుద్ధి, రాదేయా హి ముముక్షుభిః ।**

10-11. 'ఈ దేహమే నేనను బుద్ధియే, సంసారబంధహేతువు. ఈ బుద్ధి, మోక్షార్థులకు ఉపాదేయమెపుడును కాదు. 'నేనెప్పుడును దేహాదికమును కాను; పరమాత్మను, జ్ఞానస్వరూపుడ'నను బుద్ధియే ముముక్షువులకు ఆదేయము (గ్రహింపదగినది). ఇదియే సంసారమును ధ్వంస మొనర్చును.

**సన్నివేశాంశ వైచిత్ర్యం, యథా హేమ్నోఽఙ్గదాదితా[1] ॥ 11 ॥**
**ఆత్మన స్తదతద్రూపా, తథైవ జగదాదితా ।**

11. సువర్ణము యొక్క సన్నివేశాంశ వైచిత్ర్యమే, బాహుపురులు మొదలగు నగల రూపమును బొందుచున్నట్లు, జగదాదికమగు రూపమంతయు కేవలము పరమాత్మ యొక్క సన్నివేశ మాత్రమే. కాని, ప్రపంచ రూపము సత్యము కాదు.

[సన్నివేశాంశ వైచిత్ర్యము – అనేక అంశభేదముల కలయిక]

**కుచకోటరసంసుప్తం, విస్మృత్య జననీ సుతమ్.[2] ॥ 12 ॥**

---

(1) 'యథా అఙ్గదాద్యాకారతా హేమ్న ఏవ సన్నివేశాఽవయవ విన్యాస వైచిత్ర్యం, తద్వదాత్మనోఽపి జగత్తన్మాత్రమాయారూపే ఇత్యర్థః ।' (యో.వా.తా.ప్ర.)

(2) పోల్చు :- "మోహమాత్రా దలబ్ధస్య లాభవత్సా,
స్వాత్మనః కంఠచామీకర న్యాయతః ।
బోధమాత్రం తదాక్రమ్య యస్మా చ్ఛ్రుతిః ।
ప్రాహ భూయః పదేనాఽమ విద్దేదితి ।" (స్వారాజ్య సిద్ధిః -III – కైవల్య – 14)

యథా రోదితి పుత్రాఽర్థం, తథాఽఽత్మార్థ మయం జనః ।

**12-13.** వక్షోజమధ్యమున పరుండి నిద్రించుచున్న పుత్రుని మఱచి, పుత్రార్థమై శోకించు తల్లి వలె, స్వస్వరూపమున నున్న పరమాత్మను మఱచి, జనులు దానికై పరితపించుచున్నారు.

అజరామర మాత్మాన మబుధ్వా పరిరోదితి ॥ 13 ।
'హా! హతోఽహ మనాథోఽహం నష్టోఽస్మీ'తి వపుఃక్షయే ।

**13-14.** జరామరణరహితమగు ఆత్మ నెఱుగక, శరీరము నశించినంతనే 'అయ్యో! నేను హతుడను, అనాథుడను, నేను మరణించుచున్నా'నని, మనుజుడు శోకించుచున్నాడు.

అనాత్మన్యాత్మతా మస్మిన్, దేహాఽదౌ దృశ్యజాలకే ॥ 14 ।
త్యక్త్వా సత్త్వ(1) ముపారూఢో, గూఢ(2) స్తిష్ఠ యథా సుఖమ్ ।

---

భ్రాంతి వలన తన కంఠమందే యున్న స్వర్ణమాలను మఱచి, అది పోయినదని మనుజుడు విచారించునట్లు, నిత్యసిద్ధమై, స్వస్వరూపమున నున్న ఆత్మను మోహవశమున అలబ్ధముగా భావించుచు మూఢుడు, దుఃఖించును. జ్ఞానోదయమున (స్వస్వరూపమున నిత్యసిద్ధమగు) ఆత్మ, క్రొత్తగా తనకు లభించినట్లు సంతసించును. అందువలననే, శ్రుతి, జ్ఞానము నుపదేశించి, మరల, పదము (గుఱుతు)చే ఆత్మను తెలియవలెనని చెప్పుచున్నది. తన పైట క్రింద పరుండి నిద్రించుచున్న చంటిపాపను మఱచి, దాని కొఱకై శోకించు తల్లియు, ఈ విషయమున దృష్టాంతమగుచున్నది.

(1) "తత్ర సత్త్వం నిర్మలత్వాత్ ప్రకాశక మనామయమ్ ।". (భ.గీ. XIV.6)
సత్త్వగుణము [స్ఫటిక మణివలె]
నిర్మలమును, శాంతమును, ప్రకాశస్వభావమునై యున్నది.
"సర్వభూతేషు యేనైకం, భావ మవ్యయ మీక్షతే ।
అవిభక్తం విభక్తేషు, తద్జ్ఞానం విద్ధి సాత్త్వికమ్ ।" (భ.గీ.XVIII-20)
సర్వభూతములందును అద్వైతాత్మ దర్శనజ్ఞానము సాత్త్వికమని గ్రహింపుము.
"విశుద్ధ సత్త్వస్య గుణాః ప్రసాదః,
స్వాఽఽత్మాఽనుభూతిః, పరమా ప్రశాన్తిః ।
తృప్తిః, ప్రహర్షః, పరమాత్మనిష్ఠా,
యయా సదాఽఽనన్దరసం స మృచ్ఛతి ।" (శంకరుడు – వివేక చూడామణి 121)
ప్రసన్నత, స్వాత్మానుభవము, పరమప్రశాంతి, నిత్యతృప్తి, నిరతిశయానందము, పరమాత్మ నిష్ఠ, అనునవియే శుద్ధ సత్త్వము యొక్క లక్షణములు. దీని వలన సచ్చిదానంద రసానుభూతి సిద్ధించును.

(2) గూఢ = ఆచ్ఛాదితుడు, నిలీనుడు, నిభృతుడు.
విషయప్రపంచమును విస్మరించి, పరమాత్మ యందు విలీనుడైయుండుట యీశబ్దము సూచించుచున్నది.

**14-15.** అనాత్మయగు దేహాదిదృశ్యజాలమున, ఆత్మాఽఽరోపణమును (ఆత్మయను భావమును) విసర్జించి, సత్త్వమున ఆరూఢుడవై, పరమాత్మ యందు నిలీనుడవై సుఖింపుము.

**సర్గాఽఽత్మభి ర్విభుః స్పన్దైః క్రీడతే బాల★ వత్స్వయమ్ ॥ 15 ॥**
**సంహారాఽఽత్మక శక్త్యాఽథ, సంహృత్యాఽత్మని తిష్ఠతి ।**

**15-16.** సర్వగతుడగు **పరమాత్మ**, అజ్ఞానుల విషయమున సృష్టిస్వరూపములైన స్పందనల(చలనముల)తో, స్వయముగ **బాలుని లీల** క్రీడించుచున్నాడు. **ప్రసవ ధర్మిణియగు అవిద్యాశక్తితో**, సృష్టి(సంసార) రూపస్పందనలతో ఆ పరమాత్మ **క్రీడించుచున్నాడు.** అంతమున, జ్ఞానుల విషయమున, తత్సంహారాత్మికయగు **విద్యాశక్తితో**, సృష్టిని సమూలముగ ఉపసంహరించి, కూటస్థము, అద్వయమునైన, **స్వరూపమున** నిత్యము నెలకొని యున్నాడు. [అజ్ఞానదృష్టికి సృష్టిరూపసంసారము దోచుచున్నను, జ్ఞానదృష్టికి సదా కూటస్థము, అద్వయమునైన పరమాత్మయే తోచుట అనుభవసిద్ధము.]

**అహో! ను చిత్రా మాయేయం, తాత! విశ్వవిమోహినీ ॥ 16 ॥**
**సర్వాఙ్గప్రోత మప్యేతం, యదాత్మానం న పశ్యతి ।**

**16-17.** ఆహా! కుమారా! విశ్వవిమోహిని యగు మాయ విచిత్రమైనది. అవయవ

---

★ **"లోకవత్తు లీలా కైవల్యమ్ ।"** (బ్ర.సూ.II-1-33)
మనుజునకు ఉచ్ఛ్వాసాదులు స్వభావము చేతనే ఉత్పన్నములగుచున్నట్లు, బ్రహ్మమునకు సైతము విచిత్ర కార్యరచన (సృష్టి) లీలా కైవల్యము – కేవల లీలా మాత్రము; ఫల సాపేక్షము కాదు. నిత్య తృప్తుడైన పరమాత్మకు, జగజ్జన్మ స్థితి లయ కార్యములు, లీలా మాత్రములేయని బ్రహ్మసూత్రకర్త బాదరాయణ మహర్షి (వ్యాసర్షి) స్థాపించును.
మఱియు, **"వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వా త్తథా హి దర్శయతి ।"** (బ్ర.సూ. II.1-34)
బ్రహ్మము యొక్క ప్రవృత్తి, జీవుల కర్మములను అపేక్షించుటచే, పాక్షికత్వ నిర్దయత్వములు, బ్రహ్మమునకు ప్రసక్తింపవు. మఱియు శ్రుతియు నట్లే చూపుచున్నది కదా!
(చూడుః- బ్రహ్మసూత్రము – పుటలు 608 – 611 – డా॥ రత్నాకరం బాలరాజు 1971. ఆధ్యాత్మ విద్యా గ్రంథ రత్నమాల. సాకేత నిలయం, (21, S.B.I. Colony) అనంతపురం (ఆం.ప్ర.)

ప్రాయములగు బాహ్యాధ్యాత్మికభావములందన్నిటను లోపల, బయటను, వ్యాప్తమై యున్న స్వప్రకాశమగు ఆత్మను, మనుజుడు, కాంచుటలేదు; అప్రకాశమగు జగత్తును మాత్రమే, స్ఫుటముగ, అఘటితఘటనాసామర్థ్యము గల ఈమాయాబలముననే కాంచుచున్నాడు.

ఇదం రమ్య మిదం నేతి, బీజం తద్దుఃఖ సన్తతేః । 17 ।
తస్మిన్ సామ్యాఽగ్నినా దగ్ధే, దుఃఖస్యాఽవసరః కుతః ?।

17-18. 'ఇది మనోజ్ఞమైనది. ఇది మనోజ్ఞము కాదు' - అను తలపే, (వైషమ్య కల్పనమే) సమస్తదుఃఖపరంపరకును మూలము. (బీజము) ఈ ద్వైతభావము దుఃఖావహము కాన, సామ్యాగ్ని (సమత్వభావన యను అగ్ని)చే, ఇది దగ్ధమైనంతనే, ఇక దుఃఖమునకు అవసరమెక్కడిది?

**2. యోగభూమికాః** – యోగము నధిరోహించుటకు సప్త సోపానములు, లేక, పరమాత్మైక్య సిద్ధికి సాధనములు

శాస్త్ర సజ్జనసంపర్కైః, ప్రజ్ఞా మాదౌ వివర్ధయేత్ । 18 ।
ప్రథమా భూమికైషోక్తా, యోగస్య నవయోగినః ।
విచారణా ద్వితీయాస్యాత్, తృతీయాఽ సఙ్గభావనా । 19 ।

18-19. శాస్త్ర విచారము, సజ్జన సంగతి, మొదలగు ఉపాయములచే మొదట, బుద్ధిని అభివృద్ధి నొందించుకొనవలయును. ఇది, నూతనముగ యోగము నభ్యసించు సాధకులకు ప్రథమ భూమిక యని చెప్పబడినది. 'విచారణ' యనునది ద్వితీయభూమిక. 'అసంగభావన' యనునది తృతీయ భూమిక.

విలాపనీ చతుర్థీ స్యా ద్వాసనా విలయాత్మికా ।
శుద్ధసంవిన్మయాఽఽనన్దరూపా భవతి పఞ్చమీ । 20 ।
అర్ధ సుప్త ప్రబుద్ధాఽఽభో, జీవన్ముక్తోఽత్ర తిష్ఠతి ।

20-21. సర్వవాసనలను నశింపజేసికొనుటయే 'విలాపని' యను చతుర్థ(నాల్గవ) భూమిక. శుద్ధచైతన్యానందానుభవరూపమగు సమాధ్యవస్థ, పంచమ భూమిక. దీని నారోహించిన వాడు నిద్రింపకయు, నిద్రించు వాని వలె,

సర్వవ్యవహార పరుడయ్యును, ఏమియు జేయని వాని వలె, నుండు జీవన్ముక్తుడు. [మేల్కొని యున్నను ఈతని బుద్ధి అంతర్ముఖమై, నిద్ర యందు వలె, పరమవిశ్రాంతిని పొంది యుండును. సగము నిద్ర, సగము మెలకువ గల వాని వలె, ఈ భూమిక యందు యోగి యుండును.]

స్వసంవేదనరూపా చ, షష్ఠీ భవతి భూమికా । 21 ।
ఆనన్దైక ఘనాకారా, సుషుప్త సదృశస్థితిః ।
తుర్యాఽవస్థోపశాన్తాఽథ, ముక్తి రేవేహ కేవలమ్ । 22 ।

21-22. నిర్విషయమైన శుద్ధజ్ఞప్తి రూపమున స్వస్వరూపము నెఱుగుటయే, (బ్రహ్మాకారానుభవవృత్తి రూపము) షష్ఠ (ఆఱవ) భూమిక. ఇది కేవల పరమానంద ఘన రూపమై, సుషుప్త సదృశమైన స్థితి; శాంతరూపము. ఇదియే తుర్యావస్థ. ఇచట నిది, కేవలము ముక్తి (జీవన్ముక్తి) యే.

సమతా స్వచ్ఛతా సౌమ్యా, సప్తమీ భూమికా భవేత్ ।
తుర్యాఽతీతా తు యాఽవస్థా, పరా నిర్వాణరూపిణీ । 23 ।
సప్తమీ సా పరిప్రౌఢా, విషయః స్యా న్న జీవతామ్ ।

23-24. ప్రియదర్శనా! సర్వసమత్వము (బ్రహ్మైక్యము) నిర్మలత్వము, సౌమ్యము, ననునవియే, సప్తమ (ఏడవ) భూమిక. ఇదియే తుర్యాతీతాఽవస్థ. పరమైన నిర్వాణరూపము. ఇది మిగుల ప్రౌఢమైనచో, విదేహముక్తి సంభవించును. ఇది జీవించి యుండు యోగుల విషయము కాదు.

పూర్వాఽవస్థాత్రయం త్వత్ర, జాగ్రదిత్యేవ సంస్థితమ్ । 24 ।
చతుర్థా స్వప్న ఇత్యుక్తా, స్వప్నాఽఽభం యత్ర వై జగత్ ।
ఆనన్దైక ఘనీభావాత్, సుషుప్తాఽఽఖ్యా తు పఞ్చమీ । 25 ।

24-25. ఇందు మొదటి మూడు భూమికలును, జాగ్రదవస్థా రూపములై యున్నవి. నాల్గవభూమిక స్వప్నరూపమని చెప్పబడినది. ఇందు జగత్తు, స్వప్నతుల్యముగా భాసించును. కాని, ఆనంద ఘనమగు పరమాత్మతో ఐక్యమంది యుండుట వలన, పంచమ (ఐదవ) భూమిక, సుషుప్త్యవస్థ

యని పేర్కొనబడినది. ఇందు జగ త్తనునదియే యుండదు.

అసంవేదన రూపాఽథ, షష్ఠీ తుర్య పదాఽభిధా ।
తుర్యాఽతీత పదాఽవస్థా, సప్తమీ భూమి కోత్తమా ॥ 26 ।
మనోవచోభి రగ్రాహ్యా, స్వప్రకాశపదాత్మికా ।

26-27. అట్లే, విషయ (పదార్థ) సంవేదనా శూన్యమైన షష్ఠభూమిక, తుర్యపదమని (తురీయావస్థ యని) పేర్కొనబడినది. ఇది, నిర్విషయమగు స్వస్వరూపస్థితియే. తుర్యాతీత పదావస్థ, ఉత్తమమైన సప్తమ భూమిక ఇది స్వప్రకాశ (పరమాత్మ) పద స్వరూపమగుటచే, మనోవాక్కులకు అగ్రాహ్యమగుచున్నది. మనస్సుచే నూహించుటకు గాని, వాక్కుతో చెప్పుటకు గాని అనువు గానిది. ఇందు ప్రత్యగాత్మయందు, సర్వ దృశ్యముల యొక్క సంపూర్ణ విలయము సంభవించుచున్నది.

ప్రత్యాఽహృతివశా దస్త శ్చేత్యం చేన్న విభావితమ్ ॥ 27 ।
ముక్త ఏవాఽస్త్యసన్దేహో, మహాసమతయా తయా ।

27-28. ప్రత్యగాత్మ యందు, సర్వ దృశ్య విలయము సంభవించుటచే, చేత్యము (జ్ఞేయ విషయము) భాసింపనందువలన, సప్తమ భూమికా ప్రసిద్ధమైన ఈ మహాసమత్వము చేత, యోగి, కేవలము ముక్తుడే యగును; ఇందు సందేహ మేదియు లేదు. ఇది ఆత్యంతికమైన జీవన్ముక్తావస్థ.

యద్భోగ సుఖదుఃఖాంశై రపరామృష్ట పూర్ణధీః ॥ 28 ।
ఆత్మారామో వర త్తిష్ఠేత్, తన్ముక్తత్వ ముదాహృతమ్ ।
ఇత్యుక్త్వా దయయా ప్రాహ, మను రిక్ష్వాకవే పునః ॥ 29 ।

28-29. ఎందు, సుఖదుఃఖభేదములగు భోగ (అనుభవ)ములచే, లేశమైనను స్పృశింపబడని పరిపూర్ణబుద్ధియై, ఆత్మారాముడవై, మనుజు డుండునో, ఆ స్థితియే ముక్తత్వమని చెప్పబడును. అని, మనువు, ఇక్ష్వాకు నృపతికి దయతో మరల నిట్లు బోధించెను.

### 3. బ్రహ్మతాఽవాప్తిః - బ్రహ్మత్వ ప్రాప్తి

వ్యవహర్త్యుపశాన్తో వా, గృహస్థో వాఽథవా యతిః ।
సశరీరోఽశరీరో వా, భవత్యేవ మ్మతిః పుమాన్ । 30 ।

అహమ్మత్యాదిహీనశ్చ*, శుద్ధో బుద్ధోఽజరాఽమరః ।
శాన్తః సమసమాఽఽభాస, ఇతి మత్వా న శోచతి । 31 ।

30-31. సర్వకార్యములు చేయువాడైనను, చేయనివాడైనను, గృహస్థుడైనను, యతియైనను, సశరీరుడైనను, అశరీరు (శరీరాభిమానరహితు) డైనను, అహమ్మత్యాదిశూన్యుడైన మనుజుడు, "నేను శుద్ధుడను, బుద్ధుడను, జరామరణరహితుడను, శాంతుడను, సర్వత్ర సమముగ ఆకాశసదృశుడనై, భాసించు చున్నవాడనని భావించి, దేనికిని శోకింపడు.
[★అహమ్+మతి+ ఆదిహీనః - 'నేను' అను భావాదులు లేనివాడు]

బద్ధవాసన మర్థో యః, సేవ్యతే సుఖయత్యసౌ ।
యత్సుఖాయ తదేవాఽఽశు, వస్తు దుఃఖాయ నాశతః । 32 ।

32. వాసనావశత్వమున ఎవడే వస్తువును సేవించునో, అది అతనికి సుఖమును కల్గించును. కాని, సుఖకారణమైన ఆ వస్తువే, నశించిపోవుట వలన వెంటనే దుఃఖమును కల్గించుచున్నది.

అవినాభావ నిష్ఠత్వం, ప్రసిద్ధం సుఖదుఃఖయోః ।
తనువాసన మర్థో యః, సేవ్యతే వా వివాసనమ్ । 33 ।
నాఽసౌ సుఖాయతే నాఽసౌ, నాశకాలే చ దుఃఖదః ।

33-34. సుఖదుఃఖములకు అవినాభావనిష్ఠత్వము (సహావస్థితినియమము - ఎడబాటు లేకుండుట యను నియమము) ప్రసిద్ధము కదా! క్షీణవాసన (అత్యల్పమగు నభిమానము)తో గాని, వాసనారహితముగ కాని, ఎవడే వస్తువును సేవించునో, ఆ వస్తువు అతనికి సుఖమునుగాని, నాశకాలమున దుఃఖమును గాని కలిగింపదు.

క్షీణవాసనయా బుద్ధ్యా, కర్మ యత్ క్రియతేఽనఘ! । 34 ।
తద్దగ్ధ బీజవద్భూయో, నాఽఙ్కురం ప్రవిముఞ్చతి ।

**34-35.** పాపరహితుడా! శ్రీరామా! వాసనా రహితమైన బుద్ధితో నొనరించిన కర్మము, దగ్ధ బీజము (వేచిన గింజ) వలె, మఱి అంకురింపదు. (అట్టి కర్మము, పునర్జన్మహేతువు కాదు.)

**క్రియమాణా, కృతా, కర్మతూలికా దేహశాల్మలేః । 35 ।**
**జ్ఞానాఽనిల సముద్ధూతా, ప్రోడ్డీయ క్వాఽపి గచ్ఛతి ।**

**35-36.** దేహమనెడి **శాల్మలీవృక్షము** (బూరుగుచెట్టు)నకు, ఇపుడు ఆచరింపబడు చున్నవియు, ఆచరింపబడినవియు నగు **కర్మములు, దూది వంటివి.** అవి, **జ్ఞాన**మనెడి గాలిచే నెగురగొట్టబడి, పైకెగిరి ఎచటికో పోవును.

**సర్వైవ హి కళా జన్తోః, రనభ్యాసేన నశ్యతి । 36 ।**
**ఏషా జ్ఞానకళా త్వన్తః, సకృజ్జాతా దినే దినే ।**
**వృద్ధి మేతి బలాదేవ, సుక్షేత్ర వ్యుప్త బీజవత్ । 37 ।**

**36-37.** జనులకు, కళలు (విద్యలు) అన్నియు, అభ్యాసము చేయనిచో, నశించుచున్నవి కదా! కాని, జ్ఞానకళ (బ్రహ్మవిద్య) మాత్రము, ఒక మాఱు అంతరంగమున నుదయించినచో, **సుక్షేత్రమున నాటిన బీజము (విత్తనము) వలెనే,** దృఢముగ దినదినాభివృద్ధిని గాంచును; నశింపదు.

**యావద్విషయ భోగాఽఽశా, జీవాఽఽఖ్యా తావదాత్మనః ।**
**అవివేకేన సంపన్నా, సాఽప్యాశా హి న వస్తుతః । 38 ।**
**వివేకవశతో యాతా, క్షయ మాశా యదా తదా ।**
**ఆత్మా జీవత్వ ముత్సృజ్య, బ్రహ్మతా మేత్యనామయః । 39 ।**

**38-39.** విషయ భోగములందాశ యున్నంత వఱకు, ఈ ఆత్మకు, జీవనామము తప్పదు. విచారించి చూచిన, ఈ ఆశయు, అవివేక (అజ్ఞాన) వశముననే కల్పితము కాని, ఆత్మకు స్వాభావికము కానే కాదు. **వివేక (జ్ఞాన) వశమున ఆశ నశించినంతనే, జీవుడు తన జీవత్వమును త్యజించి, నిర్వికారుడై, (దుఃఖరహితుడై,) బ్రహ్మమే యగుచున్నాడు.**

**చిన్మాత్రత్వం ప్రయాతస్య, తీర్ణమృత్యో రచేతసః ।**
**యో భవే త్పర మానన్దః, కేనాఽసా వుపమీయతే ? । 40 ।**

**40.** చిన్మాత్రత్వము (బ్రహ్మత్వము)ను పొంది, మృత్యువు నతిక్రమించి,

మనో నాశ మొందిన వానికి కల్గు స్వప్రకాశ పరమానందమును , దేనితో పోల్పగలము? (అది నిరుపమానము).

ఏతత్స్వరూప మాసాద్య, ప్రకృతిః పరిశామ్యతి ।
అహఙ్కృతే ర్విమోహస్య, క్షయేణేయం విలీయతే ॥ 41 ॥
ప్రకృతి ర్భావనానామ్నీ[1], మోక్షః స్యాదేష ఏవ సః ।

41-42. ఆత్మ యొక్క పారమార్థికమగు పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించుకొని, ప్రపంచమునకు ఉపాదానకారణమగు ప్రకృతి, అంతరించుచున్నది. అహంకారము యొక్క విమోహము (భ్రాంతి) నశించినంతనే, ఇది, విలయమందుచున్నది. చరమసాక్షాత్కార వృత్తి ఉదయింపగా, తన్నామకమగు స్వాభావిక ఆత్మస్వరూప (ప్రకృతి) ప్రాప్తియే, మోక్షము.

## 4. జీవన్ముక్త స్థితిః – జీవన్ముక్తావస్థ

యేనకేన చిదాచ్ఛన్నో, యేనకేనచిదాశితః ॥ 42 ॥
యత్ర క్వచన శాయీచ,[2] స సమ్రాడివ రాజతే ।

(1) ప్రకృతిః – స్వాభావిక ఆత్మస్వరూపమ్ ।
భావనానామ్నీ :– భావనా, అనాది విస్మృత స్వరూప ప్రతి సంధానం, చరమ సాక్షాత్కార వృత్తిః, తదను ప్రవేశాత్ తన్నామ్నీ సాక్షాత్కారాఽభిధా యదా భవతి తదా ఏష ప్రసిద్ధః ప్రత్యగాత్మా ఏవ స శాస్త్రప్రసిద్ధో మోక్షః స్యాదిత్యర్థః ।
(యో.వా.తా.ప్ర. ఆనంద బోధేంద్ర సరస్వతి)
పరబ్రహ్మసాక్షాత్కారమున, ప్రపంచఉపాదాన (సంస్కార) కారణమైన ప్రకృతి క్షయింపగా అనాదిగా విస్మరింపబడిన స్వాభావికాత్మ స్వరూప భావన – (చరమ సాక్షాత్కార వృత్తితో ప్రతి సంధానము) కల్గుచున్నది., ఇదియే మోక్షమని యో.వా. తాత్పర్య ప్రకాశము వివరించును.

(2) పోల్చు :–
"యేనకేనచిదా చ్ఛన్నో, యేనకేన చిదాశితః ।
యత్ర క్వచన శాయీ స్యాత్, తం దేవా బ్రాహ్మణం విదుః ॥"
"నిరాశిష మనారమ్భం, నిర్నమస్కార మస్తుతిమ్ ।
నిర్ముక్త బన్ధనైః సర్వైస్తం దేవా బ్రాహ్మణం విదుః" (మ.భా. శాంతి – 245 – 12, 24)
మ.భా. శాంతి – మోక్ష దర్మ పర్వమున (245 అధ్యాయమున) వ్యాస మహర్షి తన పుత్రుడగు శుకునకు జ్ఞానవంతుడైన భిక్షులక్షణములను వివరించును. అట్టి విశిష్టలక్షణసంపన్నుడు ప్రజ్ఞాతృప్తుడు, నిర్భయుడు, అనికేతనుడైన వానిని దేవతలు బ్రాహ్మణు డందురని వ్యాసర్షి, బ్రాహ్మణ సమగ్ర లక్షణములను వర్ణించినాడు. యోగవాసిష్ఠ మందలి జీవన్ముక్త లక్షణములును ఇట్టివే. ఉపనిషద్గీతాధమ్మపదాది మోక్షసంహితలన్నియు నిట్లే జీవన్ముక్తుల లక్షణములను వర్ణించినవి. మఱియు చూడు ధమ్మపదం – 416 గాథ.

**42-43.** బాహ్యమగు సర్వస్వమును త్యజించి యున్నను, ప్రారబ్ధవశమున జనులొసగిన బొంతను గాని, పట్టు వస్త్రమును గాని, ఏది ధరించినను, అతులమృష్టాన్నమైనను, శుష్కాన్నమైనను, ఏది భుజించినను, మృదుతల్పమున గాని, కటిక నేలపై గాని, ఎందు శయనించినను, ఆంతరమగు స్వానందామృత తృప్తుడై జీవన్ముక్తుడగు జ్ఞాని, సర్వోత్తమ సుఖశాలియై, సమ్రాట్టు వలె విరాజిల్లును.

**(సర్వ) వర్ణ ధర్మాఽఽశ్రమాచార శాస్త్ర యన్త్రణ యోజ్ఝి*తః । 43 ।**
**గమ్భీరశ్చ ప్రసన్నశ్చ, రమతే స్వాఽఽత్మనాఽఽత్మని ।**

**43.** సర్వవర్ణధర్మములయు, ఆశ్రమాచారములయు, శాస్త్రనియమములచే పరిత్యక్తుడు, గంభీరుడు, ప్రసన్నుడు (ప్రశాంతుడు)నై, **జీవన్ముక్తుడు,** తనలో తానే ఆనందించుచుండును. బాహ్య లాభనిరపేక్షుడై, పరమార్థ దర్శనామృతరసానుభవము వలన సంతుష్టుడై యుండును.

[చతుర్వర్ణములు :- బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు. చతురాశ్రమములు :- బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సంన్యాసములు.]

**సర్వకర్మఫలత్యాగీ, నిత్యతృప్తో నిరాశ్రయః । 44 ।**
**న పుణ్యేన, న పాపేన, నేతరేణ చ లిప్యతే ।**

**44-45.** జీవన్ముక్తుడు సర్వకర్మఫలములను త్యజించిన వాడును, నిత్యమగు నిజానందముచే పరితృప్తుడును, కావుననే, యోగక్షేమార్థమై

---

★ పోల్చు :- **"కార్యాఽకార్యం కిమపి చరతో నైవ కర్తృత్వమస్తి,**
**జీవన్ముక్తి స్థితి రిహగతా దగ్ధవస్త్రాఽవభాసా ।**
**ఏవం దేహే ప్రచలితతయా దృశ్యమానః స ముక్తో,**
**నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః? కో నిషేధః ? ।"**

ఆత్మజ్ఞానికి, కర్తృత్వాభిమానము లేదు. కార్యాకార్యవిభేదమును ఉండదు. వస్త్రము సంపూర్ణముగా దగ్ధమై పోయినను, వస్త్రరూపమున కనపడుచున్నట్లే, కర్తృత్వాభిమానము లేకున్నను, ఉన్నట్లు లోకులకు తోచును. ఇది జీవన్ముక్త స్థితి. జ్ఞాని, సంచరించుచున్నట్లు కనిపించినను, సర్వగతమగు పరమాత్మతో నభిన్నుడు కాన, ఆతనికి రాక పోకలు లేవు. **త్రిగుణాతీత పదమున చరించు వారికి విధినిషేధము లెక్కడివి?**

**(చూడు :- కల్యాణ కైవల్యము – (శుకాఽష్టకము –7) – డా॥ రత్నాకరం బాలరాజు. 1965)**
**"శాస్త్రేణ యన్త్రణా కిఞ్చిదపి న్న యమనం తయా వర్జితః ।" (యో.వా.తా.ప్ర.)**

ఆశ్రయింపదగిన దేదియును లేనివాడునై, పుణ్యపాపములచే గాని, తదితరములగు హర్ష విషాదాదులచే గాని, కళంకితుడు కాడు. అవి వానిని స్పృశింప (అంట) జాలవు.

**స్ఫటికః ప్రతిబిమ్బేన, న యాతి రఞ్జనం యథా[1] I 45 I**
**తద్జ్ఞః కర్మ ఫలేనాఽన్త, స్తథా నాఽయాతి రఞ్జనమ్ I**

**45-46.** స్ఫటికము, ప్రతిబింబము చేత, రూపాంతరమును పొందనట్లు, (ఆ ప్రతిబింబము యొక్క రక్తిమ-రంగు-ను పొందనట్లు), బ్రహ్మవేత్తయు, ప్రారబ్ధోపనీతములగు సుఖదుఃఖాదులగు కర్మ ఫలములచే అంతరంగమున రంజిల్లడు. (రాగవశుడు కాడు). ఆత్మస్వభావము నుండి చ్యుతిని పొందడు.

**నిఃస్తోత్రో నిర్వికారశ్చ, పూజ్యాఽ పూజ్య వివర్జితః I 46 I**
**సంయుక్తశ్చ, వియుక్తశ్చ, సర్వాఽఽచార నయక్రమైః I**

**46-47.** పూజితుడైనను, ప్రశంసింపని వాడును, పూజావివర్జితుడైనను, నిర్వికారుడును, పూజ్యాఽపూజ్య రహితుడును, సర్వాచార నీతిక్రమములు కలవాడును, లేనివాడునునై, జ్ఞాని చరించును.

**తస్మా న్నోద్విజతే లోకో, లోకా న్నోద్విజతే చ సః[2] I 47 I**
**తనుం త్యజతు వా తీర్థే, శ్వపచస్య గృహేఽపివా I[3]**
**మా కదాచన వా రాజన్! వర్తమానేఽపి వా క్షణే I 48 I**

---

(1) పోల్చు :- "వారి పోక్ఖర పత్తే'వ, ఆరగ్గేరివ సాసపో I
యో నలింపతి కామేసు, తమహం బ్రూమి బ్రాహ్మణం I'
(ధమ్మపదం -401)
పద్మపత్రమున జలము వలె, ఆరాగ్రమున (సూదిమొనపైన) ఆవగింజవలె నెవడు కామ భోగములందు లిప్తుడు (అనురక్తుడు) కాడో, అట్టి వానిని నేను బ్రాహ్మణుడందును.
(ధమ్మపదం - డా॥ రత్నాకరం బాలరాజు - 1994 పుట - 253 -54)

(2) పోల్చు :- భ.గీ. XII-15;

(3) "యత్ర యత్ర మృతో జ్ఞానీ, యేన కేనాఽపి మృత్యునా I
యథా సర్వగతం వ్యోమ, తత్ర తత్ర లయం గతః I " [ఉత్తరగీత - II-8]
ఘటాదికము నశింపగా, వాని యందలి ఆకాశము, అచ్చటనే మహాకాశముతో, ఐక్యమగుచున్న

**47-48.** రాజా! జ్ఞాని వలన లోకము (జనులు), భయశంకలతో సంక్షోభ (సంతాప)మందదు. లోకము (జనుల) వలన అతడును, ఉద్వేగమును - (సంతాపమును) - పొందడు. పుణ్యతీర్థమున గాని, లేక, శ్వపచుని (కుక్కమాంసముతినుచండాలుని) గృహమున గాని, తనువు త్యజించు గాక!. ఎప్పటికి త్యజింపకుండుగాక!. లేక, ఇప్పుడే త్యజించుగాక!. అందేవిశేషమును లేదు. ఏమైనను, బ్రహ్మవేత్త యొక్క ముక్తస్థితి కెప్పుడును భంగము వాటిల్లదు.

న పూజనీయః న స్తుత్యో, నమస్కార్యః స యత్నతః* ।
న నిరీక్ష్యోఽభివాద్యశ్చ, విభూతి విభవైషిణా ॥ 49 ॥

**49.** ఐశ్వర్యవిభవముల కాంక్షించు వారికి, బ్రహ్మవేత్త పూజింపదగిన వాడు, స్తుతింపదగినవాడు, ఉత్సాహపూర్వకముగ నమస్కరింపదగినవాడు, నిరీక్షింపదగినవాడు, పాదాభివందన మాచరింపతగినవాడు.

---

విధమున, బ్రహ్మవేత్త, శరీరోపాధులతో గూడి ఎచ్చట, ఏ విధమున మృతుడైనను, సర్వ పరిపూర్ణ బ్రహ్మముతో నైక్యమగుచున్నాడు. బ్రహ్మవిదునకు, మరణమున దేశకాలాద్యపేక్ష లేదని యిది స్థాపించును. (చూడు :- ఉత్తరగీత II-8-గౌడపాదాచార్య కృతభాష్యము)

* పోల్చు :- "యం యం లోకం మనసా సంవిభాతి,
విశుద్ధ సత్త్వః కామయతే యాం శ్చ కామాన్ ।
తం తం లోకం జయతే తాం శ్చ కామాం -
స్తస్మాదాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతి కామః ।"
"యద్యేకో బ్రహ్మవిద్ భుక్తే జగత్తర్ప్యయతేఽఖిలమ్ ।
తస్మాదన్విష్య సర్వత్ర, పూజనీయో విదాంవరః ।"

(ఉపనిష్ద్బ్రహ్మయోగి - భగవద్గీతార్థ ప్రకాశిక - IX-2)

విశుద్ధసత్త్వుడైన మహాత్ముడు, ఏయే లోకముల సంభావించునో, యే కామములను ఆకాంక్షించునో, ఆలోకములను, ఆకామములను అన్నిటిని, జయించు (పొందు)చున్నాడు.

ఒక బ్రహ్మవేత్త భుజించుట వలన జగత్తంతయు తనివి జెందును. కాన, ఐశ్వర్యవిభవముల నాకాంక్షించు వారు, ఆత్మజ్ఞానిని అర్చింపవలెను.

సర్వవిద్యాధిరాజత్వము వలన, బ్రహ్మవిద్య విద్యలన్నిటిలోను (రాజవిద్య-Sovereign Science) విశిష్టమైనది. బ్రహ్మజ్ఞాని, జ్ఞానులందఱిలోను, విశిష్టుడు, పూజనీయుడు.

"[illegible] బ్రహ్మజ్ఞానీ విశిష్టః, పూజనీయశ్చ,

యజ్ఞతీర్థతపోదానైః, న తదాసాద్యతే పదమ్ ।
సతా మాత్మవిదాం భక్త్యా, సేవనేన తు లభ్యతే ॥ 50 ॥

50. యజ్ఞాచరణము, పుణ్యతీర్థ సేవనము, తపోదానములు - ఇవి యేవియు పరమ పురుషార్థ రూపమగు ఆ పదమును పొందింపజాలవు. ఆత్మవేత్తలైన మహాత్ములను భక్తితో సేవించుట వలననే ఆ పదము లభించును.

ఏవ ముక్త్వా స భగవాన్, మను ర్బ్రాహ్మ్యం గృహం యయౌ ।
ఇక్ష్వాకు రపి తాం దృష్టి మవష్టభ్య స్థిరోఽభవత్ ॥ 51 ॥

51. ఇట్లుపదేశించి, భగవంతుడగు ఆ మనువు, బ్రహ్మ నివాసమున కేగెను. ఇక్ష్వాకు మహారాజును మనువు ఉపదేశించిన ఆత్మజ్ఞానము నాశ్రయించి ఆత్మసాక్షాత్కారమున ప్రతిష్ఠితుడయ్యెను.

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'ఇక్ష్వాకూపాఖ్యానం' నామ త్రింశః సర్గః

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'ఇక్ష్వాకూపాఖ్యానమ'ను త్రింశత్తమ (ముప్పదవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ఏకత్రింశసర్గము

### భూమికాజయః – భూమికల జయించుట

### 1. చిత్తనాశః – చిత్తమును నశింపజేయుట.

శ్రీ రామ ఉవాచ :–
ఏవం స్థితే హి భగవన్! జీవన్ముక్తస్య సన్మతేః ।
అపూర్వోఽతిశయః కోఽపి భవత్యాత్మవిదాం వర ! ।1।

1. శ్రీ రాముడు :– ఆత్మజ్ఞులలో శ్రేష్ఠుడవగు ఓ మహాత్మా! ఇట్లు మీరు వర్ణించిన లక్షణములున్నను, సన్మతి యగు జీవన్ముక్తునకు (ఆకాశ గమనాదిసిద్ధిరూపమగు) అపూర్వమైన అతిశయ మేదైన నుండునా?

వసిష్ఠ ఉవాచ :–
విత్యక్తతృష్ణః ప్రశాన్తాత్మా, స ఆత్మన్యేవ తిష్ఠతి ।
మన్త్ర తన్త్ర తపః సిద్ధ్యై, సంప్రాప్త మణిమా ద్యపి ।2।

కృత మాకాశయానాది, కా తత్ర స్యా దపూర్వతా ? ।
యత్నాత్ తత్సాధితం, తైస్తు నేతరేణాఽఽత్మ దర్శినా ॥ 3 ॥

2-3. వసిష్ఠుడు :– జీవన్ముక్తుడు నిత్యతృప్తుడు. ఆత్మ యందే ప్రీతి గలిగి తక్కిన విషయముల నన్నిటిని ఉపేక్షించి, త్యజించుట వలన, వాని సంయోగ వియోగ జన్యములైన హర్ష శోకములు, అతనికి సంక్షోభమును కల్గింపజాలవు. కావున, అతడు ప్రసన్నాత్ముడై, పరిపూర్ణమైన ఆత్మ యందే నిష్ఠ గలిగి యుండును. మంత్ర సిద్ధిని, తపస్సిద్ధిని, తంత్ర సిద్ధిని సాధించినవారు, అణిమాది సిద్ధుల పొందుచున్నారు; ఆకాశయానాదుల నొనర్చుచున్నారు. స్వప్రయత్నముతో, అణిమాదిసిద్ధులు సాధింపబడు చున్నవి. ఇందు అపూర్వత యేమున్నది? ఆత్మజ్ఞాని, ప్రయత్నమున వాని సాధింప నవసరము లేదు. సర్వాత్మభూతుడగుటచే, ఇతరులచే ప్రయత్నమున సాధింపబడిన సర్వసాంసారికసిద్ధులును తనచే సాధింపబడినవే యగుచున్నవి. కావున మరల, వానిని తాను సాధించుట వలని ప్రయోజన మేమియును లేదు. [సిద్ధులు, మోహము వలన దూషితము కావచ్చును కాని, అవి ఉత్తమావస్థకు సంబంధించినవి కావు. "మోహాఽఽవరణాత్ సిద్ధిః ।" – (శివసూత్రము -III-6)]

ఏష ఏవ విశేషోఽన్య, న సమో మూఢబుద్ధిభిః ।
సర్వత్రాఽఽస్థా పరిత్యాగా న్నీరాగ మమలం మనః ॥ 4 ॥

4. మూఢబుద్ధులతో సమానముగ నుండకుండుటయే, ఆత్మజ్ఞాని యందలి విశేషము. ఎల్ల పదార్థములందును ఆస్థ, (ఆలంబనము, ప్రయత్నము, అపేక్ష)ను, పరిత్యజించి, పరమాత్మనిష్ఠ గలిగి యుండుటయు, రాగాది (కామక్రోధాది) రహితమై మనస్సు, నిర్మలముగ నుండుటయే, జ్ఞానికి ఇతరుల కంటెను గల విశేషము.

యథా సత్త్వ ముపేక్ష్య స్వం, శనై ర్విప్రో దురీహయా ।*
అఙ్గీకరోతి శూద్రత్వం, తథా జీవత్వ మీశ్వరః ॥ 5 ॥

5. ఒకానొక బ్రాహ్మణుడు, కామినీ కామోపభోగ రూపమగు దుర్వాంఛకు

* పోల్చు :- అజామిళోపాఖ్యానము :– (శ్రీమద్భాగవతము VI-1-55-67)
"కన్యాకుబ్జే ద్విజః కశ్చిద్దాసీపతి రజామిళః ।
నామ్నా నష్టసదాచారో, దాస్యాః సంసర్గ దూషితః" । ఇత్యాది

లోనై, నిజమైన సత్త్వగుణము నేమఱి, క్రమక్రమముగా, శూద్రత్వమంగీకరించినట్లు, ఈశ్వరుడును, బుద్ధ్యాది (ప్రకృతిగుణ) సాంగత్యవశమున, నిత్యశుద్ధపూర్ణానందస్వభావ ముపేక్షించి, జీవత్వము నంగీకరించుచున్నాడు.

**అకారణ ముపాయాన్తి, సర్వే జీవాః పరాత్పదాత్ ।**
**పశ్చాత్తేషాం స్వకర్మాణి, కారణం సుఖదుఃఖయోః ॥ 6 ॥**

6. ఆదియందు జీవులందఱును, పరమాత్మ పదము నుండి నిష్కారణముగనే కలుగుచున్నారు. తరువాత, వారి సుఖదుఃఖములకు, వారి స్వకర్మములే కారణ మగుచున్నవి.

**ఆత్మాఽజ్ఞానా త్సముత్పన్నః, సఙ్కల్పః కర్మకారణమ్ ।**
**సఙ్కల్పిత్వం హి బన్ధస్య, కారణం తత్ పరిత్యజ ॥ 7 ॥**

7. ఆత్మస్వరూపజ్ఞానము లేమిచే కలిగిన సంకల్పమే, పుణ్యాపాప ప్రవృత్తి రూపకర్మమునకు కారణమగుచున్నది. కావున సంకల్పదశయే, వాస్తవముగ, పుణ్యాఽపుణ్యప్రవృత్తిభోగవాసనాది సంతతిచే, బంధమునకు కారణ మగుచున్నది. కావున శ్రీరామా! నీవు సంకల్పమును త్యజింపుము.

**నిస్సఙ్కల్పస్తు మోక్షస్య, తదభ్యాసం ధియా కురు ।**

8. సంకల్పరాహిత్యమే మోక్షమునకు కారణము. కావున, శ్రీరామా! నిశ్చయాత్మకమగు బుద్ధితో, మోక్ష స్థితి నభ్యసింపుము. [శుద్ధ చైతన్య స్వరూపమగు ఆత్మ యొక్క ఆవరణమునకు సంకల్పమే, ప్రథమ కారణము. 7,8 శ్లోకములీ విషయము నిర్దేశించుచున్నవి]

**మనసి గ్రథితాః పాశా, తృష్ణా మోహమదాదయః ॥ 8 ॥**
**మనసైవ మనశ్ఛిన్ధి, సంసారభ్రాన్తిశాన్తయే ।**
**క్షాళయన్తి మలేనైవ, మలం క్షాళకకోవిదాః ॥ 9 ॥**

8-9. తృష్ణ(ఆశ) మోహము, మదము మొదలగు పాశములు మనస్సు నందు గట్టిగ పురిగొని యున్నవి. శ్రీరామా! సంసార భ్రాంతి ఉపశమించుటకై,

వివేకసంపన్నమై నిశితమైన మనస్సు చేతనే, (ఇనుముచే ఇనుమును ఛేదించునట్లు) మనస్సును ఛేదింపుము. లోకమున మాలిన్యమును కడిగి వేయుట యందు నిపుణులైన వారు, మలినపదార్థమునే సాధనముగ గైకొని, మాలిన్యమును క్షాళన మొనర్చుచున్నారు కదా!

**జీవస్య త్రీణి రూపాణి, స్థూలం సూక్ష్మం తథా పరమ్ ।**
**పాణిపాదమయో యోఽస్య, దేహో భోగాయ వర్తతే (వల్గతే) ॥10॥**
**భోగాఽర్థమేత జ్జీవస్య, స్థూలం రూప మిహాఽస్థితమ్ ।[1]**

**10-11.** జీవునకు స్థూలము, సూక్ష్మము, పరము నని మూడు రూపములు కలవు. హస్తపాదాదియుతమగు దేహము, భోగము కొఱకు పరుగులిడునట్టిది, స్థూలరూపము. ఇది జీవునకు విషయ భోగార్థమై యున్నది. ఈ లోకమున నిది అస్థిరమైనది.

**స్వసఙ్కల్పమయాఽఽకారం, యావత్సంసారభావి యత్ ॥ 11 ॥**
**చిత్తం తద్విద్ధి సూక్ష్మాఖ్యం, రూపం తస్యాఽఽతి వాహికమ్ ।[2]**

**11-12.** శ్రీరామా! స్వసంకల్పమే ఆకారముగ గల్గి, సంసారముండు పర్యంతము – (బ్రహ్మజ్ఞానము కలుగు వఱకు)– చెడకుండ నిలిచి యుండు చిత్తము, సూక్ష్మరూపమని తెలియుము. ఇది, ఆతివాహికము. (ప్రస్తుతశరీర పతనానంతరము, ఇతరదేహములందు ప్రవేశించునది. (ఈ స్థూల సూక్ష్మ దేహములు రెండును, జాగ్రత్స్వప్నాఽవస్థల యందు ప్రసిద్ధములు)

---

(1) "రసాదిపఞ్చీకృతభూతసమ్భవం, భోగాలయం దుఃఖసుఖాది కర్మణామ్ ।
శరీర మాద్యన్తవదాదికర్మజం, మాయామయం స్థూలముపాధి మాత్మనః ।"
పృథివ్యాది పంచీకృత భూతముల వలన నుత్పన్నము, సుఖదుఃఖాది కర్మానుభవమునకు ఆశ్రయము, పూర్వోపార్జితకర్మఫలప్రాప్తమునై, ఆద్యంతవంతము నైన ఈ మాయా మయ శరీరము, ఆత్మకు స్థూలమైన ఉపాధి యని భావింపబడినది.

(2) "సూక్ష్మం మనోబుద్ధిదశేన్ద్రి యైర్యుతం, ప్రాణై రపఞ్చీకృతభూత సమ్భవమ్ ।
భోక్తు స్సుఖాదే రనుసాధనం భవేచ్ఛరీర మన్యద్విదు రాత్మనో బుధాః ।"
మనసు, బుద్ధి, దశేంద్రియములు, పంచప్రాణములతో కూడి, అపంచీకృత భూతముల నుండి యుత్పన్నమైన సూక్ష్మ శరీరము (లింగ శరీరము) భోక్తకు సుఖదుఃఖాది అనుభవమునకు సాధనము. ఇది ఆత్మకు అన్యోపాధియని జ్ఞానులెఱుగుదురు.
(అధ్యాత్మ రామాయణము -V సర్గ (శ్రీరామగీత)–28,29)

ఆద్యన్త రహితం సత్యం, చిన్మాత్రం నిర్వికల్పకమ్ । 12 ।
యత్తద్విద్ధి పరం రూపం, శుద్ధం జీవస్య రాఘవ ! ।
పూర్వే ద్వే సంపరిత్యజ్య, పరే బద్ధపదో భవ ! । 13 ।

12-13. రాఘవా! ఆద్యంతములు లేనిదియు, సత్యమును, శుద్ధచైతన్య స్వరూపమును, నిర్వికల్పము (సంకల్పవికల్పరహితము)ను, లేక, జ్ఞాతృజ్ఞేయరూపవిభాగరహితమునైన పరబ్రహ్మమే, జీవునకు స్వాభావికమైన పరమరూపము. మొదటిరెండురూపములను సంపూర్ణముగ పరిత్యజించి, పరబ్రహ్మరూపమగు ఈ పదమున సుస్థిరుడవు కమ్ము.

యా స్వచ్ఛా సమతా శాన్తా, జీవన్ముక్తవ్యవస్థితిః ।
సాక్ష్యవస్థా వ్యవహృతౌ, తుర్యా సా పరికీర్త్యతే । 14 ।

14. ఏది స్వచ్ఛము (నిర్మలము), సమము, శాంతమునైన జీవన్ముక్త వ్యవస్థితి యొక్క వ్యవహారకాలము నందలి సంసర్గరహితమై నసాక్ష్యవస్థయో అది తుర్యావస్థ యని కీర్తింపబడినది.

నైతజ్జాగ్ర న్న చ స్వప్నః, సఙ్కల్పానా మసంభవాత్ ।
నై తత్సుషుప్త భావోఽపి, జడతాయా అభావతః । 15 ।

15. సంకల్ప (సర్వ ప్రపంచ కల్పనా) శూన్యమగుటచే నిది జాగ్రదవస్థయు, స్వప్నావస్థయును కాదు. జడస్థితి లేమిచే నిది సుషుప్త్యవస్థయును కాదు.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్యం, త్రయం రూపం హి చేతసః ।
శాన్తం ఘోరం చ మూఢం చ, త్ర్యాత్మ చిత్త మిహ స్థితమ్ । 16 ।

16. జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలును, వాస్తవముగ చిత్తము యొక్క మూడు రూపములు. ఇచట, శాంతము, ఘోరము, మూఢము నను గుణత్రయ స్వభావముతో చిత్తస్థితి యుండును.

ఘోరం జాగ్రన్మయం చిత్తం, శాన్తం స్వప్నమయం స్థితమ్ ।
మూఢం సుషుప్త భావస్థం, త్రిభి ర్హీనం మృతం భవేత్ । 17 ।

17. జాగ్రదవస్థ యందలి చిత్తము, స్వర్గనరకపునర్జన్మాది హేతువులగు పుణ్య

పాపకర్మములకు ఉత్పాదకమగుటచే, ఘోరమని పేర్కొనబడినది. స్వప్నావస్థ యందలి చిత్తము, శాంత మనబడును. స్వప్నావస్థ యందు సుఖదుఃఖాది అనుభవ మున్నను, ఉత్తరక్షణమున నా అనుభవము నందు, అసత్యభావన కల్గుటచే, అది నశించుచున్నది. కాన, చిత్తమున కా అనుభవము వలన నంతగా బాధ యుండదు. సుషుప్త్యవస్థ యందలి చిత్తమ్ము మూఢమని చెప్పబడినది. అందు సుఖదుఃఖాద్యనుభవమును, అది ఎఱుగదు. గుణత్రయాత్మక మాయ, విచ్ఛిన్నమగుటచే, ఈ ధర్మములు లేని చిత్తము, మృత మనబడుచున్నది.

తచ్చ తుర్యం మృతం చిత్తం, సత్త్వ మేకం స్థితం సమమ్ ।
తదేవ యోగినః సర్వే, యత్నా త్సంపాదయన్తి హి ॥ 18 ॥

18. చిత్తము యొక్క మృత స్థితియే తుర్యావస్థ. ఇందు సత్త్వమే, రజోగుణముచే అక్షోభ్యమాణమై, ఏకమై, సమముగా నెలకొని యుండును. యోగుల కిందు, ప్రారబ్ధశేషము ననుభవించు కొఱకు, సత్త్వాంశము మాత్రమే అనుసరించును. రజస్తమస్సుల అంశము లేశమైనను, ఇందుండదు. దీనిని యోగు లందఱు ప్రయత్న పూర్వకముగా సంపాదింతురు.

చిత్తాసత్తా పరం దుఃఖం, చిత్తనాశః పరం సుఖమ్ ।
సిద్ధాన్తోఽధ్యాత్మ శాస్త్రాణాం, సర్వాఽపహ్నవ ఏవ హి ॥ 19 ॥

19. (నానాకర్మజవాసనాన్వితమగు) చిత్తము యొక్క ఉనికియే, పరమ దుఃఖము. చిత్తనాశమే పరమసుఖము. సర్వాఽభావమే – (సమస్త దృశ్యము యొక్క అపలాపమే – లేదనుటయే) శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాది రూపమైన సర్వఅధ్యాత్మశాస్త్రముల సిద్ధాంతము.

[అవిద్యగాని, మాయగాని, వాని వలన జనించిన భూతభౌతికములు గాని, లేవనియు, సర్వసంక్షోభరహితమగు పరబ్రహ్మము మాత్రమే ఉన్నదనుటయే, అధ్యాత్మశాస్త్ర సిద్ధాంతము]

శాన్త ఏవ చిదాకాశే, బ్రహ్మేతి శబ్దితే పరే ।
కేచి న్నిర్ణీయ శూన్యత్వం, కేచి ద్విజ్ఞానమాత్రతామ్ ॥ 20 ॥

కేచి దీశ్వర రూపత్వం, వివదన్తే పరస్పరమ్ ।
సర్వమేవ పరిత్యజ్య, మహామౌనీ* భవాఽనఘ ! ।21।

20-21. ఇట్లు శాంతమై, బ్రహ్మశబ్దవాచ్యమగు చిదాకాశ మొక్కటియే వెలుగుచుండగా, దానిని కొందఱు శూన్యమనియు, కొందఱు విజ్ఞాన మాత్ర స్వరూపమనియు, మఱికొందఱు పరమేశ్వరుడనియు, తమ తమతమ బుద్ధిదోషవైచిత్ర్యము వలన, నానావిధకల్పనలను, సిద్ధాంతభేదములను కల్పించి, వాదించుకొనుచున్నారు. పాపరహితుడవగు శ్రీరామా! నీవా వాదములను, మాయాఽంతమగు సర్వదృశ్యజాలమును, పరిత్యజించి, మనోయుక్తముగ, సర్వేంద్రియ వ్యాపార ఉపరామము నొంది మహామౌనివి కమ్ము.

నిర్వాణవాన్ నిర్మననః, క్షీణచిత్తః ప్రశాన్తధీః ।
అన్తః సర్వపరిత్యాగీ, బహిః కురు యథాఽఽగతమ్ ।22।

22. శ్రీరామా! నిర్వాణసుఖమును పొంది, మననరహితుడవు (అంతర్ముఖుడవు) క్షీణచిత్తుడవు, ప్రసన్నబుద్ధివి, శాంతుడవునై, లోపల సర్వమును పరిత్యజించి, బయట మాత్రము, యథాగతములైన కర్మములను ఆచరింపుము.

---

★ పోల్చు :- "ఆహ చ తన్మాత్రమ్ ।" "దర్శయతి చాఽథో అపిస్మర్యతే।"
(బ్ర.సూ. III-2-16,17)

బ్రహ్మము, చైతన్యమాత్రమనియు, నిర్విశేషమనియు, శ్రుతిస్మృతులు చెప్పుచున్నవి.
(బృ.ఉ. II-3.6, కేన. ఉ. I-4, తై.ఉII.9)

బ్రహ్మమును గుఱించి బాష్కలి చేత ప్రశ్నింబడిన బాధ్వుడు మౌనముతోనే దాని నుపదేశించుటను, భాష్యకారుడు శంకరుడు తెలుపును.
'అయ్యా! బ్రహ్మము నుపదేశింపుము' – అని బాష్కలి యడిగెను. కాని,
బాధ్వుడు – తూష్ణీంభావుడై యుండెను. రెండవసారి, మూడవసారి, బాష్కలి మరల, మరల ప్రశ్నింపగా, బాధ్వుడు తూష్ణీంభావమును విడిచి ఇట్లు సమాధానమొసగెను.
"మేము నీకు ఉపదేశించుచునే యున్నాము. కాని, నీవు తెలిసికొనజాలకైతివి. ఈ ఆత్మ, ఉపశాంతస్వరూపము".
(బ్రూమః ఖలు త్వం తు న విజానాసి, ఉపశాన్తోఽయమాత్మా ఇతి – బ్ర.సూ. III-2-17- శంకరభాష్యము)
చూడు :- బ్రహ్మసూత్రము -III-2-17-డా॥ రత్నాకరంబాలరాజు (1971) –
ఆధ్యాత్మవిద్యాగ్రంథరత్నమాల, సాకేతనిలయం, 21, S.B.I. Colony,
అనంతపురం – (ఆం.ప్ర.) 515 001

## 2. భూమికాత్రయాఽఽరోహణమ్ – మొదటి మూడు యోగ భూమికల ఆరోహణము

శ్రీరామ ఉవాచ–

సప్తానాం యోగభూమీనా మభ్యాసః క్రియతే కథమ్ ?।

23. శ్రీరాముడు :– స్వామీ! సప్తయోగ భూమికల నెట్లు అభ్యసింపవలయునో, వివరింపవలయును.

వసిష్ఠ ఉవాచ :–

ప్రవృత్త శ్చ నివృత్తశ్చ, భవతి ద్వివిధః పుమాన్ ॥ 23 ।
కియ త్తన్నామ నిర్వాణం?, పరం సంసృతి రేవ మే ।
ఇతి నిర్ణీయ కర్తా యః, స ప్రవృత్త ఉదాహృతః ॥ 24 ।

23-24. వసిష్ఠుడు :– ప్రవృత్తు డని, నివృత్తు డనియు, వ్యక్తి ద్వివిధముగా నున్నాడు. స్వర్గాదిసాధనమైన కర్మపథము ననుసరించువాడు, ప్రవృత్తుడు. మోక్షసాధనమైన జ్ఞానమార్గగామి, నివృత్తుడు. విషయ వర్జితమగు నిర్వాణము (మోక్షము) అనగా నేపాటిది? నాకు భోగానుభవ పూర్ణమగు సంసారమే, ఉత్తమము. అని నిర్ణయించుకొని, వేదవిహితములగు యజ్ఞాదికర్మల నాచరించువాడు ప్రవృత్తు డనబడును.

అసారా బత! సంసారవ్యవస్థాఽలం మమైతయా ।
ఇతి నిశ్చయవాన్ యోఽన్తః, స నివృత్త ఇతి స్మృతః । 25 ॥

25. అయ్యో! వివిధ వైరుధ్యములతోడి యీ సంసార వ్యవస్థ, విశ్రాంతి సుఖ రహితము – అసారము. అని, అంతరంగనిశ్చయము కలవాడు నివృత్తు డనబడును.

'కథం విరాగవాన్ భూత్వా, సంసారాఽబ్ధిం తరా మ్యహమ్' ?।
ఏవం విచారవాన్ యః స్యాత్, సంసారోత్తరణం ప్రతి । 26 ।
స భూమికావా నిత్యుక్తః, శేషః స్వార్థ ఇతి స్మృతః ।

26-27. 'ఎట్లు వైరాగ్యవంతుడనై, నేనీ సంసారసాగరమును తరింతును?' సంసారమును తరించుటకు ఎవ డిట్లు విచార మొనర్చునో, వాడు, యోగభూమిక లందు ప్రవేశించినవా డనబడును.(భూమికావంతుడు).

మిగిలిన వారందఱును, రాగాదులచే బద్ధులై, నశ్వర శరీరభరణనిరతులును, సత్యము నాచ్ఛాదించు అహంకారముతో కూడినవారునునైన స్వార్థపరులు, వంచకులు ననబడుదురు.

క్రియాసూదారరూపాసు, క్రమతే మోదతే యదా ॥ 27 ॥
గ్రామ్యాసు జడచేష్టాసు, విరాగ ముపయాతి చ
బిభేతి సతతం పాపా న్నచ భోగ మపేక్షతే ॥ 28 ॥
దేశకాలోపపన్నాని, వచనాన్యభి భాషతే ।
తదాఽసౌ ప్రథమాం ప్రాప్తః, శుభేచ్ఛా ఽఽహ్వాయ భూమికామ్ ॥ 29 ॥

27-29. ఎప్పుడు మనుజుడు, చిత్తశుద్ధికి అనుకూలములైన శౌచము, సత్సంగము, ఈశ్వరోపాసనము, జపాదులు నగు ఉదార రూప క్రియలందు తత్పరుడై, వానిచే తృష్ణ క్షయింపగా, సంతోషించుచుండునో, గ్రామ్యములైన మూఢకార్యములందు – (అనుభవమందలి ప్రేమ, దుఃఖము, విషయ భోగములు మొదలగు వాని యందు) జుగుప్సను – విరక్తిని –పొందునో, పాపకార్యములకు భయపడునో, భోగాపేక్షను విసర్జించునో, మృదు రమ్యములు, అనుద్వేగకరములు సత్యప్రియహితాదిరూపములు, నగు మాటలనే, దేశకాలోచితముగా పలుకుచుండునో, అప్పుడతడు, శుభేచ్ఛ యను ప్రథమయోగ భూమికను ప్రాపించును.

విచారణేతి సంప్రోక్తాం, ద్వితీయాం భూమికాం గతః ।
శ్రుతి, స్మృతి, సదాచార, ధారణా, ధ్యానకర్మణామ్ ॥ 30 ॥
ఆశ్రిత్య పణ్డితశ్రేష్ఠాన్, విభాగజ్ఞో భవత్యతః ।
దంభాదిహీనః శాస్త్రేషు, గురుసజ్జన సేవయా ॥ 31 ॥
స రహస్య మశేషేణ యథా వదధిగచ్ఛతి ।

30-32. విచారణ యనబడు ద్వితీయయోగభూమికను పొందినవాడు శ్రుతి, స్మృతి, సదాచార, ధారణా, ధ్యానాదులగు యోగాంగముల వివరింపగల పండితశ్రేష్ఠులను ఆశ్రయించును; గృహస్థుడు తన ఇంటి సంగతుల నెల్ల చక్కగా తెలిసి, కార్యాకార్యముల నిర్ణయించునట్లు, పదపదార్థ విభాగము తెలిసి అతడు కార్యాఽకార్య వినిర్ణయ మొనర్చును. దంభాది (గర్వకాపట్యాది) దుర్గుణరహితుడై, గురువులను, సజ్జనులను, సేవించుట వలన శాస్త్రముల యొక్క పరమతాత్పర్యమగు ఆత్మరహస్యమును యథార్థముగ, సంపూర్ణముగ తెలిసికొనును.

తతోఽసంసక్తినామ్నీం స, తృతీయాం ప్రాప్య భూమికామ్ ‖ 32 ‖
తాపసాశ్రమవిశ్రామై రధ్యాత్మకథనక్రమైః ।
చిత్తోపశమ శోభాఽఽఢ్యః, కాలం నయతి నీతిమాన్ ‖ 33 ‖

**32-33.** అనంతరము, ఆతడు అసంసక్తి (సర్వవస్తుసంబంధరాహిత్యము) అనబడు తృతీయయోగభూమికను ప్రాపించును. తాపసుల ఆశ్రమములందు నివసించుటచే కలుగు విశ్రాంతుల చేతను, అధ్యాత్మ శాస్త్రప్రసంగముల చేతను, అతడు చిత్తవిశ్రాంతి (ప్రసన్నతా) శోభాఢ్యుడై, నీతిమంతుడై, యే పదార్థముతోడను సంబంధ ముంచుకొనక, కాలము గడపు చుండును.

అభ్యాసాత్ సాధుశాస్త్రాణాం, కరణాత్పుణ్యకర్మణామ్ ।
యథావదేవ తస్యేయం, వస్తుదృష్టిః ప్రసీదతి ‖ 34 ‖

**34.** సచ్ఛాస్త్రాభ్యాసము చేతను, పుణ్యకర్మాఽఽచరణము చేతను, అతనికి యథార్థముగ(ఉన్నదున్నట్లు) వస్తు(ఆత్మ)తత్త్వ జ్ఞానము ప్రసన్నమగు చున్నది.

ద్వివిధోఽయ మసంసఙ్గః, సామాన్యః, శ్రేష్ఠ, ఏవ చ ।
నాఽహం కర్తా న భోక్తా చ, న బాధ్యో న చ బాధకః ‖ 35 ‖
ప్రాక్కర్మ నిర్మితం సర్వ మీశ్వరాఽధీన మేవ వా ।
సుఖం వా యదివా దుఃఖం, కైవాఽత్ర మమ కర్తృతా ‖ 36 ‖
ఇత్యసజ్జన మర్థేషు, సామాన్యోఽసా వసఙ్గమః ।

**35-37.** ఈ అసంగము, సామాన్యము, శ్రేష్ఠమునని రెండు విధములు. నేను కర్తను కాను, భోక్తను కాను. ఒకరిచే బాధింపబడువాడను, ఒకరిని బాధించువాడను, కాను. నేననుభవించు సుఖదుఃఖములు, పూర్వజన్మ కర్మముల వలన నిర్మితములు, లేక, ఈశ్వరాధీనములై యున్నవి. ఇందు నా కర్తృత్వ మేమున్నది? ఇట్లు విచారించి, దృశ్య పదార్థములందు సంసక్తి లేకుండుటయే, సామాన్యాఽసంగమ మనబడును.

అవేవాఽభ్యాస యోగేన,* సంయోగేన మహాత్మనామ్ ‖ 37 ‖

---

★ పోల్చు :- "ఆవృత్తి రసకృదుపదేశాత్ । (బ్ర.సూ. IV-1-1)
పరతత్త్వదర్శనమున పర్యవసానములైన శ్రవణ,మనన, నిదిధ్యాసనముల ఆవృత్తి పలుమారు అనుష్ఠింపవలయును. బ్రహ్మసాక్షాత్కారము సిద్ధించు పర్యంతము, వీనిని పలుమారు అనుష్ఠింపవలయునని శ్రుతులు ఉపదేశించుచున్నవి.
[బృ.ఉ. II-4-5, IV-4-21; ఛాం. ఉ.VIII–7–1]

దుర్జనానాం వియోగేన, ప్రయోగేణాఽఽత్మ సంవిదామ్ ।
సంసారాబ్ధేః పరే పారే, సారే పరమకారణే ॥ 38 ॥
యన్మౌన మాసనం శాన్తం, తచ్ఛ్రేష్ఠాఽసఙ్గ ఉచ్యతే ।
శ్రేష్ఠాఽసంసజ్జతా హ్యేషా, తృతీయా భూమికా మతా ॥ 39 ॥

37-38. ఈ అభ్యాసయోగము చేతను, మహాత్ముల సాంగత్యము చేతను, దుర్జనసాంగత్య వివర్జనము చేతను, శ్రవణమననాది రూపమైన ఆత్మ జ్ఞానము యొక్క ఆవర్తనము – (పలుమాఱు అభ్యసించుట) – చేతను, సంసారసాగరము యొక్క **ఆవలితీరమగు సమస్తమునకు పరమ కారణమును, సారభూతమునైన, పరమాత్మ యందు,** వాఙ్మనశ్చక్షురాది చేష్టాశూన్యమగు **సామ్యక్షుమౌనము** నాశ్రయించి, నిదిధ్యాసన పరిపాకఫలమగు **నిర్వికల్పసమాధి** యను **నాసనమున** (అవస్థానమున) శాంతముగ నుండుటయే శ్రేష్ఠాఽసంగ మనబడు **తృతీయయోగభూమిక.**

3. **ఉత్తర భూమికాః** – తరువాతి ఉన్నత యోగభూమికలు

శ్రీరామ ఉవాచ :–

**మూఢస్యాఽ ప్రాప్త యోగస్య, కథ ముత్తరణం భవేత్ ? ।**
**ఆరూఢస్య మృతస్యాఽథ, కీదృశీ భగవన్! గతిః ? ॥ 40 ॥**

40. శ్రీరాముడు :– మహాత్మా! ఆభిజాత్యాదిఅధికారివిశేషణహీనుడు, అధ్యాత్మకథావిముఖుడు, యోగము ప్రాప్తింపని **మూఢుడెట్లు సంసారాంబుధిని తరింపగలడు?** యోగానుష్ఠానమున నున్నను, ఒకటి గాని, రెంటిని గాని, మూటిని గాని యోగభూమికల నారోహించి **అపరోక్షానుభవము నొందక, మృతి నొందిన వానికేమి గతి గలుగునో,** వివరింపవలయును.

**వసిష్ఠ ఉవాచ :–**
**మూఢస్యాఽఽరూఢదోషస్య, తావత్సంసృతి రాతతా ।**
**యావ జ్జన్మాన్తరశతై ర్నోదితా ప్రథమాఽపి భూః ॥ 41 ॥**

41. **వసిష్ఠుడు :–** మూఢుడు, పరమపాపాత్ముడునగు వానికి, జన్మాంతర **శతములందు** (వందల కొలదిగా అనేక జన్మములందు) ఎంత వఱకు **పుణ్యవశమున** విచారముతో గాని, సాధుసాంగత్యమున గాని, ప్రథమ

భూమిక (శుభేచ్ఛ) సైతముదయింపకుండునో, అంత వఱకీ సంసారము విస్తరించియే యుండును.

వైరాగ్యేఽభ్యుదితే జన్తో, రవశ్యం భూమికోదయః ।
తతో నశ్యతి సంసార, ఇతి శాస్త్రార్థ సంగ్రహః ॥ 42 ॥

42. వైరాగ్యముదయించినంతనే, తప్పక శుభేచ్ఛ యను ప్రథమయోగ భూమిక ఉదయించును. అప్పుడు జీవునకు సంసార మంతరించునని వేదాంతశాస్త్ర సంగ్రహము (సంక్షేపము)

యోగభూమికయోత్క్రాన్త జీవితస్య శరీరిణః ।
భూమికాంశానుసారేణ, క్షీయతే పూర్వదుష్కృతమ్ ॥ 43 ॥

43. మొదటి యోగభూమికలు మూడింటిలో, నే భూమికయందైనను, ఆరూఢుడైన దేహికి, మరణము సంభవించినచో, ఆ యా భూమికాంశముల ననుసరించి, ఆతని పూర్వకృతమైన పాపము క్షీణించును.

పుణ్యలోకేషు సఞ్చారాత్ సుకృతేఽపి క్షయం గతే ।
శుచీనాం శ్రీమతాం గేహే*, జాయతే యోగవాసితః ॥ 44 ॥

44. పుణ్యలోకసంచారము వలన, పుణ్యము సైతము క్షీణింపగా, సంప్రదాయశుద్ధులు (సదాచారవంతులు) శ్రీమంతులునైన, సత్పురుషుల గృహమున యోగి, పూర్వయోగవాసనలతో జన్మించును.

తతః పరిపతత్యుచ్చై రుత్తరం భూమికాత్రయమ్ ।
భూమికా త్రితయం త్వేత ద్రామ! జాగ్రదితి స్మృతమ్ ॥ 45 ॥

---

★ పోల్చు :- "ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీః సమాః ।
శుచీనాం శ్రీమతాం గేహే, యోగభ్రష్టోఽభిజాయతే । (భ.గీ.-VI-41)
మఱియు చూడు. భ.గీ.VI - 42 -45.

"The night of Death may come before the heaven is reached; but he must not despair, for the path is one that must be trodden through many lives and he may repose serenely in the arms of the **Cosmic Law, Knowing that not the slightest effort is ever wasted,** and that, like a man completing on the morrow the unfinished task of to-day, he will be able to begin in his next life at the point where he left off in this.
**[The Yoga of the Bhagavad Gita– by Yogi Srikrishna Prem-1982–Eidtion p. 56]**

45 శ్రీరామా! పిదప, పూర్వాభ్యాస బలమున, తరువాతి మూడు భూమికలను యోగి, అధిరోహించును. మొదటి మూడు భూమికలు సంయుక్తముగ, జాగ్రదవస్థ యని పేర్కొనబడినవి. (జాగ్రదవస్థతో సమానము)

ప్రథమాయా ముచ్చారితం, ద్వితీయాయాం వికాసితమ్ ।
ఫలీభూతం తృతీయాయా మార్యత్వం యోగినో భవేత్ । 46 ।

46. యోగికి ఆర్యత్వము ప్రథమ భూమిక యందు అంకురించి, ద్వితీయ భూమిక యందు వికసించి, తృతీయ భూమిక యందు ఫలించును.

(ఆర్యశబ్ద నిరుక్తి)

కర్తవ్య మాచరన్ కామ మకర్తవ్య మనాచరన్ ।
తిష్ఠతి ప్రాకృతాఽఽచారో, యః స 'ఆర్య' ఇతి స్మృతః । 47 ।

యథాఽఽచారం యథాశాస్త్రం యథాచిత్తం యథాస్థితమ్ ।
వ్యవహార ముపాఽఽదత్తే, యః స ఆర్య* ఇతి స్మృతః । 48 ।

* ఆర్యశబ్దము జాతి వాచకము కాదనుట గమనార్హము. శ్రుతి, స్మృతులు, రామాయణ, భారతాదులును ఆర్యశబ్దము నిట్లే నిర్వచించును.
ఆర్య = 'ఋ' గతౌ గత్యర్థక 'ఋ' ధాతువునకు 'ణ్య' ప్రత్యయము ద్వారా, ఆర్యశబ్దము నిష్పన్నమగును. ఆర్య శబ్దమునకు ప్రాచీనమైన అర్థముపూజ్యుడు; శిష్టుడు. విశిష్టశరీరావయవ యుక్తమగు మనుష్య జాతిని (Race) ఈ శబ్దము నిర్దేశించుట, అర్ష బౌద్ధ శాస్త్రములందు మృగ్యము.
ఇట్టి అర్థము పాశ్చాత్యపండితుల స్వకపోలకల్పనమాత్రమని భారతీయ పండితుల నిశ్చయము. "ఆర్య రూప మివాఽనార్యం కర్మభిః స్వైర్విభావయేత్ ।" అని అతి ప్రాచీన స్మృతికారుడగు మనువు వచించెను. వారువారొనర్చు కర్మములే ఆర్యులను అనార్యులను తెలియజేయునని భావము. ఇది జాతి (Race) నామము కాదని మహాయోగి, శ్రీ అరవిందులు, సశాస్త్రీయముగ వివరించినారు. ఆర్య శబ్దము బుద్ధాది మహాత్ములను నిర్దేశించునని భదన్త బుద్ధఘోషుని వ్యాఖ్య. "అరియ స్సవేది తేహి బుద్ధాదిహి అరియేహి పవేదితే నతివత్తానాది భేదే బోధిపక్ఖియ ధమ్మే" ... (బుద్ధఘోషుడు) ఆర్యప్రతిపాదిత కర్మ ననుష్ఠించుటయే పండిత లక్షణమని మహా భారతము, ఆర్యశబ్దము జాతి వాచకమనుటను ఖండించుచున్నది.
"ఆర్యకర్మణి రజ్యన్తే, భూతికర్మాణి కుర్వతే ।
హితం చ నాఽభ్యసూయన్తి పణ్డితా భరతర్షభ! ।"
(మ.భా. ఉద్యోగ. 33-25. - మ.భా. వన - 297. 47-49 - ఇత్యాది).
చూడు :- మఱియు ధమ్మపదం - గాథలు - 79, 191, 236, 270, (1994)
డా॥ రత్నాకరం బాలరాజు.
వాస్తవ మిటుండగా, ఆర్యులనే పరజాతివారు మధ్యఆసియా నుండియో, లేక, వోల్గాతీరము

**47-48.** కర్తవ్యమగు సర్వనిత్యనైమిత్తికకర్మమును, సంపూర్ణముగ నాచరించు వాడును, అకర్తవ్యము (చేయదగని (నిషిద్ధ) కర్మము) నాచరింపని వాడును, ప్రాకృతా (స్వాభావికా) చారవంతుడై యుండు మనుజుడు 'ఆర్యుడ'నబడును. వృద్ధా చారానుసారియైనను, శాస్త్ర సమ్మతముగను, యథాచిత్తముగా, అనగా, నేది చేసిన తన చిత్తము ప్రసన్నమగునో, పశ్చాత్తాపము నొందదో, అట్టి లౌకిక వైదిక కర్మమును, యథాస్థితముగా గ్రహించునతడు 'ఆర్యుడ'నబడును.

**భూమికా త్రితయాఽభ్యాసా దజ్ఞానే క్షయమాగతే ।**
**అద్వైతే స్థైర్య మాయాతే, ద్వైతే ప్రశమ మాగతే ॥ 49 ॥**
**పశ్యతి స్వప్నవల్లోకం, చతుర్థీంభూమికాం గతః ।**

**49-50.** మూడు భూమికల నభ్యసించుట వలన, అజ్ఞానము క్షీణింపగా – అనగా జ్ఞానమునకు విరోధియైన ద్వైతవాసనా జాలమును, అసంభావన, విపరీతభావన యను దోషములును క్షీణింపగా, అద్వైతము స్థిరమై, ద్వైత ముపశమింపగా, చతుర్థ (నాల్గవ) భూమికను పొందినవాడైన యోగి, సర్వ జగత్తును స్వప్నతుల్యముగా గాంచును.

**పఞ్చమీం భూమికా మేత్య తిష్ఠ న్నద్వైత మాత్రకే ॥ 50 ॥**
**శాన్తాఽశేషవిశేషాంశః, నిద్రాళు రివ లక్ష్యతే ।**

**50-51.** పంచమభూమికను ప్రాపించి, కేవలాద్వైతమున (పరబ్రహ్మమున) నెలకొని, మిగిలిన సర్వభేదము లుపశమించినవాడైన యోగి, నిద్రించుచున్న వాని వలె కాన్పించును.

---

మండియో ఈ దేశంపై దండెత్తి వచ్చి, ఇచ్చట ద్రావిడు లనే జాతి వారిని, వారి నాగరికతను సర్వ నాశ మొనర్చిరని నేటికిని పాఠశాలలలోను, విశ్వవిద్యాలయాలలోను, సత్యశోధనలేని చరిత్రాధ్యాపకులు (History Lecturers) విద్యార్థులకు బోధించుచుండుట దురదృష్టము; చింత్యము. ఆర్యద్రావిడవాదము నిరస్తము. ఆర్యులను విదేశీయజాతివారి దండయాత్రకు ఆధారము, భారతీయములగు సమస్తవేదోపనిషత్, పురాణేతిహాసాది, సాహిత్యములో నెచ్చటను లేదని విజ్ఞు లెఱుగుదురు. ఆర్య, దస్యు, (దాస) శబ్దములు పరస్పర వ్యతిరేక శబ్దము లైనను, ఇవి జాతి వాచకములు కాక, జ్ఞాన అజ్ఞానములను సాధుత్వ క్రౌర్యములకు నిర్దేశించు శబ్దములు. [The Call of the Vedas - p. 35 (A.C. Bose 1954); History of Sanskrit Literature - C. KunhanRaja p. 47 (1962)]

కుర్వ న్నభ్యాస మేతస్యాం, షష్ఠీం పతతి భూమికామ్ ॥ 51 ॥
యత్ర తిష్ఠతి నిర్గ్రంథి[1], ర్జీవన్ముక్తో౽విభావనః ।

**51-52.** ఈ పంచమభూమికను అభ్యసించుచు, క్రమమ్ముగ షష్ఠ (ఆఱవ) భూమికను అధిరోహించి యోగి, హృదయగ్రంథిశూన్యుడు, సర్వ భావనారహితుడు, జీవన్ముక్తుడునై యుండును.

అన్తః శూన్యో బహిఃశూన్యః, శూన్యకుమ్భ ఇవా౽మ్బరే ॥ 52 ॥
అన్తఃపూర్ణో బహిః పూర్ణః, పూర్ణ కుమ్భ[2] ఇవా౽ర్ణవే ।

**52-53.** జడజగత్తు యొక్క స్వభావము లేని వాడగుట చేత, ఆకాశమందలి శూన్యకుంభము (కుండ) వలె,బాహ్యాభ్యంతరములందు శూన్యుడునై, నిరావరణమైన ఆనందమే స్వభావముగ గల వాడగుటచేత, సముద్రమందలి జలపూర్ణఘటమువలె, బాహ్యాభ్యంతరపరిపూర్ణుడునై, యోగి ప్రకాశించును. [కుంభము ఆకాశమునకు పరిమితిని కల్పింపజాలనట్లు, శరీరము, శుద్ధచైతన్యమునకు అవధులు కల్పింపజాలదు. నిరవధికమైన చైతన్యసాగరమే తన స్వస్వరూపమని దర్శించిన యోగికి, శరీరాదులచే వ్యష్టి చైతన్యమను విభాగము ఉండజాలదు.]

---

(1) గ్రంథిః – అవిద్యావాసనామయములైన రాగద్వేషాదులు, అహంకారము, లేక, గ్రంథి (బంధము, ముడి) వలె దృఢమై ఛేదించుటకు అలవి కానిది. అది లేనివాడు నిర్గ్రంథుడు. (నిర్గ్రంథి)
"శరీరస్యా౽౽త్మనశ్చా౽పి సంబన్ధో గ్రంథి రుచ్యతే "।
శరీరా౽౽త్మల సంబంధము గ్రంథియని చెప్పబడినది.
(రమణమహర్షి – రమణగీత -IX-3)
దేహాత్మబంధమే గ్రంథియని భావము.
పోల్చు :- "భిద్యతే హృదయగ్రన్థి శ్ఛిద్యన్తే సర్వసంశయాః ।" (ముం.ఉ.II-9)

(2) పోల్చు :- "ఊర్ధ్వశూన్య మధః శూన్యం, మధ్య శూన్యం యదాత్మకమ్ ।
సర్వ శూన్యం స ఆత్మేతి, సమాధిస్థస్య లక్షణమ్ ।"
"ఊర్ధ్వ పూర్ణ మధః పూర్ణం, మధ్య పూర్ణం యదాత్మకమ్ ।
సర్వ పూర్ణం స ఆత్మేతి సమాధిస్థస్య లక్షణమ్ ।" ఉత్తరగీత -I-35,37

ఊర్ధ్వదేశపరిచ్ఛేదవిభాగరహితము, అధోమధ్యదేశపరిచ్ఛేద రహితము, దేశకాలాది పరిచ్ఛేద రహితమునగు స్వరూపమే, ఆత్మయను భావన కల్గియుండుటయే, సమాధిస్థుడగు యోగిలక్షణము. అట్లే, దేశకాలాదులచే పరిచ్ఛిన్నము కాక, సర్వగతమై, పరిపూర్ణమైన ఆత్మయే, తన స్వరూపమని ధ్యానించుటయే, సమాధిస్థుడైన యోగి లక్షణము.
మఱియు. చూడు :– XXX (30వ) సర్గము 7వ శ్లోకము – పాదటీక.

షష్ఠ్యాం భూమ్యా మసౌ స్థిత్వా, సప్తమీం భూమి మాప్నుయాత్ । 53 ।
విదేహముక్తతా ప్రోక్తా, సా సీమా భవభూమిషు ।

53-54. యోగి, షష్ఠ (ఆఱవ) భూమిక యందున్నవాడై, క్రమముగ సప్తమ (ఏడవ) భూమికను పొందును. ఈ భూమిక, విదేహముక్తత్వమని పేర్కొనబడినది. ఇది ప్రాపంచిక భూమికలకు సీమ (మేర; అవధి).

కైశ్చిత్ సా శివ ఇత్యుక్తా, కైశ్చిత్ బ్రహ్మేత్యుదాహృతా । 54 ।
నానాభేదై ర్యథా బుద్ధి, కైశ్చిదప్యన్యథాఽన్యథా ।
నిత్య మవ్యపదేశ్యాఽపి, కథంచిత్ వ్యపదిశ్యతే ★ । 55 ।

54-55. ఇది వాక్కులకు అగమ్యము; యోగిమానసానుభవైకవేద్యము. "శివ మద్వైతం చతుర్థం మన్యన్తే ।" - [శివము (పరిశుద్ధము, పరమానంద బోధరూపము), అద్వైతము (భేదవికల్ప రహితము) తురీయమనియు,

★ చూడు :- XVIII - అష్టాదశ సర్గము - 38-40- శ్లోకములు- పాదటీక
"ఇన్ద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః, అథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్ ।
ఏకం స ద్విప్రా బహుధా వద న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ।
(ఋగ్వేదము I-164-46; అథర్వవేదము -IX-10-28)

ఇంద్ర, మిత్ర, వరుణ, అగ్ని, దివ్యాదులను, గరుత్మంతుడగు సుపర్ణుని, వారు పేర్కొందురు. సద్రూపమగు పరతత్త్వమొక్కటే యైనను, జ్ఞానులు, అగ్ని, యమ, మాతరిశ్వాది బహునామములతో దానిని వర్ణింతురు. సువర్ణశబ్దము వేదమునందు పరమార్థతత్త్వము (Ultimate Reality) నకు యోగసంబంధమైన సంకేతము.

"వాయు ర్యమోఽగ్ని ర్వరుణః శశాఙ్కః;
ప్రజాపతిస్త్వం, ప్రపితామహశ్చ ।" (భ.గీ.-XI-39)

"నీవు వాయుదేవుడవు, యముడవు, అగ్నివి, వరుణుడవు, చంద్రుడవు, ప్రజాపతి (బ్రహ్మ)రూపమున, లోకమునకు తండ్రివి. బ్రహ్మకు జనకుడు, ప్రపితా మహుడవును, నీవే"

"యత్సత్యం పరమార్థతః పరమిదం తద్బ్రహ్మ మాయావశా -
ద్భక్తాఽనుగ్రహణాయ శఙ్కరమయం, విష్ణ్వాఽఽత్మకం చాఽభవత్ ।
శ్రీమన్తం, పురుషం, తమూర్ధ్వగరసం, విశ్వాఽఽత్మకం వా విరూ -
పాఽక్షం చేతసి కృష్ణ పిఙ్గల మితం మూర్తిం నమస్కుర్మహే ।"
(వేదాన్తముక్తావళి-పూర్వార్ధ-213)

భక్తానుగ్రహణార్థము పారమార్థిక సత్యమగు బ్రహ్మమే, మాయావశమున, శివ, విష్ణు రూపములను పొందినది. కావున, యథారుచి, శైవమో, వైష్ణవమో పురాణ ప్రసిద్ధమైన విగ్రహము (రూపము)ను చిత్తమున కల్పించుకొని, బ్రహ్మ భావమున ధ్యానింపవలయును. ధ్యానమున చిత్త ప్రతిష్ఠితుడైన శివునకు - విష్ణువునకు - నమస్కరించుచున్నాము. ఈ శ్లోకమున 3,4 పాదములు శ్లేషాలంకారమున, మనోరమముగ, శివుని - విష్ణువును - ప్రతిపాదించుచున్నవి.

ఆత్మయనియు ఔపనిషదులు భావింతురు.] అను మాండూక్య శ్రుతిననుసరించి, కొందఱు, ఈ చరమభూమికను, శివుడనియు, కొందరు బ్రహ్మమనియు, మఱి కొందఱు వారి వారి బుద్ధి ననుసరించి, వికల్పములైన నానాభేదములచే, భిన్న భిన్నముగ భావించినారు. అది 'ఇది' అని వ్యపదేశించుటకు (పేర్కొనుటకు) అసాధ్యమైనను, ఏదో విధముగ –(భాగత్యాగలక్షణాభ్యుపాయములచేత) – ఉపదేశింప బడుచున్నది.

## 4. బ్రహ్మైకభావనమ్ – కేవల బ్రహ్మ ధ్యానము

అస్త్యత్యన్తమదోన్మత్తా, కరిణీచ్ఛాసమాహ్వయా ।
సా చే న్నహన్యతే నూన మనన్తాఽనర్థకారిణీ ॥ 56 ॥

56. 'ఇది నాకు కావలయును' – అను ఇచ్ఛయే స్వరూపముగా గల అత్యంతమదోన్మత్తమగునొక కరిణి (ఆడేనుగు) కలదు. దానిని చంపకున్నచో, అది, నిశ్చితముగ, అనంతమైన అనర్థముల(ఆపదల)కు కారణము కాగలదు.

భూమికాసు చ సర్వాసు, సఞ్చారో నైవ సాధ్యతే ।
వాసనేహా మన శ్చిత్తం, సఙ్కల్పో భావనం స్పృహా ॥ 57 ॥
ఇత్యాదీని చ నామాని, తస్యా ఏవ భవన్తి హి ।
ధైర్యనామ్నా వరాఽస్త్రేణ, చైతాం సర్వాఽఽత్మనా జయేత్★ ॥ 58 ॥

57-58. ఈ కరిణి వలననే, సర్వ యోగ భూమికలందు సంచారము సాధ్యపడుట లేదు. వాసన, ఈహ, మనస్సు, చిత్తము, సంకల్పము, భావనము, స్పృహ – ఇత్యాదులు దాని పర్యాయనామములే. ధైర్యనామకమగు శ్రేష్ఠమగు మహాస్త్రము చేత, సంపూర్ణముగా దానిని జయింపవలయును.

ఇదం మేఽస్త్వితి విజ్ఞానం, యత్త త్కల్పన ముచ్యతే ।
అర్థస్యాఽభావనం యత్తత్, కల్పనాత్యాగ ఉచ్యతే ॥ 59 ॥

---

★ పోల్చు:- "ధీవశాత్ సత్త్వ సిద్ధిః" – (శివసూత్రము. III-12)
బుద్ధిని వశమొనర్చుకొనుట (నిగ్రహించుట) వలననే పరమార్థ సిద్ధి.

59. "ఇది నాకు కలుగుగాక" - అన్న జ్ఞానమే కల్పనమనబడును. విషయ పదార్థములను భావింప (స్మరింప) కుండుటయే, కల్పనా త్యాగమన బడును.

**స్మరణం విద్ధి సఙ్కల్పం, శివ మస్మరణం విదుః ।**
**సర్వమేవాఽఽశు విస్మృత్య, మూఢవత్తిష్ఠ కాష్ఠవత్ ॥ 60 ॥**

60. విషయపదార్థ స్మరణమే, సంకల్పమని, వానిని స్మరింపకుండుటయే శివమని తెలియవలయును. సర్వమును (అనుభవించినదియు, అనుభవింపనిదియునైన, విషయజాతమును) పూర్తిగ వెంటనే విస్మరించి, మూఢుని వలె కాష్ఠము (కట్టె) వలె నుండుము.

**[సామాన్యసంభాషణమునందలి స్మృతిభ్రంశతను ఇది నిర్దేశింపదు. స్మృతి యను కళంకము లేని జ్ఞానము, జ్ఞాతృ జ్ఞేయ విభాగ రహితమగు అద్వయశుద్ధ చైతన్యమునకు హేతువగుచున్నది.]**

**ఊర్ధ్వ బాహుర్విరౌ మ్యేవం, న చ కశ్చి చ్ఛృ ణోతి తత్ ।**
**అసఙ్కల్పః పరంశ్రేయః, స కి మన్తర్న భావ్యతే ॥ 61 ॥**

61. నేను చేతుల మీదికెత్తి, "**అసంకల్పమే** (సంకల్పరాహిత్యమే) పరమ **శ్రేయము. దీనిని జనులేల తమ హృదయమున భావించుట లేదు?**" - **అని, మరల మరల ఉచ్చస్వరమున (ఎలుగెత్తి) ఆక్రోశించుచున్నాను** - మొఱలిడుచున్నాను. ఇది యెందుకు లోన, భావింపబడుట లేదు? **జను లెవరును నా మొఱ వినుట లేదు.**

**తూష్ణీ మవస్థితేనైవ, పరమం ప్రాప్యతే పదమ్ ।**
**పరమం యత్ర సామ్రాజ్య మపి రామ ! తృణాయతే ॥ 62 ॥**

62. సర్వేంద్రియ మనోవ్యాపార విరమణ స్థితి (కేవల తూష్ణీం భావ స్థితి యందుండుట) **చేతనే, పరమపదము** సంప్రాప్తించుచున్నది. అచ్చట, **ఆ భూమానందము నందు బ్రహ్మలోకపర్యంతమగు సామ్రాజ్య సుఖము సైతము, శ్రీరామా! తృణము** (గడ్డిపరక) **వలె తుచ్ఛత్వమును** పొందుచున్నది.

బహునాఽత్ర కిముక్తేన, సంక్షేపాదిద ముచ్యతే ।
సఙ్కల్పనం పరో బన్ధ స్తదభావో విముక్తతా ॥ 63 ॥

63 ఈ విషయమున అధికముగ చెప్పుట వలని ప్రయోజనమేమి? సంకల్పించుచుండుటయే, పరమబంధము. అది లేకుండుటయే మోక్షము.

అవేదనం విదు ర్యోగం,[1] చిత్తక్షయ మకృత్రిమమ్ ।
యోగస్థః కురుకర్మాణి, వికర్మాణి చ మా కురు ! । 64 ।
అకర్మనిరతో మా భూః, బన్ధసంభవశంకయా ।

64-65. అట్టి దృష్టి పరిణతి వలన, అహమ్, మమేతి (నేను నాది - యని) అధ్యస్తములైన సర్వభేదములను విస్మరించుటయే, జీవబ్రహ్మైక్య లక్షణమైన యోగమని బ్రహ్మవిదు లెఱుగుదురు. ఇదియే సహజమైన చిత్తక్షయము. యోగమునందు ప్రతిష్ఠితుడవై కర్మల నాచరింపుము.[2] పరమాత్మ సిద్ధికి నిన్ను దూర మొనర్చు నిషిద్ధ కర్మల నాచరింపకుము.

---

(1) పోల్చు :- "యదా పఞ్చాఽవతిష్ఠన్తే, జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టిత, (విచేష్టతే) తా మాహుః పరమాం గతిమ్ । (కఠ.ఉ. VI-10)

ఎప్పుడు, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు, స్వవిషయముల నుండి మఱలినవై, సంకల్ప వికల్పవిముఖమైన మనస్సుతో కూడి, ఆత్మ యందే నిలిచి యుండునో, ఎప్పుడు అధ్యవసాయ లక్షణాత్మకమగు బుద్ధియు, స్వవ్యాపార విముఖమై ,చేష్టా విరహితమై యుండునో, ఆ స్థితియే పరమగతి యని జ్ఞానులు వచింతురు.

"తాం యోగ మితి మన్యన్తే, స్థిరా మిన్ద్రియధారణాం ।
అప్రమత్త స్తదా భవతి, యోగో హి ప్రభవాఽవ్యయౌ । (కఠ.ఉ.VI-11)

స్థిరమైన బాహ్యాంతరింద్రియ ధారణము యోగమందురు. యోగాభ్యాస కాలమున, అప్రమత్తత, అత్యంతము అవసరము.. ఏలయన యోగము, జననాపాయ ధర్మములు కలది. కావున యోగి, అప్రమత్తుడై – అవధానవంతుడై యుండవలయును.

(2) తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్ । (భ.గీ.VI-23)

దుఃఖమునకు అత్యంతిక నివృత్తి కల్గు స్థితియే యోగమని తెలిసికొనుము.

యోగస్థః కురుకర్మాణి । (భ.గీ. II-48)

మా తే సఙ్గోఽస్త్వ కర్మణి । (భ.గీ.II -47)

యోగమున ప్రతిష్ఠితుడవై (కర్మఫలాసక్తి రహితుడవై), కర్మల నాచరింపుము. నీకు కర్మ త్యాగమున ప్రీతి - (ఆసక్తి) కలుగకుండు గాక!. -అని భగవంతుడును, కర్మయోగమును ఉపదేశించినాడు.

బంధకారణమగునన్న సంశయముతో అకర్మనిరతుడవుకాకుము. కర్మత్యాగ మొనరింపకుము.

**శివం, సర్వగతం, శాన్తం, బోధాత్మక మజం, శుభమ్ ।65।**
**తదేక భావనం రామ! కర్మత్యాగ ఇతి స్మృతః । 66 ।**

**65-66.** శ్రీరామా! శివము, సర్వగతము, బోధాత్మకము, అజము, శుభమునైన పరతత్త్వమున్నది. **తదేకభావనయే (ధ్యానమే) కర్మత్యాగ మని స్మరింపబడినది.** (సర్వ ప్రపంచనివృత్తి రూపత్వము వలన, ఈ స్థితి, సర్వత్యాగరూపమైనను, శివమని స్తుతింపబడినది).

ఇతి శ్రీయోగవాసిష్ఠ సంగ్రహే 'భూమికా జయో'నామ ఏకత్రింశః సర్గః

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'భూమికా జయ'మను

ఏకత్రింశత్తమ (ముప్పది యొకటవ) సర్గము సమాప్తము.

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు !



ఓం పూర్ణ మదః పూర్ణమిదం, పూర్ణాత్ పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణ మాదాయ, పూర్ణ మేవాఽవ శిష్యతే ।



ఓం నమః పరమాత్మనే ।

ఓం నమో బ్రహ్మణే, బ్రహ్మవిద్భ్యో, బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో,
వసిష్ఠ, విశ్వామిత్ర, వాల్మీకి, వ్యాస, శుకాదిభ్యః, శ్రీరామభద్రాయ చ ।

# శ్రీ యోగవాసిష్ఠసంగ్రహము

## ద్వాత్రింశసర్గము

## గ్రన్థోపసంహారః - గ్రంథసమాప్తి

### 1. భరద్వాజ ప్రబోధనమ్ : - భరద్వాజుని జ్ఞాన ప్రాప్తి

వాల్మీకి రువాచ :-
జ్ఞానసారం వసిష్ఠోక్త మిదం మాకర్ణ్య రాఘవః ।
ముహూర్త మాప్య దుద్బుద్ధః, చైతన్యాఽఽనన్ద సాగరః ॥ 1 ॥
మహాసామాన్యరూపత్వా చ్చిద్వ్యాపకతయా స్థితః ।
న కించిదూచే సంపన్నః, శివే పరిణతః పదే ॥ 2 ॥

1-2. వాల్మీకి :- వసిష్ఠమహర్షి వచించిన జ్ఞానసారమును రాఘవుడు ఆకర్ణించి, ముహూర్తమాత్రము (48 నిమిషముల కాలము) స్వస్వరూపమున జాగరితుడై వికాసమొంది, ఆనందసాగరమై యుండెను. సర్వాధిష్ఠాన సత్తాసామాన్యస్థితిని పొందుట చేతను, చిత్స్వరూపవ్యాపకత్వముచేతను,

సర్వవ్యాపకస్థితి నొంది, నిరతిశయానందపదమున పరిణతుడై సర్వపరిపూర్ణుడై -(బ్రహ్మముతోనేకత్వమొంది) - శ్రీరాము డేమియు వచింపడయ్యెను.

**భరద్వాజ ఉవాచ :-**

**అహో! ఖలు మహాశ్చర్యం, రామః ప్రాప్తో మహత్పదమ్ ।**
**కథ మేతాదృశీ ప్రాప్తి, రస్మాకం? మునినాయక ! । 3 ॥**

**దుష్పారశ్చ భవామ్భోధి ర్మయా చ తీర్యతే కథమ్ ?।**

3-4. భరద్వాజుడు :- ఆహా! శ్రీరాముడు మహాపదమును - (పరమాత్మ స్థితిని) - పొందుట నిశ్చయముగా మహాశ్చర్యము. మాకట్టి ప్రాప్తి మునీంద్రా! ఎట్లు లభించును? తరించుట కలవి గాని సంసార సాగరమును నేనెట్లు తరింతును?

**వాల్మీకి రువాచ :-**

**అశేషం రామ వృత్తాన్త ఆదితో యో నిరూపితః । 4 ।**
**తం విచార్య ధియా సమ్యక్పరామృశ స్వయం పునః ।**

4-5. **వాల్మీకి :- శ్రీరాముని వృత్తాంతము సర్వమును మొదటి నుండి వసిష్ఠ వాక్యానుసారముగ నీకు నిరూపింపబడినది. దీనిని స్వయముగ బుద్ధితో మరల, పలుమారు, చక్కగా విచారించి, పరామర్శించి, తెలిసికొనుము.**

**అవిద్యయా జగత్ జాతం, నాఽస్తి సత్యమిహాఽణ్వపి । 5 ।**
**వివేచయన్తి విబుధాః, వివదన్త్యవివేకినః ।**
**నాఽస్తి భిన్నం చితః కిఞ్చిత్, స్వప్నవృత్త మిదం జగత్ । 6 ।**

5-6. మిథ్యారూపమగుఅవిద్యవలన, ప్రపంచము కల్పితము. ఇచట అణుమాత్రమైనను సత్యము లేదు. జ్ఞానులు దీనిని గూర్చి వివేచింతురు. **కాని, అవివేకులు ఒకరితో నొకరు వివదించుకొనుచుందురు. శుద్ధ చైతన్యమున కంటె భిన్నముగ నొకింతైనను లేదు. ఆద్యంతకాలములందు లేనందున, మధ్యకాలమున నైతమీ ప్రపంచము లేనిదే. ప్రపంచము, స్వప్నవృత్తాంతము. (స్వప్నము వలె అనుమేయము మాత్రమే.)**

అవిద్యాయోనయో భేదాః, సర్వేఽమీ బుద్బుదా ఇవ ।
క్షణ ముద్భూయ గచ్ఛన్తి, జ్ఞానైక జలధౌ లయమ్ ॥ 7 ॥

7. ఈ కనపడుచున్న భేదములన్నియు అవిద్యాజన్యములు. ఇవి అన్నియు, కేవలము, జ్ఞానసాగరమున బుద్బుదముల వలె క్షణములో నుద్భవించి, అప్పుడే లయించుచున్నవి.

సాకారం భజ* తావత్ త్వం, యావత్సత్త్వం ప్రసీదతి ।
నిరాకారే పరే తత్త్వే, తతః స్థితి రకృత్రిమా ॥ 8 ॥

---

★ పోల్చు :- "ఉమాసహాయం, పరమేశ్వరం, ప్రభుం,
త్రిలోచనం, నీలకణ్ఠం, ప్రశాన్తమ్ ।
ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం ।
సమస్తసాక్షిం తమసః పరస్తాత్ ॥" (కైవల్య – ఉ.7)

పార్వతీ సహితుడు, ప్రభువు, త్రిలోచనుడు, నీలకంఠుడు, ప్రశాంతుడునైన పరమేశ్వరుని ధ్యానించి, ముని(మనన శీలుడు), సర్వ జగత్కారణుడు, సమస్త సాక్షియు, మాయాతీతుడునైన పరమేశ్వరుని సాక్షాత్కారమును పొందును.

"యావ న్నపశ్యేదఖిలం మదాత్మకం,
తావ న్మదారాధన తత్పరో భవేత్ ।
శ్రద్ధాలు రత్యూర్జిత భక్తి లక్షణో,
య స్తస్య దృశ్యోఽహ మహర్నిశం హృది ॥
(అధ్యాత్మరామాయణము – ఉత్తరకాండ –V శ్రీరామగీత – 58)

శ్రీరాముడు :-
"ఎంత వఱకు సర్వమును మదాత్మకముగా, (బ్రహ్మాత్మకముగా) కాంచడో, అంత వఱకు మనుజుడు, సగుణరూపమున నన్నారాధింపవలయును. శ్రద్ధాళువు, అత్యధికభక్తిలక్షణ సంపన్నుడునగు వాని హృదయమున అహర్నిశము నేను సాక్షాత్కరింతును." – అని శ్రీరాముని ఉపదేశము.

మఱియు, "నిత్యం స్మరన్ జలదనీల ముదారహార –
కేయూరకుణ్డలకిరీటధరం హరిం వా ।
గ్రీష్మే సుశీత మివ వా హ్రద మస్తశోకం,
బ్రహ్మ ప్రవిశ్య, భజ నిర్వృతి మాత్మనీనమ్ ॥" (ప్రబోధచంద్రోదయము -V-31)

మొదట సగుణమూర్తిని – నీలమేఘశ్యాములుడు, రమణీయహార కేయూర కుండల కిరీట ధారిని, సాకారుని హరిని, ధ్యానింపవలెను. ఈ సాకార ధ్యానమున సవికల్పసమాధిని సాధకుడు పొందును. తరువాత, నిర్వికల్పసమాధి యందు గ్రీష్మకాలమున శీతలహ్రదమున ప్రవేశించినట్లు, శోకరహితమగు బ్రహ్మమున ప్రవేశించి, విక్షేపరహితమగు నిర్వృతిని – (స్వరూపానిర్వాణ లక్షణమగు నిర్వాణమును) ఆత్మహితమును, పొందుచున్నాడు. (మఱియు చూడు. సర్గ 23– శ్లో 33–పాదటీక)

8. నీ చిత్తము ప్రసన్నమగు వఱకు (చిత్తశుద్ధి కలుగునంత వఱకు), సాకారమును భజింపుము. (సగుణారాధన మొనరింపుము.) చిత్తము శుద్ధమైనంతనే, నిరాకారమగు నిర్గుణపరబ్రహ్మము నందు సహజస్థితి సిద్ధించును.

కృతం పురుషకారేణ, కేవలేన చ కర్మణా ।
మహేశాఽనుగ్రహాదేవ, * ప్రాప్తవ్యం ప్రాప్యతే నరః ॥ 9 ॥

---

★ పోల్చు :- "న కామ్య ప్రతిషిద్ధాభిః క్రియాభి ర్మోక్షవాసనా ।
ఈశ్వరానుగ్రహాత్ సా స్యాత్ ఇతి వేదాన్త డిణ్డిమ ॥"
(శంకరుడు - వేదాంత డిండిమము - 72)

కామ్యనిషిద్ధకర్మానుష్ఠానము వలన మోక్షవాసన కలుగదు; ఈశ్వరానుగ్రహమువనే లభించునని వేదాంతభేరి.

"ఏష సర్వేశ్వర, ఏష భూతాఽధిపతి, రేష భూతపాల, ఏష సేతుర్విధరణ,
ఏషాం లోకానా మసంభేదాయ ।
త మేతం, వేదానువచనేన బ్రాహ్మణా, వివిదిషన్తి ॥" ఇత్యాది (బృ.ఉ.IV-4-22)
అతడు సర్వేశ్వరుడు సర్వభూతాధిపతి, భూతపాలకుడు, వివిధ లోకములను కలసి పోకుండ నుండజేయు సేతువు. అని శ్రుతులు ఈశ్వరుని వర్ణించుచున్నవి. ఈశ్వరుని గుఱించిన వేదాంత సిద్ధాంతమిదియే.

"పరాత్తు తచ్ఛ్రుతేః ॥" (బ్ర.సూ.II-3-41)
పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బన్ధవిపర్యయౌ ॥ (బ్ర.సూ.III-2-5)

శ్రుతిప్రామాణ్యము వలన, జీవుని కర్తృత్వము, పరమేశ్వరుని నుండియే కల్గుచున్నది. అవిద్యావస్థ యందు అజ్ఞానతిమిరాంధుడైన జీవునకు, శరీరేంద్రియసంఘాతమున కంటె, తాను వేఱన్న జ్ఞానము లేకుండుట చేత, కర్తృత్వ భోక్తృత్వ లక్షణమగు సంసారావస్థ, పరమాత్మయు, కర్మాధ్యక్షుడు, సర్వభూతాధివాసుడు, సాక్షి, సర్వచైతన్య హేతువు నగు పరమేశ్వరుని ఆజ్ఞ వలననే సిద్ధించుచున్నది. తదనుగ్రహహేతుకమగు విజ్ఞానము చేతనే మోక్షసిద్ధియు కల్గుచున్నది. పరమేశ్వరధ్యానము వలన, అంతర్హితమై యున్న జీవుని ఈశ్వరత్వము అభివ్యక్తి నందును. ఏలయన, పరమేశ్వరుని వలననే కదా, జీవుని బంధమోక్షములని బ్రహ్మసూత్రములందు బాదరాయణ (వ్యాస) మహర్షి స్థాపించినాడు.

"అపి చ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్ ॥" (బ్ర.సూ.III-2-24)
పరిపూర్ణధ్యానమున (భక్తి ధ్యాన ప్రణిధానాది అనుష్ఠానమున) యోగులు పరమేశ్వరుని దర్శించుచున్నారని శ్రుతి స్మృతుల వలన తెలియుచున్నది.

"యోగిన స్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్ ॥"
సనాతనుడైన భగవంతుని యోగులు చూచుచున్నారు ॥ (సనత్సుజాతీయము IV-1)
దీని వలన అద్వైత వేదాంతమున, లేక, జ్ఞాన యోగమున, భక్తికి స్థానము లేదను శుష్క వేదాంతుల వాదములు నిరస్తములు.

మఱియు, "ఈశ్వరాఽనుగ్రహాదేవ, పుంసా మద్వైతవాసనా
మహద్భయ పరిత్రాణా ద్విప్రాణా ముపజాయతే ॥"
(దత్తాత్రేయుడు - అవధూతగీత - 1)
జన్మమృత్యుజరావ్యాధిమయమగు సంసారరూపమగు మహత్తర భయము నుండి రక్షించుకొనుటకు, జ్ఞానులగు పురుషులకు భగవంతుని అనుగ్రహము చేతనే, పరమాత్మ కంటె భిన్నమగు పదార్థమేదియు లేదను అద్వైత వాసన యుదయించుచున్నది.

9. భక్తి రహితమైన కేవల పురుషప్రయత్నము చేతను, సత్కర్మానుష్ఠానము చేతనుకాక, పరమేశ్వరానుగ్రహము చేతనే, మనుజుడు పొందదగిన ఫలమును పొందుచున్నాడు.

నాఽఽభిజాత్యం న చారిత్రం, న నయో న చ విక్రమః ।
బలవన్తి పురాణాని,* నూనం కర్మాణి కేవలమ్ ॥ 10 ॥

10. కులీనత్వము, సదాచారము, నీతి, పరాక్రమము – ఇవి యేవియును, ఈశ్వరానుగ్రహము లేకున్న శక్తిమంతములు కావు; సిద్ధిని కలిగింపజాలవు. ఏలయన, పూర్వోపార్జిత కర్మములు అనంతములు. ఇప్పటి పురుష ప్రయత్నము అల్పములగుటచే, ఈశ్వరాఽనుగ్రహము లేకున్న జయసిద్ధి అసంభవము. (అట్లైన, ఈశ్వరోపాసనయే కార్యము. కాని, యమ,

---

★ పురాతనకర్మణా మనన్తత్వా దిదానీన్తన పురుష ప్రయత్నానా మల్ప తరత్వాన్నేశ్వరాఽనుగ్రహ మన్తరేణ తజ్జయ సిద్ధిః । ఈశ్వరానుగ్రహ సాహాయ్యం హ్యధికృత్యైవ ప్రాగైహిక ప్రయత్న ప్రాబల్యం సాధితం, న తద్విహా యేతి భావః । (యో.వా- నిర్వాణ - పూర్వార్ధ-సర్గ 127. శ్లో.39-తా.ప్ర.)
మనుజులందు, ప్రమాదాలస్యనిద్రాదులగు తమోగుణలక్షణములను, (సోమరితనమును), నిరసించుటకై, పురుషప్రయత్నమునకు, అప్రమాదమునకు, ఉపదేశారంభమున, వసిష్ఠమహర్షి, అత్యంత ప్రాధాన్యమొసగినను, ఉపదేశాంతమున, సాధకుల చిత్తపరిపాకస్థితి ననుసరించి, ఈశ్వరానుగ్రహ మొక్కటే, మనుజుని ప్రాప్తవ్య సిద్ధికి (పొందవలసిన పరమాత్మను పొందుటకు) హేతువని స్థాపించుట గమనార్హమైన శ్రుతి సిద్ధాంతము.

"నాఽయమాత్మా ప్రవచనేన లభ్యో,
న మేధయా, న బహునా శ్రుతేన ।
యమేవైష వృణుతే తేన లభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ం స్వామ్ । (కఠ. ఉ.II-23)

ఉపాసకుని యొక్క భగవద్విషయిణియగు ప్రీతి, (పరానురక్తి), భగవంతునికి, ఉపాసకుని యందు ప్రీతి నుత్పాదించి, తత్ప్రాప్తికి హేతువగుచున్నది. ఈశ్వరానుగ్రహరహితముగ, కేవలమైన వివిధసాధనలు, పరతత్త్వప్రాప్తిని కల్గించుటకు సమర్థములు కాజాలవు.

"శ్రుత్వా తత్త్వమసీత్యేవం బోధ్య మాహోఽప్యనేకధా ।
న విజానాత్యయం తత్త్వ మీశానుగ్రహవర్జితః ॥"
(శంకరుడు – మహావాక్యదర్పణము–232)

"సమాప్తి తైలధారావ ద్యాప్రీతిః పరమేశ్వరే ।
అవిచ్ఛిత్తోఽపి సా బుద్ధిం, స్వరూపం నయతి ధ్రువమ్ ॥"
(అరుణాచలరమణ మహర్షి – రమణగీత XVI-4)

భగవద్విషయకమగు ప్రీతి, కోరని వాని యొక్క బుద్ధిని సైతము, ఆత్మస్వరూపమును పొందించుచున్నది.

నియమ, జ్ఞానాదుల వలని ప్రయోజనమేమి యని భావించిన, అట్లు కాదు.)

న లుమ్పతి లలాటస్థా మీశ్వరోఽవ్యక్తరావళిమ్ ।
బోధం పుణ్యపరాధీనం, లభతే బహుజన్మభిః ॥ 11 ॥

11. నుదుటి వ్రాలు, ఉపాసనచే ప్రసన్నుడైన ఈశ్వరుడు సైతము, ప్రత్యక్షముగా వచ్చి, స్వహస్తమున తుడిచి వేయడు. జ్ఞానకృత మూలోచ్ఛేదోపాయము చేతనే అది సాధ్యము. [జ్ఞానాదులు లేకున్న, వానిని సాధింపకున్న, భగవంతుడును, ఏమియు చేయజాలడు]. అనేక జన్మార్జిత పుణ్యములు ఫలించిననే కాని, బోధము (జ్ఞానము) సిద్ధింపదు. కావున ఈశ్వరానుగ్రహ పూర్వకముగ ప్రయత్నించి, జ్ఞానము నార్జించి, దానిచే (ధర్మాదిసహితమగు ఆ జ్ఞానముచే,) అజ్ఞానమును వశింపజేయుము.

అనుమీయేత ధీరేషు, జీవన్ముక్తేషు కార్యతః ।
త్యజ శోక మమఙ్గళ్యం, మఙ్గళాని విచిన్తయ ॥ 12 ॥

12. పుణ్యవంతులగు ధీరుల యందును, జీవన్ముక్తుల యందును, వారి కార్యములను బట్టి, పుణ్యసామగ్రి ఉన్ననే బోధము (జ్ఞానము) కల్గుచున్నదని, అభ్యూహింపబడుచున్నది. (కావున పుణ్యార్జనమునకు, సద్ధర్మానుష్ఠానమునకు, మొదట ప్రయత్నింపవలయును). అమంగళకరమైన శోకమును త్యజించి ఈశ్వరానుగ్రహసాధనములగు మంగళములను విచారింపుము.

అఖిన్నం క్షణ మాసీనః, పశ్య, సంసారనాటకమ్ ।
చిదానన్దఘనం స్వచ్ఛ, మాత్మానం చ విభావయ ॥ 13 ॥

ఏవం స్థాస్యసి నిత్యం చేత్, తీర్ణోఽపి భవసాగరాత్ ।

13-14. దుఃఖమును విడిచి, క్షణకాలము నిశ్చలముగా నాసీనుడవై, సంసార నాటకమును వీక్షింపుము [సాక్షిస్వరూపుడవైన నీకు, సంసార వర్తనమును కుతూహలముతో దర్శించుట యుక్తమగును గాని, శోకమోహాది వికారములతో స్వయముగా నర్తించుట తగదు.] చిదానంద ఘనమును, నిర్మలమునైన ఆత్మను ధ్యానింపుము. ఏరతరత మిట్లు నిలుకడ పొంది యున్నచో, భవసాగరమును తరించిన వాడ వగుదువు

2. శ్రీరామనిర్వృతిః – శ్రీరాముని పరమశాంతి ప్రాప్తి

భరద్వాజ ఉవాచ :–

రామః ప్రాప్తః పరం యోగం, స్వాత్మనాఽఽత్మని నిష్ఠితః ॥ 14 ॥
కథం వసిష్ఠదేవేన, వ్యవహారపరః కృతః ? ।

14-15. భరద్వాజుడు:– శ్రీరాముడు స్వయముగ ఆత్మనిష్ఠితుడై, ఉపాధి నశించుటచే, బ్రహ్మైక్యరూపమగు పరమయోగమును పొందెను. వసిష్ఠదేవుడు, అట్టి శ్రీరాము నెట్లు మరల వ్యవహారపరునిగ జేయగల్గెను?

వాల్మీకి రువాచ :–

వసిష్ఠః ప్రోక్తవాన్ రామం, విశ్వామిత్రేణ చోదితః ॥ 15 ॥

15. వాల్మీకి :– విశ్వామిత్రునిచే ప్రేరితుడై వసిష్ఠుడు, శ్రీరాముని కిట్లు వచించెను.

"రామ! రామ! మహాబాహో! మహాపురుష! చిన్మయ ! ।
నాఽయం విశ్రాన్తి కాలో హి, లోకాఽఽనన్దకరో భవ ! ॥ 16 ॥

16. "మహా బాహుడవైన శ్రీరామా! నీవు మహాపురుషుడవు; జ్ఞానమయుడవు. ఇది నీకు వాస్తవముగ విశ్రాంతి కాలము కాదు. నీవు లోకమునకు ఆనంద కరుడవు కమ్ము.

యావల్లోక పరామర్శో, విరూఢో నాఽస్తి యోగినః ।
తావ ద్రూఢసమాధిత్వం, న భవత్యేవ నిర్మలమ్ ॥ 17 ॥

17. ఎంత వఱకు అధికార నిష్పాదన రూపమైన లోకము యొక్క పరామర్శ, (పరామరిక) యోగికి విరూఢము కాదో (సాధింపబడదో), అంత వఱకు, నిర్మలమైన సుస్థిరసమాధిత్వ మాతనికి యుక్తముకాదు; కలుగనేరదు.

తస్మా ద్రాజ్యాఽఽదికార్యాణి, నిర్వర్తయ యథాక్రమమ్ ।
దేవకార్యం తథా కృత్వా, తతస్త్యక్త్వా సుఖీభవ" ! ॥ 18 ॥★

18. కావున, రాజ్యాదికములైన కార్యములను యథాక్రమముగా నిర్వర్తించి, అట్లే, దేవకార్యాదికములను, అధికారభారములను సైతము నిర్వర్తించి, అటు పిమ్మట, వానిని త్యజించి, సమాధినిష్ఠుడవై సుఖివి కమ్ము".

ఏవముక్తో వసిష్ఠేన, రామో దాశరథి స్తదా ।
సర్వైషణా వినిర్ముక్తో, వినయా దిదమబ్రవీత్ ॥ 19 ॥

19. ఇట్లు వసిష్ఠుడు వచింపగా, కృతకృత్యుడగుటచే, సర్వైషణా వినిర్ముక్తుడైన దశరథనందనుడు, శ్రీరాముడు, వినయమున నిట్లు వచించెను.

"విధి ర్వా మే నిషేధో వా, త్వత్ప్రసాదా న్న విద్యతే ।
ఏవం సత్యపి వాక్యం తే, కరణీయం మయా సదా ॥ 20 ॥

20. స్వామీ! మీ అనుగ్రహము వలన నాకు విధి నిషేధములు లేవు. [ఆత్మ సాక్షాత్కార సిద్ధిచే సర్వబంధ విముక్తుడనైన నేను, విధి నిషేధములచే బద్ధుడను కాను.] అయినను, మీ ఆజ్ఞ, నాకు సర్వదా ఆచరణీయము.

---

★ Illumination and Action become incompatible when we artificially divide the total activities of man into spiritual and secular; but this is certainly against the true spirit of Indian Culture. From times immemorial India has been seeking to harmonise into an integral experience the apparently diverse ideals of **Brahma** and **Kshatra**, of **Sānkhya** and **Yōga**, of **Mōkshadharma** and **Rajadharmā**, or Speaking in terms of mystical philosophy, of **Ākasa** and **Prāna**, of **Spirit and Life.** And with a true intuition, **she has sought to make the spirit the guide of Life, since it is in spirit in its widest sense that Life has its chance of progression and fulfilment.** (Buddhi Yoga of the Gita and other Essays - Buddhi and Buddhi Yoga - P.76 - Anirvan - 1991)

పరస్పర విరుద్ధములట్లు కాన్పించు జ్ఞానకర్మాదులను సమన్వయపరచి, ఆత్మను, జీవిత మార్గోపదేష్టగా చేసికొనుటకు, తన సహజావబోధమున భారతవర్షము, అనాది కాలము నుండి ఆకాంక్షించినది. ఏలయన, విస్తృతార్థమున ఆత్మయందే, జీవితము యొక్క పరిణామ సాఫల్యములు ఇమిడి యున్నవి. యోగవాసిష్ఠమందలి జీవన్ముక్తుల యుదంతములన్నియు, ఈ సమరసపూర్ణ దృష్టికి జీవద్భాష్యములే.

**వేదాగమపురాణేషు, స్మృతిష్వపి మహామునే ! ।**
**గురోర్వాక్యం విధిః ప్రోక్తో, నిషేధ స్తద్విపర్యయః ॥ 21 ॥**

21. మహామునీ! వేదములందును, ఆగమములందును, పురాణములందును, స్మృతులందును, గురువాక్యము విధి (తప్పక ఆచరింపదగినది) యనియు, తద్వ్యతిరిక్తమైనది, నిషేధము (విడువదగినది) అనియు, చెప్పబడి యున్నది.

**ఇత్యుక్త్వా చరణౌ తస్య, వసిష్ఠస్య మహాత్మనః ।**
**శిరస్యాధాయ సర్వాత్మా, సర్వాన్ ప్రాహ దయానిధిః ॥ 22 ॥**

22. ఇట్లు పలికి, మహాత్ముడగు వసిష్ఠమునీంద్రుని చరణములను శిరమున ధరించి, సర్వాత్ముడు, కృపానిధి యగు శ్రీరాముడు సభ్యులందఱి కిట్లు వచించెను.

**"సర్వే శృణుత! భద్రం వో, నిశ్చయేన సునిశ్చితమ్ ।**
**ఆత్మజ్ఞానాత్ పరం నాఽస్తి, గురో రపి చ తద్విదః ॥ 23 ॥**

23. "సభ్యులారా! మీరందఱును నిశ్చయముతో సునిశ్చితమైన ఈ వాక్యమును వినుడు. ఆత్మ జ్ఞానమున కంటెను, దాని నెఱిగిన గురువున కంటెను ఉత్కృష్టమైన దీప్రపంచమున మఱేదియును లేదు."

**రాఘవస్య తదా మూర్ధ్ని, పుష్పవృష్టిః పపాత హ ।**

24. అప్పుడు శ్రీరాముని శిరమున పుష్పవర్షము కురిసినది.

**ఏతత్తే సర్వమాఖ్యాతం, రామచన్ద్రకథానకమ్ ॥ 24 ॥**
**అనేన క్రమయోగేన, భరద్వాజ! సుఖీ భవ ! ।**
**వీరాగ స్తిష్ఠ నిశ్శఙ్కో, జీవన్ముక్తః ప్రశాన్తధీః ॥ 25 ॥**

24-25. భరద్వాజా! శ్రీరామచంద్రుని జీవన్ముక్తిప్రశాంతిపర్యంతసంవాద రూపమగు కథానక (కథాసంగ్రహ) మంతయు నీకు చెప్పితిని. ఏ ఏ క్రమము ననుసంధించి, (ఈచక్కని దృష్టిని అవలంబించి), **రాగరహితుడవు, నిశ్శంకుడవు, ప్రశాంతబుద్ధివి, జీవన్ముక్తుడవువై, సుఖింపుము.**

మోక్షోపాయా నిమాన్ పుణ్యాన్, ప్రత్యక్షాఽనుభవాఽర్థదాన్ ।
బాలోఽప్యాకర్ణ్య తద్జ్ఞత్వం, యాతి కా త్వాదృశే కథా? । 26 ।

26. ప్రత్యక్షానుభవరూపఫలమును ప్రసాదించు పుణ్యములైన ఈ మోక్షోపాయము లను, విని, బాలుడు సైతము, ఆత్మజ్ఞానమును పొందును. ఇక నీ వంటి వారిని గుఱించి ఏమి చెప్పవలయును?

సంవాదం శృణుయా న్నిత్యం, యది రామవసిష్ఠయోః ।
సర్వాఽవస్థోఽప్యసౌ నూనం, ముక్తి మార్గం నిగచ్ఛతి" । 27 ।

27. శ్రీరామచంద్ర వసిష్ఠుల సంవాదమును నిత్యము శ్రవణ మొనరించినచో, మనుజుఁడు, మోహము, మాలిన్యము, రాగము, ద్వేషము, మహాపాతకములు, ఉపపాతకములు మొదలగు సర్వదోషావస్థలతో కూడిన వాడైనను, తచ్ఛ్రవణ మాత్రముననే, సర్వదోషముల నుండి విముక్తుడై, క్రమముగా, శాంతిదాంత్యాదిగుణములను పొంది, నిశ్చయముగా మోక్ష మార్గమున ప్రవిష్టుడగుచున్నాడు. (ఇది ఫలశ్రుతి)

యత్సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలాఽ నితి* చ స్ఫుటమ్ ।
శ్రుత్యా హ్యుదీర్యతే సామ్ని, తస్మై బ్రహ్మాత్మనే నమః । 28 ।

---

* బ్రహ్మము నుండియే నామరూపాత్మకమైన ఈ సమస్తజగత్తు, జన్మస్థితిలయములను బొందుచుండుట వలన, సర్వమును బ్రహ్మాత్మకమని, శమదమాది సహితుడై – రాగ ద్వేషాది దోష రహితుడై, సంయమశాలియై, మనుజుడు ఉపాసింపవలయును. (శాన్త ఉపాసీత)
తజ్జలాన్ – (తత్ – జ + ల + అన్)
బ్రహ్మము నుండియే, తేజోఽబన్నాఽది క్రమమున విశ్వము, జన్మలయ స్థితులను పొందుచుండుట వలన, ఈ విశ్వము 'తజ్జము', 'తల్లము', 'తదనితము' (స్థితి కాలమున దాని చేత ప్రాణితము, చేష్టితము) అని, శ్రుతి (ఛాం.ఉ. III-14-1) బ్రహ్మాత్మకమై త్రికాలములందును సమముగ బ్రహ్మవ్యతిరిక్తముగ గ్రహించుటకు సాధ్యము కానందున, ఈ విశ్వము బ్రహ్మమేయని బోధించుచున్నది. సర్వమును బ్రహ్మాత్మకమగుట వలన, శాంతుడై, రాగద్వేష రహితుడై, ముముక్షువు, సర్వమగు బ్రహ్మమును ఉపాసింపవలయును. సామవేదము, వేదములలో భగవద్విభూతి యని స్తుతింపబడినది.
('వేదానాం సామవేదోఽస్మి' – భ.గీ. X-22) "సామాని యో వేద స వేద సర్వమ్" । – సామము నెఱిగినవాడు సర్వవేదజ్ఞుడనియు చెప్పబడినది. అట్టి సామవేదీయమగు ఛాందోగ్యోపనిషత్తు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను మహా వాక్యము నుపదేశించినది. యోగవాసిష్ఠము సామవేదార్థ సారమనియు మహాత్ములందురు.
మఱియు పోల్చు :-
"యదా భూత పృథగ్భావ మేకస్థ మను పశ్యతి ।
తత ఏవ చ విస్తారం, బ్రహ్మ సమ్పద్యతే తదా । (భ.గీ. XIII-30)

28. ఏ బ్రహ్మము సామవేదమున "సర్వం ఖల్విదం బ్రహ్మ, తజ్జలానితి శాన్త ఉపాసీత" అని ఛాందోగ్యశ్రుతి చేత సాధనచతుష్టయ సంపన్నులై, అధికారులైన ముముక్షువులకు, కరతలామలకము వలె ప్రత్యక్షమగు రీతి, స్పష్టమగు, పరమతాత్పర్యమున, బోధింపబడినదో, అట్టి ప్రత్యక్చిదానంద ఘన స్వరూపమైన బ్రహ్మమునకు నమస్కారము!

బ్రహ్మానన్దం, పరమసుఖదం, కేవలం జ్ఞానమూర్తిం,
ద్వన్ద్వాఽతీతం, గగనసదృశం, తత్త్వమస్యాది లక్ష్యమ్ ।
ఏకం, నిత్యం, విమల, మచలం, సర్వధీ సాక్షిభూతం,
భావాఽతీతం, త్రిగుణరహితం, శ్రీ వసిష్ఠం నతాః స్మః ॥

భగవత్స్వరూపుడు, బ్రహ్మ విద్యాగురువునగు శ్రీ వసిష్ఠమునీంద్రునకు, మేమందఱము, ప్రణమిల్లుచున్నాము.

ఇతి శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహే 'గ్రంథోపసంహారో' నామ
ద్వాత్రింశః సర్గః

ఇట్లు శ్రీ యోగవాసిష్ఠ సంగ్రహమున 'గ్రంథోప సంహారమ'ను
ద్వాత్రింశత్తమ (ముప్పది రెండవ) సర్గము సమాప్తము.

శ్రీ యోగ వాసిష్ఠ సంగ్రహమను ఈ గ్రంథము సర్వము, సంపూర్ణము.



ఎప్పుడు యోగి, భూతపృథగ్భావము (చేతనాఽచేతనముల నానాత్వము) -.
'బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్' – (ముం.ఉ.II-2-11)
'ఆత్మైవేదం సర్వమ్' (ఛాం.ఉ.VII-25.2)
అని, శ్రుత్యాచార్యోపదేశము ననుసరించి, బ్రహ్మాతిరిక్తమగు సత్త, శూన్యమగుట వలన, సర్వకల్పనాస్పదము, ఏకము, భూమమునగు బ్రహ్మము నుండియే ఈ విస్తారము (ఆత్మ నుండియే భూతముల ఉత్పత్తి నానాత్వములు – ప్రాణము, ఆశ, స్మరణము, (ప్రేమ), ఆకాశము, తేజము, జలము, ఆవిర్భావతిరోభావములు –) అని అభేదమును దర్శించునో, అప్పుడతడు బ్రహ్మమే యగుచున్నాడు.

"ఓం ఆప్యాయన్తు మమాఽఙ్గాని
వాక్ప్రాణచక్షుః శ్రోత్ర మథో బల
మిన్ద్రియాణి చ సర్వాణి। సర్వం బ్రహ్మౌపని
షదం మాఽహం బ్రహ్మ నిరాకుర్యాం మా
మా బ్రహ్మ నిరాక రోదనిరాకరణమస్త్వని
రాకరణం మేఽస్తు। తదాత్మని నిరతే
య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సన్తు
తే మయి సన్తు"।(1)

"ప్రాణాః పఞ్చ, దశేన్ద్రియాణి చ, దశస్థానాని తేషాం తథా,
కోశాః పఞ్చ చ, సప్తధాతవ, ఇమే శబ్దాదయః పఞ్చ చ।
హృద్బుద్ధిద్వయ మాత్మకార్యసహితం, భూతాని పఞ్చాఽపి, మే
శుద్ధ్యన్తు! ప్రతిపద్యతా మవరజా ఆత్మా మమ బ్రహ్మతామ్ ।"

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః।

"త్రాతారో దేవా అధి వోచతా నో,
మా నో నిద్రా ఈశత మోత జల్పిః।" (2) (ఋ.వే.VIII-48-14)

"పరస్పర విరోధిన్యో రేక సంశ్రయ దుర్లభమ్ ।
సఙ్గతం శ్రీ సరస్వత్యోర్భూతయేఽస్తు సదా సతామ్ ।"(3)
(కాళిదాస మహాకవి – విక్రమోర్వశీయము -V-24)

---

(1) "నా హస్తపాదాదిఅంగములు ఆప్యాయమును (పుష్టిని – తనివిని) పొందుగాక! వాక్కు, ప్రాణములు, నేత్రములు, శ్రోత్రములును, ఆప్యాయము నొందుగాక! అట్లే, సర్వేంద్రియములును బలమును ప్రాపించుగాక! ఉపనిషత్తున ప్రతిపాదితమగు బ్రహ్మము సర్వము నై యున్నది. నేను బ్రహ్మమును, నన్ను బ్రహ్మము, నిరాకరింప (త్యజింప) కుండుగాక! అనిరాకరణము అగుగాక! అనిరాకరణము నాయందు అగుగాక! ఉపనిషత్తులందు, ఏ శమదమాది ధర్మములు చెప్పబడినవో, ఆ ధర్మములన్నియు, బ్రహ్మరూపమగు ఆత్మయందు నిరతుడనగు నా యందు సదా నెలకొని యుండుగాక!
మనశ్శరీరములు శుద్ధముగ నున్నవానికే బ్రహ్మవిద్యాధికారము. కావున, నా ప్రాణాదులు ఈశ్వరానుగ్రహమున శుద్ధిని పొందుగాక! నా ఆత్మ, నిర్మలమై, బ్రహ్మ భావమును ప్రాపించుగాక!

(2) "త్రాతలగు దేవతలు మమ్మాశీర్వదింతురు గాక!
నిద్రగాని, వృథాలాపముగాని, మమ్మాక్రమింపకుండుగాక!"

(3) అన్యోన్యము బద్ధవైరము గల లక్ష్మీ సరస్వతులకు (ఐశ్వర్య విద్యలకు) ఏకాశ్రయ (ఏకావాస)ము దుర్లభము. అట్టి లక్ష్మీసరస్వతుల నిత్యసహవాసము సజ్జనులకు ఐశ్వర్యప్రదమగుగాక! విద్వాంసులు, సమృద్ధులు, ప్రభువులు (ప్రజా పాలకులు) విద్యానురక్తులు అగుదురు గాక!

"శివమస్తు సర్వ జగతః,
పరహితనిరతా భవన్తు భూతగణాః ।
దోషాః ప్రయాన్తు నాశం,
"సర్వత్ర సుఖీ భవతు లోకః ।" ★ (బృహచ్ఛాన్తిస్తోత్రము)
"సంసారాఖ్య విశాల నాటకగృహే, సర్వాణి రూపాణ్యహో!
ధృత్వాఽధోముఖ యోనిజా యవనికా నిర్హృత్య నిర్గత్య చా
సర్వజ్ఞస్య దయాకరస్య తవదేవాఽగ్రే చిరాన్నృత్యతః,
శ్రాన్తస్యాఽపి మమాఽల మిత్యుచిత వాగ్గైకైవ విశ్రాణనమ్।"

ఈ సంసారమను విశాలనాటకశాలయందు, విధినిర్మితములగు నానారూపముల (వేషముల) నన్నిటిని, మాతృ గర్భమున ధరించి, మాతృయోని ద్వారమను యవనికల (తెరల)ను తొలగించి, పరమేశ్వరా! శ్రీరామా! నీ యెదుట నా వేషముల ప్రదర్శించుచుంటిని. నీవు సర్వజ్ఞుడవు, పరమకారుణికుడవు, జగదేకపాలకుడవు. నా వేషధారణములను మెచ్చి, నన్ను సత్కరింపగలవు. చిరకాలము నే నీ వేషముల నభినయించి, అభినయించి, అలసిపోయి యున్నాను. 'ఈ వేషములిక చాలించుమ'ను నీ వాక్కే (అనుమతియే) నాకు ఈయవలసిన ఈవి. భగవంతుడా! పునర్జన్మ రాహిత్యము ననుగ్రహించి, నన్నీ జన్మ మృత్యు జరావ్యాధి దుఃఖరూపమగు సంసారము నుండి రక్షింపుము.

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః ।

వాక్య పుష్పాఞ్జ లిరియం భక్త్యా న్యస్తా పదాబ్జయోః ।
ధియః ప్రచోదకస్య శ్రీకృష్ణస్య ప్రీతి సిద్ధయే ।

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు ।

(యువనామ సంవత్సర మాఘ బహుళ దశమీ. బుధవారము 14-2-96)



★ జగమంతట శాంతి వెలయుగాక! ప్రతి వ్యక్తియు పరహితమునకై పాటుపడుగాక! దోషములు (పాపములు) అంతరించుగాక! సర్వ దిగ్దేశకాలములందును, లోకము సుఖవంతమగు గాక! ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక తాపములన్నియు శాంతించుగాక.



ఓం నమః పరమాత్మనే ।

## అనుబంధము –I

# శ్రీ యోగవాసిష్ఠ మహారామాయణ రచనాకాలము

## కర్తృ వైలక్షణ్యము – మహర్షి వాల్మీకి

**కూజన్తం రామరామేతి మధురం మధురాక్షరమ్।**
**ఆరుహ్య కవితాశాఖాం, వన్దే వాల్మీకికోకిలమ్।**

**చరితం రఘునాథస్య శతకోటి ప్రవిస్తరమ్।**
**ఏకైక మక్షరం ప్రోక్తం, మహాపాతకనాశనమ్।**
**రామాయ, రామభద్రాయ, రామచన్ద్రాయ, వేధసే ।**
**రఘునాథాయ, నాథాయ, సీతాయాః పతయే, నమః ।**

సంప్రదాయమననుసరించి, శ్రీమద్రామాయణమును, శ్రీయోగవాసిష్ఠ రామాయణమును, రెంటిని రచించినది **ఆదికవి వాల్మీకి మహర్షియే.** ఆ రెండు గ్రంథములును, ఈ విషయమును, నిస్సందిగ్ధముగా తెలుపుచున్నవి. వర్ణించు విషయము ననుసరించి, ఈ రెంటియందు, శైలీ భేదము కాన్పించుచున్నది.

వాల్మీకి వసిష్ఠు లిర్వుర జీవితములును శ్రీరాముని జీవితముతో నవినాభావమున పెనగొనయున్నవి. **యోగవాసిష్ఠోక్త సంఘటనలన్నియు, శ్రీరాము డవతరించిన త్రేతాయుగమునకు సంబంధించినవే.** కలియుగమునకు పూర్వము 1241 వ సం॥న, క్రీ.పూ. 4342 సం॥న చైత్రశుద్ధనవమి యందు **శ్రీరాముడు జనించె నని,** శ్రీరామునికి సమకాలికుడగుటచే వాల్మీకియు, నాకాలమున నుండెననియు, **డా॥ డి.ఎస్. త్రివేద యను** పండితుడు నిర్ణయించెను*

---

* See"- Indian Chronology - Dr. D.S. Triveda- Bharatiya Vidya Bhavan- Bombay-1963.

శ్రీరామున కుపదేశముగా వసిష్ఠప్రోక్తమైన ఈ గ్రంథమున, ద్వాపర యుగమునకు చెందిన వ్యాసర్షి పుత్రుడు శుకుని వృత్తాంతమును, అర్జునోపాఖ్యానము, భగవద్గీతా ప్రశంసయు నెట్లుండగలవు?. కాలపరిగణనముననిది, భ్రమాత్మక ప్రమాదముకాదా? అని విమర్శకుల ఆక్షేపము.

ప్రాచీనమహర్షులు త్రికాలవేత్తలైన ద్రష్టలు. వారి దివ్యదృష్టి, విగతావరణమైనదన్న సత్యమును మనస్సున నిడుకొనిన, ఈ ఆక్షేపము క్షణమాత్రమున నిరస్తమగును. వసిష్ఠుడే యిట్లు వచించెను.

**"యదా విదితవేద్యః సంప్రాప్తికాలాఽమలదర్శనః ।**
**భవిష్యసి తదా తాని, ప్రత్యక్షేణైవ భోక్ష్యసే॥"**
(యో.వా. VI– ఉత్తర –176–4)

శ్రీరామా! ఎపుడు జ్ఞేయమగు పరమాత్మ నెఱిగి, **తత్త్వజ్ఞు** లందు ప్రసిద్ధమైన త్రికాలాఽమలదర్శనము కలవాడ వగుదువో, అపుడు నీయొక్క ద్రష్టృత్వము వలననే, త్రికాలము లందలి సమస్తద్రష్టృదృశ్యరూపములను అనుభవింపగలవు కావున, భూతభవిష్య ద్బ్రహ్మాండములందును, వర్తమాన బ్రహ్మాండమునందును, లేశమైనను విశేషము లేదని నీవే ప్రత్యక్షముగ గ్రహింపగలవు.

కాని, **ఆధునికపండితులు,** ప్రస్తుతయోగవాసిష్ఠరచనాకాలము, భర్తృహరికి పూర్వముననను, కాళిదాసునకు తరువాతను, అనగా **క్రీ.శ. ఆఱ (6)వ శతాబ్దమని నిర్ణయించినారు.**[1] పండితుల సిద్ధాంతములు బహువిధములై, పరస్పర విరుద్ధములు, భ్రమప్రమాదాత్మకములునై, యున్నందున కాలనిర్ణయమున సంప్రదాయానుసరణమే శ్రేయస్కరమగు ఉత్తమమార్గము. అదియును గాక, **వసిష్ఠుడీ జ్ఞానమును, కల్పాదిని, సర్గాఽఽరంభముననే, (యో.వా.II 10.9)**[2] **సృష్టికర్త నుండియే పొంది యుండుట వలన, ఈ తత్త్వదర్శనము యొక్క మూలములు, కాలరహితమైన పరమాత్మ యందు పాదుకొని యుండుట వలన** (Rooted in the Eternity) **తద్విషయకమైన కాలనిర్ణయము, నిష్ఫలారంభము.**

శంకరుడీయోగవాసిష్ఠము నెఱుగును. శ్వేతాశ్వతరోపనిషత్తు (VIII-1) భాష్యమున, **'తథా చ వాసిష్ఠ యోగ శాస్త్రే'** । ఇదియే వాసిష్ఠ యోగ శాస్త్రాభిప్రాయము– అని శంకరు డనెను. భ.గీ. (XIII-4) భాష్యమున **'ఋషిభిః ర్వసిష్ఠాదిభిః'** – వసిష్ఠాది

(1) See: 'The Yogavasishtha and Its Philosophy' – III Edition – 1966- B.L. Atreya p.23)

(2) **యోగవాసిష్ఠసంగ్రహము – సర్గ–2 శ్లో॥ 33–37.**

మహర్షుల చేత- అని 'ఋషిభిః' అనుటను శంకరుడు వివరించెను.

**"తపోనిర్ధూతపాప్మానో, యాథాతథ్యాఽభిధాయినః।**
**వేదవేదాఙ్గ తత్త్వజ్ఞా, ఋషయః పరికీర్తితా॥"**

తపస్సుచే పాపముల నున్మూలించినవారు, సత్యవచస్కులు, వేదవేదాంగ తత్త్వజ్ఞులగు వారు, ఋషులని, పరికీర్తితులు. అని, ఋషిలక్షణము నిర్వచింపబడినది.

మహాభారతాంతర్గతమగు సనత్సుజాతీయమున (I. 15,31) **'తథా చాఽఽహ భగవాన్ వసిష్ఠః'** – **'తథా చాఽఽహ భగవాన్ వసిష్ఠః॥'** భగవంతుడగు వసిష్ఠుడును, ఇట్లే వచించెను. అని భాష్యకారుడు పేర్కొనెను. **ఈ నిర్దేశములన్నియు, శంకరుడు యోగవాసిష్ఠము నెఱుగునని నిరూపించును.** శంకరుని పరమగురు వగు **గౌడపాదుడును.** యోగవాసిష్ఠము నెఱుగు ననుటను, కారికలందలి **'వేదాన్తేషు విచక్షణాః'** (మాం.కా. II -31) **'తత్త్వవిదః॥'** (మాం.కా. II -34), **'నాయకాః'**, (మాం.కా. IV -88) అను వాక్యములు తెలుపుచున్నవి. ఆ తత్త్వవేత్తల కాపాదించిన భావములు, యోగవాసిష్ఠ భావములతో నభిన్నములని పండితుల నిశ్చయము. వసిష్ఠుని తత్త్వదర్శనమున గౌడపాదుని భావము లన్నియు నంతర్గతములు.

**శ్రీరాముని స్థితప్రజ్ఞతకు[1], జీవన్ముక్తికి, వసిష్ఠోపదేశితమైన ఈ పరమ జ్ఞానమే కారణము, కావ, యోగవాసిష్ఠమునకు శ్రీమద్రామాయణమునకు, హేతుహేతుమద్భావము కల దనుట నిరూఢము** . అయినను, కాలపరిగణనమున శ్రీమద్రామాయణ రచనానంతరమే యోగవాసిష్ఠమును మహర్షి రచించి, తన శిష్యుడగు భరద్వాజునకు ఈ మోక్ష సంహితనుపదేశించినాడు. **గుణాధికులచే గృహీతమై, అనుష్ఠీయమానమైన ధర్మము, జగమున విస్తరించును.** ఇట్లు పరంపరాప్రాప్తమై, యోగవాసిష్ఠము నిత్యనూతనముగ సకలలోకములకు భవతారకమై, నేడును వెలయుచున్నది.

**కర్తృ (వాల్మీకి) వైలక్షణ్యము – ఆదికవి మహర్షి వాల్మీకి పూర్వ వృత్తాంతము.**

భార్గవవంశ్యుడు, ప్రచేతసుని పుత్రుడు, ఋక్షుడు[2], కుసంసర్గమువలన, విద్యావిహీనుడు, ధర్మభ్రష్టుడునై, కిరాతులలో కలసి పోయి, కిరాతకాంతను

---

(1) చూడు:- వాల్మీకి రామాయణము. బాలకాండ – సర్గ-1 దేవర్షి నారదు డొనర్చిన శ్రీరాముని గుణశీలవర్ణనము. (8-19 శ్లోలు) **'వశీ', 'సమాధిమాన్', 'అదీనాత్మా'** ఇత్యాది విశేషణములు. **'సముద్ర ఇవ గాంభీర్యే, ధైర్యేణ హిమవా నివ॥'** ఇత్యాదులు, అనుసంధించునది.

(2) ఇతడు అంగీరస గోత్రోద్భవుడగు బ్రాహ్మణుని కుమారుడు. 'రత్నాకరుడ'ని యొక ఆఖ్యానము – తెలుపును. (చూడు :- భక్తచరితాంకము. –ఆదికవి వాల్మీకి - గీతా ప్రెస్ – గోరఖ్‌పూర్.)

వివాహమాడి,సంతానవంతుడైనాడు. కుటుంబపరివారభరణపోషణార్థము, క్రూరదస్యుడుగ, బందిపోటుగ, మారి,నిరంతరప్రాణిహింసాపరాయణుడై జీవించుచుండెను. ప్రాక్తనాఽనేకపుణ్యకర్మపరిపాకోదయమున నొకనాడు, అరణ్యమున, సప్తర్షులు* వానికెదురుపడినారు. వారివస్తువుల నపహరించు నుద్దేశమున, వారిని వెంబడించి నిలిపినాడు. అభయప్రతిష్ఠితులైన మునీంద్రులు, అతని ఘోరపాపకర్మముల గూర్చి ప్రశ్నింపగా, దారపుత్రాదుల పోషణార్థమై, గత్యంతరాఽభావమున, తానట్లు ప్రవర్తించుచుంటినని యాతడు సమాధాన మొసగినాడు.

అత డొనరించు దారుణపాపసంచయమున, పాలుపంచుకొందురో, లేదో భార్యాపుత్రాదులను, వేర్వేరుగా నడిగి తెలిసికొని రమ్మని, ఆమునీంద్రులు వానిని కోరిరి. పుత్రదారాదు లందు అమితబద్ధానురాగుడై యున్నఅతడు, విశ్వాస నిర్భర హృదయమున, ఇలు చేరి, వారిని వేర్వేరుగ నీ విషయమై యడుగగా, వారందఱును, **"పాప మంతయు నీదే. మేము, నీ సంపాదనము యొక్క ఫలభాగులము మాత్రమే"**- అని యన్నారు.

అందున దుఃఖితుడై, నిర్వేద మతిశయింపగా, తనపాపకర్మములకు పశ్చాత్తప్తుడై అతడు తన్ను ఘోరపాపార్ణవము నుండి మోక్షమార్గోపదేశమున సముద్ధరింప వలెనని మహర్షుల పాదములపై వ్రాలి, (శరణాగతుడై) ప్రార్థించినాడు. ఈ నిర్వేదమువలన,నతడు కేవలము మునీంద్రుల దర్శనముననే పవిత్రాంతః కరణుడైనాడు. మహాత్ముల స్మరణముగాని, శ్రవణముగాని, దర్శనము గాని,

★ దేవర్షి నారదుడని మఱియొక ఆఖ్యానము. సత్యమే, సత్యాన్వేషకుని కంటె ప్రధానము. ప్రాచీన వేదేతిహాసపురాణాదులు,పరమజ్ఞానమును,బోధించుచున్నను, బోధకుల వ్యక్తిగత జీవితాంశములను యథారీతి వివరింపవు. బోధకుని కంటె బోధయే వానికి ముఖ్యము. వ్యక్తి చరిత్ర, భారతపురాతనసాహితిలో మృగ్యమనియే చెప్పవచ్చును. మహాకవులగు కాళిదాసాదుల జీవనచరిత్రలు సైతము మనకు లభింపవు. అవి, అద్భుతగాథలు (Legends) రూపమున, ఆ మహాత్ముల మూర్తిమత్త్వమునకు భాష్యరూపములుగ మాత్రమే నిలిచియున్నవి.

**They (legends) contain more of the truth about him than all the authentic facts that I have written down. Legend is the chalice of truth. Facts are so veracious and so dull that nobody is uplifted by believing in them.....Because on and around history will grow legend . (The face of silence- Dhan Gopal Mukerji-ChapterII. p. 7- great books- Calcutta 1991)**

శ్రేయోలతల యొక్క విస్తారమైన ఫలసంతతి. దానమున కంటెను, పుణ్యమున కంటెను, మహాత్ముల దర్శనము మహాఫలప్రదాయి. అది సదాచారమున కంటెను శ్లాఘ్యతరమని శాస్త్రములు వచించును.

'స్మరణం శ్రవణం వాఽపి, దర్శనం వా మహాత్మనామ్ ।
సేయం కుశలవల్లీనాం, మహతీ ఫలసన్తతిః ॥"
"దానాదపి ప్రియతరం, పుణ్యాదపి మహాఫలమ్ ।
సదాచారాదపి శ్లాఘ్యం, మహతాం కిల దర్శనమ్ ॥"

(క్షేమేంద్రుడు-సుందరీనందాఽవధానము– 11,13)

దుర్వృత్తుడైనను,శరణాగతుడుతప్పక రక్షణీయుడని దయాసాగరులైన ఋషీంద్రులు భవతారకమగు రామనామమును వ్యత్యస్తాఽక్షరరూపమున (మరా) నుపదేశించి, "ఏకాగ్రచిత్తమున 'మరా' అని మేము తిరిగి వచ్చునంత వఱకు జపింపుము" - అని పలికి దివ్యదర్శనులైన మునీంద్రులు, అంతర్హితులైనారు.

సీ॥ దినము 'మరా' 'మరా' యని పల్క నంతంత
నది 'రామ' నామపర్యాయ మయ్యె,
నా 'రామ' నామ జపాఽనుభావంబున
నంతర్ముఖత జూడ, నల్లనల్ల
నల్లని మొగు లొండు నానాట గనిపించె,
నదియు కోదండ కాండాంచితమగు
సగుణభావము నొందె, సగుణరూపం బెల్ల
రూపింప నిర్గుణరూప మగుచు
గీ॥ కోటిరవిచంద్రరూపమై కొమరు మిగిలె,
నట్టి తేజంబు నందున నంతరంగ
మిట్టటు చలింప నీయక గట్టిగాగ
బూదె గరగిన గతి నేకముగ ఘటించె ।

(వాల్మీకిచరిత్రము – II- 152–రఘునాథనాయకుడు)

బాహ్యస్మృతి రహితుడు, సర్వసంగవిహీనుడు, నిశ్చలుడునై, మునీంద్ర దేశితమంత్రనిష్ఠుడై అత డుండగా, అతనిపై పుట్టలు మొలిచినవి. చిరకాలమునకు,

మునులు తిరిగివచ్చి, పుట్టనుండి వెడలి రమ్మని పలుకగా, ఆ ధన్యుడు, నీహారము **(మంచు)నుండిబహిర్గతుడగు భానుని వలె, వల్మీకము నుండి బయటకు వచ్చినాడు.**

**"మునీశ్వరా! నీవు వాల్మీకివి.** వల్మీకము నుండి సంభవించుట వలన, నీ కిది **ద్వితీయజన్మము"** అని పలికి, మునీంద్రులు దేవలోకమున కేగినారు. ఇది **మహర్షి పూర్వ వృత్తాంతము.**

శ్రీరాము డవతరించుటకు పూర్వమే, సప్తఋషులు రామనామము నుపదేశించుటవలన, ఆనామము, **ఆదిపరబ్రహ్మప్రతిపాదకమనియు** హృదయా (దహరా)కాశమున, వాల్మీకికి ప్రత్యక్షమైన దివ్యరూపము, పరబ్రహ్మము యొక్క నిత్యమైన సగుణరూపమని నిరూఢమగుచున్నది.

**"రమన్తే యోగినోఽనన్తే, నిత్యానన్దే చిదాత్మని ।**
**ఇతి రామపదేనాఽసౌ, పరం బ్రహ్మాఽభిధీయతే ॥"**

**[రామతాపిని ఉపనిషత్ (పూర్వ-I-6)]**

**"మనుష్యేతేషు సర్వేషా మధికారోఽస్తి దేహినామ్ ।**
**ముముక్షూణాం, విరక్తానాం, తథా చాఽఽశ్రమవాసినామ్ ।**
**ప్రణవత్వాత్ సదా ధ్యేయో, యతీనాం చ విశేషత ః ।**
**రామమన్త్రార్థ విజ్ఞానీ, జీవన్ముక్తో న సంశయః ॥"**

**(రామరహస్యోపనిషత్-V-16,17)**

సమ్యగ్జ్ఞానులైన యోగులు,అనంతము (పరిచ్ఛేదశూన్యము) నిత్య భూమానందము నగు చిత్స్వరూపమున రమించుచుండుట వలన, 'రామ' పదమున, ఆ భగవంతుడు, పరబ్రహ్మము చెప్పబడుచున్నాడు. **"రామ ఏవ పరంబ్రహ్మ" – (శ్రుతి)**

**దేహధారులగు మనుష్యమాత్రులు,** ముముక్షులు, విరక్తులు, ఆశ్రమవాసులు, – అందఱును, **శ్రీరామమంత్రమునకు అధికారులే.** ప్రణవస్వరూపమగుటచే, యతులకు విశేషముగ శ్రీరామమంత్రము ధ్యేయము. **రామమంత్రార్థ విజ్ఞాని, జీవన్ముక్తు డనుటలో సందేహము లేదు.**

"వేదవేద్యే పరే పుంసి, జాతే దశరథాఽఽత్మజే।
వేదః ప్రాచేతసా దాసీత్, సాక్షాద్రామాయణాత్మనా॥"

వేదవేద్యుడగు పరమపురుషుడు, దశరథాత్మజుడై జన్మింపగా, వేదము సాక్షాద్రామాయణరూపమున వాల్మీకి వలన వెలసినది. రామాయణము సాక్షాద్వేదమని పై శ్లోకము స్థాపించుచున్నది.

"భద్రో భద్రయా సచమాన ఆగా త్స్వ సారం,
జారో అభ్యేతి పశ్చాత్ సుప్రకేతై ద్యుభిరగ్ని,
వితిష్ఠన్ వృషద్భి ర్వర్ణై రభిరామ మస్థాత్॥"

వ్యాఖ్యా: భద్రో– రామభద్రో, భద్రయా మంగళరూపయా సీతయా, సచమాన–సంపద్యమాన అగమన్తాదాగాత్ పితృవియోగవశా దరణ్య మగాత్, జారః– పరదారహర్తా–రావణః, స్వసారం– మాతృవత్ పూజ్యాం, జగన్మాతరం, సీతాం పశ్చాద భ్యేత్య అరణ్యగమనాఽనన్తరం, సేతుబన్ధనద్వారా రావణే హతే, సీతాయాం, చాఽగ్నౌ ప్రవిష్టాయాం, విశ్వాసార్థ మగ్నిః, తాం గృహీత్వా, రామం– రఘురామ మభ్యభిముఖే నాసాం శుద్ధేత్యభినివేదితవాన్, సకలార్తిహారిభిః, కమనీయాభిః ఋషిద్భిః వర్ణైరాకార విశేషైశ్చ వితిష్ఠన్– విశేషేణ స్థితవాన్ తస్త్యేషా భవతి"- (ఋగ్వేదనిరుక్తము) – అని, ఋగ్వేదమున రామకథ, ప్రోక్తమై యున్నదని పై మంత్రవ్యాఖ్య తెలియజేయుచున్నది. (చూడుః– శ్రీ మదాంధ్రవాల్మీకి రామాయణ పీఠిక, నాలుగవకూర్పు – 1982) వనవాస గమన సందర్భమున సీతాలక్ష్మణసమేతుడై శ్రీరాముడు మహర్షిని, చిత్రకూటాద్రి ఆశ్రమమున దర్శించినట్లు అధ్యాత్మ రామాయణము పేర్కొనును. ఈ సందర్భమున తమకు నివాసార్హమగు, స్థానమును నిర్దేశింప వలెనని, మహర్షిని శ్రీరాముడు అర్థింపగా–

"త్వమేవ సర్వలోకానాం, నివాసస్థానముత్తమం।
తవాఽపిసర్వభూతాని, నివాసనదనాని హి।

..........................................

శాన్తానాం, సమదృష్టీనా మద్వేష్టౄణాం చ జన్తుషు।
త్వామేవ భజతాం నిత్యం, హృదయం తేఽధిమన్దిరమ్।" (ఇత్యాది)

రాగద్వేషరహితులు, సమదర్శనులు, నిరంతర భగవన్నిష్ఠులునైన మహాత్ముల హృదయమందిరములే శ్రీ స్వామికి నివాసస్థానములని మహర్షివాల్మీకి శ్రీరాముని స్తుతించెను. (అధ్యాత్మరామాయణము - అయోధ్య –VI– 43-92). **తమసాతరంగిణీతటమున చిత్రకూటమున, ఆశ్రమమున, బ్రహ్మర్షి వాల్మీకి తపోధ్యానసమాధిమగ్నుడై యుండగా, నొకనాడు; దేవర్షి నారదు డాశ్రమమున కేతెంచి, వాల్మీకి ప్రశ్నరూపమున పేర్కొన్న షోడశ (16) కల్యాణ గుణములకు ఆశ్రయుడు, ధర్మ విగ్రహుడైన శ్రీ రాముని చరితమును సంగ్రహముగ నుపదేశించెను.** (శ్రీమద్రామాయణము – బాల– ప్రథమసర్గము) ఆ కాలమున, శ్రీరాముడు ప్రాప్తరాజ్యుడై, అయోధ్యాసింహాసనము నధిష్ఠించి యుండెను.

ఒకనాడు, మాధ్యందిన సమయమున గంగానదికి సమీపమున ఉన్న **తమసానదికి, స్నానార్థము శిష్యుడగు భరద్వాజునితో** నేగిన ఆ బ్రహ్మర్షి వాల్మీకి, తీరవనమునవిహరించు క్రౌంచమిథునమున మగపక్షి, యొక నిషాదుని బాణఘాతమున నేలకూలుటను గాంచెను. రక్తపరీతాంగముతో నేలబడి తన్ను కొనుచున్న **మగక్రౌంచమును** గాంచి, దాని **సఖియగు ఆడుపక్షి,** అత్యంత కరుణముగ రోదించినది. ఈ దృశ్యము, ధర్మాత్ముడగు మహర్షిహృదయమున శోకము **నతిశయింప జేసినది. కారుణ్యము కడలుకొన్నది. శోకమే శ్లోకమైనది. వేదమున కంటె, భిన్నమగు నూతన ఛందస్సు అవతరించినది.**

**"మా నిషాద! ప్రతిష్ఠాం త్వ మగమః శాశ్వతీ స్సమాః।**
**యత్క్రౌఞ్చ మిథునా దేక మవధీః కామమోహితమ్ ॥"**

అని, నిషాదుని శపింప నుద్దేశించిన **శాపవాక్యము మంగళార్థమును వ్యంజించుచు. 'అనుష్టుప్'** శ్లోకరూపమున మునీంద్రుని నోటనుండి వెలువడినది. శోకార్తుడైన మునివాక్కు, పాదబద్ధాక్షర సమము, తంత్రీలయ సమన్వితమునైన శ్లోకమైనది. దానికి, విస్మితుడై యున్న మునీంద్రు నెదుట, **సర్వలోకపితామహుడు, బ్రహ్మ, సాక్షాత్కరించి, "పుణ్యాకరమగు శ్రీ రామచరితమును సర్వమును, మనోరమశ్లోకబద్ధముగా రచింపుము. శ్రీమద్రామాయణకథ శాశ్వతముగ ఆ సంసారము, లోకములందు వ్యాపించును. "నీవు ఆదికవి"వని అనుగ్రహించి, ఆదేశించి, అంతర్హితుడైనాడు.**

"యావత్ స్థాస్యన్తి గిరయః, సరితశ్చ మహీతలే ।
తావద్రామాయణకథా, లోకేషు ప్రచరిష్యతి॥ (వా.రా. I – 2.36)

"ఇదం పవిత్రం పాపఘ్నం, పుణ్యం వేదైశ్చ సమ్మితం ।
యః పఠే ద్రామచరితం, సర్వపాపైః ప్రముచ్యతే॥ (వా.రా. I-2.98)

యోగదృష్టితో (అప్రతిహతప్రకాశము, ఆర్షమునైన జ్ఞానచక్షువుతో) - కరతలామలకముగాంచి యథాదర్శనముగ సంసార తారకమైన శ్రీరామచరితమును, సప్తకాండాత్మకముగ ఇరువదినాల్గువేల (24,000) శ్లోకములతో గాయత్రీ మంత్రసంపుటీకృతముగ, మధుమయఫణితిమహర్షి రచించినాడు.★

---

★ "తతః పశ్యతి ధర్మాత్మా, తత్సర్వం యోగమాస్థితః ।
పురా యత్తత్ర నిర్వృత్తం, పాణావామలకం యథా ।
తత్సర్వం తత్త్వతో దృష్ట్వా, ధర్మేణ స మహాద్యుతిః ।
అభిరామస్య రామస్య, చరితం కర్తు ముద్యతః ।
కామార్థగుణసంయుక్తం, ధర్మార్థగుణవిస్తరం ।
సముద్రమివ రత్నాఽఽఢ్యం, సర్వశ్రుతిమనోహరమ్ ।
స యథా కథితం పూర్వం, నారదేన మహర్షిణా ।
రఘువంశస్య చరితం, చకార భగవాన్ ఋషిః ।"

"ప్రాప్త రాజ్యరామస్య, వాల్మీకి ర్భగవాన్ ఋషిః ।
చకార చరితం కృత్స్నం, విచిత్రపద మర్థవత్ ।
చతుర్వింశత్సహస్రాణి, శ్లోకానా ముక్తవాన్ ఋషిః ।
తథా సర్గశతాన్ పఞ్చ, షట్కాణ్డాని తథోత్తరమ్ ।
కృత్వా తు తన్మహాప్రాజ్ఞః సభవిష్యం సహోత్తరమ్ ।
చిన్తయామాస కోన్వేతత్ ప్రయుఞ్జీయాదితి ప్రభుః ।"

(వా.రా.. బాల. IV 1,2,3)

Every Thing is narrow in the west. Greece is so small that I am stifled in it; Judea is so dry that I pant in it. Let me glance at the side of high Asia towards the deep Orient. There I have my immense poem as vast as the Indian sea, blessed and adorned by the sun - a book of divine harmony, where nothing jars. A calm peace pervades it, and even in the midst of battle described in it we perceive an infinite sweetness, a boundless brother hood, which extends to every living thing; an ocean without bottom or shore, full of love, pity, and clemency. I have found that for which I was looking - the Bible of goodness. Receive me then great poem! Let me plunge in the O see of milk!" (jules Michelet - the

"అథ సరసిజయోనే రాజ్ఞయా రామవృత్తం,
కరబదరసమానం ప్రేక్ష్య, దృష్ట్యా ప్రతీచ్యా★ ।
శుభమతనుతకావ్యం, స్వాదు రామాయణాఖ్యం,
మధుమయఫణితీనాం మార్గదర్శీ మహర్షిః ॥"
(భోజరాజు - చమ్పూరామాయణము - బాలకాణ్డ - 11)

(★ప్రతీచ్యా దృష్ట్యా = యోగదృష్ట్యా)

జనాపవాదవశమున పరిత్యక్తయైన నిర్భరగర్భఖిన్నను, శ్రీరామపత్ని వైదేహిని (జానకీ దేవిని), ఆదరించి, సమాశ్వాసించి, తన ఆశ్రమమున, ఆశ్రయ మొసగి, రక్షించి, ఆజనని కన్న కవలబిడ్డలు– కుశలవులను పెంచి, ఉపనీతుల నొనరించి, విద్యాబుద్ధులు గఱపి, రామాయణమును గాన మొనరింప నేర్పిన కరుణారసమూర్తి ఆదికవి బ్రహ్మర్షి వాల్మీకి. యోగవాసిష్ఠమహారామాయణమును గూర్చి ముందే వివరింపబడినది.

శ్లోకంబుల్ శతకోటి కాండములుగా సూత్రించి, రామాయణం
బేకైకాక్షర మెల్ల పాపముల మాయింపంగ నిర్మించి, ను
శ్లోకుండైన పురాణసంయమివరుం జాతున్ మహోపేథి, వా
ల్మీకిం బ్రహ్మపదాఽవతీర్ణకవితాలీలావతివల్లభున్ ॥
(శ్రీనాథుడు – శ్రీభీమేశ్వరపురాణము -I-5)

---

French historian in his Bible of Humanity)

"No language can be purer, none chaster, none more beautiful and at the same time simpler than the language in which the great poet has depicted the life of Rama"

(Sages of India- C.W. Of Swami Vivekananda Vol III p. 225 – Advaita Ashrama, Mayavati Memorial Edition 1989)

. . . . . . Not all perhaps can enter at once into the spirit of this master piece, but those who have once done so, will never admit any poem in the world as its superior" (Sri Aurobindo)

అని పాశ్చాత్యులు, భారతీయులైన స్వామివివేకానంద అరవిందాది మహాత్ములందఱు శ్రీమద్రామాయణమహత్త్వమును కీర్తించివారు.

శబ్దరూపమున బ్రహ్మతత్త్వమును భాసింపజేయు (శబ్దబ్రహ్మవిస్తరమగు) రామాయణము వలన, ఈ సంసారము సమలంకృతమైనది. (**మణ్డితః సంసారః!**)

ఈ సంసార మిదెన్ని జన్మలకు నేనీ మౌనివాల్మీకి భా
షాసంక్రాంతఋణంబు దీర్పగలదా? సత్కావ్యనిర్మాణరే
ఖాసామగ్రిఋణంబు దీర్పగలదా? కాకుత్స్థుడౌ స్వామి గా
థాసంపన్నము భక్తిదీర్చినను, ద్వైతాద్వైతమార్గంబులన్ ।

(విశ్వనాథ సత్యనారాయణ – శ్రీమద్రామాయణ కల్పవృక్షము – అవతారిక)

I అనుబంధము సమాప్తము

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు





ఓం నమః పరమాత్మనే ॥

# అనుబంధము II

## వక్తృవైలక్షణ్యము – బ్రహ్మర్షి వసిష్ఠుడు

ఓం–నారాయణం, పద్మభువం, వసిష్ఠం,
శక్తిం,చ తత్పుత్ర పరాశరం, చ ।
వ్యాసం, శుకమ్ ............ అన్యాన్,
అస్మద్గురూన్, సన్తత మానతోఽస్మి ।

ఆదికర్తయగు భగవంతుడు నారాయణుడు, విశ్వస్రష్టయగు బ్రహ్మ తరువాత, మానవలోకమునకు, ఆదిగురువు, మహర్షి వసిష్ఠుడే యని, పై గురుధ్యానప్రార్థనారూపమగు సాంప్రదాయిక శ్లోకములు వర్ణించుచున్నవి.

వసిష్ఠుడు బ్రహ్మమానవపుత్రుడైనను, నిమిశాపవశమున స్వశరీరమును బాసి, బ్రహ్మ యొద్దకేగి, మరల దేహమును ప్రాపించు నుపాయ మర్థించెను. **"దేహహీనులకు మహాదుఃఖము ప్రాప్తించును. సర్వధర్మకార్యములును, లుప్తములగును. మరల ధర్మసాధనమగు దేహమును పొందునట్లు అనుగ్రహింపవలెను"★**

**"ఊర్వశీనిమిత్తమగు మిత్రావరుణుల తేజము నావేశించి, అయోనిజుడవై మరల జన్మింతువు గాక! మహితతపమున నాకు మరల వశుడ వగుదువు".** అని బ్రహ్మ వచించెను.

---

★ "సర్వేషాం దేహహీనానాం, మహద్దుఃఖం భవిష్యతి ।
లుప్యన్తే సర్వకార్మాణి, హీనదేహస్య వై ప్రభో!॥" (వా.రా. VII-ఉత్తర-56.8)

ఇట్లు, ఊర్వశీ నిమిత్తమగు మిత్రావరుణు లిర్వుర వీర్యమున జనించుటచే వసిష్ఠుడు, 'మైత్రావరుణి' యని ప్రసిద్ధుడయ్యెను.(1) (ఈ పేరు అగస్త్యునకును అన్వయించును.) కల్పాదిని, సర్గారంభమున, వసిష్ఠుడు బ్రహ్మమానసపుత్రుడై యుదయించెను. సూర్యవంశమునకు పురోహితుడుగ నుండు మని బ్రహ్మ ఆదేశము. పౌరోహిత్యము, బ్రాహ్మణునికి శ్రేష్ఠమగు పదవి కాదు కాన, వసిష్ఠుడు దాని నంగీకరింపలేదు. కాని భగవంతుడు, ధర్మవిగ్రహుండగు శ్రీరాముని రూపమున నావంశమున నవతరించును గాన, అతనికి గురుత్వము వహించి, కృతార్థతను బొందగల వన్న పరమేష్ఠి యాదేశమును భక్తితో శిరసావహించి, వసిష్ఠుడు, అయోధ్యాసమీపమున ఆశ్రమము నిర్మించుకొని, ఇక్ష్వాకువంశమునకు పురోహితుడైనాడు.

## భగవతి అరుంధతీమహత్త్వము

ఈ ఋషిచంద్రుని ధర్మపత్ని, సతీశిరోమణి, భగవతి అరుంధతి.ఈమె, దేవహూతీ కర్దమ ప్రజాపతులకు జన్మించిన తొమ్మండ్రు పుత్రికలలో నొక్కతె. భగవంతుడు, సిద్ధుడు నగు కపిలమహర్షికి అగ్రజ.(2) వాస్తవ మిటుండ, అరుంధతి జన్మవంశముల గూర్చి లోకప్రచారమున నున్న కథలు, అయథార్థములు, అసత్యకల్పనలు. ఈ కథల కాధార మనూహ్యము.

హ్రీ (నమ్రత), శోభ, కారుణ్యము, వివేక విజ్ఞానములు, ఆమె మూర్తిమత్త్వమును నిర్మించినవి. భగవద్విభూతులు, దేవతామూర్తులు నగు కీర్తి, శ్రీ, వాక్, స్మృతి, మేధా, ధృతి, క్షమలు, ఆమె యందు స్థిరనివాస మేర్పఱచుకొన్నారు. పవిత్ర

(1) చూడు :- వాల్మీకి రామాయణము - VII - ఉత్తర కాణ్డము – 55,56,57 సర్గలు
"ఊర్వశీ గర్భసమ్భూతో వసిష్ఠో భగవాన్ ఋషిః ।
తపసా బ్రాహ్మణో జాత, స్తస్మై జ్ఞాతి రకారణమ్ ॥"
అందున, ఊర్వశీ గర్భసంభూతు డన్న ప్రవాదమునకు వ్యాప్తి కల్గినది. బ్రహ్మయోని యగు వసిష్ఠుడు సహజముగ పరమార్థద్రష్ట. ఆ మహాత్మున కీ జాతి (జన్మము) అకారణము– ఔపచారికము.

(2) చూడు : భాగవతము III-24. 21-23
"కర్దమ స్తేన చోదితః,
యచ్ఛ ద్వసిష్ఠాయాఽరుంధతీమ్"

తపోనిధి, పూర్వులగు గురువులకు సైతము గురు వరేణ్యుడైన బ్రహ్మర్షి వసిష్ఠుడును, అరుంధతికి భర్తయగుట చేత, తాను పావిత్ర్యమును బొందెనని భావించినాడు. లోకత్రయమంగళమునకు హేతుభూత మగు ఉషస్సు (ప్రాతః సంధ్యాధిదేవత) వలె అరుంధతి, జగద్వంద్యయని కీర్తింప బడినది. (ఉత్తరరామచరితము - భవభూతి - IV–10) నిరంతరము తన పార్శ్వమున కూర్చుండి, తన్నుపాసించు అరుంధతిచే, స్వాహాదేవిసమేతుడగు అగ్నివలె తపోనిధి వసిష్ఠుడు ప్రకాశించుచుండెను[1]

దేవమానవుల దాంపత్యములను ప్రతిష్ఠించు వివాహములను, శాసన ప్రామాణికమగు అనుమతిచే ముద్రించి స్థిరీకరించు కౌశలసంపన్న యగు పురంధ్రీమణి, అరుంధతి,

"గుణాః పూజాస్థానం గుణిషు, న చ లిఙ్గం న చ వయః।"

(భవభూతి – ఉత్తర రామచరితము -IV-11)

గుణములే పూజా స్థానములు. స్త్రీ, పురుషుడు – అను లింగభేదముగాని, వయోభేదముగాని, పూజార్హములు గా వను సత్యము నామె యెఱుగును గాన, సీతాదేవి యెడల, ఆమె హార్దికమగు ఆరాధనను విస్తరింపజేసినది. అరుంధతి హృదయము కుసుమకోమలమైనను, సంకల్పము, దృఢతమము (కఠినము) 'లలితమాధవము'న అరుంధతి, రాధాదేవి నాశీర్వదించి, ఆమె పావిత్ర్యమును నిరూపించును. పార్వతీ పరిణయ సందర్భమున సప్తర్షులతో పాటు, అరుంధతి, పరమశివుని యెదుట ప్రత్యక్షమై నిలిచినది. ఆ సప్తర్షుల నడుమ నున్న తన భర్త వసిష్ఠుని పాదములందు సమర్పితదృష్టియై, ఆ మహర్షి యొక్క సాక్షాత్తపస్సిద్ధి వలె, ఆమె ప్రకాశించినది. పరమేశ్వరు డాయరుంధతీదేవిని, సప్తర్షులతో సమానముగ గౌరవించినాడు. స్త్రీపురుష భేదము నిమిత్తము గాదు; సత్పురుషులకు సౌశీల్యమే (చరిత్రమే) పూజనీయము.[2] ఇట్టి మహనీయసౌశీల్యమూర్తిని, ధర్మపత్నిగా

---

(1) "అన్వాసిత మరుంధత్యా స్వాహయేవ హవిర్భుజమ్"। (రఘువంశము -I–56)

(2) "తేషాం మధ్యగతా సాధ్వీ, పత్యుః పాదార్పితేక్షణా।
సాక్షాదివ తపస్సిద్ధి ర్బభాసే బహ్వరుంధతీ॥
తా మగౌరవభేదేన మునీం శ్చాపశ్య దీశ్వరః।
స్త్రీ పుమా నిత్యనాస్థైషా వృత్తం హి మహితం సతామ్"॥ (కుమారసంభవము – VI-11,12)

బడిసిన కారణముననే, వసిష్ఠుడు, కులాంగనా మాహాత్మ్యమును, యోగవాసిష్ఠమున మహోన్నతముగా స్తుతించి, వర్ణించినాడు.

వసిష్ఠుని నిరంతరము **సకలాభీష్టప్రదయగు నందినీ** (కామ)ధేనువు, సేవించుచుండును. అగ్ని, జల, వ్యాధి, దుర్భిక్ష, మృత్యుణము లను పంచవిధ దైవహేతుకములగు **ఆపదలను,** ఆయుధ, చోర, శత్రు, రాజవల్లభ, రాజ్యలోభము లను **పంచవిధమానుషహేతుకములగు ఆపదలను,** మహర్షి, తన తపోమహిమచే నివారించి ప్రజలకు క్షేమము కల్గించుచుండెను.

దేశము, శత్రురహితమై, సకాలవర్షములతో, ఈతిబాధారహితములు, సస్యములు, ఫలించి ప్రజ లందఱు శతవర్షజీవులై , నిర్భయులై, బ్రహ్మవర్చస్వియగు మహర్షిపౌరోహిత్యమున సుఖసంతోషముల నధిగమించిరి. **బ్రహ్మమానస పుత్రుడు, గురువునగు, ఆ మునీంద్రునిచే, అనుధ్యాయమానములై (చింతితములై) రాజసంపదలు, వ్యసనదూరములై అవిచ్ఛిన్నములై యుండెను.**

సంతానరహితుడై, పుత్రార్థమై తన్ను ప్రార్థించిన **దిలీపమహారాజును, భార్యా(సుదక్షిణా)** సహితముగ **నందినీ ధేనువు** నారాధింపజేసి, రాజు మనోరథమును మహర్షి, సఫల మొనరించెను. అనుగ్రహఫలముగ వారికి జనించిన పుత్రుడే **రఘువు.**

## వసిష్ఠవిశ్వామిత్రుల సంఘర్షము

ఒకనాడు, తన యాశ్రమమున కేతెంచిన **మహారాజు విశ్వామిత్రునికి** అతని సేనావాహినికి, మహర్షివసిష్ఠుడు అనేకవిధమృష్టాన్నభోజనపానాది సత్కారములతో ప్రీతిపూర్వకముగ నాతిథ్య మొసగెను. దీనికి, కామధేను ప్రభావమే కారణమని యెఱిగిన **రాజు, లోభవశమున, ఆధేనువును తనకిమ్మని** మహర్షి నర్థించి, విఫలుడై, బలాత్కారముగ★ ధేనువును గొనిపోవుట కుద్యుక్తుడు కాగా, మహర్షి యనుజ్ఞచే, కామధేనువు అపారసేన నుత్పాదించి, విశ్వామిత్రుని ససైన్యముగ **పరాజితుని** జేసినది.

---

★ **చూడు : వాల్మీకి రామాయణము – బాల – 56–సర్గ–16–20 శ్లోలు)**

తీవ్ర పరాజయమున, విశ్వామిత్రుని ద్వేషాగ్ని ప్రజ్వలించినది. తపమున శివుని మెప్పించి, అనేక దివ్యాస్త్రముల సంపాదించి, వానిని వసిష్ఠునిపై ప్రయోగించి నాడు విశ్వామిత్రుడు. కాని, మహర్షిబ్రహ్మదండము ముం దవి నిర్వీర్యములై విఫల మైనవి.[1]

తరువాత, ప్రసన్నేంద్రియ మానసమున, తపమున, బ్రాహ్మణత్వమును ప్రాపించుటకు, విశ్వామిత్రుడు నిశ్చయించుకొని,[2] ఉగ్రతపో నిష్ఠుడై క్రమముగా, తన ప్రకృతి యందలి రాజసతామసాత్మకములు, కామక్రోధాదులగు సకల దుర్గుణములను జయించి మనస్సమాధిని, సాధించి స్థితప్రజ్ఞుడై, బ్రాహ్మీస్థితి నందినాడు. శమశాలి వసిష్ఠుడు, విశ్వామిత్రుని బ్రహ్మర్షిత్వమును గుర్తించి గౌరవించినాడు.

**మహాత్ములు సర్వదా క్షమా సంపన్నులు కదా– ('క్షమా సారా హి సాధవః')**

బ్రాహ్మణ్యపదము నధిగమించి, ధర్మాత్ముడైన విశ్వామిత్రమహర్షియు, బ్రహ్మర్షి వసిష్ఠుని పూజించినాడు.

వాల్మీకిరామాయణమున పలుమాఱు, వసిష్ఠుడు **"వసిష్ఠో జప తాం వరః"** – అని వర్ణింపబడినాడు.

**నిరంతర గాయత్రీ జపశీలత్వమున, మహర్షి, పరమార్థ సిద్ధిని ప్రాపించెనని, ఆతని మహత్త్వమునకు కారణము గాయత్రీమంత్రజపానుష్ఠానమే యని విశద మగుచున్నది.**

**"జప్యేనైవ తు సంసిద్ధ్యే ద్బ్రాహ్మణో నాఽత్ర సంశయః ।**
**కుర్యా దన్యా న్న వా కుర్యాన్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే"**

(మనుస్మృతి –II– 87)

జపమూలముననె బ్రాహ్మణుడు మోక్షసిద్ధిని గాంచవచ్చును. సంశయము

(1) **"తదస్త్రం మహాఘోరం, బ్రాహ్మం బ్రాహ్మేణ తేజసా**
**వసిష్ఠో గ్రసతే సర్వం, బ్రహ్మదణ్డేన రాఘవ!"। ఇత్యాది.**

(2) చూడు : వా.రా. బాల. సర్గలు 51–65
**"త దేతత్ప్రమవేక్ష్యాఽహం, ప్రసన్నేన్ద్రియ మానసః ।**
**తపో మహత్సమాస్థాస్యే, యద్వై బ్రహ్మత్వకారణమ్" । ఇత్యాది.**

లేదు ఇతరమును దేనిని నాచరించినను నాచరింపకున్నను, సర్వభూతదయాశాలి (మైత్రుడు) బ్రాహ్మణు డనబడును. వసిష్ఠుడు నిస్సందిగ్ధముగ మైత్రుడే.

వసిష్ఠవిశ్వామిత్రుల యుద్ధము, ఆత్మవిద్యకు, అనాత్మవిద్యకు జరిగిన యుద్ధము. అనాత్మవిద్యను సంపూర్ణముగ నేర్చినవాడైనను, ఆత్మవిద్యాసంపన్నుని జయింప జాలడనుట నిది స్థాపించుచున్నది. వసిష్ఠు డీయుద్ధమున, ఆత్మ రక్షణమునకు మాత్రమే ప్రయత్నించెను కాని, తన ఆతిథ్యమును పొంది, కృతఘ్నుడై,తన ధేనువు నపహరింపబూని, తన ఆశ్రమమును సర్వనాశనమొనర్చి, తన్ను చంప యత్నించినను, విశ్వామిత్రున కేకీడును తలపలేదు; కోపింపలేదు; శపింపను లేదు.

"శమోదమస్తప శ్శౌచం, క్షాన్తి రార్జవ మే వ చ।
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రహ్మ*కర్మస్వభావజమ్॥(భ.గీ. XVIII-42)

శమము, దమము, తపస్సు, క్షాంతి, ఋజుత్వము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తిక్యము, ఇవి బ్రాహ్మణునికి స్వభావప్రభవములగు గుణములు. ఇవి లేనిచో, బ్రాహ్మణ్యము, అర్థరహితము. వసిష్ఠుడు బ్రాహ్మణస్వభావకర్మములకు జీవద్భావ్యము. తాను ఆధికారికపురుషు డని వసిష్ఠుడే వచించెను. (చూడు యో.వా. సం- ఉపదేశోపక్రమము - సర్గ - 2. శ్లో॥ 33-37 పాదటీక)

"ప్రాప్య సర్వజ్ఞతాం కృత్స్నాం, బ్రాహ్మణ్యం పద మద్వయమ్।
అనాపన్నాఽఽది మధ్యాఽన్తం, కిమతః పర మీహతే ?"॥

(గౌ.మాం.కా. IV-అలాత - 85)

పూర్ణసర్వజ్ఞత్వమును,ప్రాపించినవాడే,బ్రాహ్మణుడు. ఆదిమధ్యాంతములు (ఉత్పత్తి, స్థితి, లయములు) లేనిదియు, అద్వయము -(ద్వైతవర్జితము)-నగు బ్రాహ్మణ్యపదమును (బ్రహ్మపదవిని) -ఆత్మ స్వరూపమును పొందిన తరువాత, ఈ ఆత్మలాభమున కంటె, వెక్కువగా కోరవలసిన దేమున్నది?

---

★ బ్రాహ్మ్యం, బ్రాహ్మం - పా.భే.

వసిష్ఠశబ్దనిరుక్తి

వసుమత్ + ఇష్ఠ = వసిష్ఠః

అతిశయేన వసుమత్త్వం వసిష్ఠత్వమ్॥

వసుశబ్దమునకు కిరణము, అగ్ని, ప్రకాశము, మణి,రాజు, ధనము. స్వర్ణము, మొదలగు పదునొకండు (11) అర్థములున్నవి. (మేదినీ కోశము-సాన్తద్వివర్గము) బ్రహ్మవిద్యయే ధనములన్నిటిలో శ్రేష్ఠతమధనమగుటచే,అది కల వసిష్ఠుడు, వసుమంతు డగుటలో నాశ్చర్యమేమున్నది? భౌతికములైన సకలాఽభీష్టములు వర్షించు నందినీ ధేనువు మహర్షి వశవర్తిని. సర్వవిధములు సార్థకనాము డీమహర్షి.

విశ్వామిత్రుడు, వసిష్ఠుని పుత్రులను సంహరించెను. అయినను, వసిష్ఠుడు ప్రతీకార మొనర్పలేదు. ఒకనాడు ప్రచ్ఛన్నముగ విశ్వామిత్రుడు, వసిష్ఠుని వధించు నిమిత్తమై, ఆశ్రమమున కేతెంచెను. అది చంద్రికామనోజ్ఞనిశాసమయము. అపుడు మహర్షి, తన ధర్మపత్ని అరుంధతితో " ఇట్టి వెన్నెల రాత్రి యందు తపమున భగవంతుని సంతుష్టుని చేయుటకు ప్రయత్నించుచున్న విశ్వామిత్రు డెంతటి భాగ్యశాలియో" యని ప్రశంసించెను. ఏకాంతమున సైతము శత్రువైన, తన్ను, ప్రశంసించుచున్న మహాపురుషుని యెడల తన పాపచింతకు విశ్వామిత్రుడు పశ్చాత్తప్తు డైనాడు.

మహర్షి యొక్క ఈ గుణము, సమ్యగ్దర్శనమునకు లక్షణము.

రాగభయక్రోధవర్జితులు, వేదాంతతత్త్వద్రష్టలు, మననశీలురునగు జ్ఞానులచే వికల్పనాశూన్యము, సంసారవినాశకరము, అద్వయమునగు ఆత్మ దర్శింపబడినది కదా!

"వీతరాగభయక్రోధై, ర్మునిభిః వేదపారగైః।
నిర్వికల్పో హ్యయం దృష్టః, ప్రపంచోపశమోఽద్వయః॥"
(గౌ.మా.కా.II- వైతథ్య – 35)

శిష్యరూపమున తన్ను సేవించిన భగవంతుడు శ్రీరామునికి గురువై, తత్కారణమున ఆత్మ విద్యను (యోగవాసిష్ఠ రూపమున) లోకమునకు ప్రసాదించి

వసిష్ఠుడు, తన పురోహిత పదమును, ధన్య మొనరించుకొని చరితార్థుడైనాడు.

సోపాధికాప్తులగు బంధువులు, సుహృజ్జనులు, సోదరులు, మాతాపితరులు, వీరిలో నెవరుగాని, సంసారాంబుధి తరణమునకు హేతువగు జ్ఞానసేతువును నిర్మింపజాలరు. బోధ (Teaching), ఆదర్శము, (Example), ప్రభావము (Influence), అను ఉపకరణములు గల జ్ఞానాచార్యుడగు గురువే, దానిని నిర్మింప సమర్థుడు. సద్గురువు, వర్ణింప నలవికాని ఒకానొక కళ్యాణహేతువు. శ్రీరాముని విషయమున వసిష్ఠమునీంద్రు డీసత్యమును సార్థక మొనరించినాడు.

యోగవాసిష్ఠమహారామాయణము, ఆ మహాత్ముని జ్ఞానమునకు మూర్తిరూపము. **వసిష్ఠసంహిత,** కర్మము యొక్క మహత్త్వమును, అనుష్ఠానము యొక్క ఆదర్శమును లోకమున స్థాపించినది.

## అధ్యాత్మవిద్య భగవద్విభూతి.

వాగాది ఇంద్రియ (ప్రాణ)యుక్తమైన శరీరము నుండి ముఖ్యప్రాణము ఉత్క్రమించినచో, అది (శరీరము) మఱింత పాపిష్ఠము, అపవిత్రము నగును. కావున ముఖ్య ప్రాణమునకు వాగాది ఇంద్రియవర్గమున శ్రేష్ఠత్వము స్థాపింపబడినది. (బృ.ఉ.VI-I-7) ఇంద్రియములకు సైతము ప్రాణశబ్దము వర్తించును. ముఖ్యప్రాణము వసిష్ఠుడని (Pre-eminent)వర్ణింపబడినది. 'వాసయతి' లేక, 'వస్తే' – అని వసిష్ఠశబ్దనిరుక్తి. అనగా, **అతిశయముగ ఇతరులను నివసింపజేయువాడు, వసించువాడు, లేక, వస్త్రములచే ఆచ్ఛాదించు (అలంకరించు)వాడు.** ఆచ్ఛాదనార్థకమైన 'వస్' ధాతువు నుండి కూడ, వసిష్ఠశబ్దము నిష్పన్నమగును.

వాక్కుశలుడగు వ్యక్తి(వాగ్మి) తన **వాణివలన,** నితరులను పరాభవింపగలడు. **(పరేషా మభిభవకరః)** ముఖ్యప్రాణము, ఇంద్రియవర్గమున, వసిష్ఠుడు. వసిష్ఠ గుణయుక్తమగుముఖ్యప్రాణవిజ్ఞానమువలన,ఉపాసకుడు, **జ్యేష్ఠత్వ శ్రేష్ఠత్వ గుణములను** ప్రాపించును.

వాగాది ఇంద్రియ (ప్రాణ) వర్గమున ముఖ్యప్రాణము, వసిష్ఠ నామమున **విఖ్యాతము. అట్లే, విద్యలన్నిటికిని, బ్రహ్మవిద్య, లేక, ఆత్మవిజ్ఞానము, ముఖ్య ప్రాణము. తద్రహితమైన విద్యలు, కేవలము జీవనరహిత వధువులు. బ్రహ్మవిద్య,**

వసిష్ఠ శబ్దార్థముతో అభిన్నము. కావున, బ్రహ్మవిద్యను జ్యేష్ఠము, శ్రేష్ఠమునైన, వసిష్ఠము అని వర్ణింపవచ్చును.

అధ్యాత్మవిద్యా విద్యానామ్ I (భ.గీ.X-32) – విద్యలలో మోక్షప్రదమగు అధ్యాత్మవిద్య తనవిభూతి యని భగవంతుడు వర్ణించినాడు. మఱియు, సర్వవిద్యాధి రాజత్వము వలనను దీప్త్యతిశయము వలనను, బ్రహ్మవిద్య రాజ విద్యయనియు, రాజగుహ్యము (అనధికారులవిషయమునగోపనీయము), పరమపవిత్రము ననియ భగవంతుడు దీనిని వర్ణించెను. (భ.గీ. IX-2)

"విద్యలలో బ్రహ్మవిద్య, విద్యర వేమా!" I
అని వేమనయోగియు వచించెను.

శ్రీరామునిపై ప్రేమకు వసిష్ఠుని జీవితము జీర్ఘ్వ్యము.

నేటికిని, విశ్వకల్యాణార్థమై త్రిలోక మంగళ స్వరూపిణి భగవతి అరుంధతీ సమేతుడై వసిష్ఠుడు సప్తర్షి మండలమున జ్యోతిర్మయమూర్తియై నక్షత్ర రూపమున ప్రకాశించుచున్నాడు.

మౌనరూపమున,ఆశీఃపూర్వకముగ బ్రహ్మవిద్యను శ్రద్ధాళువులగు ఉపాసకులకు – ముముక్షువులకు–ప్రసరింప జేయుచున్నాడు. ధ్యానా వస్థిత తద్గత మనస్కులు ఆ మౌనవ్యాఖ్యను వినగలరు.

స్వామివివేకానందులు వసిష్ఠుని ఈ యుదంతము వివరించి, మహర్షి నిర్వైరత్వమును కొనియాడినాడు.* ఈ కథలన్నియు వసిష్ఠుని మూర్తిమత్త్వము నకు, మనోజ్ఞభాష్యరూపములు.

---

★ 'He told us the story of Vasishtha and Viswamitra; of Vasishtha's hundred descendents slain, and the king left alone, land less and crownless, to live out his life. Then he pictured the hut standing in the moonlight amongst the trees and Vasishtha and his wife within. He is poring intently over some precious page, written by his great rival, when she draws near and hangs over him for a moment saying, "Look, how bright is the moon tonight!" and he without looking up, " But ten thousand times brighter, my love, is the intellect of Viswamitra!"

All forgotten! the deaths of his hundred children, his own wrongs and his sufferings and his heart lost in admiration of the genius of his

వసిష్ఠుడు వేదమంత్రద్రష్ట. ఋగ్వేదసప్తమమండల మందలి అనేక మంత్రముల కా మహర్షి ద్రష్ట (కర్త). వాసిష్ఠధర్మశాస్త్ర మను స్మృతికిని ఆయన కర్త.

## ఆగమనమ్ (Advent)

"తానీ దహాని బహులాని – ఆసన్,
యా ప్రాచీన ముదితా సూర్యస్య ;
తతః పరి జార ఇవాచరన్తీ –
ఉషో దదృక్షే న పునర్యతీవ" *

(మైత్రావరుణి వసిష్ఠః – ఋ.వే.VII 76.3)

" ఆచార హీనం న పునన్తి వేదాః ।" (వాసిష్ఠధర్మశాస్త్రము VI-3)

సదాచార(శీల)రహితుడగు వానిని వేదములు సైతము, పవిత్రుని చేయజాలవని (ఉద్ధరింప జాలవని) ఆ స్మృతి సిద్ధాంతము.

"కృష్ణో భోగీ, శుక స్త్యాగీ, నృపౌ జనక రాఘవౌ ।
వసిష్ఠో కర్మకర్తా చ, పఞ్చైతే జ్ఞానినః సమాః ॥

జ్ఞానసంపన్నులైన వారు, జగమున కర్మ మాచరింపవచ్చును. ఆ కర్మము, అనేకరూపముల ధరింపవచ్చును. వారు, సర్వదిగ్దేశకాలము లందును నిర్లిప్తులై, ఈశ్వరాత్ములై యుండగలరు. వారి దృష్టియందు, భోగి శ్రీకృష్ణుడు, త్యాగి శుకుడు, నృపులు జనక రాఘవులు, కర్మకర్త (పురోహితుడు) వసిష్ఠుడు. ఈ పంచవిధ జ్ఞానులు సములని ప్రసిద్ధ శ్లోకమొకటి పఠించును.
(చూడు :- బ్రహ్మసూత్రము పుట. 332 డా॥ రత్నాకరం బాలరాజు 1971)

---

Foe! such, said the Swami , should be our love. also, like that of Vasishtha for Viswamitra, without the slightest tinge of personal memory."
(The Master as I saw him - sister Nivedita - p. 137- Seventh Edition 1953)

★ ఆగమనము :– వ్యాఖ్యాతములైన ఉదయముల యొక్క మ్లాయమాన (వాడిపోవుచున్న) కుసుమములు – ఎన్ని మృతవాంఛల అనంతసమూహములు; మార్గము పొడువున, వెదజల్లబడి యున్నవి. చాలసేపటికి సూర్యుడుదయించినాడు. తరువాత, నా వేదనాత్మకములైన ఆశల దిఙ్మండలమున ప్రియమైన ఓ ఉషోధిదేవతా! ప్రియుని పరిరంభించు ప్రేయసి (జార) వలె నీవు గోచరించితివి. నీవు వెనుదిరిగి పోవు కదా! కంపించు నా హృదయము తడబడుచున్నది (శ్రీ అనిర్వాణ్ ఆంగ్లానువాదము ననుసరించి. See : Buddhiyoga of the Gita and other essays- Anirvan- Samata Books. Madras –1991)

మహాభారతకాలము (ద్వాపరయుగము)న, జనమేజయుని సర్పయాగమును మాన్పించుటకై అతని దర్శించుట కేగిన ఆస్తీకుడు, ఆరాజును స్తుతించుచు, వాల్మీకి వసిష్ఠులను స్మరించును.

"వాల్మీకి వత్తే నిభృతం స్వవీర్యం।
వసిష్ఠ వత్తే నియమశ్చ కోపః।" (మ.భా.–ఆది.–ఆస్తీకపర్వము – 55–14)

వాల్మీకి యందు స్వతేజశ్శక్తి ప్రభావములు, నిభృతములై (గుప్తములు, పూర్ణములు, స్థిరములునై) యుండెననియు, వసిష్ఠుడు, రజోగుణవికారమగు క్రోధమును పూర్తిగ నిగ్రహించి, సత్త్వ స్థితుడై యుండెననియు, ఆ స్మరణము, స్థాపించును.

"యో వేదేషు పితామహశ్చ, కవిషు ప్రాచేతసో,
బ్రాహ్మణే ష్వాద్యో ధాత్రసుతో"। (వేదాన్తముక్తావళి–పూర్వార్ధ–194)

అని మఱియొక శ్లోకము వాల్మీకి వసిష్ఠులను పరమేశ్వర విభూతులుగ వర్ణించినది.

"వేదాన్తోదరవర్తి, భాస్వదమలం, ధ్వాన్తచ్ఛిదస్మద్ధియో,
దివ్యజ్ఞానమతీన్ద్రి యేఽపి విషయే, వ్యాహన్యతే న క్వచిత్।
యో నో వ్యాయశలాకయైవ, నిఖిలం సంసారబీజం తమః,।
ప్రోత్సార్యాఽఽవిరకార్షీ ద్గురు గురుః, పూజ్యాయ తస్మై నమః।"
(సురేశ్వరుడు నైష్కర్మ్య సిద్ధి-IV-80)

ఉపనిషద్గర్భమున వర్తించు శుద్ధసత్త్వరూపము, రాగద్వేషశూన్యమునై, మన బుద్ధి సంబంధమైన గాఢాంధకారమును ఛేదించి, అతీంద్రియమై అవిరోధమైన దివ్యజ్ఞానమును, యే మహాత్ముడు, సమస్త సంసార బీజరూపమగు తమస్సును నిరాకరించి, ఆవిర్భవింపజేసెనో, ఆ సకలలోకపూజ్యుడు, గురువుల కందఱకును గురువైన, పరమగురువునకు ప్రణమిల్లుదును.

శ్రీ యోగ వాసిష్ఠ సంగ్రహము
అనుబంధములు సర్వము సమాప్తము

ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు।

